# యయాతి



మరాఠీ మూలం:
విష్ణు సఖారామ్ ఖాండేకర్

తెలుగు అనువాదం:
యార్లగడ్డ లక్ష్మీప్రసాద్

అట్ట లోపలివైపున అచ్చువేసిన శిల్పచిత్రంలో కనబడేది శుద్ధోదన మహారాజుకు గౌతమ బుద్ధుని తల్లియైన మహారాణి మాయాదేవి కన్న స్వప్నం గురించి జ్యోతిష్కులు వ్యాఖ్యాచేస్తూ ఉండిన దృశ్యం. వారికి దిగువ వారి వ్యాఖ్యను వ్రాసుకుంటున్న లేఖకుడు కనిపిస్తాడు. భారత దేశంలో లేఖనకళ చిత్రశిల్పంలో నిబద్ధమై లభించే దృష్టాంతాలలో ఇదే ప్రాచీనతమమైనది.

నాగర్జున కొండ క్రీ.శ. 2 వ శతాబ్దం.

(జాతీయ పురావస్తు ప్రదర్శనశాల, న్యూఢిల్లీ, వారి సౌజన్యముతో)

# యయాతి

(సాహిత్య అకాడెమీ బహుమతి పొందిన మరాఠీ నవల)

మరాఠీ మూలం:

విష్ణు సఖారామ్ ఖండేకర్

తెలుగు అనువాదం:

యార్లగడ్డ లక్ష్మీప్రసాద్



సాహిత్య అకాడెమి

**YAYATI** - Telugu Translation by Yarlagadda Lakshmi Prasad of Vishnu Sakharam Khandekar's award winning Marathi Novel *Yayati*, Sahitya Akademi, 2000, Rs. 200/-.



First Edition : 2000

ISBN : 81-260 0924-1

సాహిత్య అకాడెమీ

రవీంద్రభవన్, 35, ఫిరోజ్ షా రోడ్, న్యూఢిల్లీ - 110 001

విక్రయ విభాగం· స్వాతి మందిర్ మార్గ్, న్యూఢిల్లీ - 110 001

ప్రాంతీయ కార్యాలయాలు:

లైబ్రెరీ బిల్డింగ్, సెంట్రల్ కాలేజ్ క్యాంపస్, అంబేడ్కర్ వీధి, బెంగళూరు - 560 001

గుణ బిల్డింగ్స్, 304-305, అన్నాసాలై, చెన్నై - 600 018

జీవనతారా బిల్డింగ్స్, 4వ అంతస్తు, 23A/44X, డైమండ్ హార్బర్ రోడ్, కలకత్తా - 700 053

172, ముంబయ్ మరాఠీ గ్రంథ సంగ్రహాలయ మార్గ్, దాదర్, ముంబై - 400 014

Cover Designed by :
**Sreedhar & J. Venkatesh**

Typesetting by:
**Control System INC.,** Bangalore - 96

Printed at :
**Sathyasri Printers Pvt. Ltd.,**
**Chamarajpet, Bangalore - 18** Phone : 6525736

# అధ్యాయం 1

## యయాతి

నేను ఒక రాజును కనక నా కథ వినిపిస్తున్నానా? ఏమో నాకే సరిగా తెలియటంలేదు. అసలు వాస్తవానికి నేను ఒక రాజునా? కాదు, నేను ఒకప్పుడు మాత్రమే రాజును.

రాజు - రాణి కథలు ప్రజలు చాలా ఇష్టంగా వింటారు. సాధారణ ప్రజానీకం వారి ప్రేమ గాథలు వింటూ రసాస్వాదన చేస్తుంటారు ప్రసిద్ధులైన కవులు వీరి కథల ఆధారంగా కవితలల్లుతూ ఉంటారు.

నాదికూడా ఒక ప్రేమకథ - కాదు, కాదు! అది ఏ రకం కథో నాకూ తెలియదు. కవుల హృదయాలను రంజింపచేసే విషయాలేవీ అందులో లేవు. ఇది ఒక రాజు కథ కాబట్టి నేనీరోజు ఈ కథ వినిపించటంలేదు. ఈ కథామూలంలో ఏవిధమయిన అభిమానంగానీ, అహంకారంగానీ, ఏ విషయ ప్రదర్శనగానీ లేవు. ఇవి కేవలం రాజ వస్త్రాల పీలికలు మాత్రమే. ఎవరైనా వీటిని ఎందుకు ప్రదర్శిస్తారు?

రాజవంశంలో జన్మించిన కారణంగా రాజునయ్యాను. అదే అధికారంతో జీవించాను. ఇందులో నా గొప్పతనమూ లేదు, నా దోషమూ లేదు. హస్తినాపురం మహారాజు నహుషుని కుమారునిగా భగవంతుడు నాకు ఈ జన్మ ప్రసాదించాడు. తండ్రితర్వాత రాజసింహాసనం అధిష్టించాను. ఇందులో గొప్ప తనం ఏముంది? రాజ ప్రసాదపు గోపురంమీద కూర్చున్న కాకిని సైతం ప్రజలు కుతూహలంతో చూస్తారు.

నేను రాజకుమారుణ్ణి కాకుండా ఋషికుమారుణ్ణి అయివుంటే ఏవిధంగా జీవించి ఉండేవాణ్ణి? శరత్కాలపు వెన్నెలగానా? లేక శిశిరపు చీకటి రాత్రిలాగానా? ఏమో, ఎవరికి తెలుసు? ఏదైనా ఆశ్రమంలో జన్మిస్తే ఇంతకంటే ఎక్కువ సుఖంగా వుండేవాడినా? లేదేమో? ఈ ప్రశ్నకు సమాధానం వెతకటంలో నేను ఓడిపోయాను. ఏదో నార చీరవలే జీవితం సాదాగా గడచిపోయేదేమో, అనే ఆలోచన తరచు కలుగుతూ ఉంటుంది. రంగు రంగుల పడుగు పేకలతో నిండిన రాజవస్త్రాల అందం నార చీరలకెలా వస్తుంది? ఏదైనా కానీ, ఈ రోజుక్కూడా ఈ రాజవస్త్రాల తళుకు బెళుకులు నా మనస్సుకు నచ్చటం లేదు.

అయినప్పటికీ నేను ఈరోజు నా జీవిత కథ ఎందుకు చెబుతున్నాను? ఏ విషయం నాకు ప్రేరణ కలిగిస్తున్నది? గాయాలను ఇతరులకు చూపిస్తే బాధ కొంత తగ్గుతుంది. ఎవరైనా దగ్గరకూర్చుని యోగక్షేమాలు విచారిస్తే, రోగి పరిస్థితి కొంచెం మెరుగైనట్లనిపిస్తుంది. మమతతో కూడిన కన్నీళ్ళకు నిర్భాగ్యుల మనస్సు లోని దావానలాన్ని చల్లార్చే శక్తి ఉంటుంది. ఆ అభిమానపు ఆ కన్నీళ్ళను నా మనస్సు కోరుకుంటున్నదా?

ఏది ఏమైనా శ్రావణమేఘాల మాదిరిగా, ఈ కథతో నా మనస్సు నిండిపోయిం దన్నది నిజం. నిరంతరం ఈ కథ గురించే ఆలోచిస్తున్నాను. నా కథ ఎవరినైనా, వారివారి జీవితాలలో గల ఎత్తుపల్లాల పట్ల జాగరూకులను చేయగలదనే ఆలోచన నాకు సంతృప్తిని కలిగిస్తున్నది. అయితే ఆ సంతృప్తి కొద్ది క్షణాలు మాత్రమే. నన్ను నేను మోసం చేసుకుంటు న్నానా అనిపిస్తుంది. గురుపత్నిని మోహించి శాశ్వతంగా తన బ్రతుకును కళంకితం చేసుకున్న చంద్రుని కథ ఎవరికి తెలియదు? అహల్యా అందాలకు బానిసై శాపగ్రస్తుడైన ఇంద్రుని కథ ఎవరెరుగరు?

ఈ ప్రపంచం తప్పులు చేస్తుంది. తప్పుల గురించి తెలుసుకుంటుంది. అయితే గుణపాఠం మాత్రం నేర్చుకోదు. అయితే ప్రతి మనిషి జీవితపు చరమాం కంలో ఎంతో కొంత తెలుసుకున్నప్పటికీ, అది తన అనుభవాల గాయాలనుండి నేర్చుకున్నదే కానీ, ఇతరుల ఎదురు దెబ్బలనుండి కాదు. ఇదంతా ఆలోచిస్తున్న ప్పుడు, నా యీ పనికిరానికథ ఎందుకు వినిపించాలనిపిస్తుంది. లతలకు ఎన్నో పూలు పూస్తాయి. వాటిలో కొన్ని దేవతామూర్తుల విగ్రహాలనలంకరిస్తాయి. వాటికి

భక్తుల నమస్కృతులు లభిస్తాయి. కొన్ని పూలు యువతుల కేశ సౌందర్యాన్ని ఇనుమడింప చేస్తాయి. భవనాలలోని పడకలపై జరిగే వివిధ విలాసాలను తమ చిన్ని చిన్ని కళ్ళతో చూస్తూ వుంటాయి. కొన్ని పూలు పిచ్చివాళ్ళ చేతుల్లోకి చేరుతాయి. వాళ్ళు చూస్తూనే ఆ పూలను నలిపి అవతల పారవేస్తారు. ఈ ప్రపంచంలో జన్మించే మనుష్యుల పరిస్థితి కూడా ఇంతే. కొందరికి దీర్ఘాయుష్షు లభిస్తే కొందరు అకాల మృత్యువాత పడతారు. కొందరు వైభవాల చరమసీమల నధిరోహిస్తే, మరికొందరు పేదరికపు లోయలలోకి జారిపోతూ వుంటారు. కొందరు దుష్టులైతే, కొందరు శిష్టులు. కొందరు సౌందర్య వంతులు, కొందరు అంద విహీనులు. అయితే చివరకి అందరూ మట్టిలో కలిసిపోయే వారే. ఇదొక్కటే అందరిలో మనకు లభించే సమానత్వం. ఏ పువ్వూ తన కథ వినిపించ లేదు. అయితే మనుష్యుడొక్కడే తన జీవితానికి ఇంత ప్రాముఖ్యాన్ని ఎందుకు ఇస్తున్నాడు?

# అధ్యాయం 2

జీవితం ఏమిటి? వెనుక దట్టమైన ముళ్ళపొద, ముందు పెద్ద కారడవి! అజ్ఞాతపు చీకటిలో అదిమరింత భయావహంగా వుంటుంది. అప్పుడప్పుడు దారి తప్పిన, ఏవో మిణుకు మిణుకుమనే నక్షత్రాల వెలుగు ఈ అడవిలోని కాలిబాటలపై ప్రసరిస్తుంది. ఈ కాలిబాటల వెంటే సాగే మానవుని ప్రయాణాన్నే మనం 'జీవితమని' పిలుచుకుంటాము.

నా ఈయాత్రలో చెప్పదగినది ఎంతోకొంత వున్నది. బహుశా ఇది నా భ్రమకావచ్చు, బాలయయాతి, కిశోరావస్థలోని యయాతి, యువకుడైన యయాతి, ప్రౌఢుడైన యయాతి, అందరూ ఒకటే. అయితే ఈనాటి యయాతి వారందరికీ భిన్నంగా ఉన్నాడు. వారందరి శరీరంలో ఈ యయాతే వుండి వుండవచ్చు. అయితే వారందరికీ ఏనాడూ తెలియని యయాతి ఈరోజు కనిపిస్తున్నాడు. అందరికి లీలా మాత్రంగానైనా ఈ విషయాలు తెలియ చేద్దామని ఈ నా కథను, నా గతాన్ని వినిపించాలనే కోరిక కలుగుతున్నది.

బాల్యంలోని స్మృతులు నెమలి ఈకలవలె ఎంత కోమలంగా, ఎన్నోరంగు లతో, ఎంత సమ్మోహనంగా వుంటాయి? కవల సోదరులలాగ నిప్పు, పూలు కలిసి వున్న నా తొలి స్మృతులు నాకు కన్పిస్తున్నాయి.

మొదట నుండి నాకు పూవులంటే చాలా ఇష్టం. రాజోద్యానంలో వికసించిన పువ్వులను బాల్యంలో నేను గంటల తరబడి చూస్తూ కూర్చుండేవాడినని, చెబుతూ వుంటారు. రాత్రిపూటనే నేను వెక్కివెక్కి ఏడుస్తూ వుండేవాడినట. నన్నుపెద్దగా జోకొడుతూ నిద్రపుచ్చే దాసీలను బాగా విసిగిస్తూ ఉందేవాడినట. ఉద్యానవనం లోని పూవులన్నీ కోసుకువచ్చి నా ప్రక్కమీద పరిస్తేనే నిదరపోతానని ఒకసారి

దాసిని ఆదేశించానట. ఆ దాసి నవ్వుతూ మరోదాసికి, ఆ మరోదాసి ఇతర దాసిలకు, వారు సేవకులకు-మొత్తం మీద ఈ విషయం అంతఃపురంలో చర్చావిషయ మైంది. మా అమ్మకు కూడా ఈ విషయం తెలిసినట్లుంది - 'ఏమండీ! విన్నారా మన అబ్బాయి పెద్దకవి అయ్యేటట్లు వున్నాడు'- అంటూ నన్ను మా తండ్రిగారి సమక్షంలో నిలబెట్టింది.

'ఏమిటి? కవా? కవి అయితే యయూకు ఏమి లభిస్తుంది? కేవలం ప్రపంచ సౌందర్యాన్ని వర్ణించటమే కవుల పని. ప్రపంచంలోని ఆ అందమైన వాటి నన్నిటినీ మనసార అనుభవించగలవాడు వీరుడొక్కడే. మన యయాతి పరాక్రమవంతుడూ, శౌర్య ధనుడూ అయిన వీరుడుకావాలి. ఒకటి, రెండూ కాదు వంద అశ్వమేధాలు చేయాలి. మనపూర్వీకులలో ఒకరైన పూరూరవ మహారాజు దేవాంగన ఊర్వశిని తన ప్రేయసిగా చేసుకున్నాడు. నేను స్వయంగా దేవతల పనిపట్టాను. ఇంద్ర సింహాసనాన్ని అధిష్టించి ఆనందాన్ని పొందాను. యయూ ఈ సంప్రదాయాన్నే కొనసాగించాలి' అంటూ నవ్వారు మా తండ్రి.

నేను నాన్నగారి మాటలన్నీ విన్నాను. అయితే వాటిలో ఎన్ని నాకర్థ మయ్యాయో నాకే తెలియదు. కాని పెరిగి పెద్ద వాణ్ణయిన తర్వాత, అమ్మ నా వీరత్వాన్ని పొగుడుతూ, నాన్నగారు చెప్పిన ఆ మాటలను పదేపదే చెపుతూ ఉండేది. అందుచేత ఈ మాటలు నాకు కంఠస్థమయ్యాయి.

అగ్నికి సంబంధించిన జ్ఞాపకం కూడా అటువంటిదే. అమ్మ దానినికూడా పదేపదే వినిపిస్తూ వుండేది. నేను ధనుర్విద్యను పూర్తిచేసిన తర్వాత నాన్నగారు నన్ను ఒక సంవత్సరంపాటు ఒక ఆశ్రమంలో ఉంచాలని నిర్ణయించుకున్నారు. ఆశ్రమానికి వెళ్ళే సమయానికి నేనేమి పాలుతాగే పసివాణ్ణికాదు, అయితే తల్లిప్రేమ గుడ్డిదికదా! పదహారేళ్ళ యయాతి వారిని వదలి సంవత్సరం పాటు ఎడంగా వుంటాడన్న ఊహభరించలేని అమ్మ పదే పదే కళ్ళుతుడుచుకో సాగింది. దుఃఖోద్వేగంతో వణుకుతున్న తన చేతితో ఆమె నా మొహం సవరించసాగింది. కన్నీళ్ళతో రుద్ధమైన గొంతుతో- 'నాయనా యయూ! నువ్వు పిచ్చివాడివి. నాబెంగంతా నిన్ను గురించే అగ్నిశాలలో పైకెగుస్తున్న జ్వాలలను చూసి ఆనందంతో గంతులు వేసేవాడివి. ఒక్క సారి ఆ జ్వాలల నుండి ఎగురుతున్న

నిప్పుకణాలను చూసి చప్పట్లుకొడుతూ ''పూలు పూలు'' అని అరుస్తూ వుండే వాడివి. నేను సమయానికి చూడకపోతే నువ్వు ఆ అగ్నికణాలను పట్టుకోవటానికి ఎగిరి దూకేవాడివే'. అంటూ వెక్కిళ్ళను ఆపుకుంటూ 'పిల్లలెంత పెద్దవారైనా తల్లికి వారు పసిపాపలే. ఆశ్రమంలో జాగ్రత్తగా ఉండు. అక్కడ నదులలో మొసళ్ళు వుంటాయి. ఆశ్రమంలో అడవి జంతువులు కనిపిస్తాయి. అనవసరంగా ప్రమాదాలలో చిక్కకోకు నాయనా?' అంది.

చాలా జ్ఞాపకాలు, కొన్ని లీలామాత్రంగా నాకు గుర్తున్నాయి. కొన్ని నేను విన్నవి. ఇప్పుడు మరల వాటిని జ్ఞప్తికి తెచ్చుకుని, ఆనందాన్ని అనుభవించే కోరిక నాకు లేదు. ఆయితే ఆనాటి ఒక జ్ఞాపకం, గాయపు గుర్తులాగా నా మనస్సును ఆక్రమించుకుని వుండిపోయింది. దాని అర్థం నాకు మొన్నమొన్నటి వరకు తెలియ లేదు. కాని ఇప్పుడు-జీవితపు తొలి దినాలలో అర్థరహితంగా అనిపించిన చాలా సంగతులు, జీవితపు చరమాంకంలో చాలా అర్థవంతంగా కనిపిస్తుంటాయి.

మా అమ్మగారికి చాలా ఇష్టమైన దాసి వుండేది. పేరు కలిక. ఆమెఅంటే నాకు చాలా ఇష్టం. ఆమె అప్పుడప్పుడు నా కలల్లోకి కూడా వస్తూవుండేది. ఎంత ప్రయత్నంచేసినా దీనికి కారణం మాత్రం నాకు అర్థంకాలేదు. అప్పుడు నా వయస్సు ఆరేళ్ళ కంటే ఎక్కువలేదు. ఆటల మధ్యలో కలిక నన్ను పట్టుకుని తన వైపు లాగుకుని ఎదకు హత్తుకుంది. ఆమె కౌగిలినుండి విడివడటానికి నేను వది లించుకున్న కొద్దీ ఆమె తన పట్టును మరింత బిగించింది. చెయ్యిగట్టిగా కొరికి 'ఎట్లా ఉందని' అడిగి, చప్పట్లు కొడుతూ పారిపోదామనే ఆలోచన వచ్చింది. అంతలో కలిక నా నుదురు తన గుండె కానించుకుని -'యువరాజా! మీ అల్లరి నానాటికీ ఎక్కువవుతున్నది. చిన్నప్పుడు పాలివ్వటానికైతే కలిక అవసరమయ్యేది. అప్పుడైతే నా ఒడిలో ఒదిగి పడుండేవారు! ఇప్పుడు........'

'ఏమిటీ? నేను నీ పాలు తాగేవాడినా?' ఆశ్చర్యంతో ప్రశ్నించాను.

కలిక నవ్వుతూ తల ఊపింది. పక్కనే ఆమె కూతురు అలక నిలబడివుంది. బహుశా దానికీ నా వయస్సే ఉంటుంది. అలకను చూపిస్తూ - 'నాకడుపున పుట్టినదీనికి పోతపాలు తాగించి మీకు......... మీరంతా మరచిపోయారు!' అంది కలిక.

నా కుతూహలం మరింతగా పెరిగింది. అడిగాను-

'చిన్న పిల్లలు తల్లిపాలు కదా తాగేది?'

'అవును',

'అయితే, నువ్వు మా అమ్మవా?'

ఆమె భయపడిపోయింది. భీతిల్లిన చూపులు నాలుగువైపులా సారించి నెమ్మదిగా అంది-

'యువరాజా! ఇటువంటి పనికిరాని మాటలు మాట్లాడవద్దు'.

నా మనస్సు యజ్ఞకుండంలా ఉడికిపోతున్నది. బయటకు కేవలం పొగ మాత్రమే వస్తున్నది. నేను హస్తినాపురపు రాజకుమారుణ్ణి, యువరాజుని. కాని బాల్యంతో ఒక నీచపు దాసీదాని పాలు నాకెందుకు తాగించవలసి వచ్చింది? నేను కలిక పాలు తాగి పెద్దవాణ్ణయితే, కలికను 'అమ్మా' అని ఎందుకు పిలవకూడదు?

ఈ ఆలోచనరాగానే నా చిన్నారి మనస్సు తేలికయ్యింది. కలికను చుట్టుకుని- 'ఈ రోజునుండి నేను నిన్ను 'అమ్మా!' అని పిలుస్తాను' అని అన్నాను.

నానోటికి తన చెయ్యి అడ్డుపెడుతూ కలిక - 'యువరాజా! మహారాణిగారు మీకు తల్లి. నేనెలా ఆమెతో సరితూగగలను? నేను ఆమె పాదధూళివంటి దానను'-అంది.

'మరయితే అమ్మనాకు తనపాలెందుకు ఇవ్వలేదు?'

కలిక ఏమీ సమాధానం చెప్పలేదు.

'ఆమె నాకు తన పాలెందుకు తాగించలేదు' - నేను బిగ్గరగా అరిచాను. బెదరిన లేడిలా నాలుగుప్రైపులా చూస్తూ మెల్లగా చెపిలో చెప్పింది - 'పిల్లలకు పాలిస్తే స్త్రీల అందం వాడిపోతుందంటారు'.

ఆనాడు కలిక చెప్పిన మాటలు నాకు సరిగ్గా అర్థంకాలేదు. అయితే నాకు అధికారికంగా లభించవలసిన దానినుండి నేను వంచితుణ్ణి చెయ్యబడ్డానన్న విషయం

మాత్రం నాగుండెల్లో గుచ్చుకుంది. ఒక అద్భుతమైన సుఖం నుండి నేను వంచితుణ్ణి చెయ్యబడ్డాను. అదీ సాక్షాత్తూ కన్నతల్లిచేత! ఎందుచేత? తన సౌందర్య పరిరక్షణకా? తల్లి కూడా ఇంత స్వార్థపూరితంగా ఉండగలుగుతుందా? లేదు, లేదు? మా అమ్మకు నా మీద ప్రేమలేదు. ఆమెకు తన సౌందర్యమే ఎక్కువ ఇష్టం.

ఎంతో కష్టంమీద నేను ఆరోజు మొట్టమొదటిసారి మా అమ్మమీద కోపం తెచ్చుకున్నాను. రోజంతా అమ్మతో నేను ఒక్కమాట కూఢా మాట్లాడలేదు. రాత్రి ఆమె నా పడక దగ్గరకు చాలాసార్లు వచ్చి 'నాయనా! రాజా! యయూ........' అంటూ ముద్దుచేసింది. మధ్య మధ్యలో నానుదుటిని సవరించింది. ఆస్పర్శలో పువ్వుల కోమలత్వం ఉంది. నేను కొంచెం కరిగాను, అయినా మాట్లాడలేదు. కళ్ళు కూడా తెరవలేదు. దారితప్పిన మనస్సు - 'ఋషులు, మునులవలె శపించే శక్తినాకుంటే! అమ్మనురాయిగా మార్చివేస్తాను' - అని ఆలోచించింది.

మాటలకంటే అప్పుడప్పుడు స్పర్శే ఎక్కువ భావాలను వ్యక్తంచేస్తుంది. అయితే మనస్సును కదిలించే శక్తిదానికుండదు. ఆ పనికేవలం . కన్నీళ్ళే చెయ్యగలవు. నా బుగ్గలమీద వేడికన్నీటి చుక్కలు పడసాగాయి. నేను కన్నులు తెరిచాను. అమ్మ కన్నీరు కార్చటం ఇంతకుముందు నేనెప్పుడూ చూడలేదు. నాచిన్నారి మనస్సు కలవర పడింది. నా రెండు చేతులూ అమ్మమెడచుట్టూవేసి నా బుగ్గలతో అమ్మ బుగ్గలు రాస్తూ - 'అమ్మా ఎందుకేడుస్తున్నావు? నీకేమయింది?' - అని అడిగాను.

అప్పుడు కూడా ఆమె ఏమీ మాట్లాడలేదు. నన్ను హృదయానికి హత్తుకుని తనవేళ్ళతో నాజుట్టు సవరిస్తూ కన్నీరు కారుస్తూ మంచంమీద కూర్చుండి పోయింది.

'అమ్మా! నా మీద ఒట్టు' - అన్నాను.

వణుకుతున్న చేతులతో నా మొహంపైకెత్తింది. తడిసిన కన్నులతో నన్ను రెప్పవాల్చకుండా చూస్తూ గద్గదస్వరంతో అన్నది. -'నా బాధ నీకెలా చెప్పను నాయనా?'

'నాన్నగారికి నీమీద కొపం వచ్చిందా?'

'లేదు'.

'నాన్నగారికి ఆరోగ్యం బాగాలేదా?'

'కాదు, కాదు'.

'మీకిష్టమైన నెమలి ఎక్కడికైనా ఎగిరిపోయిందా?'

'ఆ నెమలిని గురించి నాకంత బాధలేదు'.

'మరి?'

'నా రెండో నెమలి ఎప్పుడు, ఎక్కడకు ఎగిరిపోతుందో - తెలియటంలేదు'.

'రెండో నెమలా? ఆదెక్కడుంది?'

'ఇదుగో ఇదే' - అంటూ అమ్మనన్ను హృదయానికి హత్తుకుంది. తనివి తీరని ప్రేమతో అమ్మ నన్ను నలిబిలి చెయ్యసాగింది. వివశురాలైన ఆమె కౌగిలి కారణంగా శరీరమంతా బాధకలగసాగింది. ఆయితే నా మనస్సుకు అపారమైన ఆనందం కలుగుతున్నది. నా చూపుడు వేలితో అమ్మకన్నీరు తూడుస్తూ - 'లేదమ్మా, నిన్ను వదిలి నేనెక్కడికీ వెళ్ళనమ్మా! ఎప్పుడూ నిన్ను విడిచివెళ్ళ నమ్మా' అన్నాను.

అసలు అమ్మకీభయం ఎందుకు పట్టుకుందో నాకర్థంకాలేదు. ఆమెను ఇదే విషయం తరచి తరచి అడిగాను. చివరకు అమ్మ అన్నది - 'ఈ రోజంతా నువ్వు నా మీద అలిగావు, నాతో ఒక్క మాటకూడ మాట్లడలేదు సాయంత్రం నేనునీచెయ్యి పట్టుకుని తోటలోకి వెళదామా! అని అడిగాను. నువ్వు నా చెయ్యి విదిలించుకుని నావంక కోపంగా చూసావు. ఇప్పుడు-ఇక్కడ-నువ్వు మేల్కొనే వున్నావని నాకు తెలుసు. ఆయినా నేనంత ప్రేమగా పిలిచినా నువ్వు పలకలేదు. నామీద ఎందుకు నాయనా నీకు కోపం? యయూ! తల్లిదండ్రుల బాధ పిల్ల లెప్పుడూ అర్థం చేసుకోలేరు. నాయనా! నిన్ను అర్థిస్తున్నాను. నువ్వు వాడిలాగా చెయ్య వద్దు'.

'వాడిలాగానా? ఎవరిలాగా? ఎవరతను?'

చిన్నప్పుడు రాక్షసుల కథలు వినేటపుడు నేను ఎంతో కుతూహలంగా 'తరవాత ఏమి జరిగింది?' అంటూ ప్రశ్నించేవాడిని. అదే కుతూహలంతో, అదే ఉద్విగ్నతతో అమ్మనడిగాను. అతను ఎవరు?.

భవనంలో అమ్మ, నేను తప్ప ఎవ్వరూ లేరు. బహుశా ద్వారంబయట వున్న దాసి నిదిరపోయినట్లున్నది. మూలనున్న బంగారు ప్రమిదలోని ఒత్తికూడా ఒదిగి ఒదిగి వెలుగుతున్నది.

అయినా అమ్మెందుకు నాలుగువైపుల జాగ్రతగా పరికిస్తున్నదో నాకర్థం కాలేదు. అమ్మ నెమ్మదిగా లేచింది, కిటకీ మూసివచ్చింది. నాతలను ఒడిలో వుంచు కుని మెల్లగా సవరిస్తూ వణుకుతున్న, కోమలమైన స్వరంతో చెప్పసాగింది - 'యయూ! ఈ విషయం నువ్వు కొంచెం పెద్దవాడివయిన తర్వాత చెపుదామను కున్నాను. కాని ఈ రోజు నువ్వు నామీద అలిగావు. రేపు బహుశా నామీద కోపం పెరగవచ్చు. ఎల్లుండి నన్ను వదిలి, వాడిలాగానే నువ్వు ఎక్కడికైనా వెళ్ళిపోతా వేమో? అందుకే'-

-'వాడు? ఎవరు వాడు?'

'సోదరుడు'.

'ఏమిటీ? నా సోదరుడా!'

'అవును నాయనా'.

'నాకు సోదరుడా!'

'అవును'.

'ఆయన ఎక్కడ వున్నారు?'

దేవుడికే తెలియాలి. ఎక్కడవున్నా క్షేమంగా ఉండాలని మాత్రమే నేను ప్రతి రోజూ ఆ దేవుణ్ణి ప్రార్థిస్తూ వుంటాను. నేను చిన్నవాణ్ణిగా వున్నప్పుడు అలకవంటి అనేకమంది పిల్లలతో ఆడుకుంటూ వుండేవాడిని. కొంచెం పెద్దవాణ్ణయిన తర్వాత అమాత్యులు, సేనాపతి, రాజకవి, కోశాధికారి, అశ్వరక్షకులు వంటివారి పిల్లలతో

ఆడుకుంటూ వుండేవాణ్ణి. ఆయితే రాజప్రాసాదంలో నా స్థాయివారు ఎవ్వరూ నాతో ఆడుకోవటానికి లేరే! అన్న నిరాశ నాకెప్పుడూ వుండేది. దాసదాసీల పిల్లలు నాతోపాటు పానుపులమీద, గద్దెలమీద ఎక్కి కూర్చుని ఆడటానికి సంకోచిస్తూ వుండేవారు. ఉద్యానవనంలో, తోటలలో నాతోపాటు సీతాకోకచిలకలను వెంటా డుతూ పూలు కోసి నలిపిపారవేసే ధైర్యం వారికి వుండేదికాదు. అదే అన్నగారు వుండి వుంటే! ఈ ఆటలలో ఉత్సాహం రెట్టింపయ్యి ఉండేదన్న ఆలోచనలలోకి పోయాను.

బాల్యం ఎంత అమాయకంగా, నిర్మలంగా, హాయిగా, ఒకే మూసలోసాగు తుంది! అన్నగారు వయస్సు ఎంత వుండి వుంటుందన్న విషయం అమ్మనడగటం మర్చిపోయాను. అన్నగారు వుండివుంటే, నాన్నగారి తర్వాత ఆయనే సింహాసనాన్ని అధిష్టిస్తారని కాని, నేను జీవితాంతం కేవలం రాజపుత్రుడిగా మిగిలి పోతానన్న ఈర్ష్యా భావం లేశమాత్రం కూడా నా మనస్సులో కలగలేదు. నాకు ఆడు కోవటానికి, పోట్లాడుకోవటానికి నా అన్నయ్యే కావాలి. ఆయన ఎక్కడ వున్నాడు? ఏమి చేస్తున్నాడు? అమ్మను చూడటానికి ఎందుకు రావటంలేదు? ఇటువంటి ఆలోచనలు నా మనస్సులో తేనెటీగల్లాగ ముసురుకున్నాయి. నేను భయం భయంగా అమ్మనడిగాను.

-'అన్నయ్య పేరేమిటమ్మా?'

'యతి!'

'ఆయన వెళ్ళిపోయి ఎన్ని రోజులయ్యిందమ్మా?'

'నువ్వు పుట్టటానికి సంవత్సరం - సంవత్సరంన్నర ముందు వెళ్ళిపోయాడు'.

'ఒంటరిగా వెళ్ళిపోయాడు'.

అమ్మ స్వరంలోని అంతులేని ఆవేదన కన్నా - ఒంటరిగా వెళ్ళిపోయాడంటే, యతి చాలా ధైర్యవంతుడయ్యుంటాడన్న ఆలోచనే నా మనస్సును చుట్టివేసింది.

-'నీకు చెప్పకుండానే వెళ్ళిపోయాడా అమ్మా?'

అమ్మ తలపూసి సమాధానం చెప్పింది. ఆనాటి వ్యాకులత అమ్మ మనస్సును కలచివేసినట్లుంది. అయితే నా మనస్సు మాత్రం, అమ్మకు కూడా చెప్పకుండా రాజప్రాసాదాన్ని వదలి ఒంటరిగా వెళ్ళిపోయిన ధైర్యశాలి యతి చుట్టే తిరుగుతున్నది. మళ్ళీ మరో ప్రశ్నవేశాను-

'ఏ సమయంలో వెళ్ళిపోయాడమ్మా?'

అర్ధరాత్రి. దట్టమైన అడవిలో రాత్రి ఒకటిన్నర ఝాము వరకు నేను మెలుకవగానే వున్నాను. వాడికి నచ్చ చెబుతూనే వున్నాను. ఎప్పుడు నిద్రపట్టిందో తెలియదు. తెల్లవారటానికి ముందే కళ్ళు తెరిచి చూసాను. యతి తన పక్కమీద లేడు. ఆ చీకటిలోనే సేవకులు చుట్టుప్రక్కల అంతా గాలించి వెదికారు. అయినా వాడు దొరకలేదు.

కథలు వినేటప్పుడు సహజంగా కలిగే కుతూహలం నాలో కలిగింది. అమ్మనడిగాను - 'యతిని తీసుకుని నువ్వెక్కడికి వెళ్ళావమ్మా?'.

'ఒక మహాత్ముడి దర్శనం చేసుకోవటానికి. వివాహమయిన చాలా సంవత్సరాల వరకూ నాకు సంతానం కలగలేదు. మీ నాన్నగారూ, నేను వెళ్ళి కొంతకాలం ఆ మహాత్ముడి ఆశ్రమంలోనే వున్నాము. ఆయన ఆశీర్వాద ఫలితమే యతి. ప్రతి సంవత్సరం యతి పుట్టినరోజున, వాడిని ఆ మహాత్ముడి దర్శనంకోసం తీసుకు వెళ్ళుతూ వుండేదాన్ని. యతి నన్ను వదిలి వెళ్ళిపోయినరోజు ఆ మహత్ముడి దగ్గర నుండే తిరిగి వస్తున్నప్పుడు యతి చాలా వ్యాకులంగా వున్నాడు. ఆ ఆశ్రమంలోనే వుండిపోతానని మారాం చేసాడు. పట్టుపట్టాడు. నాకు చాలా కోపం వచ్చింది. బాగా కోప్పడ్డాను. తిట్టాను. దూడకు ముక్కుతాడువేసి బండివెనక్కు లాక్కు వచ్చినట్లు, వాణ్ణి ఆశ్రమంనుండి బయటకు తీసుకువచ్చాను. వాడి ఘట్టుదలనూ, అలకలనూ నేను పట్టించుకోలేదు. వాడికి కావాల్సింది'

- 'అసలు ఆయనకు ఏమి కావాలంట?'

- అమ్మ కళ్ళ వెంటకన్నీళ్ళు జలజలా రాలాయి.

అదే నాకు ఈరోజు వరకు తెలియలేదు. దేవీ-దేవతల పూజా పునస్కార

లన్నా, ఆధ్యాత్మిక విషయాలన్నా వాడు ఎంతో మక్కువ చూపేవాడు. ప్రతిరోజూ ఉదయం దాసీలు రకరకాల విరిసిన తాజాపూలను వాడి ముందుంచేవారు. ఒక్క రోజు కూడా వాడు వాటిని వాసనచూడలేదు. ఎప్పుడైనా పొరపాటున నాలుగు పూవులు చేతిలోని తీసుకుంటే వాటిని వెంటనే తీసుకువెళ్ళి ఏ దేవుడు విగ్రహానికో సమర్పించేవాడు. వాడి ఆటపాటలుకూడా చాలావిచిత్రంగా ఉండేవి. కళ్ళు మూసు కుని ధ్యానం చేస్తూ కూర్చోవటమూ, ఏదైనా గెడ్డం, మీసాలు తగిలించుకుని ఋషిలాగా వేషం వేసుకోవటంలోనో వాడు విపరీతమైన ఆనందం పొందుతూ వుండేవాడు. వాడి తల్లి దండ్రులిర్వురూ రాజ కుటుంబానికి చెందినా, వాడి రక్తంలో రాజసంవునట్లు కనిపించేదికాదు. ఎప్పుడైనా రాజసభకు వెళ్ళినా దారి తప్పిన లేడిలా బెదురుచూపులు చూస్తూ వుండేవాడు. రాజప్రాసాదానికి వచ్చిన సాధువులతో, ఋషులతో వెంటనే కలసిపోయేవాడు. వాడు వెళ్ళిపోయిన తర్వాత ఎంతో వెదికించాము. ఫలితం దక్క లేదు. ఆకాశం నుండి రాలిపడిన చుక్క మరి ఎవరికి చిక్కుతుంది? నా యతి కూడా అట్లాగే .....'.

నేను పుట్టటానికి ముందు జరిగిన ఈ బాధాకరమయిన సంఘటనను అమ్మ సంయమనంతోనే నా ముందుంచింది. అయితే చివరలో నా యతి కూడా ఇట్లాగే - అంటూ - బహుశా ఆనాటి - అరణ్యంలోని ఆసంఘటన కళ్ళముందు మెదిలినట్లుంది, ఆమె ఒక్కసారిగా వణికిపోయింది. క్షణం తర్వాత ఆమె నావైపు ఏదో పోగొట్టుకున్నట్లుగా చూస్తూ ఉండిపోయింది. నేను భయపడ్డాను. అంతలోనే ఆమె దీర్ఘంగా నిట్టూర్చి, నన్ను కౌగలించుకుని వెక్కివెక్కి ఏడ్వసాగింది. ఆమెనెట్లా ఓదార్చాలో నాకర్థంకాలేదు.

'అమ్మా, అమ్మా' - అంటూ మరింతగా చుట్టుకుపోతూ, స్వర్శతోనే అమ్మ పట్ల నాకుగల ప్రేమను వ్యక్తంచేయసాగాను. హృదయవేదన కొంచెం చల్లబడిన తర్వాత - 'యతి నామీద అలిగి వెళ్ళిపోయింది నీ వయస్సు లోనే యయా!' అంటూ అమ్మ నెమ్మదిగా చెప్పసాగింది.

'వాడు అలిగినప్పుడు నేను పెద్దగా పట్టించుకోలేదు. కాని ఈరోజు నువ్వు నామీద కోపగించుకోవడంతో ఆ గాయం తిరిగి కెలికినట్లయ్యింది. అంతేకాదు దాంట్లోంచి రక్తం స్రవిస్తున్నట్లుంది. మనస్సులో చెలరేగిన ఆందోళన ఫలితంగానే,

నీకు ముఖ్యంగా చిన్నతనంలో తెలియనివ్వకూడదనుకున్న ఆ రహస్యం చెప్ప వలసి వచ్చింది. నువ్వుకూడా యతిలాగా వెళ్ళిపోతావెమోనన్న భయంతో చెప్పాను. నాయనా! యయూ! పిల్లలు తల్లికి కంటిదీపాలు వంటివారు'.

'లేదమ్మా! యతిలాగా నేను నిన్ను వదిలి ఎప్పుడూ వెళ్ళనమ్మా. నీకు కష్టం కలిగించే ఏ పనీ నేను ఎన్నడూ చేయ్యనమ్మా!' నేను వెక్కుతూ చెప్పాను.

'మాట ఇవ్వు నాయనా'.

'అమ్మా ఇదే నామాట. ఎప్పుడూ, ఎటువంటి పరిస్థితులలోనూ నేను సన్యాసిని కానమ్మా' - చేతిలో చేయ్యివేసి చెప్పాను.

# అధ్యాయం 3

ఆ రాత్రి - నాకింకా గుర్తే.

ఏళ్ళు గడిచినా ఆ జ్ఞాపకాలు నన్ను వదలలేదు. అమ్మ, నేనూ ఆరోజు ఏం మాట్లాడ కున్నామో నేను చెప్పలేను. కాని, ఆ ఒక్కరోజులోనే నేను ఎంతగానో ఎదిగిపోయాను. కలల ప్రపంచం నుండి వాస్తవిక ప్రపంచంలోకి వచ్చేసాను.

నేను మొట్టమొదటిసారిగా ఏడ్చిన రోజది. అమ్మకు దుఃఖం కలిగించిన విషయాలన్నిటి పైన నాకు అసహ్యం వేసింది. ఆరాత్రి నేను ప్రశాంతంగా నిదుర పోలేదు. మధ్యలో ఉలిక్కిపడి లేస్తూ గడిపాను. నాకు కలలు రాసాగాయి. ఒక కల ఇంకా నాకు గుర్తుంది. ఇప్పుడు ఆ కలను తలచుకుంటే నవ్వు కూడా వస్తుంది. ఆ కలలో నేను ప్రపంచానికంతా రాజు నయ్యాను. కొరడా ఝుళిపించుకూంటూ ప్రతి నగరంలో తిరుగుతూ కనిపించిని ప్రతి తాపసిని, యోగిని, బాబాను, సాధు వును కొట్టాను. కొరడా దెబ్బల మూలంగా రక్తం కారుతున్న వీపులతో వారు అరుస్తుంటే నేను ఆనందంతో చప్పట్లు కొట్టసాగాను.

అవును. ఆ రాత్రి నేను నిశ్చయంగానే అకస్మాత్తుగా పెద్దవాణ్ణయ్యాను. ఆ రాత్రి చీకటిలో జీవితపు కఠోరయథార్థాలను తెలుసుకున్నాను. నాకు ఒక అన్నయ్య ఉన్నాడు. సన్యాసిగా మారటానికి ఇల్లువదలిపోయాడు. ఈ విషయాన్ని నాకు తెలియ కుండా అందరూ దాచివుంటారు. ఎందుకు? ఇంతటి వాస్తవాన్ని ఎందుకు దాచివుంటారు? అందరూ ఇతరుల పట్ల ఇటువంటి దాగుడుమూతలే ఆడుతారా?

ఈ విషయం నాకు తెలియనంతవరకు పువ్వులు, గాలి, నీరే నా ప్రపంచం. ప్రతిరోజూ పువ్వులు వికసించినట్లే నేను నిద్రలేచేవాణ్ణి. తుఫానులు, ఉప్పెనలు

వచ్చినా నేనెప్పుడూ భయపడలేదు. కలకలమంటూ పారే సెలయేటినిచూసి, అది కూడా నాలాగే ఏదో పాటపాడుతుందనుకునేవాణ్ణి. దేవతల - రాక్షసుల - యక్షుల-గంధర్వుల కథలు నాకెంతో నచ్చేవి. రంగు రంగుల సీతాకోకచిలుకలు, పువ్వులు, నక్షత్రాలు, వర్షా కాలపు ఇంద్రధనుస్సులు, గాలితో పోటిపడుతూ పరిగెత్తేగుర్రాలు, దేవాలయంలో మ్రోగేగంటలు, నదిఒడ్డున మెత్తని ఇసుక, మంచం మీది మెత్తటి తలగడ ఇవన్నీ కలసి నాకంటూ ఒక ప్రపంచాన్ని సృష్టించిపెట్టాయి. ఆ రాత్రివరకు నాకు ప్రకృతి - పురుషుడు ఒకటే.

ఆ కలల ప్రపంచలోని అనుభవాలు ఎంత మనోహరంగా వుండేవి? ఎంతో మధురంగా వుండేవి? ఆకాశంలోని తెల్లని మేఘాలనుచూసి, మా తోటలోని తెల్లని కుందేళ్ళు ఆకాశపు అద్దంలో ప్రతిబింబిస్తున్నాయనుకున్నాను. ఒకసారి వేసవి కాలంలో చాలా ఎండగా వుంది. శరీరమంతా చెమటతో తడిసి పోతున్నది. అప్పుడు నాకు ఆడుకోవటానికి బయటకు వెళ్ళాలనిపించింది. పనివాళ్ళ కళ్ళు కప్పి నేను రాజ భవనం బయటకు వచ్చాను, అయితే కొంచెంసేపటికే నేను ఎండలో తిరిగి తిరిగి అలసిపోయాను. దగ్గరలోని ఒక అందమైన చెట్టు కొమ్మలు విస్తరించుకుని కనపడింది. దాని క్రింద చేరాను. ఆ చెట్టునీడలో అలసటంతా మటుమాయమైపోయింది. అమ్మ ఒడిలో సేదతీరినట్లుంది. ఆ చెట్టును వదిలి వెళ్ళాలనిపించలేదు. ఆ చెట్టు కొమ్మనొక దానిని బాహువులలో బంధించాను. ఆ రాత్రివరకు ఇదే నా ప్రపంచం. అది ఒక అద్భుతమైన, రమణీయ స్వప్నం. ఎవరి మీదైనా కోపం వస్తే కోతిలాగా ఏదైనా చెట్టెక్కి భగవంతుణ్ణి పిలిస్తే, ఆ పిలుపు విని భగవంతుడు దిగివచ్చి అపరాధిని దండిస్తాడనే ఆలోచన. మొగ్గ లాంటి జీవితం. అయితే మొగ్గఎంతకాలం మొగ్గలాగా వుండిపోతుంది? నేడో రేపో అది వికసించవలసిందే. పెరగవలసిందే.

ఆ రాత్రి నుండి నేనూ వికసించసాగాను. పెరగసాగాను. ఏదోరోజు యతిని తప్పకుండా వెదకి తీసుకురావాలనీ, అమ్మ ముందు నిలిబెట్టాలనీ, ''నువ్వు నాకు అన్నయ్యవు, ఈ రాజ్యమంతా నీదే'' అనాలన్న ఒక ఆలోచన మనస్సులో గట్టిగా ఏర్పడింది. ఇది సఫలమవుతుందో లేదో తెలియదు.

ఈ ఆలోచనతోనే నేను పెద్దవాణ్ణయ్యానని చెప్పలేను. నాకు ఆరేళ్ళు వచ్చాయి. రాజకుమారుణ్ణయిన కారణంగా విశిష్టమైన విద్యలలో, కళలలో నేను

నిష్ణాతుణ్ని కావలసిన అవసరం తప్పనిసరి అయ్యింది. నాన్నగారు నాకోసం చాలా మంది గురువులను ఏర్పాటు చేసారు. మొట్టమొదట వారందరినీ నేను శత్రువులు గానే భావిస్తూ వచ్చాను. నాకు మల్లయుద్ధ నేర్పే గురువుగారయితే రాక్షసుడే అనిపించే వాడు. రాక్షసుని వంటి మహాకాయమే ఆయనకు మల్లయుద్ధం నేర్పే అధికారాన్ని సిద్ధింప చేసిందని నా కనిపించేది. కాని తెల్లవారగానే నిద్రలేవటం, గోదాలోని ఎర్ర మట్టిలో దొర్లటం నాకు విసుగునిపించేది. మొదట్లో కొన్నిరోజులు ఒళ్ళంతా భరించ లేనంత నొప్పిగా వుండేది. అమ్మకు ఫిర్యాదు చేసాను. అయితే భవిష్యత్తులో రాజు కావలసినవారు ఇదంతా భరించవలని వుంటుందని అమ్మ నాకు సర్ది చెప్పే ప్రయత్నం చేసింది. అప్పటినుండి 'నేను రాజు కావాలి' అంటూ మంత్రాల జపించ సాగాను. మొదట మల్లయుద్ధంలో నేను తరచుగా ఓడిపోతూ వుండేవాడిని. ఈ విద్య నాకు ఎప్పుడూ పట్టుబడదేమోనన్న నిరాశతో క్రుంగిపోయేవాడిని. అయితే మా గురువుగారు నన్ను ప్రోత్సాహిస్తూ వుండేవారు.

'నీ వయస్సులో నేనూ వెన్నముద్దలాగా వుండేవాడిని. ఇప్పుడు నా భుజాలు చూడు. వీటి ముందు లోహపుగుళ్ళు కూడా మెత్తగానే అనిపిస్తాయి'.

ఈ ఏడేనిమిదేళ్ళలో ఎందరో గురువులు, మిత్రులు నా శరీరాన్ని, మనస్సును తీర్చిదిద్దారు.

అప్పటికి నేను పదనాలుగేళ్ళ వయస్సువాడినయ్యాను. అద్దంముందు నిలబడి నా అందమైన, బలిష్ఠమైన శరీరాన్ని తనివితీరా చూసుకుంటూ వుండేవాణ్ణి. ఆ ప్రతి బింబపు బలిష్ఠమైన రెక్కపట్టుకుని ఊపివెయ్యాలనే కోరిక కలుగుతూ వుండేది. దానిని తలగడగా చేసుకుని విశ్రాంతిగా నిదరపోవాలనిపించేది. వృత్రాసురుణ్ణి సంహరించి తన ప్రాసాదానికి తిరిగివచ్చిన తర్వాత ఇంద్రాణి భుజంమీద తల వాల్చి నిదురించిన ఇంద్రుడు నాకు గుర్తుకు వచ్చాడు.

ఇటువంటి ఆలోచనలు మదిరలాగా మత్తుని కలిగిస్తాయి. అటువంటి మత్తులోనే మునిగి ఎంతసేపు అద్దం ముందు నిలబడ్డానో నాకే తెలియదు. అకస్మాత్తుగా వులికిపాటుతో తిరిగిచూసాను. ఎవరివో మాటలు వినిపిస్తున్నాయి. ఆ మాటలు అమ్మవే-

'మగవారు కూడా గంటలకొద్ది అద్దం ముందు నిలబడి తమ అందాన్ని చూసుకుంటారన్నమాట! ఇన్నాళ్ళూ కేవలం ఆడవాళ్ళకే తమ అందం మీద గర్వముంటుందనుకుంటున్నాను.

'యయూ! పెద్దవాడవయ్యావు. ఎవరైనా చూస్తే ఏమనుకుంటారు?'

నేను వెనుతిరిగిచూడకపోతే అమ్మమాటలు కొనసాగేవేమో! అమ్మ నా దగ్గరకు వచ్చి, నా వీపు నిమురుతూ - 'యయూ! చూస్తూ చూస్తూనే ఎంత పెద్దవాడ వయ్యావురా! నీకు నాదిష్టే తగిలేటట్లుంది. నిన్ను వెనుక నుండి చూసి, బహుశ మహారాజుగారే అద్దం ముందు'-

ఆమె మధ్యలోనే ఆగిపోయింది. ఆమె కళ్ళనిండా నీళ్ళు. ఆకళ్ళతోనే నా వంక చూస్తూ అన్నది -

'సరే! నా బాధ ఒకటి తీరిపోయింది'.

'ఏ బాధ?'

'చాలా ఏళ్ళయ్యింది. దానిని గురించి నేను నీతో ఏమి అనలేదు. కాని లోలోపల నా మనస్సు కుళ్ళుతూనే వుంది'.

'అమ్మా! నువ్వు హస్తినాపురపు మహారాణివి. ఏ దరిద్రుడైన ఋషికో, నిర్భాగ్యుడైన దస్యునికో భార్యవుకావు, నీకు బాధేమిటమ్మా?'

'అయినా నేనూ 'అమ్మ'నే కదా యయూ!'

'అవునమ్మా నా అమ్మవే!' - 'నా' అనే మాటదగ్గర నేను అద్దంలో నా ప్రతిబింబాన్ని మరొక్కసారి చూసుకున్నాను. అమ్మకూడా ఆ ప్రతిబింబాన్ని చూసి నవ్వింది. కొంచెం సేపటి తర్వాత గంభీరంగా అంది-

- 'కావచ్చు! కాని ఒక కలశంలో వుండిన అమృతం విషంగా మారినప్పుడు రెండవ కలశం గురించి బాధవుండటం సహజమే కదా!' అర్థమయ్యింది. అమ్మ యతి గురించే అంటున్నది. అమ్మ తన మనోవేదనను నా ముందుంచేటపుడు నేను పెద్దవాణ్ణయ్యాను. మల్లవిద్యలో, ధనుర్విద్యలో, అశ్వారోహణలో, యుద్ధ తంత్రంలో

నైపుణ్యాన్ని సంపాదించాను. ఇప్పుడు యతికోసం ఆర్యావర్తమంతా గాలించటం నాకు పెద్ద కష్టంకాదు.

- 'అమ్మా! నాన్నగారితో అనుమతి ఇప్పించు. భూమండలమంతా ఏకంచేసి యతిని వెదికి పట్టుకుని నీ ముందు నిలబెడతాను'.

అమ్మ పెదవులు అస్పష్టంగా కదిలాయి. అయితే కళ్ళు నీళ్ళతో నిండాయి. తన్నుతాను ఓదార్చుకుంటూ అన్నది - 'పిచ్చినాయనా! యతిని ఎట్లా వెదుకుతావు? ఒకవేళ యతి ఈ రోజు నా ముందు వచ్చి నిలబడినా నేనే గుర్తించలేను. నువ్వు వాణ్ణి ఒక్కసారి కూడా చూడలేదు. వాడు ఎక్కడున్నాడో! ఏ స్థితిలో వున్నాడో! ఎలా జీవితం గడుపుతున్నాడో! ఏ పేరుతో వున్నాడో! అసలీలోకంలో వున్నాడో లేక-'

మాట్లాడుతూ, మాట్లాడుతూ ఆమె గొంత దుఃఖంతో భారమయ్యింది. మాటలు నోటిలోనే ఆగిపోయాయి. యతి ఆమెకు అంతులోని వేదనను కలిగించాడు. ఎవరికీ చెప్పుకోలేని వేదనను మిగిల్చిపోయాడు. అదుపు తప్పిన గుఱ్ఱం మీద నుండి క్రిందకు తోసివేయబడి, పైకి దెబ్బలు కనిపించకపోయినా, ఒళ్ళంతా పచ్చి పుండయి నట్లు, కనీసం మూలగటానికికూడా వీలులేని పరిస్థితిలో వున్నట్లుంది, అమ్మ స్థితి. నాకు ఒక్క అన్నయ్య వుండేవాడని, బ్రహ్మర్షి కావటానికి చిన్నతనంలోనే ఇల్లువదలి వెళ్ళిపోయాడన్న విషయం వాకు గుర్తులేదు.

కాని అమ్మ ఆజ్ఞాపకాన్ని తిరగతోడింది. నామీద చూపునిలుపుతూ అమ్మ అన్నది - 'యయూ! నువ్వు త్వరగా పెద్దవాడివయ్యావు. శరీరంకూడా ధృఢంగా తయారయ్యింది. సకల విద్యా, కళాపారంగతుడవయ్యావు. ఇప్పుడు నీకు వివాహం చెయ్యటానికి ఏ అడ్డులేదు. నీకు వివాహం చేస్తే నాకు ఇక ఏ బాధ వుండదు. నేనీ రోజు మహారాజుగారితో ఈ విషయం ప్రస్తావిస్తాను'.

నాన్నగారు యతి విషయం ఎవరితోనూ ప్రస్తావించరు, ఎవరూ ఆయన వద్ద ఆ విషయం ప్రస్తాపించకూడదు. మిగిలిన విషయాలలో మాత్రం ఆయన అమ్మ గుప్పిట్లో వున్నట్లే.

అమ్మ చెప్పిన ఏ విషయమూ ఆయన కాదనరు. ఏ కోరికనూ

తిరస్కరించరు. ఒకసారి గురువుగారు నన్ను కొంతకాలం ఏదైనా ఆశ్రమంలో వుండమన్నప్పుడు - 'అవును. ఏచెట్టయినా సక్రమంగా పెరగాలంటే వర్షం లాగానే ఎండకూడాతగలటం అవసరం'- అని అన్నారు. ఈ విషయం నా దృష్టికి వచ్చినప్పుడు నేను ఆశ్చర్య పోయాను. యతి విషయం అమ్మ నాకు చెప్పినప్పటి నుండీ, ఆశ్రమ జీవితంపట్ల నా మనస్సులో తెలియని అసహ్యం, అయిష్టత ఏర్పడ్డాయి. పొడవైన గడ్డం, రూప విహీనంగా ఋషులు, వారి మాసిపోయిన నారబట్టలు, అడివి మనుష్యుల్లాగ భీతి గొలిపే వారి జీవనవిధానం - ఈ ఊహతెలిసినప్పటి నుండి ప్రతి ఋషిని గురించీ నాకు అయిష్టతే పెరుగుతూ వచ్చింది. ఇటువంటి ఋషులకు, మునులకు భగ వంతుడు ఎందుకు వశమవుతాడో, ఎందుకు వీరికి వరాలు, శాపాలు ఇచ్చేశక్తి ప్రసాదిస్తాడో నాకు అంతుపట్టలేదు. ఇది నాకు అర్థంకాని ప్రశ్నగానే మిగిలి పోయింది. నా గురువులంతా నాకు సౌందర్యాన్ని, సామర్థ్యాన్ని ఆరాధించటమే నేర్పారు. అయితే ఆశ్రమజీవితంలో వీటికి స్థానమేలేదు. తమనుతాము శిక్షించు కోవటమే, అక్కడ పంచమవేదం. కందమూలాలే మృష్టాన్నాలు. మంత్రఘోషాలే అక్కడ గర్జనలు. కూరలు కోయటమే అక్కడ మృగయావినోదం. కుటీరాలే అక్కడ భవంతులు. అక్కడి స్త్రీలతో పోలిస్తే మా అంతఃపుర దాసీలు అప్సరసలు.

అటువంటి ఆశ్రమానికి వెళ్ళి కొంతకాలం గడపాలన్న ఆలోచనే నేను భరించ లేకపోయాను.

రెండవరోజు నాన్నగారు ఆ గురువుగారితో మాట్లాడటం కిటికీచాటు నుండి విన్నాను. మొదట గుండె భయంతో కొట్టకోసాగింది. చివరకు నాన్నగారు గురువు గారితో ఇంతే చెప్పారు - 'యయూ ఆశ్రమానికి వెళ్ళి అక్కడ కొంతకాలం గడ పడం నా ఉద్దేశ్యంలో చాలా మంచిదే. అయితే మహారాణిగారికి అటువంటి కోరికలేదు'.

ఆ రోజు అమ్మ నన్ను ఒక ఇరకాటం నుండి బయట పడవేసింది. అయితే అదే అమ్మ నన్నీరోజు మరో సంకటంలోకి తోస్తున్నది. నాకు వివాహం చేస్తా నంటన్నది. వివాహం అందరూ చేసుకుంటారు. ఏదో ఒకరోజు నేనూ చేసుకో వలసిందే. ఎవరో ఒక అందమైన రాజకన్య నాకు భార్యగా వస్తుంది. ఈ

ఆలోచనలు నా మనస్సులోనూ కలుగుతున్నాయి. కేవలం అవి ఆలోచనలు మాత్రమే. అవేమీ ఉత్తుంగ తరంగాలలా నా మనస్సును కల్లోలపరచటంలేదు. ఆ ఆలోచనలు కూడా చిత్రంగానే వుంటాయి.

పగలంతా మానసికంగా, శారీరకంగా అలసిపోయినప్పటికీ, మెత్తని పరుపు కూడా నాకు రాత్రి నిద్రను ఇవ్వలేకపోతున్నది. అకస్మాత్తుగా మధ్య రాత్రిలో మెలుకవ వస్తున్నది. వీరత్వం, అశ్వమేధం, దేవ, దానవ యుద్ధం వంటి అనేక మైన కలల చిత్రాలు నా మూసినకళ్ళ ముందు సిద్ధమవుతున్నాయి. నా ముత్తాత పురూరవుడు మహాపరాక్రమవంతుడు. ఊర్వశిని అపహరించుకు వెళుతున్న రాక్షసుణ్ణి ఓడించి ఆమెను తన భార్యగా చేసుకున్నాడు. ఆయన పరాక్రమంతో నిండిన కావ్యాన్ని నేను చిన్నతరంలోనే కంఠస్థం చేసాను. యజ్ఞకుండాన్ని ప్రజ్వలింపచేయటానికి గంధర్వలోకం నుండి ఆయన తీసుకువచ్చిన ముగ్గురు అగ్ని దేవతల మందిరాలు ఈ నాటికీ హస్తినాపురపు వైభవాన్ని చాటుతూ వున్నాయి. నా తండ్రి నహుషుడు కూడా, వారి తాతగారి లాగానే గొప్పవీరుడు. చిన్నవయస్సులోనే ఆయన రాక్షసులను సంహరించి మునులకు అభయదానం చేసారు. ఆయన దేవతలను జయించి ఇంద్రపదవిని సైతం పొందారని చెపుతూ వుంటారు. వీరిద్దరిలాగానే అద్భుతమూ, అపూర్వమూ అయిన విజయాలు సాధించాలని నా మనస్సు ఉవ్విళ్ళూరుతూ వుంటే, అమ్మ ఒకపక్కనాకు వివాహం చేస్తానంటున్నది.

వివాహం విషయంలో అమ్మ చూపుతున్న తొందర నాకిష్టంలేదు. నవ్వుతూ అన్నాను - 'అమ్మా! నా వివాహ విషయంలో మీరెందుకు తొందరపడుతున్నారో నేను చెప్పనా?'

- 'కోడల్ని చూసుకోవాలని కోరికగా వుంది నాయనా!'

- 'కాదు, నేను కూడా యతిలాగా మాయమైపోతానని భయం. నన్ను బంధించి వుంచటానికి మీకు మరో రెండు చేతులు కావాలి. అమ్మా! చెపుతున్నా విను, భార్య ముఖ సౌందర్య శక్తికంటే అమ్మ చరణాల శక్తే ఎక్కువ. నీకు కలుగు తున్న భయం నిజం కాదమ్మా!'.

- 'లేదు నాయనా! అది నా నీడంత నిజం'.

- 'నేను పరాక్రమవంతుడైన వీరుణ్ణవుతాను. సన్యాసిని కాను'.

- 'కాని'-

- 'కానీ గీనీ ఏమీ లేదు'.

- 'నువ్వు పుట్టినప్పుడు ఒక గొప్ప జ్యోతిష్యుడు నీ జాతకం చెప్పాడు'-

- 'నా చేతిలో ఎంతమంది రాక్షసులు చస్తారని చెప్పాడమ్మా? లక్షలా? కోట్లా? చెప్పమ్మా?'- చాలా కుతూహలంగా అడిగాను.

'చాలు చాల్లే పద. పిచ్చి నాయనా!'

'పోని నేనెన్ని అశ్వమేథాలు చేస్తనో చెప్పాడా అమ్మా?'

'లేదు', అంటూ అమ్మ తలఊపింది.

'అయితే ఆ జోతిష్యుడు నా జాతకం ఎందుకు రాసినట్లూ'- నిరుత్సాహంగా అడిగాను.

అమ్మ మొహం చూస్తే ఈ సంభాషణ పొడిగించటం ఇష్టం ఉన్నట్లులేదు. కొంచెం సేపు మౌనంగా వుంది, మెల్లగా చెప్పింది -

- 'యయూ! ఈ బాలుడు చాలా అదృష్టవంతుడనీ, రాజవుతాడనీ, అయితే అన్ని సుఖాలు అందుబాటులో వున్నప్పటికీ సుఖంగా ఉండడని ఆ జోతిష్యుడు చెప్పాడు'.

ఆ జోతిష్యుడు చెప్పిన పిచ్చి జాతకం విని నాకు నవ్వు వచ్చింది. తన మాటలకు అర్థం తెలిసినట్లులేదు ఆ పిచ్చి జోతిష్యునికి. సర్వసుఖాలు అందుబాటులో వున్నప్పటికి సుఖపడనటువంటివాడు పిచ్చివాడయి ఉండాలి లేదా అతనికి అటువంటి విషయం చెప్పినవాడన్నా పిచ్చివాడయి ఉండాలి. చివరకు నేను అమ్మతో ధృడంగా చెప్పాను -

'అమ్మా! నువ్వుకావాలంటే తరువాత నేను వంద పెళ్ళిళ్ళు చేసు కుంటాను. అయితే నాకు ఇప్పుడు కావలసింది ప్రణయంకాదు, పరాక్రమం అంతఃపురాలలో

కబుర్లు చెప్పుకుంటూ కాలంగడపాలని లేదు. యుద్ధరంగంలో పరాక్రమాన్ని చూపించాలనిపిస్తుంది. దేవదానవుల మధ్య మరల యుద్ధం మొదలయ్యేటట్లుందని తెలిసింది. నన్నాయుద్ధంలో పోరాడనివ్వు. లేకపోతే అశ్వమేథం చెయ్యమని నాన్న గారికి చెప్పు. యాగాశ్వంతోపాటు ఆర్యావర్తమంతా చుట్టివస్తాను. వందల కొద్దీ వీరుల్ని మట్టికరిపించి వస్తాను. ఆ తర్వాతే వివాహం విషయం ఆలోచిస్తాను'.

ఒక వీరుడిగా నా పరాక్రమాన్ని ప్రపంచమంతా చాటాలనే నా కోరికను అమ్మ అర్థం చేసుకున్నట్లుంది. నాన్నగారి దగ్గర నా వివాహ ప్రస్తావన తేనేలేదు.

విద్యాభ్యాస సమయంలోనే నేను ఊహించలేనంతగా మారిపోయాను. చుట్టు ప్రక్కలవున్న భూభాగం కారణంగా నది స్వభావం మారిపోయినట్లు నా మనస్సు కూడా చాలా వేగంగా మారిపోయింది. ధనుర్విద్యలో తొలిపాఠం నేర్చుకునే సమయంలో మనస్సు, దృష్టి ఏకంచేసి చూడటంలో గల అలౌకికమైన ఆనందాన్ని నేను తొలిసారిగా అనుభవించాను. కిటకీ నుండి బయట కనిపించే రంగురంగుల పువ్వులను చూస్తే చిన్నతనంలో పులకించి పోయేవాణ్ణి. అయితే బాణపుగురి చూస్తున్నప్పుడు దానికి భిన్నమైన అనుభవం ఎదురయ్యింది. కొండలు, చెట్లు, నీలాకాశం, వీటన్నిటికీ నా దృష్టిలో అస్తిత్వమే వుండటం లేదు. నా దృష్టంతా కేవలం నా గురిగా నిలిచిన ఆ నల్లనిచుక్కమీదే. ఆ నల్లనిచుక్కే నాకు ప్రపంచ మయ్యింది.

ఈ కొత్త అనుభవంతో నేను పులకించిపోయాను. నిర్జీవమైన వస్తువులమీద గురితప్పకుండా బాణం వెయ్యటంలో నేను నిష్ణాతుడనయ్యాను. ఇక సజీవ ప్రాణుల మీద బాణాలు వేసేవంతు వచ్చింది. చాలా రోజులు గడిచినప్పటికీ, నా తొలి గురికి ఎరయిన ఆ ప్రాణిని తలచుకుంటే నా మనసు కంపించిపోతుంది. అది ఒక ఎత్తైన చెట్టుమీద విశ్రాంతిగా కూర్చున్న ఆడపక్షి. కాదు, కాదు, ధ్యాన మగ్నమైన యోగిని అది. నీలాకాశపు నేపథ్యంలో అదొక మనోహరమైన బొమ్మలా గున్నది. కనురెప్ప పాటులో ఆ బొమ్మ ప్రాణం పోసుకుని ఎగిరిపోయేదే. సూర్యుడు అస్తమిస్తూ వున్నాడు. ఎక్కడో ఏదో గూటిలో రెక్కలు రాని పక్షిపిల్లలు తల్లికోసం ఎదురు చూస్తూ వుండవచ్చు. కాని నాకుగాని, నా గురువుకుగాని దానిని గురించిగానీ, దాని కుటుంబం గురించి గానీ చింతలేదు. నేను ధనుర్వి ద్యలో

నిష్ణాతుణ్ణికావాలను కుంటున్నాను. నా గురువు నాకు విద్యనేర్చి తన మనుగడ సాగించాలనుకుంటున్నారు. ఆ అమాయకపు మూగప్రాణిమీద బాణం వేసేటపుడు నా మనస్సు అంతు లేని వేదనతో నిండిపోయింది. ఆ క్షణంలో, ప్రకృతితో నాకు గల సన్నిహిత సంబంధం తెగిపోయింది. ప్పటివరకు హృదయపు ఏదో మూల నాలో కవి దాగి వున్నాడు. ఆ క్షణంలో నాలోని కవి మరణించాడు.

నేను గొప్పపరాక్రమవంతుడైన వీరుణ్ణయిన మాట యథార్థమే. అయితే అది అంత తేలికగా జరగలేదు. నాలోపల వున్న కవిని చంపి, ఆ సమాధిపై ఈ వీరుడు సింహాసనాన్ని అధిష్టించాడు. తిరుగులేని నాగురి ఆ రాత్రి ఎన్నో ప్రశంసలు పొందింది. రాజభవనంలో ఆ రాత్రి అమ్మ ఆ పక్షిమాంసం స్వయంగా వండించి, నాకూ, నాన్నగారికీ వడ్డించటమేకాక, తాను కూడా తిన్నది. నాన్నగారు నామీద ప్రశంసల వర్షం కురిపిస్తూ ఎంతో ఇష్టంగా ఆ మాంసం తిన్నారు. అయితే నాకు మాత్రం ఒక్కొక్క ముద్ద ఎంతో కష్టంగా గొంతుదిగింది. రాత్రి రెండు మూడు సార్లు నేను పులిక్కిపడి నిద్రలేచాను. ఒకసారి నాబాణం దెబ్బకు ఆ పక్షి గిలగిలా తన్నుకున్నట్లనిపించింది. మెలుకువరాగానే ఆ పక్షిపిల్లల కరుణార్ద్రమైన కిచకిచలు విని పించసాగాయి. ఎప్పుడో, ఎన్నో సంవత్సరాల క్రితం మాయమైన కొడుకు గుర్తుకు వస్తే అమ్మ తల్లడిల్లిపోతూ వుంటుంది. అయితే అదే అమ్మ, ఆ పక్షితల్లి చావును ఎంతో ఆనందంగా చూడగలుగుతుంది. ఆ అమాయకపు పక్షితల్లి శరీరాన్ని భేదిం చిన తన కుమారుణ్ణి విపరీతంగా ప్రశంసిస్తున్నది. ఆ మూగప్రాణి మాంసాన్ని ఎంతో ఇష్టంగా భుజించింది. అయితే ఆ పక్షి శరీరంలోని అణువణువు చివరివరకు తన పిల్లలకోసం అలమటించిన సంగతి అమ్మ విస్మరించింది. జీవితంలో ఈ వైవిధ్యం నన్ను విస్మయ పరిచింది.

మరుసటిరోజు దేవాలయానికి వెళ్ళివచ్చిన తర్వాత వృద్ధమంత్రి రాజ మహలుకు వచ్చారు. నేను నా మనస్సులోని సందేహాన్ని ఆయన ముందుంచాను. ఆయన నవ్వుతూ అన్నారు -

'యువరాజా! మీరింకా చిన్నవాళ్ళు. ప్రపంచంలోని ఈ వైరుధ్యాలు చూసి నా తల నెరసిపోయింది. ఈ వృద్ధుడి అనుభవాలు ఎప్పుడూ గుర్తుంచుకోండి - ఈ ప్రపంచం మనిషి మనస్సులోని దయమీద నడవటంలేదు. అతని భుజబలం

మీద సడుస్తున్నది. మనిషి కేవలం ప్రేమ మీద జీవించటం లేదు. అతను ఇతరులను పరాభవించి జీవిస్తున్నాడు. మనిషి సుఖభోగాలకోసమే తన జీవిత మంతా వురుకులు పరుగులతో గడుపుతున్నాడు. త్యాగం కేవలం దేవాలయాలకూ, పురాణాలకూ, కీర్తనలకే పరిమితమయ్యింది. జీవితం దేవాలయంకాదు. యుద్ధభూమి వంటిది'.

ఆ తర్వాత అమాత్యులు నాకెన్నో వైదిక కథలు వినిపించారు. పశుపక్ష్యాదుల వృత్తాంతాలు ఎరుకపరచారు. వాటన్నిటిసారం ఒక్కటే. ప్రపంచమంతా శక్తిమీదే ఆధారపడి నడుస్తూన్నది. పోటీలోనే జీవిస్తున్నది. అనుభవించటానికే పరుగులు తీస్తున్నది.

ఆ రోజునుండి నేను శక్తిని, పరాక్రమాన్ని ఆరాధించసాగాను, క్రూరత్వం, వీరత్వం రెండు కవల పిల్లలని భావించసాగాను.

బాల్యంలో నేను జంతువుల పిల్లలతో ఆడుకుంటూ వుండేవాణ్ణి. అవే నాకు ఆనాడు సహచరులు. ఇప్పుడు నేను అరణ్యంలోని ప్రతిజంతువుకూ శత్రువునే. లేళ్ళ చపలత్వం బాల్యంలో నన్నెంతో వివశుణ్ణి చేస్తూ వుండేది. అయితే ఇప్పుడు వాటి ఆ చపలత్వం నాకు క్రోధం కలిగిస్తున్నది. గెంతుతూ పరుగులు తీస్తున్న లేడి బొమ్మను నేను ఐదారేళ్ళవయస్సులో గీసి అంతఃపురద్వారం దగ్గర వుంచాను. ఇప్పుడ అదే బొమ్మను నేను లేళ్ళరక్తంతో దిద్దుతూన్నాను. నా చిన్నతనంలో అమ్మకు అత్యంత ప్రీతి పాత్రమైన లేడికి దెబ్బతగిలింది. నాన్నగారి దగ్గరవున్న నెమలి ఈకల వింజామరతో నేను ఆ లేడి గాయానికి గాలి విసురుతూ గంటలు తరబడి కూర్చున్నాను. ఇప్పుడు నేను గురిచూసి సంహరించిన లేళ్ళ చర్మాలు వలచి సేవకులు వాటి శరీర భాగాలు నాకు చూపిస్తుంటే వాటిని ఎంతో ఆప్యాయంగా నెమ్మదిగా చేతితో నిమురుతున్నాను. ఆ శరీర భాగాల మెత్తటి స్పర్శ నాకెంతో సంతోషం కలిగిస్తున్నది. నా బాణాల దెబ్బలకు గిలగిల లాడుతున్న వాటి బాధగానీ, ప్రాణంపోయేటపుడు వాటి నిస్సహాయమైన చూపులు గానీ, వాటి గాయాల నుండి చిమ్మే రక్తంగానీ నాకు గుర్తుకు రావటంలేదు. వాటి చర్మాలను గురువులకు, బంధువులకు, మిత్రులకు బహూకరిస్తూ వుంటే వారు నా వేట నైపుణ్యాన్ని ప్రశంసిస్తున్నారు.

నా యీ వీరత్వానికి పరీక్షాసమయం అనాయాసంగానే వచ్చింది.

నారదుడు, మరికొంతమంది ఋషులు అప్పుడప్పుడు వచ్చి దేవదానవుల మధ్య పెరుగుతున్న వైషమ్యాలను నాన్నగారికి తెలియచేస్తున్నారు. ఈ కలహం ఇంకా యుద్ధరూపం దాల్చలేదు. అయితే ఇరుపక్షాల మధ్య చిన్నచిన్న కీచు లాటలు మొదలయ్యాయి. ఆ కీచులాటలలో దేవతల పక్షంవహించి, రాక్షసులను మట్టికరిపించి, తమ భావిపాలకుడు ఎంతటి పరాక్రమవంతుడో నా ప్రజలకు చూపించాలని నేను తహతహలాడసాగాను. అయితే నాన్నగారికి రాక్షసులపట్ల ఎంత అయిష్టత వుందో దేవతలన్నా అంతే అయిష్టతవుంది. నాన్నగారు తరచు అంటూ వుండేవారు-

'వృషపర్వుడు, ఇంద్రుణ్ణి బంధించి తన రాజభవనాన్ని ఊడ్పించినా నేను నిన్ను ఇంద్రుడికి సహాయంగా పంపను'.

ఈ విషయమై వృద్ధ మంత్రిని నేను అనేకసార్లు తరచి తరచి అడిగాను. ఆయన ఒకటే సమాధానం ఇస్తూవుండేవారు - 'ప్రపంచంలో మనిషికి అన్ని విషయాలు తెలియవలసిన సమయంలోనే తెలుస్తాయి. చెట్లకు ఆకులు, ఆకులతోపాటు పూవులు, పూవులతోపాటు పళ్ళు ఒకేసారిరావు'.

అటువంటి సమయంలో ఏదో ఒక పెద్ద సాహసంచేసి, యుద్ధకాంక్షను తీర్చుకోవాలనిపించేది. హిమాలయసానువుల వద్దకు వెళ్ళి, అక్కడ దట్టమైన అడవులలో యథేచ్ఛగా వేటాడాలని, ఆర్యావర్తపు ఉత్తరభాగంలోని అడవులలోని మదించిన మత్త గజాలను వశపర్చుకోవాలని ప్రగాఢమైన కోరిక కలుగుతూ వుండేది. ఏనుగులను వేటాడి వాటి పొడవైన తెల్లటి దంతాలను హస్తినాపురం తెచ్చి అమ్మకు కానుకగా ఇవ్వాలని వుంది.

కాని అమ్మ నన్నింకా పాలుత్రాగే పసివాడిగానే చూస్తున్నది. నాన్నగారు ఆమె గుప్పిట్లో వున్నారు. అకారణంగా నాకోరికలన్నీ భూమిలో నిక్షిప్తమైన బంగారు నాణాలవలే మిగిలిపోతున్నాయి. ఉండి కూడా లేనట్లుగానే వుంటున్నాయి.

రాజభవనంలో నా శరీరమూ, నా మనస్సూ బందీలయినట్లుగా అనిపిస్తున్నది. ఈ ఆలోచనతో నేను పగలూ రాత్రి సతమతమవుతుండగా మంచి అవకాశం

నడుచుకుంటూ వచ్చి నా తలుపు తట్టింది.

నగరదేవత వార్షికోత్సవం దగ్గర పడింది. ఈ ఉత్సవానికి ఎంతో దూర ప్రాంతం నుండి కూడా వేలాది మంది ప్రజలు నగరానికి వస్తారు. ఆ సమయంలో హస్తినాపురం ఒక విశాల జనసాగరంలా అనిపిస్తుంది. భజనలతో, హరికథలతో, సంగీత-నృత్యాలతో, నాటకాలతో, వివిధ రకాల ఆటపాటలతో ఉత్సవం పది రోజులూ పదిక్షణాల్లా గడిచిపోతాయి.

ఈ సంవత్సరం సేనాపతి ఒక కొత్త ఆటను ఏర్పాటుచేసారు. ఆ ఆట ఉత్సవపు ఆఖరు రోజున వుంటుంది. బహుశా వీరసైనికలకు ప్రోత్సాహం కలిగించ టానికి ఈ ఆట ఏర్పాటు చేసినట్లున్నారు. ఆ ఆట ఈవిధంగా వుంటుంది - అతి వేగంగా పరుగెత్తగల గుర్రానికి బాగా మద్యం పట్టించి, విశాలమైన గుండ్రటి మైదా నంలో పరుగెత్తిస్తారు. దానికి కళ్ళెంగాని, జీనుగాని, తాళ్ళుగాని వుండవు. మత్తెక్కిన ఆ గుర్రం యథేచ్ఛగా పరుగెత్తుతున్నప్పుడు ఆటగాడు ఆ గుర్రాన్ని పట్టుకుని, దానిమీద ఎక్కి ఆ ఆటస్థలం చుట్టూ ఐదుసార్లు తిరిగి, దానిని ఆప కుండా దాని మీద నుండి క్రిందకు దిగాలి, ప్రతి ఆటగాడికి ఒక కొత్త గుర్రం ఏర్పాటు చేస్తారు.

ఈ ఆట నాకు చాలా ఇష్టాన్ని కలిగించింది. అయితే అది సామాన్య సైని కులకు మాత్రమే నిర్దేశించబడింది. యువరాజు ఆ ఆటలో పాల్గొనటం ఎవరికీ నచ్చే పనికాదు. ఉన్మాదంతో, ఉత్సాహంతో నిండిన ఈ ఆటజరుగుతున్నప్పుడు, నేను అంతులేని వుత్సాహంతో అమ్మనాన్నల దగ్గర కూర్చున్నాను. నాలుగు గుర్రాలు వచ్చాయి. ఐదవసారి చుట్టూ తిరిగే సరికి అవి స్వారీచేసేవారిని బంతి లాగా క్రిందకు విసరిపారవేసాయి. ఐదవ గుర్రం చాలా బలిష్టమైనది. దానిని చూస్తుంటే చిన్న రాక్షసుడు కదలి వస్తున్నట్లనిపించింది. దాని కళ్ళు నిప్పులు చెరుగుతున్నట్లున్నాయి. అది ఎంతో ఆకర్షణీయంగా వున్నప్పటికీ ఉన్మాదంలో వున్నట్లు మదించి వుంది. దాన్ని చూడగానే జనంలో ఉత్సాహంతో కూడిన కలకలంచెలరేగింది. ప్రతిఒక్కరిచూపులో భయం, ఆశ్చర్యం, ఉత్సాహం చిందులు వేయసాగాయి. ఆరుగురు సేవకులు దానిని బంధించి మైదానంలోకి తీసుకు వచ్చారు. అయినా అదివశంకాకుండా తలవిదిలిస్తూ, భయంకరంగా సకిలిస్తూ,

గిట్టలతో మట్టి రేపుతున్నది. మధ్యమధ్యలో ఆవేశంతో తలవిదిలిస్తూ, - నేను మీ ఇష్టానుసారం నడిచేదాన్నికాద ని బెదరిస్తున్నట్లున్నది. దానిని చూస్తుంటే నా మనస్సులో అపూర్వమైన ఉన్మాదం పొంగివచ్చింది. భుజాలు అదరసాగాయి. నేను కాళ్ళతో గట్టిగా నేలను తన్నసాగాను.

నేను అమ్మ వంక చూసాను. అమ్మ భయంతో కంపించిపోసాగింది. ఆమె నాన్నగారితో ఆందోళనగా చెప్పింది-

'ఈ గుర్రాన్ని తీసుకు వెళ్ళమని చెప్పండి. చాలా భయంకరంగా వుంది. ఏదైనా అనుకోని సంఘటన జరిగితే అనవసరంగా ఉత్సవం రసాభాసయిపోతుంది'.

'మహారాణీ! పరాక్రమాన్ని ప్రదర్శించటానికే పురుషులు వున్నది' - నాన్న గారు నవ్వుతూ చెప్పారు.

నాన్నగారి నవ్వు, నాన్నగారి మాటలు నాకెంతో ఆనందాన్ని కలిగించాయి. మైదానంలోకి దూకాను. నాలుగు వైపులా మనుష్యులే. ఒక్క క్షణంలో కళ్ళు మూసుకుని నాన్నగారి మాటలను మననం చేసుకోసాగాను. అకస్మాత్తుగా జనంలో భయంతో కూడిన కలకలం చెలరేగటంతో నా కనులు తెరిచాను. ఒక సైనికుడు ఆ గుర్రాన్ని ఎక్కటానికి విఫల ప్రయత్నం చేయటం, అది వాడిని విదిలించి కిందపడ వేసి భయంకరంగా పరుగులు పెట్టటం నాకు కనబడింది. మరో ముగ్గురు సైనికులు ఆ గుర్రంవద్దకు రావటం, మట్టి కరవటం జరిగిపోయింది. గుర్రం ఎవరికీ లొంగటం లేదు. ప్రజలందరూ ఊపిరి బిగబట్టి ఏమి జరగతున్నదని భయంగా చూడసాగారు.

'లే! లే! పురుషులు పరాక్రమవంతులు, లే! యయాతి! నువ్వు హస్తినా పురానికి భావిసామ్రాట్టువు. వాస్తవానికి మహారాజును చూసి భయమే పారిపోవాలి. లేకపోతే హస్తినాపురంలో క్షాత్రధర్మం అడుగంటిందని ప్రజలు హేళన చేస్తారు. ఒక గుర్రం ఆ నగరాన్ని జయించిందని భావిస్తారు. దేవదానవులందరి దగ్గరకు ఈవార్త వ్యాపిస్తుంది. నువ్వు మహావీరులైన పురూరవుడు, నహుషుల సంతతికి చెందిన వాడివి'- అంటూ రకరకాలుగా నా చెవులలో ఎవరివో మాటలు ప్రతిధ్వనించ సాగాయి.

నేను ఒక ఉదుటన లేచి నిలబడ్డాను. పెద్దడుగులు ముందుకు వేసాను. కోమలమైన రెండు చేతులు నన్ను చుట్టివేసాయి. నేను తిరిగి చూసాను. ఆ

చేతులు అమ్మవి.

అమ్మ, కాదు కాదు. బహుశ నా పూర్వజన్మశత్రువు. మహత్తరమైన నా ఆకాంక్షకు నన్ను దూరంగా వుంచాలనుకుంటున్నది. ఆమె తప్పకుండా నా కన్న తల్లే. కాని ఆమె మమత గుడ్డది. ఆమె మనస్సు కుంటిది.

అరణ్యంలో విహరించేవాడు దారిలో అడ్డుగా వున్న కొమ్మలను, తీగలను రెండు చేతులతో ఎలా తొలగిస్తాడో నేనూ అదేవిధంగా అమ్మ చేతుల్ని తొలగించాను. రెప్పపాటులో నేను మైదానంలోకి దూకాను. నాలుగువైపులా మనుష్యులే. ఒక్క క్షణంలో వారందరూ నాదృష్టిపథం నుండి మాయమయ్యారు. నా దృష్టిలో కేవలం ఆ మదించిన గుఱ్ఱమే మిగిలింది. అది విజయగర్వంతో నావైపు చూసి నట్లనిపించింది. నహుష మహారాజు సామ్రాజ్యంలోని పరాక్రమాన్నే అది ప్రశ్నించి నట్లుగాతోచింది. గుఱ్ఱానికి నాకు మధ్యదూరం క్రమంగా తగ్గసాగింది.

'ఇది గుఱ్ఱంకాదు. కుందేలు' - నేను మనస్సులో అనుకోసాగాను.

ఇవే మాటలు నామదిలో పలుమార్లు మెదలుతుండగానే, ఎవరో బిగ్గరగా అరిచారు - 'పిచ్చివాడా! ఎక్కడకు వెళుతున్నావు? అది మృత్యుమందిరం'.

నేను అంతే బిగ్గరగా బదులు పలికాను - 'కాదు. ఇది మృత్యుమందిరం కాదు. కీర్తిశిఖరం. ఇది ఎత్తైన పర్వతం. నేను దీన్ని అధిరోహించబోతున్నాను చూడండి. చూస్తూనే వుండండి. ఇదిగో చూడండి నేనీ శిఖరాన్ని చేరి పోయాను'.

ఆ క్షణమాత్రంలో ఏమి జరిగిందో నాకు తెలియదు. నేను ఆ గుఱ్ఱాన్ని అధిరోహించటం, అది వాయువేగంతో దుమ్ములేపుకుంటూ పరుగులు పెట్టటం జరిగిపోయింది.

అది మొదటి చుట్టు పూర్తిచేసింది. రెండవచుట్టు మొదలయ్యింది, ప్రజలలో ఆనందోత్సాహాలతో కూడిన కేకలు మొదలయ్యాయి.

ఆ సమయంలో నా మనస్సులో కలిగిన ఆలోచనలను నేను వివరించలేను. నేను అవధులులేని ఆనందంతో మూర్ఛిల్లానో, సమాధిస్థితిలో వున్నానో నాకే తెలియదు. ఏ అతీంద్రియ శక్తినాకు సహకరిస్తున్నదో, లేక నాశరీరంలోని ప్రతి అణువు

తమ సర్వశక్తుల్ని సమీకరించుకుని ఆ గుర్రంమీద నా పట్టులేసమాత్రం సడల కుండా చూస్తున్నాయో నాకర్థం కావటంలేదు.

ఆ తేజోవంతమైన గుర్రం, దాని నధిరోహించిన యువకుడైన యయాతి ఇద్దరూ ఉన్మత్తులైవున్నారు. గుర్రం, యయాతి ఇద్దరూ, తిరుగుతున్న బొమ్మల్లాగ వున్నారు. గుర్రంబొమ్మమీద మనిషిబొమ్మ. రెండూ తిరుగుతూన్నట్లున్నాయి. గత జన్మలోని పాప పుణ్యాలలాగా ఒకరికొకరు అతుక్కుపోయినట్లున్నారు. రెండు, మూడు, నాలుగు, దీనితో మూడు చుట్లు పూర్తయ్యాయి.

ఆయిదవ చుట్టు ప్రారంభమయ్యింది. అప్పుడు నేను ప్రదర్శించిన పరాక్రమం ఎవరూ ఎప్పుడూ చూసిగాని, వినిగాని వుండరు. బాల్యం నుండి నా మనస్సులో గూడుకట్టుకున్న కల నేడు నిజంకాబోతున్నది. స్వాతిబిందువు ముత్యపు చిప్పలో పడి ముత్యమయ్యింది. నేను ఆనందం పట్టలేకపోతున్నాను.

అది ఆకాశం! నీలాకాశం. ఆ నీలాకాశం నాకిప్పుడు కేవలం నాలుగడుగుల దూరంలోనే వున్నది. ఈ గుర్రం మీద నిలబడి ఆ ఆకాశాన్ని అందుకుని నాగుప్పెట్లో బంధించనా?

ఇవన్నీ స్వేచ్ఛగా ఎగురుతున్న మనస్సులో రేగుతున్న విశృంఖల ఆలోచనా తరంగాలు. గుర్రం నురగలు కక్కుతున్నది. దాని వేగం కొంచెం తగ్గింది. ఆ సంగతి నాకు కూడా తెలుస్తున్నది. అయితే నా మనస్సు నన్ను పదేపదే -'జాగ్రత్త తెలివిగా వ్యవహరించు!' అని హెచ్చరిస్తున్నది.

ఐదవ చుట్టు పూర్తికావలసి వున్నది. అమ్మనాన్నగారు కూరున్నచోటు దాటితే ఆ చుట్టుపూర్తవుతుంది. నేను ఆచోటునుండి వెళుతున్నాను. కొంచెం సేపటి క్రితం నన్ను అడ్డుకుని, గుర్రం ఎక్కకుండా ఆపిన అమ్మ ఇప్పుడు ఎంత ఆనందంగా వుందో చూడాలనిపించింది. అలా చూడాలన్న వ్యామోహాన్ని ఆపుకోలేకపోయాను. ఆచోటనుండి గుర్రం దాటుతుండగానే నేను తిరిగి ఆ వైపు చూసాను.

వ్యామోహంతో నిండిన ఆక్షణంలో బహుశా నాపట్టుకొంచెం సడలిందో ఏమిటో తెలుసుకునే లోపలే, అప్పటి వరకూకోపంతో బుసలుకొడుతున్న ఆ జంతువు నన్ను గాలిలోకి విసరివేసింది. ఒక్క ఊపులో ఆ మూగ జంతువు తన

ప్రతీకార మంతా తీర్చుకున్నట్లుంది.

గాలిలోనే నాకు రకరకాల కరుణ, కర్కశ స్వరాలు వినిపించాయి. అయితే అవన్ని కేవలం ఒక్క క్షణమే, అయితే తరువాతి క్షణంలో నేనేదో చీకటి సముద్రంలో మునిగిపోతూ వున్నాను.

ఆ భయంకరమైన చీకటి సముద్రం నుండి బయటకు వస్తే నాకొక చిరు కాంతి కిరణం కనిపించసాగింది. నేనెక్కడున్నానో నాకర్థం కావటంలేదు. నాగలోకంలోని ఏదైనా గుహలో చేరుకున్నానా? అయితే ఈ వెలుగు కిరణమెక్కడిది? పడగవిప్పిన ఏదైనా పాము తలమీద మణివెలుగు కాదుగదా?

బహుశా నేను నా భవనంలోని నాపడకమీదే పడివున్నట్లునిపించింది. కళ్ళు నిద్రతో బరువెక్కి తెరవలేకపోతున్నాను. తెరవాలనికూడా అనిపించటంలేదు. నాన్న గారి భవనం నుండి ప్రభాతభేరులు వినిపించటంలేదు. బహుశా ఇంకా తెల్లవారి నట్లు లేదు. ఈరోజు ఉత్సవం ఆఖరురోజు. మదించిన గుర్రంమీద ఎవరు స్వారీ చేస్తారో చూడాలి........

ఒక్కసారిగా నాకు స్మృతి కలిగినట్లయ్యింది. దానితోనే నాతల, నాశరీరంలోని ప్రతిభాగమూ విపరీతమైన బాధతో నిండిపోయాయి. గాలిలో ఎగిరిపోయే ఎండు టాకులాగా నేను ఆరోజు గుర్రం మీద నుండి విసిరివేయ బడ్డాను. కాని ఎక్కడ పడ్డాను? ఆ ప్రమాదంలో నేను వికలాంగుణ్ణికాలేదు గదా? కుడిచేతిని నుదురు మీద ఉంచుకున్నాను. అక్కడ చన్నీళ్ళతో తడిపిన గుడ్డవుంది. బహుశా నాకు జ్వరం వచ్చివుంటుంది. నాకు దగ్గరలో ఎవరూ వున్నట్లులేరు. అయితే నా నుదుటి మీద ఇంత చల్లని గుడ్డ ఎక్కడి నుండి వచ్చింది? శక్తినంతా కూడగట్టుకుని - 'అమ్మా' అంటూ పిలిచాను.

గాజుల గలగల వినిపించింది. బహుశా అమ్మే వస్తుందనుకుంటాను. కళ్ళు విప్పార్చుకుని చూడసాగాను. కాదు, అమ్మకాదు. మరి ఎవరు? ఆ దుర్ఘటనలో నాకు ప్రాణాంతకమైన గాయాలు తగిలాయా? నేనిప్పుడు ఎక్కడ వున్నాను? నా భవనం లోనా? మృత్యుద్వారంలోనా? ఏమి అర్థం కావటంలేదు. నాతలవైపు నిల బడివున్న ఆ ఆకృతిని నేను రెప్పవాల్చకుండా చూడసాగాను. మృత్యువు ఇంతటి

సుందరరూపంలో సాక్షాత్కరిస్తుందా? మరయితే ఈ ప్రపంచం మృత్యువుకు ఎందుకు భయపడుతుంది?

అంతలో 'యువరాజా!' అన్న ధ్వని వినవచ్చింది.

అది అలక గొంతు.

'ఉత్సవం పూర్తయ్యిందా?'- ప్రశ్నించాను.

'ఎప్పుడో!'

'ఎన్నిరోజులయ్యింది!'

'ఎనిమిది'.

'ఎనిమిదా?'

'అవును'.

ఆమె స్వరంలో కొద్దిపాటి కంపన. ఎనిమిదిరోజులుగా సూర్యుడు ప్రతి ఉదయం ఉదయిస్తూనే వున్నాడు. అస్తమిస్తూనే వున్నాడు. కాని నాకు మాత్రం తెలివి లేదు. ఈ ఎనిమిదిరోజులూ నేను ఎక్కడ వున్నాను? ఏ లోకంలో వున్నాను? ఏమి చేస్తూవున్నాను? గందరగోళంలో పడిపోయాను. నాశరీరంలో, నాక్కాకుండా భిన్నమైన వేరే నేను వున్నాననే ఆలోచన వుండేది. కాని ఆ 'నేను'కు కూడా గత ఎనిమిదిరోజులలోని ఏ క్షణమూ గుర్తులేదు.

'అమ్మ ఎక్కడ?' - నేను అలకను ప్రశ్నించాను.

'మహారాణిగారు తమ భవనంలో వున్నారు. ఆరోజు నుండి ఆహారపానీయాలు మానివేసారు. నిన్న అతికష్టంమీద మిమ్మలను చూడటానికి వచ్చారు. చూస్తూ చూస్తూనే మూర్ఛపోయారు. రాజవైద్యులు ఆమెను లేవవద్దన్నారు'.

'మీ అమ్మ ఎక్కడ?'

'ఆమె మహారాణిగారి సేవలో వుంది. రాజవైద్యులు ఎనిమిదిరోజులూ కంటి మీదకునుకు వేయలేదు. ఇంతకుముందు వరకు మీనాడి చూస్తున్నారు. ఒక్క సారిగా చిన్నపిల్లలవలె గంతులు వేయసాగారు - 'అలకా! మావిద్య మా గౌర

వాన్ని కాపాడుతుందో లేదో అనే భయంతో ఎనిమిది రోజులు నిద్రకూడాలేకుండా గడిపాము. ఇక యువరాజుకు ఏ భయమూలేదు. బహుశా అర్ధరాత్రిలోగా యువరాజుకు తెలివి వస్తుంది. ఒకవేళ కొంచెం ఆలస్యమయినా తెల్లవారేసరికి ఖచ్చితంగా తెలివివస్తుంది. నువ్వు మెలుకువగా ఉండాలి. యువరాజుగారి నుదుటిపై నిరంతరం చల్లటి పట్టి వేస్తూ వుండాలి', అని నాకు చెప్పారు.

అంతలోనే అలకకు ఏదో గుర్తుకు వచ్చినట్లుంది. వెంటనే అక్కడ నుండి కదలి ఏదో తీసుకుని నా తలవైపు వచ్చి నిలబడింది.

ఇంతకముందుకంటే ఆమె నాకు స్పష్టంగా కనిపించసాగింది. నా ఎదురుగా నిలబడింది అలకేనా? కాదు ఆనాటి దుర్ఘటన తర్వాత బహుశా నేను చనిపోయి వుంటాను. స్వర్గం చేరివుంటాను. అక్కడ ఎవరో అప్సరస నాతల వద్ద నిలబడి వుంటుంది.

నా యీ కల్పనకు నాకే నవ్వు వచ్చింది.

'ఎందుకు నవ్వుతున్నారు?' - అలక అడిగింది.

'నవ్వటానికి కూడా ఏదైనా కారణం కావాలా?'

'నాకట్లానే అనిపిస్తున్నది'.

'అయితే పూలెందుకు నవ్వుతాయో చెప్పు'.

'పూలెందుకు నవ్వుతాయి?' అలకతనలోతాను ప్రశ్నించుకోసాగింది. అక్కడ ఇద్దరు అలకలు నిలబడి వున్నట్లు, ఒకరు మరొకరిని ప్రశ్నించుతున్నట్లువుంది. ఆ ఆలోచనలలో సతమతమవుతూ, వున్నట్లుండి అలకే ముందు నవ్వింది. వెంటనే సిగ్గు పడింది. సిగ్గుతోనిండిన ఆ మూర్తి మరింత సమ్మోహనంగా కనిపించింది. అలక క్షణ క్షణమూ మరింత అందంగా కనిపించసాగింది.

'నేను చెప్పనా?' - నవ్వుతూ అడిగాను.

'చెప్పండి'.

'స్త్రీలు సిగ్గుపడతారు. వారిని చూసి పువ్వులు నవ్వుతాయి'.

'నవ్వనివ్వండి'.

అలక పలికన తీరు నాకెంతో నచ్చింది. నేను రోగినని, మంచంమీద పడి వున్నానని, గత ఎనిమిదిరోజులుగా స్పృహలోలేనన్న సంగతి మరచిపోయాను. రెప్ప వాల్చకుండా ఆమెను చూస్తూ వుండిపోయాను. ఆమె వులిక్కిపడింది.

'నేనెంత పిచ్చిదాన్ని? నుదిటి మీద పట్టివేయటానికి మందు తీసుకువచ్చి, మాటలు చెపుతున్నాను. కళ్ళు మూసుకోండి'.

'ఎందుకు?'

'ఈ మందు విషపూరితమైనది. ఈ మందు కొంచెంకూడా కళ్ళల్లో పడకూడ దని రాజవైద్యులు నాకు మరీమరీ హెచ్చరికగా చెప్పారు'.

'మరి నాకన్నులు మూసుకోవటానికి ఒప్పకోవటంలేదే?'

'ఎందుకని?'

'ఎందుకు?' రెప్పవాల్చకుండా ఆమెను చూడటమే నా మనస్సుకు చాలా బాగుందని అలకకు ఎలా చెప్పను? ఈ విషయం తనకు నచ్చుతుంది. కలిక నన్ను తన ఒడిలో ఆడించి పెంచింది. నాన్నగారు కూడా కలికను ఎంతో ఆదరి స్తారు. అమ్మైతే ఆమెతో ఎంతో ఆత్మీయంగా వ్యవహరిస్తుంది. యయూ విషయంలో తనకంటే కలికే ఎక్కువ బాధపడుతుందని అప్పుడప్పుడు అమ్మ చెపుతూ వుంటుంది. అటువంటి కలిక కూతురితో .........

'చూడండి, మీరిప్పుడు కళ్ళు మూసుకోకపోతే నేను మీతో పచ్చికోట్టేస్తాను తెలిసిందా?'

తియ్యటి అలకమాటలు గడిచిపోయిన నా బాల్యాన్ని తిరిగి తెస్తున్నట్లని పించాయి. సముద్రంలో కలసిన నదినీరు మరల వేరుపడినట్లుంది.

నేను నిశ్శబ్దంగా కళ్ళుమూసుకున్నాను. అలకనుదుటి పై వున్న పట్టీమీద మెల్లగా ఒక్కొక్క చుక్క మందువేస్తున్నది. బహుశా అప్పుడప్పుడు తెరిచిన

కన్నుల కంటే మూసిన కన్నులే ఎక్కువ చూస్తాయనుకుంటాను. నాతో పచ్చీకొట్టే చిన్ననాటి నుండి ఇప్పుడు నాతలవైపు నిలబడి మందు వేస్తున్నప్పటి వరకు, అలకకు సంబంధించిన అనేక చిత్రాలు నా కళ్ళ ముందు మెదలసాగాయి. మొగ్గ రూపమొక్కటే. అయితే అది వికసించేటపుడు అనేకమైన మనోహర రూపాలను ధరిస్తూ వుంటుంది. నాకన్నుల ముందు కదలుతున్న అలక ప్రతిచిత్రం ఎంతో విలక్షణంగానూ, సమ్మోహనంగానూ వుంది.

అలక తనతల్లితోపాటు రాజభవనంలోనే ఉంటున్నది. అందుచేత బాల్యం నుండి అలకలో చోటు చేసుకున్న మార్పులన్నీ, నాకు అవగతమే. అయితే ఆమెపట్ల నా మనస్సులో ఈరోజున కలిగిన భావాలు ఇంతకుముందెప్పుడూ కలగ లేదు. ఇలా ఎందుకు జరుగుతున్నది? నేను ఆలోచించ సాగాను. ఆరేళ్ళ వయస్సు వరకు అలక నా స్నేహితురాలు. తరువాత మెల్లమెల్లగా మేము విడిపోయాము. నేను రాజపుత్రుణ్ణి. రాజభవనంలో, నగరంలో, రాజపథలో, ఉత్సవాలు మొదలగు వాటిలో ఎంతో అట్టహాసంగా తిరుగుతూ వుండేవాణ్ణి. ఆమె ఒకదాసి కూతురు. ఆమె వెనుకవుండిపోతూ వచ్చింది. రాజభవనంలో తనతల్లి పనులలో కొంచెం కొంచెం సాయపడుతూ వుండేది. నేను భవిష్యత్తులో రాజు కావలసిన వాణ్ణి. విశ్వవిజేతను కావలసివుంది. ఆమె దాసి అవుతుంది. ఎప్పుడూ ఎవరో ఒకరి సేవలో జీవితం గడపవలసి వుంది. అందుచేత మేము ఒకరికొకరికి దూరమయ్యాము.

ఏదో స్వర్గీయ సురభిళపరిమళం నన్ను మదోన్మత్తుణ్ణి చేసింది. నాకళ్ళు మూసేవున్నాయి. కుడిచేతిని మెల్లగా పైకెత్తుతూ చూసాను. అలక వంగి నా నుదుటి పై మందుచుక్కలు వేస్తున్నది. ఆమె ముంగురులు అప్రయత్నంగా నా బుగ్గలను తాకుతున్నాయి. ఆ ముంగురులు నాచేతిని తాకాయి. వాటికోమలమైన స్పర్శతో నాశరీరం యావత్తూ పులకించిపోయింది. నేను కళ్ళు తెరిస్తే అలక దూరమవు తుందన్న ఆలోచనలో నేను మూసుకునే నవ్వుతూ అడిగాను -

'అలకా, నా ముక్కుకు చాలాకోపంగా వుంది'

'ఎవరి మీద?'

'కళ్ళ మీద'.

'ఎవరి కళ్ళ మీద?'

'నా కళ్ళ మీద'.

'ఎందుకని?'

'ఇంతటి అద్భుతమైన సువాసన ఎక్కడి నుండి వస్తుందో తనకు తెలియటం లేదని'

'నేను ఆ ముక్కును కొంచెం అడగాలి'

'అయితే అడుగు'.

'భగవంతుని పట్ల దానికి విశ్వాసముందా?'

'నాముక్కేమీ నాస్తికంకాదు!'

'గుడిలోని దేవుడు పాషాణమూర్తిగా వుండడాన్ని ముక్కు అంగీకరిస్తుందా?'

'అవును'

'మరి ఎందుకు ఆ దేవుడి విగ్రహం ముందు తననుతాను అరగదీసు కుంటుంది? ఆ విగ్రహంలో భగవంతుడు కనిపిస్తున్నాడా?'

'కనిపించకపోయినా! ఆయన అక్కడే వుంటాడు గదా?'

'అట్లాగే, మీముక్కుకు సువాసనలు అందించే ఆ సుగంధం పరిస్థితి కూడా అంతే!'

అలక మాట్లాడే విధానం నాకెంతో మనోరంజకంగా వుంది. తిరిగి ఇద్దరం బాల్యంలోకి తిరిగివెళ్ళి ఆటలాడుకున్నట్లుంది. చిన్నతనంలోలా మాట్లాడుకుంటూ, ఆడుకున్న దానికంటే ఈ సురభీళ సుగంధంలో పీకలదాకా మునగాలనే ప్రబలమైన ఆకాంక్ష నాలో కలుగసాగింది.

'ఈ సుగంధం ఎవరిది?' - అలకను ప్రశ్నించాను.

'సన్నజాజులది - ఈ పూలంటే మీరు బాల్యంలో చాలా ఇష్టపడేవారు'.

అలక నిజమే చెప్పింది. అయితే మధ్యకాలంలో, ధనుష్టంకారాలలో, గుఱ్ఱపు డెక్కల చప్పుడులో ఈ సన్నజాజుల సురభీళ పరిమళం ఎక్కడికోపోయింది.

'అలకా! ఆ పూలను నాముక్కు దగ్గరకు తీసుకురా! నేనువాటిని క్షమించుమని అడగాలి'.

'ఆగండి, మాలతీసి ఇస్తాను'.

'మాలా?'

'అవును. తలలో పెట్టుకున్నాను'.

'అయితే వాటిని అక్కడే వుండనీ'.

'ఎందుకని?'

'నీవాపూలను జడనుండి వేరుచేస్తే అవి నామీద కోపం తెచ్చుకుంటాయి'.

'మీరు భలేవారే?'

'వాటిని అక్కడే వుండి నన్ను వాసన చూడనివ్వు'. అలక మాట్లాడలేదు.

'నేనా పూల వాసన చూడటానికి నువ్వు జడను నాకివ్వకపోతే, నేను అరుస్తాను. అందరూ మేల్కొంటారు......'

బహుశా నా నుదుటి పట్టిమీద వేయవలసిన మందు చుక్కలు అయిపోయినట్లున్నాయి. తనచేతిని నా పెదవుల కావించి - 'వద్దు వద్దు - మీరేమి అరవవద్దు. ఎనిమిదిరోజులయ్యింది, రాజభవనంలో ఎవరికీ ప్రాణాలు కుదురుగాలేవు. మీకేమీ ప్రమాదం లేదని చెప్పిన తర్వాతే, ఈరోజు అందరూ నిదురపోగలిగారు. రాజ వైద్యులు కూడా ప్రక్కనేవున్న భవనంలో నిద్రపోతున్నారు. మీరరిస్తే అందరూ పరుగుపెట్టి వచ్చేస్తారు. అమ్మయితే - 'సేవకూడా నీకు సరిగా చేయటం రాదా!' అని నన్ను కేకలు వేస్తుంది. ఇక నన్ను శూలానికి వేలాడదీస్తారు'.

'అంతకంటే వాసన చూడటానికి జడను ఇవ్వటమే మంచిదికదూ! చూడు మంచిపనులు చేయటంలో ఎప్పుడూ ఆలస్యం చెయ్యకూడదని పెద్దలు ఎప్పుడో

చెప్పారు కదా! నేను ఐదు వరకు అంకెలు లెక్కపెడతాను. ఒకటి - రెండు - మూడు - నా నా....'

బహుశా నందనోద్యానంలోని పూవులన్నీ తమ సువాసనలను ఈ సన్నజాజి పూలికిచ్చాయేమో!.

అలకజడలోని ఆ సన్నజాజులమాల వాసన చూస్తూ చూస్తూ నాకేదో మత్తు ఆవరించినట్లయ్యింది. ఆపూలతోపాటు నా చెంపలను తాకుతున్న ఆమె ముంగరుల స్పర్శ ఎంతో సుఖంగానూ, ఉన్మాదాన్ని కలిగించేదిగానూ వుంది.

ఆ సంగతి గ్రహించిన అలక నానుండి దూరంగా జరిగే ప్రయత్నంలో వుండ గానే నేను, విచక్షణాజ్ఞానాన్ని కోల్పోయాను. ఆ సువాసన నా మనస్సును తృప్తి పరచలేకపోతున్నది. అణువణువులో ఆ కోరిక ప్రబలం కాసాగింది.

నేను కనులు తెరిచాను. ఆమె దూరంగా జరగసాగింది. నేను వెంటనే ఆమె జడలోని ఆపూలమాలను గుంజుకుని, రెండు చేతులతో ఆపూలను నలిపి పిసరు పిసరుగా చేసి నా ముక్కుదగ్గర పెట్టుకున్నాను.

'యువరాజా, ఏమిటిది?' - అలక గొంతు వణికింది.

'అలకా! తనివి తీరటంలేదు. ఇంకా..... ఇంకా సువాసనలు కావాలి'. అప్రయత్నంగా నాచేతులు ఆమెను చుట్టుకున్నాయి. మరుక్షణంలో ఆమె పెదవులు నా పెదవులకు అతుక్కుపోయాయి. ఆ పెదవులలో మధురాతిమధురమైన అమృతం దాగి వుంది. నిప్పులు చిమ్మేమండుటెండలో ఎడారిలో నడిచే ప్రయాణీకునిలా నా పెదవులు ఎండిపోయాయి. మనస్సు-శరీరము దప్పికతో అలమటిస్తున్నాయి. ఆ అమృతాన్ని పానంచేస్తున్నాను - పానంచేస్తూనేవున్నాను. ఇంకా - ఇంకా - ఇంకా అన్న చిరుసవ్వడే పెదవుల నుండి వెలువడుతున్నట్లుంది. నేనేదో సుఖాల కొలనులో ఈదులాడుతున్నట్లు, ఆకొలను పెద్దలోతులేనట్లు మాత్రమే నాకు తెలుస్తున్నది.

'యువరాజా! ఏదో జరుగుతున్నట్లున్నదేమిటి?' ఆ కొలనులోనుండి ఎవరో ప్రశ్నించారు.

ప్రశ్నించినదెవరు? ఎవరో మత్స్యకన్యా? నేను కనులు విప్పార్చుకుని చూడ సాగాను. ఆమె అలకే. నామంచానికి దూరంగా నిలబడివుంది. కాని నా పెదవుల దాహం ఇంకాతీరలేదు. మనస్సు తృప్తిచెందలేదు. శరీరంలోని ప్రతి అణువు కణకణ లాడుతుంది. నేనిప్పటి వరకు చేసిన అమృతపానమే, ఇప్పుడు హాలాహలంలా జ్వలిస్తున్నది. ఆ దాహం శాంతించాలంటే నాకు మరింతగా అమృతంకావాలి.

అలకను పట్టుకోవటానికి నేను తడబడుతూ లేవసాగాను. నాకుడికాలులో విపరీతంగా నెప్పి కలిగింది. బాణం తగిలిన పక్షిలాగా కొట్టుకుంటూ మర్మాంతకంగా అరచి నేను పక్కమీద జారిపడ్డాను.

ప్రాణాంతకమనిపించిన ఆబాధ నుండి కోలుకోవటానికి మూడు నాలుగు నెలలు పట్టింది. అయితే ఆరాత్రి నా ఆరుపుకు రాజభవనమంతా ఆనందపరవశ మయ్యింది. నాకు స్పృహవచ్చిందనీ, మృత్యువు నోటినుండి తిరిగివచ్చాననీ, అందరూ వూపిరి పీల్చుకున్నారు. ముసలి రాజవైద్యుడు పరుగులు పెట్టుకుంటూ, నా భవనానికివచ్చి, అమాయకపు బాలికలా గద్గదస్వరంలో, కన్నీరు కార్చాడు.

ఎనిమిదిరోజులు చచ్చినవాడిలా పడివున్నాను. బహూశా ఈ మూర్ఛనుండి నేను కోలుకుంటానని అమ్మ అనుకోలేదేమో! నగరంలోని దేవతలందరికీ మొక్క కున్నట్లుంది. నేను పూర్తిగా లేచి తిరగకముందే పెద్ద ఎత్తున ఎంతో అట్టహాసంతో ఆ మొక్కులన్నీ తీర్చివేసింది.

నాజ్వరం త్వరగానే తగ్గిపోయింది. కాలి ఎముకకు దెబ్బతగిలింది. ఆది కొంచెం ఎక్కువ ఇబ్బందే పెట్టింది. అయితే రాజవైద్యుడు ఆర్యావర్తపు తూర్పు భాగం నుండి ఎముకలు అతికే నిపుణుణ్ణి తీసుకు వచ్చాడు. అతను బొత్తిగా ఆటవికుడైనప్పటికీ, తనకళలో నిష్ణాతుడు. అతనిని తీసుకు రావటానికి కొద్దిగా శ్రమపడవలసి వచ్చింది. అతను ఎముకను బాగా అతికించాడు. కాలిలో ఏవిధమైన బాధలేకుండా పోయింది. అయితే ఈ మూడు - నాలగు నెలలు విచిత్రమైన స్థితిని అనుభవించాను. రాజభవనపు కిటకీగుండా ఆకాశంలో ఎగిరే పక్షులను చూసి, నా ఆవిటితనం గురించి ఆలోచిస్తూవుండేవాణ్ణి. ఆ పక్షుల లాగానే నన్ను కిటకీనుండి బయటకు విసిరివేస్తే ఎలా వుంటుంది? ఏదయితే ఆదే అవుతుంది. గుర్రపు సకిలింపు వింటూ వుంటే భుజాలు అదురుతూ వుండేవి. నా అవిటితనం మీద

నాకే విపరీతమైన కోపం కలుగుతూ వుండేది. అయితే ఆ కోపాన్ని ఎవరిమీద చూపించాలి? నాలోనేనే చిరాకుపడుతూ నాశరీరాన్ని చూసుకుంటూ వుండిపోయేవాణ్ణి. గత పది సంవత్సరాలుగా నేను ఏ శరీరాన్నయితే అందంగా దృఢంగా తీర్చిదిద్దటానికి పగలు రాత్రి శ్రమించానో, ఆశరీరమే నన్ను మోసం చేసిందా! లేదు! మనిషి తన శరీరాన్ని ప్రేమిస్తాడు. దానికి అంతం వుండదు. అయితే ఈ వెధవ శరీరమే మనిషిని అంతగా ప్రేమించదు. అవకాశం వస్తే శత్రువుగా మారిపోతుంది.

ఈ శరీరం ఎవరికి శత్రువవుతుంది? ఎందుకవుతుంది? ఈ ప్రశ్నలకు సమధానం తెలుసుకోవటానికి మంచంమీద పడివుండాలని విశ్వప్రయత్నం చేసాను. కాని లాభం లేకపోయింది. ఈ శరీరంలో వేరుగా మరో యయాతి వున్నాడని నేనె ప్పుడూ అనుకుంటూ వుంటాను. కాని ఎలా గుర్తించాలి? ఆలోచించి ఆలోచించి ఓడిపోతుంటాను. మనస్సు, బుద్ధి, అంతఃకరణ శరీరపు అవయవాలు కావని నాకు బాగా తెలుసు, వాటికి వేరుగా తమదైన స్వతంత్రమైన అస్తిత్వంవుంది. అయితే నా శరీరం నాకు విరోధిగా మారినపుడు ఇవన్నీ ఏమి చేస్తున్నాయి? ఎనిమిదిరోజులుగా స్పృహలేదు. అప్పుడు మందులేకాదు, రాజవైద్యుడు విషమిచ్చినా మందులాగానే మెదలకుండా తాగి వుండేవాణ్ణి. ఆ మూర్ఛలో నా యీ మనస్సు ఎక్కడ వున్నది? నా బుద్ధి ఎక్కడకు వెళ్ళిపోయింది? నా అంతఃకరణకేమయ్యింది? చీకటి! అంతా కేవలం చీకటే!!

మెల్లగా జారుకుంటూ నా కాళ్ళుచేతులను చూసుకోసాగాను. పెదవులు మెల్లగా గొణగసాగాయి. నువ్వు పిచ్చివాడివి. ఈ శరీరం నీతో ఎల్లప్పుడూ శత్రుత్వమే వహించిందా? ఆ రాత్రి అలక అధరాల అమృతపానం చేయించిం దెవరు? మేముకాదా?

ఆ రాత్రి, జీవితపు మధురమైన, శాశ్వతమైన స్వప్నంగా మిగిలిపోయింది. ఆ స్వప్నం గుర్తుకు వచ్చినంతమాత్రానే, నేను నా బాధలన్నిటినీ, కొంతకాలపు ఈ అవిటితనాన్ని మర్చిపోతున్నాను. బయట ఎంతవేడిగా వున్నా, ఆ రాత్రి గుర్తుకు రాగానే మొత్తం చల్లగా మారిపోతుంది. చేతిలో హారతి పళ్ళెం పట్టుకుని నిలబడిన రమణిలాగ ఆరాత్రి నా కనుల ముందు నిలుస్తుంది. సన్నజాజిపూవుల ఆ మనోహర సుగంధం, అలక శిరోజాల ఆ కోమల స్పర్శ, ఆమె అధరాల ఆ

మధురామృతం - పీటన్నిటి మధురస్మృతులతో నా అణువణువు పులకించి పోతున్నది.

మంచానపడిన మూడు నాలుగు నెలల్లో నా కన్నీటి కన్నా ఎక్కువ సుఖ మిచ్చింది ఆ రాత్రి జ్ఞాపకమే. కాని ఆరాత్రి సుఖాన్ని మరొక్కసారి పొందుదామని కోరిక కలిగి నప్పటికీ, మరలా అటువంటి అవకాశమే లభించలేదు. అలక నాకు సేవ చేయటానికి చాలా సార్లు వచ్చింది. అయితే పగలుమాత్రమే. రాత్రి పూట మరలా ఆమె ఎప్పుడూరాలేదు. రాత్రిపూట వేరువేరుగా చాలామంది దాసీలు నాకు సేవలు చేస్తుండేవారు. వారిలో చాలామంది యువతులే. కాని నేను కోరుకునేది కేవలం అలకను మాత్రమే. సన్నజాజులమాలను అందించి - నేను మీతో పచ్చీకొట్టేస్తాను - అంటూ పట్టీమీద మందువేసే అలక, యువరాజా! ఇదే మీటి? అంటూ కొంచెం కోపం, కొంచెం ఆనందంతో ఆ రాత్రి నన్నడిగిన నా చిన్న నాటి స్నేహితురాలు అలకనే నేను కోరుకుంటున్నది. పగటిపూట నాచుట్టు పక్కల ఆమె తిరుగుతూ వుంటే, ఏళ్ళుతరబడి ఆకలి దప్పులతో వున్నవాడిలాగా, ఆమె ప్రతి కదలికను నా కళ్ళలో నింపుకోసాగాను. మిగిలిన ఏ దాసీపట్లా నాకంత ఆకర్షణ కలగలేదు.

మధురమైన అలక జ్ఞాపకాలతోపాటు ఆరోజులలో ఒక దివ్యమైన స్వప్నం కూడా నాకు మిక్కిలి సుఖాన్ని కలిగిస్తూ వుండేది. ఎముకలు అతకటానికి తీసుకు రాబడిన ఆ అడవిమనిషి తగినంత అనుభవజ్ఞుడు. అతను ఆర్యావర్తం యావత్తూ తిరిగి చూసి వచ్చినవాడు. రకరకాల గుహలు, అరణ్యాలు, నగరాలు, సముద్రాలు, కొండలు, గుడులు, ప్రజలను అతను ఎంతో రసవత్తరంగా వర్ణించగలడు, అతను చెప్పిన మాటలు విని నేను మనస్సులోనే ఒక సుందర స్వప్నాన్ని చిత్రించు కున్నాను. నేను అశ్వమేథపు అశ్వాన్ని తీసుకుని బయలుదేరాను. ఎన్నో అందమైన, భయంకరమైన ప్రదేశాలను చూస్తూ వెళుతున్నాను, ప్రకృతిలోని సప్తవర్ణాల సౌందర్యాలను ఆస్వాదిస్తూ, కొత్తకొత్త ప్రదేశాలను పాదాక్రాంతం చేసుకుంటున్నాను. ఇదే నేను చిత్రించుకున్న ఆ స్వప్నం. ఆ స్వప్నపు అంతిమ దృశ్యం ఈ విధంగా వుంటుంది - దిగ్దిగంతాలను జయించి నేను హస్తినాపురం తిరిగివస్తాను, నాకు వీరోచిత స్వాగతమిస్తూ హారతి పెట్టటానికి నిలబడిన దాసీలలో అందరికంటే అలక ముందు నిలబడి నాకు నివాళిపడుతున్నది!

నేను పూర్తిగా ఆరోగ్యవంతుడయిన తర్వాత, వృద్ధ అమాత్యునికి, మిగిలిన గురుజనులకు నా స్వప్నవృత్తాంతం వినిపించాను. వారికది నచ్చింది. అమ్మ ఎంతగా అడ్డుపెట్టినప్పటికీ నాన్నగారు నగరదేవతలకు సంబంధించిన ఒక ఉత్సవంలో అశ్వమేధాన్ని గురించి ప్రకటనచేసారు.

# అధ్యాయం 4

ఆరోజులు నాకింకా గుర్తే. పరాక్రమవంతులైన వీరపురుషుల విగ్రహాల్లా అవి నేడు కూడా నా కనుల ముందర మెదలుతున్నాయి. తమ ప్రత్యేక పదవిన్యాసాల మత్తెక్కించే విలాసినుల మాదిరిగా ఆ రాత్రుల స్మృతులు నా మనస్సును ఆహ్లాద పరస్తున్నాయి.

సుమారు సంవత్సరంన్నర కాలం నేను అశ్వమేథపు గుర్రం వెనుక తిరిగాను. ప్రతి అడుగులో ఈ ప్రాచీనమైన పవిత్రభూమి సౌందర్యాన్ని చూస్తూవచ్చాను. పంచమహాభూతాల తాళంమీద పాడబడే, దేశపు అసంఖ్యాక మధురగీతాలను చెవుల నుండి హృదయానికి అందిస్తూ వచ్చాను. దాని నిత్యనూతన నృత్యాన్ని కనులలో నింపుకుంటూ వస్తున్నాను. యాగాశ్వం తూర్పు పడమర, ఉత్తరం, దక్షిణం - నాలుగు దిక్కులు వరసగా పయనిస్తున్నది. ప్రతి ఒక భాగంలో భూమి ఎంతో అందంగా వుంది. ప్రతి ఋతువులో అది ఒక నూతన వస్త్రాన్నంది స్తున్నది. రకరకాల ఆభరణాలతో తన్ను తాను అలంకరించుకుంటున్నది. ఈ లోకమాత సజీవమై నాముందు నిలబడిందా అనిపిస్తుంది ఒక్కసారి. ఈ నదులు ఆమె క్షీరధారలు, పర్వతాలు అమె స్తనాలు, ఆ స్తనాలనుండి ప్రవహించే ధారలో ఆమె తన లక్షలాది మంది పిల్లలను పోషిస్తున్నది ఈ కల్పనతో అణువణువు పులకితమవుతోంది.

అప్పుడప్పుడు ఎప్పుడో రాత్రిపూట అమ్మ గుర్తుకు వస్తుండేది. ఆమె కిచ్చిన మాటకూడా జ్ఞప్తికి వస్తూవుండేది. లేదు, నేనెటువంటి పరిస్థితులలోనూ సన్యాసిని కాను - నేను అమ్మకు చేసిన ఆ వాగ్దానాన్ని అక్షరశః నిజంచేసి చూపించాను. విరక్తుడైన ప్రపంచం నుండి ముఖం తిప్పుకుపోకుండా, ప్రపంచానికి ఎదురొడ్డి

నిలబడటానికి నేను బయలుదేరాను. నేను ప్రపంచాన్ని వదలి అడవులలోనికి పారి పోయేవాణ్ణికాదు. ప్రపంచాన్ని జయించి పాదాక్రాంతం చేసుకునేవాణ్ణి.

మా గుర్రాన్ని చాలా కొద్దిరాజ్యాల్లో అడ్డగించారు. నాన్నగారు తన పరాక్రమంతో ఆర్యావర్తం మొత్తంలో తన అధికారాన్ని చాటివున్నారు. స్వయంగా దేవేంద్రుణ్ణి పరాభవించిన నహుష మహారాజు యాగాశ్వాన్ని ఎవరు ఆపగలరు? అజ్ఞానంతో యాగాశ్వాన్ని అడ్డుకున్నవారిని నేను నా పరాక్రమంతో మట్టికరిపించి తండ్రి నహుషునికి యయాతి ఏవిధంగానూ తీసిపోడని నిరూపించాను.

ఈ చిన్నచిన్న సంఘర్షణలు నాకెంతో ఆనందాన్ని, ఉత్తేజాన్ని కలిగించేవి. వేటలో నేను నిపుణుడనే కదా! ఎటువంటి అడివి మృగాన్నయినా నేను ఎంతో తేలికగా వేటాడేవాడిని. కాని శస్త్రాస్త్రాలతో ఎదురు నిలిచిన శత్రువులను ఓడించటంలో విశేషమైన ఆనందం వుంటుంది. అటువంటి సమయాలలో వీరులలో నిజమైన ఉత్సాహం పొందిన విజయం ఉత్తేజకరంగానూ, ఉన్మాదకరంగానూవుంటుంది.

ఆ ఉన్మాదంకోసమే ఆరాటపడుతూ ఉండేవాణ్ణి. ఆ ఉన్మాదపు మాధుర్యాన్ని చవిచూసిన కారణంగానే, ఆరోజు నగర దేవత ఉత్సవంలో నా ప్రాణాన్ని ప్రమాదంలో పడవేశాను. అయితే అది ఒక జంతువు మీద సాధించిన విజయమే కదా.

యాగాశ్వం వెంట ప్రయాణం చేస్తున్నప్పుడు పెద్దపెద్ద రాజులు, మహారాజులు శస్త్ర సమర్పణచేసి నా పాదాలను మ్రోలవాలుతూ ఉంటే, మీసాలు మెలి పట్టి వీరత్వాన్ని ప్రదర్శించే గర్వాంధులైన శూరులు ఓటమినంగీకరించి నాకు లొంగిపోతూవుంటే - నాకు ఆనందపు శిఖరాగ్రాలు అధిరోహించినట్లు ఉండేది. బాల్యంలో పూలతో నిండిన పారిజాత వృక్షాన్ని బలంగా ఊపి ఆ పూలు జలజలా నేల రాలుతూ వుంటే అంతులేని ఆనందాన్ని పొందుతూ ఉండేవాణ్ణి. అదే విధంగా ఆకాశమనే వృక్షాన్ని ఊపి నక్షత్రాల్ని రాల్చి భూదేవిని అలంకరించాలనే కోరిక కలుగుతూ ఉంది. అయితే నా ఆలోచనలకు నాకే నవ్వు వచ్చి నేనేమి పిచ్చివాడినా! అనిపిస్తూ ఉండేది. ఆకాశంలో తళతళ మెరిసే తారకలను అర్ధరాత్రి నిర్నిమేష దృష్టితో చూస్తూ ఉంటే కలిగే ఆనందం వాటిని నాశనంచేస్తే ఎలా కలుగుతుంది?

ఈయాత్రలో చాలా రాత్రులు నాకు నిద్రపట్టేదికాదు. అయితే అమ్మమీద బెంగతోనో, మరే కారణంతోనోకాదు. ఏదో తెలియని మనోవేదనతో నిదురపారి పోతున్నది. శరీరం అలసిసొలసిపోతుండేది. జవనాశ్వం అలసిపోయిన తన తోటి అశ్వాన్ని పట్టించుకోకుండా ఉత్సాహంతో రథాన్ని ముందుకు తీసుకువెళ్ళి నట్లు నా మనస్సు అలసిన నా శరీరస్థితిని పట్టించుకోకుండా ఎక్కడెక్కడికో స్వేచ్ఛా యానం చేస్తూ ఉండేది. జననం, మరణం, ప్రణయం, ధర్మం మొదలైన చిక్కు ప్రశ్నల చక్రవ్యూహంలోకి చొచ్చుకుపోతుండేది. అక్కడ నుండిబయటపడేందుకు ప్రాణాంతకమౌతుండేది. మృత్యువు యొక్క వాస్తవ స్వరూపాన్ని తెలుసుకోవాలనే కోరిక కలిగి వున్న నచికేతుని కథ అవాస్తవికంగా తోస్తూవుండేది. నా శరీరపు ప్రతి అణువునుండి 'నేను జీవించాలి'. అన్న ఆకాంక్ష వ్యక్తమౌతూ వుండేది. అయితే నా మనస్సు నన్నిలా పరిహసిస్తూ వుండేది.

'అయితే ఎందుకిలా యాగాశ్వం వెంటపరుగులు తీస్తున్నావు? ఎవరైనా ఈ అశ్వాన్ని అడ్డుకొని, యుద్ధం జరిగి బహుశా నీవు వీరస్వర్గాన్ని పొందుతావేమో? జీవించాలని కోరిక గలవాడివి, మృత్యువు కరాళ నృత్యం చేసే ఈ సంగర రంగ భూమిలో ఎందుకు అడుగుపెట్టావు?'

మనస్సులో చెలరేగే ఈ అంతర్మథనాన్ని ఆపడం నాకసంభవమయ్యేది. పూలశయ్యకూడ కంటకామృతంగాతోచేది. నేను లేచి బయటకు వచ్చి నక్షత్రాల వైపు చూస్తూ గిలిగింతలు పెడుతూ పారిపోయే చల్లని గాలితో మాట్లాడుతూ వుండే వాడిని. ఇంతలో దగ్గరలోని మామిడి తోపులోని చెట్లు గుసగుసలు పోతూ వుండేవి. నేను ఇవన్నీ వింటూ కూర్చొనేవాడిని. సమీపంలోని జలాశయం నుండి చక్రవాకపు జంట కరుణార్ద్రమైన ఆక్రందనలు వినిపిస్తూవుండేవి. ఆవేదనాభరితమైన సంగీతం నా మనస్సులోకి చొచ్చుకుపోతుండేది. అకస్మాత్తుగా ఏదో ఒక నక్షత్రం రాలిపడుతూ వుండేది. మెల్లమెల్లగా నా నాలుగు వైపులా శాంతి - సామ్రాజ్యం విస్తరించుకుంటూ వుండేది. నా నివాసం దగ్గరే పెద్ద సైనికశిబిరం వుండేది. అయినా మధ్యరాత్రి రెండవ జాము తరువాత గుర్రం సకిలింపులు కూడా వినిపించనంతటి ప్రశాంత వాతావరణం ఏర్పడుతూ వుండేది. పక్షి గూళ్ళలో కూడా నిశ్శబ్దమే ఆవరించుకుంటూ వుండేది. ప్రాణికోటి యావత్తూ అనుభవించే ఈశాంతిని చూసి నానోటి నుండి అనాయసంగా ప్రార్థనా శబ్దాలు వినపడుతూ వుండేవి. నేను చాలా

మంద్రస్వరంతో ఆ మంత్రం ఉచ్ఛరిస్తూ వుండేవాడిని. చివరకు నేను చేతులు జోడించి క్షితిజం వైపు చూస్తూ తృప్తి నిండిన మనస్సుతో 'ఓం శాంతిః శాంతిః శాంతిః' అంటూ వుండే వాడిని. అప్పుడు నిద్రాదేవి మెత్తని దుప్పట్లు కప్పి నాకు జోల పాడుతూ వుండేది.

పగటిపూట లభించే పరాక్రమంతో కూడిన ఉన్మాదం, రాత్రిపూట లభించే శాంతి, రెండు నాకు సమానమైన ఆనందాన్ని కలిగిస్తూ వుండేవి, అయితే పరస్పర విరుద్ధాలైన ఈ రెండూ నా దగ్గర ఎలా కలిసిపోయాయో నాకే అర్థం కావటంలేదు. యాగాశ్వం వెంట నా ప్రయాణం సాగుతూనే వున్నది. కాలవృక్షం ఒక్కొక్క ఆకు రాలుస్తూ వున్నది. ఈ యాత్రలో శాంతి, ఉన్మాదాల ఎన్నో విభిన్న రూపాలను నేను చూశాను.

నృత్యంలో పూర్తిగా లీనమైన నర్తకి చెందు తొలగినపుడు ఆమె రూప సౌందర్యం ప్రేక్షకులకు కన్నుల విందు చేస్తుంది. అదే విధంగా శుద్ధ చతుర్థి నాటి వెన్నెలను నేను చాలాసార్లు పూర్తిగా అవలోకించగలిగాను. ఒక్కసారి దట్టమైన అరణ్యంలో నేను బసచేయవలసి వచ్చింది. చీకట్లు ముసురుకుంటున్నాయి. నాలుగు వైపులా మిణుగురుల మెరుపులు, అడవి జంతువుల అరువులు. అర్ధరాత్రి గడిచి పోయినా నాకు నిదురపట్టలేదు. శిబిరం నుండి బయటకు వచ్చాను. ఏదో గంధర్వ లోకంలోకి అడుగు పెట్టినట్లుంది. ఆశ్చర్యపోయాను. నాకెదురుగా ఉన్న ఎత్తైన దట్టమైన వృక్షాల చాటు నుండి వెన్నెల గలగల నవ్వుతూ దిగివస్తున్నట్లున్నది.

ఆ వెన్నెలలాగానే ఆ దావానలం కూడా నాకింకా గుర్తే. ఆరణ్యమంతా అగ్ని అంటుకున్నట్లున్నది. అయితే ఆదృశ్యం భయంకరంగానే కాకుండా చాలా భవ్యంగా కూడా వున్నది. సృష్టిదేవత యజ్ఞదేవత ప్రచండంగా వెలుగుతున్నట్లున్నది. అటు వంటి ఒక యజ్ఞకుండంలోనే పార్వతీదేవి తన భర్తమీద ప్రేమతో దూకింది. ఆమె సతీదేవి అయింది. ఆ దావానలం చూస్తూ వుంటే ఆ అమర ప్రణయగాథ నాకు గుర్తు వచ్చింది. నాకు కూడా ఒక ప్రేయసివుంటే! ఆమె అరుపులు విని నేను ఆ అగ్ని జ్వాలలోకి చొచ్చుకు వెళ్ళి ఆమెను క్షేమంగా బయటకు తీసుకువచ్చి వుండేవాడిని. ఆమెపట్ల ఆచంచలమైన నా ప్రేమను చూచి దేవతలు నాపై పూల

వర్షం కురిపించేవారు. ఎక్కడో దూరదేశంనుండి ప్రతిభావంతుడైన కవి నా దర్శనానికి వచ్చి -

'యువరాజా! నేడు నా జీవితం ధన్యమైంది. ఈ ప్రపంచంలో పుట్టినందుకు ఏది చూడాలనుకున్నానో, అది ఈ రోజు చూడగలిగాను. మహాకావ్య రచనకు అనువైన విషయవస్తువు లభించింది' అని అన్నాడు. ఎంత విచిత్రమైన ఆలోచన.

ఈ విధమైన శాంతి, ఉన్మాదాల ఎన్నో విభిన్నమైన రూపాలను చూశాను. ఎన్నని చెప్పగలను. భూమిమీద పరుచుకున్న పచ్చదనాలను, ఆకాశాన్ని చూస్తున్నట్లుండే దేవదారు వృక్షాలను, పురోహితుని ఆశీర్వాద సంప్రోక్షణకు గంగాజలం వంటి వర్షపు జల్లులను, కుండపోతంగా కురిసిన ప్రచండ వర్షధారలను, అందమైన సీతాకోకచిలుకలను, గుర్రంతోపాటు మనిషిని కూడా మింగి జీర్ణించుకోడానికి వృక్షాలను చుట్టుకున్న పెద్దపెద్ద కొండ చిలువలను, ఎత్తైన దేవాలయ గోపురాలను, అందమైన వేశ్యల సుందర హర్మ్యాలను ఎత్తైన వీరుల విగ్రహాలను, గుహలలో చెక్క బడిన కమనీయ రమణీయ రూపాలను ఎన్నోన్నో చూశాను.

ఆ సందర్భంలోనే ఒకసారి గుహలో రతీదేవి బొమ్మను చూసాను, వెంట వచ్చిన సైనికులు బయట ఉండిపోయారు. ఆ శిల్పం ఎంతో అద్భుతంగా ఉంది. శివుని ఆగ్రహానికి మన్మథుడు భస్మమయినపుడు శోకిస్తున్న రతీదేవి శిల్పమది. ఆ బొమ్మవైపు ఎంతోసేపు రెప్పవాల్చకుండా చూస్తూ నేను నిల్చుండి పోయాను, ఆమె చీరచెంగు జారిపోయింది. ముడివడిన శిరోజాలు వీపున పరుచు కున్నాయి. చూస్తూ చూస్తూ అది ఒక నిర్జీవమైన శిల్పమని మరచిపోయి ఆవేశంలో దాని ముఖంపై ముద్దులు కుంపించాను. చల్లని రాతి స్పర్శతో నాలో ఆవేశం చల్లారిపోయింది. ఆయినప్పటికీ ఆ శిల్ప సుందరిని ఎన్ని లక్షలసార్లు ముద్దిడినా నాకు తనివి తీర లేదు.

పాషాణ సుందరి స్పర్శ తొలగిన తరువాత నాలో ఆలోచన కలిగింది. నేను పాపం చేశానా? వేదన కలిగిన మనస్సు తనకుతాను సర్ది చెప్పుకుంది. రతి అయితేనేమి సతి లేక దేవత కావచ్చు. ముద్దిడినంత మాత్రాన పాపం చేసినట్లా?

యాగాశ్వం తిరిగితిరిగి ఆర్యావర్తపు తూర్పుభాగం చేరింది. అది పూర్తిగా అడవులతో నిండి వున్నది. ఆ అడవి మధ్యలో ఎచ్చటో నగరం ఉన్నది. ఆ

చుట్టూ చిన్నచిన్న అటవిక రాజ్యాలున్నాయి. ఏ ఒక్కరూ యుద్ధం చేయడానికి రాలేదు.

ఏనుగులు ఈ ప్రాంతంలో చాలా ఎక్కువగా ఉన్నాయి. నేను వాటిని వేటాడాలని నిర్ణయించుకున్నాను. ఏనుగులు అడవిలోని జలాశయంలో నీరు త్రాగేందుకు రాత్రులు వస్తాయి. నేను ఒక్కడినే ఈ వేటలోని ఆనందాన్ని పొందాలనుకొని దట్టమైన అడవిలోకి వెళ్ళాను. ఒక జలాశయం దగ్గరగానున్న ఎత్తైన వృక్షం ఎక్కి కూర్చున్నాను. చుట్టూ చిక్కని చీకటి పరచుకుంది. ఎక్కడనుండో ఆగిఆగి జంతువుల ఆరుపులు పినిపిస్తున్నాయి. మధ్యమధ్యలో సన్నిపాతజ్వరంతో బాధపడే రోగి అరుపులా సింహాల గర్జనతో అడవి కంపిస్తున్నది.

అలాంటి వాతావరణంలో ఏనుగుల వేట మహానందాన్ని కలగజేస్తుంది. పంచ ప్రాణాలు చెవుల్లో ఉంచుకొని వేటకు తయారయ్యాను. ఏనుగు నీరు త్రాగేటప్పుడు 'బుడ, బుడ' శబ్దం వినిపిస్తుందని ఎవరో చెప్పగా విన్నాను. ఆ శబ్దం కోసమే ఆతృతతో ఎదురు చూశాను. ఏకాగ్రతతో ఏనుగుకై ఎదురు చూస్తు ఉండటం వలన నిముషం గంటలా సాగింది.

దూరంగా ఎచట నుండో 'బుడ, బుడ' శబ్దం పినిపించింది. నా శరీరంలో ఒక్కసారి మెరుపు మెరిసింది. శబ్దభేది విద్య తెలిసినవారే ఆ శబ్దం వినగలరు. నేను అందులో అందె వేసిన వాడిని. మెరుపువేగంతో బాణం సంధించాను. బాణం శబ్దంతో ఒక మానవ కర్కశకంఠధ్వని వినిపించింది.

'ఈ బాణం వేసిన పాపి ఎవరు? నా ఎదుటకు రా, లేదా........'

నాకు చెమటలు పట్టాయి. శరీరం వణకుతుంది. బాణం ఏనుగుకు తగలకుండా తపస్వికి తగిలింది. ఇప్పుడతను శాపమిస్తాడు. వణకుతున్న కంఠంతో చెట్టుపై నుండి అరిచాను. 'క్షమించండి, మునీంద్రా! నా వలన గొప్పతప్పు జరిగిపోయింది'.

చెట్టునుండి దిగి ఆ చీకటిలోనే ఆశబ్దం దిశగా వెళ్ళాను. జలాశయం ఒడ్డున ఒక పొద దగ్గర ఎవరో నిలబడినట్లు వెన్నెలలో అస్పష్టంగా కనిపించింది. భూతమేమో అనుకున్నా కాని ఆ ఆకారం ముఖాన్ని చూస్తూ అతని పాదాలపై వాలిపోయాను.

అతను వెంటనే వెనుకకు జరిగి నాతో అన్నాడు, 'పాపాత్ముడి స్పర్శ నాకు వద్దు'.

'నేను పాపాత్ముణ్ణి కాను, మహారాజును! మృగయావినోద తృష్ణతో ఇక్కడకు వచ్చాను. ఏనుగు నీరుత్రాగుతున్నదనే భ్రమతో బాణాన్ని విడిచాను. నేను క్షత్రియుడను. వేట నాధర్మం'.

'ఇప్పుడు ధర్మాధర్మాలు నాకు చెబుతావా? నేను నిష్ఠాగరిష్ఠుడనయిన తపస్విని. ఆజన్మబ్రహ్మచారిని. స్త్రీ అధరాల స్పర్శతో నీ అధరాలు అపవిత్రం కాలేదా? నీవు పవిత్రుడవైతే నా పాదాలు స్పర్శించు'.

అబద్ధం చెప్పడానికి నేను సాహసించలేదు. ఆరోజురాత్రి ఆ శిల్పసుందరి అధర చుంబనం గుర్తొచ్చింది. నిజంగా ఇతను త్రికాలజ్ఞుడు. అబద్ధం చెబితే వెంటనే నిజం తెలుసుకొని నన్ను భస్మం చేయగలడని భావించి శిరస్సు వంచి నిలబడ్డాను.

కర్కష కంఠంతో యోగి అన్నాడు - 'పాపి'!

స్త్రీని తాకితే పాపమా? అలా అయితే ఈ ప్రపంచంలో అందరూ పాపాత్ములేనా?

మనస్సులో రకరకాల ప్రశ్నలు తలెత్తాయి. ఏమి మాట్లాడాలో, ఏది చేయాలో తెలియక అయోమయంలో పడ్డాను.

తిరిగి యోగి అన్నాడు, 'నీలాంటి తుచ్ఛుడితో మాట్లాడేందుకు నాకు సమయం లేదు. అర్ధరాత్రి గడిచిన ఝాము - రెండు ఝాముల తరువాత కాల కృత్యాలు నెరవేర్చుకొని తపస్సులో లీనమౌతాను'.

ఆ తరువాత కమండలం నిండా నీరు నింపుకొని బయలుదేరాడు. ఆయనకు ప్రణమిల్లుతూ మెల్లగా అర్థించాను.

'మీ ఆశీర్వాదం కావాలి?'

'నిన్ను ఆశీర్వదించటానికి నేను భోళాశంకరుడిని కాను. నీ పూర్తి పరిచయం తెలుసు కోకుండా, ఎలా ఆశీర్వదిస్తాను?'

'నేనొక రాజపుత్రుడను'.

'అయితే నీవు నా ఆశీర్వాదానికి అర్హుడవుకాదు'.

'ఎందుకు అర్హుడను కాను?' నేను భయపడుతూనే ప్రశ్నించాను.

'నీవు శరీరానికి బానిసవు. అధికారం పెరిగే కొలది ఆత్మ పాపపంకిల మౌతుంది. నీవు రాజువు కాబట్టి మరింత పాపివి, సుఖభోగాలలో తేలుతూ ప్రజలను పరిపాలిస్తూంటాడు రాజు. ఇంద్రియలోలుడుగా జీవిస్తాడు. మేము ఇంద్రియ సుఖాలకు అతీతులం. వెళ్ళు, రాజకుమారా, వెళ్ళు! మా ఆశీర్వాదం కావాలంటే సంసార సుఖాలనన్నింటినీ త్యజించి మా దగ్గరకు రా'.

'కాని నేను ఏ పరిస్థితులలోను సన్యాసిగా మారనని మాటిచ్చాను'.

'ఎవరికి?'

'మా తల్లిగారికి!'

యోగి జిజ్ఞాసతో ప్రశ్నించాడు - 'ఎందుకా విధంగా మాటిచ్చావు?'

'నా అన్నగారు చిన్నప్పుడే ఐహిక విషయాలపై విరక్తి చెంది, ఎక్కడికో వెళ్ళిపోయాడు, నా తల్లి ఇప్పటికీ ఆ వేదనను మరువలేకపోతున్నది'.

'మీ అన్నగారు ఏమన్నారు?'

'బహుశ, అతను మిమ్మల్ని కలిసే వుండవచ్చు. ఆయనెక్కడ ఉంటారో తెలిస్తే మా అమ్మగారిని హస్తినాపురం నుండి తీసుకు వస్తాను..........'

'హస్తినాపురంనుండా? అయితే నీవు హస్తినాపుర రాజ కుమారుడువా?'

'ఔను!'

'నీ పేరు?'

'యయాతి'

'అన్నగారి పేరు?'

'యతి'

'యతి', అంటూ ప్రశ్నార్థకంగా ఆశ్చర్యం వెలిబుచ్చారు.

ఇప్పుడు యోగి ఆకృతి ఇంకా స్పష్టంగా కనిపిస్తున్నది. అతను తన చేతితో నా భుజాన్ని పట్టుకున్నాడు. ఆ చేయి వణుకుతున్నది.

'నాతోరా' - అంటూ ఆయన ముందుకు సాగాడు. కొద్దిదూరం వెళ్ళి వెనుకకు తిరిగి చూడగా నేను అక్కడే నిలబడటం చూసి - 'యయాతి, నీ అన్నగా ఆజ్ఞాపిస్తున్నాను. నావెనుకరా' అని మృదువుగా ఆదేశించారు.

అచ్చట నుండి యతి నివసిస్తున్న గుహ పెద్దదూరంలేదు. మార్గ మధ్యంలో నా మనస్సులో అనేక ఆలోచనలు రేకెత్తాయి. నన్ను ఇతను గుహలో బంధించడు గదా? నేను ఎంత పరాక్రమ వంతుడనైనా ఈ హఠయోగి సిద్ధుల ముందు నేనెంత? కోపం వచ్చి నన్ను జంతువుగా మార్చాడు కదా? అశ్వమేధ యాగం మధ్యలో ఆగి పోదుకదా? సైనికులకు ఎవరు నన్ను బంధించారో తెలియక హస్తినాపురం చేరు కుంటారు. తండ్రిగారు తల బాదుకుంటారు. తల్లిగారు నా అదృశ్యవార్త విని మూర్ఛ పోతుంది.

ఆశలు భయాల మధ్య నామెదడు మొద్దుబారింది. తొలిసారి యతిని చూపిన నా హృదయం పుష్పంలా వికసించాలి, కాని దానికి విరుద్ధంగా ఆయన మాటలతో ఆలోచనా సాగరంలో మునిగిపోయాను.

యతి గుహను చేరుకొని లోన ప్రవేశించాం. లోనికి అడుగు పెట్టగానే ఒక సింహం గర్జించింది. దానితో నేను నా ధనుర్బాణాలను సిద్ధం చేసుకున్నాను. ఇంతలో యతి దాని తల నిమరగా పిల్లిపిల్లలా అతనితో ఆడుకోవడం మొదలు పెట్టింది. మేము మరికొద్దిగా గుహ లోపలకు వెళ్ళగా, అచ్చట అద్భుతమైన వెలుగు ఆవరించివుంది. నలుమూలలా మణులు శిరస్సున కలిగిన సర్పాలు చుట్ట చుట్టుకుని విశ్రాంతి తీసుకుంటూ దర్శనమిచ్చాయి. కొద్దిదూరంలోనున్న ఒక శిలాసనం చూపించి 'ఇదేనా శయ్య' అని చెప్పాడు, యతి. అది చూచి నాకు దుఃఖం కలిగింది. అతను నా అన్నగారు. అతను హస్తినాపురంలో వుండి వుంటే సకల రాజభోగాలు అనుభవించవలసినవాడు. కాని ఏమి పొందాలని, ఏమి సాధించాలని ఈ కఠోర జీవితాన్ని అనుభవిస్తున్నాడు?

తన ముళ్ళ మంచం దగ్గరపడివున్న మృగచర్మాన్ని తీసి ఎగుడు దిగుడు గానున్న స్థలం పై పరచి 'కూర్చో!' అన్నాడు.

ఆయన తన ముళ్ళశయ్యపై కూర్చున్నాడు. నేను ధనుర్బాణాలు ప్రక్కన పెట్టి మృగచర్మంపై సర్దుకు కూర్చున్నాను. సింహాసనంపై కూర్చునట్లు యతి తన ఆసనంపై విశ్రాంతిగా కూర్చున్నాడు. నాకు ముళ్ళశయ్యపై కూర్చునట్లుంది. నేను ఇప్పుడు యతిని స్పష్టంగా చూడగలుతున్నాను. తలపై నల్లని జటలు, అంతే నల్లని గడ్డం పెరిగి వుంది. ముఖం మాత్రం అమాయకపు బాలుని ముఖంలా ఉంది. అయితే ఈయన మామూలు బాలుడు మాత్రంకాదు. కాలం రాకుండానే వృద్ధుడైన బాలుడు. ఆయన కళ్ళను చీకటి మూలలనుండి తీక్షణంగా చూస్తూ న్నాను. గుడ్లగూబ కళ్ళవలే ఉన్నాయి. ఆయన కేవలం అస్థిపంజరంలా ఉన్నాడు. శరీరపు రంగు రాలివాడిపోయిన ఆకుల రంగు వలే ఉంది. నేను ఆయనను మరింత పరిశీలనగా చూసాను. బహూశా చిక్కిపోయిన కారణంగా ఆయన ముక్కు, పక్షిముక్కు లాగాముందుకు పొడుచుకొచ్చినట్లుంది. ఆయననను చూస్తుంటే ఎప్పు డైనా యువకుడుగా ఉన్నాడా అనే అనుమానం కలుగుతుంది. యుద్ధంలో పాల్గొన్న ఆనందం అటుంచి కనీసం గుర్రపు స్వారీ ద్వారాపొందే సాధారణ ఆనందంకూడా ఎప్పుడూ పొంది ఉండడు. కాని అలకవంటి అందాల సుందరి అధరపాన సుఖం.......

ఈ ఆలోచన కలగాగానే నేను ఒక్కసారి ఉలిక్కిపడ్డాను. యతి నివసిస్తున్న ఈ గుహను, బక్కచిక్కిపోయిన ఆయన శరీరం చూస్తుంటే ఎంత ఘోరమైన తపస్సు చేసాడో అర్థమౌతుంది. బహూశా ఇతరుల మనస్సు ఆకట్టుకునే సిద్ధి ఈ యనకు ప్రాప్తించి ఉండవచ్చు.

ఆ గుహనూ, యతినీ చూసిన తరువాత నాలోని బాధలన్ని మూగబోయి నట్లైనాయి. లేకుంటే మొట్టమొదటిసారిగా సోదరుని చూచి నేను ఎలా కౌగిలించు కోకుండా ఉండిపోయాను? ఎందుకని ఆయనను చూచి వెక్కివెక్కి ఏడవలేక పోయాను? పట్టు పట్టి అయినా సరే ఎందుకు హస్తినాపురం తీసుకు వెళ్ళి అమ్మ పాదాల చెంతకు చేర్చలేకపోయాను? వీటిలో ఏ ఒక్కటీ ఎందుకు చేయలేక పోతున్నాను. అంతా తెలిసి ఎందుకు బొమ్మలాగ మౌనంగా కూర్చుండిపోయాను?

చివరకు ఏదో ఒకటి మాట్లాడాలి కదా అని - 'నిన్ను చూస్తే అమ్మ చాలా సంతోషిస్తుంది' అన్నాను.

'ఈ ప్రపంచంలో అన్నిటినీ మించిన ఆనందం ఒకటే ఉంది - బ్రహ్మానందం! శారీరక సుఖం - అది స్పర్శ ద్వార పొందినా, దృష్టి ద్వారా పొందినా వేదనకే దారి తీస్తుంది. శరీరమే అన్నిటి కన్నా మనిషికి శత్రువు. దానిని జయించటానికి నిరంతర ప్రయత్నం చేయడమే మనిషికి ఈ ప్రపంచంలో ఏకైక కర్తవ్యం. ఈ పండు చూడు నేను ఎప్పుడూ వీటినే తీసుకుంటాను' అంటూ యతి నా ముందు పెట్టిన పండ్ల నుండి ఒక పండు తీసు కున్నాను. ప్రసాదంగా భావించి దానిని కొంచెం కొరికి నమలసాగాను. నోరంతా వగరుగా అయ్యింది. బహుశా అది నా ముఖంలో ప్రతిబింబించి ఉండవచ్చు. అది చూచి యతి, మనిషి నోటికేంకావాలి? దానికి ఎప్పుడూ తీయని మధురఫలాలు కావాలి. అటువంటి పండ్లు దానికి తినిపిస్తే, తీయని పండ్లపట్ల కోరిక కలుగుతుంది. కోరిక మనిషిని శరీర ఆరాధకుణ్ణి చేస్తుంది. శరీరాన్ని ఆరాధించేవారిలో ఆత్మ చైతన్యం నశించిపోతుంది. ఆత్మను జాగృతం చేసే శక్తి కేవలం విరక్తిలోనే వుంటుంది. ఆ విరక్తి కోసమే నేను ఇటు వంటి చేదు ఫలాలను తింటూ వుంటాను'.

యతి ఒక పండు తీసుకొని చకచకా నమిలి తినేసాడు. చేదు కారణంగా నేను కొరికిన ఆ ముక్క నా నోటిలోనే వుండిపోయింది. గుహ బయటకు వెళ్ళే అవకాశం వుండి వుంటే ఎప్పుడో దానిని ఉమ్మేసేవాడిని.

నేనూ, యతి సొంత సోదరులం. కాని మా ఇద్దరి మధ్య భయంకరమైన లోతైన అగాధం వ్యాపించినట్లుంది. అది ఎంతలోతైనదో నేను ఇప్పుడు పూర్తిగా తెలుసుకోగలిగాను.

ఆ పండు పూర్తిగా తిన్న తరువాత యతి నెమ్మదిగా అన్నాడు - 'ప్రతి ఇంద్రియం మీద మనిషి ఈవిధంగా విజయం సాధించ గలగాలి. ఈ మార్గం స్వీకరించినప్పటి నుండి నేను నిరంతరం అదే ప్రయత్నంలో ఉన్నాను. అయితే నామీద నాకింకా నమ్మకం కలగలేదు. పచ్చగడ్డిలో పాములు కూడా దాగివుంటాయి. అదేవిధంగా విరక్తి చాటున ఆసక్తి కూడా.....'

బాల్యంలో తల్లిని వదలి రాత్రికి రాత్రి ఇల్లు వదలి ఈయన ఎందుకు పారి పోయాడో నాకిప్పటికీ అర్థంకాలేదు. కొంచెం ధైర్యం చేసి అడిగాను -

'బాల్యంలోనే నీవెందుకు ఈ మార్గాన్ని ఎంచుకున్నావు?'

'నేను ఏ ఋషి కృపతో జన్మించానో, ఆ ఋషి ఆశ్రమంలోనే నాలో ఈ విరక్తి మొదలైంది. అమ్మ నన్ను ఆయిన దర్శనానికి తీసుకు వెళ్ళింది. ఒక రాత్రి నాతో పాటు అమ్మ కుటీరంలో గాఢంగా నిద్రపోయింది. నాకెందుకో విచిత్రమైన కలలు రాసాగాయి. నేను వెంటనే లేచి బయటకు వచ్చాను. మెల్లగా అడుగులు వేసుకుంటూ దగ్గరలో ఉన్న కుటీరంలోకి వెళ్ళాను. అక్కడ ఆశ్రమంలోని బ్రహ్మచారులు తమలోతాము మాట్లాడుకుంటూ నహుష మహారాజు కుమారులు ఎప్పుడు సుఖంగా ఉండలేరని అనుకుంటున్నారు'.

నేను భయంతోకంపించి పోయాను. నా శరీరం రోమాంచితమైంది. యతి లాగానే నేను కూడ నహుష మహరాజు కుమారుడినే! ఆ బ్రహ్మచారుల భవిష్య వాణి నిజమౌతుందా! నిజమైతే! అప్రయత్నంగా అడిగాను. 'నహుష మహరాజు సంతానం సుఖంగా ఉండలేరా?'

'ఔను', నేటి వరకూ అవే మాటలు నా చెవులలో ప్రతిధ్వనిస్తున్నాయి

'ఎందుకని?'

'శాపం'

'ఎవరిది?'

'ఋషిది'

'ఋషి శాపమిచ్చేటటువంటి ఏం పాపం నాన్నగారు చేశారు?'

'నాకు కూడా ఆ కథ తెలియదు. సరే, పద. నాకు ధ్యానానికి సమయమైంది. కాని ఒక్క విషయం గుర్తించుకో. ఆ రాత్రి ఆ బ్రహ్మచారుల మాటలు నన్ను జాగరూకుణ్ణి చేసాయి. దుఃఖంతో ఉన్న రాజకుమారుని కంటే సన్యాసిగా ఉండడమే మేలని ఆరోజే నిశ్చయించుకున్నాను. ఆనాటి నుండి తిరుగుతూ - తిరుగుతూ హిమాలయాలకు చేరాను. నాకక్కడ హఠయోగి గురువుగా లభించాడు'.

నేను మధ్యలోనే అడ్డుకునే అడిగాను - 'యతి! నీ తమ్ముడికి ఒక వరం ఇస్తావా?'

'నీకేం కావాలి?'

'నేను హస్తినాపురానికి వెళ్ళి అమ్మను తీసుకువస్తాను. ఒక్కసారి ఆమెను కలుసుకో'.

తల ఊపుతూ యతి సమాధానం చెప్పాడు. 'అది అసంభవం'.

'ఎందుకని?'

'నా తపస్సు ఇంకా పూర్తికాలేదు. భగవంతుడింకా నా గుప్పిటలోకి రాలేదు. నువ్వు ఆమెను తీసుకువచ్చినా, ఆమె నన్ను కలసుకోలేదు. నేను ఒకేచోట ఎక్కువ రోజులు ఉండను. కోరికే ఆత్మకు పెద్ద శత్రవు. అన్నిటికన్నా పెద్ద శత్రువు. ఏ ప్రదేశం పట్లయినా నాకే మాత్రం ఆకర్షణ కలిగినా ఆ ప్రదేశాన్ని వెంటనే విడిచి పెడతాను'.

'అయితే నువ్వు అమ్మను ఎప్పుడు కలుస్తావు?'

'ఎలా చెప్పగలను. బహూశా కలవవచ్చు, లేదా ఎప్పటికీ కలవక పోవచ్చు'.

'అయితే మన ఇద్దరి కలయిక?'

'ఇప్పటికి లాగానే ఎప్పుడో ఆకస్మాత్తుగా కలవవచ్చు. అప్పటికి నేను సిద్ధు లన్నీ పొంది ఉండవచ్చు. బయటకి పద, నా ధ్యానానికి సమయమయింది. రా! నేను నిన్ను గుహ బయట వదలి వస్తాను'.

గుహ ప్రవేశద్వారాన్ని కప్పి ఉన్న ముళ్ళతీగలను చేతులతో తొలగిస్తూ సోదరులం ఇద్దరం బయట పడ్డాం. ఇప్పుడు యతి దగ్గర సెలవు తీసుకోవటం నాకు తప్పనిసరి అయ్యింది. గద్గద స్వరంతో అడిగాను - 'యతీ! నేను వెళ్ళి వస్తాను. నన్ను మర్చిపోవద్దు. నేను గుహలోనికి వచ్చినప్పటి నుండి యతి నన్ను కనీసం సరిగ్గా తాకనైనా లేదు. కాని ఈ ఆఖరి క్షణంలో బహూశా ఆయన కఠోర నిశ్చయం సడలినట్లుంది. కుడిచేతిని నా భుజం మీద పెడుతూ అన్నాడు -

'యయాతీ! నేడో రేపో నువ్వు రాజువవుతావు. చక్రవర్తివి అవుతావు, వందలకొలది అశ్వమేధయాగాలు చేస్తావు. కాని ఒక్క విషయం గుర్తుంచుకో, మనస్సును జయించటం ప్రపంచాన్ని జయించినంత తేలికకాదు'.

# అధ్యాయం 5

దిగ్విజయంతో యాగాశ్వాన్ని తీసుకొని నేను హస్తినాపురానికి వచ్చాను. రాజధానిలో నాకు బ్రహ్మాండమైన స్వాగత సత్కారాలు జరిగాయి. యావత్తు నగరం కొత్తపెండ్లికూతురులాగా అలంకరించబడింది. నృత్య మత్త రమణి లాగా ఊగి పోయింది.

కాని ఈ అద్భుతమైన స్వాగత సత్కారాలకు నా మనస్సు పొందవలసి నంత ఆనందాన్ని పొందలేదు. నా మెడను అలంకరించిన సుందర సుగంధిత పుష్ప హారాలలో నాకిష్టమైన పూలు అదృశ్యమైనట్లు పదేపదే అనిపించింది. నగర మహా ద్వారంవద్ద నాకు హారతి ఇవ్వటానికి నిలబడిన దాసీలలో అలక ఎక్కడా కనిపించ లేదు. తరువాత జరిగిన ఎన్నో సంరంభాలలో సైతం ఆమె ఎక్కడా కనపడలేదు. నా కళ్ళు నిరంతరం ఆమెకోసం వెతుకుతూ ఉన్నా నా నేత్రాల దాహం తీరలేదు.

అమ్మ పొందుతున్న అమిత ఆనందం ఆమె నడకలో, ఆమె ప్రతిచేష్టలో స్పష్టంగా కనిపించింది. ఆమెకు యవ్వనం తిరిగి వచ్చినట్లుంది. ఆమె మమతాను రాగాలలో వాత్సల్యంలో నేను నిండా మునిగిపోయినా, నాకు మాత్రం ఏదో మూల అసంతృప్తిగానే ఉండిపోయింది.

చివరకు ఏదో యథాలాపంగా అడిగినట్లు నేను అమ్మను అడిగాను -

'అమ్మా! అలక ఎక్కడా కనిపించదేం?'

'ఆమె తన పెద్దమ్మ ఇంటికి వెళ్ళింది'.

'వాళ్ళ పెద్దమ్మ ఎక్కడ ఉంటుంది?'.

'చాలా దూరం, హిమాలయ పర్వతాలలోయలలో, అక్కడ నుండే రాక్షసుల రాజ్యం మొదలవుతుంది'.

ఆ రాత్రి నేను చాలాసార్లు అలక, యతి గురించి ఆలోచిస్తూనే ఉన్నాను.

నేను నా భవనంలో తల్పంపై ప్రశాంతంగా విశ్రమించాను. కాని అదే సమయంలో యతి చేతిలో కమండలం ధరించి అరణ్యంలోని ఏ జలాశయం వైపో వెళుతూ ఉండి ఉంటాడు. అతనికి మనస్సులో భయంలేదు. ఎవరిపట్లా ప్రేమ అంతకన్నా లేదు. ఈ ప్రపంచంలో సుఖప్రాప్తికి అదే సరైన మార్గమేమో? మరి నామనస్సు ఎందుకు ఆ మార్గం వైపుసాగదు? అలక జ్ఞాపకాలు పదే పదే నా మనస్సును ఎందుకు ముప్పిరిగొంటున్నాయి. ఆ రతీదేవి బొమ్మ లాగానే, ఆ రాత్రి అలక చిత్రం నా మనస్సుమీద ఎవరు ముద్రించారు? ఇప్పుడు ఆమె ఏమి చేస్తూ ఉండి ఉంటుంది. విశ్రాంతిగా నిదురపోయి ఉంటుందో?, లేక నా జ్ఞాపకాలతో వివశురాలయ ఉంటుందో! ఆమె కలలోనైనా హస్తినాపురం వస్తూ ఉంటుందా? వస్తే నా మహలు చుట్టూ తిరుగుతుంటుందా!

నేను అశ్వమేధపు ఉత్సావాలలో నెమ్మది నెమ్మదిగా ఈ విషయాలను మరిచి పోయాను.

అశ్వమేధపు కార్యక్రమం యావత్తు పూర్తి అవుతూ ఉండగానే యతి జననానికి ఆశీస్సులిచ్చి కారణభూతులైన మహర్షి శిష్యులు నాన్నగారికి ఆ మహర్షి దగ్గర నుండి ఒక సందేశం తీసుకువచ్చారు.

ఆ ఋషి పేరు పైకి ఉచ్ఛరించకూడదని, మా కుటుంబంలో ఒక అలిఖితమైన సంప్రదాయమున్నది. అయితే ఆ సంప్రదాయం వెనుక అనంతమైన భక్తిభావన వుందో, విపరీతమైన క్రోధముందో అంతు బట్టదు.

నేను ఆ గొడవ తెలియచేస్తున్నప్పుడు, ఏ విషయమూ వదిలిపెట్టకూడదను కున్నాను. ఆ మహర్షి పేరు అంగీరసుడు.

దేవదానవుల మధ్య ఘోరమైన యుద్ధం జరిగే సూచనలు కనపడుతున్నాయి. ఆ యుద్ధాన్ని నివారించేందుకు అంగీరస మహర్షి శాంతియజ్ఞాన్ని సంకల్పించాడు.

ఆ యజ్ఞానికి ప్రధాన ఋత్వికుడు ఆయన ప్రియశిష్యుడు కచుడు. కచుడు దేవతల గురువైన బృహస్పతి కుమారుడు. ఆకారణంగా రాక్షసులు ఈ యజ్ఞాన్ని భగ్నం చేసే అవకాశాలు ఎక్కువగా ఉన్నాయి. అందుచేత యజ్ఞాన్ని రక్షించటానికి దిగ్విజయుడైనట్టి తమ కుమారుని పంపవలసిందిగా నాన్నగారికి అంగీరసుడు సందేశం పంపాడు.

ఇది అశ్వమేధం కంటే గొప్ప గౌరవం. నా ఆకాంక్షలన్నీ ఆ శాంతియజ్ఞం చుట్టూ ప్రదక్షిణలు చేస్తున్నాయి. యతిని కలవటం నా జీవితంలో ఒక పీడకల అయితే, అలకాచుంబనం ఒక తీయని కల. రెండూ కలలే. శాంతియజ్ఞం కల కాదు. ఆ యజ్ఞాన్ని రక్షిస్తున్నప్పుడు నా వీరత్వం, పరాక్రమం లోక విదితా లవుతాయి. రాక్షసుల పీచమణిచిన ఈ నూతన వీరుడు ఎవరు అని తెలుసు కోవటానికి ఇంద్రుడు నాకోసం కబురంపుతాడు. నేను స్వర్గానికి వెళతాను. అక్కడ అలక కంటే వేయిరెట్లు అందగత్తెలైన అప్సరోభామినులు నన్ను కవ్వించాలని ప్రయత్నాలు చేస్తారు. అయితే వారి అంగాంగ ప్రదర్శనలను, తత్ప్రణయమత్త కేళివిలాసాలను పట్టించుకోకుండా, నేను దేవేంద్రుణ్ణి అడుగుతాను -

'దేవేంద్రా! నేను సురాసురయుద్ధంలో ఎల్లప్పుడా నీకు తోడుగా ఉంటాను. కాని మీరు నాకోవరం ఇవ్వాలి. నహుష సంతతి ఎప్పుడూ సుఖపడదని, నా తండ్రికి ఒక శాపం ఉంది. ఆ శాప ముక్తికి మీరు నాకు ఉపాయం చెప్పాలి'.

నన్నేదో విధంగా యజ్ఞరక్షణకు వెళ్ళకుండా ఆపాలని అమ్మ ప్రయత్నాలు చేసింది. 'కుమారుడెంత పెద్దవాడయినా, తల్లికి మాత్రం ఎప్పుడూ బిడ్డడు గానే వుంటాడని', అంటూ నాకు నచ్చచెప్పబోయింది. ఆమె దుర్బలత్వంపై నాకు జాలి గలిగింది. నేను రాక్షసుల పరాజయం, నా దిగ్విజయాలకు సంబంధించిన కలలు కంటున్నాను. నేను ఆమెతో నెమ్మదిగా అన్నాను - 'అమ్మా! నీ మాటలలోని వాస్త వాన్ని వృద్ధాప్యంలో తెలుసుకుంటాను. అయితే వృద్ధాప్యంలో నేనేదయినా చిన్న తప్పులు చేస్తే క్షమిస్తావు కదా!'

ఆర్ద్రమైన గొంతు అమ్మ - 'నిన్ను వృద్ధావస్థవరకు చూడగలనా! ఇదే భగ వంతుణ్ణి నేను కోరుకునేది', అన్నది.

అమ్మ వేదనలోని బాధ నేను అర్థం చేసుకోగలను. యతి పారిపోయిన ఆ భయంకరమైన రాత్రిని అమ్మ ఇంకా మరిచినట్లు లేదు. భయంకరమైన రాక్షసిలాగా భయం ఇంకా ఆమెను హింసిస్తూనే వుంది.

# అధ్యాయం 6

నా అంగరక్షకులు నెమ్మదిగా వెనుక వస్తున్నారు. వారి నెమ్మది కారణంగా అంగీరస ఋషి ఆశ్రమం చేరేసరికి నా గుఱ్ఱం విసిగిపోయింది. బహుశా దాని యజమాని లాగాదాని స్వభావంకూడా చంచలమైనదేమో! వాయువేగంతో ప్రయాణం చేయటం దానికి సరదా. కొద్దిసేపటికే మేము ఆశ్రమంచేరుకున్నాము.

సాయంకాలం గడిచిపోయింది. గూళ్ళకు తిరిగివచ్చే పక్షుల కలకలరవాలు మధురంగా వున్నాయి. పశ్చిమాన ఆకాశంలో యజ్ఞకుండం జాజ్వాల్యమానంగా మండుతున్నట్లుంది. ఆ జ్వాలలు మేఘాలకు హారతి పట్టినట్లూ, పక్షులు మంత్రోచ్చారణ చేస్తూన్నట్లూ వుంది -

రకరకాల పక్షులు తమ తమ గూళ్ళకు తిరిగి వస్తున్నాయి. రాజప్రాసాదంలో కూడా నేనిన్ని రకాలరంగులను చూడలేదు! నేను గుఱ్ఱాన్ని ఆపాను. ఆ పక్షుల వరసలు నన్ను ముగ్ధుణ్ణి చేసాయి. ఒక పంచరంగుల పక్షి ఎగురుతూ నా ముందు నుండి వెళ్ళసాగింది. ఆ పక్షి రంగులు నన్నెంత ముగ్ధుణ్ణి చేసాయంటే, ఆ పక్షిని బాణంతోకొట్టి, దాని రంగుల ఈకలను దాచుకుందామన్న కోరిక కలిగింది. ఆ ప్రబల మైన కోరికతో నేను విల్లు ఎక్కుపెట్టాను. 'ఆగు' - అంటూ ఒక కఠోరమైన కంఠ స్వరం వినిపించింది.

అది విన్నపంకాదు. ఆదేశం. నేను ఉలిక్కిపడి వెనుకకు తిరిగి చూశా, రంగురంగుల ఆ పక్షిని చూచి నేను నా పరిసరాలనే మరచిపోయాను. కుడివైపున ఒక చెట్టుకొమ్మపై కూర్చున్న ఆ ఋషి కుమారుడు సంధ్యాశోభను తిలకిస్తున్నాడు. నా వయస్సే ఉండవచ్చు - అతని ఆదేశం నాకు కోపాన్ని తెప్పించింది. కాని నా చెయ్యి మాత్రం అనాయాసంగా క్రిందకు జారిపోయింది. అతనిమీదకంటే నామీద నాకే కోపంవచ్చింది. అతను పైనుండి దూకి నా దగ్గర కొచ్చి, -

'ఇది అంగీరస మహర్షి ఆశ్రమం' అన్నాడు!

'ఔను, తెలుసు' కొంచెం కటువుగా సమాధాన మిచ్చాను.

'ఈ ఆశ్రమ పరిసర ప్రాంతాలలో ఒక పక్షిని చంపబోతున్నావు. ఇది అధర్మం!'

'నేను క్షత్రియుణ్ణి, హింస నా ధర్మం'

'ఆత్మ రక్షణార్థం దుష్టశిక్షణ కోసం వినియోగించితే హింస ధర్మమౌతుంది. ఈ అమాయక మూగ ప్రాణి నీకేమి కష్టం కలిగించింది?'

'ఆ పక్షి రంగులకు నేను ముగ్ధుడనైయ్యాను'.

'గొప్ప రస హృదయం కలిగి నట్లున్నావు. కాని నీకీ రసహృదయమిచ్చిన వాడే ఈ పక్షికి కూడా ప్రాణాలిచ్చాడు'.

'ఇటువంటి ఉపదేశాలు దేవాలయాలలో బాగుంటాయి!' ఎగతాళిగా అన్నాను.

ఋషి కుమారుడు చిరనవ్వుతో సమాధానమిచ్చాడు 'నీవొక దేవాలయంలో నిలబడి వున్నావు. అటుచూడు. ఈ దేవాలయవు అఖండదీపం. పడమర వైపున మెల్లమెల్లగా కాంతి తగ్గుతున్నది. కొంచం పైవైపుకు చూడు. సాయం సమయపు హారతి ఇవ్వడానికి ఒక దాని వెంటఒకటి, ఎన్ని అసంఖ్యాకమైన దీపాలు వెలుగుతాయో చూడు'.

అతని వేషం ఋషి కుమారునిలాగా వున్నది. కావి మాటలు మాత్రం కవి హృదయాన్ని వ్యక్తంచేస్తున్నాయి. నేను ఎగతాళిగా అన్నాను - 'కవిరాజ! మీకు గుర్రపు స్వారీ తెలుసా?'

'లేదు, లేదు'

'అయితే వేటలోని ఆనందం మీ ఊహకు కూడా అందదు'.

'కాని నేను కూడా వేటాడతాను'.

'ఎవరిని? దర్భలనా?' - నేను ఎగతాళిగా అన్నాను.

'నా శత్రువులను'. అతను చాలా శాంతంగా సమాధాన మిచ్చాడు.

'నార బట్టలు కట్టి, పర్ణకుటీరంలో ఉండే ఋషికుమారులకు శత్రువు లుంటారా?'

'ఒక్కరే కాదు, అనేక మంది'.

'శత్రువులను ఎదిరించడానికి నీ దగ్గర శస్త్రాలేవి?'

'సూర్యుడు, ఇంద్రుడు దగ్గర కంటే నా దగ్గర తేజోవంతమైన గుఱ్ఱం ఉంది'.

'ఇప్పుడే కదా గుఱ్ఱంమీద కూర్చోవడం తెలియదన్నావు?'

'నీ గుఱ్ఱం మీదకాదు. నేనెప్పుడూ నాగుఱ్ఱంమీదే స్వారీ చేస్తుంటాను. నా గుఱ్ఱం చాలా అందంగా వుంటుంది. చాలా చంచలస్వభావం కలది. నీవూహాకు అందనంత వేగంగా దౌడుతీస్తుంది. రెప్పపాటులో భూమినుండి స్వర్గానికి చేరు కుంటుంది. కాంతిరేఖలు కూడా చొరలేని ప్రదేశాలకు సైతం చేరుకోగలుగుతుంది. దీని ముందు యాగాశ్వాలు దిగుదుడుపే. దీనిబలంతో నరుడు నారాయణుడిగానూ, దేవతలు మహాదేవుడిగానూ మారగలుగుతారు'.

ఋషికుమారుని మాటలు గందరగోళంగా వున్నాయి. వాటి అర్థం నాకేమీ బోధపడలేదు. కోపంతో నాగుఱ్ఱాన్ని అదిలిస్తూ, ఆ ఋషి కుమారుణ్ణి అడిగాను-

'నీ గుఱ్ఱం ఎక్కడ?'

'నీకు చూపించలేను, కాని అన్నివేళలా అది నన్ను వెన్నంటే వుంటుంది. సదా నా సేవలో జాగరూకమైవుంటుంది'.

'నీ గుఱ్ఱానికి కనీసం పేరైనా వుంటుంది కదా!'

'ఉంటుంది'.

'మరి ఎందుకు చెప్పటంలేదు? దాని పేరేమిటి?'

'ఆత్మ!'.

ఆశ్రమంలోకి ఎంతో సాధారణంగా, వినయంగా ప్రవేశించాలని అమ్మ మళ్ళీ మళ్ళీ చెప్పింది. అందుకే రాజవస్త్రాలను, ఆభరణాలను అంగరక్షకులకు ఇచ్చి, సాధారణ సైనికుడిలా వచ్చాను. బహుశా ఋషి కుమారుడు నన్ను గుర్తుపట్టలేదు.

అతనిని నేను ఇంతకుముందు చూడలేదు. మరెలా గుర్తు పట్టగలను? దూరం నుండి చూస్తే ఋషులందరూ ఒకేలా కనిపిస్తారు. జడలు కట్టిన జుట్టు, యజ్ఞోపవీతం, వల్కలాలు, విభూతి అన్నీ అందరూ ఋషుల దగ్గర ఒకేలా వుంటాయి.

అంగీరస మహర్షి రాత్రి ప్రార్థనాసమయంలో మమ్మల్నిద్దరిని పరస్పరం పరిచయం కావించారు. అతను కచుడు. దేవగురువు బృహస్పతి కుమారుడు. శాంతి యజ్ఞపు ప్రముఖ ఋత్విజుడు. నాకంటే చిన్నవాడిగా కనిపిస్తాడు. బహుశ నాకంటె రెండు మూడేళ్ళు పెద్దకావచ్చు. ఇంత చిన్నవయస్సుకల కచుని అంగీరస మహర్షి ఈ యజ్ఞానికి సంబంధించి ఉన్నత పదవిని ఎలా ఇచ్చారు? నిజంగా ప్రేమ గుడ్డిది. ఆ ప్రేమ తల్లీ తనయులదికావచ్చు, గురుశిష్యులదికావచ్చు.

అంగీరసుని ద్వారా నా పరిచయాన్ని పొందిన కచుడు కూడా ఆశ్చర్య పోయాడు. సాయంకాలం జరిగిన ఆ సంఘటన గుర్తు తెచ్చుకుంటూ కచుడు నవ్వుతూ అన్నాడు - 'యువరాజా! సాయంత్రం మీతో వివాదం జరిగింది - ఎప్పుడు సత్యం పల్కు, అది విన్నవారలకు ఇష్టంగా ఉండేటట్లు చెప్పు అని మా గురువుగారి దగ్గర నేర్చుకున్నాను. కాని ఆ విషయం నాకు పూర్తిగా అవగాహన కాలేదు. నన్ను చెడ్డగా భావించవద్దు. మనస్సనే గుర్రం ఎవరి వలన కళ్లెం తెగిన గుర్రంలా పరుగెడుతుందో చెప్పలేం నన్ను క్షమించండి'.

నేను ప్రతి నమస్కారం చేశాను. 'మీరు కూడా నన్ను క్షమించండి' - కాని ఈ మాటలు నా పెదవులు దాటలేదు. హస్తినాపుర యువరాజు ఒక ఋషి కుమారుని క్షమాభిక్ష అడగడమా? అది ఎలా సంభవం!

తనలోతాను ఎదో అనుకుంటూ కచుడు అగ్నిశాల నుండి బయటకు వెళ్ళి పోయాడు. నేను కూడా అతని వెనుక ఉన్నాను. కచుని మాటలు నాకు విని పించాయి - 'ఆత్మావా అరే మంతవ్యః శ్రోతవ్యః అతా వా అరే నిదిధ్యాసితవ్యః'-

మా ఇద్దరికి వేరువేరు పర్ణశాలల్లో ఉండడానికి ఏర్పాట్లు చేశారు. ఆశ్రమం రెండో వైపున ఉన్న ఆ కుటీరాలు పచ్చని ఆ వనంలో ఇద్దరు అక్కచెల్లెళ్ళు ఒకే దుప్పటి కప్పుకొని ఉన్నట్లున్నాయి.

నావైపు చూస్తూ కచుడు నవ్వుతూ అన్నాడు 'యువరాజా! ఇప్పుడు మనం ఇరుగు పొరుగువారం......'

'కచుడా, గుర్తుందా? పొరుగు వాని కంటే శత్రువు మరెవరూ ఉండరు!' నేను ఎగతాళిగా అన్నాను.

'ముఖ్యమైన సామెత సగం సత్యాన్నే తెలుపుతుంది. అతను కూడా నవ్వుతూ జవాబిచ్చాడు. ఆ కుటీరంలోని శయ్యపై పరుండినప్పటికి నిద్రరాలేదు. యతి యొక్క ఆ పరుపు కంటే లక్షరెట్లు ఈ శయ్యమేలు. మెత్తని పరుపులపై నిద్రించిన ఈ శరీరానికి ఈ శయ్య గుచ్చుకుంటున్నది. మూలనున్న నూనె దీపం ఒదిగొదిగి వెలుగుతున్నది. నాకు ఈ వాతావరణం సరిపడలేదు. శాంతియజ్ఞంపూర్తి అయ్యేవరకు ఉండాలి. ఒక్కసారి నా శరీరం గగుర్పొడిచింది. పక్క పర్ణశాల నుండి మంద్రస్వరం మధురంగా వినిపిస్తున్నది. ఆ ధ్వని కలకల పారే గంగానదిలా తియ్యగా, సుఖంగా ఉంది. కళ్ళు మూసుకొని వింటూ వున్నాను. బహుశా కచుడు తన నిత్య కార్యక్రమానుసారం పాఠం చదువుతూ వుండవచ్చు. మాటలు స్పష్టంగా వినిపించనప్పటికి ఎండలో నడచి వచ్చిన యాత్రికునికి వర్షపు జల్లు ఎంత ఆనందానిస్తుందో, అలా నాకు సుఖం కలుగుతున్నది. మెల్లమెల్లగా నిద్ర నన్ను తనఒడిలోకి లాకున్నది. నేను కల కంటున్నాను - అలక తనలోతాను పాడుకుంటున్నది. 'ఆత్మావా అరే మంతవ్యః, శ్రోతవ్యః నిదిధ్యసితవ్యః - ఓ మానవుడా! ఆత్మ స్వరూపాన్ని అవలోకించి, ఆత్మను విను, ఆత్మజ్ఞానమే లక్ష్యమనుకో. అందులోనే నిమగ్నుడవు! బాగుందే, నీవు కూడా గార్గి, మైత్రేయల్లా తయారైనావా?' అంటూ ఆమె భుజంపై చేయి వేశాను. ఆమె అదృశ్యమైంది.

జపమాలలోని ఒక్కొక్క రుద్రాక్ష వెనుకకు మళ్ళినట్లు ఒక్కొక్క రోజు గడుస్తున్నది. మంత్ర ఘోషలో కీచురాయి ధ్వనులు కలిసి పోయినట్లే ఈ శరీరం ఏదో ఒక శాంతియజ్ఞపు పనినుండి ఆనందం పొందుతున్నది. కావచ్చు, శాంతి యజ్ఞ రక్షణా నిర్వహణలో ఉన్నప్పుడూ లేక నీవు యాగ రక్షణకు వచ్చావని

రాక్షసులకు తెలుసుకాబోలు ఎవరూ యాగ విఘ్నానికి సాహసించలేదని అంగీరస మహర్షి పొగిడి నపుడా లేక ఆశ్రమంలోని వ్యక్తిగాలిలా స్వేచ్ఛగా, లేడిలా చింత లేకుండా ఉండడం వలనా, కచునివంటి తేజస్వి, మంచి ఆలోచనాపరుడూ, శాస్త్ర విశారదుడూ మిత్రుడుగా లభించటం వలన, ఈ శరీరం శారీరిక ఆనందాన్ని మరిచి వుండవచ్చును. శాంతియాగానికి ప్రధాన ఋత్విక్కుడైన కచుడు ఉదయం నుండి సాయంత్రం వరకు మంచి నీళ్ళు మాత్రం త్రాగి ఉంటున్నాడు. నేను కూడ యాగ రక్షకుడనైనందున అతనిలాగా వ్రతనియమాలను పాటించాల్సిఉంది. కాని మహర్షి నా అంగరక్షకులలో ఆరుగురుని ఎన్నుకున్నారు. నాతోకలిపి ఏడుగురం. ఒక్కొక్క రోజు ఒక్కొక్కరు ఉదయం నుండి సాయంత్రం వరకు మంచినీరు తాగి వ్రత నియమాన్ని పాటిస్తుంటారు. వారంలో ఒకరోజు నావంతు. ఆ దినం నాకు చాలా కష్టంగా ఉండేది. కడుపులో ఆకలికి ఎలుకలు పరిగెత్తినట్లు ఉండి, అశాంతిని కలుగ జేసింది. జంతువుల వేట లేక అశ్వమేధ యజ్ఞం చేసినపుడు, యాగాశ్వం వెంట వెళ్ళినపుడు సమయానికి భోజనం దొరికేది కాదు. కాని ఆ ఉన్మాదంలో నాకు భోజనం గుర్తుకు వచ్చేది కాదు. ఆకలి బాధకు మనసులో ఆలోచనలు రేకెత్తాయి. నావంతు వ్రతపు రోజున రాక్షసులు యాగంపై దాడిచేసి వుంటే నేను వారితో యుద్ధం చేస్తూ ఆకలిని మరిచిపోయి వుంటేవాడిని. కాని అలా జరగలేదు. ఈ విధమైన వ్రతపు రోజున కచుని చూస్తే ఆశ్చర్యమేస్తుంది. వారంలో ఒకరోజు వ్రత మాచరించడం గగనమౌ తుంది. కచుడు రోజూ ఈ వ్రతాన్ని చాలా సంతోషంగా ఆచరిస్తున్నాడు. అతను ఈ మనోబలాన్ని ఎక్కడ నుండి పొందాడు? ఆలోచించి, ఆలోచించి నేను ప్రశ్నకు జవాబు పొందలేక ఓడిపోయాను. తిరిగి నన్ను నేను సమాధాన పరచుకున్నాను. - 'నా జీవితం ఒక వీర జీవితం. వీరుని పరాక్రమానికి శరీరమే ఆధారం. బాల్యం నుండి ఈ శరీరాన్ని ధృడంగా ఉంచేందుకు నేను శిక్షణ పొందివున్నాను. అందుకే ఆకలిని జయించలేకపోయాను. కచుడిది వేరే పరిస్థితి. అతని భుజాలు ఎండిపోయినా కర్రలా ఉన్నా పనులు చేసుకోగలడు. కాని వీరుని భుజాలు ధృడంగా ఉక్కులా ఉండాలి. కచునిలా నేను ఆకలిని జయించకపోవడం నిజమే. దానివలన గౌరవ భంగమా? యాచకత్వం చేసుకుంటూ కచుడు ఆర్యావర్త మంతా తిరగగలడా? అతని శరీరం తపశ్శక్తి మూలంగా తేజోవంతంగా ఉంది. యౌవనంతో అందంగా ఉన్నాడు. కాని జీవితంలో ఎప్పుడూ వింటికి నారిని ఎక్కించలేడు'.

విలక్షణంగా కనిపించే కచుడు నాకు ప్రతం రోజునే కాక చాలాసార్లు గుర్తుకు వచ్చేవాడు. ఎప్పుడూ కళ్ళలోనే ఉండేవాడు.

యజ్ఞం నిర్విఘ్నంగా జరిగిన తరువాత అంగీరస మహర్షి తన ఆశ్రమంలో మూడు రోజుల పండగ జరిపాడు. అందులో కచుడు చిన్న పిల్లవాడిలా పాల్గొన్నాడు. సంగీతంలో మంచి ప్రవేశముంది. నీటిలో ఈదే టప్పుడు అతడు పూర్వ జన్మలో చేప పిల్లడేమోనని అనిపించింది. పాటపాడుతూ వున్నప్పుడు ఒక పిల్లవాడు ఏడుస్తూ ఉంటే, అతణ్ణి వాళ్ళమ్మ ఒడినుండి తీసుకొని జామచెట్టు దగ్గరకు తీసుకు వెళ్ళి అచ్చట గుత్తులుగా ఉన్న జామకాయలలో రెండు తన నోటిలో వేసుకొని తిరిగి నాలుకతో బయటకు తీస్తాడు. దానిని చూచి ఆ పిల్లవాడు తన ఏడుపు ఆపి నవ్వుతాడు. కోతిపిల్లలా నాలుకను బయటకు తీసే కచుడు, ఆ పిల్లవాడిలా అనిపించాడు. శాంతి యజ్ఞ ప్రముఖ ఋత్వికుడుగా మంత్రాలన్నీ ఎలా ఉచ్చరించాడో! ఒకే మనిషిలో ఈ రెండు రూపాలు ఉండడం నేను నమ్మలేకపోతున్నాను.

రెండు రూపాలా? కాదు కచుడు బహురూపి. అతని ప్రతిరూపాన్నిచూచి నేను ఆశ్చర్యపోయాను. రాత్రి అతను ఫలహారం చేస్తున్నప్పుడు నేను కూడా అతనితో కూర్చుంటూ ఉండేవాణ్ణి. ఒక్కసారి తీయని అందమైన పండులో పురుగు ఉండటం చూశాడు. అతని నవ్వు ముఖం ఒక్కసారి గంభీరంగా మారిపోయింది. నా వైపు నిశ్చలంగా చూస్తూ -

'యువరాజా! జీవితం కూడా ఇలాంటిదే. అందమైనది. మధురమైంది. కాని ఎప్పుడూ ఎలా దానిలో పురుగు చేరుతుందో తెలియదు' అని చెప్పి ఆలోచ నలో మునిగిపోయాడు. ఏదో ఒక శ్లోకాన్ని ఉచ్చరించాడు. 'ఈ ప్రపంచంలోని మధుర ఫలాలకు పురుగులతో అధిక ప్రమాదం ఉంది' ఇది ఆ శ్లోకపు అర్థం. ఆ శ్లోకం చదివిన తరువాత పెద్దగా నవ్వుతూ అన్నాడు. 'యువరాజా! శ్లోకం మొదటి చరణం ఏదోవిధంగా కూర్చాను గాని రెండో చరణం కూర్చలేక పోతున్నాను .........' ఎవరిలో విశేషమైన అర్హతలుంటాయో వారు ఈ మధుర ఫలం నుండి గుణపాఠం నేర్చు కోవాలి. తనను తాను రక్షించుకోవాలి. కాని ఈ భావం ఛందస్సులలో బంధించబడి కొట్టుమిట్టాడుతూ బయటకు రాలేకపోతున్నది.

కచుడు కవి అని నాకు ఆ రాత్రి తెలిసింది. మనస్సుకు ఏదైనా కష్టంకలిగితే ఇటువంటి పంక్తులేవో రాస్తూవుంటాడు. వాటిని నేను ఎక్కడైనారాసి జాగ్రత్త చేస్తే ఎంత బాగా వుండేది?. కాని ఏ వస్తువు విలువైనా దాన్ని పోగొట్టుకున్న తరువాతే తెలుస్తుంది. ఎన్నోరోజులు కచునితో కలిసి ఉన్నప్పటికి ఒక్క శ్లోకం కూడా నాకు కంఠస్థం కాలేదు. కాని ఒక చరణం లోని మూడు శబ్దాలు మాత్రం గుర్తు న్నాయి. - 'జగద్ ద్రుమస్య హే పర్ణ......'

ఆ శ్లోకం అతని నోటి నుండి అనాయాసంగా వెలువడింది. ఆ సంఘటన ఇప్పటికీ నాకు గుర్తే. వెన్నెలరాత్రి, బయట మేమిద్దరం పచార్లు చేస్తున్నాం. ఒక్క సారి గాలివీచడం ఆగిపోయింది. ఆకు కూడా కదలటం లేదు. ఇంతలో ఎక్కడి నుండి ఒక పెద్దగాలి తెర అకస్మాత్తుగా వచ్చింది. అక్కడేవున్న కుంకుమపువ్వు మొక్క ఆకు ఒకటి కచుని తలపై రాలింది. అక్కడ నుండి నేలపై పడుతున్నప్పుడు దానిని పట్టుకునేందుకు కచుడు ప్రయత్నించినప్పటికి సాధ్యంకాలేదు. నేలరాలిన ఆ ఆకును చేతితో తీసి పట్టుకుని మంత్రముగ్ధుడైనట్లు దానిని చూస్తూ ఉండి పోయాడు. అప్పుడు 'జగద్ ద్రుమస్య హే పర్ణ .....' అనే శ్లోకం అతని నోటి నుండి వెలువడింది. శ్లోకం ముందు పదాలు నాకు గుర్తులేవు, కాని భావం నేనె ప్పటికీ మర్చిపోలేను. ఇప్పటికీ అది నా మనస్సులో ముద్రితమై వుంది. 'ఓ చిగురుటాకా! నీ ఈ అకాలమరణానికి కారణమేమి? నీవు ఈ మొక్కకు అందాన్నిచ్చావు, నీకు చేతనైనంత వరకు నాలాంటి వారికి నీడనిచ్చావు. నీ జీవితం సారకమైంది. స్వర్గంలో నీస్థానం సుస్థిరమైంది........'.

ఒకనాడు ఒక ఋషి బాలిక మా చేతులు పట్టుకొని తన కుటీర ప్రాంగాణానికి తీసుకువెళ్ళి తన చేతులతో నాటిన తీగకు మొదటిపూవు పూసిందని మాకు చూపించింది. మేము అది చూచి ఆమెను అభినందించి ముందుకు వెళ్ళ బోయాము. కాని ఆ బాలిక ఏదో సమస్యలో చిక్కుకున్నట్లు కనిపించింది. ఒక పూవును ఇద్దరి అతిథులకు ఎలా ఇవ్వటమా, ఎవరికి ఇవ్వడమా అనే సందిగ్ధంలో పడినట్లుంది. అది గ్రహించిన కచుడు 'పాపా! ఆ పువ్వు ఈ రాజ కుమారునకు ఇవ్వు!' అన్నాడు. నేను వెంటనే 'కాదు, కాదు. ఈయన గొప్ప ఋషి. ఆయనకే ఇవ్వు' అన్నాను.

అర విరిసిన ఆపూవును ఆ బాలిక కోయబోయింది. కచుడు మెల్లగా ఆమె చేతిని తనచేతిలోకి తీసుకొని అన్నాడు - 'నీ బహుమతి నాకు చేరింది. కాని దానిని తీగకే ఉండనివ్వు. రోజూ ఉదయాన్నే వచ్చి నీ ఈ పూవుతో మాట్లాడ తాను. ఇప్పుడు నీకు ఆనందంగా వుందా?'

కచుని మాటలు ఆ అమ్మాయికి చాలా ఆనందాన్నిచ్చాయి. కాని నాకు అశాంతి కలిగింది. ఆ రాత్రి మాటల్లో నేనా విషయం కదిపాను. 'కచుడా! ఆ మొగ్గ రెండురోజులలో పూర్తిగా వికసిస్తుంది....... మరో నాలుగురోజులు ఆ తీగ నంటి వుంటుంది. ఆ తరువాత రాలిపోతుంది. ఇందులో ఆనందమేముంది? దూరం నుండి చూడడానికేనా ఆ పువ్వులు? వాటిని కోయడంలో, వాసన చూడ డంలో, దండగా గుచ్చడంలో, కొప్పులో అలంకరించడంలో, పడకపై చల్లడంలోనే నిజమైన ఆనందం ఉంది'.

కచుడు నవ్వుతూ అన్నాడు, 'అది నిజంగా ఆనందమే. కాని క్షణికమైంది. కేవలం దానిని అనుభవించడం'.

'అనుభవించడం పాపమా?'

'కాదు, ధర్మాన్ని ఉల్లంఘించని అనుభవం పాపం కాదు. కాని ఈ ప్రపంచంలో అనుభవించడం కంటే శ్రేష్ఠమైన ఆనందం వుంది'.

'ఏమిటది?'

'త్యాగం'.

నాకు యతి జ్ఞాపకం వచ్చాడు. చిన్నప్పుడే భౌతిక సుఖాలను త్యజించి వెళ్ళిపోయాడు. ఆ రాత్రి ఏనుగును వేటాడడం, యతియొక్క విచిత్రమైన గుహ, అందులో ముళ్ళ శయ్య అన్నీ గుర్తుకు వచ్చాయి. నేను కచుని ప్రశ్నించాను,

'ఈ ప్రపంచంలో సన్యాసం ఒక్కటే సుఖమైన మార్గమా'.

అతను నవ్వి కొద్దిసేపు మాట్లాడలేదు. తిరిగి నేను అడిగాను. 'రేపు రాజు కావలసిన నేను సన్యాసించటం ఉచితమా'!

కచుడు గంభీరముద్ర దాల్చాడు. తరువాత ఆవేశంతో అలా ఎన్నడు కాదు. 'యువరాజా! రాజై ప్రజలను పరిపాలించడం, వారి సుఖ సంతోషాలకై పాటు పడడం నీ రాజధర్మం. ఈ రాజధర్మం సన్యాస ధర్మం కంటే తక్కువకాదు' అన్నాడు.

'సింహాసనంపై కూర్చుండి సన్యాసిగా వ్యవహరించవచ్చా?' - నేను ప్రశ్నించాను.

కచుడు మెల్లగా చెప్పాడు, 'యువరాజా! గృహ నిర్వాహణే మానవుని సహజ స్వభావం. నిజం చెప్పాలంటే అతను అన్నిరకాల భోగాలు అనుభవించ వచ్చును. మానవుడు ఏవిధమైన భోగాలు అనుభవించరాదు అనే భావన భగవంతునికుంటే మానవుడికి శరీరాన్ని ప్రసాదించడు. కాబట్టి అతని ఉద్దేశం అదికాదు. జీవితం అనుభవించడానికే అయితే భగవంతుడు మానవునికి శరీరంతోపాటు ఆత్మను కూడా ఇచ్చాడు. శరీరపు కోరికలన్నీ ఈ ఆత్మ అధీనంలో ఉండాలి. కాబట్టి ఆత్మ ఎప్పుడూ జాగ్రదావస్థాలో ఉండాలి. సారథి మత్తులో మునిగి తన చేతిలో కళ్ళెం విడిచి పెడితే గుర్రం తన యిష్టం వచ్చిన దిశలో పరిగెత్తి లోయలో పడితే రథంలో కూర్చున్న ధనర్ధారి అనవసరంగా తన ప్రాణాలు చేతులారా పోగొట్టు కుంటాడు'.

చెప్పుతూ ఆగిపోయాడు. తలెత్తి ఆకాశంలోని నక్షత్రాలవైపు దృష్టి సారించాడు. తిరిగి మొదలుపెట్టాడు. 'యువరాజా! నన్ను క్షమించు. ఈ విధమైన సంభాషణలో నన్ను నేను మరిచిపోతాను. నేనొక జీవితబాటసారిని. ఆ మార్గంలో ఉండే కొండలు, కోనలు, లోయలు, అడవులు, నదులు దాటాలి. నేనిప్పుడు చెప్పిన దంతా పుస్తక జ్ఞానం. అందులో అనుభవ జ్ఞానం లేదు. కాని బృహస్పతివంటి తండ్రి, అంగీరసునివంటి గురువు దగ్గర నేర్చుకున్న దానికి నా ఆలోచనలు జోడించి చెప్పిందే ఇదంతా. ఆ అందమైన పుష్పాన్ని చూచి నేను ఆనందించాను. ఆ బాలికకు ఇచ్చిన మాట నిలుపుకుంటాను. ఆ పూవును రోజూ చూస్తూ ఆనందిస్తాను. అది పూర్తిగా వికసిస్తుంది. అప్పుడు ఆ తీగ దగ్గరకు వెళ్ళి వాసనను ఆఘ్రాణిస్తాను. కాని దానిని తుంపను. నేను సుగంధాన్ని ఆస్వాదించాలనే కోరికతో తుంపి నట్లయితే రేపు మరికొన్ని పువ్వులను తుంపాలనే కోరిక కలుగుతుంది. రేపు ఇతరుల పూవులు దొంగతనం చేయాలనే కోరిక కలుగుతుంది. దొంగతనం పాపం'.

అతని స్వరంలోని మాధుర్యానికి ముగ్ధుణ్ణై, అలా వింటూ ఉండాలనిపించింది. అతని మాటలు చిలుక పలుకుల వలే ఉన్నాయి. - 'నాకొక సందేహం వుంది. తీర్చుకో వచ్చునా?' అన్నాను.

'అడగండి. కాని నేను కూడా మీలా అనుభవ శూన్యుడనయిన యువకుడనే. జీవుతపు రహస్యాలు ఎప్పుడూ గుహలోనేదాగి ఉంటాయి. మనం ఇప్పుడిప్పుడే ఆ గుహలోకి ప్రవేశం పొందాము. ఆ గుహలోపలి చీకటిలో మనకేమీ కనిపించ డంలేదు. మనలో ప్రతి ఒక్కరూ ఆ రహస్యాలను స్వయంగా వెతికి వెలికితీసు కోవాలి'. నేను అడ్డుపడుతూ అన్నాను-

'అదంతా అలా ఉండనివ్వు. నాలుగు రోజులలో ఆ పువ్వు తనంతతానే వాడిపోతుంది. దానిని ఈరోజే తుంపి వాసనచూసి నలిపివేయటంలో తప్పే ముంది?...... ఇందులో ఎవరికి ఏమి పోతుంది? ఎవరికి నష్టం కలుగుతుంది? అలా చేయటంవలన కనీసం నేను కొద్ది క్షణాలైనా ఆ ఆనందాన్ని అనుభవించ కలుగుతాను కదా?'

కచుడు నా ప్రశ్నకు సూటిగా జవాబు చెప్పలేకపోయాడు. కాని తన అప జయాన్ని కూడా స్వీకరించలేకపోయాడు. 'రాక్షస గురువు శుక్రాచార్యుడు విచిత్ర మైన తపస్సు చేసి సంజీవినీ విద్య పొందారని తెలిసింది. ఆ విద్యతో మృతులను సజీవులగా చేయవచ్చును. నేనావిద్యను నేర్చుకోగలిగితే ఈ వాడిపోయిన పూవు లను వికసింపజేస్తాను' అని అన్నాడు.

కచుడు చిన్నపిల్లవాడిలా మాట్లాడుతున్నాడు. ఆయితే అతను ఇటువంటి మాటలు ఇప్పుడేకాదు, చాలాసార్లు మాట్లాడుతూ వుండేవాడు. అతని మాటలు నాకు కొంచెం కూడా నచ్చేవికావు. దేవదానవుల మధ్య చిన్నచిన్న తగాదాలు చాలా కాలంగా జరుగుతానేవున్నాయి. శుక్రాచార్యుడు పొందిన ఈ సంజీవిని విద్య వలన ఆ చిన్నచిన్న తగాదాలు పెద్ద యుద్ధాలుగా మారడం తథ్యం. ప్రపంచాన్ని ఈ ఘోర యుద్ధాల నుండి రక్షించాలనే ఉద్దేశంతోనే అంగీరసుడు ఈ శాంతి యజ్ఞాన్ని ఏర్పాటు చేశారు. ఒకవైపు ఇంద్రాదులు యుద్ధానికి కావలసిన ఏర్పాట్లలో మునిగివున్నారు. ఈ సమయంలో దేవగురుని పుత్రుడు, ఈ శాంతి యాగానికి పురోహితుడిగా వచ్చాడు. అతను ఎప్పుడూ అంటూ ఉంటాడు, దేవతలు

విలాసాలను గుడ్డిగా ఉపాసిస్తుంటే, దానవులు శక్తిని ఉపాసిస్తుంటారు. వీళ్ళిద్దరూ ఈ జగత్తుని శాంతియుతంగా ఉంచటంలో అసమర్థులే. ఒకవేళ వారిద్దరూ యుద్ధంచేసినప్పటికీ, ఆ యుద్ధంవలన ఉపయోగం కూడా ఏమీ ఉండదు'.

అతని ఆలోచనలన్నీ విచిత్రంగా ఉంటాయి. నేనతనికి ఎంత దగ్గరగావున్నా, మామధ్య ఎంతటి అనుబంధం వున్నా నేనతని మనస్సును తెలుసుకోలేకపోయాను. ఒక్కోసారి అతను యతి కంటే నూరుకోట్లు గొప్పవాడిగా, మరొకసారి పిచ్చివాడి కంటేకూడా కనాకష్టంగా కనిపిస్తాడు. అతని ఆలోచనలన్నీ ఒక్కోసారి స్వప్న లోక విహారాల్లాగా అనిపిస్తాయి. మేమిద్దరం త్వరలోనే విడిపోతామన్నది మాత్రం అక్షర సత్యం. ఆ ఆలోచనే నా మనస్సులో ఆందోళనను రేకెత్తిస్తున్నది. అయితే విడి పోయే సందర్భం చాలా అకస్మాత్తుగా వచ్చిపడింది.

ఉత్సవపు మూడవరోజు రాత్రి నాన్నగారు తీవ్రమైన అస్వస్థతతో మృత్యు శయ్యపై వున్నారన్న సమాచారం తీసుకుని హస్తినాపురం నుండి దూత వచ్చాడు. నేను వెళ్ళడం తప్పనిసరి. కాని ఏంచెయ్యాలో తోచక అంగీరసుని వద్దకు వెళ్ళాను.

ఆయన అంతులేని ఆత్మీయతతో వెన్ను నిమురుతూ అన్నాడు -

'యువరాజా! వెంటనే వెళ్ళు. ఇచ్చట విషయాలను గురించి ఏమాత్రం చింతించ వద్దు. యాగానికి సంబంధించిన ప్రధానమైన భాగాన్ని నువ్వు సమర్థ వంతంగా నిర్వహించావు. ధర్మాన్ని సేవించినట్లే తండ్రిని సేవించటంకూడా నీ కర్తవ్యం'.

నేను భక్తి ప్రపత్తులతో అంగీరసునికి నమస్కరించాను. నన్ను వాత్సల్యంతో చూస్తూ అన్నాడు -

'యువరాజా, నేను నిన్ను సుఖంగా ఉండాలని దీవించలేను. మానవుని మనస్సు, జీవితం పడుగు పేకల్లా కలసి ఉన్నాయి. ఒకోసారి ఆనందం మృగ తృష్ణలా ఉండవచ్చు. సుఖం దుఃఖానికి నీడా? లేక దుఃఖం సుఖానికి ప్రతి బింబమా? అనేది ఇన్నాళ్ళు తపస్సు చేసినప్పటికీ నేను తెలుసుకోలేక పోయాను. నువ్వీ సమస్యలో మునగకు. నీవు రాజ్యాన్ని పాలించు. ధర్మం, అర్థం, కామం నీ

పురుషార్థాలు. అర్థం, కామం పదునైన బాణాల వంటివి, వినయం రూపవతి అయిన స్త్రీకి ఆభూషణం. అదే విధంగా అర్థకామాలు రెండూ ధర్మంతో కలసి ఉంటే అందాన్నిస్తాయి. అయితే ధర్మమంటే ఏమిటి? ఇతరుల నుండి మనం దేనిని ఆశిస్తామో అదేవిధంగా మనం ఇతరులతో వ్యవహరించడమే ధర్మం. ఇటువంటి ధర్మ బుద్ధి నీకు కలగాలని నేను కోరుకుంటున్నాను'.

అనురాగవతియైన తల్లి ఉపదేశంలా, అంగీరసుని ప్రతి మాటలో అనురాగం, ఆప్యాయత తొణికిసలాడుతున్నాయి. ఆ మాటలు నా చెవిలో మ్రోగుతున్నాయి. కాని నా మనస్సులోకి చొచ్చుకుపోలేదు. తండ్రిగారికి అనారోగ్యం అన్న విషయం నా మనస్సుకు విరక్తిని కలిగించింది. అనేకరకాలైన ఊహాలు మంచుపొగలా మనస్సును ఆవరించుకున్నాయి. యతి చెప్పిన మాటలు, శాపం గుర్తుకొచ్చాయి. తండ్రిగారికున్న శాపం ఏమిటి? దాని కారణంగా మరణావస్థలో లేరుకదా? ఆ శాపనివారణకు ఉపాయ మేమిటి?

నేను భయపడుతూ అంగీరసుని ప్రశ్నించాను - 'నేను ఒక విషయం తెలుసుకోవాలనుకుంటున్నాను. నాన్నగారికి ఎవరైనా శాపమిచ్చారా?'

ఆయన ముఖంలో విషాదం అలుముకుంది. కొద్దిక్షణాలు నిశ్శబ్దం తరువాత జవాబిచ్చారు -

'ఔను'

కొంచెంసేపటి తురవాత చెప్పారు, - 'యువరాజా, ఆ శాపానికి ఇంత భయపడడ మెందుకు? నిజం చెప్పాలంటే ఈ ప్రపంచంలో ప్రతి మనిషి శాప గ్రస్తుడే'.

'ప్రతి ఒక్కరూ' భయంతో నా గొంతు వణికింది.

ఆయన నవ్వుతూ అన్నారు, 'నేను, కచుడు, నీ తండ్రి - మనమంతా శాప గ్రస్తులమే. పూర్వజన్మమే ప్రతి ఒక్కరి మార్గానికి ఆటంకం, కొందరు వారి తల్లిదండ్రుల దోషాలు అనుభవించవలసి ఉంటుంది, కొందరు తమ ప్రవర్తన వలన దుఃఖిస్తారు. అయితే కొందరు పరిస్థితుల కనుగుణంగా తమ మార్గాలను నిర్ణయించుకుని జీవిస్తారు'.

'అయితే జీవితమే ఒక శాపమా?'

'కాదు, కాదు! జీవితం ఒక వరంలాంటిది. అది భగవంతుని ప్రసాదం'.

'అయితే ఈ శాపగ్రస్త జీవితాన్ని అనుభవించడానికే మానవుడు ఈ ప్రపంచంలో జన్మిస్తాడా?

'కాదు', అంగీరసుడు గంభీరంగా చెప్పాడు. కాని వెంటనే నవ్వాడు. నాకా నవ్వు శరత్కాల చంద్రుని వెన్నెలనిపించింది.

'మానవుని జీవిత లక్ష్యమేమిటి?'

'ఈ శాపం నుండి విముక్తి పొందడానికి ప్రయత్నించడమే మానవుని జీవిత లక్ష్యం. ఇతర ప్రాణాలకు శారీరిక సుఖదుఃఖాలకు అతీతంగా ఉండే శక్తిలేదు. అది మానవులకు మాత్రమే లభించిన భగవంతుని వరం. దాని వలనే మానవుడు జంతువుల కంటే ఉన్నతుడుగా పరిగణించబడ్డాడు. సంస్కృతి అనే పర్వతాన్ని అధిరోహిస్తూ ఎప్పుడో ఈ శాపం నుండి విముక్తి పొందుతాడు. ఒక విషయం మరచిపోవద్దు. శారీరిక సుఖం జీవిత చరమ లక్ష్యం కాదు. ఆత్మ సుఖమే అంతిమ లక్ష్యం'.

కొద్దిక్షణాలు ఆగి చెప్పసాగాడు - 'నేనొక పిచ్చివాడిలా ఉన్నాను. అవసరం లేకుండా నీకు బ్రహ్మజ్ఞానం బోధిస్తున్నాను. క్షత్రియుడు ధనుర్బాణాలు, బ్రాహ్మణులు వాక్కును ఎప్పుడూ సిద్ధంగా ఉంచుకుంటారని ప్రతీతి. నీవు ఎటు వంటి సంకోచం లేకుండా హస్తినాపురం వెళ్ళు. నీతండ్రిగారి ఆరోగ్యానికై భగవంతుని ప్రార్థిస్తాను. వెళ్ళు, నీ ప్రయాణంలో ఆటంకాలు కలగకుండు గాక. శివస్తే పన్థానః సంతు!'

హస్తినాపురం చేరేవరకు నావెంట అంగీరస కచుల ధార్మిక సంభాషణలు నీడలా వెంటాడుతూనే ఉన్నాయి. కాని నగరంలో ప్రవేశించిన వెంటనే ఆనీడ మాయమైపోయింది. దాని స్థానాన్ని రాజధాని విషయాలు ఆక్రమించుకున్నాయి. ఎల్లప్పుడూ నవ్వుతూ, తుళ్ళుతూ నగరంలో హడావిడిగా తిరిగే నగరపౌరులు, నేడు విచారంగా, మౌనంగా అడుగులో అడుగు వేసుకుంటూ నడుస్తున్నారు. ఆ పరిస్థితిని చూస్తుంటే నా తండ్రిగారి అంతిమ దర్శనం నాకు లభిస్తుందో లేదో అనే

అనుమానం కలిగింది. యుద్ధంలో ఓడిపోయిన రాజపుత్రినిలా నేను మౌనంగా తల వంచు కొని, రాజప్రసాదంలోకి వెళ్ళాను. తండ్రిగారు కదులుతున్నారు. కాని నన్ను గుర్తించ లేదు. ఆయన శరీరం సలసలా కాలుతున్నది. మధ్యమధ్యలో పల వరిస్తున్నారు. ఆయన అపస్మారక స్థితిలోకి వెళ్ళి పోయారు. తల్లి, రాజవైద్యులు, వృద్ధ అమాత్యుడు, దాస - దాసీలు అందరి ముఖాలలో విచారం, దుఃఖం అలుముకుంది.

నేను తండ్రిగారి శిరస్సు వద్ద కూర్చున్నాను. 'నాన్నగారూ..... నాన్నగారూ .....' అని చాలా సార్లు పిలిచాను. ఆయన ఏదో గొణిగారు. కాని నా పిలుపులకు జవా బివ్వలేదు.

నేను లేచి ఆయన పాదాల చెంతకూర్చున్నాను. నేను మెల్లమెల్లగా ఆయన పాదాల వత్తసాగాను. కాని నాచేతి స్పర్శ ఆయన గుర్తించలేదు. నాకళ్ళనిండా కన్నీరు. తండ్రిగారి పాదాలు నాకన్నీరుతో తడుపుతూ రోదించాను.

మంత్రి నా భుజాలను పట్టి లేపి బయటకు తీసుకువచ్చి దుఃఖంతో పూడుక పోయిన గొంతుకుతో చెప్పారు. 'యువరాజా! మీరు ఇంకా చిన్నవారు, అందుకే ఈ ప్రపంచం గురించి తెలియదు. ఇది మర్త్యలోకం. మానవుని జీవితం కల్ప వృక్షం లాంటిదేకాదు, విషవృక్షంలాంటిది కూడా. మీరు తండ్రిగారి బాధలు చూడ లేరు. నగరానికి రెండు క్రోసులదూరంలో మన అశోకవనం ఉంది. అది సుందర విశ్రాంతి స్థలం. ఎవరైనా ఋషులు వచ్చినప్పుడు అచ్చట వారికి ఆతిథ్యం ఇవ్వడం సంప్రదాయం. అది హిమాలయంలో ఉన్న ప్రశాంత గుహాలకన్నా తక్కు వదికాదు. అది పూర్తి ఏకాంత ప్రాంతం. ఇక్కడ నుండి అశోకవనం వెళ్ళడానికి ఒక రహస్య సొరంగమార్గం ఉంది. ఈ మార్గం చాలా దగ్గరమార్గం. మీరు ఆ ప్రశాంత ఉద్యానవనంలో విశ్రాంతి తీసుకొండి. రోజుకు రెండుసార్లు తండ్రిగారిని చూడడానికి వస్తూ ఉండండి. ఏదైనా ముఖ్య సమాచారం ఉంటే ఈ సొరంగ మార్గంగుండా వెంటనే చేరుకొండి. మహారాణిగారితో సంప్రదించే నేను ఈ ఏర్పాటు చేశాను - అశ్వమేధ, శాంతియాగాలకారణంగా మీరు చాలా అలసి ఉన్నారు. అశోకవనంలో విశ్రాంతి తీసు కుంటే మీఆలసట పోతుంది'.

వేటలోగానీ, యుద్ధభూమిలోగానీ ఎవరికీ భయపడలేదు. వెనుకంజ వేయలేదు.

కాని ఈ మృత్యు వాతావరణానికి భయపడి అశోకవనానికి వెళ్ళి విశ్రాంతి తీసుకో వాలని అనుకున్నాను.

మృత్యువు ఒక భయంకరమైన ఎలుగుబంటి వంటిది. ఎంత ఉన్నత స్థానంలో ఉన్నప్పటికీ వెన్నంటే ఉంటుంది. ఎక్కడ దాక్కున్నా వదలి పెట్టదు. ఆ ఉత్కంఠత వలన ప్రాణం పోయినట్లుంటుంది.

అశోకవనంలో మంత్రివర్యులు నాకోసం అన్ని ఏర్పాట్లుచేశారు. కాని నా మనస్సు దేనిపైన లగ్నం కాలేదు. దాసదాసీ జనం నా ఆజ్ఞకై ఎదురు చూస్తూ నిలబడ్డారు. దాసీ జనంలో ముకులిక అనే కొత్త దాసీ ఉంది. ఆమె అందమైనది, తెలివైనది. పాతిక సంవత్సరాల వయస్సు ఉంటుంది. నాకు ప్రశాంతత కలిగించ డానికి మౌనంగా నా పరిచర్యలో నిమగ్నమైవుంటుంది. భోజనం చేయకుండా లేచి పోతే గాలివిసురుతూ ఉన్న ఆమె ఆగిపోయేది. నేను వెనుకకు తిరిగి చూస్తే సిగ్గుతో, కరుణతో నన్నే చూస్తుండేది. 'అదేమిటి యువరాజా? మీరేమీ తినక పోతే, మీ శరీర పరిస్థితి' అనే భావన ఆమె కళ్ళు చెప్తున్నాయేమో అనిపిస్తుంది.

మృత్యు నీడ నా మనస్సుపై పడకుండా ఉండాలనే రాత్రిపగలు నా ప్రయత్నం. కాని తండ్రిగారిని చూడడానికి రాజప్రసాధంలోకి వెళ్ళే సమయానికి నా ప్రయత్నాలన్ని వ్యర్థం అయ్యేవి, మృత్యువు ఎనిమిది ఝామురా అశ్వమేధంచేసిన చక్రవర్తి లాగా కనిపిస్తూ వుండేది. దానికి ఈ ప్రపంచంలో ఎవరూ ఎదురులేరన్న భావన నన్ను బాధిస్తుండేది. నేడు తండ్రిగారు మృత్యుశయ్యపై కొట్టిమిట్టాడుతున్నట్లే రేపు నేను కూడా యాతన అనుభవించాలనే దృశ్యం నా మనస్సును చాలాసార్లు కుదిపివేస్తూవుంటే, మృత్యువుకు దొరకనంతదూరం పారిపోవాలనిపించేది.

తండ్రిగారి ఆనారోగ్యం వలన మృత్యువు భయంకర రూపం మరింత వికృతంగా కనిపించింది.

కొద్దిక్షణాలు నాన్నగారికి తెలివిరాగా తల్లిగారిని గుర్తించి దగ్గరకు పిలిచి క్షీణ స్వరంతో అన్నారు - 'ఈ అందం, అంతులేని వైభవం ఇక్కడే వదలివెళ్ళిపోవాలి'. నేను శిరస్సు దగర కూర్చునట్లు ఆయన గమనించలేదు. ఆ సమయంలో నేను అక్కడే ఉన్నట్లు అయనతో చెప్పాలని మా తల్లిగారు ప్రయత్నించారు. కాని

ఫలించ లేదు. ఆయన చిన్నపిల్లవాడిలా రోదిస్తూ చెప్పసాగారు, 'ఇంకా నాకా అమృతపానం చెయ్యాలనే వుంది, కాని.......'

అమ్మ నన్ను బయటకు వెళ్ళమని సైగ చేశారు. కాని తండ్రిగారి ఆవేదన నా మనస్సులో ఇప్పటికి ప్రతిధ్వనిస్తూనే వుంది. అది ఒక వీరుని ఆక్రందన. ఆ కన్నీ టికి అర్థం నాకు తెలియరాలేదు. దాని వెనుక జీవితపు లోతుల్లో ఏదో రహస్యం దాగివుంది. నేను ఏమీ తెలియక కొట్టుమిట్టాడాను.

కాని అప్పుడు నా హృదయవేదనకు వేరే కారణం ఉంది. రాత్రంతా మేలుకొని ఉన్న మా తల్లిగారు ఆలసిపోవుండచేత నేను ఆమెను అంతఃపురానికి పంపించి వేశాను. తండ్రిగారి వద్ద నేను కూర్చున్నాను. ఆయనను రాజవైద్యులు క్షణంక్షణం వచ్చి చూస్తూన్నారు. పొద్దుపోయింది. అప్పుడు నాన్నగారు కళ్ళు విప్పి చూశారు. నన్ను చూసి చేయ పట్టుకుని ఏడూస్తూ అన్నారు - 'యయూ, యయూ, నన్ను గట్టిగా పట్టుకో, నేను వెళ్ళిపోవాలి, నాకు..... లేదు, నేను వెళ్ళను. యయూ, వారిని చూడు...... చూడు...... వారు యమదూతలు, నీవు వీరుడవు. నీవుండగా వారు ఇక్కడకు ఎలా రాగలిగారు. నీవెందుకు వారిని రానిచ్చావు?'

ఆయన చేతులు వణుకుతున్నాయి. ఆయన అన్నారు - 'మీరంతా కృత ఘ్నులు మీ ఆయువులో ఒక్కరోజు నాకు..... నేను, .....యయూ, యయూ! నన్ను గట్టిగా పట్టుకో....!' అని అరుస్తూ ఆయన స్పృహకోల్పోయారు. కాని ఆయన నోటితో చెప్పలేనిది నా చేతిలో ఉన్న ఆయన చేతుల స్పర్శ చూస్తే తెలుస్తుంది. ఎంత గట్టిపట్టు. ప్రాణభీతితో పరుగెత్తే లేడి భయం ఆ పట్టులో ఉంది. కొంచెంసేపటి తర్వాత నేను నిరాశ - నిస్పృహలతో ఆశోకవనానికి చేరుకున్నాను. మాటిమాటికి, కొద్ది క్షణాలక్రితం జరిగిన ఆ సంఘటన నా కళ్ళల్లో మెదులు తున్నది. తండ్రిగారి స్థానంలో నాకు శక్తిహీనుడు, ముసలి తనంలో మృత్యువును ఎదుటచూచి నోటమాటరాక పిచ్చివానిలా అటూయిటూ తిరుగుతున్న యయాతి కనిపించాడు.

'జీవితానికి చివర క్షణం మృత్యువే' అయితే మానవుడసలు జన్మించడ మెందుకు?'

కచ, అంగీరసుల వేదాంతం నాకు గుర్తుకొచ్చింది. కాని డోలాయమానంగా ఉన్న నా హృదయానికి దాని వలన తృప్తికలుగలేదు. మిలమిలమెరిసే మిణుగురులు అమావాస్య చీకటిని తొలగించలేవు.

శూన్యమైన మనస్సుతో శయ్యపైకి చేరాను. బయట అలుముకున్న చీకటి లాగానే నా మనస్సు కూడా అంధకారంతో నిండిపోయివుంది. నావైపు వీపువుంచి, ముకుళిక మెల్లగా వచ్చి దీపాన్ని వెలిగించింది. మందిరమంతా వెలుగుతో నిండి పోయింది. ఆ వెలుగులో ఆమె మరింత ఆకర్షణీయంగా, గోడపై పడిన ఆమె నీడ వింతగా, విచిత్రంగా గోచరించింది.

ఆమె మెల్లమెల్లగా నా మంచం దగ్గరకు రాసాగింది. ఆమె నడక నాట్యంలా వుంది. కనులు తెలచుకుని వున్న నన్ను చూస్తూ అన్నది -

'మహారాజుగారి మనస్సు బాగా వున్నట్లు లేదే!' ఆమె గొంతులో ఎంతో మార్దవంనిండిఉంది.

'నాన్నగారి పరిస్థితి చూస్తూ ఉంటే నాకేమి తోచడంలేదు'.

'విన్నాను, మీరేమి బాధపడవద్దు. మహారాజుగారికి అశుభ గ్రహాలదశ తొలగి పోతుందని జ్యోతిష్యులిప్పుడే చెప్పారు'.

'నాకు కొద్దిగా మదిర ఇవ్వు, - గ్రహాలు, అనారోగ్యం, మరణం అన్నీ మరచి పోవలనుకుంటున్నాను'.

ఆమె అక్కడే స్థబ్దంగా నిలబడిపోయింది. నేను కోపంతో అరిచాను. 'నాకు మదిర కావాలి'.

తలవంచుకుని చెప్పింది 'యువరాజా, ఇక్కడ మద్యం, మదిర వంటివి ఉంచ రాదని మహారాణిగారి ఆజ్ఞ'. నిజాని ఆమె జవాబుతో నాకు కోపంరావాలి. కాని ఆ సమయంలో నేలవైపు చూస్తూ నిలబడి ఉన్న ముకుళిక అందంగా కనిపించడం వలన నాకు కోపంరాలేదు. నిమీలితనేత్రాలతో ఆమెను నా కళ్ళల్లో బంధించాను. 'ఆహా! నేను చిత్రకారుణ్నో లేక శిల్పినో ఆయివుంటే ఎంత బాగుండేది'.

స్త్రీ స్వభావసిద్ధంగా మనోజ్ఞానం కలిగి ఉంటుందా? లేక ఆమెకు అందం, అవగాహన శక్తి ఎల్లప్పుడూ ఉంటాయా?

ముకుళిక నేలవైపు చూస్తూనే వున్నా, నేను ఆమె వైపు రెప్ప వాల్చ కుండా చూస్తునట్లు, ఆమె అందాన్ని కళ్ళతోనే ఆస్వాదిసున్నట్లు ఎలా తెలిసుకుందో, కను రెప్పలు ఎత్తి నన్ను చూచి నవ్వింది. ఆ నవ్వు నీలాకాశంలో తళుక్కున మెరిసె మెరుపులా ఉంది. ఆమె మధురాదరహాసం, నవ్వుతున్నప్పుడు ఆమె బుగ్గపై పడే సొట్ట, మత్తు గొలిపే ఆమె అందం - ఆ వెలుగులో, బంగారపు మెరుపు మెరిసి నట్లుగా ఉంది.

ఆమె నా మంచం దగ్గర నిలుచుంది. నేను మదిర సేవించలేదు. అయి నప్పటికీ నా శరీరంలోని అణువణువు మత్తెక్కినట్లుంది. 'యయూ, నన్ను గట్టిగా పట్టుకో, నాకు బ్రతకాలని వుంది'. అనే మాటలు నా చెవుల్లో ప్రతిధ్వనిస్తున్నాయి.

నేనెప్పుడూ మత్తుపానీయాలు సేవించనని చిన్నప్పుడు నా తల్లిగారికి మాట ఇచ్చాను. ఇప్పటివరకు ఆ మాటను నిలబెట్టుకున్నాను. కాని నేడు ఈ భయానక పరిస్థితుల కారణంగా ఏమి చేయాలోతోచక మత్తుపానీయాన్ని అడిగాను. నేను ముకుళికను అడిగాను, 'ఇక్కడ మత్తుపానీయం ఉంచరాదని నిజంగా అమ్మగారే ఆజ్ఞాపించారా?'

'ఔను, యువరాజా!'

'ఎందుకని? నేనిక్కడ మత్తులోపడి ఉంటానని భయమా?'

'అదికాదు, యువరాజా!'

'అయితే మరేమిటి?'

'ఇది పూర్తిగా ఏకాంత ప్రదేశం, ఋషులు ఇక్కడకు అతిథులుగా వస్తారు. వారికది అపవిత్రమైనది ..........'

తండ్రిగారి ఆవేదన నా చెవులలో ప్రతిధ్వనిస్తున్నది. ఆయన ప్రతిమాటలో ధ్వనించే మృత్యు భయం...........!

నా శరీరం భయంతో కంపించసాగింది. ఏకాంతం కారణంగా భయం కలుగసాగింది. నాకు ఎవరిదైనా తోడు కావాలనిపించింది.

నేను పక్కకు తిరుగుతూ ముకుళిక చేతిని పట్టుకున్నాను.

ఆ రాత్రి జరిగిన సంఘటన నా మనస్సులో మెదులుతున్నది.

వరద వెల్లువకు ఎదురీదటం మొగతనమనిపిస్తుంది. దానిలో కొట్టుకుపోవడం పిరికితనం కాదా? దానిలో కొట్టుకుపోవడాన్ని వర్ణించడంలో ఆనందమా?

ఆరాత్రి జరిగింది స్వాభావికం. బహుశా ప్రపంచంలో ప్రతిరాత్రి అలాగే జరుగుతుంది, జరుగుతున్నది, జరగబోతుంది. కాని కొన్ని అటువంటి సంఘటనలు జరిగేటప్పుడు స్వాభావికంగానే వుంటాయి. కాని చెప్పేటపుడు సంకోచం కలుగుతుంది. సిగ్గనిపిస్తుంది. బహుశా అందుకేనేమో దేవాలయంలో కూడా యువతులు తమ రవిక ముడివీడిపోయిందేమోనని మధ్యమధ్యలో చూచుకుంటూ వుంటారు.

కాని నేను నాకథ దాచకుండా ఉన్నటున్నట్లు చెపుతాను. నా మనస్సు విప్పి చూపిస్తాను. సిగ్గు సౌందర్యానికి సింగారం. సత్యానికి కాదు. నిజం అప్పుడే పుట్టిన పసిపాపలా నగ్నమైనది.

ఆ రాత్రి ముకుళిక కౌగిలలో నేను ....... కాదు!

నా కౌగిలిలో ముకుళిక ...... కాదు ....... కాదు!

ఆ సాక్షాత్తు ఆ మన్మథుడే ఎవరి కౌగిలిలో ఎవరున్నారో చెప్పలేడు.

ముకుళిక చేతిని నాచేతిలోకి తీసుకున్న తరువాత నాకు బాహ్యప్రపంచంతో సంబంధం లేకుండా పోయింది. అప్పుడు నేను యువరాజును కాదు. ఆమెదాసి కాదు. మేమిద్దరం ప్రేమైక జీవులం. ప్రేమపక్షులం ...........

మేము......... మందిరంలో లేము. అనంతమైన ఆకాశంలో, నక్షత్ర మండలం దాటి దుఃఖం, రోగం, మృత్యువు అనే మాటలు వినిపించని స్థానానికి చేరుకున్నాం. అది అందమైన అస్పష్టమైన లోకం. ఆ లోకం మాకే పరిమితం. అది మధురమైన మత్తుగొల్పే లోకమా? పిచ్చివారి లోకమా? లేక అందమైన సమాధా?

ఎవరికి తెలుసు?

మా అధరాల కలయికతో నా మనసులోని మరణ భయం మాయమైంది.

ఆ రాత్రి మేమిద్దరం ఎన్ని ముద్దులు పెట్టుకున్నామో.....?

ఎవరైనా ఆకాశంలోని నక్షత్రాలను లెక్కించగలరా?

నేను కావ్యాలలో స్త్రీ సౌందర్యం గురించి చదివాను. చాలాకాలంగా ఆవైపు నా మనస్సు ఆకర్షితమైవుంది. ఆ ఆకర్షణలోని ఆనందంకోసం ఎన్ని కలలుకన్నాను. కాని అది పసిపాప చందమామను చేతితో పట్టుకోవాలనే ఆనందం లాంటిది. అందమైన యువతి పొందు మత్తులాంటిదని ఆరాత్రి నాకు తెలిసింది. ఆమె ప్రతి అణువులో సుఖం జలయంత్రంలా ఎగచిమ్మింది. ఆ అనుభవపు మత్తులో నన్ను నేను మరచిపోయాను.

పక్షుల కలకలాలు ఆమత్తు నుండి నన్ను మేల్కొలిపాయి. కనులు తెరిచి కిటికీ గుండా బయటి ప్రపంచాన్ని చూసాను. సూర్యకిరణాల తాకిడితో ప్రకృతి బంగారంలా మెరిసిపోతుంది.

లేచి కూర్చున్నాను. నిన్నరాత్రి మనోవ్యథతో ఇదే మంచంపై దొర్లాను. కాని ఈ మంచం, భవనం, గోడలు, కిటికీల గుండా తొంగిచూచే లతలు ఒక్క రాత్రిలో పునర్జన్మ పొందినట్లున్నాయి. ఇప్పుడు ప్రతి వస్తువు నా ఆనందాన్ని రెట్టింపు చేస్తు న్నట్లున్నది.

ముకుళిక తలుపులు తెరచి లోపలికివచ్చి అడిగింది, 'రాత్రి బాగా నిద్ర పట్టిందా?'

నా ఎదుట ఆమె సిగ్గుపడుతుందని, నా కళ్ళలో కళ్ళు కలిపినపుడు కొద్ది క్షణాలైనా తడబడుతుందని నేను అనుకున్నాను. కాని ఆమె ఆ రాత్రి ఏమీ జరగ నట్లు ప్రశాంతంగా పనులు చేయసాగింది. జరిగిందంతా ఓ కల. మేల్కొన్న తరువాత కలలతో పనేమున్నది?

ముకుళిక మహానటి. ఆ రాత్రి నా ప్రేయసిగా ఉంది. ఇప్పుడు దాసిగా తన పనులను నేర్పుగా చేసుకుంటున్నది.

ఆమె ప్రశ్నకు సమాధానమేమివ్వాలో తెలియలేదు. ఆమె చిరునవ్వు నవ్వింది. కనుబొమలు అందంగా కదిలిస్తూ నావైపు చూసింది. నోరు, ముఖం శుభ్ర పరచు కునే సామగ్రి తెచ్చేందుకు ఆమె వెళ్ళుతుండగా ఆమె వెనక భాగాన్ని చూచి రాత్రి జరిగిన సంఘటన గుర్తుకొచ్చింది. అనుకోకుండా నానోట నుండి మాట వెలు వడింది,

'ముకుళికా!'

ఆగి, వెనుకకు తిరిగి నన్ను చూసింది. నా దగ్గరకువచ్చి అడిగింది. 'యువ రాజా మీరు నన్నెందుకు పిలిచారు?' ఆమెను నేనెందుకు పిలిచాను? నాకు తెలి యదు. నేను మౌనంగా ఉండిపోయాను.

చేతులు జోడించి వినయంగా నాతో అన్నది, 'నావలన ఏమైనా తప్పు జరిగిందా?'

'తప్పు నువ్వు చేయ్యలేదు, నేను చేశాను! నీవు లోపలికి వచ్చి నన్ను దగ్గ రికి తీసుకుంటావని అనుకున్నాను. కాని నీవు దాసిగా పనిలో నిమగ్న ......'

ఆవిధంగా అందామని అనుకున్నాను. కాని నోరు తెరిచి అలా అనలేక పోయాను.

నేను మౌనంగా ఉండడం ఆమెకు ఏదోలా అనిపించింది. మరింత వినయంగా అంది, 'మహారాజా వారికి ఈ దాసిపై కోపమా?'

'లేదు' అనే మాట నానోటి నుండి వచ్చింది. ఇంకా ఎదో అందామను కున్నాను. ఇంతలో మరోదాసి ఆతృతతో లోపలికి వచ్చింది.

నా గుండె వేగంగా కొట్టుకుంది. నిద్రలేచిన తరువాత తండ్రిగారు ఒక్క సారైనా గుర్తుకు రాలేదు. మనిషి ఎంత నిర్దయుడు. నాయీ ప్రవర్తనకు నాకే బాధని పించింది.

ఆ దాసి మంత్రిగారిచ్చిన ఉత్తరానిచ్చి వెళ్ళిపోయింది.

ఆ ఉత్తరం కచునిది. ఒక మునికుమారుడు దానిని అర్ధరాత్రి తీసుకొని వచ్చాడు.

'యువరాజా! నేను కూడా మీ వెనుకునే ఆశ్రమాన్ని వదల వలసి వచ్చింది. మనమంతా కలసి శాంతియజ్ఞాన్ని పూర్తి చేశాం. ఆ యాగాగ్ని ఆర కుండానే దేవ-దానవుల మధ్య యుద్ధం దావానలంలా వ్యాపించింది. మేమిక్కడ ఉన్నప్పుడే దానవుల గురువు శుక్రాచార్యుడు సంజీవినీ విద్య పొందినట్లు తెలిసింది. ఆయన ఆ విద్యద్వారా యుద్ధంలో చనిపోయిన రాక్షస వీరులను పునర్జీవితులను చేస్తున్నాడు. ఇప్పుడు అపజయం తప్పదని దేవతలు అనుకుంటున్నారు. ఇప్పుడేమి చేయాలో ఎవరికి ఏమీ తెలియడంలేదు'.

'ఏ యుద్ధాన్నయినా అది ఇద్దరు మనుషులమధ్యయినా, రెండు జాతులు మధ్యలేదా రెండు శక్తుల మధ్య అయినా మేము హర్షించం. ఆదిశక్తిచే సృష్టించ బడిన ఈ ప్రపంచం ఎంతో అందమైనది, సుసుంపన్నమైనది. ప్రతి ఒక్కరూ ఇక్కడ సుఖంగా మనుగడ సాగించలేరా? ఇది నా వంటి పిచ్చివాని కలయేనా? ఇది ఎప్పటికి వాస్తవ మవుతుందో! ఇప్పుడిది ఆలోచించటం వెర్రితనమా!'

'నిజంగా ఈ యుద్ధంలో దేవతలు ఓడిపోవడం ఖాయం. ఓటమి భరింప రానిది. ఈ ఓటమిని ఆపాలని నా ఉద్దేశ్యం. రాత్రంతా కుటీరం ముంగిట్లో అటూ ఇటూ పచార్లు చేస్తూనేవున్నాను. ఆకాశంలో నక్షత్రాలు మిలమిలమెరుస్తున్నాయి. కాని నా మనస్సులో చీకటి పరచుకుంది. ఈ మానసిక అశాంతిలో, ఏమి చెప్పను, నీవు చాలాసార్లు గుర్తుకొచ్చావు. ఆచీకటిలో నాకు ఒక ఉపాయం తోచింది ........ కాదు! కవికి అకస్మాత్తుగా కవితాస్ఫూర్తి కలిగినట్లు ఒక ఆలోచన కలిగింది'.

'దేవతలకు కూడా సంజీవినీ విద్య లభ్యమైతే ఓటమి ఆపగలం. కాని మూడు లోకాలలో ఈ విద్య కేవలం శుక్రాచార్యులకే తెలుసు. శిష్యునిగా మారి ఆయనకు సేవలు, చేస్తూ ఆ విద్యను నేర్చుకోవాలి. దేవతలలో అటువంటి సాహసికులెవరూ కానరాలేదు. కావున వృషపర్వని రాజ్యానికి వెళ్ళి శుక్రాచార్యుని శిష్యునిగా నేనే చేరాలని నిర్ణయించుకున్నాను. అచ్చట ఏమి జరుగుతుందో, ఎలా చెప్పగలను? నా కార్యం విజయవంతంకావాలని అనుకుంటున్నాను. బహుశా, ఆ కార్యనిర్వాహణలో నా ప్రాణాలు పోవచ్చును.

అంగిరస మహర్షి, నన్ను ఆశీర్వదిస్తూ, పుట్టుకతో నీవు బ్రాహ్మణడవు, యజ్ఞయాగాలు చేయ్యటం, చదవడం - చదువు చెప్పడం నీధర్మం. విద్యను నేర్చుకునేందుకు వెళ్తున్న నీ సాహసం క్షత్రియ పూరితమైందన్నారు. నేను సమాధాన మిస్తూ, యువరాజు యయాతి ఇక్కడ ఉండి ఉంటే నాతో రాక్షస రాజ్యానికి తీసుకు వెళ్ళే వాడిని, క్షత్రియోచితకార్యాలు అతనికి అప్పగించి నేను విద్యను నేర్చుకొనేవాడినని చెప్పాను.

అంగిరస మహర్షితో చెప్పలేకపోయినప్పటికీ నా మనసులో కొత్త ఆలోచనలు రేకెత్తాయి. ఇతర వర్ణాల భావాలు, గుణాలు మరోవర్ణం ఆచరించినంత మాత్రానే నష్టమేమిటి? అనేక నదుల నీటిని కలిపి మనం భగవంతుడైన సూర్య దేవుణ్ణి అభిషేకిస్తున్నాం.

'యువరాజా! శాంతి యజ్ఞం వలన మనం దగ్గరైనాం. సమాన వయస్కులమైనందున మన మధ్య స్నేహం బలపడింది. నీ స్నేహం నేను మరువలేను. సంజీవిని విద్యతో నేను ప్రాణాలతో తిరగివస్తే తప్పక నిన్ను కలుస్తాను'.

'కొన్ని గ్రహాల కలయక త్వరగా జరిగితే, కొన్నింటి కలయిక ఆలస్యంగా జరుగుతుంది. మనమెప్పుడూ తిరిగి కలుస్తామో నేను చెప్పలేను. కాని తప్పక కలుసుకుంటాం. నేనిప్పుడు సుఖస్వప్నంలో తేలుతున్నాను'.

'ఇంకా రాయటానికేముంది? హృదయంలోని భావాలు చెప్పటానికి వేదాలు కూడా అసంపూర్తిగానే మిగిలిపోతాయి. ఆచార్యులవారు మీకు ఆశీస్సులు తెలియజేయమన్నారు. దేవదేవుడైన ఉమాశంకరుని దయవలన నహుష మహారాజుల వారి ఆరోగ్యం త్వరగా కుదుటబడుతుందని ఆశిస్తాను'.

'ఆ...... ఒక విషయం వ్రాయడం మరిచాను. అమాయక బాలిక - మనిద్దరిలో ఎవరికి పూవు ఇవ్వాలో తెలియక అవస్థపడింది. నేను ఆశ్రమాన్ని వదలి వెళ్తున్నానని తెలిసి చాలా దుఃఖపడుతున్నది. ఆమె నాటిన ఆ తీగనిండా పూవులు వికసించాయి. పాపం, వాటినెవరు ఇప్పుడు ప్రశంసిస్తారో తెలియక ఆ అమ్మాయి బాధపడు తున్నది. యువరాజు యయాతి ఆశ్రమానికి తప్పకవచ్చి నీ ఈ పూవులను చూడడమేకాక వాటి సుగంధాలను ఆస్వాదిస్తాడని నేను అమ్మాయితో చెప్పాను'.

కచుని లేఖ చదివిన తరువాత, నా మనస్సు ఏదోలా అయిపోయింది. దొంగలా నిశ్శబ్దంగా మంచంపై కూర్చున్నాను. మనస్సంతా విషాదంతో నిండి పోయింది. కచుడు తన వాళ్ళకోసం ప్రాణత్యాగానికి సిద్ధపడ్డాడు. మరి నేను? తండ్రి గారు ఆఖరి క్షణాలను లెక్కిస్తుంటే నేను సుఖాన్ని వెతుక్కుంటూ ............

సుగంధభరితమైన అందమైన పూవులు దూరం నుండి చూడడానికే ఉన్నాయా? వాటిని వాసన చూస్తే ఏ పాపం కలుగుతుంది? ముకళిక నాకు అందంగా కనిపించింది.

నేను............

నేను పాపం చేసానా? నిన్న రాత్రి నేను పాపపుపని చేశానా?

పాపపు తలపుతో నా మనస్సు వికలమైంది. తేనె గ్రోలుతూ ఉంటే తేనెటీగలు తేనె పట్టునుండి బయటకు వచ్చి శరీరాన్ని జోరుగా కుట్టినట్లుంది -

శయ్యపై నుండి లేస్తూ ముకుళికతో చెప్పాను -

'రథం సిద్ధం చెయ్యమని చెప్పు'

'మీరు ఇలాగే వెళ్ళిపోతారా?'

'ఔను!'

'ఎక్కడికి?'

'నగరానికి వెళ్ళి, తండ్రిగారి దర్శనం చేసుకోవాలి, తల్లిగారి ఆశీస్సులు పొందాలి.'

'కొద్దిగా అల్పాహారాన్ని..........'

'మధ్యలో కల్పించుకోవద్దు. దాసీల ఉపదేశాలు వినే అలవాటులేదు. చూడు, సాయంత్రం నేనిక్కడకు రాను, రాజభవనంలోనే ఉంటాను!'

'కాని..................'

'కానీ ఏమిటి..........?'

'యువరాజుగారు రేయంబవళ్ళూ అశోకవనంలోనే ఉంటారు. వారికి పూర్తిగా విశ్రాంతి లభించాలనీ, అన్నీ విధాల వారి మనస్సును ప్రసన్నంగా ఉంచాలనీ మంత్రిగారి ఆజ్ఞ'.

'మంచిది. అదంతా నేను విన్నాను'

'అయితే సాయంకాలం విశ్రాంతి ...........'

'నేను రాను!'

నాన్నగారి ఆరోగ్యంలో ఏమాత్రం మార్పులేదు. ఆయన పగలు కోలు కుంటు న్నారు. సాయంత్రం కాగానే ఆయనలో ఆయన ఏదో మాట్లాడు కుంటున్నారు. నాన్నగారి పాదాలుతాకి వేదనతో నిండిన మనస్సుతో తల్లిగారి భవనం వైపు వెళ్ళాను. అమ్మ తన భవనంలో ఏర్పాటు చేసుకున్న బంగారపు దేవాలయం ఎదుట చేతులు జోడించి కూర్చుని ఉన్నారు. ఈ కొద్దిరోజులలోనే ఆమె బాగా చిక్కి పోయింది. ఆమె వేదనను నేను చూడలేకపోతున్నాను.

ఆమె దగ్గరకు వెళ్ళి కూర్చున్నాను. ఆమె ఆప్యాయంగా నావీపు నవరించింది.

ఆ మందిరంలోని విగ్రహాన్ని, తల్లిగారి వేదనను చూడగానే నాలో దుఃఖం మరింత పెరిగింది. అనుకోకుండా రాత్రి జరిగిన సంఘటన మనస్సులో మెదిలింది. అది పాపమా? అలా ఆయితే ఈ భగవంతుని ఎదుట, తల్లిగారి సమక్షంలో బాహటంగా తప్పుఒప్పుకుంటే పాపం పోతుందా?

కళ్ళెత్తి తల్లిగారిని చూడడానికి సాహసించలేకపోయాను.

నా ముఖాన్ని తనవైపు తిప్పుకుంటూ అమ్మ అడిగింది - 'నా దగ్గర ఏదో దాస్తున్నట్లున్నావు?'

'అప్పటికీ ఆమెవైపు నేను చూడలేకపోయాను. ఆమె నెమ్మదిగా అన్నారు. 'అశోక వనంలో రాత్రంతా నీవు మాకోసం బాధపడినట్లున్నావు. నీవు చాలా సున్నిత మైనవాడవు. ప్రతి మాట పట్టించుకుంటావు. పిచ్చివాడా! సమస్య లెవరికి లేవు? భగవంతుడైన శంకరుడు హాలాహలాన్ని త్రాగుతున్నప్పుడు పార్వతీదేవి వెక్కి వెక్కి ఏడ్చింది. నిన్న నేను ఆ కథ విన్నాను'.

'అమ్మా! కాని'

'కాని - గీని లేదు. చిన్నవాడవు. బాధతో చిక్కిపోయావు, చెప్పు, మా అవసరం ఏదైనా వుందా? పిచ్చివాడిలా ప్రవర్తించుకు, మనస్సును సంగీత, సాహిత్యాలలో లగ్నం చేసేందుకు ప్రయత్నించు'.

అప్పుడే మంత్రిగారు లోపలికి వచ్చారు. అమ్మ ఆయినతో అంది, - 'అమాత్యా, అశోకవనంలోని ఏర్పాట్లలో ఏమైనా......'

మంత్రి అమ్మగారి మాటలను మధ్యలోనే తృంచుతూ అన్నారు. 'దేనికీ లోటు లేదు. ముకుళిక అనే అందమైన నేర్పుగల దాసి యువరాజా వారికి కావలసిన అన్ని ఏర్పాట్లు చూస్తూ ఉంది.......'

నేను ఉలికికపడ్డాను. నిన్నరాత్రి జరిగింది తప్పో, ఒప్పో, పాపమో, పుణ్యమో, అది మంత్రిగారి అనుమతితో జరిగిందా? లేకపోతే ఒకదాసి ముకుళిక ఇంత సాహసం చేయగలదా? ఇదంతా క్షమించదగినదేనా?

అమ్మ మంత్రిగారితో అంది, 'అయితే అక్కడి ఏర్పాట్లు ఎక్కువ ఆయినా యయూ మనస్సుకు సంతోషం కలిగినట్లు లేవేమో?' నవ్వుతూ ఆమె మరల అన్నది, 'మీకు మరోసారి చెప్పనక్కరలేదు, మా కుటుంబంలోనివారు ఇంద్ర లోకంలో కూడా సుఖంగా ఉండరు! పగలంతా యయూ సంగీత, సాహిత్యాలతో మునిగి ఉంటే ఆతని మనస్సు త్వరగా కుదుటపడుతుంది'.

'రాజకవి రెండవ కుమారుడు మాధవుడు మంచి మాటకారి, రసికుడు, పగలంతా అతనిని యువరాజు గారి సేవలో ఉండమని కబురు పంపుతాను'.

నేను నవ్వటానికి ప్రయత్నిస్తూ అన్నాను, 'జనన, మరణాలకు సంబంధించి అనేక చిక్కు ప్రశ్నలతో నా మనస్సు నిండి వుంది. ముందు నన్ను ఒక పండితుని వద్దకు తీసుకువెళ్ళమని మాధవుడికి చెప్పండి'.

# అధ్యాయం 7

మాధవుడు నన్ను ఒక మహాపండితుని వద్దకు తీసుకు వెళ్ళాడు. అతనిపై రకరకాల ప్రచారాలున్నాయి. మార్గమధ్యంలో ఒక్కొక్కటి నాకు చెప్పసాగాడు.

'పూర్ణిమ, అమావాస్య రోజులలో ఆయన తన కుటుంబ సభ్యులతో కలసి భోజనం చేస్తారు. మిగిలిన రోజులు ఆయన చదువుకునే గదిలోనికే భోజనం పంపిస్తారు. అప్పుడు ఆయనకు ఏ వారమూ గుర్తుండదు. ఆయన గదిలో హిమాలయం ఎత్తంత గ్రంథాల దొంతరులు ఉన్నాయి. ఆ గ్రంథాల దొంతర్ల మధ్య కూర్చుని పుటలు తిరిగవేస్తూ కొండ గుహలో తపస్సు చేసుకొనే మునుల వలె కనిపిస్తాడు'.

'ఒక్కసారి ఆషాఢ మాసపు అమావాస్య, అర్ధరాత్రి, ఒకదొంగ ఆ ఇంటిలో ప్రవేశించాడు. అప్పుడు ఆయన ఏదో శ్లోకం శబ్దాల అర్థం తెలుసుకొనటానికి గ్రంథాల దొంతర్లలో ఉన్న నిఘంటువుకై వెదుకుతున్నారు. చేతిలో దీపంతో, పెరిగిన గడ్డం, కృశించిన శరీరంతో ఉన్న ఆయన భూతంలా కనిపించగానే దొంగ భయపడి పారిపోయాడు'.

'ఒకసారి ఆ పండితుడు రాజ సభకు వెళ్ళారు. అక్కడ జరిగిన నాట్యాన్ని చూడకుండా తలవంచుకొని నోటిలోనే ఏదో శ్లోకాన్ని చదువుకుంటున్నారు. ఒకసారి ఒక జటాదారి అయిన యతి పరమాత్మ స్వరూపాన్ని చర్చించడానికి వచ్చారు. చర్చ మంచి రసపట్టులోవుంది. మధ్యలో పండితులు యతిని ప్రశ్నించారు, '-మీరెప్పుడా గడ్డం, తల గీయంచు కుంటారు? గుండుకు, పరమేశ్వరునికి సంబంధమే మిటో? అర్థం కాక ఆ యతి పండితుని చూస్తూ ఉండిపోయారు. పండితుడు గట్టిగా అరిచాడు, 'యతిరాజా! దట్టమైన అడవిలోని

భూమిని చేర డానికి సూర్యకిరణాలు చాలా కష్టపడవలసి వుంటుంది. ఈ జడల కారణంగా 'మీకుకూడా పరమాత్ముని విషయాలు తలకెక్కక మధ్యలో చిక్కుపడిపోతాయి'.

ఒక్కసారి పండితుని ఇంటికి వచ్చిన పశ్చిమ ఆర్యావర్తపు శాస్త్రిగారు ఆయనను ప్రశ్నించారు, 'మీకెంతమంది పిల్లలు?' - ఆయన వెంటనే సమాధానం చెప్పారు - 'నాకు తెలియదు, నా భార్య నడగండి. ఇటువంటి ప్రశ్నలు వేసి నా కాలాన్ని పాడు చేయకండి. కాని ప్రతి పిల్లవాని నామకరణ విషయంలో భార్యభర్తల మధ్య కీచు లాట ప్రారంభమౌతుంది. అప్పుడు ఆయన మాటే చెల్లుతుంది. ఆమె మాటకు విలువనివ్వరు. మాయ, ముక్తి, ప్రకృతి, తితిక్షా ఇవి ఆయన తన కుమార్తెలకు పెట్టిన పేర్లు. ఆయన ఒక్కగానొక్క కొడుకు పేరు యముడు. ఆయన భార్య చేతులు జోడించి అన్నది, 'అంత భయంకరమైన పేరు పెట్టువద్దు', మంచి మాటలు ఆయన ఎప్పుడూ చెవిన పెట్టలేదు. 'యమ' - నియమంలో ఉన్న 'యమ' శబ్దం అని చెప్పి ఆయన ఆమె నోరు మూయించారు. ఐదు సంవత్స రాల వయస్సు వచ్చిన తరువాత ఆ పిల్లవాడు తనతోటి పిల్లలతో ఆడు కుంటున్నాడు. పిల్లలందరూ అతనిని ఎగతాళి చేస్తూ ఏడిపిస్తున్నారు - 'ఏరా, యముడా, నీ దున్నపోతు ఏది?' - అది విని ఏడుస్తూ పేరు మార్చమని తండ్రిని కోరాడు.

మాధవుని మాటతీరు ముచ్చటగా వుంటుంది. ఆ మాట ఈ మాట కలిపి చెప్పేటప్పుడు విని నవ్వు ఆపుకోవడం అసంభవం. పండితుల పాండిత్య కారణంగా వారి జీవన విధానం వేరుగా ఉంటుంది. అందువలన వారిని గూర్చి చెప్పేటప్పుడు కొన్ని కలిపి చెప్పటం వలన హాస్యంగా ఉంటుంది. ఆ పండితునికి సంబంధించిన కొన్ని విషయాలు నేనూ విన్నాను.

పండితునికి సంబంధించిన మాధవుడు చెప్పిన కథలు ఎంతవరకు నిజమో నాకు తెలియదు. కాని అవి వినటానికి రసభరితంగా వున్నాయి. మనస్సులో అలుముకున్న చీకటి కొంత తొలగింది.

ఆ పండితుడు తను చదువుకునే గదిలోనే మమ్మల్ని గౌరవించారు. అక్కడ పడివున్న గ్రంథాల దొంతర్లు, కళ్ళకు దగ్గరగా పుటను వుంచి చదవడం, కృశించిన

దేహం చూస్తుంటే యతి, గుహ జ్ఞాపకం వచ్చాయి. ఆయనతో మాట్లాడు తుంటే ఆ గదే ఆయన లోకం అని అర్థమైంది. చిరిగిపోయిన ఒక పుస్తకంలోని ఒక పుటను నాకు చూపిస్తూ చాలా ఆనందపడ్డారు. ఆయన పాండిత్యం చూస్తే ప్రతి ఒక్కరూ తలవంచి నమస్కరించవలసి ఉంటుంది. నేనొక ప్రశ్నవేస్తే దానికి జవాబుగా ఎన్నో వినిపించి తన అభిప్రాయానికి బలంగా ఎన్నో ఆధారాలు చూపించారు.

కాని ఆయన పాండిత్యంలో నా మానసిక అశాంతికి కారణభూతమైన ప్రశ్నలకు జవాబు చెప్పగల సామర్థ్యం లేదు. మృత్యువనే భావన వలన నా మనస్సులో అశాంతి రేగుతుందని ఆయనతో చెప్పాను.

ఆయస నవ్వుతూ అన్నారు. 'యువరాజా! మృత్యువు నుండి ఎవరు తప్పుకో గలిగారు? వస్త్రం పాతదైనప్పుడు మనం దానిని విసరివేస్తాం కదా? అదేవిధంగా ఈ ఆత్మ కూడా శరీరాన్ని వదిలి వేస్తుంది'.

నేను ఆయన మాటలను మధ్యలోనే ఆపి అన్నాను - 'అందరూ ముసలి వారైన తరువాత మరణిస్తే మీరు చెప్పినది సరిపోతుంది. కాని జీవిత నియమాలు మీరు చెప్పిన విధంగా ఉన్నాయా? పసిపిల్లలు, యౌవనవంతులు మరణించడం మనంచూస్తున్నాం - ఇందుకు కారణమేమిటి?'

మాటల మధ్యలో మాధవుడు అన్నాడు - 'మా అక్క విషయం చూడండి! ఎంత ఆరోగ్యవంతురాలు. మంచి స్వభావం కలిగి ఎప్పుడూ నవ్వుతూ వుండే ఆమె మూడునెలల పసిపాపను వదలి రెండు పదుల వయస్సులోనే చనిపోయింది. ఇందులో భగవంతుడు ఎంత అన్యాయం చేసాడు? పాతది, చిరిగిపోయిన వస్త్రం వంటి శరీరం అనే మాట ఎక్కడుంది?'

పండితుడు కొద్దిసేపు మాధవునివైపు గుర్రుగా చూసారు. నా వైపు తిరిగి చెప్ప సాగారు, 'యువరాజా! నా మాట ఒకటి గుర్తుంచుకోండి. మీ అనుమానం అప్పుడు దూరమవుతుంది'.

'ఏమిటిది?'

'ఇదంతా మాయ'

'అంటే'

'ఈ ప్రపంచంలో ఒక్కటే సత్యం'

'ఏమిటిది?'

'ఈ సృష్టికి మూలం ఆయన బ్రహ్మ తప్ప మిగిలినదంతా మాయే! మాధవుడు, యువరాజు - పుస్తకాలు, ఇల్లు, చావుకు భయపడడం ఇవన్నీ మిథ్య'.

నా మనస్సులోనున్న మరణభయం అబద్ధమా? అయితే జీవించడంలో నాకు కలిగిన ఆనందం కూడా అబద్ధమేనా! నిన్నరాత్రి ముకుళికతో పొందిన ఆనందమూ అబద్ధమే. దేవతలు మిథ్య, దానవులు మిథ్య, ఆయితే దేవదానవుల మధ్య యుద్ధాన్ని ఆపుచేయడానికి శాంతియాగం చేయడానికి ఎందుకు కష్టాలుపడ్డారు? సంజీవని విద్య నేర్చుకునేందుకు కచుడు ఎందుకింత సాహసం చేసినట్లు? కళ్ళకు కనిపించిన ఈ చరాచర ప్రపంచం, మనసుకు కలిగే ఈ సుఖదుఃఖాల అనుభవం అంతా కేవలం మాయేనా! అయితే నహుష మహారాజు అనారోగ్యం గురించి నా మనస్సు ఎందుకింత బాధపడుతున్నది? శరీరం నశించవచ్చు. కాని మిథ్యకాదు. ఉత్కంఠ కలిగించే సుఖదుఃఖాల అనుభూతి కాలంతో కరిగిపోవచ్చును. కాని అది అసత్యం కాదు. ఐదు రకాల పదార్థాలు అసత్యంకాదు. దాని వలన కలిగిన ఆనందం అసత్యంకాదు.

ఆ పండితుడు ఎన్నో పుస్తకాల నుండి శ్లోకాలు నాకు వినిపించారు. వాటి అర్థాన్ని తెలియ చెప్పారు. అయనప్పటికీ నా సందేహం తీరలేదు.

మాధవుని పట్టుదల మీద అతని ఇంట్లో ఆపూట భోజనం చేసి రెండు మూడు గంటలు ఉండి రాజప్రాసాదానికి తిరిగి వచ్చేందుకు నిర్ణయించుకున్నాను.

మాధవుని అన్నకు కవితలు వ్రాయడం, వినిపించడం చాలా యిష్టం. చిన్నప్పుడు అతని పేరు నేను చాలాసార్లు విన్నాను. అతనిగూర్చి అడిగాను. అతను భార్యా వియోగంతో తీర్థయాత్రలు చేస్తున్నట్లు మాధవుడు చెప్పాడు. ఆ మాట విన్న తరువాత పండితులు చెప్పిన వేదాంతం వాస్తవిక అనుభూతికి చాలా దూరం అనే సంగతి తెలిసుకున్నాను.

ఇంటికి వెళ్ళే త్రోవలో మాధవుని అన్నగారు ప్రసిద్ధమైన కవిగా ఎలా పేరు పొందాడో నాతో చెప్పాడు.

రాజధానిలో కవితల పోటి ఏర్పాటుచేశారు. అందులో పాల్గొనేందుకు దూర ప్రాంతాల నుండి ఎందరో కవులు వచ్చారు. వారితో పోల్చుకుంటే మాధవుని అన్నకు పేరు ప్రఖ్యాతులు అంతగా లేవు. 'చంద్రుని కళంకం' అనే శీర్షికతో కవులు కవితలు వినిపించసాగారు. మొదట్లో మాధవుని అన్న అందులో పాల్గొనలేదు. చంద్రునిపై మచ్చను కొంతమంది కమలంపైనున్న తుమ్మెద అని, హిమాలయ శిఖరం పైనున్న నల్లని రాయని వర్ణించారు. ఆఖరున పంచనదుల ప్రాంతం నుండి వచ్చిన కవి చంద్రుణ్ణి అందమైన యువతి స్తనమని, మచ్చని చూచుకమని వర్ణించాడు. ఈ కల్పనా చాతుర్యానికి ప్రేక్షకులు ముగ్ధులయ్యారు. ఈ కవికే బహుమతి ఇవ్వబడు తందని అందరూ అనుకున్నారు. రసరాజు శృంగారానికిది విజయం అన్నారు.

ఇంకా ఎవరైనా ఈ పోటీలో ఇప్పుడు పాల్గొన దలిస్తే పాల్గొవచ్చునని న్యాయ నిర్ణేతలు ప్రకటించారు.

మాధవుని సోదరుడు లేచి నిలబడ్డాడు. చంద్రినిపైనున్న మచ్చ ప్రకృతిమాత తనచిన్నారి పిల్లవానికి ఇతరుల దృష్టి తగలకుండా ఉండానికి పెట్టిన దిష్టిచుక్క అని సుందర పదాలతో వర్ణించాడు. అతని కవిత శ్రోతలందరికి నచ్చింది. బహుమతి అతనికి లభించింది. అది శృంగారంపై వాత్సల్యరసానికి లభించిన విజయం.

ఇంటి ద్వారం దగ్గర మాధవుని అన్న కూతురు మాధవుని కొరకు ఎదురు చూస్తూ వుంది. ఆ అమ్మాయి అందమైన బొమ్మలా వుంది. గాలికి ఎగురుతున్న ముంగురులు, రత్నాల్లాంటి కళ్ళూ, చిగురుటాకులవంటి పెదవులు, అందమైన చుబుకం - ఆమె మమ్మిలను చూసి తళుక్కమనే మెరుపు తీగలాగా నిలబడింది. పూవుపై వాలిన అందమైన సీతాకోక చిలుకలా వుంది. మాధవుని చూడగానే ఆ అమ్మాయి సీతాకోక చిలుకలా ఎగురుతూ రథం దగ్గరికి పరుగెత్తుకు వచ్చింది. మాధవుని మెడచుట్టూ తన మృదువైన చిన్నిచేతులు వేసి ముద్దుగా నావైపు చూస్తూ అడిగింది, 'చిన్నాన్నా ఈయన ఎవరు?'

'తారకం నమస్కారం చేయి'

'నమస్కారం చేయడానికి ఈయన భగవంతుడా?'

'ఈయన యువరాజుగారమ్మా'

'ఈ యువరాజు ఏమౌతారు?'

ఆ ప్రశ్నకు సమాధానం చెప్పేందుకు మాధవుడు అవస్థపడ్డాడు. కొంచెం ఆలోచించి చెప్పాడు. 'ఈ రథం, గుర్రాలు, అన్నీ ఈయనవే, అందుకే ఈయనను యువరాజు అంటారు'.

నా వైపు చూస్తూ కోమలమైన తన చేతులు జోడించి, 'నమస్తే, యువరాజా!' అంది తారక.

నేనే ఓ చిత్రకారుణ్ణై వుంటే! ఈ అందాల బాలిక సుందర ఆకృతిని చిత్రించి వుండేవాణ్ణి.

'నమస్తే అంటూ' రథం నుండి దిగి ఆ బాలికను ఎత్తుకున్నాను. నా తరువాత మా అమ్మగారికి సంతానం కలుగులేదు. తమ్ముడు గాని, చెల్లిగాని ఆడిం చేందుకు లేకపోవటంవలన నా మనస్సులో ఆ అసంతృప్తి ఉండిపోయింది. ఆ కోరిక తీర్చికునేందుకు సమయం వచ్చింది.

ఇంటిలోకి వెళ్తూ మాధవుడు తారకను ఒడి నుండి దిగిపొమ్మని సైగచేశాడు. కాని అమ్మాయి ఆవైపే చూడలేదు. ఆ అమ్మాయి నన్నడిగింది.

'యువరాజా! మీరు నాకు గుర్రం ఇస్తారు?'

'ఎందుకు?'

'నేను వాటిపై కూర్చుని దూరంగా వెళతాను'

'ఎక్కడికి?'

'వాహ్యాళికి'

'వాహ్యాళికి వెళ్ళేందుకు గుర్రమెందుకు? ఏదైన పక్షిపై కూర్చుని వెళ్ళాలి! కాకి మీదో! లేక ..........!'

మేము వసారాలోనికి వచ్చాం. అయినా బాలిక చెట్టునంటి పెట్టుకున్న పండు లాగా అతుక్కునే వుంది.

నేను కూర్చున్నాను. నా ఆభరణాలతో ఆడుకుంటూ ఆమె అంది, 'మీ గుర్రంపై కూర్చుని రేపు నేను దేవుని దగ్గరకు వెళతాను'.

'మంచిది, ఎందుకు?'

'మా అమ్మ అక్కడికి వెళ్ళింది. ఎన్నో రోజులయ్యిందో, ఇప్పుడు తిరిగి వస్తుందో రాదో'.

నేను మాధవుని వైపు చూశాను. తారక మాటలు ఏవిధంగా ఆపాలో తెలియక అతను సందిగ్ధంలో పడ్డాడు.

నా ఒడిలోనున్న తారక తలగోక్కుంటూ చెప్పింది, 'నేనిప్పుడు మీ గుర్రాలను వెళ్ళనివ్వను'.

'ఎందుకు?'

'ఈరోజు పెళ్ళి'.

'ఎవరికి, నీకా?

'ఊహు! నా బొమ్మకి'

'ఎప్పుడు?'

'పెండ్లికొడుకు ఎక్కడ?'

'పెండ్లికొడుకా?' అంటూ చేతులతో లేడని సైగ చేసింది. అలా అంటు న్నప్పుడు ఉన్న ఆమె భంగిమ మరచిపోలేనిది.

తారక బొమ్మకు ఎల్లుండి పెళ్ళి నిశ్చయమైంది. కాని ఇప్పటి వరకూ పెండ్లి కొడుకు ఎవరో తెలియక పోవడం ఆశ్చర్యకరమైందే.

ఆమెను ఆట పట్టించాలనే ఉద్దేశంతో నేను అన్నాను, 'నీ బొమ్మ పెళ్ళికి నా గుర్రాన్ని ఇస్తాను. కానీ నువ్వు, పెండ్లి కొడుకుని ఎక్కడ నుండి తెస్తావు?'

'మీరు నిజం చెప్పారు. ఔను పెండ్లికొడుకును ఎక్కడనుండి తెస్తాను?' అంటూ తన అరచేతిలో గడ్డం ఉంచుకుని ఆలోచనలో పడింది.

కొద్దిసేపు తరువాత తలెత్తి గంభీరంగా ప్రశ్నించింది. 'ఓ యువరాజా! మీరు నా బొమ్మకు పెండ్లికొడుకుగా ఉంటారా?'

అంతలోనే మాధవుడు వచ్చాడు, తారక వేసిన ఆ ప్రశ్నవిన్నాడు. ఇంకో సమయంలో అయితే ఆ అమ్మాయి వీపు చిట్లేది. ఏమి చేయలేక చేతులు నలుపు కుంటూ ఉండిపోయాడు. హస్తినాపుర యువరాజు ఈ తారక బొమ్మకు పెండ్లి కొడుకుగా ఉండడమా! ఈ అమ్మాయి ఊహ అనూహ్యమైనది. నేను వివాహ చిత్రాన్ని ఊహించుకోసాగాను. ఒకవైపు చిన్న బొమ్మ, మధ్యలో చినిగిన దోవతి పట్టుకున్న మాధవుడు, రెండవ వైపు లావుగా ఎత్తుగా యయాతి.

తారక ఆటపాటలతో భోజన సమయం వరకు ఎలా గడిచిందో తెలియ లేదు. భోజన కార్యక్రమం పూర్తి అయన తరువాత రథసారథితో చెప్పాను. 'మేము ఇక్కడే విశ్రాంతి తీసుకుంటాం. ఎండ తగ్గిన తరువాత రథం తీసుకురా. ఈ రోజు రాత్రి మేము రాజమహల్‌లోనే ఉంటా'.

మూడవ ఝామున మాధవుడు తన అన్నగారి కవితలు చదవడానికి ఇచ్చాడు. చేతికి వచ్చిన పుటను తెరచి చదవసాగాను.

ఆ పుటలో సాగర దర్శనం అనే కవిత ఉంది. సాగరంలో లేచిన ఉత్తుంగ తరంగాలు, వేయి గుఱ్రాల రథంపై కూర్చుని వరుణుడు భూమిపైకి దండెత్తి వస్తున్నాడన్నట్లున్నాయి. ఈ అద్భుతమైన కల్పన నా మనస్సుకు హాయిని కలిగించింది. తరువాత ఉత్తుంగ తరంగాల వలన ఏర్పడిన నురగను గుఱ్రాలు పరిగెత్తి నపుడు చెల్లాచెదురైన వాటి జూలుతో పోల్చడం కవియొక్క సునిశిత పరిశీలనా శక్తిని తెలియజేస్తుంది.

సముద్రం పై రాసిన కవితలోని ఒక చరణం

'ఓ ఉన్మత్త సాగరమా! వ్యర్థంగా గర్జించుకు. నీవు కొద్దికొద్దిగా భూమిని ఆక్రమించుకుంటున్నావు. ఇప్పుడు నీ అదృష్టం బాగుంది. కొద్ది సేపటి తర్వాత నీ అదృష్టం నీకు తెలుస్తుంది. అది నీకు మర్యాద రేఖను గీస్తుంది. దాన్ని దాటడం

నీ తరంకాదు. ఇంతేకాదు, నీ అదృష్టం మారితే నీవిప్పుడు ఆక్రమించిన భూ భాగాలు ఒక్కొక్కటి తిరిగి అప్పగించి ఆమె పాదాలుచెంత శిరస్సు వంచుకోవలసి ఉంటుంది. ఐశ్వర్యం పొందిన మానవునికి గర్వం పనికిరాదు. అదృష్టం ఎప్పుడు ఎలా మారుతుందో చెప్పలేము, అందుచేత ఆపదలు వచ్చినప్పుడు ధైర్యాన్ని కోల్పోరాదు.

ఆ.అదృష్టాన్ని గురించి ఇంతమంచి కవిత రాయగలిగిన మాధవుని అన్న తన భార్య మరణం తరువాత కలిగిన జీవన పరిణామాలను కొంచెం కూడా ఊహించ లేక పోయాడా? ఇప్పుడు అతను ఎక్కడ ఉన్నాడు? అతని మనసులో ఎలాంటి ఆలోచనలు ఉన్నాయి? సాయంకాలపు నీడలు చూచి నప్పుడైనా తారక జ్ఞాపకాలు బాధించవా? ప్రతి ఇంటిలో దీపాలు వెలుగుతున్నాయి. మగవారంతా తమ పనులు పూర్తి చేసికొని ఇంటికి తిరిగి వెళ్తున్నారు. వారికి స్త్రీలు నవ్వుతూ స్వాగతం చెప్తున్నారు. వారి ఆ కలయికకు సంబంధించిన ఊహ చాలా మధురంగా వుంది. ఇలాంటి భావాలకు అతనెలా స్పందిస్తాడు?

రాజభవనం నుండి బయలుదేరినపుడు ముకుళిక గుర్తురాలేదు. ఇప్పుడు ఆమె అందమైన ఆకృతి నాకళ్ళముందు కదలాడుతున్నది. అది మరచిపోవాలని ఆ గ్రంథంలోని మరో పుట తిప్పాను. అందులో -

'కైలాస పర్వతం ఎంత ఎత్తుగా వుంది? ఆ కైలాస పర్వత శిఖరం ఎప్పుడూ ఆకాశాన్ని చుంబిస్తున్నట్లుగా వుంటుంది. అక్కడ చలి కూడా భయంకరంగానే వుంటుంది. ఎటూ చూసినా మంచే! భోళాశంకరుడు విభూతి శరీరానికి అలంక రించు కుంటున్నప్పుడు అది గాలిలో ఎగురుతూ అలా పడిందేమోననిపిస్తుంది. ఇలాంటి ప్రాంతాన్ని పార్వతీ పరమేశ్వరులు ఎందుకు తమ నివాస స్థానంగా ఎంచు కున్నట్లు? శంకరుని చూస్తే నిర్ధనుడు, దిగంబరుడు. ఇక్కడ తినడానికి కంద మూలాలు గానీ, కప్పుకునేందుకు గుడ్డలుగానీ దొరకడం కష్టం.

'వారు తమ సంసార జీవనానికి మరో స్థానాన్ని ఎందుకు ఎన్నుకోలేదో చెప్పనా?'

యథార్థానికి ఉమామహేశ్వరులు తమ స్వేచ్ఛాశృంగారానికి ఏకాంతాన్ని కోరు కున్నారు. ఎవ్వరూరాని ఏకాంత స్థలంవారికి కావాలి. శంకరుడు ఉమాదేవితో తనవి

తీరా పాచికలాడుకోవటానికి, ఆ ఆటలో ఓడిపోయినప్పుడు శంకరుడు వాటిని చెల్లాచెదురుగా విసరివేయటానికి, అప్పుడు అలిగిన ఉమాదేవిని కౌగిట్లో బిగించి అలకతీర్చాలి. అందుకే వారీ కైలాసాన్ని ఎన్నుకున్నారు.

'దీనిని మీరు నమ్మలేక పోతే విష్ణుమూర్తిని అడగండి. ఆయన కూడా సాగరంలో శేషశయ్యపై ఎందుకు శయనించాడో! తన ఏకాంత సుఖాన్ని ఎవరూ భంగ పరచకుండా ఉండటానికేమో!'

ఆ కవిత చదవిన తరువాత ముకుళిక రూపం మరింత ఆకర్షణీయంగా నా కళ్ళముందు నిలచింది. మనస్సు అశోకవనం వైపు లాగసాగింది. ఉదయం ఆమెపై అనవసరంగా కోపగించాననిపించింది. జరిగిన దానిలో ఆమె తప్పేముంది? ఆమె నా దగ్గర కొద్దిపాటి ............?

ముకుళిక గూర్చి తరచూ ఆలోచించడం బాగుండదు. నిన్నరాత్రి జరిగింది పాపమా కాదా అనే ఆలోచన కన్నా నేటి నుండి అలా జరగనివ్వకూడదు. మరెప్పుడూ జరగనివ్వరాదు.

తిరిగి నేను కవిత చదవ సాగాను - 'స్త్రీ వంటి విలక్షణమైన దేవి ఈ మూడు లోకాలలో దొరకుతుందా? ఆమె కౌగిలిలో అమర సుఖాన్ని పొందిన వారు ఈ ప్రపంచంలో సాహసోపోతమైన పనులు చేశారు. గొప్ప వీరుల, కవుల జీవిత చరిత్రలు దీనినే తెలియజేస్తున్నాయి. ఇందుకు విరుద్ధంగా ఉన్నవారి జీవితంలో శూన్యం కనిపిస్తుంది. ఈ ప్రపంచంలో దొంగసాధువులు, సన్యాసులు ఎందరు లేరు?'

చదివినకొద్దీ నాలో అశాంతి పెరుగుతున్నది -

'ఓ రమణీ! నీ ప్రియుడు చాలా కాలం తరువాత ఇంటికి తిరిగి వచ్చాడని నీ స్నేహితులు, ఆప్తులు అనుకుంటున్నారు. అతనిని చూచి నీవు సిగ్గుపడటంవలన నీ కపోలాలు ఎర్రబడ్డాయి. ఇది రసహీనులకెలా తెలుస్తుంది? నిజంగా ఎన్నిరోజుల నుండి నీవతనికోసం ఎంతగా ఎదురు చూశావు. అతనికై ఎంతగా కళ్ళు కాయలు కాచేటట్లు నిరీక్షించావు. ఎన్ని రాత్రులు నిదురలేకుండా అతనికోసం మేల్కొని ఉన్నావు. గాలి కదలికలకు తలుపులు కదిలితే ప్రియుడు వచ్చాడనే భ్రమతో

పరుగెత్తుకు వెళ్ళి తలుపులుతీసి ఎన్నిసార్లు చూశావు. అతను కనిపించక ఎంత నిరాశతో శయ్యపై మేనువాల్చావు?

'వర్షం జోరుగా కురుస్తూన్నప్పుడు అతనిప్పుడెక్కడ ఉన్నాడో అనే ప్రశ్న నీ మదిలో మెదిలేది. ఇప్పుడు దారిలో ఉండివుంటే పూర్తిగా తడిసివుండి వుంటాడు. అలా తడిసి వుంటే నేను నా వెచ్చని కౌగిలిలో అతనిని బంధించి వెచ్చదనాన్ని కలిగించే దాన్ని. కాని. ఇప్పుడు అతను వందల మైళ్ళ దూరంలో ఉన్నాడు. అత నికి ఇక్కడినుండి సాయం ఎలా అందించను?

'ఓ రమణీ, ఈ విధంగా ఎన్నో రాత్రులు నిద్రలేకుండా గడిపావు. అందుకే నీ కళ్ళు ఎర్రబారాయి. ఈ రోజు ప్రియుని కలయికతో కళ్ళలో ఉన్న ఆ ఎర్ర దనం కన్నీళ్ళుగా మారి చెక్కిళ్ళపై జాలువారుతున్నది. నీ ఇరుగు పొరుగువారు అమాయకులు. నీవు ప్రియుణ్ణి చూడగానే సిగ్గిల్లి ఎర్రగా మారిపోయావని వారు అనుకుంటున్నారు. అలా అయిపోవడానికి నీవేం కొత్త పెళ్ళికూతురువా?'

దీని తరువాత 'రజనీస్తోత్రం' కవిత కనిపించింది. ఇది చదివే వరకు నాకు మనస్సు ఆగలేదు.

'ప్రతి ఋషి, ముని ప్రాతఃకాలంలో సూర్య భగవానునికి అర్ఘ్యం ఇస్తారు. తమ బుద్ధి వికసింప జేయమని ప్రార్థిస్తారు'.

'ఓ రజనీ, నీకెవరూ అర్ఘ్యమివ్వరు. నిన్ను ప్రార్థించరు. నీవు ఒక పిచ్చిదానవు. సూర్యునికంటే నీకు ఎక్కువ భక్తులున్నారు. ప్రతి గృహంలోకి తొంగిచూడు. నీ ఆగమనంతో ప్రతి యువతీ యువకుల హృదయం కమలంలా వికసిస్తుంది. ప్రతి క్షణం ఒక యుగంలా అనిపిస్తుంది. నీవు శీతలానివి. అయినప్పటికి వారి రోమ రోమంలో వేడిని పుట్టిస్తావు. నిన్ను చూడగానే పువ్వులు వికసించవు. కాని ప్రేమికుల హృదయాలు వారి శరీరంలోని అణువణువు పులకించిపోతుంది. ఆకాశంలో నక్షత్రాల అందం వెల్లి విరిస్తుంది. ఇందులో నీకు సాటి ఎవరున్నారు?

సూర్యుడు కర్తవ్యాన్ని ప్రబోధిస్తాడు. నీవు అనురాగ గీతాన్ని పాడుతావు. సూర్యుడు మానవుని బుద్ధిని వికసింపచేస్తే నీవు అతని హృదయంలో వెన్నెల కురిపిస్తావు.

'ఓ రజనీ! నీవు జగన్మాతవు, నీవు లేకపోతే! అన్నివేళలా సూర్యుడే తన కాంతిని నింపడం వలన మానవుని కోమల భావాలు దగ్ధమౌతాయి. అప్పుడతడు విముక్తుడవటానికి అతనికి ఆత్మహత్యే శరణ్యం'.

మాధవుని దగ్గర సెలవు తీసుకుని రథంలో కూర్చున్నాను. ఆ కవితల ప్రభావం నాపై ఒక మత్తులా పనిచేసింది. శరీరంలోని అణుఅణువు దాహార్తిని రేపుతున్నది. గాలిలో తేలియాడిస్తూ వస్తున్న సుగంధంలా రాత్రి జరిగిన ఆ సంఘటన స్మృతులు నా మనస్సులో అశాంతిని రేపాయి.

'సారథి రథాన్ని రాజభవనంవైపు తిప్పుతుండగా నేను గట్టిగా అరిచాను, 'సారథీ! రథాన్ని ఆపు'.

రథాన్ని ఆపి అతను ప్రశ్నించాడు, 'శలవివ్వండి మహారాజా!'

'ఎక్కడికి తీసుకు వెళుతున్నావు?'

'రాజభవనానికి ప్రభూ!'

'అచటకు తీసుకు వెళ్ళమని ఎవరు చెప్పారు?'

'మధ్యాహ్నం తమరే శలవిచ్చారు'.

నాకప్పుడు మధ్యాహ్నం విషయం జ్ఞాపకం వచ్చింది. పాపం సారథి తప్పేముంది. మృదువుగా చెప్పాను. 'రథాన్ని అశోకవనం వైపు తీసుకు వెళ్ళు. తల నొప్పిగా వుంది'.

అశోకవన భవనంలో అలంకరణంతా నిన్నటిలాగానే వుంది. ఉదయం బయటకు వెళ్ళుతూ నేనీరోజు రానని ముకుళికతో చెప్పాను. అయినా ఈ అలంకరణంతా చూస్తూంటే ఆశ్చర్యం కలిగింది.

నావెనుకనే ఆమె మెల్లమెల్లగా భవనంలో అడుగుపెట్టింది. ఆమె చేతిలో అందమైన బంగారు మదిర పాత్రవుంది. తెచ్చి పెట్టుకున్న గంభీరతతో అడిగాను, 'ఇక్కడ మత్తు పానీయాలు ఉండరాదని మహారాణిగారి ఆజ్ఞ కదా!'.

ఆమె నవ్వుతూ చెప్పింది. 'నేను మీ దాసిని, మీ ఇష్టం...........', అంటూ ఒక చిన్న పాత్రలో మదిరను నింపి నాకు ఇచ్చింది.

నెమ్మదిగా పానీయాన్ని సేవిస్తూ అడిగాను, 'నేనిక్కడకు రానని ఉదయం నీకు చెప్పాను. దానికి విరుద్ధంగా............'

'లేదు! లేదు!'

'అంటే'.

'సాయంకాలం వస్తాననే చెప్పివెళ్ళారు'.

'ఏమిటా ప్రేలాపనలు?'

'నిజం చెప్పనా?' అంటూ చిటికిన వేలు పంటి కింద ఉంచుకొని చెప్పింది. 'ఆడవారిచూపు పురుషుల మాటల మీద కాక వారి కన్నులపై ఉంటుంది!'.

సూర్యుడు ఉదయిస్తున్నాడు, అస్తమిస్తున్నాడు. సూర్యోదయం తరువాత నేను నగరానికి వెళ్ళి తల్లిదండ్రుల ఆశీస్సులు పొంది మాధవుని దగ్గరకు వెళతాను. అతని సాంగత్యంలో సంగీత, సాహిత్య, నృత్య విషయాలను తెలుసుకుంటూ నన్ను నేను మరచిపోతున్నాను. సూర్యాస్తమయంతో అశోకవనం చేరుకుంటాను. ఇది నా దైనందిన కార్యక్రమం. అప్పుడప్పుడది ఒక చిన్నపిల్లల కార్యక్రమంలా ఉంటుంది. నిద్రలేస్తాడు, పాలుతాగుతాడు, చేతులు కాళ్ళు కదుపుతూ ఆడుకుంటాడు. ఆ తరువాత నిద్రపోతాడు. రోజుకి ఇరవై గంటలు నిద్రపోతూనే వుంటాడు. బహుశః అందుకేనేమో సుఖః దుఃఖాలు, చావు మొదలగు వాటి ప్రభావం ఆ పసివాని మనస్సుపై ఉండదు. అప్పుడప్పుడది ఒక ఆత్మవంచన అనిపిస్తుంది. మోహం పాపానికి మొదటి మెట్టు. నేను దానిని దాటి వచ్చాను. ఎంత అందమైనదైనా పతనానికే మెట్టు అది. ఇది నన్ను ఏ వైపుకు తీసుకు పోతుందో? భయంకరమైన లోతైన లోయలలోకా? పాతాళంలోకా?

అప్పుడప్పుడు మనసులోని ఈ ద్వైధీ భావన భయంకరమైనదిగా మారు తున్నది. నా మానసిక స్థితి మథించిన మత్తగజాల పోరాటం చూస్తున్న బాలుని వలే ఉంటున్నది.

ఒకరోజు సాయంకాలం ఒక కళాత్మక శృంగార నాట్యాన్ని చూసి తిరిగివస్తూ, మాధవుణ్ణి అతని ఇంటి దగ్గర దిగబెట్టిన తర్వాత రథాన్ని అశోకవనం వైపు తీసుకు

వెళ్ళమని సారథితో చెప్పాను. అంతలోనే నాన్నగారు పూర్తిగా స్పృహలోకి వచ్చారని, యయూ ఎక్కడని, పదే పదే అడుగుతున్నారన్న అమాత్యుల సందేశం తీసుకుని వార్తాహరుడక్కడికివచ్చాడు.

సంధించి విడిచిన బాణంలా రాజ భవనంలో ప్రవేశించి నాన్నగారి దగ్గరకు వెళ్ళాను. ఆయన ముఖం గ్రహణ గ్రస్తసూర్యునిలా నిస్తేజంగా ఉంది. నేను కంగారు పడ్డాను. నన్ను దగ్గర కూర్చోమని చెప్పడానికి, కుడిచేతిని చాలా కష్టంగా ఎత్తి సైగ చేశారు. నాకు దుఃఖం ఆగలేదు. బాల్యంలో నేను అనారోగ్యంతో ఉన్నప్పుడు ఈ చేయి నాకెంతో ధైర్యాన్ని ఇచ్చింది, ప్రోత్సాహాన్నిచ్చింది. ఆ చేయి నాకు రక్షా కవచం వంటిది. అటువంటి చేయి నేడు .............

నా కనులు అనాయాసంగా అశ్రుపూరితాలయ్యాయి. నన్ను తప్ప అందరిని గదినుండి వెళ్ళమని నాన్నగారు సైగ చేశారు. దాసీలు వెళ్ళిపోయారు. మంత్రి, రాజవైద్యుడు వెళ్ళిపోయారు. నాలుగైదు క్షణాలు తటపటాయించి అమ్మ సంకోచిస్తూనే బయటకు వెళ్ళిపోయింది. బయటకు వెళుతూ ఆమె తలుపులు మూసి వేసింది.

నాన్నగారి తలదగ్గర అనేక రకాల మాత్రలు, చూర్ణాలు, భస్మాలు, లేహ్యాలు, మందులు ఉన్నాయి. అందులో ఒక మదిరా పాత్ర కూడా వుంది. ఆయన చాలా కష్టపడ్తూ ఆ పాత్రను చూపించి నాతో అన్నారు -

'నాకు కొద్దిగా ఆ మదిర ఇయ్యి'

రాజవైద్యుడు మధ్యమధ్యలో ఒకటి రెండు గుటకల మద్యాన్ని ఇస్తూ వుండటం నేను చూశాను.

మదిరా పాత్రను చూస్తూ ఆయన అన్నారు, 'పాత్రనిండా పోసి ఇయ్యి......'

'కాని, నాన్నగారూ ............. మీ నియమాలు ...........' విషాదంతో కూడిన నవ్వు నవ్వారు ఆయన.

'నీతో చాలా మాట్లాడాలి. అందుకు చాలా శక్తి కావాలి ........... పాత్రనిండా నింపు ......... ఇయ్యి. తీర్థంలా .........'

నేను పాత్రనిండా నింపి ఆయన నోటికందిచాను, ఒక్కొక్క గుటక మింగుతూ

ఆయనాపాత్రాలోని మదిరనంతా తాగేసారు. కొంచెం సేపు కళ్ళు మూసి కొని ఉన్నారు.

ఆయన కళ్ళు విప్పి చూచినపుడు కొంచెం ఉల్లాసంగా ఉన్నట్లు కనిపించారు.

నాచేతిని తన చేతిలోకి తీసుకుని నాన్నగారు చెప్పారు - 'యయూ, ఇప్పటికీ జీవించాలనే కోరిక మనసులో వుంది. తన జీవితాన్ని నాకిచ్చేవారు ఎవరైనా లభిస్తే వారికి నా రాజ్యమంతా ఇచ్చివేస్తాను. కాని ..............'

పెద్దగా నిట్టూర్పు విడుస్తూ నావైపు జాలిగా చూడసాగారు. ఆయన ముల్లో కాలలో పురుషసింహుడిగా ప్రసిద్ధిచెందారు. కాని ఇప్పుడు ఆయన చూపులు తీవ్రంగా గాయపడిన లేడి చూపుల వలే, భీతిచెందిన కుందేలు చూపులవలె ఉన్నాయి. ఆయన మెల్లగా చెప్ప సాగారు, 'యయూ, నేను సమృద్ధమైన విశాల సామ్రాజ్యాన్ని నీ చేతిలో పెడుతున్నాను, నీవు జీవితమంతా హాయిగా కాలక్షేపం చేసినా రాజ్యపాలన సాఫీగా సాగిపోతుంది. నేను సింహాసనం అధిష్ఠించినపుడు రాక్షసుల అకృత్యాలు ఎక్కువుగా ఉండేవి. ప్రజలు అనేక కష్టాలు పడ్తూఉండేవారు. రాజపరిపాలనా కూడా - ఇవన్నీ ఎందుకులే? అత్యంత సంపన్నమైన రాజ్యాన్ని నీకు వార సత్త్వంగా ఇచ్చి నేను ................'

'నాన్న గారూ! మీ శక్తిసామర్థ్యాలు నాకు తెలుసు. మీలాంటి వారికి కొడుకుగా పుట్టడం నా అదృష్టం ...........'

'దురదృష్టం కూడా ..........!' నా మాటలను మధ్యలోనే తుంచివేస్తూ నాన్నగారు అన్నారు.

నేను కంపించి పోయాను. ఏమి మాట్లాడాలో తెలియదు.

ఈ ఉద్వేగానికి ఆయన పొందిన శాపం కారణమా? లేక యతి వియోగం వలన కలిగిన దుఃఖం ఆయన మనస్సును ఇంకా బాధిస్తుందా?

నాన్నగారు ఒక్కొక్క మాట మెల్లమెల్లగా చెప్పసాగారు. 'యయూ, నేను ఇంద్రుణ్ణి జయించి స్వర్గలోకాధిపతి నయ్యానని నీవు చిన్నప్పుడే విని ఉంటావు. కాని ఇంద్రపదవిని విడిచి పెట్టడానికి ఒక కథ ..........'

'ఎవరూ ఆ కథ నాకు చెప్పలేదు, నాన్నగారు'.

పెద్దగా నవ్వుతూ ఆయన అన్నారు, 'రాజు చనిపోయిన తరువాత ప్రజలు రాజుల దుర్గుణాలపై చర్చిస్తారు. ఆ(., నీతో ఏమి చెప్తున్నాను? ఆ .......... గుర్తు కొచ్చింది. ఇంద్రపదవి లభించిన తరువాత నాలో మార్పు వచ్చింది. నేను గర్విష్ఠినయ్యాను. ఈ మూడులోకాలలో నాలాంటి వీరుడే లేడని తెలిసి మదో న్మత్తుడయ్యాను, యయూ! ఒక విషయం మరచిపోవద్దు. పరాక్రమానికి గర్వపడటం ఒకటి, అందులో ఉన్మత్తుడుగా మారడం వేరొకటి. నా ఉన్మత్తత ఎంతవరకూ పోయిందంటే ఇంద్రాణిని ఒక భోగవస్తువుగా చూడడం ..... ఆమె ఒక షరత్తు పై నా మాటను అంగీకరించింది. నా పరాక్రమం వెల్లడయ్యేటట్లు ఒక విచిత్రమైన పల్లకిపై ఆమె రంగమహల్‌కు చేరాలనే షరతు విధించింది. ఋషులు చేత పల్లకి మోయిస్తే, అది ఈ మూడులోకాలలో ఎవరూ చేయని విధంగా ఉండి మన కలయికకు గుర్తుగా మిగులుతుందని ఆమె సలహా ఇచ్చింది. కామోన్మత్తతతో గుడ్డి వాడినైన నేను పెద్దపెద్ద మహాఋషులను పిలిపించి రత్నపల్లకిని వారి భుజాలపై వుంచి మోయించాను. రత్నాల పల్లకిలోనున్న నన్ను ఋషులు మోసుకుపోసాగారు. కామాతురతతో వున్న నాకు ఋషుల నడక చాలా నెమ్మదనిపించింది. ఎప్పుడు ఇంద్రాణి రంగమహల్ చేరుకుందామా, ఆమె సౌందర్యాన్ని ఎప్పుడు తనివితీరా అనుభవిద్దామా, అనే ఆలోచనలో వున్న నాకు వారి నడక కోపం తెప్పించింది. పల్లకి వేగాన్ని పెంచాలనే దృష్టితో ఒక ముని తలపై గట్టిగా కొట్టి 'సర్ప' అంటూ త్వరగా పదమని చెప్పాను.

అతను .......... అగస్త్యముని. అతను వెంటనే శాపం ఇచ్చాడు ............'

ఆఖరి మాట చెప్తూ నాన్నగారు ఆయాస పడసాగారు. ఆయన మాటలలో అస్ప ష్టత .......... వణుకు ఉంది.

ఆయన మాటలాడలేక మదిరవైపు చేయి చూపించారు. వెంటనే మదిర ఇవ్వడం బాగుండదని నేను ఊరుకున్నాను. కాని ఆయన బాధ చూడలేక పాత్రలో మదిర సగం నింపి ఆయనకందించాను.

అది తాగిన తరువాత ఆయనకు స్వస్థతత చేకూరింది. ఏదో చెప్పాలనే పెదవులు

కదిలించారు. నేను అన్నాను, - 'మీరు విశ్రాంతి తీసుకోండి నాన్నగారు. రేపు మిగిలిన విషయాలు మాట్లాడుకుందాం'.

'రేపా?' - ఆయన ఒకే మాట పలికారు కాని అందులో ప్రపంచంలోని బాధ అంతా గూడుకట్టుకొని ఉంది.

కొంతసేపు ఊరుకొని ఆయన శాంతంగా నాతో అన్నారు, 'ఆ శాపం........ ఈ నహుషుడు, ఇతని పుత్రులు ఎప్పుడూ సుఖంగా ఉండరు ......... - తల్లి దండ్రుల మంచి చెడ్డలు పిల్లలకు వారసత్వంగా లభిస్తాయి. ఇది ప్రకృతి ధర్మం, కాని ఈ శాపం నీకు తగలకూడదు. యయూ! నీ తండ్రి అపరాధి, క్షమించు, ఒక విషయం గుర్తుంచుకో - జీవితంలో నీతి మర్యాదలు మరచిపోరాదు. నేను వాటిని మరచి పోయాను ...........'

హతాశుడైనట్లు నాన్నగారు కళ్ళుమూసుకున్నారు. ఇంతసేపు మాట్లాడటం వలన ఆయనపై వత్తిడి పెరిగి ఆయాస పడ్డారు. ఇప్పుడాయనకు పూర్తి విశ్రాంతి అవసరం. కాని ఆయన ఏదో తనలోతను అనుకుంటున్నారు. నేను వంగి శ్రద్ధగా వినసాగాను. నేను విన్నాను - 'శాపం, యతి, మరణం అనాయాసంగా నానోటి నుండి మాటలు వెలువడ్డాయి, 'నాన్నగారూ, యతి బ్రతికే ఉన్నాడు'.

తుఫాను గాలికి కిటికి రెక్కలు ఒక్కసారి తెరచుకున్నట్లు ఆయన కను రెప్పలు తెరచి బొంగురు గొంతుకతో అడిగారు, 'ఎక్కడ?'

'తూర్పు ఆర్యావర్తంలో .....'

'సాక్ష్యం'

'అతను నన్ను కలిసాడు'

'ఎప్పుడు?'

'అశ్వమేధ యాగమప్పుడు'

నాన్నగారు విని వణికిపోసాగేరు.

'మరి ఇన్ని రోజులు నాదగ్గర ఎందుకు దాచావు? నీచుడా, దుష్టుడా, స్వార్థ పరుడా - నేను అతన్ని తిరిగి తీసుకువచ్చి అతనినే రాజును చేస్తాననే భయంతో నీవు అతని .......'

ఆ తరువాత ఆయన నోటి నుండి మాట రాలేదు. కాని నన్ను ఆయన విచిత్రంగా చూడడంతో నేను అరిచాను, 'అమ్మా .....'

అమ్మా, అమాత్యుడు, రాజవైద్యులు, దాసీలు.......... అందరూ లోపలికి వచ్చారు. రాజవైద్యుడు అతి ప్రయత్నంనీద ఏదో లేహ్యాన్ని నాన్నగారిచే తిని పించారు.

కొంచెం సేపటి తరువాత ఆయన తేరుకున్నారు. ఆయన మంత్రిగారితో మెల్లగా చెప్పారు. 'అమాత్యా, ఇక నేను ఎంతో కాలం బ్రతుకను. ఇంద్రుణ్ణి జయించిన తరువాత, ఆ సందర్భాన్ని పురస్కరించికొని మనం బంగారు రాజ ముద్రికను తయారు చేయించాం. దానిని తీసుకురండి. ఒక్కసారి కళ్ళతో చూస్తాను. అది చూస్తూ మరణిస్తాను. మనిషికి విజయంతోనే మరణం సంభవిం చాలి'.

నాన్నగారి మాటలతో అమ్మ బాధపడి దుఃఖించసాగింది. ఆమెను ఎలా ఓదా ర్చాలో నాకు తెలియలేదు.

మంత్రిగారు ఆ సువర్ణ ముద్రిక తీసుకువచ్చారు. 'ఇవ్వండి, నా చేతి కివ్వండి' అంటూ నాన్నగారు దానిని చేతిలోకి తీసుకుని కష్టంగా అటుఇటు తిప్పి చూచి అన్నారు, - 'దీనిపై నా విజయపు గుర్తు ఏది? ధనస్సు, బాణం - నా ధనస్సు - నా బాణం'-

అమాత్యుడు ఆ ముద్రికపై ఒకవైపును నాన్నగారికి చూపిస్తూ చెప్పారు, 'ఇక్కడ మీ విజయ చిహ్నాలున్నాయి?'

'ఎక్కడ - ఎక్కడ' 'ఈ సువర్ణ ముద్రక అది కాదు! నన్ను మీరు మోసం చేస్తున్నారు'.

'లేదు మహారాజా! ఈ వైపు ముద్రించి ఉంది!'

'అయితే ఆది నాకెందుకు కనిపించడంలేదు? రెండో వైపు చూపించండి నాకు!'

అమాత్యుడు రెండో ప్రక్కనుండి నాన్నగారికి చూపించారు. నాన్నగారు ఏకాగ్రతతో చూస్తూ నన్ను పిలిచారు. 'యయూ! ..........'

నేను ముందుకు వెళ్ళాను. ఆయన నాతో అన్నారు, 'ఈ సువర్ణ ముద్రిక మీద ఏవైనా అక్షరాలు ఉన్నాయా?'

'ఉన్నాయి, నాన్నగారు!'

'మంచిది, చదివి వినిపించు!'

'జయతు, జయతు నహుషః'

'అయితే నాకెందుకు ఆ అక్షరాలు కనిపించడం లేదు? అవి కూడా నాకు వ్యతిరేకంగా కుట్రపన్నుతున్నాయి'.

ఆ ముద్రికను అటుఇటు త్రిప్పి చూడమని నాన్నగారు రెండు మూడుసార్లు చెప్పారు. నేను ఆ విధంగా త్రిప్పిచూసాను. ఒక్కప్రక్క ధనుర్బాణాల గుర్తు రెండో ప్రక్క జయతు, జయతు నహుషః అనే అక్షరాలు స్పష్టంగా కనిపించాయి. కాని నాన్నగారు వాటిని చూడలేకపోయారు.

ఆయన కళ్ళ నుండి కన్నీరు కారసాగింది. గద్గద స్వరంతో అన్నారు. 'లేదు, నాకేమీ కనిపించుటంలేదు, జయతు, జయతు నహుషః! అబద్ధం, ఇదంతా అబద్ధం. నేడు ఆ నహుషుడికి ఓటమి కలుగుతుంది మృత్యువు అతనిని ఓడి స్తున్నది. మరణం! నాకేమీ కనిపించటంలేదు! నాకు ......... నాకు .........'

మాట్లాడుతూ స్పృహతప్పిపోయారు. అమ్మ తన దుఃఖాన్ని అణచు కోవటానికి ప్రయత్నించినా దుఃఖం ఆగలేదు. రాజవైద్యుడు దాసీ సహాయంతో మందును త్రాగించ ప్రయత్నించసాగారు.

మృత్యువు మెల్లగా రాజమహల్‌లో ప్రవేశించింది. అది ఎవరికి కనిపించ నప్పటికీ మృత్యు ఛాయాలు మాత్రం కనిపించసాగాయి.

నేనక్కడ ఉండలేకపోయాను. రెండు చేతులతో ముఖాన్ని కప్పుకొని నేను బయటకు పోయాను. మనసు తీరా ఏడ్వాలనుకున్నాను. కాని ఏడుపు బయటకు రాలేదు.

కొద్దిసేపు తరువాత మంత్రి, రాజవైద్యులు బయటకు వచ్చారు. నా భుజంపై చేయివేసి రాజవైద్యులు చెప్పారు, 'యువరాజా! ఇప్పుడిచ్చిన మాత్రతో మహ రాజావారికి కొంత అలసట తగ్గింది. ఇప్పుడిక చింతించనవసరంలేదు. కాని ఎప్పుడు ఏమి జరుగుతుందో చెప్పలేము. అంతా - భగవంతుని దయ, మీరు అశోకవనానికి వెళ్ళి విశ్రాంతి తీసుకోండి. మహారాజుగారి ఆరోగ్యంలో మార్పు వచ్చినప్పుడు మంత్రిగారు మీకు సందేశం పంపుతారు'.

అమాత్యులవారు కూడా తలవూపుతూ రాజవైద్యులు వారి మాట లను సమర్థించారు.

అక్కడ ఉండి నేను ఏమి చేయాలి? ఏదో నిర్జీవ భూతంలా అమ్మగారి దుఃఖాన్ని చూస్తూన్నాను. తండ్రిగారి ఆవేదనను ఒకరాయిలా భావరహితుడునై చూస్తూన్నాను.

రాజమార్గం పై నారథం పరుగుతీస్తున్నది. ప్రజలు గుంపులుగుంపులుగా తిరుగుతున్నారు. కొందరు నవ్వుతున్నారు. కొందరు ఆడుతున్నారు. ఎవరో పాడు కుంటున్నారు. ఎవరో వెన్నెలలో షికారు చేస్తూన్నారు. వారి ఆనందాన్ని చూస్తూంటే నాకు మరింత దుఃఖం వచ్చింది.

అశోక వనంలోని భవనంలో అడుగుపెట్టగానే ముకుళిక అలంకరించుకొని ద్వారం దగ్గర స్వాగతం చెప్పేందుకు నిలబడి కనిపించింది. ఆమెతో ఒక మాట కూడా మాట్లాడకుండా లోపలికి వెళ్ళిపోయాను. నా బట్టలు విప్పడానికి ఆమె వచ్చింది. నేను చేత్తోనే రావద్దని సైగ చేశాను. ఆమె ఉలిక్కిపడి, చూస్తూ ఉండి పోయింది.

గుడ్డిగవ్వలాంటి దాసీ, తనను తాను ఏమనుకుంటున్నది? రంభా, ఊర్వశి లేక తిలోత్తమా? అక్కడ మహారాజు మరణావస్థలో ఉండగా ఇక్కడ ఈమె అలంక రించుకొని నాపై సమ్మోహనాస్త్రం ప్రయోగిస్తున్నది. ఇందులో ఏదో ఉంది. ఈ

రోజు కాకపోతే రేపు రాజు నౌతాను. ఇప్పటి నుండి ఇతనితో సంబంధం పెంచు కుంటే చేతిలో ఉంచుకోవచ్చునని ఊహతో వలవిసురుతున్నదేమో! లేకపోతే ఈమె ఎప్పుడూ అలంకరించుకొని కొత్త పెండ్లికూతురులా నన్ను వశ పరుచుకునేందుకు ఎందుకు ప్రయత్నిస్తున్నది? ఇక్కడ కార్యక్రమాలన్నీ సమర్థవంతంగా తన గుప్పి టలో ఉంచుకుంది. ఈ చెవిలోని మాట ఆ చెవికి చేరనివ్వదు. ఇంతకీ ఈమె ఉద్దేశ్యమేమిటి? నాతో ఏర్పరుచుకున్న సంబంధం........ నాలాంటి వానితో ప్రేమ నాటకం....... పాపపు ఆలోచనతో ఒక యువకుని అధఃపతన మార్గాన తీసు పోయేందుకు ఈ నాటకాలు .......... సంకోచాలు ........'.

భయపడుతూ ముకుళిక ప్రశ్నించింది. 'భోజనం ఎప్పుడు చేస్తారు?'

'నేను ఇప్పుడు భోజనం చేయను'.

'ఎందుకు?'

'నాయిష్టం'.

'కాని నేను ఈరోజు ప్రత్యేకంగా ...............'

'నీ నాటకాలు నాకు బాగా తెలుసు! రేపు ఉదయమే మాట్లాడకుండా ఇక్కడ నుండి వెళ్ళిపో! ....... నీ ముఖం నేను చూడాలనుకోవడం లేదు!. నీవు బయటకు పో! గుర్తుంచుకో, నేను పిలిచే వరకు ఈ భవంతిలోకి అడుగు పెట్టకు. అర్థమైందా?'

నేను కుపితుడనయ్యాను....... కోపం వచ్చింది....... నామీద నాకే!....... ఈ ప్రపంచంమీద ....... మృత్యువు మీద ....... ముకుళిక మీద! నేను ఏమి మాట్లాడు తున్నానో నాకే అర్థం కావటంలేదు.

ముకుళిక భయపడి బయటకు వెళ్ళిపోయింది. ఆమె భయాందోళనలు చూచి ఆనందపడ్డాను. బట్టలు విప్పకుండానే పరుపుపై వాలిపోయాను.

ఒక్కసారి నాన్నగారు గుర్తుకొచ్చారు. ఆ స్వర్ణముద్రిక........ దానిపై ముద్రించిన విజయ చిహ్నాలు చూచేందుకు ఆయన పడిన తపన......... దానిని చూడటానికి ముందే ఆయనకు దృష్టి పోవటం....... బహుశా ఇప్పుడు కాళ్ళు చేతులు కదిలించ

గలిగే శక్తి కూడ ఆయనలో సన్నగిల్లి ఉంటుంది. ఇంద్రుణ్ణి ఓడించిన వీరునిగా ఆయన లోకంలో కీర్తించబడ్డారు. కాని నేడు ఆయన చేతిని కదపలేని పరిస్థితి ఏర్పడింది. మరి కొద్ది క్షణాలలో ఆయన శరీరం నిర్జీవమై పోతుంది.

మృత్యువు పట్ల తెలియని భయం నా మనస్సు నిండా అలుముకుంది. భయ పడే పిల్లవానిలా నేను కళ్ళు మూసుకున్నాను. మెల్లమెల్లగా నేను నిద్రారాజ్యంలో ప్రవేశించాను.

నేనెంత ఆలస్యంగా నిద్రపోయానో, తెలియదు. ఒక భయంకరమైన కలగని నేను మేల్కొన్నాను. ఆ కలలో నాన్నగారి స్థానంలో యయాతి మరణశయ్యపై పడి వున్నాడు. అతని కేమీ కనిపించడంలేదు. కాళ్ళు చేతులు చల్లబడి పోతున్నాయి. కంఠం మూగబోయింది. నవ్వలేడు, ఏడ్వలేడు.

పిచ్చివానిలా నేను నా శరీరాన్ని - అతని శరీరాన్ని చూడసాగాను. శరీరం లేకపోతే మధుర సంగీతం లేదు, శరీరం లేకపోతే అందమైన చంద్రోదయంలేదు. రుచికరమైన పదార్థాలు లేవు. సురభిళ పరిమళాలు వెదజల్లే సుమాలు లేవు. అనురాగ పూరితమైన స్పర్శల్లేవు. పుట్టిన తరువాత నేను ఎన్ని సుఖాలు అను భవించానో, ఎన్ని ఉన్మాదపు చేష్టలు చేశానో అవి అన్నీ శరీరంతోనే, ఈ శరీరంతో వాటికి దగ్గర సంబంధం ఉంది. 'నేను' అని నన్ను నేను పిలవగల యయాతి ఈ శరీరానికి భిన్నమైన వాడుకాదు. శరీరంవేరు, ఆత్మవేరు అని చిన్నప్పటి నుండి నేర్చుకుంటున్నాను. కాని అగ్నిజ్వాలలా నాలో ఒక ప్రశ్న ప్రజ్వలి స్తున్నది........... యయాతి శరీరం లేకుండా యయాతి ఆత్మ ప్రపంచంలోని ఎదైనా సుఖాన్ని పొందగలదా?

ముకుళిక మీద నేను అనవసరంగా కోపగించుకున్నానని ఇప్పుడనిపిస్తుంది. ఈ రాజభవనం నాలుగు గోడల లోపలే ఆమెలాంటి దానికి నాలుగు దిశలూ వుంటాయి. ఇదే ఆమె లోకం, పాపం ఆమెకు బయట ప్రపంచంతో ఏమి పని? యువరాజు తన యజమాని అని, ఆయన సుఖంగా ఉండాలనే ఉద్దేశ్యంతో ఆమె నాతో ఉంది. ఇంకేమైనా .........

నేను ఆమెను పిలిచాను, 'ముకుళికా...........

ఆమె బయట తలుపుకు చెవులు ఆనించి కూర్చొందో లేదో నాకు తెలియదు. వెంటనే తలుపు తీసుకొని లోపలికి వచ్చి మెల్లగా తలుపును మూసి ఒక్కో అడుగు వేసుకుంటూ ముందుకు రాసాగింది.

మంచం దగ్గరకువచ్చి తలవంచుకుని నిల్చుంది.

'ఇలా ఎందుకు నిలబడ్డావు? నేను నీ ముఖం కూడా చూడనని ఇప్పుడు అన్నాననా?'

ఆమె నవ్వింది. కాని తలెత్త లేదు.

మరల నేను అన్నాను - 'ఈ మాత్రం పరిహాసం నీకర్థం కాలేదా? ఇప్పుడు నీవు తలెత్తక పోతే గుర్రానికి వేసే కళ్ళెం వేసి రేపటి నుండి నీ ముఖాన్ని నావైపుకు..........

ఇప్పుడామె తలెత్తి సమ్మోహనంగా నవ్వుతూ నావైపు చూడసాగింది. బహుశా ఇంతకుముందు బయట నిలబడి ఏడ్చివుంటుంది. వానవెలసిన తరువాత ప్రకృతి వలే ఎంతో అందంగా ఉంది ఆమె.

నేను లేచి ఆమె భుజంపై చేయవేయబోయాను, 'యువరాజా!..........' పిలుపు వినిపించింది.

'నీవు నన్ను పిలిచావా?' నేను ఆమెను అడిగాను. ఆమె తలతిప్పుతూ 'లేదు' అంది. బహుశా ఆమెకూడా ఆ పిలుపు వినే ఉంటుంది. ఆమె మంచానికి దూరంగా వెళ్ళింది. తుమ్మెదలా తలుపువైపు చూడసాగింది.

'యువరాజా .........' మరలా అదే పిలుపు వినిపించింది.

మంచానికి ఎదురుగా ఉన్న గోడవైపు నుండి ఎవరో పిలుస్తున్నారు. ఆశ్రమం నుండి వచ్చేటప్పుడు మంత్రిగారు చెప్పిన మాటలు గుర్తుకొచ్చాయి. రాజమహాల్ నుండి అశోకవనానికి ఒక సొరంగ మార్గముంది. ఆ సొరంగ మార్గం ద్వారా ఎవరో వచ్చారు. నేను గోడ దగ్గర వెళ్ళి పరీక్షగా చూసాను. గోడ మధ్యలో బోలు పీట ఉంది. అక్కడ సాధారణంగా ఎవరికీ కనిపించని యంత్రం ఉంది. దానిని నొక్క

గానే ఒక మనిషి పట్టగల ఒక భాగం విడిపోయింది. సౌరంగం పై మెట్టుపై మంత్రి గారి సేవకుడు మందారుడు నిలబడి వున్నాడు. వణుకుతున్న కంఠంలో అతను చెప్పాడు 'త్వరగా రండి. యువరాజా! మహారాజుగారి ఆఖరి(అంతిమ) క్షణాం.....'

ముకుళిక వైపు చూడకుండానే నేను సౌరంగం మెట్టుదిగాను. అతను రహస్య ద్వారాన్ని మూసాడు. అతని వెంటనేను కీలు బొమ్మలా నడవసాగాను.

ప్రపంచం దృష్టిలో యయాతి ఒక సంపన్న రాజ్యానికి రాజు అయ్యాడు. కాని నిజంగా యయాతి అనాథ అయ్యాడు.

నాన్నగారి జ్ఞాపకాలతో నేను దుఃఖించసాగాను. రాజగురువు నన్ను ఓదార్చ సాగారు - 'మహారాజా, నహుష మహారాజు ఆత్మ ఇప్పుడు విముక్తి పొందింది - అది అంతరిక్షంలో తిరుగుతూ పోసాగింది. సూర్యభగవానుడు దానికి దారిచూపి స్తున్నాడు. ఆ ఆత్మ విశాలమైన ప్రవాహాన్ని దాటింది. అప్పుడు యముని కాపలా దారులవలె విశాలమైన ముక్కు, నాలుగు కళ్ళు, శరీరం నిండా చీమలతోనున్న సురమ కుమారు లైన రెండు కుక్కలను దాటి ఆ ఆత్మ ఆత్మల నివాసస్థానం వైపు సాగుతుంది. అది ఒక అపురూపమైన ప్రదేశం. అక్కడ కాంతి ఎప్పుడూ తగ్గదు. అక్కడ నీరు ఎండిపోదు. అక్కడ కేవలం సుఖం, ఆనందమే ఉంటుంది. కాబట్టి మీరు బాధపడ వద్దు. మహారాజుగారి ఆత్మ అన్ని బంధాలను త్యజించి త్వరగా ఆనంద సముద్రంలో తేలియాడుతుంది. మీరేవిధంగాను దుఃఖించవద్దు.

పాపం రాజగురువు! నా మనస్సును సముదాయించడానికి ఆయన దగ్గర వేరే ఉపాయం ఏది? అందుకె ఋగ్వేదంలోని ఋక్కులను వినిపిస్తూ వాటి అర్థాలను తెలియ చెప్పారు. నేను ఆయన మాటలు మౌనంగా విన్నాను. మానవుని ఆత్మ ఎక్కడ ఉంటుంది? అది ఎలా ఉంటుంది? ఏమి చేస్తుంది? శరీరానికి భిన్నంగా దానిలో ఏమి వుంటుంది? ఈ ప్రశ్నలు నా మనస్సులో తలెత్తాయి. నాన్నగారి ఆత్మ ఇప్పుడు ఆత్మానందంలో లీనమౌతుందని రాజగురువు నాకు తెలియ చెప్పారు. శరీరానికి అగ్ని సంస్కారం చేసేటప్పుడు పురోహితులు, 'ఓ అగ్నిదేవా! ఈ మృత్యుణ్ణి మేము నీకు అర్పిస్తున్నాం, పితృదేవతలకై తిరిగి బ్రతికించు. ఇతను పునర్జన్మ పొంది శరీరాన్ని పొందుగాక, శరీరం పొందుగాక........' అని ప్రార్థిస్తారు. ఈ ప్రార్థనకు అర్థమేమిటి?

ఆ ప్రార్థనలోని కల్పనతో నా మనసు ఊగిసలాటింది. నాన్నగారు మరల ఎటువంటి శరీరాన్ని పొందివస్తారు? నేను ఆయన పునర్జన్మను గుర్తించగలనా? ఆయన నన్ను గుర్తించుగలరా? మా కలయిక మిత్రత్వంగా ఉంటుందా? లేక శతృత్వంగా ఉంటుందా? నాన్నగారు నా శతృవుగా వుంటారా? లేదు! నేను నాన్నగారికి శతృవుగా ఉంటానా? లేదు! నేను నాన్నగారికి శతృవుగా ఉంటానా? అసంభవం! అసంభవం!

యయాతి పుత్రునిగా పుట్టడం ఆయనకు ఆనందం. అలా జరుగుతుందా? జన్మలో అమ్మ ఆయనను గుర్తించ గలదా? లేదు! పునర్జన్మ కవికల్పన కాగలదు.

ఈ ఆలోచనలతో నేను అశాంతికి గురయ్యాను. మంచమ్మీద అటు ఇటు చాలా సార్లు దోర్లాను. అలా పడివుండడం వలన విసుగు చెంది బయట ఉద్యాన వనాన్ని చూస్తూవున్నాను. తిరిగి చిన్ననాటి జ్ఞాపకాలు గుర్తుకొచ్చాయి. ఆరోజుల్లో పూల తోటలోని పూలే నా స్నేహితులు, వాటితో ఆడడం, నవ్వడం, నవ్వించడం, అందులోని ఆనందాన్ని పొందడం, ఎప్పుడూ అలాగే వుండాలని కోరిక ఉండేది. కాని ఇప్పుడు నాకు పూలు పూలుగానే ఉన్నాయి. రంగులు, సుగంధంతో అందంగా ఉన్న ఆపూలు ఈ ప్రపంచంలో చాలా చిన్న వస్తువులు! నిర్జీవమైన వస్తువులు! ఇప్పుడు వాటివైపు ఎంత ఇదిగా చూచినా అవి నన్ను స్వప్న లోకం లోకి తీసుకు పోలేవు.

ఇప్పుడు ఇంత పెద్దవాడినైపోయినందుకు నాపై నాకే కోపం వస్తున్నది. ఈ యవ్వనం వ్యర్థంగా వచ్చిందనిపిస్తుంది. ఎందుకు వచ్చింది? నేను రాజునెందు కయ్యాను? ఎక్కడ ఉన్నాడా యయాతి? పూలతోటలలోని పూలు, యజ్ఞాయాగాల లోని ఆ అగ్నిశిఖలు ఒకేలా అనిపించేవికదా? ఆ నిర్భయమైన, అమాయకమైన బాల్యం ఎక్కడకు పొయింది?

ఇప్పుడు నేను మొండిగా ఆ అగ్నిశిఖలను పట్టుకునేందుకు పరుగెత్తడం లేదు. ఇప్పుడు నాకు అగ్నికాల్చుతుందనే జ్ఞానం వచ్చింది. నేడు నేను ఏ మొగ్గతో రహస్యం చెప్పను? అవి రేపు వికసించి ఎల్లుండి వాడిపోతాయని నాకు తెలుసు.

అయితే జ్ఞానమంటే ఏమిటి? అది మనిషికి లభించిన వరమా లేక శాపమా? యవ్వనం ముసలితనానికి మొదట మొట్టు. అయితే మరణం చివరి మెట్టు. కాదు,

కాదు, జీవుని భ్రమలో ఉంచి ముసలితనం వైపు తీసుకుపోయో యవ్వనం యవ్వన మేనా! దాన్ని వరమని ఎవరు అంటారు? అది ఒక భయంకరమై శాపం.

శాపమనే పదం గుర్తుకురాగానే నాన్నగారు చనిపోతూ నాకు చెప్పిన కథ జ్ఞాపకం వచ్చింది. 'నహుషుడూ, అతని కొడుకులూ ఎప్పుడూ సుఖంగా ఉండరం'టూ అంతరిక్షంలో అగ్నిజ్వాలతో ఎవరో రాస్తున్నారనిపిస్తున్నది.

ఆ శాపం కొంతవరకూ నిజమైంది. నాన్నగారు సుఖంగా ఉండలేదు. ఆయన తన చివరి తటపటాయింపు, జీవించాలనే తపన, అసంతృప్తి, చివరకు తన అపూర్వమైన విజయ చిహ్నం కూడా చూడలేకపోయారు.

నాన్నగారు ఉన్మాదిగా అగస్త్యమునిని తన్నారు. ఆయన నాన్నగారికి శాప మిచ్చారు. బాగుంది. కాని ఆయన పుత్రులమైన మైము ఏమి పాపం చేశాం? అప్పుడు నేను పుట్టనేలేదు. అది భూతంలో నా జీవితమంతా నా వెనుక ఉండి పీడిస్తుందా?

ఆయన కైలాసగిరి వెళ్ళి తపస్సు చేసుకుంటున్నాడు అక్కడకు వెళ్ళి అడగాలనిపిస్తుంది. అమాయక బాలురమైన మాకు శాపం ఎందుకిచ్చారు? తల్లి దండ్రుల పాపానికి పిల్లలను దండించడం ఎంత వరకు న్యాయం? దేవతల దగ్గర న్యాయం ఉండదా?

నేను యతి జీవనక్రమాన్ని చూసాను. ఈ శాపకారణంగా యతి చిన్నప్పుడే ఇల్లు విడిచి తప్పు చేయలేదుకదా? నేను కూడా - ముకుళికా - కాదు! అది పీడ కల.

# అధ్యాయం 8

నాన్నగారు మరణించడంతో నేను రాజునయ్యాను. పట్టాభిషేకపు ముహూర్తం కోసం అమ్మ మంత్రిగారితో చర్చలు జరుపుతునే ఉన్నారు. అమ్మగారు కోరు కున్నట్లు ఆ ముహూర్తం ఇప్పటి వరకు కుదరలేదు.

సింహాసనం అధిష్టించిన తరువాత కూడా నేను సుఖపడనా? అది ఎలా సంభవం? భగవంతుడు నా అదృష్టాన్ని ఎలా రాసాడో తెలియదు?

ఈ ఆలోచనలతో నా మనస్సులో -చిత్రమైన నిశ్శబ్దం ఆవరించింది. ఎవరితోనూ మాట్లాడకుండా, ఆహారం నీరు తీసుకోకుండా మౌనంగా ఉండాలని ఉంది. అమ్మ జ్ఞాపకం వచ్చింది. ఒకరోజు ఆమె నాతో అంది, 'యయూ, నీ ఆరోగ్యం బాగుందా? నిన్న అశోకవనం నుండి నీ దాసి ముకుళిక వచ్చింది. నీ కునికిపాట్లు చూసి కలవకుండా వెళ్ళిపోయింది. ఆమె చాలా మంచిది. అర్థంచేసుకొని నడుచుకోగలదు. ఆమెను అక్కడ ఉంటే కన్నా ఇక్కడకు తీసుకురావడం మేలని పిస్తుంది. నీ ఉద్దేశ్య మేమిటి? 'మహారాజు చాలా అమాయకుడు, తనకు ఏమి కావాలో తెలియదు. ఇది కావాలి, అది కావాలి అని అడగరు. ఆయన కళ్ళల్లో కోరికలు చూచి పూర్తి చేయాలని' అన్నది. నీకోసం ఆమెను ఇక్కడకు పిలిపించనా?'

'ఆ ముకుళిక ఒక పిచ్చిది. నీవు పిచ్చిదానవు. అమ్మా! నిజం చెప్పాలంటే కొన్నిరోజుల నుండి ఏ విషయం పైనా మనస్సు నిలవడం లేదు. ఈ వైభవం అంతా వదిలి ఎక్కడకో వెళ్ళిపోవాలని .........'

అమ్మకు పాము కాటువేసినట్లైంది. నాచేతిని బలంగా పట్టుకుని, అన్నది 'యయూ, గుర్తుందా - నీవు చిన్నప్పుడు నాకు మాటిచ్చావు?'

నేను హాస్యంగా అన్నాను, 'చిన్నప్పుడు నేను నీకు ప్రతిరోజు ఏదో ఒక మాట యిస్తూవుండేవాడిని. అప్పుడు అన్న మాటలు ఇప్పుడు ఎలా గుర్తుంటాయి?'

'చిన్నప్పటినుండి అల్లరివాడివే'.

యతి సంగతంతా అమ్మతో చెప్పాలని ఒక్కసారి మనస్సులో కోరిక కలిగింది. 'అమ్మా! అతని దగ్గరకు వెళ్ళు. అతనిని నీ మమతానురాగాలతో బంధించి తీసుకు రా. అతను నీకు పెద్దకొడకు. అతనిని రాజు చెయ్యి. నా మనసు విరిగి పోయింది. నాకు రాజ్యం వద్దు. ఏమీ వద్దు .........' అని చెప్పాలనిపించింది.

ఆరోజు అనుకోకుండా నాన్నగారి దగ్గర నోరుజారి యతి సంగతి చెప్పాను. లాభం లేకపోగా, నాన్నగారు దుఃఖించారు. యతి జీవించి ఉన్నాడని తెలిస్తే అమ్మకు సుఖం కలుగుతుందా? ఆమె అతనికై వెదకుతుంది, అమ్మ కన్నీరు చూచి యతి తిరిగివస్తాడా? సింహాలు, పులుల వంటి అడవిజంతువులతో స్నేహం చేయడం సులువు. కాని హఠయోగి లాంటి యతి...... నిజంగా యతి జీవితం ఎలా ముగుస్తుంది? ఈ మార్గంలో అతను భగవంతుని దర్శించగలడా? అలా ఆయితే ఈ ప్రపంచం అతనిని పొగడ్తలతో ముంచెత్తుతుంది. ఒక మహా తపస్విగా అతను ప్రపంచంలో కీర్తిని పొందుతాడు. కాని భగవంతుణ్ణి దర్శించాలనే కోరికతో ఎక్కుతున్న వైరాగ పర్వత శిఖరం నుండి కాలుజారితే? ఆ పర్వతాన్ని కప్పుతున్న మంచు ఒక్కసారి కరిగి అతనిని తనలో ఇముడ్చుకుంటే?

నేను మౌనంగా ఉండడం చూసి అమ్మ అన్నది - 'చాలారోజుల నుండి ఎదురు చూస్తూన్నాను, నీవు ఈరోజు కాకపోతే రేపు కుదుటపడతావని, మొదటినుండి చూస్తూన్నా. నీవు మొండి వాడివి, అయినా నీవేమి చేస్తావు? నీవంశం అటువంటిది. ఇప్పుడు బాల్యపు మొండితనంతోపాటు రాజుగా ఠీవి తోడైంది. రాజననే ధిక్కారంతోవుంటే గుర్తుంచుకో! నేను రాజమాతగా అధికారం చెలాయించగలను. నీవు ఇలా ఉదాసీనంగా ఎందుకున్నావో చెప్పనా?'

ఏది ఏమైనా ఆమెది మాతృహృదయం. కుమారుని కాలిలో ముల్లు గుచ్చు కుంటే ఆమె కళ్ళల్లో శ్రావణ మేఘాలు వర్షిస్తాయి. శిలవలే నా హృదయం జడత్వం

పొందిది. అలా ఎందుకు జరిగిందో నాకే తెలియదు. నా ఈ విచిత్రపరిస్థితిని చూసి అమ్మ ఆందోళన చెందడం సహజం.

మాట మారుస్తూ నేను అన్నాను - 'అమ్మా, నీవు అనురాగ మూర్తివని నాకు తెలుసు కాని నీవు ఆత్మజ్ఞానం కూడా కలగిన దానవని .......'

'ఇది వార్ధక్యంలో వచ్చిన ఆత్మజ్ఞానం, బాబూ!'

'అంటే?'

నవ్వుతూ అంది, 'పిచ్చివాడా, ఒకప్పుడు, నీ వయస్సులో ఉన్నదాననే కదా?'

'అయితే'

'ఆ వయస్సులో ఉన్నప్పుడు నేను ఎలా ఆలోచించేదాననో ఇప్పటికీ నాకు జ్ఞాపకం. అది ఎలా మర్చిపోతావు నీవు?'

'అమ్మా! చూడు నేను మగవాణ్ణి. మీ ఆడవారి మాటలు నాకు అర్థం కావడంలేదు. నీ మనసులో ఏముందో సరిగా చెప్పు'.

'నీకు వివాహం చేస్తే నీ మనసు కుదుట పడుతుందని .........'

'ఇప్పుడు ఈ ప్రయత్నమంతా!'

'ఇందులో ఆశ్చర్యపోవలసినదేముంది? నా వివాహం అయనపుడు నీ వయస్సు కంటే చిన్నదాన్ని. అమ్మను వదలి అత్తవారింటికి వచ్చాను. దేవుడు గుర్తు కొచ్చాడు. అత్తవారింట్లో ఒకరోజు కూడా సుఖంగా ఉండలేననిపించింది.'

'అప్పుడేమైంది?'

'ఏమవుతుంది. అదే ప్రతి యింట్లో జరిగేదే. ప్రతి ఆడపిల్లకి జరిగేది'. చూస్తూ వుండుగానే సంసారానికి అలవాటుపడ్డాను. అమ్మను పూర్తిగా మరచిపోయాను. అందుకే చెప్తున్నాను, ఈ రాజ్యాభిషేకం వేగంగా జరిగిపోతే, నీకిష్టమైన రాజకన్యతో........' పట్టాభిషేక ముహూర్తాన్ని నిర్ణయించడానికి అమ్మ నవ్వుతూ వేళ్ళిపోయింది.

ఆమె ఆఖరి మాటలతో నాలో మధురోహలు ఉవ్వెత్తున లేచాయి. నేను హస్తినాపురానికి రాజైయ్యాను. అప్సరసలుకూడా సిగ్గుపడేవిధంగా ఉండే అతిలోక సుందరి అయిన రాజకన్యను పెళ్ళి చేసుకుంటానని పట్టుపట్టినా, నాకోరిక నెరవేరుతుంది. నా జీవన యాత్రలో సహచారిణిగా వచ్చే ఆ త్రిలోక సుందరి ఎక్కడ ఉంది? ఇప్పుడేమి చేస్తూవుంటుంది? నా జీవనసహచారిణి ఏదైనా కావ్యంలా కల్పనా తీతంగా ఉంటుందా లేక నేను రాజవంశ సాంప్రదాయంగా స్వయంవరంలో పాల్గొన వలసి ఉంటుందా? యవ్వన ప్రాంగణంలో విహరించేవారికి సహజంగా కలిగే రక రకాల అందాల ఊహాలలో నేను తేలియాడసాగాను.

కాని నేను అమ్మను గురించి ఆలోచిస్తున్నాను. నాన్నగారికి బాగాలేనప్పుడు, ఆఖరు రోజులలో నేను ఆమె బాధను చూడలేకపోయాను. ఆమె కళ్ళల్లో ఉన్న బాధామయ మేఘాలను చూచేందుకు ధైర్యం లేకపోయింది. బలిపీఠానికి తీసుకొని రాబడే మూగ జంతువులా ఉంది ఆమె. నాన్నగారు చనిపోయిన తరువాత కూడా నన్ను అనాథగా చేసి ఆయన వెనుక వెళ్ళిపోతుందని, నేను చాలా అశాంతిని పొందాను.

అయితే అంతా నావూహలుకు విరుద్ధంగా జరిగింది. మొదట్లో కొన్నిరోజులు ఆమె దుఃఖించింది. తరువాత త్వరగా కోలుకొని రాజమాతగా ఇంటి విషయాలు, బయటి విషయాలు కూడా చక్కపెట్టసాగింది. ప్రతి విషయంలో తన ఉత్సాహాన్ని చూపించసాగింది. ఆమె ముఖంలో వృద్ధాప్యపు ఛాయాలు తొంగి చూస్తూన్నా, ఆమెను చూస్తుంటే సాయంకాలపు నీడలు ఏవి గుర్తుకు రావడంలేదు. ఆమె చేష్ఠ లలో స్ఫూర్తి ఉంది. జీవితానందాన్ని ఆమె మరో రూపంలో పొందుతున్న దనిపిస్తుంది.

నా ఉదాసీనత ముందు ఆమె ఉత్సాహపూరితమైన రూపం మరింత ప్రకాశ వంతంగా కనిపిస్తుంది. అది వెనుతిరిగే నల్లని మేఘాలలో మెరిసే మెరుపు అని నాకనిపిస్తుంది.

ఇది విధి విధానంలోని విచిత్రం, పొంగుతున్న యవ్వనంలో యయాతి ముసలి వానిలా నీరసించి శక్తిహీనుడైయ్యాడు. వృద్ధాప్యవు ఆఖరి మెట్టున ఉన్న

అతని తల్లి నవయువతిలా ప్రతి పనిలో నిమగ్నమై ఆనందాన్ని పొందుతున్నది. కొత్త కొత్త కలలు కంటూ ఉన్నది.

ఆమె తన సుఖం అంతా నాన్నగారిపై ఆధారపడివున్నదని భావించడం నిరాధారం.

నిజంగా ఈ లోకంలో ప్రతివాడు తనకోసం జీవిస్తాడు. చెట్లు, చేమలు తమ వేళ్ళను నీరున్నవైపు తిప్పినట్లు ప్రతి మనిషి తన సుఖంకోసం దగ్గరవారిని ఆశ్రయి స్తాడు. ఈ లోకం దీన్నే ప్రేమని, ప్రీతి అని, స్నేహమని పిలుస్తుంది. కాని వాస్తవంగా అది ఆత్మప్రేమ. తడి ఆరినపుడు చెట్టుచేమలు ఎండిపోకుండా తడివున్న చోటుకు తన వేళ్ళను చొచ్చుకు పోయేటట్లు చేస్తాయి. ఆ తడి దగ్గర ఉన్నా లేక దూరంగా ఉన్నా - దాన్ని వెదికి, తిరిగి అవి పచ్చగా ఎదుగుతాయి.

బహుశ అమ్మ మనసులో ఈ నూతన ఉత్సాహం కూడా అదేవిధంగా ఉండి ఉంటుంది. మొన్న - మొన్నటి వరకు ఆమె మహారాణిలా వెలిగింది. అయినా ఇంత ఐశ్వర్యంలో ఆమెకు స్వేచ్ఛ ఎక్కడ ఉంది? తన అందంతో తన భర్తను తన వశంలో ఉంచుకోవడంలోనే ఆమె గొప్పతనం ఉందా? నాన్నగారు ఇంద్రాణిని మోహించినపుడు అమ్మ ఎంత నరకయాతన అనుభవించిందో? తనలోతను ఎంత దుఃఖించిందో, రాత్రులంతా మేల్కొని మంచంపైనున్న తలగడలను కన్నీరుతో తడిపి వుండి వుంటుంది. అప్పుడు ఆమె కన్నీటికి తుడిచే ప్రేమికుడు లేనపుడు అలా రోదించి వుంటుంది.

చిన్నప్పుడు అమ్మ తన స్తన్యం ఇచ్చి మాకు పాలు త్రాగించలేదు, ఒక మహాపురుషుని భార్యగా ఆమెలో ఈ దుఃఖం ఉండివుండవచ్చు. వాత్సల్యం కంటే అందంగా ఉండాలనే కోరిక ఆమెకు ఎక్కువగా ఉండి వుంటుంది. భర్త ఆమెకు సర్వస్వం. అయినప్పటికి భర్తపై ఆమెకు ఏమాత్రం అధికారం లేదు. అతను లేకపోతే ఆమెకు ఏమిలేదు.

నేడు ఆమె భయపడడంలేదు. ఆ విచారం లేదు. ఇప్పుడామె రాజమాత. కొడుకు మీద తల్లిగా ఉన్న అధికారం ఆమె ప్రతిమాటలో, అడుగడుగునా కనిపిస్తున్నది.

నా మనసులో అమ్మగూర్చి రకరకాల ఆలోచలనలు కలుగుతున్నప్పుడు రోజూ లాగానే మాధవుడు నన్ను కలవడానికి వచ్చాడు. ఈరోజు ఒక్కడే కాకుండా తారకను తీసుకువచ్చాడు. ఆ పెంకిపిల్లను చూడగానే మనస్సుకు హాయి అనిపించింది. ఆమెను దగ్గరకు పిలిచి అడిగాను.

'తారకా! నీ బొమ్మకు పెండ్లి కొడుకు దొరికాడా?'

ఆమె తలాడించి, 'అవును' అన్నది. నావైపు చూడకుండా, నాతో మాట్లాడ కుండా రాజభవనాన్ని చూడసాగింది.

'పెండ్లికొడుకు బాగా ఉన్నాడా?'

ఆమె తిరిగి తలవూపుతూ మాట్లాడకుండానే లేదని జవాబిచ్చింది. ఆమె మౌనంగా ఉండడానికి కారణమేమిటి? నాకు అర్థం కాలేదు. నేను నవ్వుతూనే ప్రశ్నించాను. 'బాగాలేడంటే? అతను ఆ బొమ్మలా లేడా?'

ముక్కు ఎగపీల్చుతూ తారక అంది, 'పెండ్లికొడుక్కి చప్పిడి ముక్కు'

'అయితే ఇందులో పోయిందేముంది? ఏనుగు అతని ముక్కుపై తన కాలు ఉంచి ఉంటుంది. ఈ లోకంలో చప్పిడి ముక్కు భర్తలు బాలామంది ఉన్నారు. ........... భార్యలూ ఉన్నారు'.

'అతను నత్తిగా మాట్లాడుతాడు'.

బొమ్మ నత్తిగా మాట్లాడుతుందా? ఈ చమత్కారం నా కర్థంకాలేదు. నేను మాధవుని వైపు తిరిగి అడిగాను, 'గొప్ప పండితుల ఇంట్లోని పశుపక్ష్యాదులు కూడా వేదాంతం మాట్లాడతాయని విన్నాను, కాని, ఇది వాటికన్న అద్భుతంగా ఉంది'.

'ఆ నత్తిమాటలు కలలోవిని, చెప్తూ ఉంది!' మాధవుడు చెప్పాడు.

నేను మనసార నవ్వాను. తారక మౌనంగానే ఉంది. మాధవుడు నాతో అన్నాడు 'ఈరోజు ఈమె అనుకోకుండా మహారాజు దగ్గరకు వచ్చింది'

'మంచిదే కదా? ఆ చప్పిడి ముక్కు పెండ్లి కొడుకు ముక్కు ఎత్తు

చేయించడానికేనా? అయితే రాజవైద్యున్ని పిలిపించి, ఆయన్ని అడుగుదామా! లేక వడ్రంగిని పిలుపించుదామా! అంతేకదా తారకా?'

'ఊహు'; ఆమె మౌనం సడరింది.

'అయితే నీకేం కావాలీ?'

తలవంచి ఆమె నాపైపు చూడడానికి ప్రయత్నిస్తూ అంది, 'నీవిప్పుడు మహారాజువు కదా?'

'ఔను'

'నీవు సింహంపై కూర్చుంటావా?'

'సింహం పైనా?'

'ఔను, సింహంపైన'; చిన్నాన్న చెప్పారు.

ఆమె అన్న మాటలు నాకు అర్థమైనయి. నేను నవ్వుతూ 'రాజు సింహాసనంపై కూర్చుంటాడు. లేకపోతే అతన్ని రాజు అని ఎవరు అంటారు?'

'ఆ సింహం తింటుందా?'

నేను గంభీరంగా సమాధాననిచ్చాను, 'ఊహు, అది ముసలిది. దాని అన్ని దంతాలు పీకించేశాం'.

'అది నన్ను తినదు కదా?'

'లేదు'

'అయితే నీవు నన్ను నీ రాణిని చేస్తావా?'

అదా సంగతి! తారక నా రాణిగా ఉండడానికి వచ్చింది! ఈ అద్భుతమైన స్వయంవరం చూసి నాలో నేను నవ్వుకోవడంతో కడుపు అంతా కదిలిపోయింది. ఈ నవ్వుతో పాపం తారక లేత మనసు గాయపడరాదని, నేను కృత్రిమ గంభీరతను ప్రదర్శించాను. మాధవుణ్ణి నవ్వవద్దని సైగ చేసాను.

'రాణిని అయితే నీవు ఏం చేస్తావు?' నేను తారకను అడిగాను.

తన అందమైన చిన్న చేతులు త్రిప్పుతూ ఆమె చెప్పింది 'నేను రాణినైతే, నానమ్మ నన్ను ఉదయాన్నే నిద్రలేపదు, నా బొమ్మకు ఎన్నో నగలు దొరకుతాయి'.

రాణి అయితే లాభమేమిటో బాగానే ఆలోచించింది. వాటిని బాగా కంఠస్థం కూడా చేసింది. ఆ లాభాలన్ని ఆమె తన ముద్దుమాటలతో తియ్యగా నాకు వినిపించింది. కాని నా దృష్టి ఆమె మాటలపై లేదు. స్వప్నలోకంలో విహరించే ఆమె బాల్యాన్ని చూస్తుంటే నాకు ఈర్ష్య కలుగుతున్నది.

రాణి అయితే లాభాలు ఎన్ని ఉంటాయో తారక లెక్కపెట్టుకుంది నేను ఆమెతో అన్నాను - 'నీవు ఇప్పుడు చాలా చిన్నదానవు. నీవు పెద్దదానివైన తరు వాత నేను నిన్ను నా రాణిగా చేసుకుంటాను, అర్థమైందా?'

చాలా మిఠాయిలు తారకకు ఇచ్చి పంపించి వేసాను.

సాయంకాలం అంగీరస ఆశ్రమం నుండి ఆయన ఉత్తరం తీసుకుని, ఇద్దరు శిష్యులు వచ్చారు. ఆ ఉత్తరం చదివి నేను తారక ధ్యాసనుండి విచిత్రమైన మరో లోకంలో విహరించసాగాను. అంగీరస మహర్షి ఉత్తరం ఈవిధంగా వుంది ·

'నహుష మహారాజు దివంగతుడైన కొన్ని దినాల తరువాత ఈ ఉత్తరం నీకు వ్రాస్తున్నాను. ఈ మధ్యనేను ఆశ్రమంలో లేను, అందుకే ఉత్తరం వ్రాయడం ఆలస్యమయ్యింది.

నీవు వెళ్ళిన కొన్ని రోజుల తరువాత కచుడు సంజీవనీ విద్య నేర్చుకునేందుకు వృషపర్వుని రాజ్యానికి వెళ్ళాడు. మా శాంతియజ్ఞం నిరాతంకంగా పూర్తి అయ్యింది. దేవదానవుల మధ్య యుద్ధాన్ని ఆపేందుకు మేము చేసిన ప్రయత్నం ఫలించలేదు. కళ్ళ ఎదుట అశుభకార్యం జరుగుతుంటే చేతిమీద చేయి వేసుకుని ఉంటే పురుషార్థమనిపించుకోదు. అందుకే ఏకాంతంలో పునశ్చ రణం చేసుకునేందుకు ఆశ్రమాన్ని విడిచి శివతీర్థం వెళ్ళాను. నా కార్యాన్ని పూర్తి చేసుకొని ఆశ్రమానికి తిరిగి వస్తూ మార్గమధ్యలో మహారాజు నహుషిని మరణవార్త విన్నాను. ఈరోజు ఆశ్రమం చేరుకుంటునే నీకు ఉత్తరం వ్రాస్తున్నాను.

యయాతి! మృత్యువును జీవుడు ఇష్టపడడు కాని అతనికి మరణం తప్పదు. జననం లాగే మరణం కూడా సృష్టి చక్రంలో రహస్య భరితమైన నాట్యభంగిమ, వసంతంలో కొమ్మకొమ్మలో తొంగి చూసే సింధూరపు చివురులు ఆదిశక్తిలీల అయితే, శిశిరంలో ఆకురాల్చే కాలంలో ఎండి రాలే పసుపుపచ్చ ఆకు ఆమె ఆట. ఈ దృష్టితో మనం మరణాన్ని చూడాలి. ఉదయం-అస్తమయం, గ్రీష్మం, వర్షం, చీకటి-వెలుగు, రాత్రి-పగలు, స్త్రీ-పురుషులు, సుఖం-దుఃఖం, శరీరం-ఆత్మ, జననం-మరణం, విడదీయరాని జంటలు. అది జీవితం యొక్క ప్రస్ఫుట ద్వంద్వ రూపం. ఈ అల్లికతోనే ఆదిశక్తి విశ్వవికాసపు వస్త్రాన్ని తయారు చేస్తుంది.

మహారాజు నహుషుడు మహావీరుడు. ఆ వీరత్వంతో ఎల్లప్పుడూ నీకు ప్రేరణ లభించాలి, ప్రజలు రాజకు కామధేనువు లాంటివారు. వారిని నీవు సేవించాలి. ధర్మ విరుద్ధం కాని కామ, అర్థాలకు నీవు పాత్రుడవుకావాలి. ఆదిశక్తిని అదే ఉద్దేశ్యంతో నేను పూజిస్తున్నాను.

ఉత్తరం ఇంతటితో ముగించబోయాను. కాని దుర్వార్తలు ఎప్పుడూ వంటరిగా రావని నాకనిపిస్తుంది.

రాక్షస రాజ్యం నుండి వచ్చిన ఒక మునికుమారుడు, కచుడు ఆ రాజ్యంలో ప్రవేశించారని చెప్పాడు. శుక్రాచార్యుడు ఆతనిని తన శిష్యునిగా స్వీకరించాడు. భక్తితో గురువుగారిని సేవించి, ఆతనిని ప్రసన్నుణ్ణి చేసుకొని, సంజీవని విద్య నేర్చుకోగలనని కచునికి ఆశ కలిగింది. ఈ సంజీవిని విద్యతోనే రాక్షసులు దేవతలను మట్టిలో కలిపి స్వర్గాన్ని జయించాలని ఆశిస్తూన్నారు.

అందుకే రాక్షసులు కచుని ద్వేషిస్తున్నారు. రోజులాగే కచుడు గురువుగారి ఆవులు మేపేందుకు తీసుకు వెళ్ళగా రాక్షసులు అతనిని చంపి ముక్కలు ముక్కలుగా నరికి తోడేళ్ళ ముందు పడవేశారు.

చాలాకష్టపడి ఈ సమాచారాన్ని ఈ మునికుమారుడు సేకరించ గలిగాడు. రాక్షస రాజ్యంలో ప్రవేశించి తిరిగి ప్రాణాలతో బయటపడడం చాలా కష్టం. సరి హద్దుల్లో చాలామంది ముని కుమారులు తమ ప్రాణాలను ఉగ్గబట్టి ఈ పని చేస్తున్నారు.

'ఇప్పుడు వారికి అక్కడ పనిచేయడానికి ఏమీ లేదు. కచుడు ఈవిధంగా హత్య చేయబడిన తరువాత, యయాతి! పై నాలుగైదు పంక్తులలోని మాటలు అస్పష్టంగా ఉన్నాయి కదూ! వాటిపై నా కన్నీటి బిందువులు పడ్డాయి. వాటిని ఆపేందుకు నేను చాలా ప్రయత్నం చేశాను కాని మునిగా, సన్యాసిగా జీవితంపై విరక్తి చెందినప్పటికీ నేనూ మనిషిని!'.

'కచుని సద్గుణాలు గుర్తుకు వచ్చి మనసు బాధపడింది. ఈ ప్రపంచంలో కొంతమంది మంచిగుణాలతో మరికొంత మంది చెడుగుణాలతో జన్మిస్తారు. కాని కొద్దిమందిలో - బహుశా చాలా కొద్ది మందిలో - మంచి గుణాలు బయటకు కనిపిస్తాయి. పర్వత శిఖరాలు ఆకాశాన్ని తాకేందుకు ప్రయత్నించినట్లు మనస్సు కూడా ప్రయత్నిస్తుంది. వారు ఔదాత్యం వైపు ఆకర్షితులౌతారు. కచుని స్వభావంలో ఈ విశేషం ఉంది. అది నా దృష్టిలో అమూల్యమైనది.

దేవదానవుల యుద్ధం నిరోధించే మహత్తర కార్యం అతను సాధించగలడని నేను ఆశించాను. కాని -

'ఆశించడం మానవుని సహజ గుణం, అది ఫలిస్తుందా' -

'నేను పైన వ్రాసినట్లు, జనన మరణాలు విడదీయరాని జంట. నేనిప్పుడు కచుని మరణానికి దుఃఖిస్తున్నాను. నీవు నన్ను చూచి నీలోనీవే నవ్వుకుంటావుకదూ! ఈ ప్రపంచంలో వేదాంతం ఇతురులకు చెప్పడానికేనా? అనే సందేహం నీకూ కలుగ వచ్చు. కాని నాలాంటి వృద్ధుని మాటలు గుర్తుంచుకో - ఈ ద్వంద్వ పూర్ణ జీవితంలో వేదాంతమే మానవుని అంతిమ జీవిత చరణానికి తోడు అవుతుంది.

రాజమాత వేదన నేను అర్థం చేసుకోగలను. నీ సత్కర్మలతో ఆమెతన దుఃఖం మరచిపోవాలని నేను ఆ ఆదిశక్తిని ప్రార్థిస్తున్నాను'.

నీవు రాజువయ్యావు. ఉత్తరం వ్రాయడానికి కూర్చున్నప్పుడు నిన్ను మీరు అనే సంబోధించాలని అనిపించింది. కాని మీరు కంటే నీవు అంటనే మనసులోని ప్రేమ సరియైన పద్ధతి తెలియజేయడమౌతుంది, ఔనా?'

అంగీరసుని ఉత్తరంలోని ఒక భాగం నా మనసుని హత్తుకుంది. అదే కచుని మరణంతో ఆయన కళ్ళ నుండి చిమ్మిన కన్నీరు కారణంగా ఉత్తరంలోని కొన్ని పదాలు అస్పష్టంగా ఉన్నాయి. మిగిలినదంతా వేదాంతం, పట్టి మాటలు.

మనిషి కేవలం వేదాంతంతో జీవిస్తాడా? లేదు. అతను ఆశతో జీవిస్తాడు, కలలలో జీవిస్తాడు, ఇష్టంతో జీవిస్తాడు, ఐశ్వర్యంతో, పరాక్రమంతో జీవిస్తాడు. కేవలం వేదాంతంతో అతను జీవించగలడా? ఈ ఋషులు - మునులు, అన్ని విషయాలలో వేదాంతం చొప్పించడానికి చాలా ఇష్టపడతారు.

ఏమైనా, ఆ ఉత్తరంలో కచుని వీరత్వ వర్ణన నన్ను ఆకట్టుకుంది. రాజైతే అలా ఉండాలి. సేనాధిపతి అలా ఉండాలి. కచుని బృహస్పతి ఇంటిలో పుట్టించి బ్రహ్మ చాలా పెద్ద తప్పు చేసాడు. చేతిలో ఆయుధం లేకుండా ఎంత ధైర్యంగా ఉన్నాడు. చంపబడుతున్నప్పుడు అతని స్థితి మెరుపులా ఉండి ఉంటుంది. కంఠంలో ఉన్న రుద్రాక్షమాలతో ఆడుకుంటూ ఆ దుష్ట రాక్షసులతో ఇలా అని ఉంటాడు - 'మీరు నా శరీరాన్ని ముక్కలు ముక్కలుగా నరక గలరు కాని నా ఆత్మను ముక్కలు చేయగలరా!' ఆతను అమరుడు.

అతనిలా ఏ సాహస కార్యం చేయకుండా, నేనిక్కడ పనిలేకుండా జీవితాన్ని గడుపుతూ రాజమహాలులో ఉన్నాను. నాపై నాకే కోపం వచ్చింది. ఇప్పుడు రాజ్యంలో ఎక్కడైనా రాక్షసులు విద్రోహ చర్య చేస్తే నా వీరత్వానికి సవాలు దొర కేది. యజ్ఞగుండంలోని బూడిద తీసివేసిన తరువాత అగ్నిజ్వాలలు తిరిగి ఎలా ప్రజర్విల్లు తాయో, అదేవిధంగా పనిలేకుండా కూర్చున్న యయాతి తిరిగి ఉత్సాహ వంతుడైన యయాతిగా మారుతాడు. ఉత్సాహవంతుడైన మనిషి మనసు లోహపు ఆయుధం వంటిది. దానిని ఎల్లప్పుడూ ఉపయోగిస్తూ ఉండాలి లేకపోతై అది తుప్పు పడుతుంది.

నాన్నగారు చనిపోయిన తరువాత రాజ్యంలో ఎక్కడా తిరుగుబాటు జరగలేదు. రాజ్యపాలన చక్కగా సాగుతున్నది. నేను మాత్రం రత్నపంజరంలో బందీ అయిన పక్షిలాగా ఉన్నాను.

కచుడు, వైనతేయునిలా ఆకాశంలో ఎగురుతూ, వెళ్ళిపోయాడు. ఈ విధంగా ఎక్కడికైనా వెళ్ళి సాహసకృత్యం చేయాలని నాకనిపించింది. ఈ ఆలోచనలతో రాత్రంతా మేల్కొని ఉన్నాను. తెల్లవారు ఝామున ఒక కలకన్నాను. ఆ కలలో యతి నాతో అంటున్నాడు. నీచుడా, స్వార్థపరుడా, దుష్టుడా! ఈ రాజ్యంపై నీకు ఏమి ఆధికారం ఉంది? నేను బ్రతికి ఉన్నానని నీకు తెలుసు. ఈ విషయం నీవు

అమ్మ దగ్గర దాచావు. లే! సింహాసనం పై నుండలే! లేకపోతే ఇప్పుడే శాపమిచ్చి నిన్ను భస్మం చేస్తాను.

ఇది విని నేను మేల్కొన్నాను. తిన్నగా అమ్మ దగ్గరకు ఎళ్ళి అశ్వమేథ యాగ సమయంలో యతిని కలుసుకోవటాన్ని, ఇప్పుడు చూసిన కలను ఆమెకు వినిపించాను. మొదట్లో ఆమె సంధిగ్ధంలో పడింది. నా కళ్ళల్లోకి సూటిగా చూస్తూ అడిగింది, 'యయూ, నీవు చెప్పినదంతా నిజమేనా?'

'అమ్మ! నాన్నగారి మీద ప్రమాణం చేసి చెప్తున్నాను'. ఆమె నిందిస్తున్నట్లు అంది - 'ఇతరులెవరిపై నైనా ప్రమాణం చేసి చెప్పు, నీ తండ్రి గొప్ప యోధుడు. ఆయన ఇంద్రుణ్ణి కూడా ఓడించాడు, కాని నా ఎదుట ఆయన చేసిన ఒక ప్రమాణం నిలుపుకోలేదు. నా దుఃఖం........'

నాన్నగారిని నిందిస్తూ అమ్మ మాట్లాడం నేను మొదట్లసారి విన్నాను. వారిద్దరు ఒకరినొకరు ప్రేమించుకున్నారని నా ఉద్దేశ్యం. కాని అది నాటకం. ఆ నాటకంలో అమ్మ నవ్వుతూ భార్యగా తన పాత్రను అతి సమర్థవంతంగా పోషించింది. ఈ అనుభవాన్ని నేను మొదటిసారి పొందాను. అది నా మనసును గాయపరిచింది.

నా వీపును ప్రేమతో నిమురుతూ అమ్మ అంది - 'బాబూ, నీవు పురుషుడువు, స్త్రీ బాధ నీవు ఎప్పటికీ అర్థం చేసుకోలేవు. ఒకే వ్యక్తి పట్ల ఎంత ఇష్టంగా ఉన్నా అతనికి బానిసగా ఉండటం..........' ఆమె కొద్ది క్షణాలు ఆగి, ఏడుస్తూ చెప్పింది, 'నేను మహారాణిని కాదు యయూ! మహాదాసిని. ఆయన కను సైగల్లో నేను జీవితమంతా గడిపాను. కాని ఇప్పుడు నేను ఆవిధంగా ఇంక జీవించను. భర్తపై కంటే కొడుకు మీద తల్లికి అధికారముంటుంది. కొడుకు ఆమె హృదయపు తునక'.

ఆమె చెప్పింది, నిజం కావచ్చు. అది ఒక కఠోర సత్యం. అందుకే ఆమె నాకు చెప్పలేదు. నేనామెను ఓదార్చుతూ అన్నాను, 'అమ్మా నేను ఎప్పుడూ నీకు బాధ కలిగించే పని చేయను'.

మాట్లాడుతూ మాట్లాడుతూ ఆమె పాదాలను చేతితో తాకాను. ఆ స్పర్శతో, మాటలతో ఆమె కొద్దిగా ఓదార్చుపొందింది. రెండు చేతులతో నన్ను పైకి లేపు అశ్రుపూరితనయనాలతో నా ముఖాన్ని నిమిరింది.

కొద్దిసేపటి తరువాత నేను తూర్పు ఆర్యావర్తం వెళ్ళి యతిని వెదికి తీసుకు వచ్చేందుకు అమ్మ అంగీకరించింది. నా ప్రయాణాన్ని రహస్యంగా ఉంచటానికి నాతో కొద్దిమంది అతి అవసరమైన వ్యక్తులను తీసుకు వెళ్ళేందుకు ఒప్పుకుంది. కాని యతి కలువకపోతే, అతను ఉండేచోటు తెలియకపోతే నేను తిరిగి హస్తినా పురం వెంటనే చేరుకోవాలని ఆమె షరత్తు విధించింది. ఆ షరత్తుకు నేను అంగీ కరించాను. ఆమె స్వయంగా నాతో బయలుదేరాలని అనుకున్నది. కాని దూర ప్రయాణంలో ఇబ్బందులు భరించడం కష్టం, పైగా రాజధానిలో యువరాజూ, రాజ మాత ఇద్దరూ లేకపోవటం మంచిదికాదు.

నా రాజ్యాభిషేకానికి బదులుగా అమ్మ నా ప్రయాణానికి ఏర్పాట్లు చేస్తున్నది. మంత్రిగారికి అత్యంత విశ్వసనీయుడైన మందారుణ్ణి నా అంగరక్షకుడిగా నియమిం చింది. దారిలో నాకు ఎటువంటి కష్టం రాకుండా రకరకాల పనులు చేయడానికి సేవకులతో సహ ఒకరిద్దరు దాసీలను పంపించడానికి ఆమె నిర్ణయించింది. ఆమె నాతో అంది, 'ముకుళిక చాలా తెలివైనది. ఆమెను నీతో తీసుకువెళ్ళితే ఎలా వుంటుందీ?'

నేను క్షణకాలం ఆలోచనలో పడ్డాను. తిరిగి స్థిరంగా చెప్పాను. ఆమె కంటే కలిక అయితే బాగుంటుంది. ఆమెకు ఎక్కువ అనుభవం కూడా ఉంది. నాపై ఆమెకు మంచి అనురాగం ఉంది'.

'కలికా! ఆమె ఇక్కడెక్కడ ఉంది?'

చాలాకాలంగా ఆమెను చూడలేదు, అందుకే ఆమె రాజమహల్‌లో లేదని అనుకోలేదు. నేను 'ఆమె ఎక్కడకు వెళ్ళింది?'

'చాలాదూరం హిమాలయాలలో ఏదో గ్రామం'

'అక్కడకు ఎందుకు వెళ్ళింది?'

'ఇదీ ప్రశ్నేనా? ఆమె తన కుమార్తె సంసారాన్ని చూడడానికి వెళ్ళింది'

'అందుకా? అలక పెళ్ళి ఎప్పుడైంది?'

'చాలా రోజులైంది. నీవు శాంతియజ్ఞానికి వెళ్ళావు కదా? అప్పుడు'

'నాకు తెలియనే లేదు?'

'ఇందులో నీకు తెలియ చేయటానికేముంది?'

'దాసీ కూతురు పెళ్ళి, బొమ్మల పెళ్ళి మనకు ఒకటే'

నేను ఊరుకున్నాను.

అమ్మ భవిష్యత్ లక్ష్యాలను దృష్టిలో ఉంచుకొని చెప్పసాగింది. 'నీవు తిరిగి వచ్చేటప్పటికి ఇక్కడ నేను ఇద్దరు రాజకన్యలను ఎంపికచేసి ఉంచుతాను'.

నేను నవ్వుతో అన్నాను 'ఎందుకు? నాకు ఒకేసారి రెండు పెళ్ళిలు చేస్తావా?'

అది కాదు బాబూ! ఒక ఆమె నీకు భార్య అవుతుంది. రెండవది .......... రెండవది ............' చెప్పాలా వద్దా అనే సందిగ్ధంలో పడి చివరికి ధైర్యంగా చెప్పింది. 'యతి వస్తే అతనికి పెళ్ళి చేయాలి కదా?'

నా రాణి అయ్యేందుకు వచ్చిన తారకకు, యతికి పెళ్ళి చేయాలంటున్న అమ్మకు లేడా ఏమిటో, నాకర్థంకాలేదు. మాతృత్వం పసిమనసులా ఉంటుందా? నేను అమ్మను చూస్తూ ఉన్నాను. చూస్తూ ఉంటే మనసులో ఒక ఆలోచన వచ్చింది. ఒక మనిషి స్వభావం రెండో మనిషికి ఎప్పుడూ పూర్తిగా అర్థంకాదు కదా? ఇప్పుడు మా అమ్మ కూడా, కాని ఆమె స్వభావం - కాదు! ఆకాశం అంచులు కలుస్తాయేమో కాని మనషుల స్వభావం .........

నేను వెళ్తున్న దారిలోనే అంగీరసుని ఆశ్రమం ఉంది. నేను ఆయనను చూడ డానికిని వెళ్ళాను. నాకు సంతోషంగా స్వాగతం చెబుతూ ఆయన అన్నారు - 'యయాతీ, నీరాక మాకు ఆనందాన్ని కలగుజేసింది. నీవు రావటానికి కొద్ది క్షణాల ముందు మాకు ఒక శుభవార్త అందింది. రాక్షసులు కచుని ముక్కలు ముక్కలుగా తరిగి తోడేళ్ళకు వేసినప్పటికి శుక్రాచార్యులు శిష్యప్రేమతో కచుని పునర్జీవితుణ్ణి చేశారు. దేవతలకు సంజీవిని విద్య లభించబోతున్నది'. ఆ వార్తవిని నేను చాలా సంతోషించాను. నేను నా ఆనందాన్ని వ్యక్తం చేస్తున్నంతలో ఒక ముని కూమారుడు వేగంగా లోపలికి వచ్చాడు. అతని కాళ్ళు దుమ్ముకొట్టుకోపోయి

ఉన్నాయి. ముఖమంతా చెమట పట్టివుంది. ముఖం వాడివుంది. దూరం నుండి రావటం వలన ముఖం వాడి వుందో లేక - .........!

అతను చాలా విచారంతో చెప్పసాగాడు. 'రాక్షస రాజ్యంలో అట్టహాసంగా ఉత్సవం జరుగుతున్నది. మదిర దొరకడంతో మరింత ఆనందంతో మదిరోత్సవం జరుపుకుంటున్నారు ............'

నేను మధ్యలో అడిగాను, 'రాక్షసులకు మదిర ఏమి ఉపకారం చేసింది?'

అతను చెప్పాడు. 'శుక్రాచార్యులు కచుని తిరిగి బ్రతికించకుండా ఉండేందుకు రాక్షసుల ఒక పన్నాగం పన్నారు'.

'పన్నాగమా!' - అంగీరసుడు ప్రశ్నించాడు.

'కచుని చంపి భస్మం చేసి, దానిని మదిరలో కలిపి శుక్రాచార్యునితో త్రాగించారు. ఇప్పుడు కచుడు శుక్రాచార్యుని కడుపులో ఉన్నాడు. శుక్రాచార్యుడు మదిరా దాసుడు. రాక్షసుల పన్నాగం ఫలించింది. ఇప్పుడు కచుడు తిరిగి బ్రతకి .......'

ఒక్క క్షణంలో ఆశ్రమమంతా విచారంతో నిండిపోయింది.

అంగీరసుని వద్ద సెలవు తీసుకొని బయలుదేరినప్పటికీ నా మనసు పై ఆ ప్రభావం ఉంది. దారిలో కనిపించిన సుందరమైన ప్రకృతి కారణంగా ఆ ప్రభావం కొంత తగ్గింది. ఎత్తైన పర్వతాలు, లోతైన లోయలు, విశాలమైన ఇంద్రధనుస్సు, సీతాకోక చిలుకులు, పొడవైన తాడిచెట్లు, చిన్నచిన్న తోకలున్న బుర్రుపిట్టలు, వాటి అందం నాకు ఆనందం కలిగించింది. రకరకాల నగరాలు, గ్రామాలు, లావుగా దృఢమైన శరీరాలు గల స్త్రీ పురుషులు, వారి అందమైన ఆకారాలు, అలంకరణాలు, రకరకాల వస్త్రాలు, వస్తువులు, ఆభరణాలు, రకరకాల పాటలు, నాట్యాలు, పండుగలు అన్నీ చూస్తూ వింటూ, నా యాత్రను ముందుకు కొనసాగించాను. వీటి కారణంగా నా మనసు సేదదీరింది. యతిని వెదికేందుకు రాజమహల్ నుండి బయటకు రావడం మేలయ్యింది. ఈ విశాలవిశ్వంలో ఒక కచుడు, ఒక యతి, యయాతిల అదృష్టం ఏమి ఉంది? ఈ విశాలమైన సృష్టిలో మానవుడు ఒక క్షుద్ర

జీవి, అతని సుఖంలో దుఃఖంలో ఏముంది? సముద్రపు అలలలో కొట్టుకుపోతున్న గడ్డిపోచ గురించి ఎవరైనా ఆలోచిస్తారా?

మేము తూర్పు ఆర్యావర్తానికి త్వరగా చేరుకోవాలని ప్రయత్నించాము. ఈ ఆతృతలో కూడా నాకు కష్టం కలగకూడదని సేవకులు దృష్టిలో ఉంచుకున్నారు. మందారుడు ఎక్కువగా మాట్లాడటానికి ఇష్టపడడు, అయినప్పటికీ అతను నేను నిద్రలేచి మరల నిద్రపోయో వరకు - నిద్రపోయిన తరువాత కూడా - నా. ఆనం దానికి ఎటువంటి అవరోధం కలగకుండా ఉండేదుకు చాలా జాగ్రత్తలు తీసుకునే వాడు. ఒకో సారి నేను మధ్య రాత్రి లేచి పైకప్పు చూస్తూ ఉండిపోయే వాడిని. అతను నేనుండే స్థలాన్ని తొంగి చూస్తూ వెళ్ళిపోతూ ఉండడం నేను గమనించాను.

ఏ ఉద్దేశ్యంతో నేను ఇంతదూర ప్రయాణం చేశానో అది నెరవేరేటట్లు కనపడ లేదు. యతి తన గుహను వదిలి ఎక్కడకో వెళ్ళిపోయాడు. ఆ గుహ దగ్గర చుట్టుప్రక్కల ఉన్న గ్రామాలను వెదికాను. చాలామందిని కలిసి అడిగాను. చిన్న పెద్ద అందరిని ప్రశ్నించాను. తన గుహవద్ద ఎవరినీ ఉండనివ్వని అతను అప్పు డప్పుడు పట్టణాలకు వెళ్ళేవాడని చెప్పారు. ప్రజలు అతనికి ఒక ప్రయోగశాల అయ్యారు. నీటి పైన, అగ్నిమీద నడవడం అతనికి భూమి మీద నడిచినంత సులభమైందట. అతను ఆకాశంలో నడవడం చాలా మంది చూసారు. తూర్పు ఆర్యవర్తం ప్రాచీన కాలం నుండి ఇంద్రజాల విద్యలకు ప్రసిద్ధి. కాని ఇప్పుడక్కడ పెద్దపెద్ద ఇంద్రజాలికులు కూడా యతి ఆధిపత్యాన్ని అంగీకరించారట. ఇంత సిద్ధిని పొందినప్పటికీ యతి సంతృప్తిపడలేదు. స్త్రీని చూడగానే అతనికి పిచ్చి పట్టేది. అతను ఏ ఊరు వెళితే ఆ ఊరు స్త్రీలంతా తమ ఇల్లు తలుపులు మూసి లోన ఉండేవారు. ప్రపంచంలోని స్త్రీలను పురుషులుగా మార్చాలనే కోరిక అతనిని దహించసాగింది. దాన్ని సాధించేందుకు ఉగ్రమైన తపస్సు చేశాడు. కాని అది ఫలించలేదు. ఈ అసంతృప్తిలో, శుక్రాచార్యుడు సంజీవిని విద్యతో చనిపోయిన వారిని బ్రతికిస్తున్నాడనే వార్త విన్నాడు. తన కోరిక తీర్చుకునేందుకు అటువంటి గురువు అవసరమని తెలుసుకొని, కొన్ని నెలల ముందే రాక్షస రాజ్యానికి బయలుదేరి వెళ్ళిపోయాడట.

ఈ సమాచారం ఆధారంగా యతి గుహను పూర్తిగా వదిలిపెట్టి ఎక్కడకో వెళ్ళిపోయాడని తెలిసింది. బహుశా అతను శుక్రాచార్యుని దగ్గరకు వెళ్ళి ఉండ వచ్చు.

అతనిని వెదకడం అంటే గాలిలో ముడివేయడం వంటిది. యతి కలవకపోతే వట్టి చేతులతో, హస్తినాపురం తిరిగి చేరుతానని అమ్మకు మాట ఇచ్చివచ్చాను కదా! మందారుడు యథాప్రకారం నా క్షేమసమాచారం హస్తినాపురం పంపుతూనే ఉన్నాడు. నేను హస్తినాపురం చేరుకపోతే అమ్మ నాకై విచారిస్తుంది. ఇందులో సందేహంలేదు. నాకు బాగా తెలుసు.

మేము హస్తినాపురానికి తిరుగు ప్రయాణం సాగించాం. మధ్య మధ్యలో మజిలీలు చేస్తూ మూడు - నాలుగు రోజులు ఏకధాటిగా ప్రయాణించాం. ఐదవరోజు ఒక అందమైన రమణీయ ప్రదేశం చేరుకున్నాం. అది రాజమార్గానికి కొద్దిగా దూరంగా ఉంది.

కొండ, లోయ, నది, అడవులతో ఆ ప్రాంతం సుందర ప్రకృతికి నిలయమై ఉంది. కొండ పెద్ద ఎత్తైనదికాదు. నది మధ్యలో ఒక సుడిగుండం ఉంది. మిగిలిన దంతా ఒక సేలయేరు మాత్రమే. అదేవిధంగా అడవి మధ్యలో కొంత భాగం తప్ప మిగిలినదంతా ఒక ఉద్యానవనంలా ఉంటుంది. నేను మొదటిసారి ఈ ప్రదేశాన్ని చూస్తూన్నా. పిల్లల ఆటస్థలంగా బ్రహ్మ దీనిని సృష్టించాడని పించింది. రెండు క్రోసుల లోపు బస్తీ ఏది లేదు. ఏకాంత ప్రాంతంలో భయం ఉంటుంది, కాని ఇక్కడ అటువంటిది ఏదీ లేదు. పక్షుల కలకలరావం - అవి తమలోతాము మాట్లాడు కుంటున్నాయి అనిపించింది. కలకల గలగల ప్రవహించేనది కన్నెపిల్ల తన ధ్యాసలో పాడుతూ ఆడుతున్నట్లుంది. లోయ ఒక ప్రశాంతమైన శయన మందిరంలా ఉంది. కొండ యాగవాటికలా ఉంది. మనస్సుపై ఎటువంటి బరువు లేదు, భయమనేది కలగదు. అక్కడ సౌమ్యమైన, రమ్యమైన రమణీయమైన అనంత ఆనందం మాత్రమే ఉంది.

అమ్మ నాకై, ఎదురు చూస్తూ ఉంటుందని నాకు తెలుసు. నేను త్వరగా హస్తినాపురం చేరుకోవాలి. కాని ఈ సుందర రమణీయమైన ప్రాంతం నన్ను ముగ్ధుణ్ణి చేసింది. గంటల తరబడి చూస్తూన్నా నాకు తృప్తికలగటంలేదు. కళ్ళు

తెరచినా నిద్ర మత్తు వదలని కారణంగా శయ్యా నుండి లేవటానికి మనసు ఇష్టపడ నట్లుంది, నా పరిస్థితి ఆ ప్రాంతాన్ని విడిచి వెళ్ళాలనిపించడంలేదు. ముందుకు ప్రయాణించకుండా నేను అక్కడే ప్రకృతి అందాలను ఆస్వాదించ సాగాను. మధ్యలో యతి గుర్తుకోచ్చే వాడు. ఆయన చాలా సుందర ప్రాతాలు చూచి వుంటాడు. కాని ఎందుకో అతను ఈ సౌందర్యాన్ని కన్నుల్లో నింపుకోవాలని అను కోలేదు? మంత్రతంత్రాలు, హఠయోగం వంటి దుర్భరమైన మార్గాన్ని అతనెం దుకు ఇష్టపడ్డాడు? ఇప్పుడు శుక్రాచార్యుల సేవ చేసి మొత్తం ప్రపంచాన్ని పురుష మయం చేసే విద్యను నేర్చుకునేందుకు అతను వెళ్ళాడు. స్త్రీతో - ఆమె అందంతో ఎందుకు ద్వేషం పెంచుకున్నాడు? ఎంత పిచ్చి కోరిక అతనిది! అతను ఈ అందమైన ప్రకృతిని చూస్తే తప్పక మరుభూమిగా మార్చేందుకు ప్రయత్నిస్తాడు. అయితే మానవుని చివరి కోరిక ఏమిటి? సహజమైన, సుందరమైన ప్రకృతిని ప్రేమించాలని, పూజించాలి. జీవితం వికసించేలా దానిని అనుభవించాలి లేదా ..............'.

రెండు రోజులు గడిచాయి, మూడోరోజు గడిచింది. కాని ఆ ప్రాంతాన్ని విడిచి వెళ్ళాలనిపించుటలేదు. నేను ఎక్కడకు వెళతానో, ఏం చేస్తానో, ఎందుకు ఈ ప్రాంతాన్ని విడిచి వెళ్ళేందుకు ఇష్టపడడం లేదో మందారునికి అర్థం కావడం లేదు. రెండు మూడుసార్లు నాకు తెలియకుండా అనుసరించాడు. ఈ ప్రాంతంపై నా మనసులో కలిగిన ఆకర్షణ గురించి మందారకుడికి వివరించేందుకు నావద్ద మాటలులేవు.

ఈ రమణీయమైన ప్రాంతానికి మరల ఎప్పుడు వస్తానో నాకే తెలియదు. వస్తానో, రానో, బహూశా ఎప్పుడూ రాకపోవచ్చు. జీవితరేఖ వక్రంగా ఉంటుంది. దాని గతి తెలిసీ తెలియకుండా ఉంటుంది. అది నన్ను తిరిగి ఈ ప్రాంతానికి రానిస్తుందా? ఈ ప్రపంచంలో ఆనందం పొందే సమయం ఒకటే - అది లభించి నపుడే.

ఈ ఆలోచలతోనే నేను నా ప్రయాణాన్ని వాయిదా వేస్తున్నాను. రోజులు గడుస్తున్నకొలద్దీ మందారుడికి అసహనం పెరగసాగింది. చివరకు ఐదవరోజు అతను నాతో చెప్పాడు - 'రేపు చీకటితోనే మనము ఇక్కడ నుండి వెళ్ళిపోవాలి'

అతను వెళ్ళిపోవాలి అని పట్టుపట్టడంవలన నాకేమీా అనిపించలేదు. నేను హస్తినాపురం రాజును, అతను నా సేవకుడు, అయినప్పటికీ నేను ఇక్కడ ఎందుకు ఉండాలో అతనికి వివరించలేకపోయాను. చివరకు అక్కడి నుండి బయలుదేరే నిశ్చయంలో చివరిసారిగా అన్నట్లు అన్యమనస్కుడనై ఆ ప్రాంతానికి వెళ్ళాను. దగ్గర వ్యక్తిని విడిచిపోతుంటే మనసుకు బాధ కలుగుతుంది కదా? అదే పరిస్థితి నాకు కలిగింది. మనిషిని విడిచి వెళ్ళడం వలన కలిగే దుఃఖం, ఆ దుఃఖాన్ని పంచుకునేందుకు ఎవరైనా వస్తే వారితో కన్నీటితో, స్పర్శతో తన దుఃఖాన్ని తెలియజేస్తాడు. కాని ఇక్కడ ఆ పరిస్థితి ఏది?

సాయంకాలపు పొడవైన నీడలు కొండ శిఖరాలపై, చెట్లకొమ్మలపై, జలాశయపు ధారలపై మెల్లమెల్లగా పరచుకోసాగాయి. ఆ దృశ్యాన్ని చూస్తూ నేను ఆ చెట్టు మీద ఎప్పటిలాగానే కూర్చున్నాను. మరి కొంచెం సేపటిలో ఇక్కడ నుండి వెళ్ళి పోవాలనే ఆలోచన మనసును బాధించసాగింది. అప్పుడే నది ఒడ్డున ఒక లేడి ఠీవిగా నిలబడి నాకు కనపడింది. నీళ్ళు త్రాగడానికి వచ్చి అక్కడ ఎవరో శిల్పి చెక్కిన అందమైన శిల్పంలా నిలబడి ఉంది. అనుకోకుండా నాకుడిచేయి భుజంపైకి వెళ్ళింది. ధనుర్బాణాలు గుర్తుకొచ్చాయి. నాలోని వేటగాడు మేల్కొన్నాడు. కాని అది క్షణకాలమే వెంటనే వేటాడటం పాపం అనే భావన మనస్సులో నాటుకుంది. ఈ భావన క్షత్రియునికి శోభస్కరం కాదు.

ఆ లేడి అలా నిలుచునే ఉన్నది. నేను ప్రక్కకు తిరిగి నది రెండు ఒడ్డును చూసి ఆశ్చర్యపోయాను. అక్కడే లేడిలేదు. బహుశ ఎవరో యువతి నిలుచుని ఉన్నది. ఆమె వీపు నావైపు ఉన్నది. ఈ నిర్జన ప్రాంతానికి ఆమె ఎందుకు వచ్చింది?

ఆమె ఆకాశం వైపు చూచి చేతులు జోడించింది! మరుక్షణం నదీ ప్రవాహంలో దూకింది.

ఆ యువతిని రక్షించేందుకు నేనూ ప్రవాహంలో దూకాను. అప్పుడు నా మనసు జాలితో నిండి ఉంది. ఆమెను తెలివిలోకి తెచ్చేందుకు ఆమె తలను నా ఒడిలో ఉంచుకున్నాను. ఇప్పుడు జాలికి బదులు భయం, ఆశ్చర్యం, ఆనందం నా మనస్సును ఆక్రమించు కున్నాయి.

ఆమె అలక.

అలక ఎక్కువ నీళ్లు త్రాగలేదు. త్వరగానే ఆమె కళ్ళు విప్పింది. నన్ను చూస్తూ మెల్లగా నవ్వి కనురెప్పలు వాల్చింది. చాలా నెమ్మదిగా అడిగింది. 'అమ్మా! యువరాజు ఎప్పుడు వచ్చారు?' ఆమె యింకా పూర్తిగా కోలుకోలేదు. బాహ్య ప్రపంచాన్ని గుర్తించటంలేదు.

'అలకా! ఇప్పుడు నేను యువరాజును కాను, మహారాజును' - నేను నవ్వుతూ చెప్పాను.

ఆమె తిరిగి కనురెప్పలు తెరచి నాపై దృష్టి నిలిపి నిజంగా తప్పిపోయింది, 'మహారాజా!' అంటూ మధురంగా నవ్వింది, చాలా సంవత్సరాల క్రితం ఒకరాత్రి నా తలవద్ద నిలబడిన ముగ్ధమనోహర రూపం నాకళ్ళముందు నిలబడింది. ఒక శిశువు దీపాన్ని తదేకంగా చూస్తున్నట్లు ఆమె నన్ను చూస్తున్నది. బహుశా ఆమె సంభ్రమాశ్చర్యాలలో మునిగి వుండవచ్చు. ఇది కలా లేకా నిజమా! ఆ స్థితిలో ఆమె మరింత సమ్మోహనంగా కనిపించింది. ఆమెను ముద్దుపెట్టుకోవాలనే కోరిక నా మనసులో కలిగింది. ఆమె పెదవుల పై నా పెదవులను ఉంచేందుకు తల వంచాను. బహుశా ఆ ఉద్దేశ్యం ఆమెకీ కలిగిందేమో! తల ఊపుతూ అంది, "హుఁ.!'.

ఆమె గొంతుక పూడుకుపోయింది. కాని ఆ వెనుక నిగ్రహం ఉంది. నేను నా తలను ఎత్తాను. మౌనంగా తడినిండిన కళ్ళతో నన్ను చూస్తూ నా చేతులు గట్టిగా పట్టుకొని చెప్పింది - 'ఇప్పుడు నేను పరాయ స్త్రీని. మహారాజా!'

ఆమె చేయి వణుకుతున్నది. ముఖంలో భయం. నేను చాలాసార్లు అడిగితే గాని ఆమె తనకథ చెప్పలేదు. పూర్తిగా తడిసిన బట్టలు, నీరు కారుతున్న జుత్తు, దేనిమీద ఆమెకు దృష్టిలేదు.

పెద్దమ్మ ఆమె పెళ్ళికుదిర్చింది. అమ్మ సంతోషించింది. పెళ్ళి జరిగింది. భర్త ఒక రైతు. అతను అందమైన వాడు, దృఢమైనవాడు, ధనవంతుడు, కాని అతడు జూదరి. జూదమంటే అన్ని మరచిపోతాడు. ఇల్లు, భూమి, భార్య, తల్లి, ఎవరూ గుర్తుకురారు. అతనికి ఒక స్నేహితుడున్నాడు. అతడు గారడీలు చేస్తాడు.

ఒక రోజు భర్త అలకను తిరునాళ్ళకు తీసుకొని బయలుదేరాడు. ఆ స్నేహితుడు కూడా తోడయ్యాడు. అక్కడ జూదమాడి అంతా పోగొట్టుకున్నాడు. అలకను తీసుకొని అక్కడ నుండి బయట పడ్డాడు. మిత్రుని సహాయంతో కర్ణ పిశాచిని వశం చేసికొని జూదంలో చాలా సొమ్ము సంపాదించవచ్చని గాలిలో మేడలు కడుతుంటాడు ఆమె భర్త. ఆ స్నేహితుడు కూడా రాత్రి పగలనక మంత్ర తంత్రాలలో మునిగి ఉంటాడు. మనిషిని గాడిదగా మార్చాలనే ప్రయత్నంలో ఉన్నాడు. మనిషిని కుక్కగా, మేకగా మార్చే శక్తి తనకు ఉందని అందరితో చెపుతూ ఉంటాడు.

ఆ ఇద్దరితో కలిసి తిరుగుతూ అలక ఇల్లువదలి చాలా దూరం వచ్చింది. భర్తకు మంచి మాటలు చెపితే అందుకు అతను కోపంగా చూస్తూ స్నేహితునితో ఇలా అంటాడు, 'ఈమెను కుక్కగా గాని మేకగాగాని మార్చివేయి. మరెప్పుడూ గొణగదు, నోరు మూసుకొని మన వెంటపడి వస్తుంది'. ఆ మిత్రుడు అగ్నిని ప్రజ్వలింప జేసి అందులో ధాన్యాన్ని జల్లి ఏవోమంత్రాలు గొణుగుతాడు. అలకకు ప్రాణం పోయినట్లుంది. వారిద్దరికి దణ్ణంపెట్టి మరెప్పుడూ అలా మాట్లాడనని ప్రమాణం చేస్తే ఆ మంత్రగాడు మంత్రోచ్చారణ ఆపేస్తాడు.

అయినా ఆమె దురదృష్టం అంతటితో ఆగిలేదు. నాలుగయిదు రోజుల క్రితం ఆమె భర్త ఆమెను జూదంలో పణంగా పెట్టి ఓడిపోయాడు. గెలిచినవాడు కోరికతో ఆమెను చూడసాగాడు. ఏదో చెప్పి ఆమె అక్కడ నుండి తప్పించుకొని చీకటిలో కనిపించిన త్రోవలో పరిగెత్తింది. దాగుకుంటూ నడుస్తూ, ఎవరైనా, ఏదైనా యిస్తే తింటూ, నీరు త్రాగుతూ రోజులు గడిపింది. చివరకు ఈ బాధనుండి విముక్తిని పొందేందుకు ఆత్మహత్య ప్రయత్నం చేసింది.

ఆ కథ చెప్పటానికి ఆమెకు చాలా కష్టమనిపించింది. ఆ కథ విన్న తరువాత నాకు విధి ఎంతో క్రూరమైన పిల్లి వంటిదనిపించింది. మనిషిని చంపటానికి ముందు అతనితో, ఎలుకతో పిల్లి చెలగాటమాటినట్లు, ఆడుతోవడంలో విధికి ఆనందం కలుగుతుందేమో.

సూర్యుడు అస్తమిస్తున్నాడు, కాని అలక జీవితంలో ఒక నూతన ఆశ ఉదయి స్తున్నదని చెప్పడం సబబు. ఆమె ముంగురులను ప్రేమతో సరిచేస్తూ నేను చెప్పాను.

'నీవు భయపడవద్దు - నీవు నా ............'

నా వడిలో ఉంచిన తన తలను ఎత్తి కోపంతో ఆమె చెప్పింది, 'లేదు. నేను నీ దాన్ని కాదు! నేను - నేను - వేరొకరి దాన్ని'.

ఆమె తలను తడుతూ నేను చెప్పాను - 'పిచ్చిదానా! నీవు నా సోదరివి! నీకు గుర్తుందా? నేను మీ అమ్మపాలు త్రాగాను'.

ఊరట కలిగించే మాటలలో, నావారనే స్పర్శలో ఎంత శక్తి వుంటుందో!

ఆరిపోతున్న దీపానికి చమురు దొరికినంత సంభ్రమంతో అలక నవ్వింది.

సంధ్య భూమిని త్వరగా చేరుకుంటున్నది. ఈ నిర్జన ప్రాంతంలో ఇంకా ఉండడం మంచిదికాదు. నేను అలకను మెల్లగా లేవనెత్తి కూర్చుబెట్టాను. తరువాత చేయిపట్టి నిలబెట్టాను. నది నుండి దూరంగా తీసుకుపోయాను. నదిలోని నీరు కడుపునిండా త్రాగింది. ఇప్పుడామె పూర్తిగా తేరుకుంది.

ఆమె నీరు త్రాగుతున్నప్పుడు వీడిన ఆమె శిరోజాల వైపు చూసాను. అస్తమిస్తున్న సూర్యుని కిరణాల కాంతిలో ఆమె తలలోని నాలుగైదు వెంట్రుకలు తళుక్కన మెరిసాయి. అలకను నేను చిన్నతనం నుండి చూస్తున్నా, ఆమె శిరోజాలలోని ఒకపాటి అందమైన బంగారు పాయలను నేను ఎప్పుడూ గమనించలేదు. ఇప్పుడు మొదటసారి చూసి, నవ్వుతూ అన్నాను, 'నీ శిరోజాలు బంగారు రంగు కలిగి ఉన్నాయి'.

'ఔను, కొన్ని'

'ఉండాలి'

'ఎందుకు?'

'గొప్పవారి మాటలు గొప్పగా ఉంటాయి'

ఆమె గుండె లోతులనుండి నవ్వుతూ నాపై దృష్టి నిలిపి అన్నది, 'అవును, నేను చాలా గొప్పదాన్ని. మీకు తెలుసా, నేను ఎవరినో?'

'తెలియదు'

'హస్తినాపుర మహారాజు యయాతి సోదరిని'

ఆ రాత్రి నేను నిద్రించాను. అప్పుడు బంగారం రంగు కేశాలు గల అలక నదీ ప్రవాహంలో నిలబడి నాతో అంటున్నది - 'నేనెవరో, మీకు తెలుసా? హస్తినా పుర మహారాజు యయాతి సోదరిని!' ఆమె అందమైన ఆకారాన్ని కనులనిండా నింపుకొని, ఆమె మధురమైన నవ్వు మనసు తీరా వింటూ నేను నిద్రపోయాను.

మధ్యరాత్రి ఎవరో నాకాళ్ళను తాకుతున్నట్లు అనిపించింది. నేను ఉలిక్కిపడి లేచాను. దీపం వెలుతురు మందగించింది. నాకాళ్ళ వద్ద ఉన్న ఆకారం అలకగా గుర్తించాను. వెంటనే నేను లేచి ఆమె దగ్గరకు వెళ్ళి అడిగాను - 'అలకా! ఏమిటి? ఏమయ్యింది?'

ఆమె చెప్పలేకపోయింది. వణికిపోతున్నది. నేను ఆమె చేతిని నాచేతిలోకి తీసుకున్నాను. ఆమె చెమటతో తడిసిపోయింది. నేనామెను శయ్యపై కూర్చో పెట్టాను. ఆమె వీపు నిమురుతూ ఆమెకు ధైర్యం చెప్పాను. అప్పుడే ద్వారం దగ్గర ఏదో నీడ కదిలింది. వెను తిరిగి చూసాను, అక్కడ ఎవరూ లేరు.

అలక పరుపుమీద పడుకున్నప్పటికీ ఆమెకు నిద్రరాలేదు. ఆమె మంత్ర తంత్రాలకు చాలా భయపడుతుంది. నేడు ఆమె ఒక కలలో మేకగా, రెండోకలలో కుక్కగా మారిపోయింది. మూడోకలలో ఆమె భర్త ఆమెను కొండ శిఖరం నుండి క్రిందకు త్రోసివేసాడు. ఆమె అరుస్తూ మేల్కొన్నది. కాని ఆమె ప్రక్కన పడుకున్న దాసీలు గుర్రుపెడుతూ పడుకోని ఉన్నారు. ఆమె చాలా భయపడింది. చివరకు ధైర్యంచేసి నా దగ్గరకు వచ్చింది.

నేను ఆమె మాటలు వింటున్నప్పుడు ఏదో పురుగు దీపాన్ని ఆర్పివేసింది. చెపుతూ - చెపుతూ ఆమె మాటలు ఆపివేసింది. అప్పుడే బయట ఏదో చప్పు డైంది. బహుశా అది కాపలాదారుడు చేసిన చప్పుడైవుంటుంది.

నేను అలకను సముదాయించి ఆమెను ఆమె స్థానానికి పంపించాను. జూదగాడైన భర్తకు, మంత్రగాడైన అతని మిత్రులకు అలక చాల భయపడుతున్నది. నాకో విషయం అర్థం కాలేదు. నేను ఎంత సముదాయించినా, ధైర్యం చెప్పినా ఆమె మామూలు మనిషి కాలేకపోయింది.

రెండో రోజు రాత్రి ఆమె నా గదిలోకి రాదని అనుకున్నాను. కాని నిన్నటి రాత్రిలాగే ఆమె వణికిపోతూ నా వద్దకు వచ్చింది. రాత్రి ఆమెకు శత్రువుగా మారి నట్లున్నది. భూతపిశాచాలు చీకటి రాత్రిలో ఆమెను బాధిస్తున్నాయి.

ఆ తరవాత రాత్రి అలక నా దగ్గరకు వచ్చింది. కాని ఆమె చెప్పిన దానిలో ఓ విచిత్రం ఉన్నది. ఆమె భూతాన్ని చూసింది. భూతంముఖం మందారునిలా ఉంది. ఆమె పడుకున్నప్పుడు అది ఆమెను ముద్దుపెట్టుకోడానికి ప్రయత్నించింది. ఆమె అల్లరిచేయగా భూతం పారిపోయింది.

మూడోరోజు అలక పడక నా గదిలోనే ఏర్పాటు చేయమని దాసీలకు చెప్పాను. నా శయన మందిరం తలుపులు ఎప్పుడూ తీసి ఉంటాయి. కాపలా దారుడు నేను సుఖంగా నిద్రపోయానో లేదో చూస్తూ ఉంటాడు. అలక నా గదిలో పడుకంటే మునిగి పోయిందేముంది? అనుమానించడానికి అవకాశం ఏది?

నాపైన విశ్వాసంతో గడిచిన ప్రతిరోజులాకాక భయం తగ్గి అలక హాయిగా నిద్రపోయింది. నిద్రలో పలవరింతలు మానలేదు. అప్పుడప్పుడు మహా రాజా! అంటూ మేల్కొంటుంది. నేను వెంటనే ఏమి జరిగింది అలకా? అంటూ ప్రశ్నిస్తూ ఉంటాను. దానితో ఆమె మనసు శాంతిస్తుంది. ఈ విధంగా ఆమె మిగిలిన ప్రవాసంలో నాలుగైదుసార్లు అరుస్తూ మేల్కొన్నది. ఆమె వణికిపోతూ ఉంటే నా శయ్యపై కూర్చోబెట్టి ఆమె వీపును నిమురుతూ ఆమె మనసు శాంతింపజేస్తాను. శాంతించిన తరువాత తిరిగి ఆమెను శయ్యపై పరుండ జేస్తూ ఉంటాను.

ఇవన్నీ చూస్తుంటే నాకెప్పుడూ ఏమి అనిపించలేదు - అలక రాత్రి తప్ప మిగతా సమయంలో నా శయ్యపై కూర్చుంటుంది. అప్పుడు కూడా - నా మనసులో ఆమెతో శారీరిక సుఖం పొందాలని ఎప్పుడైనా అనిపించిదా! ఆమె అందంకంటె నాపై ఆమెకున్న ప్రగాఢ విశ్వాసం వందరెట్లు నాకు ఆకర్షణీయంగా ఉంది. ఆమెను ముద్దు పెట్టుకోవడం కంటె నా ఒడిలో తలఉంచి, ఆమె విశ్రాంతగా ఉన్నప్పుడు నాకు మరింత ఆనందం, ఉత్సాహం కలుగుతున్నాయి.

ప్రయాణపు రోజులు చాలా మధురంగా గడిచిపోయాయి. రోజంతా అలక నా దగ్గర ఉంటుంది. పాటలు పాడుతూ ఉంటుంది, రకరకాల కేశాలంకారణలు, చేస్తూ

ఉంటుంది. నా వస్తువులపై దుమ్ము దులిపి శుభ్రపరుస్తూ ఉంటుంది, అడవి పూలు ఏరి మాలగా కడుతూ ఉంటుంది, రకరకాల వంటలు వండుతూ ఉంటుంది, నేను తింటున్నప్పుడు విసనకర్రతో విసురుతూ ఉంటుంది, నాకు ఇష్టమైన పదార్థాలను కొసరి కొసరి వడ్డిస్తూ తినిపిస్తూ ఉంటుంది. అప్పుడు నేను ఆమెతో అనేవాణ్ణి - 'చూస్తూంటే హస్తినాపురం చేరేలోగా, నాకు అజీర్తి పట్టుకునేట్లుంది. ఈసారి రాజవైద్యుడు నాచేత చేదు కషాయం తాగిస్తాడు. అప్పుడు నీకు కూడా తాగించ మని చెప్తాను. నీ వలనే నాకీ అజీర్తి కలిగిందని చెప్తాను'.

స్త్రీని తయారు చేస్తున్నప్పుడు బ్రహ్మదేవుడు ఏఏ పదార్థాలు కలిపాడో తెలి యదు కాని, ప్రయాణంలో అలక కారణంగా నాకు చాలా సుఖం లభించింది. నా చుట్టూ నాదమాధుర్యం, భావరమ్యమైన కావ్యం ఉందా అనిపించింది. ఆకావ్యంలో శృంగార రసం మాత్రం లేదు. కాని హాస్యం, వాత్సల్యం, కరుణ రసాల మేళవింపు ఉంది.

ఆమె వైపు చాలాసార్లు మందారుడు కోపంగా చూసాడు. అలక ఒకదాసి పుత్రిక, ఆమెతో నేను సమానంగా కలిసి ఉండడం అతనికి ఇష్టం లేదు కాబోలు. కాని ఆ పిచ్చివానికి ఏమి తెలుసు. ప్రపంచం దృష్టిలో యయాతి మంచి రాజు కాని, అలక దృష్టిలో అతడు కేవలం ఒక సోదరుడు మాత్రమే. ప్రపంచం దృష్టిలో అలక ఒకదాసి కూతరుకాని యయాతి దృష్టిలో ఆమె అతని సోదరి మాత్రమే అని అతనికేం తెలుసు?

కల్మషరహితమైన ఆనందం, కోరకలోని ప్రేమ, మలినంలేని హాసపరిహాసాలతో ఆరోజులు ఇట్టే గడిచిపోయాయి. హస్తినాపురం మరో పదికోసుల దూరం ఉంది. అప్పుడు మంధారుడు నాతో చెప్పాడు. 'మహారాజా, మొదట నేను నగరానికి చేరుకుంటాను. మీకు స్వాగత సత్కారాలు ఏర్పాటు చేయడానికి రాజమాతకు సమయం లేకపోతే కోపగించుకుంటారు'.

నేను అతను వెళ్ళడానికి అనుమతిచ్చాను. కాని అమ్మ కళ్ళలో వాత్సల్యం, అలక కళ్ళల్లో మమత హారతి దీపంలా ఎల్లప్పుడూ వెలుగుతూ ఉంటే యయాతికి వేరే స్వాగతం ఎందుకని నాకు చాలాసార్లు మనసులో అనిపించింది.

మేము హస్తినాపురం చేరేటప్పటికి చాలారాత్రి అయింది. నేను అమ్మతో అలక ఎక్కడ ఏ పరిస్థితిలో కలిసిందో చెప్పి ఆమెకు అప్పగించాను.

ఆ రాత్రి భోజనం చేసిన వెంటనే నేను నిద్రపోయాను. ఉదయం అమ్మ యతి విషయం అడుగుతుందేమోనని అనుకున్నాను, కాని ఆమె ఏమీ మాట్లాడ లేదు. బహూశా వట్టి చేతులతో రావడం చూసి ఆమె దుఃఖించి ఉండవచ్చు. నేను ఆమె మనసులో యతిపై శుష్కమైన ఆశరేకెత్తించానేమో అనిపించింది. ఆశ అడియాశ ఆయితే దానికంటే భయంకరమైన దుఃఖం ఈ ప్రపంచంలో మరేదీ ఉండదు.

ఆరోజంతా చాలా పనులతో గడిచిపోయింది. మంత్రిగారూ, తదితర అధి కారులు వచ్చి రాజ్యాభిషేకం గూర్చి మాట్లాడారు. మాధవుడు తారకను తీసుకొని వచ్చాడు. తారకకు మిఠాయి ఇవ్వడానికి నేను అలకను పిల్చాను. కాని మిఠాయి తీసుకుని వేరే దాసి వచ్చింది. పగలంతా పనులతో ఒత్తిడిగా ఉన్నా ఏదో ఒక నెపంతో అలకను మూడు నాలుగుసార్లు పిలిచాను. కాని ఒక్కసారి కూడా ఆమె నా ఎదుటకు రాలేదు, నాకు కనిపించలేదు.

రాత్రి భోజన సమయంలో నేను అమ్మను అడిగాను, 'అలక ఎక్కడా కని పించడంలేదు?'

అమ్మ నిర్వికారంగా నా ప్రశ్న వినిపించనట్లు అంది, 'యయూ! నీవు ఇప్పుడు హస్తినాపురానికి రాజువు, రాజుల దృష్టి రాజకన్యలపై ఉండాలి గాని దాసీలపై కాదు'.

అమ్మ అలా నిర్వికారంగా చెపుతూ ఉంటే నన్ను ఆట పట్టించడానికి అందేమో అనిపించింది. కాని నాకేమీ అర్థంకాలేదు. నేను ఊరుకున్నాను. కాని ఆమె మాటలతో పళ్లెంలోని రుచికరమైన పదార్థాలు నాకు సయించలేదు. నేను భోజనం చేయకుండానే లేచిపోయాను.

అమ్మ సైగ చేసి నన్ను తన భవనానికి రమ్మన్నది. నేను మౌనంగా ఆమె వెనుక నడిచాను. ఆమె పెంటనే తలుపుమూసి తన శయ్య దగ్గర ఉన్న ఒక అంద మైన సింహపు బొమ్మను చూస్తూ చెప్పింది. 'అలక ఇప్పుడు తన జీవితపు అంతిమ ఘడియలలో ఉంది'.

నేను మేల్కొని ఉన్నానో లేక కలకంటున్నానో నాకర్థం కాలేదు. చాలా కష్టం మీద నోరు విప్పాను-

'అంటే' -

'ఈ ప్రపంచంలో జన్మించడానికి ఒకటే మార్గం కాని మరణానికి అలా కాదు. చావు అనేక విధాలుగా వస్తుంది. ఎలా ఆయినా వస్తుంది'.

'ఆమె ఆ స్థితిలో ఉందని నాకు ఎందుకు చెప్పలేదు? నేను రాజ వైద్యుణ్ణి............'

'ఈ సమస్యలో రాజవైద్యునితో పనిలేదు. ఇది రాజవంశ గౌరవానికి సంబంధించిన ప్రశ్న. రాజమాత ప్రశ్న. నీవు ప్రవాసంలో ఎన్ని రాసక్రీడలు.........' ఒక్క సారి అమ్మ నావైపు తిరిగి అంది. ఆమె కనులు నిప్పులు కురిపిస్తున్నాయి. క్షణం ఆగి ఆమె అంది, 'నీకు కలిగిన భయంకరమైన వ్యాధికుదర్చడానికి!'

'నాకు ఏంవ్యాధి వచ్చింది?'

'ఎలాంటిదా? ముకుళికను అశోకవనం నుండి నేను వెళ్ళగొట్టాను. ఈ నగరంలో కనిపిస్తే ప్రాణాలు పోగొట్టుకుంటావని ఆమెను హెచ్చరించాను. ఆమె ఇప్పుడు ఇక్కడ ఉంటే నీ రోగం ...........'

నేను తలవంచుకున్నాను. ముకుళికతో నేను హద్దుమీరి ప్రవర్తించాను. నేను తెలుసుకున్నాను. కొద్దిరోజులవరకూ ఆ సంఘటన మనస్సును బాధించింది. అశోకవనంలో జరిగిన ఆ సంఘటన అమ్మతో ఎవరు చెప్పారు? ఆమె స్వయంగా వచ్చి చెప్పిందా? లేదు. ఆమె అలా ఎందుకు చెబుతుంది? శరీర సుఖమిచ్చి యువరాజు దయకు పాత్రురాలు కావలసిన ఒకదాసి ఆమె. ఆమె ఎందుకు ఈ రాజ ......... .

అమ్మ చెప్పసాగింది. 'ఇక్కడ మీ నాన్నగారు చావు బ్రతుకులతో మంచం పై పడివుంటే అక్కడ నీవు ఆ నీచదాసిని మంచంపై కూర్చో...........'

ఆ రోజు మంత్రి సొరంగమార్గం ద్వారా మందారుణ్ణి పంపారు. అతను వచ్చినప్పుడు ముకుళిక నా మంచం దగ్గర నిలుచుని ఉన్నది. ఆమెను భవనం బయటకు పంపి సొరంగ మార్గం తెరచే సమయం నాకు లేకపోయింది.

నా తల తిరిగిపోయింది. మందారుడు ఇంత నీచుడా? అమ్మతో ఇదంతా చెప్పి అతను ఏం లాభం పొందాడు?

అశోకవనంలో జరిగినదంతా పూసగుచ్చి చెప్పాలని అనిపించినా సిగ్గుతో చెప్పలేకపోయాను.

అమ్మతో ముకుళిక ఆ పాపం అంతా నాదేనని చెప్పి ఉంటుంది. నేను ఎంత ప్రాధేయపడి చెప్పినా ఆమె నా మాటలు నమ్మదు.

మనసు మండుతున్నా నేను స్తబ్దుడిగా ఉన్నాను. నేను మౌనంగా ఉండడం వలన ఆ పాపం నేనే చేసానని అంగీకరించటమేనని అమ్మ అనుకొని ఉంటుంది. ఆమె నిందిస్తున్నట్లు అంది, - 'ఇందులో నీ తప్పు ఏమీ లేదు. దోషం అంతా నా తలరాతది. నీ వంశరక్తంలోనే దోషం ఉంది. అందమైన అమ్మాయిని చూడటం ఆలస్యం .........'

ఇంద్రాణిపై మోహితుడైన నాన్నగారిని ఉద్దేశించో లేక ఆయన పొందిన శాపం గుర్తు చేయడానికో! అమ్మ అలా ఎందుకన్నదో నాకు అర్థం కాలేదు. ఆమె ఒక్కొక్క మాట కొరడా దెబ్బలా నా మనస్సును తాకాయి.

ఆమె చెపుతూనే ఉంది - 'రక్తంలో ఉండేది బయటకు కనిపిస్తుంది. భార్యగా నేను చాలా దుఃఖాన్ని అనుభవించాను. అమ్మగా అటువంటి దుఃఖం పొందకూడదనే ఆశతో ఉన్నాను. కాని ..........'

కోట సింహద్వారాలన్నీ ఒక్కసారి మూసుకుపోయినట్లు అమ్మ మాటలు ఆగిపోయాయి. ఆమె నాకు సైగ చేసింది. నేను ఆమె వెంట వెళ్ళసాగాను. ఆమె భవంతి తూర్పుగోడ దగ్గరకు వెళ్ళింది. బహుశా అక్కడ కూడా భవంతినుండి అశోకవనం వెళ్ళేందుకు సొరంగమార్గం ఉండిఉంటుంది. అమ్మ వెనుకనే నేను సొరంగంలో అడుగుపెట్టాను. 'మనం ఎక్కడకు వెళ్తున్నాం' అనే మాట అడిగేందుకు కూడా నాలో ధైర్యం లేకపోయింది.

సొరంగం పొడవుగా లేదు. దాని రెండోవైపు భూగృహం ఉంది. భూగృహం తలుపు దగ్గర ఒక దృఢకాయుడు కాపలా కాస్తున్నాడు. అతను మాకు నమస్కరించాడు.

అమ్మనావైపు తిరిగి చెప్పింది - 'లోపలికెళ్ళు. గుర్తుంచుకో, నీవు అక్కడ ఘడియ, రెండు ఘడియలు మాత్రమే ఉండడానికి సమయమిస్తారు. చనిపోయే ముందు మనిషి తన ఆఖరి కోరిక నెరవేర్చాలని అంటారు. అందుకే అలకపై నేను దయ తలచాను. లేకపోతే ..........' కొన్ని క్షణాలు ఆగి ఆమె తిరిగి చెప్పింది,

'యువరాజా .........'

'యువరాజా?' అమ్మ నన్ను యయూ! అనకుండా యువరాజా! అని సంబోధించింది.

'చూడండి యువరాజా! రేపు మీరు మహారాజు కాబోతున్నారు. దుఃఖిం చడం రాజులకు తగదని గమనించండి. రాజులు ఎప్పుడూ తప్పు చేయరని మరచిపోవద్దు. రాజు తలచుకుంటే రోజుకో అప్సరల లాంటి స్త్రీ దొరుకు తుంది..........'

అలా చెప్పి అమ్మ ముఖం తిప్పుకుని నిలుచుంది. ద్వారపాలకుడు నెమ్మదిగా తలుపుతెరచాడు. మనసు శూన్యమయ్యింది. అలాగే నేను లోపలికి వెళ్ళాను. ఆ చిన్నగదిలో ఒక మూల దీపం మిణుకు మిణుకుమంటూ వెలుగు తున్నది. ఆ చిరు వెలుతురులో నాకేమీ సరిగ్గా కనిపించలేదు. గది మధ్యలో మోకాళ్ళపై తల ఉంచుకొని కూర్చున్న అలక కనిపించింది. పెద్దపెద్ద అడుగులు వేసుకుంటూ ఆమె దగ్గరకు వెళ్ళి భుజంపైచేయి వేశాను. అప్పుడామె తలఎత్తి నావైపు చాలాసేపు చూస్తూ ఉండిపోయింది. ఆమె ముఖం నల్లగా మారిపోయింది. కళ్ళు రాళ్ళులా అయిపోయాయి. నావైపు చూస్తూ ఆమె అడిగింది

'ఎవరూ?'

ఆమెకు వినిపించదు, కనిపించదు ........ నా గుండో కొట్టుకో సాగింది. ఆమె రెండు భుజాలు పట్టుకొని ఊపుతూ నేను అరిచాను - 'అలకా' -

బహుశా ఆమె నా కంఠం గుర్తు పట్టివుంటుంది. వాడిన ఆమె పెదవులపై చిన్న చిరునవ్వు విరిసింది. ఆమె మధురమైన కంఠంతో ప్రశ్నించింది. 'ఎవరూ? మహారాజా?'

ఆమె దగ్గర కూర్చొని నేను చిన్నపిల్లవాడిలా ఆమె తలను నా భుజంపై ఉంచుకొని, నిమురుతూ అన్నాను - 'ఎంత పని చేశావు, అలకా?'

ఆమెకు దగ్గరగా ఒక ఖాళీకప్పు పడివుంది. ఆవైపు కష్టంగా **చేతితో** చూపుతూ ఆమె అన్నది, 'దానిని అడగండి. ఆ - ఆ కప్పులో ...... ప్రేమ ఉంది........ ఆ ........... ఆ .......... ఆది ........... నేను ........... త్రాగాను'.

అంతకన్నా ఆమె ఏమి మాట్లాడలేకపోయింది. ఆమె కళ్ళనుండి ధారగా కన్నీరు, నా భుజం తడిసిపోయింది. చాలా బాధపడిన తరువాత ఆమె చెప్పింది - 'ఆ ......... ఆ ......... మందారు ......... ఆతను ......... అతనికి ............ నేను.........'

ఆమె నాలుకు కదలసాగింది. నేను పిచ్చివాడిలా ఆమెను ఓదార్చసాగాను. ఆమె కష్టంగా శరీరాన్ని విరుచుకుంది. విషప్రభావం కారణంగా ఆమె శరీరం బాధతో మెలికలు తిరుగుతున్నది. శరీరం చల్లబడసాగింది. నా భుజంమీద ఉన్న ఆమె తల క్షణం క్షణం బరువుగా మారుతున్నది. శ్వాస ఆడడంలేదు. ఏమి చేయాలో అర్థం కాలాదు.

ఇప్పుడామెకు ఎక్కిళ్ళు వస్తున్నాయి. ఒకసారి ఆమె క్షీణస్వరంలో అంది, 'న ........ నన్ను ......... మరచి ........ పో ........ వద్దు ......... నా ........ బంగారు ........ వెంట్రుకలు ........ గుర్తు ........'.

నేను మెల్లగా ఆమె బంగారపు తలవెంట్రుకల పాయ తీసుకున్నాను. ఇప్పుడు ఆమె కొన్ని క్షణాలు మాత్రమే బ్రతుకుతుంది. నా కారణంగా ఆమెకు చావు వచ్చింది. మృత్యువు సన్నిధికి ఎప్పుడూ ఆగని యాత్రలో అలక ........ నా అలక ......... వెళ్ళిపోయింది. ఆ యాత్రకై నేను మరిచిపోలేని, ఆమెకు పనికి వచ్చే ఏదైనా గుర్తు ఇవ్వకూడదా?

మృత్యుద్వారం దగ్గర రాజైనా బిచ్చగాడుగా మారుతాడు. నేను ఆమెకు ..... ఏమీ ఇవ్వకపోయాను.

అనుకోకుండ నా తల వంగింది. అలక పెదవులతో నా పెదవులు కలిపాను. బహుశా ఆమెకు కొంచెం తెలివి ఉంది. ముఖం త్రిప్పుకుంటూ ఆమె అన్నది - 'వద్దు - వద్దు - విషం - విషం'.

తల తిప్పుకోడానికి ఇప్పుడామెలో శక్తి లేదు. నేను పిచ్చివానిలా ఆమెను ముద్దు పెట్టుకోసాగాను.

ఆ రాత్రి అలక నుండి పొందిన తొలి ముద్దు - ఈ రాత్రి అలక నుండి పొందిన చివరి ముద్దు - ఓహ్ - జీవితం ఎంత భయంకర నాటకం. ముఖం త్రిప్పుకోడానికి ప్రయత్నించడంలో అలక తలనా భుజం నుండి జారి నేలపై పడి పోయింది.

నేను ఆమెను కదిపి చూసాను. పక్షి పంజరం నుండి ఎగిరిపోయింది.

ప్రాణం లేని ఆమె శరీరం నా ఎదుట పడి ఉంది. ఆమె ఆత్మ .......... మనసు అడుగుతుంది, ఆ ఆత్మ ఎక్కడ ఉంది?

బయట నుండి అమ్మ పిలిచింది. 'యువరాజా!'

నేను నా మహల్‌కు తిరిగి వచ్చేసరికి మంత్రిగారు నాకోసం ఎదురు చూస్తూ ఉన్నారు. ఆయన తనకు తెలియకుండానే ఆ సమయంలో వచ్చారు. ఆయన చెప్పారు - 'చాలా ఆనందకరమైన వార్త వచ్చింది'.

ఈ ప్రపంచంలో ఆనందం ఎక్కడైనా ఉండగలదా? నేను స్తబ్ధుడిగా ఉన్నాను.

ఆయన చెప్పారు, దేవదానవుల యుద్ధం పూర్తయ్యింది. కచుడు సంజీవిని విద్య నేర్చుకున్నాడు. ఆ కారణంగా దేవతల పక్షంలోని మృతులు తిరిగి జీవం పొందగలుగు తున్నారు. అందువలన రాక్షసులు తమవైపు నుండి యుద్ధం ఆపివేస్తున్నామని ప్రకటిం చారు. చాలా మంచిపని జరిగింది. ఈ యుద్ధంలో రాక్షసులు గెలిచి ఉంటే వారు తప్పక మన రాజ్యంపై దండెత్తేవారు.

కచునికి సంజీవిని లభించింది. దేవదానవుల యుద్ధం ఆగిపోయింది. నా దృష్టిలో ఈ విషయాలన్నీ చాలా చిన్నవి. నా మనసు నిరంతరం వేదనతో పీడించ బడు తున్నది. అలక ఎక్కడ ఉన్నది? నా అలక ప్రేమకై అలమటించే ఈ సోదరుని ఏకైక సోదరి ఎక్కడ ఉంది?

## దేవయాని

బయట వసంత సమీరం సువాసనలు వెదజల్లుతుంటే, నేనిక్కడ భయంతో కంపించిపోతూ చెమటతో తడసిముద్దయిపోయి కూర్చున్నాను. వికసించిన తెల్ల కలువలా చతుర్దశి నాటి చంద్రుని వెన్నెల వ్యాపించివుండగా, లోపల నా మనస్సు వాడిన పారిజాజ పుష్పంలా కమిలిపోయింది. బయలు మత్తకోకిలల గానం రస ప్లావితంగా సాగతుంటే నా మనసుసు భగ్నవీణలా రాగహీన ఆలాపం చేస్తున్నది.

నేనెంత భయంకరమైన కలకన్నాను! మేల్కొన్న తర్వాత కూడా ప్రచండమైన గాలి తాకిడికి అల్లాడిపోయే తీగలా కంపించిపోయాను. మంచులో తడిసిన లతలా ఆపాదమస్తకం చెమటతో తడిసి ముద్దైపోయాను.

కచునిపై నాకు కోపం వచ్చివుండవచ్చా? ఎందుకు రావాలి? వచ్చింది. నాకు అతనిపై చాలా కోపంగా ఉంది. అతను నా ప్రేమను తృణీకరించి వెళ్ళిపోతుంటే, ఏ విద్యనైతే నేర్చుకుని వెళ్ళిపోతున్నావో, అది ఎప్పుడూ నీకు ఫలించదని శాప మిచ్చిన మాట నిజమే, కాని దాని అర్థం నేను కలలో చూసినట్లు.......

దేవయాని రాక్షసుల గురుపుత్రికేగాని స్వయంగా రాక్షసికాదు.

సుమారు గంట సేపు గడిచిపోయింది. కాని ఇప్పటికీ ఆ కల గుర్తుకువస్తే శరీరం గగుర్పొడుస్తున్నది.

కచుడు వెళ్ళిపోయిన తరువాత చాలా రోజులు కన్నీరు కారుస్తూ వుండి పోయాను. ఆహారం తీసుకోవాలనే ధ్యాసే వుండేదికాదు. నేను నాన్నగారికి చాలా సార్లు చెప్పాను - 'సంజీవిని విద్య పోతేపోయింది. మరల తపస్సు చేయండి. దేవదేవుడైన శంకరుని ప్రసన్నం చేసుకుని కొత్తవరం పొందండి. నిర్దయుడూ, కపటీ, కృతఘ్నుడైన ఆ కచుణ్ణి నాముందు నిలపండి'.

కచుడు తన జీవితంలో మరువలేని విధంగా దండించాలని ఇప్పటికీ నేను కోరుకుంటున్నాను. నా ప్రేమను తిరస్కరించి, నా హృదయాన్ని భగ్నంచేసి వెళ్ళి పోయాడు. పైగా 'ఏ ముని కుమారుడూ నిన్ను పెళ్ళి చేసుకోడని' వెళుతూ నాకు శాపమిచ్చాడు. సిగ్గులేనివాడు. అతనికి గుణపాఠం నేర్పాలనుంది, నాకు ప్రతీ కారం

తీర్చుకోవాలని ఉంది. కాని ప్రతీకారాన్ని ఆ కలలోలా తీర్చుకోవాలా నేను? లేదు! ఆ కల గుర్తుకు వస్తే ఇప్పటికీ రోమాలు నిక్కబొడుచుకుంటున్నాయి.

ఆ భయంకర స్వప్నం ఇప్పటికీ నాకళ్ళ ముందు కదలాడుతున్నది. రాజ సభలో గొలుసులతో కట్టబడిన కచుడు నిలబడి ఉన్నాడు. అతను మెరుస్తున్న కళ్ళతో నలువైపులా చూస్తూన్నాడు. వృషపర్వ మహారాజు నాతో అన్నాడు -'గురు పుత్రికా దేవయానీ! గురువుగారు మమ్మల్ని ఉద్ధరించటానికి తపస్సులో మునిగి ఉన్నారు. తపస్సు ప్రారంభించే ముందు ఆయన 'రాజా! దేవయాని నా ఆరోప్రాణం, ఆమెను ఎల్లవేళలా సంతోషంగా ఉంచు' అని నన్ను ఆజ్ఞాపించారు. కచుడు నీకు చాలా దుఃఖం కలిగించాడని మాకు తెలుసు. అందుకే మా పరాక్రమంతో కచుణ్ణి బంధించి దేవలోకం నుండి ఇక్కడ నీ ముందుకు తీసుకువచ్చాం. ఇప్పుడు అతను నీ బందీ. చెప్పు, నీవితనికి ఏ శిక్ష విధించాలని అనుకుంటు న్నావు? నీ ఆజ్ఞ మాకు శిరోధార్యం'.

నిజమైన ప్రియురాలు తన ప్రియుని - అతను మోసగించినప్పటికీ - చివరకు ఏ శిక్ష విధించగలదు? ఎప్పటికీ అతనిని తన బాహుబంధనంలో ఉంచుకోవడం కన్నా ఏమి చేయగలదు? అంత శిక్ష కూడా నేను అతనికి వేయలేదు. నా దండన దానికన్న చాలా చిన్నది. నువ్వు నన్ను ఒక్కసారి, ఒకే ఒక్కసారి ముద్దిడు కొమ్మని నేనతన్ని అర్థించాను. పైగా వెంటనే నువ్వు స్వతంత్రుడవుతావని కచునితో అన్నాను.

మృత్యు ప్రాంగణంలో నిలబడి వున్నప్పటికీ అతని పొగరు కొంచెం కూడా తగ్గలేదు. పైగా నాతో అన్నాడు - 'దేవయానీ! రాక్షసులు నన్ను చంపారు, కాల్చారు, నా ఎముకులు పిండిచేసి మద్యంలో కలిపి శుక్రాచార్యులతో త్రాగించారు. ఫలితంగా నేను ఆయన హృదయానికి చేరువయ్యాను. ప్రపంచంలో ఎవరికీ లభ్యంకాని సంజీవిని విద్యను నేను అక్కడే నేర్చుకున్నాను. అందువలన నేను నీకు సోదరుడ నయ్యాను. ఏ కడుపునుండి నీవు పుట్టావో అదే కడుపు నుండి నేను కూడా ...........'

నేను ఉగ్రురాలనయ్యాను. నేను అతనితో అన్నాను - 'దేవయానిని నీవు అమాయకురాలైన ఆడపిల్లగా భావించావు. పిల్లలు అమ్మ కడుపు నుండి పుడతారు. తండ్రి కడుపు నుండికాదు. ఈ మాత్రం అర్థం చేసుకోడానికి విశేషమైన

తెలివితేటలు అవసరం లేదు. నేను నీ సోదరినికాను, నీవు నాకు సోదరుడవుకావు. నేను నీకు ప్రేయసిని, నేను నీ నుండి ఏమీ కోరడంలేదు. కేవలం ఒక్కసారి నన్ను ముద్దు పెట్టుకో, ముద్దు పెట్టుకున్న వెంటనే నిన్ను వదలివేయమని ఆజ్ఞ ఇస్తాను'.

కాని అతడు పొగరు, మొండితనం, దుష్టత్వం కలవాడు. నా ఈ సాధారణ కోరికను కూడ అంగీకరించలేదు. 'గురుపుత్రికా! ఇతనికి ఏ శిక్షవేయాలో చెప్పు?' అని వృషపర్వ మహారాజు నన్ను మరల కోరాడు.

ఈ కచుడు మద్యంలో కలుపబడి నాన్నగారి కడుపులోకి వెళ్ళాడు. సంజీవిని ఇచ్చి బ్రతికించమని నేను నాన్నగారిని అర్థించాను. అటువంటి వాడిని నేను ఇప్పుడు శిక్షించనా? తల్లి ఎప్పుడైనా తన పుత్రుణ్ణి కఠినంగా దండిస్తుందా? ప్రియురాలనైన నేను ............ ...........

కాని కచుణ్ణి కఠినంగా శిక్షించడం అవసరం. నన్ను ఈ విధంగా అవమానించ డానికి అతను కొంచెమైనా సంకోచించలేదు. నా హృదయాంత రాళాలలో అను రాగ దీపాన్ని వెలిగించి హారతి పట్టుతున్నాను. ఆ హారతి పళ్ళాని నా చేతినుండి లాక్కొని పిచ్చివానిలా విసరివేయటానికి కూడా వెనుకాడలేదు.

నేను మహారాజుతో చెప్పాను - 'కచుని తల నరకండి. అతని తలను నరికి పళ్ళెంలో ఉంచి రాజసభకు తీసుకురమ్మనండి. దేవయాని నాట్యంలో ఎంత ప్రవీణురాలో నేను నేడందరికి తెలియజేస్తాను'.

సేవకులు రక్తం ఓడుతున్న కచుని తలను పళ్ళెంలో ఉంచి తీసుకు వచ్చారు. ఆ పళ్ళాన్ని రాజసభ మధ్యలో ఉంచి నేను నాట్యం చేయసాగాను. ప్రేమ ఒక ప్పుడు వికసించే పుష్పంలా నవ్వుతూ, మరోకప్పుడూ మండుతున్న జ్వాలాలా గోచరిస్తుంది. ఒకసారి వెన్నెలలా విస్తరిస్తుంది. మరోసారి మెరుపులా మెరుస్తుంది. అది ఒకప్పుడు లేడిలా, మరోకప్పుడు విషసర్పంలా మారుతుంది. ఈ భావాలన్నీ నేను నా నాట్యంలో అభినయం ద్వారా తెలియజేసాను.

ఇలా ఏంతసేపు నాట్యం చేసానో నాకే తెలియదు. నాపై ఆ నాట్యం మత్తులా పనిచేసింది. పళ్ళెంలో ఉంచిన కచుని శిరస్సు తప్ప నాకేమీ కని పించడంలేదు.

అతని ఫాలభాగం నుండి రక్తం పడుతున్నది. అది కళ్యాణ తిలకం దిద్దిన నా ప్రియుని పాల భాగంలా ఉంది. నేను అభిసారికలా మోకాళ్ళపై కలవడానికి వెళ్ళాను. ఆ తల జీవంలేనిదని మరచిపోయాను. నాట్యం చేస్తూ చేస్తూ అతనిని కూర్చుని నేను అతనిని ముద్దిడుతూ అన్నాను, 'కచదేవా! మీరు ముద్దివ్వడానికి సిద్ధంగా లేరు, కాని చివరకు నేనే ముద్దుతీసుకున్నాను కదా?' ఈ విషయాలన్ని కలిసి నా మనసులో ఆ కలకు పట్టుదండను అల్లాయి.

కాని నా పిచ్చి హృదయం ఇప్పటికీ అతనిని నిజంగా ప్రేమిస్తున్నదా? నా వివేకవంతమైన మనసు అతనిని ద్వేషిస్తున్నదా? ప్రేమ - ద్వేషమా! అగ్ని - నీరూ!.

నా మనసులోని ఈ ద్వంద్వ ప్రవృత్తి ఎప్పుడు సమాప్తమవుతుందో? నిజంగా, ఈ ద్వంద్వాత్మకమైన మానసిక సంఘర్షణ ఎప్పటికీ పూర్తికాదా? స్త్రీ మనసు ఎంత పిచ్చిది? ఎంత కోమలమైనది? ఎంత గుడ్డిది? ఇక్కడ నుండి వెళ్ళిపోతూ నా పరిస్థితి గురించి కచుడు ఎవరినీ ఒక్కమాటకూడా అడుగలేదు. నా ప్రేమ కారణం గానే అతను నా తండ్రిగారి నుండి సంజీవినీ విద్యపొందాడు. సంజీవిని విద్యపొంది అతను దేవలోకం వెళ్ళిపోయాడు. అక్కడ జయ జయ ధ్వానలతో ఆకాశం ప్రతిధ్వనించింది. అతను ఒక మహాఋషి. మహావీరుడై య్యాడు. దేవతలకు పట్టిన ప్రాణభయం అతని కారణంగా తొలగిపోయింది.

ఇప్పుడు ఇంద్రుడు అతనికి కోరుకున్న అప్సరసను ఇచ్చి వుండవచ్చు. ఇక దేవయానిని ఎందుకు కలుస్తాడు. పురుషులు అందుకే కృతఘ్నులౌతారు. మోస గాళ్ళు, కఠినమైనవారు, పాషాణ హృదయులు. వలతోసహా ఎగిరిపోయే పక్షులలాగా దూరతీరాలకు వెళ్ళిపోతారు. స్త్రీలు దూరంగా ఎగిరిపోయే వారికై మనసులో తలచుకుంటూ దుఃఖిస్తూవుంటారు.

పూరేకులు వాడి నేలరాలతాయి. ముళ్ళు మాత్రమే ఉండిపోతాయి. ఇష్ట మనేది అలాగే ఉంటుందా? ఆ రాలిపోయిన పూలసుగంధం గుర్తుగా స్త్రీలు ఎండి పోయిన ముళ్ళలా ఉండిపోతారు. ఆ ముళ్ళనే పిచ్చివారిలా పూజిస్తూ ఉండి పోతారు. ఆ ముళ్ళు గుచ్చుకొని రక్తం స్రవిస్తుంటే .......... !.

లేదు, నేను సాధారణ స్త్రీలలా దు:ఖిస్తూ కూర్చోను. నేను సాధారణ స్త్రీలకు భిన్నమైనదాన్ని, అసాధారణమైనదానినీ. భగవంతుడు నాకు అందమిచ్చాడు. నాన్న

గారు నాకు బుద్ధి ఇచ్చారు. నాన్నగారి తపస్సు ధ్వంసంచేయబడింది. ఆయన అదే పట్టుదలతో తిరిగి అదే విద్యను పొందేందుకు వెళ్ళారు. అటువంటి తండ్రికి కుమార్తెను. ఈ ప్రపంచాన్ని ఏమాత్రం లక్ష్యపట్టని శుక్రాచార్యుని పుత్రికను. నేను కచుని మరచిపోతాను.

లేదు, అతనిపై నా మనసులోనున్న ప్రేమను నేను మరచిపోతాను. అతను నాకు శాపమిచ్చి వెళ్ళిపోయాడు. నిజమైన ప్రేమ శాపం ఇవ్వగలదా? ఏమిటది, ఏమన్నాడు? - 'ఏముని కుమారుడూ నిన్ను వివాహమాడకుండ గాక!' అది నిజం కాదు.

మునికుమారుని వరించి అడవిలోని కుటీరంలో జీవితం వెళ్ళబుచ్చటానికి ఇక్కడ ఎవరూ సిద్ధంగా లేరు పిచ్చికచుడు. దగ్గరగా ఉండి కూడా నన్ను అర్థం చేసుకోలేక పోయాడు. పూలను మాత్రమే అలంకించుకొనిఉండమనా! ఆదిశక్తి నాకు ఇంత అందమిచ్చింది? శర్మిష్ఠలాంటి రాజకన్య నా అందాన్ని చూచి ఎందుకు రాత్రి పగలు ఈర్ష్యపడుతుంది? రేపు వసంతోత్సవం ప్రారంభం అవుతుంది. ఆమెకీరోజు నిద్ర ఉండి ఉండదు. ఈ పండుగలో ఎలాంటి వస్త్రాలు ధరించాలి? ఎటువంటి నగలు అలంకరించుకుంటే దేవయాని అంత అందంగా ఉంటాను. ఈ ఆలోచనతో ఆమె నిద్రపోయి ఉండదు.

ఆమె మేల్కొని ఆలోచిస్తే నాకేమిటి? రేపు ఉత్సవం మొదటిరోజు. అందుకే రాజకన్య, ఆమె చెలికత్తెలు ప్రాతఃకాలమే వన విహారానికి వెళతారు. అక్కడ జలక్రీడలాడతారు. నాన్నగారిని సంతోషపెట్టటానికి నేను వెళతాను. కచుడు నాకై స్వర్గం నుండి తెచ్చిన అందమైన చీరను కట్టుకుంటాను. అప్పుడు ఆడపిల్లలందరూ నన్నే చూస్తూ ఉండిపోతారు. ఈ పండుగ కొరకేదానిని భద్రంగా దాచి ఉంటాను. శర్మిష్ఠ కలలో కూడా దీనిని గురించి ఊహించి ఉండలేదు. ఆ దివ్య వస్త్రంలో ఆమె నన్ను చూస్తే .........

కాని ఆ చీర కచుడు ఇచ్చింది. అతను మా ఇంటికి వస్తూ బహుమతిగా ఇచ్చాడు. నిజంగా స్వార్థంతోనే అతను నన్ను ప్రేమించాడు. కాని నేను అతణ్ణి నిజంగానే మోహించాను. ఆ సమయంలో నేను దానిని కట్టుకుంటే బాగుంటుంది. కాని ఇప్పుడు ప్రేమ అంతరించిపోయి ప్రేమికులు పరస్పరం శాపమిచ్చుకున్నారు. అతనిచ్చిన చీర కట్టుకోవడం మంచిదా? లేదు! ఇప్పుడు నేను దానిని కట్టుకుంటే

మాడిమసి అయిన ఆ ప్రేమలు తిరిగి గుర్తుకొస్తాయి. నా ప్రియుడు పూలకై ప్రాణాలను కూడా లెఖ్ఖచేయకుండా - ప్రమాదాల అంచులవంటి ఎతైన ప్రాంతాలు ఎక్కుతూ ఉండేవాడు ............. నా మనోహరమైన నాట్యాన్ని చూచి నాగ రాజులా ఊగిపోయే వాడు ........... ఒకసారో, రెండుసార్లో అయినా, ఎంతో ఇష్టంగా - 'నీవు స్వర్గంలో ఉన్న అప్సరసలకంటే అందమైనదానివి' అని అనే వాడు. వెంటనే పో, నువ్వు చాలా బాగా పొగడగలవు', అనేదాన్ని. అప్పుడు నవ్వుతూ అనేవాడు - 'ఎవరు అందంగా ఉంటే వారిని ఈలోకం పొగడుతుంది'. ఆ చీర ధరిస్తే ఆస్మృతులన్నీ తిరిగి మేల్కొంటాయి.

లేదు, ఇప్పుడా స్మృతులు గుర్తుకువస్తే ఏమాత్రం లాభం లేదు. ఒక్కొక్క స్మృతి మండుతున్న అగ్నిశిఖ.......... మనసును తీవ్రంగా మండించే అగ్నికీల..........

కచుని ప్రేమను మర్చిపోవాలని నిర్ణయించుకున్న నేను అతనిచ్చిన చీరను ఇప్పుడెలా కట్టుకోగలను? ఆ చీర చాలా అందమైనది కావచ్చును. ఇంద్రాణికి కూడా అంత అందమైనది లభించి ఉండకపోవచ్చును. కాని నేనిప్పుడు దానిని ఎందుకు కట్టుకోవాలి? అది ఎంత అందమైనదైనా ముక్కలు ముక్కలుగా చింపిపోగులు చేయడం మంచిది. దానిని తుడిచే గుడ్డగా చేసి వాకిలి తుడవనా! ఆ కృతఘ్నుడికి ఈ శిక్షే తగినది.

నేను మెల్లగా లేచి జలక్రీడలకై తీసిన బట్టలలో ఆ చీరను తీసుకొని వాకిట్లోకొచ్చాను. దాన్ని పరపర చింపాలని రెండు చేతులతో నేను దాన్ని పైకెత్తాను.

కాని దాన్ని చించలేకపోయాను. ఏ మగవాడైనా దానిని తప్పనిసరిగా చింపే వాడే. కచుడైతే దాన్ని పీలికలుగా చేసేవాడు. కాని నేను స్త్రీని, అందాన్ని పూజించడం స్త్రీకి తెలుసు, స్త్రీ ఎప్పుడూ అందమైన వస్తువును పాడుచేయలేదు.

బహుశా చంద్రుడు ఆ చీరను చూచి ఆకర్షితుడై ఆకాశంలోనే ఉండిపోయి ఆనందంతో నవ్వుతున్నాడా! రేపటి పున్నమి ఈనాడే వచ్చేసిందా? అని నాకనిపిస్తున్నది.

జలక్రీడ తర్వాత నేను ఈ చీరకట్టుకుంటే నా రూప యవ్వనం మరింతగా........ మరింతగా......... శర్మిష్ఠకు తన తండ్రి రాజని చాలా గర్వం. అయినప్పిటికీ రేపు చూడు.......... రేపటి పండుగలో ఆమె తలదించుకుటుంది.

శర్మిష్ఠకు ఎలా జరిగిందో కచునికి కూడా అలాగే జరుగుతుంది. అతనిచ్చిన చీరను నేను చించను. కాని అతని స్మృతులను రేకెత్తించే ఇతర విషయాలు.....

నా దృష్టి పూలతోటలో మూలనున్న లతాకుంజంపై పండింది. అది కచునికి చాలా ఇష్టమైన ప్రదేశం. దానిని పీకి పారివేయాలి.

కాని ఆ పొద నాన్నగారికి కూడా ఇష్టమే. రేపాయన దానిని గూర్చి అడిగితే? ఏదో ఒక కారణం చెపుతాను. గోశాలలో కట్టివున్న ఆ కపిలగోవు ఇప్పుడెవరికీ లొంగటంలేదు. గందరగోళం చేస్తున్నది. కట్టుతెంచుకుని పరుగెడుతున్నది, ఎగిరి గెంతులు వేస్తున్నది. కొమ్ములు సాచి పొడవటానికి పరుగెడుతున్నది. అదే రాత్రి కట్టు తెంచుకుని ఆపొదను పాడుచేసి ఉంటుందని చెప్పుతాను ..........

నేనా లతాకుంజం పైపు వెళ్తూ ఉండగా వెనుక నుండి ఎవరో పిలిచారు, 'దేవీ......'

ఆ పిలుపు విని ఆనందించాను. చివరకు నాన్నగారి అలవాటు మారింది. లేక పోతే ఎప్పుడూ నన్ను 'దేవ్' అని పిలుస్తూ ఉండేవారు, పరాయివారు చూస్తా రని కూడా, లేకుండా నన్ను ఆయన కొడుకులా, కచునితో సమానంగా పిలుస్తుంటే నేను సిగ్గుతో తలదించుకుంటూ ఉండేదాన్ని నేను చాలాసార్లు నన్నలాపిలవవొద్దని చెప్పాను. అయినా పట్టించుకోలేదు. కాని ఇప్పుడు 'దేవీ' అని పిలుస్తున్నారు. ఈ పెద్దవాళ్ల మాటలు చాలా విచిత్రంగా వుంటాయి. నేనొకసారి - 'ఇకనుండి నన్ను ఎప్పుడూ 'దేవ్' అని పిలవద్దని మొండికేసాను. అయితే నాన్నగారన్నారు, 'మంచిదే. దేవ్ అన్నంతమాత్రాన నీవు దేవుడవుగావు, దేవిగానే ఉంటావు' అన్నారు. ఇంక ఆయనను ఏమనగలను?

ఆయనలాంటి తపస్వికి, యవ్వనవతి హృదయం గుమ్మడి పిందెలా ఉంటుం దని మామూలు మాటలకు కూడా కుంచించుకుపోతుందని ఎలా తెలుస్తుంది? ఆయనెప్పుడూ విచిత్రలోకంలో మునిగిఉంటారు.

నాన్నగారి పిలుపు విని నేను ఆగిపోయాను. వెనక్కి తిరిగి చూసాను. ఆయన నెమ్మదిగా ముందుకు వచ్చారు. దగ్గరగా వచ్చి నాచుబుకం పట్టి నా కళ్ళ లోకి చూస్తూ అడిగారు, 'అమ్మా, ఇప్పటి వరకూ ఉన్నావా!'

'నిద్రపట్టడం లేదు నాన్నగారూ! అందుకే కొంచెం సేపు తోటలో ........' ఆ చీరను నాన్నగారికి తెలియకుండా ఎలాదాచి పెట్టాలా అనే హడావుడిలా నోటికి వచ్చిందేదో చెప్పాను.

నా వీపు నిమురుతూ నెమ్మదిగా అన్నారు. 'తెలుసమ్మా, నీ దుఃఖం నాకు తెలుసు. హృదయం ముక్కలైనంత దుఃఖం..........'

కచుని ప్రస్తావన నాకు విషంలాగా వుంది. మాట మార్చేందుకు నేను మధ్యలో అన్నాను, 'నాన్నగారూ, నా అలికిడికి మీరు లేచిపోయారా?'

ఆయన తలఊపుతూ 'కాదు' అన్నారు. తిరిగి నిట్టూర్చు విడుస్తూ అన్నారు, 'అమ్మా, అవమాన దుఃఖం నా మనసులో గుచ్చుకుంటూ వున్నది. తిరిగి మరో సారి ఘోరమైన తపస్సుచేసి ప్రపంచంలో ఎవరూ, ఇంకవరకు చూడని, వినని కొత్త విద్యను పొందాలనిపిస్తున్నది'.

'అయితే వెంటనే ప్రారంభించండి, మీరు సంజీవినికై తపస్సు చేస్తున్నప్పుడు నేను చిన్నదాన్ని. నా తండ్రిగారెంత మహాపురుషులో అప్పుడు నాకు తెలియదు. ఈ సారి మీరు తపస్సులో కూర్చుంటే నేను స్వయంగా మీకు పరిచర్యలు చేసి మీ కష్టాన్ని తగ్గిస్తాను ............'

ఆయన నవ్వుతూ అన్నారు - 'అది అసంభవం'.

ఆ మాటలతో నాకు ఆయనపై విపరీతమైన కోపం వచ్చింది. నా చిన్నప్పుడే నా తల్లి చనిపోయింది. అప్పటి నుండి నాన్నగారే నన్ను పెంచి పెద్ద చేసారు. అయతే దేవయానిని ఒక సీతాకోక చిలుకలా, తపస్సుకు సంబంధించిన పనులు చేయలేనిదానినని కనీసం తనపనులు తాను చేసుకోలేనంత సుకుమారి అని అను కోవటం ఏం న్యాయం? నా గురించి అటువంటి పొరపాటు అభిప్రాయం కలిగుండే అధికారం ఆయనకెక్కడిది?

నాన్నగారి చూపు నా చేతులలో ఉన్న చీరపై పడితే, రాత్రిపగలు నా హృదయంలో రగులుతున్న ఆ జ్ఞాపకాల అగ్నిశిఖలు ఆయన మనసులో మరిం తగా జ్వలిస్తాయని నేను భయపడ్డాను. కాని ఆయన తన ఆలోచనలలో మునిగి పోయారు.

నలువైపులా పరుచుకున్న పాలవెన్నెలను చూస్తూ ఆయన అన్నారు, 'దేవ్'.:..

'ఉ. ...... హు. దేవీ ........'

'ఆ(. , ఆ(. ..... నేను మరచిపోయాను' - అంటూ నవ్వుతూ చెప్పారు 'మద్యపానం నాకు తపస్సు లాగే ఎంతో ఉన్మాదమైన ప్రియ విషయం. అవసరం వచ్చినప్పుడు నేను ఒక్క క్షణంలో మద్యాన్ని వదిలి పెట్టేసాను. చిన్నప్పటినుండి అలవాటైన ఆ నీ పేరు ........?' ఆయన చెప్తూ చెప్తూ ఆగి పోయారు. తిరిగి బాగా వ్యాకులపడుతూ చెప్పసాగారు - 'ఈ శుక్రాచార్యుడు సంజీవిని సాధించినపుడు, ఈ మూడులోకాల్లో, నా పేరు మారుమ్రోగింది. కాని ఈరోజు ఆ శుక్రాచార్యుడు ప్రపంచంలో ఉన్నవేల సాధువులలో ఒక విరాగిగా ఉండిపోయాడు. లేదమ్మా! నేనది సహించలేను. గోళ్ళు, కోరలు పోయిన తరువాత సింహం ఎందుకు జీవించాలి?'

సంజీవిని విద్యను అపహరించిన ఆ నిర్దయుడు నాన్నగారి హృదయాన్ని ఎంత తీవ్రంగా గాయపరిచాడు? ఇన్ని రోజులు గడిచినా ఆ గాయం నుండి రక్తం స్రవిస్తూనే ఉంది.

నేను నాన్నగారికి ధైర్యం చెప్పేందుకు అన్నాను - 'నాన్నగారూ! మరలా తపస్సు చేసి మీరు తప్పక అటువంటి విద్యను పొందగలరు'.

'చేస్తాను .......... తప్పక చేస్తాను. ఒక్కటేమిటి? పది విద్యలు పొందుతాను. కాని వాటికోసం ఘోరమైన తపస్సు చేయాలి. తపస్సు చేస్తున్నప్పుడు సాధకుడి మనస్సు అన్ని బాధల నుండి విముక్తి పొందాలి. ఇంతకుముందు నేను తపస్సు చేసిన నాటికి నీవు చిన్నపిల్లవు. ఇప్పటికి నీకు యుక్తవయస్సు వచ్చింది. తపస్సు పూర్తి ఆవటానికి ఎన్ని సంవత్సరాలు పడుతుదో! శంకరుడు, అసలే భోళా దేవుడు'.

'కాని! నాన్నగారూ - ?'

నా మాటలు పూర్తి కాకుండానే ఆయన అన్నారు - 'నీ వివాహం గురించి ఆలోచనే వద్దని చెప్పబోతున్నావు కదూ! అమ్మా, తల్లిదండ్రుల మనసు తెలుసు

కోడానికి తల్లిదండ్రులుగా మారవలసి ఉంటుంది. నీవు పుట్టిన నాటి నుండి నేనే తల్లీ తండ్రిగా పెంచాను. నీ చిన్నారి చేష్టలతో నాకు జ్ఞానమూ, మద్యమూ రెండింటికి సంబంధించిన ఆనందం కలుగుతూ వుండేవి. ఈ రెండు సుఖాలు తప్పమరే ప్రాపంచక విషయంతో నాకు ఏ మాత్రం పరిచయంలేదు. నావద్ద సంజీవిని విద్య ఉన్నప్పుడు మునులూ, దేవతలూ, రాజులూ ఎవరైనా నాకు అల్లునిగా రావటానికి సిద్ధంగా వుండేవారు. కాని దానవులకు విజయం సమకూర్చా లనే ఉన్మాదంలో నేనా విషయం పై దృష్టిసారించలేదు. కాని ఈరోజు ....... అమ్మా! తపోధనుడైన ...... నీ తండ్రి ఒక బిచ్చగాడైయ్యాడు. నా కుమార్తెను స్వీకరించండి అని ఇతరులను బ్రతిమాలుతూ వారి కాళ్ళు పట్టుకోవలసిన దుస్థితి ఏర్పడింది'.

నాకు నాన్నగారిపై విపరీతమైన కోపం వచ్చింది. ఆయన వద్ద సంజీవిని ఉండేది, అది పోయింది, పోనీ పోతే పోనీ. దేవయాని అద్భుత సౌందర్యం పోలేదు కదా? నా అందం ఆధారంగా........'

తల్లిదండ్రులకు తమ సంతానంపై అనురాగం ఎక్కువుగా ఉంటుంది. కాని ఆ అనురాగం గుడ్డిది. అది సంతానపు గుణదోషాలను సరిగా చూడలేదు. గుణ విశేషాలు కనిపించవు, లేకపోతే ఈ ముల్లోకాలలోని ఏమగవాడైనా, దేవయాని అపురూప లావణ్యాన్ని చూసి మోహితుడై పాదాలచెంత చేరతాడనే ఆలోచన నాన్నగారికి ఎందుకు కలగలేదు?

ఈ విషయం నాన్నగారికి ఎలా తెలియచెప్పాలి? ఎవరు తెలియచెపుతారు?

నేను ఆయనను ఆయన గదిలోకి తీసుకెళ్ళాను. అమాయక బాలునిలా ఆయనను శయ్యపై పరుండచేసాను. చాలా సేపు ఆయన కాళ్ళు పడుతూ కూర్చున్నాను. నా ఎడమ కన్ను అదరసాగింది. అలా అదరడం శుభసూచక మంటారు. మనసులోనే నేను కన్నుని అడిగాను - 'ఏమిటి సంగతి? రేపు నా జీవితంలో జరగబోయే మహత్తరమైన సంఘటన ఏమిటి?'

కన్ను ఏమి జవాబివ్వగలదు, అదరటం తప్ప!.

మేమంతా కలిసి అడవిలోనున్న ఆ విశాల జలాశయం దగ్గరకు చేరుకున్నాం.

మిగిలిన స్నేహితురాళ్ళు తమ వస్త్రాలను తీసి ఒక దాసి వద్ద ఉంచి స్నానానికి నీటిలో దిగారు. శర్మిష్ఠ వస్త్రాలు నా వస్త్రాలు జాగ్రత్త చేయటానికి మరో దాసి ముందుకు వచ్చింది. ఆమె చాలా వికృతంగా ఉంది. 'ఈమె నెక్కడ నుండి తీసుకు వచ్చావు?' - అని నేను శర్మిష్ఠ నడిగాను.

ఆమె నవ్వుతూ జవాబిచ్చింది - 'నిన్ను నన్నూ ఈ భూమి మీద పుట్టించిన బ్రహ్మదేవుడే ఈమెనిక్కడకు పంపాడు ........'

నాకు ఆమె సమాధానం ఏమాత్రం నచ్చలేదు. అనాలనుకుంటే తనను, అను కోవచ్చును. కాని తనతో కలిసి ఆ వికృత రూపిణి సరసన నన్ను ఎందుకు లాగింది. ఈర్ష్య తప్ప మరింకేమీ కాదు.

శర్మిష్ఠవి, నావి దుస్తులు వేరువేరుగా ఉంచు అని ఆ దాసిని హెచ్చరించి నీటిలో దిగాను. నా తరువాత దాసితో ఏదో చెప్పి శర్మిష్ఠ కూడా వచ్చింది.

నీలాకాశం జలకాలాటలకు దిగివచ్చిందన్నట్లుంది. వనకన్య వింజామర వీస్తు న్నట్లుంది. మిగిలిన స్నేహితురాళ్ళు దూరంగా వెళ్ళి ఒకరిపై ఒకరు నీళ్ళు జల్లు కుంటూ ఆడుకుంటున్నారు. కాని నీటిలో లోతుగా దిగడానికి వారిలో ఎవరికీ సాహసం లేకపోయింది. నేను శర్మిష్ఠతో నవ్వుతూ అన్నాను - 'జలక్రీడ అంటే చెంబుడు నీళ్ళతో శుభ్రం చేసుకోవడంకాదు. రా, మనం ఈదుతూ దూరంగా వెళదాము. ఆపిరికిపిల్లలకు కూడా ధైర్యంవస్తుంది. అదిగో కమలంతో ఆడుకునే హంసల జంటను చూడు. అవి తెల్లని మేఘమాలికలలా ఉన్నాయి. పద అక్కడి వరకూ వెళ్ళి తిరిగి వద్దాం. చూద్దాం, ఎవరు ముందుగా అక్కడకు చేరి ఒడ్డుకు తిరిగి చేరుకుంటారో, పందెం వేదాం'.

శర్మిష్ఠ చిన్నగా నవ్వింది. మేమిద్దరం ఈదసాగం. ఆమెను ఓడించే ఉద్దేశ్యంతో నేను జోరుగా బారలు వేస్తూ ముందుకు సాగాను. చేపలా ఈదుతూ చాలా ముందుకు వెళ్ళి వెనుకకు తిరిగి చూసాను. శర్మిష్ఠ తాబేలులాగా మెల్లగా నీళ్ళను త్రోసుకుంటూ వస్తూ ఉంది. ఆమెను అవమాన పరచటానికి అవకాశం వచ్చిందని నేను మనసులోనే ఆనందించాను. ఆ ఈదే విధానం చూస్తే ఆమె ఓడి పోవటం ఖాయం. ఓడిపోయి వడ్డుకు వచ్చి నేను కట్టుకున్న ఎర్రని చీరని చూసి ఇంకా ఈర్ష్యతో మండిపోతుంది.

నేను ఈదుతూ కమలం దగ్గరకు చేరుకున్నాను. శర్మిష్ఠ ఇంకా వెనుకనే ఉంది. కాని అనుకోకుండా అలసటగా అనిపించింది. ఇంతవేగంగా రావడం వ్యర్థమని పించింది. నేను కొంచెం విశ్రాంతి కోసం ఆగాను. వెనుకకు తిరిగి చూస్తే శర్మిష్ఠ చాలా దగ్గరగా వస్తూ కనిపించింది. నేను వెంటనే వెనుకకు తిరిగి ఒడ్డుకు చేరడానికి శక్తినంతా ఉపయోగించి చేతులు కదపసాగాను. వెళ్తూ వెళ్తూ నేను కమలందగ్గరకు వెళ్తున్న శర్మిష్ఠ ముఖంపై సరదాగా నీరు చల్లాను.

నేను ఈదుతూనే ఉన్నాను. ఎంతవేగంగా వచ్చానో అంత వేగంగా తిరిగి వెళ్ళలేకపోతున్నాను. శరీరమంతా అలసటతో నిండిపోతున్నది. వెళ్ళేటపుడు జలాశయపు నీరు నవ్వుతున్న బాలునిలా అనిపించింది. వచ్చేటప్పుడు ఆ నీరు పిచ్చి పట్టిన పిల్లవానిలా అనిపిస్తున్నది. కెరటాలు ఉవ్వెత్తున లేస్తున్నాయి. క్షణంలో ఈ మార్పు ఏమిటో నాకు అర్థం కాలేదు. నేను ముందుకు చూసాను. అడవిలో గాలి చాలా జోరుగా వీస్తున్నది. చెట్టు చేమలను ఎవరో గట్టిగా కుదిపి వేస్తున్నట్లుంది. దట్టంగా ధూళి పైకి లేస్తున్నది. ఆకాశమంతా దుమ్ముధూళితో నిండిపోయింది.

నేను ఆందోళన చెందాను. అప్పుడే శర్మిష్ఠ వెనుక నుండి త్వరగా నీటిని చీల్చుకుంటూ నాకంటే ముందు వెళ్ళిపోయింది. నేను ఆమెను పిలిచాను. కాని ఆమె సమాధానం ఇవ్వలేదు.

శర్మిష్ఠ నాకన్నా ముందు ఒడ్డుకు చేరుకుంది. నేను చచ్చానో, బ్రతికానో ఆమెకు అక్కరలేదు. ఐదారుగురు చెలికత్తెలు ఆమె చుట్టూ చేరిపోయారు. వారితో మాట్లాడుతూ దుస్తులు పట్టుకున్న దాసి దగ్గరకు వెళ్ళి, అక్కడి నుండి ఒక చెట్టు చాటుకు వెళ్ళిపోయింది.

నేను ఒడ్డుకు చేరి తలవంచుకుని నడుస్తున్నాను. ఆ చెలికత్తెలు నాచుట్టూ చేరి శర్మిష్ఠ పందెం గెలిచింది అంటూ ఆట పట్టించసాగారు. వారిని తప్పించుకుని నేను బట్టలకోసం దాసి దగ్గరకు వెళ్ళాను. ఆమె నా ముందు బట్టలు ఉంచింది. నాకు కోపం వచ్చింది. అవి నాబట్టలుకావు. కచుడిచ్చిన ఆ అందమైన చీర ఈ రోజు నేను కట్టుకోవాలి, దానిని దాసి శర్మిష్ఠకి ఇచ్చివేసింది. 'వెర్రిదానా!' అంటూ నేను గట్టిగా ఆదాసి చెంపపై కొట్టి బట్టలు మార్చుకుంటున్న శర్మిష్ఠ దగ్గరకు వెళ్ళాను. ఆ అందమైన చీర వసంతోత్సవంలో కట్టుకోడానికి నేను ఎంతో

జాగ్రత్తగా దాచుకున్న చీర ఆమె కట్టుకుంది. ఒళ్ళు తెలియని స్థితిలో ఆ చీర అంచు పట్టుకుని నేను గట్టిగా లాగసాగాను.

శర్మిష్ఠ కోపంతో నావైపు చూస్తూ అంది, - 'దేవయానీ. ఇదేమిటి? పందెం ఓడి పోయింది చాలక నామీద కోపం ఎందుకు? కుంటివాళ్ళు కుంటివాళ్ళుగానే ఉండాలి .........!'

నేను కూడా ఆవేశంతో జవాబిచ్చాను, - 'నేను కుంటిదాన్నో, గుడ్డిదాన్నో తరు వాత చూద్దాం. ముందు, నీ గుడ్డితనానికి చికిత్స చేసుకో! నువ్వు ఎవరి చీర కట్టు కున్నావో చూసుకో!'

'నాదే!'

'కళ్ళు పూడిపోయాయా? ఈ చీరనాది!'

'యుద్ధ సమాప్తి తరువాత ఇంద్రాణి మా అమ్మగారికి ఈ చీర బహుమతిగా పంపింది. నా కోసం దీనిని అమ్మ దాచిపెట్టి వుంచింది'.

'మీ అమ్మగారికి ఇంద్రాణి నుండో లేక ఏ పిశాచి నుండో ఈ చీర బహుమతిగా వస్తే నాకేమిటి? చెప్పేవి గొప్ప కబుర్లు కట్టేది ఇతరుల చీరలు - నోరు మూసుకుని నాచీర నాకియ్యి .......'

'నేనివ్వను, ఏం చేస్తావు?'

చీరలాగుతూనే అన్నాను - 'ఏం చేస్తానా? నేను ఎవరో నీకు తెలుసా?'

'ఆ...... ఆ...... చాలా చాలా తెలుసు. వృషపర్వ మహారాజు దయాధర్మం మీద బ్రతుకుతున్న ఒక బిక్షగాని కుమార్తెవు'.

నాన్నగారిని ముష్టివాడని శర్మిష్ఠ ఘోర అవమానం చేసింది. ఏం చేయాలి! ఏం చెయ్యకూడదు? ప్రతీకారం ఎలా తీర్చుకోవాలి? ఈ ఆలోచనలతో వేగిపో యాను. కాని పట్టరాని కోపం కారణంగా నా నోటి నుండి మాటలు వెలుపడలేదు.

నేను మౌనంగా ఉండడంతో ఆమె మరింతగా రెచ్చిపోయింది. 'అడుక్కునే దానా! కోపం తెచ్చుకో! తలకొట్టుకో, లేకపోతే జీవితమంతా నాపై ఈర్ష్యపడు. నీ

కోప తాపాలు ఇక్కడెవరు లక్ష్యపడతారు? నేనొక రాజకన్యను, నీవు మా నాన్నగారి ఆశ్రితుని కుమార్తెవు. నీ తండ్రిని గురుదేవా! అని పిలవడం మా నాన్నగారి మంచి తనం. రాజసభలో నాతండ్రి సింహాసనంపై కూర్చుంటే నీతండ్రి మృగచర్మంపై కూర్చుంటాడు. ఈ వ్యత్యాసం ఎప్పుడూ మరచిపోవద్దు. అర్థమైందా?'

ఆమె జుట్టు పట్టుకొని ఈడ్చుకుంటూ వెళ్ళి అడవిలోని ఎదైనా పాత బావిలో పడేయాలని అనిపించింది. కోపంతో నాకాళ్ళు చేతులువణకసాగాయి. నేను ఆచేతనంగా పడిపోతానేమోననిపించింది ..........

మా యిద్దరి మధ్య తగాదా ప్రారంభమనడం చూచి చెలికత్తెలు దగ్గరకు వచ్చారు. నేను వణికిపోతుండడం చూచి పరిహసించసాగారు. నేను కోపంతో ఊగిపోయాను. వారితో కలసి శర్మిష్ఠ కూడా పకపకా నవ్వసాగింది. నా మనసులో అవమానజ్వాల రేగింది. ఇప్పుడే ఈ స్థితిలోనే పరుగెత్తుకొని నగరంలోకి వెళ్ళి నాన్నగారికి కథంతా చెప్పి, నేను ఈ నగరంలో మంచినీరు కూడా ముట్టనని చెప్పాలనిపించింది.

నేను పరుగెత్తసాగాను, వెనుకనుండి శర్మిష్ఠ పిలుస్తున్నది -

'దేవయానీ! ఆగు! దేవయానీ! నా మాట విను...........'

నీచురాలు, గర్విష్ఠి.

నేను వెనుతిరిగి చూడకుండా దెబ్బతిన్న లేడిలా దొరికిన త్రోవ వెంట అడవిలో పరుగెత్తసాగాను.

శర్మిష్ఠ కూడా నా వెనుక పరుగెత్తి రాసాగింది. బహుశా ఆమె చెలులంతా కూడా పరుగెత్తి వస్తూ ఉండవచ్చు. వారి అడుగులు చప్పుడు నాకు వినిపిస్తున్నా నేను వెనుతిరిగి చూడలేదు. గర్విష్ఠి శర్మిష్ఠ తప్పు ఒప్పుకొని క్షమించమన్నా క్షమించ కూడదని నేను మనసులో నిర్ణయించుకుని, పదేపదే మనస్సులో అనుకున్నాను.

కాని కొద్ది సేపట్లోనే నావేగం మందగించింది. ఇప్పుడు నన్ను శర్మిష్ఠ పట్టు కుంటుందని అనిపించింది. కొద్ది సేపటి క్రిందట ఈతలో ఆమె నన్ను పరాభవిం

చింది. ఇప్పుడు పరుగులోకూడ - లేదు. ప్రాణం పోయినా నేను ఆమె చేతికి దొరకను. కాని ఎలా? ఏం చేయాలో తెలియటంలేదు.

నేను వెనక్కి తిరిగి చూసాను. నాకూ శర్మిష్ఠకు మధ్యదూరం తగ్గిపోసాగింది. పరుగెత్తితే లాభంలేదు. నేను ఇటూ అటూ చూసాను. దగ్గరలో వెడల్పైన బావి తీగలతో గడ్డితో కప్పబడి ఉంది. అందులో నీరు ఎంతుందో తెలియదు. నేను బావి అంచున నిలబడ్డాను. శర్మిష్ఠ నాకు దగ్గరగా వచ్చింది. నన్ను ప్రాధేయపడ సాగింది. నా చేయపట్టుకుంది. నేను చేతిని విదిలిస్తూ అన్నాను - 'నీవు రాజ కన్యవు, నేను ఒక బిక్షగాని కుమార్తెను. నేను నీదగ్గరకు బిచ్చంకోసం రావాలి కదా? ఇప్పుడెందుకు .........?'.

'దేవయానీ ......... నేను ........ నేను' - అంటూ ఆమె చెప్పపోయింది.

లేడిలా పరిగెత్తివచ్చిన నేను సింహం అయ్యాను. ఆవేశంతో వెనుతిరిగి ఆమె కట్టుకున్న నా చీర వేగంగా లాగుతూ అన్నాను - 'నా చీర కట్టుకుని నన్నే అవమానిస్తావా? నా తండ్రిగారి శక్తి సామర్థ్యం పై బ్రతుకుతూ ఆయన్నే బిచ్చ గాడంటావా? విప్పు ........ విప్పి నా చీర ఇవ్వు. నాది ........ నాకివ్వు .......... విప్పు.....'

'అరే ........ కాని ........' అంటూ ఆమె సంకోచించింది. బహూశా చీర నడుమునుండి జారిపోతుందని భయపడి వుంటుంది.

నేను చీరను లాగుతూ అరిచాను - 'విప్పు - విప్పి ఇవ్వు. విప్పుతావా లేదా?'

ఆ తరువాత పది క్షణాలు నేను ఏం మాట్లడానో, ఏం చేశానో, శర్మిష్ఠ ఏం అన్నదో, ఏం చేసిందో నాకు గుర్తు లేదు. ఒక్కసారి. అమ్మా - అన్న కేక విని పించింది. ఆ కేక శర్మిష్ఠదా? నేను ఆమెను నూతిలోకి త్రోశానా? లేదు. అది నా కేకే. ఆ చండాలని నన్ను నూతిలోకి తోసివేసింది.

ఈమధ్యలో ఎంత కాలం గడిచిందో తెలియదు. నేను తీగలు, గడ్డితో కప్పబడిన బావిలో పడివున్నాను ........ లేదు. శర్మిష్ఠ నన్ను బావిలోకితోసిందని గుర్తుకు రాగానే నేను నీటిలో నిలబడి ఉన్నాను. బావి చాలా లోతుగా ఉంది. కాని

దానిలో నీరు నడుమువరకు మాత్రమే ఉంది. దట్టమైన అడవిలో వున్న బావిని తీగలు సగంకన్న ఎక్కువ భాగం మూసివేసాయి. ఆకారణంగా లోపలభాగం సరిగా కనిపించదు. ఈ పాడుపడిన నూతిలో విషసర్పాలు ఉండవచ్చు. ఆ ఆలోచన రాగానే నా రోమాలు భయంతో నిక్కబోడిచాయి. ఎవరో నూతిలో పడినట్లు శబ్దం వినిపించింది. ఇప్పుడు నా గాయాలు రక్తం చిమ్మటలేదు. చివరకు ప్రాణాలు అర చేతిలో ఉంచుకోని శబ్దం వచ్చిన వైపు చూసాను. అదితప్పా?

నేను గట్టిగా అరిచాను - 'ఎవరైనా నన్ను పైకి తీయండి ఒకసారి, రెండు సార్లు, మూడుసార్లు అన్నాను. కొద్దిసేపు ఆగి మరల అరిచాను - 'దేవయాని నూతిలో పడిపోయింది. శుక్రాచార్యుని కుమార్తె దేవయాని నూతిలో పడింది. చాలా ఆశతో నేను పైకి చూశాను. ఎవరూ పైనుండి తొంగి చూడలేదు. ఎవరూ ఆ నూతి ప్రక్కనుండి వెళ్ళడంలేదు. నన్ను నూతిలో తోసివేసి శర్మిష్ఠ తన చెలు లతో కలిసి నగరంలోకి వెళ్ళిపోయి ఉంటుంది. ఆమె సిగ్గుమాలినది. ఇతర అమ్మాయిలకైనా కనీసం మానవత్వం ఉండాలి కదా? స్నేహితురాలు ఒకతె నూతిలో పడింది........ ఆమె బ్రతికి ఉందా, లేదా? - ఏమి చూడకుండా అందరూ వెళ్ళిపోయారు.

నా హృదయం మండిపోతున్నది. నూతిలో నుండి ఎవరూ నీరు తోడడం లేదు. నీళ్ళు చాలా చల్లగా ఉన్నాయి. నీళ్ళలో నిలబడిపోవటంతో నేను చలితో వణికిపోసాగాను. మనసులో ఒకవైపు ప్రతీకార జ్వాల మండిపోతున్నది. రెండోవైపు భయం, దట్టమైన చీకటిలా అలుముకున్నది.

నేను చాలాసార్లు కేకలు వేసాను. కాని ఆ దట్టమైన అడవిలో నా మొర ఎవం 'కైనా ఎలా వినిపిస్తుంది? నేను ఈవిధంగా ఈ నీటిలో వణుకుతూ స్పృహతప్పి, మునిగి చనిపోతానేమో! ఈ ఆలోచనతో నేను చిన్నపిల్లలా వెక్కివెక్కి ఏడ్వ సాగాను.

మధ్యలో వినిపించింది - 'లోపల ఎవరు ఉన్నారు?'

ఆ దుర్మార్గురాలు, సిగ్గులేని శర్మిష్ఠ కాబోలు చాలా దయకలిగిన దానిలా వచ్చింది. నేను వెంటనే ఏడ్పు ఆపివేసాను, గాని ఆ ప్రశ్నకు జవాబు ఇవ్వలేదు.

నూతి అంచున నిలబడి, ముఖం పైపడుతున్న తీగలను చేతులతో ప్రక్కకు

జరుపుతూ, నూతిలోకి తొంగి చూస్తూ ఎవరో పిలిచారు, - 'లోపల ఎవరు ఉన్నారు?'

ఎవరిదో మగగొంతు, నాన్నగారిదా? కాదు మహారాజు వృషపర్వునిదా? అపరిచిత స్వరం. నేను లోపల నుండి అడిగాను - 'ఎవరు మీరు?'

'యయాతి'

'నేను కలకనడం లేదుకదా? ఉత్సుకతతో అడిగాను, హస్తినాపురం మహా రాజు యయాతి'.

'అవును, హస్తినాపుర రాజైన యయాతినే. వేటాడుతూ చాలాదూరం ఈ దట్టమైన అడవిలోకి వచ్చాం. దాహంవేసి, రథాన్ని ఆపి నీటికోసం వెదుకు తున్నాం. నా రథసారథి వేరేవైపు వెళ్ళాడు. దూరం నుండి చూస్తే ఇక్కడ బావి ఉందని పించింది. అందుకే ఇక్కడకు వచ్చాను. ఇంతకూ మీరెవ్వరు?'

'మీరు కాదు, నువ్వు అని పిలవండి'

'అంటే?'

'అది తరువాత చెపుతాను. మహారాజా! ముందు నన్ను నూతి నుండి బయటకు తీయండి. చలితో వణికిపోతున్నాను. కాని ........ కాని ........ మీరు ఈ నూతిలోకి ఎలా దిగుతారు?'

పైనుండి బిగ్గరగా నవ్వు. తరువాత తీయని కంఠస్వరంతో మాటలు వినిపించాయి. 'యయాతి చిన్నప్పటి నుండే ధనుర్విద్యను, దానిలోని అద్భుతాలను నేర్చు కున్నాడు'.

పైనుండి వేదమంత్రాలవంటి ఉచ్చారణ వినిపించింది. దాని వెంట నీటిలో ఏదో పడినట్లు అనిపించింది. త్వరత్వరగా అలలు లేచాయి. మరుక్షణం నేను ఒక కమలంలో ఉన్నట్లు అనిపించింది. ఈ ధనుర్విద్య సంజీవిని విద్యలా అద్భుత మైనది. పైకి వచ్చిన తరువాత చూస్తే అది పెరుగుతున్న కమలంలా ఉంది. బాణాలతో తయారైన కమలంలో నిలబడి నేను పైకి వచ్చాను.

ఆ బాణాలతో కూర్చిన కమలం నూతి అంచువరకు వచ్చి ఆగిపోయింది. ఎదుట నిలబడి ఉన్న యయాతి మహారాజును నేను తదేకంగా చూసాను. కచుని తప్పించి ఇంత అందమైన పురుషుణ్ణి నేను ఇంతకు ముందెప్పుడూ చూడలేదు. అతని సౌందర్యం కారణంగా రాజవస్త్రాలకు అందం పెరిగింది. పురుషుని కంఠానికి రుద్రాక్షమాలకంటే రత్నాలమాల శోభనిస్తుందనిపించింది.

మహారాజు యయాతి నావైపు రెప్పవాల్చకుండా చూస్తూ ఉండటం గమనించి సిగ్గుపడ్డాను. తలవంచి క్రింది వైపు చూడసాగాను. తడిసిన వస్త్రాలు శరీరానికి అంటుకుపోయి నా అందాన్ని మరింత స్పష్టం చేస్తున్నాయి. శర్మిష్ఠ నన్ను నూతిలోకి త్రోసి చాలా గొప్ప ఉపకారం చేసింది. నేను తడిసిన లావణ్యంగా కనిపించకపోతే వీరుడు, ఐశ్వర్య సంపన్నుడైన రాజు కనులు నన్ను చూడగానే మెరుస్తాయా......!

నేను తలదించుకునే నిలబడి ఉన్నాను. మహారాజు నవ్వుతూనే అడిగారు, - 'ఈ అప్సర నామధేయం మేము తెలుసుకోవచ్చా?'

'నేను అప్సరసను కాను'.

'లేకపోతే, ఇంతటి అపురూప లావణ్యరాశి ఈ భూలోకంలో ఉందా ........'

నా అందం రాజుగారి మనసును జయించింది. ఈ సౌందర్యపు త్రాసులో కొంత బరువు వేయవలసి ఉన్నది. నేను తలెత్తి మహారాజు వైపు క్రీగంటి చూపు విసరి, నేలవైపు చూస్తూ చెప్పాను, - 'నేను శుక్రాచార్యుని కుమార్తె దేవయానిని'.

'శుక్రాచార్యుని కుమార్తె! దానవుల గురవైన శుక్రాచార్యుని కుమార్తె!'

'అవును',

'నేను ఈరోజు మీా .........'

'కాదు, నీ ..........'

మహారాజు నవ్వుతూ చెప్పారు - 'నేను శుక్రాచార్యునితో కొద్దిగా పని వుండి వచ్చాను. వేటలోని శ్రమంతా ఫలించినట్లయ్యింది'.

'కాని, నేను మీకు ఇంకొంచెం శ్రమ ఇవ్వాలనుకుంటున్నాను'

'చాలా సంతోషం, చెప్పండి?'

'నేను ఈ నూతి నుండి బయటకు ఎలా రాను?'

'అంటే?'

'నాకు భయంకలుగుతున్నది. బయటకు వస్తూ పొరపాటున మళ్ళీ నూతిలో పడిపోతే!'

'నేను నిన్ను తిరిగి పైకి తీస్తాను'

'అయితే నేను మళ్ళీ పడిపోతాను'

'నేను నిన్ను మళ్ళీ పైకి తీస్తాను'.

మేమిద్దరం నవ్వసాగాం. నవ్వుతూనే నేను మెల్లగా తలెత్తి చూసాను. తడిసిన వస్త్రాల నుండి కనిపిస్తున్న నా శరీరంపై ఆయన దృష్టి ఉంది.

నేను మెల్లగా కుడిచేతిని చాపాను. మహారాజు కూడా తన కుడిచేతితో నా చేతిని అందుకున్నారు. నేను నూతి అంచు పైకి వచ్చాను. ఆయన నా చేతిని వదిలి వేయసాగారు. కాలి గోళ్ళతో మట్టిని తోస్తూ నేను అన్నాను - 'మీరు నా చేతిని ఇంక వదిలించుకోలేరు. మీరు నా పాణిగ్రహణం చేసారు'.

ఆయన ఉలిక్కిపడ్డారు - 'ఇది ఎలా సంభవం? నీవు బ్రాహ్మణ కన్యవు, నేను క్షత్రియ కుమారుణ్ణి. ఈ విధమైన వివాహం ..........'

'మహారాజా! ఇటువంటి వివాహాలు ఇంతకముందు చాలా జరిగాయి. ఉదాహరణకు లోపాముద్ర ........'

'కాదు'

నేను నవ్వుతూ అన్నాను - 'నేను మీకు రాణిని కావటం విధివిధానమైన భగవదేచ్ఛ మహారాజా! లేకపోతే ఈరోజు మీరు ఈ అడవిలోకి ఎందుకు వస్తారు? సరిగ్గా ఈ నూతి దగ్గరకే ఎందుకు వస్తారు? పూర్వజన్మ సుకృతం కాకపోతే, ఇలా ఎప్పుడైనా జరుగుతుందా?'

'కాని సుందరీ ..........'

'కాని - గీని ఏమీ లేదు. మహారాజా, మీదర్శనంతోనే నా హృదయాన్ని మీ పాదాల దగ్గర ఉంచాను. మీరుదాన్ని స్వీకరించండి లేదా త్రోసివేయండి. మీరు నన్ను మీదాననుగా చేసుకోకపోతే, నేను హిమాలయాలలో ఉన్న ఎదో గుహలోకి వెళ్ళి మీ నామాన్ని స్మరిస్తూ శేషజీవితాన్ని గడుపుతాను. కలలోకూడా పరపురుషుణ్ణి తాకలేను. నాలాంటి యవ్వనవతి అయిన కన్య - క్షణకాలంలోనే తన చేతిని ఇతరుల చేతికి ఎందుకందిస్తుంది?'

'కాని దేవయానీ! నీ తండ్రి మూడులోకాలలోనూ పూజనీయుడైన మహా ఋషి. ఆయనకు ఇది అంగీకారం కాకపోతే!'

'ఆయనను గూర్చి ఆలోచన మీరు ........' అంటూ రాజుగారి మొదటి మాటలు గుర్తుకువచ్చి మరల అన్నాను - 'నేను పిచ్చిదాన్ని - మీకు దాహం వేస్తుందని మరిచిపోయాను. దగ్గరలో ఎక్కడైన మంచినీరు -'

నావైపు సమ్మోహనంగా చూస్తూ ఆయన చెప్పారు, - 'నిన్ను చూస్తూ ఆకలి, దాహం ......... అన్నీ మరచిపోయాను. అందమైన లేడిని వేటాడడానికి బయలు దేరాను. కాని పరిస్థితి మారి అదే నన్ను వేటాడింది'.

నేను నవ్వుతూ సిగ్గు పడ్డాను. కిందకు చూస్తూ నేను మనసులో అను కున్నాను. నాన్నగారి లాంటి వారు తపస్సే చేసుకోవాలి. భూమి ఏ ఇరుసుపై తిరుగుతుందో వారికేమి తెలుసు? నిన్న రాత్రి నాన్నగారు నా వివాహం గురించి ఆలోచించారు. ఇప్పుడు నేను దేవయానిలా కాకుండా, హస్తినాపుర మహారాణిలా ఆయన పాదాలు తాకుతాను, అప్పుడయన హావభావాలు ఎలా ఉంటాయో........!

'ఆ కపటి కచుడు ఇప్పుడు ఇక్కడ ఉండి ఉంటే? నేను ఇప్పుడు అతని నుండి తీర్చుకున్న ఈ ప్రతీకారం చూసి ఎలా ఈర్ష్యపడేవాడో! నిజంగా ప్రతీకారం కూడా ఎంత అందంగా ఉంటుంది?'

రథంలోవెళ్ళి ఇదంతా నాన్నగారికి తెలియచెప్పుదామని మహారాజు చెప్పు తున్నారు. కాని శర్మిష్ఠ రాజకన్యగా తిరుగుతున్న చోటుకి వెళ్ళడం నాకిష్టంలేదు. ఆమె నాకు క్షమించరాని అవమానం చేసింది. బిక్షగాడని నాన్నగారికి ఘోర అవ

మానం చేసింది. నేను బిక్షుగాని కుమార్తెను కాదు, హస్తినాపురం మహారాణినని ఆమెకు చెప్పాలనిపించింది. కాని దానితో నా పగచల్లారదు. ఆమె చేసిన తప్పు చాలా పెద్దది. దానికి తగిన శిక్ష అనుభవించాలి. శర్మిష్ఠకు ఆమె జీవితమంతా మరచిపోని శిక్ష వేయకుండా నగరంలోకి అడుగు పెట్టరాదని నేను నిర్ణయించు కున్నాను. మహారాజుగారి సారథి ద్వారా నాన్నగారికి సందేశం పంపి ఆయననే ఇక్కడకు ఎందుకు పిలవకూడదు ......

కాని సారథి ద్వారా సందేశం పంపవలసిన అవసరం కలుగులేదు. అప్పుడే దుమ్ము రేపుకుంటూ ఒక రథం వేగంగా అక్కడకు వచ్చి ఆగింది. రథంలోనుండి నాన్నగారు, వృషపర్వ మహారారజు దిగారు. చాలా రోజుల తరువాత కలిసిన తల్లిని చేరే తనయనిలా నాన్నగారు ముందుకు వచ్చారు. నన్ను గుండెలకు హత్తుకుని నా ఫాలభాగాన్ని సవరించసాగారు. గర్వంతో ఆనందంగా నేను కళ్ళు మూసు కున్నాను. అప్పుడే నా చెంపకు తడితలిగింది. నేను మెల్లగా కను రెప్పలు విప్పి చూస్తే నాన్నగారి కళ్ళ నుండి కన్నీరు జాలువారుతుంది. తన ప్రియాతి ప్రియమైన కుమార్తె సురక్షితంగా ఉండటం చూచీ తపస్వి శుక్రాచార్యుడు ఆనందంతో కంట నీరు పెట్టుకున్నారు. యయాతి మహారాజు ఆ దృశ్యాన్ని తన్మయుడై చూసాడు. అప్పుడు నేను ఎంతో అదృష్టవంతురాలిగా భావించాను.

ఎంతో ప్రయత్నంమీద నాన్నగారు దుఃఖాన్ని ఆపుకుంటూ అన్నారు, 'దేవ్........'

పైకి చూస్తూ నేను చెప్పాను, 'దేవీ .....'

నాన్నగారు చిన్నగా నవ్వుతూ చెప్పారు, - 'మంచిది, దేవీ ........' ఆయన నుండి దూరంగా జరుగుతూ నేను చెప్పాను. 'దేవీ ఇకనుండి మీది కాదు, నాన్నగారూ'.

'అంటే'

నేను మహారాజు యయాతి వైపు సిగ్గుగా అర్థవంతంగా చూస్తూ తలదించుకుని నిలబడ్డాను.

మహారాజు యయాతి ముందుకు వచ్చి నాన్నగారికి నమస్కరించారు. ఆయన ఎవరో, ఇక్కడకు సమయానికి ఎలా వచ్చారో, ఆయన వచ్చిన తరువాత నా ప్రాణాలను ఎలా కాపాడారో, నేను మహారాజు కలిపి నాన్నగారికి వినిపించాం. అది విని నాన్నగారు చాలా ఆనందించారు. మమ్మల్నిద్దరిని ఆశీర్వదిస్తూ నాన్నగారు వృషపర్వుని వైపు తిరిగి చెప్పారు - 'అప్పుడప్పుడు అదృష్టం కష్టాల రూపంలో వస్తుంది. ఈనాటి ఈ ఆనందం అటువంటిదే, రాజా, వీరి వివాహం ఏర్పాట్లు చూడండి. నగరమంతా అలంకరించండి. రాక్షసులకిది అంతులేనీ ఆనందాన్ని కలిగంచే రోజు. ఈమెను అత్తవారింటికి పంపి శుక్రాచార్యుడు మరల తపస్సుకు సన్నద్ధుడవుతాడు. మధ్యలో మొండికేసిన అదృష్టం మళ్ళీ ప్రసన్నమయ్యింది. పదండి, యయాతి మహారాజా! ఈ రథంలోనే కూర్చుని మా నగరానికి రండి. దేవీ, నీవు ముందు పద'.

నేను కదల లేదు. ఒక్కమాట మాట్లాడలేదు. వృషపర్వుడు ముందుకువచ్చి నాతో చెప్పసాగారు. జరిగిన సంగతి మరిచి .........

నేను మండిపడుతూ అన్నాను - 'గాయం చేసినవారు దాన్ని మరచి పోగలరు. కాని నుదిటిపై గాయం తగిలినవారికి దానిని మరచిపోవడం సాధ్యంకాదు. ప్రాణాంతకమైన బాధతో వారు విలవిలలాడతారు. మీకుమార్తె ఈరోజు నన్ను నూతిలోకి త్రోసి నా ప్రాణం తీయాలని ప్రయత్నించింది. బహుశా నేను దానిని సహిస్తాను. కాని నాన్నగారిని ఆమె నానా మాటలు అన్నది. హృదయం గాయపడేటట్లు అన్న ఆమె మాటలు ...........'

నాన్నగారు కోపంతో అడిగారు - 'శర్మిష్ఠ ఏమన్నది?'

నేను చెప్పాను - 'నాన్నగారూ, అవన్నీ నేను మీకు ఏముఖంతో చెప్పగలను? ఆమె మిమ్ములను నిందిస్తూ నాతో అన్నది, - నీ తండ్రి ఒక బిక్ష గాడు, నేనొక రాజకన్యను. నీతండ్రి ఆస్థానంలో ఒక భట్రాజు, యాచకుడు, నా తండ్రి ముందు చేయచాచి అర్థించి దానం .........'

వృషపర్వుడు ముందుకు వచ్చి చాలా వినయంతో చెప్పాడు - 'గురుకన్యా, శర్మిష్ఠ ఇప్పుడు నీలాగే చిన్నపిల్ల. ఒక వస్త్రంకోసం మీ యిద్దరిమధ్య తగాద ఎలా మొదలయ్యిందన్ని ఆ సంగతంతా ఆమె నాతో చెప్పింది. చిన్న వాళ్ళకు ఆలోచన ఉండదు, జ్ఞానం ఉండదు, మాట మాట పెరుగుతుంది ........'

'ఆమె నన్ను నూతిలోకి తోసింది. ఇందులో కూడా ఆమె తప్పులేదా........'

'అలా ఎవరన్నారు? కాని కోపం మనిషిని గుడ్డివాణ్ణి చేస్తుంది. శర్మిష్ఠ చేసిన తప్పుకు నేను చేతులు జోడించి నిన్ను క్షమించమని అర్థిస్తున్నాను'.

'క్షమించమని అడగడం నా తండ్రిలాంటి బిక్షుకుడు చేయాలి. మీలాంటి మహారాజు కాదు. నాన్నగారికి అవసరముంటే నగరానికి తిరిగి వెళతారు. కాని ఆయ నకు, నాకూ ఇంత అవమానం జరిగిన తరువాత నేనక్కడ అడుగు కూడా పెట్టను'. వెంటనే మహారాజు యయాతి వైపు తిరిగి నేను అన్నాను - 'పదండి మహారాజా - ఇక ఇక్కడ ఒక్క క్షణంకూడా ఉండనక్కరలేదు. పుట్టిల్లు వదలేటపుడు ఆడ పిల్లల కంట కన్నీరు ఆపినా ఆగదని చిన్నప్పుడు విన్నాను. కాని నాకు పుట్టిల్లు విడిచిపెడుతున్నప్పుడు చాలా సంతోషం కలుగుతున్నది. నా ప్రాణాలు తీయ డానికి ప్రయత్నం జరిగింది. తపస్విగా మూడు లోకాలలో పేరుపొందిన నా తండ్రిని యాచకుడని, ఒక ఆడపిల్ల ఐశ్వర్యపుమత్తులో అవమానించింది. ఇక ఇక్కడ నేను మంచి నీళ్ళు కూడా ముట్టటానికి సిద్ధంగా లేను'.

'రాజా, నేను కూడా' - అప్పటి వరకూ స్తబ్ధంగా ఉన్న నాన్నగారు విరుచుకు పడ్డారు - 'తపస్సు చేసుకునే వారికి హిమాలయాలలో వేలకొద్దీ గుహలున్నాయి. ఇక నీరాజ్యంతో నాకు పనిలేదు. నా శక్తిపై నీవు నీ దానవులు ఇప్పటి వరకూ బ్రతికారు. నన్ను అవమానించి నా కూతురు ప్రాణం తీయడానికి ప్రయత్నించి నప్పుడు..........'

వృషపర్వుడు మధ్యలో ఆయనను ఆపుతూ అన్నారు, 'గురుదేవా, దేవయాని తప్పుగా ........'

నాన్నగారు మండిపడుతూ అన్నారు - 'న్యాయాన్యాయాలు నిర్ణయించడానికి నా దగ్గర సమయంలేదు. నేను వెళ్తున్నాను'.

వృషపర్వుడు మోకాళ్ళపై కూర్చుని నాన్నగారి కాళ్ళుపట్టుకుని ఇలా అన్నారు - 'గురుదేవులు మీరు, దూరమైతే సముద్రంలోపడి ఆత్మహత్య చేసు కోవడం తప్ప మాకు, మరో మార్గం లేదు. శర్మిష్ఠ పెద్ద పొరపాటు చేసింది. గురుదేవా! ఆమెను ఇష్టం వచ్చినట్లు దండించండి. మీరు చెప్పకుండా నేను దండన అమలు

చేస్తాను. ఆమెను తక్షణం మీ యిద్దరికి క్షమాపణ చెప్పమంటాను. ఆ శిక్ష సరిపోక పోతే ఆమెను ఈ క్షణం నుండి దానవరాజ్యం నుండి బహిష్కరిస్తాను'.

ఆమె దేవయానిపట్ల క్షమించరాని అపరాధం చేసింది. ఆమె శర్మిష్ఠకు ఏ శిక్ష విధిస్తే ఆ శిక్షను ఆమె స్వీకరిస్తేనే నేను నగరంలోకి వస్తాను -'. నాన్నగారు దృఢంగా పలికారు.

శర్మిష్ఠ అన్న పొగరుబోతు మాటలు - 'నేను రాజకన్యను, నీవు ఒక యాచకుని కుమార్తెవు'. ఇప్పటికీ నా చెవులలో మారుమోగుతున్నాయి. ఆ గర్విష్ఠికి మరచిపోలేని దండన ఇవ్వాలని మనసు ఉబలాటపడుతున్నది. రాజకన్యననే మత్తు ఆమెకు బాగా తలకెక్కింది. ఐశ్వర్యం మదంతో ఆమె పేదవారిని నిందిస్తుందా? మంచిది. ఆమె మత్తంతా, మదమంతా, ఒక క్షణంలో నాశనంచేసే దండన ఆమెకు ........'

నా నోటి నుండి అప్రయత్నంగా వెలుపడింది - 'శర్మిష్ఠ నా దాసిగా ఉండాలి'.

'ఏం అన్నావు? దాసి?' వృషపర్వుని ముఖం నల్లగా మాడిపోయినట్లయ్యింది. అతికష్టంగా ఆయన నోటి నుండి ఆ మాటలు వెలుపడ్డాయి.

నేను గెలిచాను. నేను బిగ్గరగా అన్నాను. 'ఔను, శర్మిష్ఠ నా దాసిగా ఉండాలి. ఈ హస్తినాపుర మహారాణికి దాసిగా ఉండాలి. జీవితమంతా దాసిగా నా సేవ చేస్తూ - ఆమె ఇప్పుడే నాతో హస్తినాపురం రావాలి'.

## శర్మిష్ఠ

గంటలు మోగాయి. రెండు ఘడియలలో ఒక ఘడియ గడిచింది. ఇక ఒక్క ఘడియ మాత్రమే ఉంది. ఈ ఘడియలో - ఇంత తక్కువ సమయంలో - నేను జీవితానికి సంబంధించి నిర్ణయం తీసుకోవాలి. దేవయాని దాసిగా ఉండనా, లేక ..........

నాన్నగారు రాసిన లేఖ ముందున్నది. తన ప్రియపుత్రికకు రాసిన మొదట లేఖ ఇది. ఇప్పటి వరకూ శర్మిష్ఠ ఆయనను వదలి దూరంగా వెళ్ళలేదు. ఆమెకు ఉత్తరం రాయడానికి ఆయనకు అవసరమేముంటుంది? ఆ అవసరం ఇప్పుడు

వచ్చి పడింది. కాని ఎన్ని విచిత్రాలు జరిగాయి. ఆ పైపు భవనంలో నాన్నగారు, ఈ పైపు భవనంలో శర్మిష్ఠ; మేమిద్దరం ఇంత దగ్గరగా ఉన్నపుటికే ఆయన నాకు ఉత్తరం రాయడానికి ఎంత బాధపడి ఉంటారు. ఇదంతా పూర్వజన్మ సుకృతంలా వుంది.

వసంతోత్సవం మొదటిరోజు ..... ......

నేటి సూర్యోదయం చిన్నప్పటిలా కిటికిగుండా నాపై ఎర్రని పూలను చల్లుతూ వచ్చింది. శయ్యపై ఉండే నేను దానిని తనివితీరా చూడసాగాను. అప్పుడే మనసులో సిగ్గుపడ్డాను. ఆ ఎర్రదనం వివాహపు పవిత్ర అగ్నిజ్వాల. రాత్రి పడు కునే ముందు అమ్మ చెప్పిన మాటలు గుర్తుకొచ్చాయి. నన్ను ప్రేమగా బుజ్జగిస్తూ అమ్మ చెప్పింది - 'శమా, యుద్ధం ఆగిపోవడం మంచిదైంది. ఇప్పుడు ఆర్యావర్తంలో ఎవరైనా రాజును వెదకి ... హస్తినాపుర రాజు యయాతి మహా వీరుడు, గుణవంతుడని విన్నాను. చిన్నప్పుడే అశ్వమేధ యాగాశ్వాన్ని తీసుకొని దిగ్విజయ యాత్రకు వెళ్ళాడట. చూడటానికి చాలా అందగాడని, నా ఈ సుకుమారికి అనుకూలుడని అంటారు. ఆమె మాటలు విని 'పో అమ్మా, ఇదే మిటి' అంటూ నేను దుప్పటిలో తలదుర్చాను. కాని రాత్రంతా మధురమైన కలల ఊయలలో నేను తేలిపోయాను. అందులో ఒక ఊయల నన్ను తిన్నగా హస్తినా పురం తీసుకుపోయింది. యయాతి మహారాజు పట్టపు రాణిగా!

సూర్యోదయంతో పాటు మేల్కొన్నా ఈ కల మత్తు నన్ను వదలలేదు.

కాని జీవితం ఎంత భయానకం. ఎంత పరస్పర వైరుధ్యం? కల కంటే వాస్తవం ఎంత కఠోరంగా ఉంటుంది? తూర్పున ఉదయించిన సూర్యుడు పశ్చి మాద్రి చేరక ముందే నేను హస్తినాపురం వెళ్ళవలసి వచ్చింది. ఆ యయాతి మహారాజు రాజ మహలుకే - 'కాని ఆయన పట్టపురాణిగా కాదు, ఆయన పట్ట మహిషికి దాసిగా!'.

ఉదయం జలక్రీడల సమయంలో నేను ఆవిధంగా మాట్లాడి వుండవలసింది కాదు. దేవయాని మనసు గాయ పడేటట్లు అనేక మాటలు అన్నాను. కాని ఏం చేయను? మనసు, మాట అన్ని కొంచెం సేపు నా వశం తప్పాయి. చిన్నప్పటి నుండి నన్ను అవమానించే ఏ చిన్న అవకాశాన్ని దేవయాని వదలి పెట్టలేదు.

ఆమే నాలా రాజకన్యకాక, మునికన్య అయ్యింది. ఇందులో, నాదోషం లేదు. ఎప్పుడైనా, ఎక్కడైనా, అడుగడుగునా దేవయాని శర్మిష్ఠ కంటే గొప్పది అని మొండిగా చెప్పడానికి తయారయ్యేది.

అప్పుడు మా యిద్దరికి మూడు - నాలుగు సంవత్సరాల వయస్సు ఉంటుంది. దాసీలు మమ్మల్ని నౌకావిహారానికి తీసుకువెళ్ళారు. దేవయాని వంగుతూ నీటిలోకి చూడసాగింది. తిరిగి చప్పట్లు కొడుతూ నాతో అన్నది - 'అరే ఛమా, చూడు ఎవరో అందమైన అమ్మాయి నన్ను తనతో ఆడుకోడానికి పిలుస్తున్నది. నేను కూడా తలవంచి నీటిలోకి చూసాను. నన్ను కూడా నాలా ఉన్న అమ్మాయి నవ్వుతూ పిలుస్తున్నది. నేను చెప్పాను - 'చూడు, నన్ను కూడా ఓ అందమైన అమ్మాయి పిలుస్తున్నది?' దేవయాని ముక్కువంకర చేస్తూ అన్నది 'నీ అమ్మాయి పొట్టిది, నా అమ్మాయి పెద్దది. మా యిద్దరికి ఎనిమిది పది సంవత్సరాల వయస్సు వచ్చింది. వసంతోత్సవంలో ఆడే ఒక నాటికలో గురువుగారు మాకు పాత్రలు ఇచ్చారు. ఆనాటికలో ఆయన నన్ను వనరాణిగా వేయించారు. దేవయాని చూడడానికి అందంగా ఉంటుంది. నాట్యం బాగా చేస్తుంది. అందుకే ఆమెచేత పూలరాణిగా వేషం వేయించారు. నాటికలో ఆమెకు మూడు నృత్యాలు ఉన్నాయి. మొగ్గ నృత్యం, సగం వికసించిన పూవు నృత్యం, ఆఖరిది పూర్తిగా వికసించిన పూవు నృత్యం. వనరాణికి నాట్యం ఏమీలేదు. నాట్యకళలో నాకు ఎటువంటి ప్రవేశంలేదు. కాని పూలరాణికి వనరాణి కంటే ఆ నాటికలో ప్రాముఖ్యం తక్కువ. అందుకే దేవయాని వనరాణిగా వేస్తానని మొండి తనం చేసింది. చివరకు గురువుగారు ఆ నాటికలో వనరాణికి నాట్య సన్నివేశం ఏర్పాటు చేసారు. పూలరాణి చేయవలసిన నాట్యం నాకు రాదు. ఫలితంగా ఆ నాటిక రసాభాసుపాలయ్యింది.

మాకు పదిహేనేళ్ళు వచ్చాయి. ఆ సంవత్సరం వసంతోత్సవంలో పెద్దవారి పిల్లలకు పోటీలు పెట్టారు. నాట్యం, సంగీతం, సాహిత్యంలో పోటీలు ఏర్పాటు చేశారు. దేవయాని నాట్యం, సంగీతం, అందాల పోటీలలో మొదటి బహుమతి గెలుచుకుంది. కాని సాహిత్య పోటీలో నా కవితకు మొదటి బహుమతి ప్రకటించారు. దానిపై దేవ యాని వెంటనే గొడవచేసింది. కోపగించింది. తలబాదుకుంటూ సభనుండి వెళ్ళి పోసాగింది. నేను శుక్రాచార్యుని కుమార్తెను. నా తండ్రి మూడులోకాలలో పేరు పొందిన

కవి. నా కవిత అన్నింటికంటే మంచిది. కాని శర్మిష్ఠ రాజకన్య అయినందున ఈ న్యాయనిర్ణేతలు ఆమె కవిత మంచిదని నాకు అన్యాయం చేసారు అని వాదిం చింది. చివరకు న్యాయ నిర్ణేతలు ఓడిపోయి ఆ బహుమతిని మా ఇద్దరికి సమంగా పంచారు. అప్పుడుగాని ఆమె శాంతించలేదు. అప్పుడు నాకు చిత్రలేఖ నంలో మాత్రమే ప్రథమ బహుమతి వచ్చింది. అది కూడ దేవయానికి చిత్రలేఖనం రాని కారణంగా మాత్రమే!.

ఆమె తండ్రి సంజీవనికై తపస్సు చేసారు. సంజీవనితో దానవులు దేవతల పై జయం పొందసాగారు. అందుకే దేవయానికి ఎప్పుడూ కోపం కలిగించగూడదని నాన్నగారు భావించేవారు. నేను కూడా అదే భావంతో ఉండవలసి వచ్చింది.

ఒకటీ రెండూ కాదు, ఆమె అహంకార ప్రవృత్తికి ప్రమాణంగా అనేక సంఘటనలు లోతులలో నాటుకున్నాయి. లోపల తుఫాన్ రేగుతున్నది. ఉదయం నేను కట్టుకున్న చీర లాగుతున్నప్పుడు కలిగిన అనుభూతి ఎవరికి చెప్పను? ఎవరికి ఎలా వివరించను?

నా నోటి నుండి నాలుగు చెడ్డ మాటలు వచ్చాయి. ఈ చీర దేవయానిదేనని అమ్మ చెప్పింది. కచుడు బహుమతిగా ఆమెకు ఇచ్చాడు. నేను అది కట్టుకో కూడదు. ఇప్పటికి నేను అది కట్టుకునే ఉన్నాను. కాని కచుడు తన ప్రాణాన్ని పణంగాపెట్టి దానవుల యుద్ధాన్ని నిరోధించాడు. అతనిచ్చిన బహుమతికై ఇంత భయంకరమైన పోట్లాట ఎందుకు? అమ్మ రాత్రి నాకు తన చీరను సరిగా ఎందుకు చూపించలేదు? ఆ చీర నాది కాదని నాకెలా తెలుస్తుంది? ఛీ! నేను రాజకన్యను కావడమే పెద్దతప్పు. అందువలనే ప్రతిపని దాసీలపై వదలడం నాకు అలవాటు అయ్యింది. దాని ఫలితం - శర్మిష్ఠ తన జీవితమంతా దేవయానికి దాసిగా ఉండ వలసి వచ్చింది.

నేను ఆమెను నూతిలోకి తోసివేసానని అంటున్నారు. ఆమె అడవిలో పిచ్చి పట్టిన దానిలా పరిగెత్తింది. ఈ మొండి పిల్ల కోపంతో ఏమైనా చేసుకుంటుందని నాకు భయం వేసింది. అందుకే ఆమెను పట్టుకునేందుకు ఆమె వెనుక పరుగెత్తాను గాని, ఆమె ప్రాణం తీసేందుకు కాదు. నేను ఆమెను కొంచెం ఈడ్చుకుంటూ ఆ నూతి అంచుకు తీసుకుపోయాను. ఆమె మొదట అక్కడకే వెళ్ళి నిలబడింది. మేమిద్దరం పెనుగులాడినపుడు ఆమె సరిగా నిలబడలేక నూతిలో పడిపోయింది. నాకు ఇప్పటికీ అనిపిస్తుంది -

'ఒకవేళ, ఇప్పటివరకు నా మనసులో ఆమె పట్ల వున్న కోపం కారణంగా నేను ఆమెను ఆ నూతిలోకి తోసివేసానా? కోపానికి గురైన మనిషి చాలా క్రూరుడుగా మారుతాడు. పశువుగా మారతాడు'.

నిజంగా నన్ను నేను మరిచిపోయానా? నాకేమీ గుర్తురావడంలేదు. కచుడు అంటూ వుండేవాడు - మంచి - చెడ్డ, సత్యం - అసత్యం, పాపం - పుణ్యం వీటికి ఈ ప్రపంచంలో రెండేసాక్షులు. ఒకటి ఆత్మ, రెండోది పరమాత్మ. ఈ రోజు ఉదయం నా ఆత్మ కోపంతో గుడ్డిదైంది. మరి పరమాత్మ? అతణ్ణి సర్వసాక్షి అంటారు. కాని అమాయకులకు, నేరం చెయ్యనివారికి సాక్షిగా అతడు ఎప్పుడైనా పరిగెత్తుకొని వస్తాడా?

ప్రతిసారి అతను రాలేదు. అతను రావడానికి కొద్దిగా అవకాశం ఉంది. నాన్నగారు నన్ను ఒక భయంకరమైన ప్రశ్న అడిగారు. దానికి జవాబు నేను ఆ భగవంతుణ్ణే అడుగుతాను. దేవయాని నన్ను నా జీవితమంతా తన దాసిగా ఉండాలని షరతు విధించింది. నేను దానిని అంగీకరించాలా వద్దా?

నాన్నగారు ఉత్తరంలో రాసారు.

'అమ్మా! తండ్రిగా నిన్ను అడుగుతున్నాను, నేను నిన్ను దాసిగా ఉండమని ఎప్పుడూ కోర లేదు'.

కాని మనిషి ఈ ప్రపంచంలో చాలా నియమాలు పాటించవలసి ఉంటుంది. నేను కేవలం నీ తండ్రినే కాదు. దానవులకి రాజును కూడా. కచుడు సంజీవని పట్టుకు పోవటంతో మనకు గొప్ప పరాభవం జరిగింది.

ఈ ప్రతికూల పరిస్థితులను ఎదుర్కొని దానవులు తిరిగి తలెత్తుకొని నిలబడాలనుకుంటున్నారు. శుక్రాచార్యులను తమ గురువుగా ఉంచుకోవటం వారికి తప్పనిసరి, ఆయనకు దేవయాని అంటే చాలా యిష్టం. ఆమె పెట్టిన షరతు ఒప్పుకోకపోతే ఆయన నగరంలో కాలుపెట్టరు. ఆయన లేకపోతే మన రాజ్యం ధూళిలో కలిసిపోవడానికి ఎంతోకాలం పట్టదు. అనంత ఆకాశంలో స్వేచ్ఛగా సంచరించాలనే కోరికగల దానవులు నీచమైన జంతువుల వలే భూమి మీద పోరాడవలసి ఉంటుంది.

శమా, నీవు దాసివైతే నీ జీవితమంతా మట్టిలో కలిసినట్లే. నా ప్రియమైన శమ! శమ, వేరెవరికో దాసిగా ఉంటుందా! లేదు - అమ్మా! దాసిగా నిన్ను చూడలేను. నిన్ను దాసిగా చూడటం కంటే .. . ఆ ఊహే అసహ్యంగా ఉంది. దానికన్నా నా కళ్ళుపోడుచుకోవడం మంచిది.

శమా, నీవు దేవయాని షరతును అంగీకరించలేదని నేను కోపగించుకోను. భగవంతుడా! పగవాడు కూడా ఇటువంటి సమస్యల వలలో చిక్కుకోరాదు. కాని అమ్మా! నీ ఈ తండ్రి అటువంటి సమస్యల వలలో చిక్కుకున్నాడు. ఏదారీ కనిపించటంలేదు. అందుకే ఈఉత్తరం రాసాను. నేను నిన్ను స్వయంగా కలిసి అన్ని విషయాలు మాట్లాడలనుకున్నాను. కాని ఎలా చెప్పగలను? ఏ ముఖంతో చెప్పగలను? చెప్పాలనుకుంటే నోటినుండి ఒక్కమాట కూడ బహూశా రాదేమో! కర్తవ్యం ప్రేమ చేతిలో ఓడిపోతుంది.

'శమా, నా ప్రియమైన తల్లీ! నీవు సుఖంగా ఉండేవిధంగా నిర్ణయం తీసుకునే బుద్ధి ఆ భగవంతుడైన శంకరుడు నీకు ప్రసాదించుగాక'.

మూహర్తం దగ్గర పడింది - ఈ మాట చిన్నప్పటినుండి పెండ్లిమంటపంలో వింటున్నాను. కాని ఆ మాటలోని భావం ఇప్పుడిప్పుడే నాకు అర్థమౌతున్నది. రెండు ప్రణయ జీవుల శుభప్రదమైన కలయికకు వేళ అయ్యిందనే సూచన. ధార్మిక పరమైన మాటలు ......... ఇప్పుడు ఆ మాటలే నాలో అంతులేని వేదనను కలిగిస్తున్నాయి.

కాని ఈ క్షణం ఆ రెండు మాటలు చాలా అశుభంగా తోస్తున్నాయి. వేళ అయ్యిందని ఎవరూ అనకూడదని నాకనిపిస్తున్నది. ఇప్పుడు ఎవరైనా కాల పురుషుడి కంఠం నొక్కితే వేళ అయ్యిందనే మాటేరాదు కదా! అని నా మనసులో మాటిమాటికి అనిపిస్తున్నది. వేళ కాగానే అమ్మ తలుపు తెరచుకొని లోపలికి వస్తుంది. కళ్ళు తుడుస్తూ నాదగ్గర నిలబడుతుంది. నాన్నగారికి నానుండి స్థిరమైన నిర్ణయం కావాలి.

భగవంతుడా! నేనేం సమాధానం చెప్పాలి? ఆనందంగా దాసిగా ఉండనా? ఆ దుష్ట దేవయానికి దాసిగా ఉండనా? ఇది ఎలా సంభవం, ఇప్పటి వరకు ఇతరు

లచే నాకాళ్ళు తుడిపించుకునేదాన్ని, ఇప్పుడు ఇతరుల కాళ్ళు ఎలా తుడవను? మణి మాణిక్యాలు, ముత్యాల ఆభరణాలు వదలి బిచ్చగత్తెలా ఉండాలా? రాత్రి పగలు సేవకులుకు ఆజ్ఞలు ఇచ్చే రాజకుమారిని, ఇప్పుడు ఇతరుల ఆజ్ఞలు ఎలా శిరసా వహించను? వారి మాటలు పడనా? యజమానురాలిచ్చిన అన్నవస్త్రాలను కాదనకుండా స్వీకరించి జీవించాలా? ప్రణయం, ప్రేమ, భర్తసుఖం, వాత్సల్యం ........ అన్ని సుఖాలు వదులుకుని ఉండాలా?

లేదు, నేను నాన్నగారితే చెపుతాను - దేవయానికి దాసిగా ఉండేకన్నా నేను జోగినిగా ఉంటాను. దేవయాని నాపై పగ తీర్చుకోవాలని అనుకుంటున్నదా? మంచిది, ఆమెను ఇక్కడకు పిలిపించండి. ఆమె వచ్చిన తరువాత మీరు కత్తి తీసుకుని ఒకే సారి శర్మిష్ఠ తల నరకండి. కాని గుర్తుంచుకోండి, నరకబడిన నాతల ఆమె పాదాల చెంత పడరాదు. ప్రాణం పోయినా నేను ఆమెకు దాసిగా ఉండను. కలలో కూడ దేవయానికి దాసిగా ఉండను.

నేను ఒకసారి ఉలిక్కిపడ్డాను. ఎవరిదో పిలుపు .......... .

వేళ అయ్యిందనే సంకేతం. గంటలు మోగాయి. నేను భయపడుతూ తలుపు పైపు చూసాను. అది తెరుచుకోలేదు, అమ్మలోపలకి రాలేదు. నాకు ఆనందంగా ఉంది.

తలతిప్పి నేను ఆలోచనలో మునిగిపోయాను. ఆలోచన ..... ఆలోచన .....మనసులో ఆలోచనా మేఘాలు తిరుగుతున్నాయి నరికిన తలలు ఎగురుతున్నాయి.

ఇవన్ని ఎందుకు? నేను పొరపాటున ఆమె చీర కట్టుకున్నందుకు .....

కచుడు దేవయానికి బహుమతిగా ఇచ్చిన పట్టుచీర. నేను పొరపాటుగా .....నాన్నగారిపై ఒట్టు, పొరపాటుగా ..... కట్టుకున్నాను.

ఈ ప్రత్యేకమైన కలయికలో ఏదైనా రహస్యమైన సంకేతం ఉందా? సంజీవనికై కచుడు ఇక్కడకు వచ్చాడు. అయితే అతను మాకుశత్రువు. కాని అతని చదువు, అతని శ్రద్ధ, భక్తి, త్యాగం, స్వభావం ..... అవన్ని చూసిన తరువాత నేను

మనసులో అతనిని పూజించసాగాను. అనేక సార్లు అనుకున్నాను - 'నాకూ అటు వంటి అన్న ఉంటే ఎంత బాగుండును'.

దేవయాని ఎప్పుడూ నన్ను కచునితో మాట్లాడనివ్వలేదు. కలిసి ఉండనివ్వ లేదు. నేనంటే ఆమె ఎందుకు అసూయపడుతుందో తెలియదు. కాని కచుని చూడ గానే నా మనసు మందహాసం చేసినపుడు నా మనసు పూలతోటగా మారేది. సహజ సంభాషణలో అతను చెప్పిన మాటలు విని వాటిని గురించి నేను ఎన్నో రోజులు ఆలోచిస్తూ ఉండేదాన్ని. రాక్షసులు అతనిని మూడుసార్లు కుట్రపన్ని చంపారు. కాని బ్రతికిన ప్రతిసారీ అతను నవ్వుతూ అనేవాడు - 'ఏదైనా వస్తువు దూరంనుండి చూస్తే భయంకరంగా ఉంటుంది, కాని నిజంగా భయంకరమైనది కాదు. మృత్యువు కూడా అటువంటిదే. రాజకన్యా! ఇది నా అనుభవంతో చెపుతున్న మాటలు'; అలా అంటూ అతను తనివితీరా నవ్వేవాడు.

అతని మాటలకు అర్థమేమిటి? కచునికి భవిష్యత్తు తెలుసా? దాసిగా ఉండటం ఏనిటి? చావు కూడా ..... మనిషి గర్వానికి చావు. అతని గొప్పతనానికి మరణం.

రాజవంశంలో పుట్టడం వలన దాసిగా ఉండడం అనేది నాకు చాలా భయం కరంగా ఉన్నది. ఏ దాసి కడుపునో పుట్టిఉంటే నేను ఆనందంగా దాసి జీవితాన్ని గడపనా? అందులో సుఖాన్ని పొందనా? ప్రపంచంలో ఆడపిల్లలలో కొంతమందే రాజకన్యలుగా జన్మిస్తారు.

గుణదోషాలు జాతినిబట్టి ఉంటాయా? కచుడు బ్రాహ్మణుడు. దేవయాని కూడ బ్రాహ్మణకన్యే. అయితే కచునిలోని ఒక్కగుణమైనా ఆమెలో ఉందా? లేదు. ఈ లోకంలో జన్మ లేదా జాతి పైన ఏది ఆధారపడి లేదు. ఒక రాజకన్య దుష్టురాలుగా ఉండవచ్చును. ఒకదాసి మంచిదాసిగా ఉండవచ్చును.

బ్రాహ్మణుడైన కచుడు సంజీవని పొందేందుకు రాక్షస నగరానికి వచ్చేటప్పుడు ఎంత వీరత్వాన్ని చూపించాడు. తన సాహసంతో అతను క్షత్రియులందరికీ సిగ్గు కలిగేటట్లు చేసాడు. దానవులు అతనిని చాలాసార్లు చంపారు. కాని అతను భయ పడలేదు. పారి పోలేదు. సంజీవని పొందే వరకూ అతను నిర్భయంగా ఇక్కడే ఉన్నాడు.

ఈ వస్త్రం - ఆలోచిస్తే - అనుకోకుండానే కచుడు దేవయానికి బహుమతిగా ఇచ్చాడా! అతని ఈ బహుమతిని జీవితాంతం భద్రంగా ఉంచాలి. కచుని స్మృతే ఈ సమస్య నుండి ..... ......

సమస్యలు ఇప్పటి వరకు ఎవరిని విడిచిపెట్టాయి? వాస్తవానికి మంచివారికే ఎల్లప్పుడూ సమస్యలు వస్తాయి. కచుడు ఎంత మంచివాడు, స్నేహశీలి, నిస్వార్థ పరుడు, బుద్ధిమంతుడు: అయితేమాత్రం అతను తక్కువ దుఃఖాన్ని అనుభవించాడా? కాని దేవయాని శాపమిచ్చిన తరువాత వెళ్ళిపోతానని నాతో చెప్పడానికి వచ్చినపుడు ఎంతో నవ్వు ముఖంతో ఉన్నాడు. అతనికి భగ్నప్రేమ దుఃఖం ఉంది. ప్రేయసి ఇచ్చిన శాప దుఃఖం ఉంది. అయినప్పటికీ అతని ముఖంలో ఏ దుఃఖపుచ్ఛాయలు లేవు.

నేను ఉండలేక అతనితో అన్నాను - 'వివాహంచేసికొని మీయిద్దరూ దేవలోకం వెళ్ళిఉంటే నేను చాలా సంతోషంగా వీడ్కోలు చెప్పేదాని. కాని .....'

అతను ప్రశాంతమైన మనస్సుతో చెప్పాడు - 'రాజకుమారీ, జీవితం ఎప్పుడూ అపూర్ణమే, అందులోనే దాని ఆకర్షణ ఇమిడి ఉంది'.

వేదాంత ధోరణిలో అన్నాడు - 'లేదు, ప్రేమ మనిషికి తననుండి వేరుగా చూసే శక్తి ఇస్తుంది. ఎవరినైనా ప్రేమిస్తే అది మనిషిగాని, వస్తువుగాని అయితే అది నిజ మైనదిగా ఉండాలి. మనసు అంతరాలనుండి అది రావాలి. అది స్వార్థం, లోభం కపటంతోకూడి ఉండరాదు. రాజకుమారీ! నిజమైన ప్రేమ ఎప్పుడూ నిస్వార్థంగా ఉంటుంది. అయితే పూలనుగాని ప్రాణినిగాని ప్రేమించవచ్చు. ప్రకృతి సౌందర్యాన్ని గానీ, తల్లిదండ్రులనుగానీ, ప్రియునిగానీ, ప్రేయసినిగానీ లేదా వంశం, జాతి లేదా దేశాన్నిగానీ ప్రేమించవచ్చు. నిస్వర్థమైన కోరికలేని, అహంకార రహితమైన ప్రేమ మనిషి ఆత్మవికాసానికి మొదటి మెట్టు. ఇటువంటి ప్రేమ మనిషి మాత్రమే ఇవ్వగలడు'.

అప్పుడు అతని మాటలు నాకు సరిగా అర్థంకాలేదు. ఈ మాటలు అతను ఎంత ఆత్మీయతతో చెప్పాండంటే - వాటిని నేను వెంటనే రాసుకొని దాచు కున్నాను. వాటిని ఎన్నిసార్లు చదివానో నాకే తెలియదు. వాటి అర్థం నాకిప్పుడు తెలిసి వస్తున్నది.

ఆరోజు కచుడు త్వరగా వెళ్ళిపోవాలనే తొందరలో ఉన్నాడు. ఆ తొందరలో కూడ అతను నాతో చెప్పాడు - 'శర్మిష్ఠ, మా ప్రేమ ఫలించలేదు, ఇందుకు నీవు బాధపడవద్దు. నాకు ప్రేమ లభించలేదనడం సరికాదు, ప్రేమంటే ఏమిటో నేను అనుభవం ద్వారా తెలుసుకున్నాను. ఆ జ్ఞాపకాలు నేను జీవితమంతా గుర్తుంచు కుంటాను. దేవయాని నీ స్నేహితురాలు. ఆమె మొండిది, కోపిష్ఠి, అహంకారికూడ. ఆమెలోని దోషాలన్నీ నాకు బాగా తెలుసు. నేను ఆమె సౌందర్యపు మోహంలోపడి ఆమెను గుడ్డిగా ప్రేమించలేదు. ఇష్టమైన వ్యక్తిని ఆమె దోషాలతోకూడా అంగీకరించే శక్తి నిజమైన ప్రేమలో ఉంది ......... దేవయానిని నేను ఆవిధంగానే ప్రేమించాను. కాని నావారి కోసం నేను దేవయాని హృదయాన్ని భగ్నం చేయవలసి వచ్చింది. నేను ఏం చేయ్యను? జీవతంలో ప్రేమ ఉన్నతమైనది. కాని కర్తవ్యం దానికంటే గొప్పది. కర్తవ్యం కఠినమైంది. కర్తవ్యమే ధర్మానికి ముఖ్యమైన ఆధారం. ఆలస్యం గానైనా ఎప్పుడైనా దేవయాని నీతో మనసు విప్పి చెప్పితే, ఆమెతో చెప్పు - కచుని హృదయంలో ఎప్పుడూ కర్తవ్యానిదే మొగ్గు. కాని అతని హృదయంలో ఒక మూల మాత్రం దేవయానికి స్థానంవుంది. అది ఎప్పుడూ ఆమెకే అంకితం'.

చాలాసేపు కచునితో జరిగిన ఈ ఆఖరి కలయిక, ఆయన భావాలు నేను .ఎలా మరిచిపోయానో తెలియదు. బహుశా దుఃఖంతో గుడ్డిదాన్ని అయి పోయాను. చీకటిలో వెలుతురుకోసం వెతుకుతున్నాను. ఇప్పుడు వెలుగు కని పించింది. కచుడే చూపించాడు. నేను పరుగెత్తి ద్వారం దగ్గరకు వెళ్ళాను. అప్పుడే వేళ అయిందనే గంట మోగింది. నేను లోపలనుండి గడియ తీయ బోయాను. అమ్మ బయట నుండి తలుపుతోసింది. నేను నవ్వుతూ అమ్మను కౌగ లించుకొని చెప్పాను 'అమ్మా! నేను వెళ్ళే ఏర్పాట్లు చేయమని నాన్నగారితో చెప్పు'.

'ఏర్పాట్లా, ఎందుకు ఏర్పాట్లు?'

'హస్తినాపురం వెళ్ళడానికి ఏర్పాట్లు. దేవయానితో ఆమె దాసిగా వెళ్ళేందుకు శర్మిష్ఠ సిద్ధంగా ఉంది'.

రాతి విగ్రహంలా అమ్మ నిశ్చేష్టురాలై నిలబడిపోయింది. తిరిగి వెక్కివెక్కి ఏడుస్తూ ఆమె నా భుజంపై తల ఉంచింది. అనుకోకుండా నేను అమ్మ తల నిమిర సాగాను. అమ్మకు నేను అమ్మ అయ్యాను.

# అధ్యాయం 9

హస్తినాపుర రాజభవనంలో అడుగుపెట్టగానే నాలో చిత్రమైన అశాంతి చెల రేగింది. కాని నన్ను నేను అదుపు చేసుకున్నాను. దాసి ........... దాసీలా నేను అన్ని పనులు చక్కపరచసాగాను.

దేవయాని రాజమాతను చూడడానికి వెళ్ళింది, నేను కూడ ఆమె వెనుకే వెళ్ళాను. నా నమస్కారాన్ని స్వీకరిస్తూ రాజమాత 'రా అమ్మా ఇటు రా' అన్నారు.

నేను కొద్దిగా ముందుకు వెళ్ళి తలవంచుకుని నిలబడ్డాను. నా చుబుకాన్ని పైకెత్తి నావైపు చూస్తూ రాజమాత దేవయానితో చెప్పింది, 'కోడలా! నీ స్నేహితు రాలు నీలాగే అందమైనది'.

దేవయాని వెంటనే అన్నది - 'ఈమె నా స్నేహితురాలు కాదు'.

'మరి'

'ఈమె నా దాసి'

'కొత్త కోడలుతో రాజకన్య శర్మిష్ఠ వస్తున్నదని మహారాజుగారి దూత చెప్పాడు. శర్మిష్ఠ నీకు తోడుగా వచ్చిందని అనుకున్నాను. నీతో లోపలికి రాగానే ఈమే శర్మిష్ఠ అనిపించింది .... '.

దేవయాని చాలాగర్వంతో చెప్పింది - 'అవును, ఈమే శర్మిష్ఠ, కాని నాకు తోడుగా నేను ఈమెను తీసుకురాలేదు. ఈమె ఇప్పుడు రాజకన్యకాదు. ఈమె ఒక దాసి.......... నాదాసి..........'

'అంటే'

'అంటే ఏమిటో మహారాజును అడగండి, నా తండ్రి ఎంత పెద్ద మహర్షో తెలుస్తుంది.......... .........'

'నీ మామగారు, నహుష మహారాజు కూడా పెద్ద వీరుడే. కాని ఆయన భవనంలోకి ఒక రాజకన్య దాసిగా రావడం నాకు నచ్చలేదు.

'ఈ ప్రశ్న మీదికాదు, నాది' అంటూ దేవయాని భవనం వదలి వెళ్ళి పోయింది.

ఈ విధంగా అత్తా కోడళ్ళ మధ్య నా కారణంగా అనుకోకుండా మొట్టమొదటి తగవు ప్రారంభమైంది. నాకు చాలా బాధకలిగింది, కారణం ఉన్నా లేకున్నా అలా జరుగుతూ ఉంటుందని వినికిడి.

దేవయాని చిన్నప్పటి నుండి చాలా గారాబంగా పెరిగింది. ఆడపిల్లకు అమ్మ అడుగుజాడలలో నేర్చుకోవలసిన పనిపాటలు, అలవాట్లు దురదృష్టవశాత్తూ నేర్చు కునే అవకాశం లభించలేదు. ఇప్పుడామె అట్టహాసంగా హస్తినాపుర మహారాణిగా, హస్తినాపుర రాజ్య గౌరవశాలినిగా వచ్చింది. వినయంతో ప్రేమతో రాజమాతను తన వశం చేసుకోవలసిన అవసరం ఏమి ఉంది? రాజమాత ప్రవర్తన కూడ కొంత వరకు దేవయాని ప్రవర్తనలాగానే ఉంటుంది. ఆకాశంలో రెండు మెరుపులు ఒకదాని కొకటి ఢీకోనట్లు వీరిద్దరిని విధి కలిపింది.

మహారాజు, రాజమాత మధ్య ఏం గొడవ జరిగిందో నేను తెలుసుకోలేక పోయాను. కాని వారిద్దరు మనసువిప్పి మాట్లాడుకోవడం నేను ఎప్పుడూ చూడ లేదు. వినలేదు - కుమారునితోనే ఇలా వుంటే కోడలితో సఖ్యత ఎలా ఉంటుంది.

రాజమాతకు క్షత్రియులంటే చాలా ఇష్టం. బ్రాహ్మణకన్య అయిన దేవయానికి జాత్యహంకారం పూర్తిగా వుంది. వారిద్దరు ఏ విషయం మాట్లాడుకున్నా ఇచ్చి పుచ్చు కుంటున్నా తమ జాతిని పేర్కొంటారు. అత్తగారు అప్సరసను మోహించే ముని కథ చెప్తూ అంటూ ఉండేది - 'ఈ మేధావులైన బ్రాహ్మణులంతా ఒకేలా ఉంటారు. పైకి తపస్సు చేస్తారు. స్త్రీ కనిపిస్తే కరిగిపోతారు'. పైకి తపస్సు చేస్తారు. అత్తగారి మాటలు కోడలికి బాధకలిగిస్తాయి. అత్తగారు తన తండ్రిని ఉద్దేశించే ఈ మాటలు అన్నదని ఆమె అనుకుంటుంది. శుక్రాచార్యుడు సంజీవనికై ఏవిధంగా

తపస్సు చేసిందీ చెప్పటం ప్రారంభమౌతుంది. అందులో వృషపర్వ మహారాజు, రాక్షసులూ అందరూ పరిహసించబడతారు. చివరకు ఒక క్షత్రియ కన్య తప్పు ఒప్పుకుని దాసిగా మారి బ్రాహ్మణకన్య దగ్గరుకు ఎలా వచ్చిందనే దానితో కథ పూర్తి అయ్యేది. దేవయాని మాటలు నా మనసులో గుచ్చుకొని, నాటుకొని, నా హృదయాన్ని ముక్కలచేస్తూ ఉండేవి. కాని నేనక్కడ చెవిటిదానిలా నిలబడి ఉండే దాన్ని. పగలురాత్రి నేను ఒకే మంత్రాన్ని జపించేదాన్ని - నేను దాసీని. దాసికి కాళ్ళు చేతులు ఉంటాయి. కాని నోరు ఉండదు. మరి మనసు? అది ఉండనే ఉండదు.

అత్తాకోడళ్ళ తగాదాలతో అప్పుడప్పుడు అనుకోని విధంగా నాకు లాభం కలిగేది. ప్రేమతో వీపు నిమిరే అమ్మ చేయి అప్పుడప్పుడు నాకు గుర్తుకొచ్చేది. హృదయం అశాంతితో నిండిపోయేది. కోపంతో నా మనస్సు రగిలిపోయేది. వారి మధ్య తగవు లేకపోతే రాజమాత ఏదో నెపంతో నన్ను తన దగ్గరకు పిలిచేది. బహుశా దేవయానికి సిగ్గు పడేటట్లు చేయడానికో లేదా నేను రాజకన్యననే భావంతోనో నా వీపుపై చేయి వేసి నిమిరేది. ఆమె స్పర్శతో నా మనసులో అశాంతి తగ్గిపోయేది. పరాయి దేశంలో ఈ అనాథ అమ్మాయిని ప్రేమించేవారు ఈ రాజ భవనంలో ఒకరున్నారనే భావన నా మనసుకు ధైర్యమిచ్చేది. అది ప్రేమ భావన కావచ్చు. జీవించాలనే కోరికి గలవారికి, ఈ ప్రపంచంలో అప్పుడప్పుడు ఈ భావన గొప్పగా సహకరిస్తుంది.

రాజమాత మనసులో నాపై ఉన్న అనురాగం ఒకరోజు బయట పడింది. ఒక గొప్ప సాముద్రిక శాస్త్ర పండితుడు నగరంలోకి వచ్చాడు. దేవయాని అతనిని రాజ భవనానికి పిలిపించింది. తన చేయి చూపించుకుంది. సంవత్సరంలోపు ఆమెకు కొడుకు పుడతాడని ఆ జ్యోతిష్యుడు చెప్పాడు. అది విని మేమందరం సంతోషించాం.

నేను దగ్గరే నిలబడి ఉన్నాను. చేయి పట్టుకుని నన్ను కూర్చోపెడ్తు రాజమాత పండితునితో నాచేయి చూడమని చెప్పింది. నేను వద్దని చెప్పాను. దేవయాని కళ్ళు పెద్దవి చేస్తూ నావైపు చూడసాగింది. కాని రాజమాత ముందు నా మాట సాగలేదు.

చాలాసేపు నాచేయి పరిశీలించిన పండితుడు చెప్పాడు - 'ఈ అమ్మాయి చాలా దురదృష్టవంతురాలు'.

దేవయాని అంది, - 'పండితులవారూ! ఈమె దాసి, రాజకన్యకాదు'.

పండితుడు ఉలిక్కిపడ్డాడు. ఆయన దేవయానివైపు చూసాడు. తిరిగి నా చేతిని జాగ్రత్తగా పరిశీలించి చెప్పాడు. 'ఈమె చాలా కష్టాలు పడుతుంది, కాని ఈమె కొడుకు ........'

దేవయాని పకపక నవ్వుతూ అంది, - 'ఈమె తన జీవితకాలం నాదగ్గరే దాసీగా ఉంటుంది. ఈమెను ఎవరు వివాహం చేసుకుంటారు? మరి ఈమెను కొడుకు ఎలా పుడతాడు?'

తన జ్ఞానాన్ని పరిహసిస్తుందని కాబోలు పండితుడు కుపితుడై దేవయాని వైపు తిరిగి అన్నాడు - 'మహారాణిగారూ! క్షమించండి. ఈవిద్య నాకు బాగా తెలుసు, మిగిలిన వాటితో నాకేం పని? ఈ చేతిలో నేను ఏం చూశానో అదే చెపుతున్నాను. ఈమెను ఎవరు వివాహం చేసుకుంటారో నేను ఎలా చెప్పగలను? కాని ఈమె కుమారుడు సింహాసనం పై కూర్చుంటాడు .........'

దేవయాని గంభీరంగా చెప్పింది - 'సింహాసనమా సింహంతోలా! పులి చర్మంపై కూర్చోవచ్చుకదా? అలాగే. ఈమె చేతిని జాగ్రత్తగా చూడండి'.

ఆమె వ్యంగ్యంతో నా మనసు మండిపోయింది. నేను ఆ జ్యోతిష్యుని చేతిలో నుండి నా చేయి తీసుకుని గది నుండి బయటకు వచ్చాను. అప్పటికే నాకళ్ళ నుండి కన్నీరు ప్రవహిస్తున్నది.

ఆ రాత్రి నా తలగడ కన్నీటితో తడిసిపోయింది. అయినా నా కన్నీరు ఆగలేదు. భర్తను గురించి, కుమారుని గురించి కలలుగనని స్త్రీ ఎవరుంటారీ లోకంలో? ఇరవై సంవత్సరాలున్న ఏ ఆడపిల్ల ఆ తీయని కలల్లో తేలిపోదు? ఎపుడో ఒకప్పుడు ఆ కలలు జీవితంలో నిజమౌతాయి. ఏ ఆడపిల్ల ఆ ఊహాలలో రాత్రులు తన పడకపై తేలిపోకుండా వుంటుంది?

నేను కూడా అటువంటి ఆడపిల్లనే. కాని ఈ కలలన్నీ నా చేతితో తొలగించుకుని హస్తినాపురం వచ్చాను. దేవయానికి దాసీనయ్యాను. ఆమె దాసీగా జీవితమంతా ఉంటానని అంగీకరించాను. ఆమెకు నాపై పూర్తిగా అధికారముంది. బహుశా ఆమె ఎవరితోనూ నా వివాహం జరగనివ్వక పోవచ్చును. పెళ్ళికానప్పుడు కుమారుణ్ణి ఆశించడం ......... సింహాసనం పై కూర్చునే కుమారుడు ........ అలా ఈ దాసి ఎందుకు కోరుకోవాలి? నా ఆశలు, ఆశయాలు వదులుకునే వచ్చాను. కాని నేడు ఆ జ్యోతిష్యుడు! ...........

చేతి రేఖలు చూసి మానవ జీవితం తెలుసుకోవడం వాస్తవమేనా? అది నిజమౌతుందా? అయితే అవుతుంది. అతను చెప్పిన దానికి భవిష్యత్ అర్థమేమిటి? భగవంతుడు, నా నుదుట ఏమి రాసాడు?

ఆ జ్యోతిష్య పండితుడు పిచ్చివాడు కాదు కదా? లేక దేవయాని చేతిని చూసి ఆమె భవిష్యత్తును నా భవిష్యత్తుగా చెప్పలేదు కదా?

ఏదైనా కావచ్చు. అది విని నల్లని రాళ్ళ సమాధి నుండి కోమలమైన ఎర్రని మొలక లేచినట్లు నా మనసుకు అనిపించింది. తల్లిదండ్రుల నుండి వీడ్కోలు పొందినపుడు కూడా దుఃఖించని శర్మిష్ఠ హస్తినాపుర రాజభవనంలో భయంకరమైన ఏకాంతంలో వెక్కివెక్కి ఏడుస్తున్నది.

నాన్నగారు గుర్తుకు రాగానే నా మనసు మేల్కొన్నది. ఆయన నుండి వీడ్కోలు పొందిన క్షణాలు మనసులో తాజాగా మెదిలాయి.

నేను చిన్నప్పటి నుండి పెరిగిన రాజభవనం నుండి, అదే ఆఖరి క్షణంగా భావించి, ఎవరో రాజుకు రాణిగా కాక, రాణికి దాసిగా బయటకు వచ్చాను. అమ్మ దుఃఖాన్ని ఆపుకోలేకపోయింది. ఆమె నా నమస్కారాన్ని సరిగ్గా స్వీకరించ లేదు. ఆమె నన్ను ఒక్కసారి గుండెలకు హత్తుకొని, వెంటనే ముఖం పక్కకు తిప్పి పిచ్చిదానిలా అక్కడనుండి పారిపోయింది. నాన్నగారు మేరుపర్వతంలా గంభీరంగా నిలబడి ఉన్నారు. కనురెప్పలు వాల్చకుండా ఆయన దగ్గరకు వెళ్ళాను. వంగి కాళ్ళకు నమస్కరించి చెప్పాను - 'సెలవు ఇవ్వండి నాన్నగారూ' ఆయన ఆశీస్సులు పొందడానికి కొంతసేపు వంగి ఉన్నాను. కాని ఆయన ఏమీ చెప్ప

కుండా నా చేతిని పట్టుకుని పైకి లేవనెత్తారు. ఆయన ఏమి చేస్తున్నారో నేను తెలుసుకునే లోపు ఆయన తన తలను నాకాళ్ళకు తాకించారు.

నేను కంగారు పడ్డాను. వెంటనే వెనుక్కి జరిగాను, ఏదో విధంగా ఆయనను నిలబెట్టాను. లేస్తూ ఆయన అన్నారు - 'అమ్మా, నీ నమస్కారం స్వీకరించి ఏ నర కాన్ని పొందను? నీవు నా కుమార్తెవుకాదు, తల్లివి. తల్లీ! నీ ఈ అభాగ్యులైన బిడ్డ లను నువ్వు ఆశీర్వదించు'.

నేను గద్గద స్వరంతో అన్నాను - 'నాన్నగారూ! నేను మీ కొడుకునైతే నన్ను యుద్ధానికి పంపేటపుడు మీరు ఏం ఆలోచించేవారు?'

'నిన్ను చూసి గర్వపడేవాణ్ణి'.

'ఇప్పుడూ అదేవిధంగా గర్వించండి. మీ శమా, అత్యంత కష్టతరమైన జీవన యుద్ధాన్ని గెలవడానికి వెళుతున్నది. ధైర్యం కోల్పోయి ఆమె యుద్ధరంగం నుండి పారిపోదు. మీ వంశానికి కళంకం కలిగే పని ఏమీ చేయదు. నాన్నగారూ, శమా యుద్ధానికి వెళ్తూ ఉంది, ఆమెను ఆశీర్వదించండి'.

అది గుర్తురాగానే, మనసులో పోయిన శాంతి తిరిగి వచ్చింది. కళ్ళనుండి కన్నీరు రావడం ఆగిపోయింది.

నాతో వచ్చిన దాసీలు నన్ను రాజకన్యగానే భావిస్తున్నారు. రాజభవనంలోని దాసీలు కూడా అదే ఉద్దేశ్యంతో ఉన్నారు. అందువల్ల వారిలో ఎవ్వరూ నాతో కలిసి మెలిసి ఉండరు. దేవయానికి పనిలేకపోతే నేను ఖాళీగా ఉంటాను. తిరిగి ప్రతిక్షణం నన్ను బాధిస్తుంటుంది. ఖాళీసమయం నా గాయాలను కెలుకుతూ వుంటుంది. వాటిని నేను గాయాలు కావని సరిపుచ్చుకుంటాను. చిత్రకళ అంటే నాకు మొదటి నుండి యిష్టం. ఇప్పుడూ సమయం దొరికితే బొమ్మలు గీస్తూ ఉంటాను.

ఏదైనా, ఒక అలవాటు ఉంటే, అది దుఃఖానికి మందులాంటిది. నా చిత్రాలు ఎంత బాగుంటాయో నాకు మాత్రం తెలియదు. కానీ వాటిని చిత్రిస్తున్నపుడు నా మనస్సుకు ఎంతో ఆనందం కలిగేది. నేను చాలా కుందేలు పిల్లల బొమ్మలు వేసాను. గురువింద లాంటి ఎర్రని కళ్ళను మిటకరించి చూసేవి. మృదువైన

చెవులను నిలబట్టి ధ్వని వినేవి, మనిషిని చూచి భయపడి పారిపోయేవి, ........ మెత్తటి గడ్డిని తింటూ ఉండేవి. తమ తోటివారితో పోట్లాడేవి, ఇటూ అటూ గెంతుతూ ఉండేవి. వాటి ప్రతి రూపం చాలా ఆకర్షణీయంగా ఉంది, మనసును ఆకట్టుకుంటుండేవి. నేను కుంచెతో వాటిని సజీవంగా ఉండేలా చేసేందుకు ప్రయత్నిస్తూ ఉండేదాన్ని.

కుందేలు పిల్లలేమిటి? లేడి, నెమలి, హంస, మొదలైన పశుపక్ష్యాదుల సౌందర్యం కూడా నేను చిత్రించేదాన్ని. ధాన్యం ఏరుకునే పక్షులు, ఎగిరేపక్షులు, గూళ్ళకై గడ్డిపోచలు ముక్కుతో ఏరుతున్న పక్షులు - పక్షులు చిన్న పిల్లలతోనే కాదు, పెద్దవాళ్ళతో కలిసి మిత్రులుగా ఉంటాయి. బొమ్మలు వేస్తూ ఉన్నప్పుడు నేనూ ఈ అనుభవాన్ని పొందాను.

ప్రకృతిలో ఎన్నెన్ని పూలు! ఆ పూలలో ఎన్ని రంగులు, సువాసనలు! రకరకాల చెట్లు, లతలు, ప్రతి దినం కొత్త సూర్యోదయం, కొత్త సాయంకాలం, వసంత కాలపు వెన్నెల, వర్షాకాలపునది, శరదృతువులోని పచ్చని పొలాలు, శిశిరంలో ఆకులులేని చెట్లు ........ ఎటుచూస్తే అటు బొమ్మలు వేయడానికి ఎన్నో ఆధారాలు ఉన్నాయి.

ఈ నూతన అనుభవంతో జీవితం గురించి ఆలోచిస్తూ ఉంటే దాని రహస్యాలు తెలుస్తున్నాయి. వైవిధ్యమే ఈ జీవితానికి శరీరం, పరస్పర విరుద్ధ భావాలే దీని ఆత్మ. జీవిత సారం, ఆనందం, ఆకర్షణ, ఆత్మ ........ ఈ వైవిధ్యంలో, ఈ వైరుధ్యంలో వున్నాయి.

ఈ కొత్త ఆలోచనలతో నా మనసుకు శాంతి లభించసాగింది. దేవయాని చాలా సార్లు నాపై పెత్తనం చెలాయించేది, కాని ఇప్పుడు ఆమె మాటలు మునుకుటిలా నా మనసును బాధించడంలేదు.

మహారాజు యయాతితో నా సంబంధం వృత్తిరీత్యా ఉండేది. దేవయాని మొదటి రోజునుండే యయాతితో నాకు సంబంధం లేకుండా చేసింది. నేను ఎప్పుడైనా గదిలోకి వస్తూ పోతూ ఉండడం, మహారాజు చూస్తూ ఉండేవారు. నిజంగా ఆయన కళ్ళల్లో నా పట్ల సానుభూతి ఉందని చెప్పలేను కాని బలహీనమైన నా మనసుకు అలా అనిపించి వుండవచ్చు. దప్పికగొన్న వాడికి అతను మృగతృష్ణలాంటివాడు. కాని అతను నావైపు చూస్తూ ఉండడమే నాకు మంచిదనిపించింది.

శర్మిష్ఠకు దాసిగా ఏపనీ ఆయన చెప్పకపోవడం ఎవరి దృష్టికైనా వస్తే? దేవయాని ఆయన దగ్గర లేనప్పుడు ఏదైనా వస్తువు నేను ఆయనకు ఇస్తే, ఆయన మెల్లగా చెప్పేవారు, 'అరే, నీవెందుకు కష్టపడ్తున్నావు? ఏదాసితో చెప్పినా .....'

నేను నవ్వుతూ జవాబు చెప్పేదాన్ని - 'నేను కూడా దాసీనే'.

ఆయన నవ్వుతూ అనేవారు, 'నీవు దేవయానికి దాసివి, నాకు కాదు'.

ఆయన స్వభావం లోని ఈ తీయదనమే రాజమాతలా నాకు పెద్దతోడు. మహారాజు పనులన్నీ నేనే స్వయంగా చేయాలనీ, ఆయన ఎప్పుడూ సుఖంగా సంతోషంగా ఉండే వాతావరణాన్ని సృష్టించాలనీ ఆలోచన మనసులో వచ్చేది, నేను మనసు విప్పి ఆయనతో ఎప్పుడూ మాట్లాడలేదు. దేవయాని స్వభావం నాకు బాగా తెలుసు. వేలు చూపిస్తే చెయ్యి మింగేరకం.

నావైపు నుండి ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నా ఒకరోజు ఆ మాటపడవలసే వచ్చింది. మహారాజుకు తాంబూలమంటే చాలా యిష్టం. దేవయాని దానిని తయారు చేసి ఆయనకు ఇచ్చేది. ఒకరోజు ఆమె ఎప్పటిలా ఆయన తాంబూలం తయారు చేసి ఇచ్చింది. బహుశా ఆయన ఆ తాంబూలంతో తృప్తిపడలేదు. ఆమెతో అన్నారు - 'నా నోరు తాంబూలం వేసుకున్నట్లుందా?'.

దేవయాని పరువుపై పడుకొని ఉంది. నేను ఆమెకు గాలి విసురుతున్నాను. మహారాజుకు తాంబూలం తయారుచేసి ఇవ్వమని ఆమె నన్ను ఆదేశించింది. నేను తాంబూలం తయారుచేసి ఇచ్చాను. మహారాజుకు అది బాగా నచ్చింది. అది తిన్న తరువాత అద్దం ముందుకు వెళ్ళి నిలబడి దేవయానిని పిలిచారు. ఆమెకు లేవాలని లేదు. కాని మహారాజు అలా పిలుస్తూనే ఉన్నారు. చివరకు కోపగించుకొని ఆమె ఆయనదగ్గరుకు వెళ్ళి అడిగింది.

'చెప్పండి, మీకేం కావాలో!'

'నానోరు చూడు!'

'ఇదేమి తమాషా! ఈ పిల్లచేష్టలు నాకు సరిపడవు'.

'ఇది తమాషాకాదు. బయటనుండి నోరు చూడమని ఇప్పుడు చెప్పవలసిన

పని ఏముంది? ఆరోజు నీవు నూతి నుండి బయటకు వచ్చినప్పుడే చూసాను. నోటి లోపల చూడమని చెపుతున్నాను'.

ఆయన పూర్తిగా చిన్నపిల్లవాడిలా తన నోటిని దేవయాని ఎదుట తెరిచి చూపించారు. నోరంతా ఎర్రగా పండింది.

మహారాజు దేవయానితో చెప్పారు - 'నా చిన్నప్పుడు తాంబూలం గురించి చాలా బాలికలలో ఒక నానుడి ఉండేది. నీకు తెలుసా?'

'నా తండ్రి మహా తపోధనుడు. ఆయన ఎప్పుడు కావాలంటే అప్పుడు తాంబూలం వేసుకోనేవారుకాదు. కాబట్టి నాకు ఎలా తెలుస్తుంది'.

'తాంబూలం తయారుచేసిన వారి ప్రేమ ఎంత ఎక్కువుగా ఉంటే, తినేవారి నోరు అంత ఎర్రగా పండుతుందని వాడుక ......'

'మంచిది, అదా సంగతి? అంటే నాకన్నా శర్మిష్ఠ మిమ్మల్ని ఎక్కువగా ప్రేమిస్తుందనా? అంతేనా? ఉన్నది ఉన్నట్లుగా చెప్పవచ్చుకదా? దానికోసం చిన్నప్పటి నానుడి అడ్డంగా పెట్టుకోవడం ఎందుకు? ఆమె మిమ్మల్ని అంత ప్రేమిస్తే ఆమెనే పెళ్ళి చేసుకోవచ్చు కదా? మీ అమ్మగారికి కూడ ఆమె అంటేనే ఇష్టం. ఆమె రాజకన్య కదా!'

మహారాజు దేవయానితో అలా తమాషాగా మాట్లాడకుండా వుండవలసింది. ఆమె దానిని గోరంతలు కొండంతలుగా చేయకుండా వుండవలసింది. ఆమె ఆరోజు రాజభవనాన్ని అతలాకుతలం చేసింది. దాసదాసీలందరికీ ఆ విషయం తెలిసి పోయింది. సిగ్గుతో నేను తలదించుకున్నాను.

ఆ తరువాత నేను ఎప్పుడూ మహారాజుకు తాంబూలం తయారుచేసి ఇవ్వ లేదు. కాని దేవయాని చుట్టుప్రక్కల లేనప్పుడు ఆయన అడుగుతూ ఉండేవారు - 'తాంబూలం దొరుకుతుందా?'

కట్టి ఉంచని తాంబూలం నాదగ్గర ఎక్కడ ఉంటుంది? నిస్సహాయురాలిలా 'లేదు' అని చెప్పవలసి వచ్చేది. పది, పదిహేనుసార్లు నేను 'లేదు' అని చెప్పాను. నాకే లేదని చెప్పడానికి సిగ్గేసింది. నేను మంచి తాంబూలం తయారు

చేసి ఎప్పుడూ ఉంచుకునే దాన్ని. మహారాజు ఏకాంతంగా చూసి నేను దొంగ తనంగా అది ఆయనకు ఇచ్చేదాన్ని. తిరిగి మహారాజు ఏదో సమయంలో దేవ యానిని సంబోధిస్తూ అన్యాపదేశంగా నన్ను ఉద్దేశించి చెప్పేవారు - 'నీవు నిన్న ఇచ్చిన తాంబూలం చాలా బాగుంది'.

జ్ఞాపకాలు ఎలా ఉంటాయి? స్వేచ్ఛగా ఎగిరే సీతాకోక చిలుకల్లాగా? దొంగాట ఆడే ఆడపిల్ల లాగా? మెల్లమెల్లగా కలిసిపోయి చిత్రం అందాన్ని పెంచే రంగుల్లాగ? వర్షాకాలంలో ఆకాశంలో మెరిసే మెరుపులాగ? ఏమో!.

మొట్టమొదట చెప్పవలసిన ఆ జ్ఞాపకం ఇప్పటికీ నా మనసులో పదిలంగా వుంది.

హస్తినాపురం వివాహమహోత్సవం వైభవంగా జరిగింది. మహారాజు యయాతి, దేవయానిపై వెన్నెల వర్షించే శోభనపురాత్రి. ఉత్సవంలో నేను ప్రశాంతంగా నిగ్ర హంగా ఉన్నాను. దేవయాని సుఖం నాకు దుఃఖం కలిగించరాదనీ, కలలోకూడ ఆమెతో పోల్చుకోరాదనీ, ఆమె ఐశ్వర్యాన్ని మనసులో కూడా ద్వేషించ రాదనీ, నన్ను నేను సమాధాన పరచుకుంటూ ఆ కఠిన పరీక్షకు తట్టుకున్నాను. ఏ అదృష్టం దేవయానిని అందలం ఎక్కించిందో అదే నన్ను అందలంనుండి కింద పడేసింది. అదృష్టాన్ని ఎదిరించి ప్రపంచంలో ఎవరూ నిలబడలేరు. మరి శర్మిష్ఠ దాని ముందు తలవంచక ఏమి చేస్తుంది?

నిజంగా మనిషికి అదృష్టం శత్రువుకాదు, స్వయంగా మనిషే. నా ఈ శాంతం, నిగ్రహం చూచి దేవయాని పిచ్చిదైంది. ఈ ఆనందోత్సవం చూసి నేను దుఃఖిం చాలనీ, ఆమె సంపద చూసి ఈర్ష్యతో నిట్టూర్చాలనీ, ఆమె సుఖం చూసి అశాంతిని పొందాలనీ బహుశా ఆమె అనుకొని ఉంటుంది. కాని ఆ ఆనందాన్ని ఆ రాత్రి ఆమె మహారాజు దగ్గరుకు వెళ్ళేంత వరకు ఆమెకు కలగనివ్వలేదు. నేను పెద్ద విజయం పొందానని అనిపించింది. వెళ్తూ నన్ను ఆజ్ఞాపించింది.
'శర్మిష్ఠా మహారాజుకు నీవు తయారు చేసిన తాంబూలమంటే ఇష్టం. అటువంటి ఇరవై తాంబూలాలు చేసి బంగారు పళ్లెంలో ఉంచి మా భవనం తలుపు బయట నిలబడు. నేను పిలవగానే తలుపు దగ్గరకురా. తలుపుకు దూరంగా నిలబడు. పెద్దవారి మాటలు దొంగతనంగా విని వాటిని ప్రచారం చేయడం దాసీల చెడ్డఅల

వాటు. అందుకే హెచ్చరిస్తున్నాను. మహారాజు నేనూ రాత్రి చాలా ఆలస్యంగా - బహుశా అర్ధరాత్రి వరకూ మాట్లాడుకుంటూ ఉండవచ్చు. ఆయనకు మధ్య మధ్యలో తాంబూలం తప్పక ఇవ్వవలసి ఉంటుంది. మహారాజు నిద్రపోయిన తర్వాత నేను నీకు వెళ్ళేందుకు అనుమతిస్తాను. నీవు తప్ప మరే దాసి ఈరోజు మా గది దగ్గర ఉండవద్దు.

తాంబూలాలు గదిలోపలే ఉంచుకోవడానికి దేవయానికి ఇబ్బందేమిటి? కాని.......

దేవయాని మహారాజు శయన మందిరంలోకి వెళ్ళింది. నేను త్వరగా తాంబూలం కట్టి శయనమందిరం తలుపుకు దూరంగా నిలబడి ఉన్నాను. కొంచెం సేపు తరువాత మహారాజు వచ్చారు. వెంటనే తాంబూలం తీసి నేను ఆయన ముందు ఉంచాను. ఆయన అది తీసుకోలేదు. బహుశా ఆయన నన్ను చూడలేదనుకుంటాను. ఎవరో దాసి నిలబడి ఉందని ఆయన అనుకొని ఉంటారు. అది సహజం తిలోత్తమ సైతం ఈర్ష్య చెందేంత సౌందర్యరాశి ఆ భవనంలో ఆయనకై ఎదురు చూస్తూ ఉన్నది. ఈ సమయంలో ఆమె తప్ప, ఆయనకు మరెవరూ, ఏదీ కానరాకపోవడం మంచిది.

మందిర ద్వారం మూసుకుపోయింది. నేను దూరంగా వెళ్ళి నిలబడ్డాను. ఆ రోజు నేను తప్ప ఏదాసీ అక్కడ తిరగరాదని దేవయాని స్వయంగా ఏర్పాట్లు చేసింది. ఫలితంగా నేను తాంబూలాలు పట్టుకుని ఒక్కదాన్నీ భూతంలా పలుచున్నాను. మనో నిగ్రహం సడలింది. మనస్సు కళ్ళెంతెగిన గుర్రంలా పరిగెత్తసాగింది. ఆ రోజు నేను దేవయానితో పోట్లాడి ఉండకపోతే ఈరోజు ఈ సిగ్గుమాలిన స్థితి రాకపోను అని ఆలోచించి దుఃఖించాను. కాని నాకు పశ్చాత్తాపం కలగలేదు.

మనసులో ప్రేమ గురించి కూతూహలం కలిగింది. అనుకోకుండా నాలో ప్రణయపు అసంతృప్తి కలిగింది.

ఒక్కొక్క క్షణం యుగంలా గడవసాగింది. నేను అక్కడే నిలబడివున్నాను. ఉధృతమైన వరద వెల్లువలో కూడా నిలబడటానికి ప్రయత్నించే చిన్న బలహీన మైన చెట్టులా -

అప్పుడే కోపంతో కూడిన మాటలు అస్పష్టంగా వినిపించాయి. ఆ గొంతు దేవయానిది.

తీయని కలయిక, మొదటిరాత్రి అనురాగ సామ్రాజ్య మేలుతుంది అనుకున్న సమయంలో కోపంతో కూడిన ఈ అరుపులేమిటి?

పాపం మహారాజు అమాయకుడు. ఆయన మాట ఒక్కటీ సరిగ్గా వినిపించటంలేదు. వినాలనే జిజ్ఞాస కలిగింది. నేను ముందుకు వెళ్ళాను. అక్కడ నన్ను చూసేవారు ఎవ్వరూ లేరు. కాని నేను చాలా కష్టంగా వెనకకు తగ్గాను.

ప్రేమికుల కలయికలో ఆనంద తన్మయత్వం ఉంటుందని కావ్యాలలో నేను చదివాను. వెలితికూండా శబ్దం చేస్తుంది. నిండుకుండ తొణకదు. ప్రేమికుల హృదయం అలాగే ఉంటుంది. ప్రేమ నిండిన మనసులకు మాటలతో పనిలేదు. ....... .........

కాని గది లోపలనుండి కోపంతో కూడిన మాటలు వినిపిస్తున్నాయి. ఎక్కువగా దేవయానే మాటలాడుతూ ఉన్నది. ఆమెతో పోల్చితే మహారాజు గొంతు మృదువుగా ఉంది.

అప్పుడే భళ్ళున తలుపు తీసుకుని దేవయాని బయటకు వచ్చింది. కాళ్ళతో నేలను తన్నుతూ త్వరత్వరగా తన భవనం వైపు వెళ్ళ సాగింది. నేను తాంబూలాలు ఆమె ఎదుట ఉంచాను. ఆమె నావైపు కోపంగా చూసింది. నాచేతిలోని తాంబూలాల పళ్ళెం త్రోసివేసి, క్రింద పడ్డవాటిని కాళ్ళతో తొక్కుతూ వెళ్ళిపోయింది.

## యయాతి

తొలిరాత్రి ఏకాంత సమాగమం. అంతమధురమూ, కావ్యమయమూ, ఉన్మాదకరమూ, రహస్యపూర్ణమూ అయిన రాత్రి భార్యాభర్తల జీవితాలలో అంతకు ముందెన్నడూ అనుభవానికి వచ్చివుండదు. రెండు నదుల కౌగిలింతా! భూమ్యాకాశాల చుంబనమా! కాదు. సంగమోత్సాహితమైన హృదయాలను వర్ణించటం మహాకవులకు కూడా అసాధ్యమే.

సాయంత్రమయ్యింది. దీపోత్సవాన్ని చూడటానికి నగర ప్రజలు గుంపులు గుంపులుగా రాజమార్గంలో నడుస్తున్నారు. రాజభవనంపై నిలబడి నేనీదృశ్యాన్ని చూస్తున్నాను.

తలెత్తి ఆకాశంవైపు చూసాను. ఒక్కొక్క నక్షత్రం మెల్లమెల్లగా ఆకాశాన్ని వెలుగులతో నింపుతున్నది.

చాలాసేపటి నుండి నేనక్కడే నిలబడి నట్లనిపించింది. ఇంకా చీకటి పూర్తిగా వ్యాపించలేదు.

దేవయాని నాకెంత దగ్గరగా ఉంది! కాని ఎంత దగ్గరగా వుందో, అంతే దూరంగానూ వుంది! ఆనాడు నూతిలోనుండి తడిసిపైకి వచ్చిన రూపం నుండి ఈరోజు ఉదయం యజ్ఞసమయంలో సకల ఆభరణాలతో, అలంకారాలతో నా పక్కన సిగ్గుతో కూర్చున్న రూపంవరకూ, ఎన్ని చిత్రాలు, ఎన్నిరూపాలు నా మనస్సులో పరిభ్రమిస్తున్నాయో! ఆ రూపాల అందాలన్నిటినీ మనస్ఫూర్తిగా ఎన్ని సార్లు వీక్షించినప్పటికీ, నా కన్నుల దాహార్తి తీరినట్లులేదు. ఈ రూపాలన్నిటికన్నా విలక్షణ మైన దేవయాని నాకు కావాలి.

ఒక్కొక్క క్షణం నాకో యుగంలాగా గడవసాగింది. ఇంకొ ఝాము గడపాలి. అదికూడ ఇంత ఉద్వేగంతో. నేను మాధవుణ్ణి పిలిపించాను. ఇద్దరం నగరంలో తిరగటానికి రథంపై బయలుదేరాం. రాజమార్గంలో ఎందరో చిన్న, పెద్ద స్త్రీలు నడుస్తున్నారు. కొందరు యువతులు, కొందరు ముగ్ధలు, కొందరు నగరస్త్రీలు, కొందరు అంతఃపుర పరిచారికలు. వారిలో ఎక్కువ మందిని చూస్తుంటే విధాత తన కుంచెను ఎంతో కళాత్మకంగా, స్వేచ్ఛగా నడిపాడనిపిస్తుంది. అయితే ఏ ఒక్కరి సౌందర్యమూ నా మనస్సు నాకర్షించలేదు. నామనస్సంతా దేవయాని సుందర రూపంతో నిండిపోతే, అందులో ఇంకెవరికి స్థానముంటుంది?

మాధవుని సాంగత్యంలో కొద్దిసేపు ఆనందంగా గడిపి నేను రాజప్రాసాదానికి తిరిగివచ్చాను. ఫలాహారం తీసుకుందామని కూర్చున్నాను. కాని అది సయించ లేదు. మనస్సంతా దేవయాని ఆలోచనలతో నిండిపోయింది. ఆమె కోమల సౌందర్యం పదే పదే నా మనస్సును చుట్టేస్తున్నది.

నేను నా భవనానికి వెళ్ళాను. తలుపులు మూసాను. తలతిప్పిచూసాను. మంచంమీద కూర్చున్న దేవయాని నెమ్మదిగా లేచి ఎంతో ఆదరంతో, గౌరవంతో నావైపు చూచింది. ఆమె అణుఅణువూ సిగ్గుతో నిండిన రంభలాగా వెలిగి

పోతున్నది. నేనధీరుణ్ణయి వెళ్ళి మంచంమీద కూర్చున్నాను. ఆమె నిలబడి ఉంది.

'నూతిలో నుండి బయటకు రావటానికి ఎవరి చేయ్యైనా ఆసరాగా పట్టు కోవాలి. మంచంమీద కూర్చోపెట్టడానికి ఆసరా అవసరం లేదనుకుంటాను' - నవ్వుతూ అన్నాను.

ఆమె నవ్వుతూ, సరదాగ సమాధానమిస్తుందనుకున్నాను. కాని ఆమె అలాగే స్థబ్ధంగా నిలబడేవుంది. పైగా ఆమెనుదురు చిట్లించినట్లనిపించింది. ఆమె నిజంగా కోపంగా వుందో, కోపం తెచ్చి పెట్టుకుందో అర్థంకావటంలేదు.

ఆమెను ప్రసన్నంచేసుకునే ఉద్దేశంతో అన్నాను -

- 'మా నాన్నగారొకసారి ఇంద్రుని పరాభవించారు. నేనిప్పుడు ఇంద్రుని పరా భవించటానికి వెళుతున్నాను'.

ఆమె ఒక్క వుదుటున ముందుకువచ్చి, 'ఈవేళలో కూడా యుద్ధం విషయానా?' అంటూ 'నేనప్పుడూ మీ సారథిగా వస్తానని' అంటుందని అను కున్నాను.

కాని ఆమె ఏమాత్రం చెక్కు చెదరకుండా అలాగే నిలబడి ఉంది. ఆమె చూపులు ఏ భావం లేకుండా శూన్యంగా వున్నాయి. ఆమెకు అమ్మకు ఏమాత్రం సరిపడదని నాకు తెలుసు. అత్తాకోడళ్ళ మధ్య ఏమాత్రం జోక్యంచేసుకోకూడదని నేను మొదటిరోజే నిర్ణయించుకున్నాను. బహుశా అమ్మతో ఏదైనా భేదాభిప్రాయం వచ్చి ఈమె ఇప్పుడు కూడా అలిగివుందెమో!.

'దేవయానీ! నేను నీ సాయంతోనే స్వర్గాన్ని జయించుదామనుకుంటున్నాను. అ స్వర్గంలో నీవంటి అప్సరసలుంటారా ...... ......' అని అందామని అను కుంటుండగానే ఆమె నాకు మాట్లాడే అవకాశం ఇవ్వలేదు.

అలకలో ఆడవాళ్ళు మరింత అందంగా వుంటారు. ఆమెను చూస్తూ నన్ను నేను మరచిపోయి, కొంచెం వంగి ఆమెను నావైపులాగాను. రెండు చేతులతో ఆమె ముఖాన్ని పైకెత్తాను. ఆమెను ముద్దాడుదామని కొంచెం వంగాను.

ఆమె నా చేతిని విదిలించుకుని పడగెత్తిన నాగినిలా ఒక్కసారి నాకు దూరంగా జరిగింది. ఆమె విచిత్ర ప్రవర్తన నాకర్థంకాలేదు. శర్మిష్ఠను దాసిగా తీసుకు వచ్చేటపుడు దేవయాని ప్రదర్శించిన కోపం. పట్టుదల నాకూ బాగా తెలిసినవే. పైగా నేనదంతా స్వయంగా చూసినవాణ్ణే. కాని, నాతో, భర్తతో - ఆమె ఈవిధంగా ప్రవర్తిస్తుందని ఊహించలేకపోయాను.

నన్ను నేనదుపుచేసుకుంటూ అడిగాను - 'దేవయానీ - నిన్నెవరేమైనా అన్నారా!'

'నన్నెవరూ ఏమీ అనలేదు!'

'నిన్నెవరయినా అవమానించారా?'

'అవును. అవమానించారు'

'ఎవరు?'

'మీరే'

'నేనా?'

'అవును. తమరే!'

'ఎప్పుడు?'

'ఇప్పుడే'

'నా కేమీ అర్థం కావటంలేదు'

'ఇందులో అర్థమేముంది? అంతా అనర్థమే. ఈరోజు - ఇక్కడ - ఈ శుభ వేళ - నా జీవితంలో అత్యంత ఆనందమయమయిన వేళలో - మీరు మధువు సేవించి వచ్చి - మీనోటి నుండి వచ్చే ఆ మదిరవాసన .........'

'మద్యమా? నేను మద్యం సేవించివచ్చానా? లేదే! మాధవుని వెంట అత నింటికి వెళ్ళాను. ఎవరో అతనికి చక్కటి మాద్యపానీయం కానుకగా పంపారు. నా గౌరవార్థం మాధవుడు దానిని నా ముందుంచాడు. చాలా అద్భుతమైన పానీయ మది. ఏదో సరదాగా కొంచెం సేవించాను'.

'దేవయానీ! నేను మద్యం సేవించలేదు! కొంచెం మాధ్య పానీయం ..........!'

'అన్ని రకాల మదిరాల పేర్లు నాకు కంఠస్థమే. మీరు వాటిని లెక్కించే ప్రయత్నం మానండి. ఈ మదిరల సంగతి మా రాక్షస రాజ్యంలో మాకు బాగా తెలుసు. ఈ మదిర కారణంగానే మానాన్నగారు సంజీవినీని కోల్పోయారు. అప్పటి నుండే ఆయన మద్యపానాన్ని త్యజించారు. బ్రాహ్మణులు మద్యం సేవిస్తే కరిగిన సీసాన్ని వారి గొంతులో పోయాలన్న నియమం పెట్టారాయన'.

నేను కొంచెం ఎగతాళిగా అన్నాను. 'నా అదృష్టం కొద్దీ నేను బ్రాహ్మణ్ణి కాదు'.

ఇటువంటి ఆనంద సమయంలో దేవయాని చేస్తున్న రసాభాస నాకు కోపం తెప్పించింది.

'మీరు బ్రాహ్మణులు కాకపోవచ్చు. నేను బ్రాహ్మణ స్త్రీనే. నేను నా తండ్రి కుమార్తెనే. తపస్వి శుక్రాచార్యుని కన్యనే. దూరం నుండి కూడా మదిర వాసన నేను భరించలేను' ఆమె సమాధానమిచ్చింది.

'నీ తండ్రికి కుమార్తెలాగానే, నాకు భార్యవు కూడా! నేను క్షత్రియుణ్ణి. క్షత్రియులకు మద్యం వర్జితంకాదు'.

'కాని మానాన్నగారు మద్యాన్ని త్యజించారు. అతనైతే మద్యానికి పూర్తి విరోధి'.

'అతను! అతనెవరు?' అసలే నేను కోపంలో వున్నాను. పైగా అనుమాన పిశాచం నా తలెకెక్కింది. నేను బిగ్గరగా అడిగాను - 'అతనెవరు?'

దేవయాని నిశ్చేష్టురాలయ్యింది. అప్పటివరకు ఆమెది పైచేయిగావుంది. తన ఇష్టం వచ్చినట్లు నన్ను తూలనాడింది. బదులు తీర్చుకోవటానికి మంచి అవకాశం దొరికిందని భావించిన నేను మండిపడుతూ అడిగాను - 'మాట్లాడవేం?' అత నెవరు? ఇప్పుడు నీ నోరెందుకు మూగపోయింది?'

పెదవికొరుకుతూ దేవయాని పలికింది - 'అతని పేరు చెప్పటానికి నేనెవరికీ భయపడను. కచునికి మద్యం ఇష్టం ఉండేదికాదు'.

సూక్ష్మాతి సూక్ష్మమైన అసూయాభావం నా హృదయంలో మెదిలింది. దృఢంగా అన్నాను - 'ఇది హస్తినాపురం రాజ ప్రాసాదం. ఇది శుక్రాచార్యుని ఆశ్రమమూకాదు, కచునిపర్ణకుటీరమూకాదు. అర్థమయ్యిందా? మదిర ఇష్టంలేనివారు, దానిని తీసుకోవనవసరమూ లేదు, దానిని ముట్టుకోవలసిన పనిలేదు. కాని ఎవరివో ఇష్టా ఇష్టాలు నాముందెందుకు రుద్దాలి? నేనెవరికయినా సేవకుణ్ణా? నేను రాజును. హస్తినాపురాధీశుడనయిన యయాతిని నేనే. ఇక్కడ కచునికేమీ పనిలేదు. శుక్రా చార్యునికి కూడా ఇక్కడ విషయాలలో జోక్యం చేసుకునే అధికారంలేదు. నువ్వు నాధర్మ పత్నివి. నా సుఖాన్ని, ఆనందాన్ని చూడ వలసిన బాధ్యత నీది.......'

'మీరు మీ ఇష్టం వచ్చినట్లు మీ ఆనందాన్ని గురించి ఆలోచించుకుంటూ కూర్చోండి', అంటూ దేవయాని కన్నుల్లో నిప్పులు రాలుస్తూ నావంక చూచి, దెయ్యం పట్టిన దానివలె వేగంగా తలుపు తెరుచుకుని వెళ్ళిపోయింది.

నేను శయ్యమీద కూలబడ్డాను. తండ్రిగారికి ఇవ్వబడిన ఆ భయంకరమైన శాపం, పుట్టలోనుండి కోపంతో ఫూత్కారాలు చేసుకుంటూ బయటకు వచ్చిన పాము లాగా నా స్మృతిపటలం నుండి బయటకు వచ్చింది - 'నహుషుని కుమారులు ఎప్పుడూ సుఖపడరు'.

మా ప్రేమ సాఫల్యానికిది తొలిరేయి. ఆ శాప ప్రభావం ఈ తొలిరేయిలో ఇంత భయంకరంగా ఎదురవుతుందని నేనెన్నాడూ ఊహించలేదు. నా స్థితి, కుండ పోతగా కురుస్తున్న వర్షం నుండి తప్పించుకోవటానికి చెట్టునీడకు వెళ్ళి, ఆ చెట్టు మీద పడిన పిడుగు వెలుగుకు కళ్ళు పోగొట్టుకున్న బాటసారి పరిస్థితిలా వుంది. అతృప్తమైన తనువుతో, సంతప్తమైన మనస్సుతో నేనారాత్రంతా నలిగిపోయాను.

ఎన్ని ఆశలతో, ఆకాంక్షలతో మహలులో అడుగుపెట్టాను. దేవయానంటే నాకెంత ఇష్టం? నేనెంతగా ఆమెను కోరుకున్నాను? కేవలం ఆమె శరీరాన్నే కాదు, ఆమె మనస్సునుకూడా. అందుకే శారీరికంగా, మానసికంగా నాదైన దేవయానే నాకు కావాలి. అలక మరణం అమ్మకు నాకు మధ్య ఆకాశమంత పెద్ద అడ్డుగోడను నిలిపింది. ముకులిక వలన నేను కొద్దిపాటి శారీరిక సుఖం పొందాను. అయితే

అదెంత పాశవికమో అలక సాహచర్యంలో నాకు బాగా అర్థమయ్యింది. అటు వంటి క్షణికమైన, క్షుద్రమైన ఆనందంకంటే, అద్భుతమైనదేదో పొందాలనే వాంఛ అధికం కాసాగింది. కాని ...... ......

అలక మరణించిన వెంటనే నా పట్టాభిషేక మహోత్సవం జరిగింది. అమ్మ నాకు శతకోటి ఆశీస్సులందించింది. రాజోచిత వస్త్రాభరణాలతో, ఆలంకారాలతో, రాజఠీవితో వెలిగిపోతున్న యయాతిని ఆమె నిండుగా, కన్నుల పండుగగా తనివి తీరా చూసుకుంది. కాని అలక తల్లి కలిక మాత్రం కన్నులు వత్తుకుంటూ నిలబడి వుంది. ఆమెకు అలక గుర్తుకు వచ్చిందికాబోలు. ఆమెను చూస్తుంటే నా గుండె తరుక్కు పోయింది. ఒకే ప్రదేశంలో మహత్వకాంక్ష కలిగిన ఒక హంతకి ఆయన తల్లి రాజమాతగా ఐశ్వర్యానందాలలో తేలియాడుతూ వుంటే, నిజాయితీ కలిగిన ఒక అమాయక మాతృమూర్తి తన ఏకైక కూమార్తెకోసం ఒక మూలన నిలబడి కన్నీరు కారుస్తున్నది. ఆమె కూతురు ఎక్కడ మరణించిందో, ఎలా మరణించిందో కూడ పాపమామెకు తెలియనీయలేదు. రాజప్రాసాదం - ఒక రాజప్రాసాదమేమిటి? అధికారం, సంపద కేంద్రీకృతమైన ప్రతిచోటు ఒక భయంకరమైన కొండచిలువ లాంటిదే. అతి భయానకమైన యథార్థాలను కూడా అది మింగివేయగలదు. నాన్నగారి శాపాన్ని, అది యతిరూపంలో నిజమైన తీరును, ఎంతో సహజత్వంతో దాచిపెట్టిన ఈ రాజప్రాసాదానికి ఒక దాసి మరణాన్ని దాచిపెట్టడం కష్టమా? తన కుమార్తె మహమ్మారి సోకి మరణించిందనుకుంటున్న కలికకు అదే యథార్థమని నమ్మించారు. పట్టాభిషేకం రోజున అలక ఇక్కడ వుండవలసిందని ఆమెకెవరో గుర్తు చేసినట్లున్నారు. దానితో ఆమె హృదయపు గాయాలు కెలికినట్లయ్యింది. ఇటు వంటి శుభసమయంలో ఎవ్వరూ కన్నీరు పెట్టకూడదని ఆమెకు తెలిసివప్పటికీ, ఎంత ప్రయత్నంచేసినా ఆమె కన్నీరా పుకోలేక పోయింది.

ఆమె కన్నీరు కార్చటం చూసిన అమ్మ తీవ్రంగా మందలించింది. 'ఇప్పుడే ఇక్కడ నుండి నీ సోదరి ఇంటికిపో. వెళ్ళు. ఇక్కడే వుండి అపశకునపు షనులు చేయొద్దు'.

ఆ మాటలతో నాకు అమ్మమీద విపరీతమైన కోపం వచ్చింది. అలక మరణా నికి తప్పక బదులు తీర్చుకోవాలని, అప్పుడే నిర్ణయించుకున్నాను.

బదులు తీర్చుకోవటానికనే నేను అమ్మతో మాట్లడటం మానివేసాను. వేటలో మద్య సేవనంలో మునిగి నన్ను నేను మరచిపోసాగాను. అమ్మ ఎందరో అందమైన రాజకుమార్తెల చిత్రపటాలు పంపుతూ వుంటే వారికి ఏవో వంకలు పెట్టి తిప్పిపంపసాగాను. ఈవిధంగా పగతీర్చుకోవటంలో నా మనస్సు కొంచెం కుదుట పడి నప్పటికీ నా అంతరాత్మ మాత్రం మునుపటిలాగానే ఏదో ఆకలితో, దప్పికతో కొట్టుకుంటున్నది.

అదే సమయంలో వేటలో పడి హిమాలయ ప్రాంతాలు చేరుకున్నాను. జంతువులను వేటాడుతూ, వాటి వెంటపడి రాక్షస రాజ్యంలో ప్రవేశించటం, దేవయానిని ధర్మపత్నిగా గ్రహించి హస్తినాపురం తిరిగి రావటం జరిగింది.

ఆరోజు ఒక్క ఘడియలోనే, ఘడియ ఏమిటి ఒక క్షణంలోనే నేను దేవయానిని స్వీకరించాను. ఎంత అద్భుతమైన, విలక్షణమైన సంఘటన అది! క్షణంలో ఆ సంఘటన ఎంత రసవత్తరంగా వుంది?

నూతిలో నుండి పైకి వస్తున్న దేవయాని నాకు సాగరమథనంలో నుండి పైకి వచ్చిన లక్ష్మీదేవిలా కనిపించింది.

నేనామె సౌందర్యం చూసే ఆమెను మోహించానా? కాదు! అమ్మ ఒక క్షత్రియ రాజకన్యను కోడలుగా తెచ్చుకోవాలని ప్రయత్నం చేస్తున్నది. ఒక బ్రాహ్మణ ఋషికన్యను కోడలుగా తీసుకువెళితే ఆమె జీవితాంతం వేదన పడుతూనే వుంటుందని నేను భావించాను. అమాయకురాలయిన ఒక ఆడపిల్లను హత్యచేసినందుకు భగవంతుడు ఎటువంటి శిక్ష విధిస్తాడో ఆమెకు తెలిసిరావాలి. అందుకే నేను దేవయానిని స్వీకరించాను. అమ్మ మీద సరి అయిన ప్రతీకారం తీర్చుకుందామనే!.

కేవలం ఈరెండు కారణాలచేతనే నేను దేవయానిని స్వీకరించలేదు. ఆమె శుక్రాచార్యుని కుమార్తె కావటం నాకు మరింత ఆనందాన్ని కలిగించింది. ఒక మహర్షి శాపం నా వంశాన్ని వెంటాడుతున్నది. దాని నుండి బయటపడటానికి మరో మహర్షి ఆశీస్సులు నాకు కావాలి. శుక్రాచార్యుడు సంజీవిని విద్యను పొందిన మహాఋషి. అగస్త్యమహర్షి శాపం తన కుమార్తె కాపురంలో నిప్పులు పోస్తుందని తెలిస్తే శుక్రాచార్యులవారు మిన్నకుంటారా? ఘోరమైన తపస్సు చేసైనా వారు మమ్ములను శాప ముక్తులను చేస్తారు. నేను ఎంతటి సంపన్నుడైన మహా రాజు

అల్లుడనైనా సుఖాన్ని పొందలేను. అదే శుక్రాచార్యుని అల్లుడనైతే - అల్లుని మేలుకోరని మామ ఎవరుంటారీ లోకంలో! అల్లుని శుభమే కుమార్తెకు శుభం కదా! కుమార్తె మంచి చెడ్డలు చూడని తండ్రి ఎవరుంటారు?

వెనుకా ముందూ ఆలోచించకుండా, ఎవరి సలహా సంప్రదింపులు లేకుండా ఎంత ఉత్సాహంతో దేవయాని నన్ను భర్తగా అంగీకరించిందో, అంతే ఉత్సాహంతో నేనూ ఆమెను ధర్మపత్నిగా స్వీకరించి కరగ్రహణం చేసాను.

అయితే శుక్రాచార్యుడే నాకు విలక్షణంగా కనిపించాడు. ఆయనకు తన కుమార్తెపట్ల అంతులేని అనురాగమున్నది. కాని నావంటి రాజును అల్లుడుగా పొందనందుకు ఆయన ఏమాత్రం సంతోషాన్ని వ్యక్తం చెయ్యలేదు. కనీసం మాట మాత్రంగా నయినా ఆనందాన్ని కనపరచలేదు. ఆయన గొప్ప ఋషి అయిన కారణంగా ఆయనకుమార్తెకు నామీద అధికారం ఉందనుకుంటున్నారా! నా మంచి చెడులు విచారించటం అటుంచి కనీసం రాజుగానయినా భావించి క్షేమసమాచారాలు అడుగలేదు. ఆయన సమయమంతా తన కుమార్తెను ఓదార్చటంలోనూ, ఆమె ఎడబాటును తలచుకుని దుఃఖించటంతోనే సరిపోయింది. ఆయన మరలా దోఘోరమైన తపస్సు చేయటానికి వెళుతున్నట్లు నాకు తెలిసింది. ఆయన సంకల్పానికి సంబంధించిన పూర్తి వివరాలు కూడా నేను విన్నాను. అయితే యయాతి కూడా ఒక మనిషేనని, అతనే మాత్రం సంకోచంలేకుండా తన కుమార్తెను వివాహం చేసుకున్నాడని, అతనిని ఆత్మీయునిగా చూడాలన్న ధ్యాసే శుక్రాచార్యులవారికి ఉన్నట్లు తోచదు.

శర్మిష్ఠ దేవయాని దాస్యాన్ని అంగీకరించటానికి క్షణమాత్రం కూడా ఆలస్యం చెయ్యలేదు. శుక్రాచార్యులకు ఆగ్రహం కలిగి, తమ రాజ్యం వదలి వెళ్ళిపోతే, తమ జాతిమరిన్ని కష్టాలు పడవలని వుంటుందని ఆలోచించి, దేవయాని క్రోధాగ్నిలో సంతోషంతో ఆత్మాహుతికి అంగీకరించింది. అదే ఆమె గొప్పతనం. అయితే ఒక తపస్వీగా, అనుభవశాలిగా, వృషపర్వ మహారాజు మిత్రునిగా, గురువుగా శుక్రాచార్యులు శర్మిష్ఠను దాసిగా చేసి వుండవలసిందికాదు.

కాని ఆయన గొప్పఋషి. సామాన్యుల సుఖదుఃఖాలు ఆయనకెట్లా తెలుస్తాయి? ఆయన తన గొప్పతనంతో తపస్సులో మొండిపట్టుపట్టినట్లే కుమార్తెను

సముదాయించటంలోనే నిమగ్నుడైపోయారు. నేను రాక్షసుల రాజ్యంలో చాలా తక్కువ కాలమేవున్నాను. ఆ కొంచెం సమయంలోనే ఒక ముఖ్య విషయాన్ని తెలుసుకున్నాను. ఈ తండ్రీ కుమార్తెలది ఒక ప్రత్యక్షమైన ప్రపంచం. దేవయాని దృష్టిలో తన తండ్రి శుక్రాచార్యుని మించిన గొప్ప తపస్వి త్రిభువనాలలోలేడని విశ్వాసం. శుక్రాచార్యునికి తన కుమార్తె దేవయాని అంత రూపవతి, గుణవతి ముల్లోకాలు గాలించినా లభించదని నమ్మకం.

కుమార్తెను అత్తవారింటికి పంపేటప్పుడు ఏ తండ్రికయినా దుఃఖం కలగటం సహజం. శుక్రాచార్యునికి కూడా దేవయానికి వీడ్కోలు చెప్పేటప్పుడు కనులు అశ్రు పూరితాలయ్యాయి. కాని వెంటనే ఆయన నన్నోపక్కకు పిలిచి చెప్పారు.

'రాజా! దేవయాని నాకు ఒక్కగానొక్క కుమార్తె, ఆమె సంతోషమే నా సంతోషం అనే విషయాన్ని నీవు ఎప్పుడూ మరువవద్దు. ఆమె ఎల్లవేళలా ప్రసన్నంగా వుండేటట్లు చూడు. నేను మరలా ఘోరమైన తపమాచరించి మహోన్నతమైన సంజీవని విద్యను పొందబోతున్నాను. నా ఆశీర్వాదమే ఈ ప్రపంచంలో ఒక గొప్ప శక్తి అన్న విషయం రేయీపగలూ కూడా మరువవద్దు. అయితే నేనెంత గొప్ప ఋషినో, అంతటి కోపిష్ఠి బ్రాహ్మణ్ణి కూడా.

తెలివిగల పురుషులు, గొప్ప విషసర్పాలు కన్నా, తీక్షణమైన శస్త్రాలుకన్నా నాలుగువైపులా సాచుకొనివచ్చే మహాగ్ని జ్వాలలకన్నా ఆగ్రహం కలిగిన బ్రాహ్మణునికి ఎక్కువ భయపడతారు. విషసర్పం ఒకర్ని కాటువేస్తుంది. శస్త్రం కొంతమందిని చంప గలుగుతుంది. అగ్ని యావత్తు గ్రామాన్ని భూడిదమసి చేస్తుంది. కాని తపశ్శక్తి కలిగిన బ్రాహ్మణుడి ఆగ్రహం మొత్తం దేశాన్నే నాశనం చేస్తుంది. వృషపర్వుడు ఏ విధంగా తాపాదా క్రమోలవాలాడో, శర్మిష్ఠ ఏ విధంగా దేవయానికి దాసి అయ్యిందో నీవు చూశావు కదా! అందుచేత దేవయానికి దుఃఖం కలిగించే ఏ చిన్న పని నీవు చేయవని ఆశిస్తాను. ఆమె దుఃఖం నాకు దుఃఖం అన్న సంగతి ఎప్పుడూ మరువవద్దు!'.

నాకు లాగానే దేవయానికి కూడా ఆయన ఉపదేశాత్మకంగా ఏదైనా నాలుగు మాటలు చెపుతారు అని ఆశించాను. సాధారణంగా అత్తవారింటికి, అందులోనూ రాజకుటుంబానికి వేళ్ళే కొత్త పెండ్లికుమార్తెకు ఏవిధంగా ప్రవర్తించాలో పెద్దలు

హితబోధ చేస్తారు అని నేను వినివున్నాను. కాని గొప్ప తపస్వి అయిన శుక్రాచార్యుడికి మాత్రం తన కుమార్తెకు హితవు చెప్పే ఆలోచనే కలుగలేదు. మహనీయుల ప్రవర్తన విలక్షణంగానే వుంటుందని భావించి నేను అందరి దగ్గరా సెలవు తీసుకున్నాను.

అర్ధరాత్రి ఎప్పుడో గడచి పోయింది. పాత జ్ఞాపకాలను నెమరువేసుకుంటూ నేను ఆవేదనతో అటూ ఇటూ దొర్లసాగాను:

# అధ్యాయం 10

మనిషి కూడా ఎంత దురాశాపరుడు!

ఈరోజు దేవయాని చేసిన హడావుడికి అంతఃపురంలో అందరూ అర్థంకాక గందరగోళ పడివుంటరని అప్పుడప్పుడు అనిపిస్తూ వుంటుంది. దాస - దాసీలు ఇంకా గుసగుసలాడు కుంటూంటారు. బహుశా, తొలిరేయి ఇలా ఉన్మాదంతో భర్తను విడిచి పడక గది నుండి వెళ్ళిపోయే భార్యను ఇంతవరకు వారు చూసి ఉండరు. ఐశ్వర్యం ఎంత అధికంగా ఉంటే పాటించవలసిన మర్యాదలూ అంతే కఠినంగా ఉంటాయి. కాని ఈ రోజు అంతఃపురంలో జరిగిన వ్యవహారం బహుశా లోకంలో ఏ నిరుపేద గుడిసెలో కూడా జరిగి ఉండదు. ఎక్కడా జరగకూడదు! అలా ఎందుకు జరిగిందో అర్థంకాదు. ఎవరు చెపుతారు? ఏమని చెపుతారు? ఎలా చెపుతారు? దేవయానికి నచ్చ చెప్పగలవారెవ్వరు?

ఇంక కొంచెం సేపటికి అంతా నిశ్శబ్దం అలముకుంటుంది. అప్పుడు తన మందిరంలో మథనపడుతున్న దేవయాని నెమ్మదిగా నా శయన మందిరానికి వస్తుంది, తలుపు మూసి నా మంచంమీద వచ్చి కూర్చుంటుంది, నాకాళ్ళు ఒత్తుతుంది, నేను ఒక్క ఉదుటన ఆమె చేతులు అందుకొని దగ్గరకు తీసుకుని ఇలా అంటాను - 'పిచ్చిదానా! భగవంతుడు ఇంత అందమైన చేతులిచ్చింది పాదసేవ చేయటానికా?' అప్పుడామె అశ్రుపూరిత నయనాలతో నెమ్మదిగా తల ఎత్తి నా వైపు బేలగా చూసి, వెంటనే నా ఒడిలో ముఖం దాచుకుంటూ చిన్నపిల్లలా అమాయకంగా ఇలా చెబుతుంది - 'నా వలన తప్పు జరిగింది. క్షణికావేశంలో అనుచితంగా ఏదో వాగేశాను. నన్ను క్షమించండి. క్షమిస్తారు కదూ?'

అప్పుడామె తల నిమురుతూ నేనిలా అంటాను - 'నేను! నిన్ను క్షమించాలా? అంటే నీవు వేరు, నేను వేరునా? కాదు! నీవొకటి. నేనొకటికాదు. మనిద్దరం ఒక్కటే. సాగరంలో సంగమించిన నదులు, మరలా భిన్న ప్రవాహాలుగా ప్రవహించ డాన్ని ఎవరైనా చూశారా! చెప్పు. నిన్ను నేను క్షమించడమంటే నన్ను నేను క్షమించటమే. అదంతా ఎప్పుడో అయిపోయింది!. ఇదంతా విని ఆమె చిరునవ్వు చిందిస్తూ, తనంతట తాను ..........

భగవంతుడు మనిషికి గాలిమేడలు కట్టే శక్తి ఇచ్చి ఉండకపోతే!.

దేవయాని ఇప్పుడు వస్తుంది, వచ్చేస్తూ ఉంటుంది. ఆమె వచ్చాక, 'జరిగిం దేదో జరిగిపోయింది, దాన్నింకా మరిచిపో', అని చెప్పి మరిపించే ప్రయత్నం చేస్తాను. ఆమెతో ఇలా అంటాను - 'నీవు పెరిగిన వాతావరణం, అక్కడి సంస్కారం వేరు. ఈ విషయం నాకు మొదటే స్ఫురించవలసింది. కాని స్ఫురించలేదు. ఈరోజు జరిగిన తప్పుకి నన్ను క్షమించాలి, ఇకమీదట ఎన్నడూ మద్యపానం చేసిన యయాతిని పడకగదిలో చూడవు. ఇంతటితో నీవు సంతృప్తి చెందకపోతే, ఇదిగో నీమీద ఒట్టు, ఈ క్షణం నుంచే నేను మద్యపానం మానివేస్తున్నాను. అంతేకాదు, ఎప్పుడూ కూడా ఎలాంటి మత్తుపానీయాన్ని నా పెదవులకు తాకనివ్వను!'. ఆమె నా మెడచుట్టూ తన చేతులూ వేస్తూ ఇలా అంటుంది - 'నాలాగానే మీరుకూడా భిన్న సంస్కారంలో పెరిగారు అనే విషయం నాకు మొదటే స్ఫురించవలసింది. మీరు క్షత్రియులు, వీరులు, మహారాజు కూడా. మీరు రాజకార్యాలు చక్కదిద్దవలసి ఉంటుంది, యుద్ధాలు చేయవలసి ఉంటుంది. అందుచేత మత్తుపానీయం వలన లభించే ఉన్మాదం, ఉత్తేజం మీకు అవసరమే. ఈ మామూలు సుఖంలో ఇలా మీకు అడ్డు తగలడం నాకు సమనుచితంకూడా కాదు, కాని, నేనుమాత్రం ఏం చేయను? మద్యపు వాసనంటేనే నాకు గిట్టదు. మన ఏకాంత సమయంలో మీరు మత్తులో ఉండరాదన్నదే నా మనవి'.

రాత్రి మూడవ ఝాముకూడా సమీపించింది. నేనలా తపిస్తూనే ఉన్నాను. దేవయాని అడుగుల చప్పుడు వినేందుకు నా చెవులు రిక్కరించాను. కాని, నా శయన మందిరంవైపు ఎవరూ వచ్చిన అలికిడే లేదు. ఆః ఎవరొస్తారులే? దేవ యాని చేసిన ఈ అకతాయితనానికి అమ్మకు కూడా కొంచెం కోపం వచ్చి

ఉంటుంది. కాని అమ్మకూడా తెలివిగలదే, కోడలికి ఉపదేశవాక్యాలు చెప్పడానికి వెళ్ళి, తాను అవమానం పొందడం ఎందుకని, ఆమెకూడా కిమ్మనకుండా ఊరుకొని ఉంటుంది. శర్మిష్ఠ కేవలం దేవయానితో వచ్చిన దాసీ మాత్రమే. సఖిగా, స్నేహితు రాలిగా దేవయానికి ఏదైనా హితోక్తులు చెప్పే అధికారం పాపం, ఆమెకెక్కడిది? చివరకి, ఆమె ఉండలేక దేవయానికి ఏమైనా చెప్పటానికి వెళ్ళినా ఆమె వింటుందా? అలాగే పాపం మిగిలిన దాస - దాసీలు అంతా కనులుండీ అంధులు, చెవులుండీ బధిరులు, నోరుండీ మూగవాళ్ళే, వాళ్ళంతా ఎక్కడివాళ్ళక్కడ చెవులు కొరుక్కొంటూ, విసుక్కుంటూ చివరకు కునుకు తీసి ఉంటారు.

ఖిన్న మనస్కుణ్ణై మంచంమీదనుండి లేచాను. అతృప్తమైన శరీరం, అవమా నింపబడిన మనస్సు బహుశా చాలా విచిత్రంగా ఉంటాయి - పాముకాటు బయటికి చూడడానికి చాలా చిన్నదిగా కన్పించినా శరీరమంతా దాని ప్రభావం ప్రాణాంత కంగా ఉంటుంది.

కిటికీ నుండి బయట చీకటిలోకి చూస్తూండగా నాకు ముకుళిక జ్ఞాపకం రాసా గింది. అలక కూడా. ముకుళిక నాకు ఏదైతే అందించ్చిందో, అలకనుండి కూడా నేను అదే పొందాను, కాని వీరికంటె కూడా ఇంకా అధికమైన ప్రేమను పొందాలనే బలీయమైన కోరికతోనే దేవయానిని చేపట్టాను, కాని, ఏ పానుపునైతే నేను పూల పాన్పని భ్రమించి సుఖించాలను కున్నానో, దాని నుండి పాము పిల్లలు బిరబిరా బయటికు వచ్చాయి.

నాలోని మనిషి మేల్కొన్నాడు. నాలోని పురుషుడు మేల్కొన్నాడు. నాలోని రాజు జాగృతమయ్యాడు. నాలో నేనే గొణుక్కోసాగాను, నాకు ఎలాంటి సుఖం కావాలన్నా, ఈ భూప్రపంచంలో ఎక్కడైనా, ఎలాగైనా పొందగలను. నేను, అసా ధారణమైన మనిషిని, పరాక్రమశాలిని, వైభవశాలినైన రాజుని, నేను తలచుకొంటే రోజుకొక అప్సరసను నా అంతఃపురంలోకి రప్పించుకోగలను!.

## అధ్యాయం 11

రెండవరోజు ఉదయం కూడా నాకోపం తగ్గలేదు. మనస్సు అవమానంతో సిగ్గుతో క్రుంగిపోతున్నది. అలా వేటకి వెళ్ళినా బాగుండునేమో అనిపిస్తోంది. అప్పుడే శర్మిష్ఠ గాభరాగా, లోనికి ప్రవేశించి చెప్పసాగింది - 'రాత్రి నుండి మహారాణి ఆరోగ్యం బాగాలేదు. అనుకోనివిధంగా అనారోగ్యం చేసింది. రాజవైద్యులు ఇప్పుడే చూసివెళ్ళారు. ఆయినా చింతించవలసిన పనిలేదు, రాజుగారు స్వయంగా ఆమె క్షేమాన్ని విచారిస్తే, కుశల ప్రశ్నలు వేస్తే మహిమాన్వితమైన ఔషధం కంటె మీదర్శనం ఆమెకు విశ్రాంతిని ప్రసాదించగలదు'.

అలా చెపుతున్నప్పుడు శర్మిష్ఠ ముఖంలో మనోహరమైన చిరునవ్వు నాట్యంచేసింది. స్వచ్ఛమైన ఆకాశంలో బంగారపు రంగులో మెరుపు మెరిసినట్లుంది ఆ చిరునవ్వు! స్మృతిపథంలో ఏదో అస్పష్టంగా మెదలసాగింది - నిన్నరాత్రి మందిరం బయట చేతిలో పళ్లెం పట్టుకుని ఎవరో దాసి నిలబడింది! ఆమె ఎవరు? శర్మిష్ఠగాని కాదుకదా? జ్ఞాపకం తెచ్చుకోడానికి ప్రయత్నించాను. సరిగ్గా జ్ఞాపకం రావటం లేదు. నేను శర్మిష్ఠను, అడిగాను, 'నీవు ........ నీవు........ నిన్న రాత్రి శయన మందిరం బయట గాని నిలబడ్డావా?'

ఆమె తలాడిస్తూ 'అః ఔను' అని క్రిందికు చూడసాగింది.

రాత్రి శర్మిష్ఠ నాకెందుకు కన్పించలేదు? కాదు - కాదనుకుంటా, నేనుగాని మాధవుని ఇంటిలో కొంచెం ఎక్కువుగా మధువుని సేవించలేదు కదా!

నేను ఆలోచనలో మునిగి వుండటం చూసి, శర్మిష్ఠ ఇలా అంది -

'మహారాజా! చిన్నతనం నుండి నేను, మహారాణి స్నేహితురాలిగా ఉంటూ

వచ్చాను. ఆమెకు కోపం కొంచెం ఎక్కువ. ఆమె చిలిపిచేష్టలకు మీరు మనసు చిన్న బుచ్చుకోవద్దు'.

కొంచెం ఆగి ఆమె మరలా ఇలా అంది - 'దాసిగా కావ్యాత్మకమైన మాటలు మాట్లాడకూడదని నాకు తెలుసు. కాని..... ప్రణయ కలహం లేనిదే ప్రేమ మధురంగా ఉండదు'. ఈచివరి వాక్యం కొంచెం భయంభయంగానే అంటూ ఆమె మరలా నేలపై దృష్టి సారించింది. ఆమెను చూసి, నా మనసు అనుకోకుండా ద్రవించింది. శర్మిష్ఠకు కూడా మనసుందా! ఏ దేవయానైతే ఈమెను నిన్నరాత్రి తన రాణీవాసం రంగమహల్‌లో దాసీగా నిలబెట్టిందో, ఈమె కోమలమైన భావాలను అణగదొక్కిందో, అదే దేవయాని సుఖంకోసం ఈమె మధ్యవర్తిత్వం చేస్తూంది.

జీవితంలో కూడా కృష్ణాష్టమి నాడు చంద్రోదయం అవుతుందా! చీకటి అలముకున్న నా మనసు కొంచెం కొంచెంగా ప్రకాశవంతమయింది. అందులో ప్రఫుల్లిత చంద్రకిరణాలు విరజిమ్మాయి.

పరిహాసంగా నేనిలా అన్నాన - 'ఇంతగా ప్రేమించటం నీకెవరు నేర్పారు శర్మిష్ఠా?'

ఎడమ చేతిగోళ్ళకున్న గోరింటను పరికిస్తూ ఆమె ఇలా ఎదురు ప్రశ్న వేసింది - 'ప్రతి విషయానికీ గురువు అవసరమా?'

'ఈ ప్రపంచంలో గురువు లేకుండా ఎవరైనా విద్యను ఆర్జించారా? ప్రేమించడ మనేది ఈ ప్రపంచంలో సర్వశ్రేష్ఠమైన విద్య, సంజీవిని కంటె కూడా గొప్పది'.

'మీకు తెలుసుకోవాలని ఉంటే, నా గురువుపేరు చెప్పేస్తాను' ఆమె కొంచెం ఆగి మరలా చెప్పింది, 'కచదేవుడు'.

'కచుడా?' నేను ఆశ్చర్యంగా అన్నాను!.

కచుడు, అతనొక విరాగి, విరక్త తపస్వి. ప్రేమ మాట వింటనే మూడుసార్లు స్నానమాచరించేవాడు! అలాంటి కచుడు, శర్మిష్ఠకు ప్రేమించడం నేర్పాడా?

'అంటే? ........ ఈమె కచుని ప్రేమించిందా? అరెరె!'.

శర్మిష్ఠ తొందరచేస్తూ 'మహారాజా పదండి మహారాణి మందిరానికి' అన్నది.

చిన్నపిల్లవాడు తనతల్లి చేతివేలు పట్టుకుని ఆమె వెంట. ఆడుతూ, నవ్వుతూ వెళ్ళినట్లు నేను కూడా శర్మిష్ఠ వెనుక దేవయాని మందిరానికి వెళ్ళాను. శర్మిష్ఠతో మాట్లాడిన తర్వాత వికలమైన నా మనసుకు కాస్త ఉపశమనం కల్గింది. మనస్సులో క్రోధానికి బదులు క్షమ మేల్కొన్నది.

దేవయానికి నిజంగా అస్వస్థతగా ఉందా? ఏమో తెలియదు. కాని ఆమె వాడి పోయిన ముఖాన్ని చూస్తే, మేఘాలలోంచి తొంగి. చూసే చంద్రునిలా ఉదాసీనంగా అన్పించింది నాకు. నేను ఆమె చెంత కూర్చున్నాను. ఆమె చేతిని నాచేతిలోనికి తీసుకున్నాను. నోటితో చెప్పలేని విషయాన్ని, కళ్ళతో వ్యక్తం చేయలేని విషయాన్ని, ఇంకా ఎన్నో విషయాల్ని మా రెండు చేతులూ మాట్లాడుకున్నాయి. ఈ చేతుల సంభాషణ కొంచెం సేపు అలానే సాగింది. దేవయానికళ్ళు చెమ ర్చాయి! తామర రేకులపై నిల్చిన మంచు బిందువుల్లా చెమర్చిన కన్నీటి బిందు వుల్ని చుంభించాలని, ఆ కన్నీటిని కళ్ళతోనే ఇగిర్చి వేయాలని అనిపిస్తాంది. కాని శర్మిష్ఠ కూడా ఈ గదిలోనే ఉంది!

నేను ప్రక్కకు తిరిగి చూసాను. గదిలో ఎక్కడా శర్మిష్ఠ కన్పించలేదు. అడుగుల చప్పుడు విన్పించనంతటి నెమ్మదిగా ఆమె గదినుండి బయటకు జారు కుంది. అలాగే గది తలుపు కూడా చప్పుడు కాకుండా మూసివేసింది.

దేవయాని కన్నీటిని చుంభించాలని నేను ముందుకు వంగాను. ఆమె వెంటనే నారెండు చేతులను, తన చేతులతో బయటకు నెడుతూ, గోముగా అంది. 'ఇక తీసుకోరు కదా?'. సగం నిద్రతో మాట్లాడినట్లుగా ఆమె మాటలు అలసినట్లు ఉన్నాయి.

నాకు అర్థమయింది. ఆమె మధువు గురించి మాట్లాడుతున్నది. నా అహం దెబ్బతిన్నది. తగిన సమాధానం చెప్పుదామని మనసులో అనిపించింది. కాని అదే క్షణం మనసులో ఇలా అనిపించింది. దేవయాని అనారోగ్యంగా ఉంది, నా దేవయాని అనారోగ్యంగా ఉంది! ఇలాంటి స్థితిలో ఆమెకు దుఃఖం కల్గించ కూడదు. మనసులో ఏదో గుర్రం కళ్ళెంలేక వశంతప్పి తనిష్టంవచ్చినట్లు పరుగెత్తు తోంది. కళ్ళెం లాగి దాన్ని అదుపులోనికి తేవడానికి ఒక సారథి ప్రయత్నిస్తు న్నట్లున్నది.

పూలకంటె సుకుమారమైన తన అరచేతులతో నా అరచేతులపై నెమ్మదిగా నిమురుతూ దేవయాని అంది - 'తీసుకోరు కదా? నాకోసం ....: .....'.

ఆమె మాటల్లోని చివరిమాటలోని చిలిపితనానికి నా మనసు ద్రవించి పోయింది. నేను వెంటనే అన్నాను! 'లేదు, ఇక మీదట శయన మందిరంలో నా నోటినుండి మధువు వాసన నీకు ఇకరాదు. ఎన్నడూరాదు!'.

ఆమె నవ్వుతూ - 'అయితే నాకు మాట ఇవ్వండి!'

నా అహం మరలా నిద్రలేచింది. నేను ఈమె కొరకు ఇదంతా చేయడానికి సిద్ధపడ్డాను. అయినా, ఇంకా నాపై విశ్వాసం కలగలేదు. అలాంటప్పుడు ఆ వ్యక్తి గురించి తన సుఖాన్ని ఎందుకు త్యాగం చేయడం, నాపై నమ్మకమే లేనప్పుడు?....

గుర్రం మరలా అదుపుతప్పి పరుగిడ సాగింది. అతి కష్టంమీద దాన్ని మరలా అదుపులోకి తెచ్చాను.

నవ్వు తెచ్చిపెట్టుకొంటూ ఇలా అన్నాను - 'ఈ సున్నితమైన చేతుల స్పర్శ ఎల్లప్పుడూ కోల్పోకుండా ఉండటానికి, ఒకటేమిటి వంద ఒట్లు పెట్టటానికి కూడా సిద్ధమే నేను!'

'ఆం హం ...... అంత సులువైన విషయంకాదిది! మా తండ్రిగారి పాదాల సాక్షిగా మీరు నాకు మాట ఇవ్వవలసి ఉంటుంది!'

నాకు ఆమె తండ్రిపై చాలా కోపం వచ్చింది. దేవయాని ఇప్పుడు నా భార్య. అలాంటప్పుడు ఆమెకు తన తండ్రికంటె నాపైనే ఎక్కువ ప్రేమ ఉండాలి. ఉండితీరాలి. కాని ..... ..... ..... ఇప్పటి వరకూ ఆమె మనసులో తన తండ్రే నిండి వున్నాడు.

ఈసారి నా మనసును నిగ్రహించుకోవడం చాలా కష్టం అయింది. కాని ఏదో విధంగా నిగ్రహించుకొని, మాటఇచ్చాను.

దేవయాని నవ్వింది, నవ్వుతోంది. ఆ నవ్వు, కేవలం ఒక ప్రేయసిలా కాదు, మానినిలా నవ్వుతోంది! అంతే కాక, సౌందర్యమనే ఆకర్షణశక్తితో పురుషుని తన

కాళ్ళపై పడేటట్లు చేయగలననే అహంకారంకల ఉన్మత్త స్త్రీ నవ్వులా ఉంది అది.

ప్రేమ అనే రాజ్యంకోసం జరిగిన ఈ మొదటి యుద్ధంలో నేను పూర్తిగా ఓడిపోయాను.

మద్యపానం విషయంలో నేను దేవయానికిచ్చిన మాటకు పూర్తిగా కట్టుబడి ఉన్నాను. మా దాంపత్యజీవితం సుఖంగా మొదలైంది.

ఇప్పటికీ ఆరోజులు జ్ఞప్తికి వస్తున్నాయి. ఏమి రోజులో? ఆరోజులనే ప్రత్యే కించి చెప్పాలి, ఎందుకంటే మధ్యలో సూర్యుడు ఉదయించి, నాలుగు ఝాముల పాటు నన్నూ దేవయానిని వేరుచేస్తూ అస్తమించేవాడు. లేకపోతే ఎనిమిది ఝాములూ రాత్రే అయి ఉండేది, అపుడు యయాతి కమలంలో బంధింపబడిన భ్రమరంలా ఆనంద మధువును తనివితీర ఆస్వాదిస్తూ ఉండేవాడు. ఆనంద సాగరంలో తేలియాడుతూ ఉండేవాడు.

పొద్దున్నే ఉద్యానవనంలో పక్షులు కలకలారావం చేస్తుంటే నాకు భలే కోపం వస్తుంది. అందరూ అరసికులే అన్పిస్తుంది. పక్షుల కలకల ధ్వని వినగానే దేవ యాని తన మందిరానికి వెళ్ళడానికి తొందరపడుతుంది. నేను ఆమెతో అంటాను. 'కొంచెం ఉండకూడదూ! ఈ పక్షులు కూడా ఎంత పిచ్చివో. పాలలాంటి తెల్లని వెన్నెలని చూసి తెల్లవారిందని భ్రమపడుతూ ఉంటాయి. తెల్లవారేం దుకు ఇంకా చాలా సమయముంది. ప్రశాంతంగా పడుకో!'.

కాని ఆమె వినిపించుకోదు. తొందర - తొందరగా వెళ్ళిపోయేటందుకు సిద్ధ పడుతుంది. అప్పుడు నేనంటాను - 'హుం, ఇక నన్ను గురించి లేనిపోని ప్రసంగం జరగబోతోందన్నమాట!'.

ఆమె అంటుంది, 'ఏమిటది?'.

'నీవులేకుండా నాలుగైదు ఝాములు గడిపే విషయంపై'

అప్పుడు ఆమె చిత్రంగా నావైపు తిరిగి చూస్తుంది, దానితో నా మనసు ఆనందపరవశమై పోతుంది. అలా చాలా సేపటివరకు నాతనువు - మనసు పుల కిస్తూ ఉండిపోతాయి.

ఏమైనా, నా మాట వినకుండా ఆమె వెళ్ళిపోడానికి సిద్ధమవుతుంటే, నేనిలా అంటాను - 'నీవే చెప్పు, ఇంత చిరకాల విరహం నేనెలా సహించగలను? ఊర్వశి అదృశ్యమైపోయినప్పుడు మా ముత్తాత పురూరవుడు అడవుల వెంబడి పిచ్చి వాడిలా తిరుగుతూ పశు - పక్ష్యాదులను నా ప్రియురాలు ఎక్కడ? అని అడుగుతూ వుండే వాడట. లతలను పొదలను చూసి ఊర్వశి అని భ్రమించి ఆలింగనం చేసుకొనేవాడట! నేను కూడా ఇప్పుడు రాజప్రాసాదంలో అలాగానే ఏమైనా చేసానంటే. ....'

ఆమె మధ్యలో నన్నాపి, 'పోదురూ, మీరు మరీను! అంటూ సిగ్గు పడుతుంది.

'కాదు! ఇంత దీర్ఘవిరహం నేను భరించలేను. అంతకాలం నేనెలా గడపగలను? నువ్వే ఏదైనా జ్ఞాపిక విడచివెళ్ళు. దాన్ని చూస్తూ . ..

అలా అనగానే ఆమె ఒక్క ఉదుటున వంగి నన్ను ఉక్కిరిబిక్కిరి చేస్తూ నా పెదవులపై, బుగ్గలపై గట్టిగా ముద్దిడుతుందేమో అని అనుకొనే వాణ్ణి. కాని నా ఆ కోరిక తీరలేదు!. కాని, నేనే తనివితీరా, ఒకటి, రెండు, మూడు, నాలుగుసార్లు ఇలా ఎన్నో ముద్దులు పెడతాను. ఆమె శరీరం నిండా, అయినా ....... ఇంకా మనసు తృప్తి చెందదు, తీరని దాహంలా.

ఆమె నెమ్మదిగా నా చేతులలోంచి ముఖాన్ని విడిపించుకొని కొంచెంగా చూస్తూ అంటుంది, 'ఇక చాల్లెండి! ఇంకా ఎక్కువైతే అజీర్ణం చేస్తుంది!'

'ఆం .... హాం, ఇంకొక్కటి. .........'

ఆమె కొంటెగా నవ్వుతూ అంటుంది, 'ఆం ......హాం! పూలన్నీ అయిపోయాయి!'

'పిచ్చిదానా! ప్రపంచం మొత్తమ్మీద ఒకేఒక అద్భుతమైన లత, ఆ లతే ఇది. ఎవరు ఎన్ని కావాలంటే అన్ని పూలు కోసుకోవచ్చు. ఇంకా పూలు మిగిలే ఉంటాయి, అదే వసంతలత. దీని పూలు ఎప్పుడూ తరిగిపోవడమే ఉండదు!'.

'కాని మీరు ఇంకొక్కటే అని అంటారు. కాని వంద ...... వంద ......'

'మహర్షి ఆశ్రమంలో పెరిగిన కన్యవు నీవు. ఈ ప్రేమ గణితం గురించి తెలుసుకోవడం నీవశంకాదు. ఈ గణితంలో ఒకటి అంటే అర్థం ఒకవేయి, ఒక లక్ష, ఒక కోటి కూడా కావచ్చు. సందర్భాన్నిబట్టి దీని అర్థం మారుతుంటుంది'.

ఇతరమైన జ్ఞాపకాలన్నీ ఒకప్పుడు మరుగునపడతాయేమో, కాని ప్రేమాను రాగాల స్మృతులు ఎన్నటికీ స్మృతిపథంలో అలా చెరగని జ్ఞాపకాలుగా పదేపదే మెదుల్తూ ఉంటాయి. అలా ఎందుకవుతుందో కూడా నాకు తెలియదు. కాని అలా అనిపించక తప్పదు!

వివాహం అయిన పిమ్మట కొన్ని నెలల వరకూ కూడా నా మనోఫలకంపై అప్సరసల సుందర - సుకుమార ఆకృతులు అంకితమై నిల్చిపోయాయి. సిరి మువ్వల వెన్నెలలు నిండిన ఎన్నో రాత్రులు ఘల్లు - ఘల్లుమని శబ్దంచేస్తూ, చేతిలో మధు పాత్రతో వయ్యారంగా నడుస్తూ నా రంగమహల్‌కు వచ్చాయి. వాటన్నింటిని ఒకేసారి నేను గడా - గడా త్రాగేశాను, అయినా ఇంకా దాహంగానే ఉండేది - ఆ రాత్రులు, సుందరమైన, మనోహరమైన సరస్సులేమో అన్పించి అందు జలక్రీడలతో శతదళ కమలాలు వికసించేవి ........

'అయినా ఇప్పుడవన్నీ చెప్పలనసిన పనేముందిలే!'.

కాని, శారీరిక సుఖం, మరియు సంభోగం గురించిన విషయాలు విచ్చల విడిగా చెప్పడం మర్యాద కాదు కాబట్టి ఆ విషయాన్ని దాటవేస్తున్నానని అనుకో వద్దు. బ్రహ్మానందం పొందేవాళ్ళు ఆత్మవిశ్వాసం గురించి బహిర్గతంగా చర్చించగా తప్పులేనిది, స్త్రీ పురుషులయొక్క అనురాగం, ప్రణయం గురించిన విషయాలు బయటకి వెల్లడించడంలో తప్పేముంది? సిగ్గుపడటానికీ లేదా దాచుకోడానికీ ఏముంది అందులో?

ఆ మధుర స్మృతుల సుగంధం పూర్తిగా గాలిలో కలిసిపోయింది. వాటి రెక్కలు నేలరాలాయి, కేవలం ముళ్ళుమాత్రమే మిగిలాయి! అందుకే నేను........

దేవయానికీ, నాకూ అంటూ ఒక రమణీయమైన, అద్భుతమైన స్వతంత్ర లోకాన్ని సృష్టించుకోవాలనే ప్రయత్నం చాలాకాలం వరకూ చేసాను. నేను నిర్మించ దలచిన ప్రపంచంలో నేనొక రాజుగా. దేవయాని ఒక రాణిగాకాక. నేనొక

శాపగ్రస్తుడ నైన నహుషుని పుత్రునిగా దేవయాని మహర్షి శుక్రాచార్యుని పుత్రికగా, కేవలం ఆ ప్రపంచంలో శారీరక బంధం అనేదే ఉండదు. అంతేకాకుండా మనసుకు సంబంధించిన అన్ని బంధాలు విడిపోయి స్వేచ్ఛగా సంచరించగలిగే ప్రపంచం. ఆ ప్రపంచంలో ఒకవేళ యముడేగనుక వచ్చి 'యయాతీ!' అని పిలిస్తే యముని కి దేవయాని సమాధానం చేప్తుంది. అలాగే యముడు 'దేవయానీ!' అని పిలిస్తే సమాధానం చెప్పడానికి ఈ యయాతి అతి వినయంగా అక్కడ నిలబడతాడు. ఒకవేళ ఆ ప్రపంచంలో యయాతి గనుక నరకానికి వెళ్ళటానికి సిద్ధపడితే, దేవయాని కూడ స్వర్గంపై వైముఖ్యంతో అతని వెనకే వెళ్ళటానికి సిద్ధపడుతుంది, అలాగే దేవయాని కూడా ఎంత చెడ్డదైనా కూడా ఆమెకొరకు ఈ యయాతి ప్రాణాలు సహితం బలి ఇవ్వడానికి సిద్ధపడతాడు, అలాంటి అద్భుత ప్రపంచాన్ని నిర్మించాలనే కోరిక ఉండేది! కాని .......

ఒకనాటి అర్ధరాత్రి నా బాహుపాశంలో పరవశంగా ఉన్న దేవయానిని నేనొక పిచ్చి ప్రశ్న వేశాను, 'నీవు ఎవరి దానవు?'.

ఆమె ఏమీ సమాధానం చెప్పకుండా, నిశ్శబ్దంగా భావయుక్తమైన దృష్టితో నావైపుచూసి, నావిశాలమైన వక్షస్థలంపై తన ముఖం దాచుకొని ఉంటే, నేనూ హించిన జవాబు నాకు లభించి ఉండేది. అంతేకాకుండా నా హృదయకలశం అను రాగంతో నిండిపోయి ఉండేది......కాని దేవయాని మాత్రం, ఏదో వేదాంతపరమైన ప్రశ్నగా భావించి దానికి సరైన జవాబు ఇవ్వాలనేమో ఇలా అంది, 'నేను నా తండ్రికి, మీకు, రేపు జన్మించ బోయే మన బిడ్డకు చెందినదానను. నేడు నేను మహారాణిని, మున్ముందు రాజ మాతను అవుతాను. అందుచేతనే నేనెవరిదాననో నేనెలా ఖచ్చితంగా చెప్పగలను, మనపై అనేక మందికి అధికారముండాలి!'

ఏ రంగుచీరైనా, ఎలాంటి రంగు బట్టలైనా, ఆమె దేహానికి సరిపోతాయి. ఏ రంగుబట్టలైనా ఆమె అందానికి వన్నెతెస్తాయి. ఆకాశంలో ఏరంగు మేఘాలైనా అందంగా ఉన్నట్టు. ఆమె రత్నహారాలుగాని లేదా ముత్యాలహారాలుగాని ధరిస్తే ఆమె అందంచేత వాటి శోభ అధికమవుతుంది. ఇంకా కురులను అలంకరించు కోవడంలో ఆమెకు ఆమెసాటి!! ఒక్కొక్కసారి ఆమె అలంకరణకు కనీసం నాలుగు గంటల సమయం పడుతుంది. నేను కూడా అదే కోరుకునేవాణ్ణి, ఆమె చక్కగా

అలంకరించుకోవాలని, కాని అలా చక్కగా అలంకరించుకొన్న దేవయాని పగటి పూట కూడా, నా దగ్గరగా, నా కళ్ళముందు అటూ ఇటూ తిరుగుతూ ఉంటే, ఎంత బాగుంటుందో అనే కోరిక ఉండేది.

ఈ కోరికలో ఏమాత్రం వ్యామోహం, ఆకర్షణ ఉందో నేను చెప్పలేను. కాని అందులో సరళతా, నిర్మలత్వం కొంత పాళ్ళవరకూ మాత్రం ఉండేవి. కనీసం, అప్పుడప్పుడనిపించేది, మండుటెండలో చల్లని నీటితో స్నానం కలిగించే ఉపశమనంలా, కార్యభారంతో అలసిన పురుషునికి స్త్రీ తన ప్రసన్నవదనంతో అలాంటి సుఖం అందించాల్సిందే! కేవలం ఆమె కిలకిల నవ్వేకాదు, ఆమె చిలిపితనం, ఆమె సామీప్యత పురుషునికి ఎంతో ఉత్సాహాన్నిస్తుంది. కాని ఈ విషయాలేవీ దేవయానికి అర్థంకావు. కాలేదు, ఒకవేళ ఆమె దృష్టిలో ఇవన్నీ పురుషుని కాముకత్వ ప్రదర్శన కొరకు మాత్రమే.

ఆమె అతి లావణ్యవతి, సౌందర్యవతి, శృంగారసాధనలో ఆమెకు ఆమేసాటి. మిక్కిలి నైపుణ్యంకలిగినది. కాని ఇందులో ఏ ఒక్కటికూడా నాకోసం కాదు. ఆమె ఒక అప్సరస, చక్కగా అలంకరింపబడిన మందిరంలో తన చుట్టూతాను తిరుగుతూ మందిరంలో అమర్చబడిన ఒక్కొక్క అద్దం ముందు నిలబడి తన ప్రతిబింబాన్ని చూసుకొంటూ తృప్తిపడుతూండేది. దేవయాని దగ్గర ఏమైతే ఉందో అదంతా కేవలం ఆమె కొరకు మాత్రమే!.

దేవయాని నాట్యకళలో నిపుణురాలని, ఒకసారి శర్మిష్ఠ మాటలద్వారా తెలిసింది. నేను ఆమె నాట్యం చూడటానికి ఉత్సుకతను చూపాను! కాని ఆమె, 'ఏం, దర్బారులో నర్తకీమణులకేం కొదువ? నేనెందుకు నాట్యం చేయాలి? చేయను' అని తిరస్కరించింది. ఋషికన్యగా ఉన్నప్పుడు ఆమె తరచూ నాట్యం చేస్తుండేది. ఇప్పుడు ఆమె మహారాణి అయిపోయింది. భర్తకోరిక మేరకు నాట్యం చేస్తే ఆమె ప్రతిష్ఠకు ఎంత కళంకం కలుగుతుంది!.

ఆమె తన గురించి మాత్రం చెప్పుకుంటుంది. ఆమె నోటితో శుక్రాచార్యుని గొప్పతనం గురించిన మాటలు విని - వీని చెవులు చిల్లులుపడేవి. కాని ఒక్కసారి కూడా, మహారాజు నహుషులవారు ఇంద్రుణ్ణి ఎలా పరాభవించారు? అని అడగలేదు. కాని నేను నగరోత్సవంలో మదించిన, కళ్ళెంలేని గుర్రాన్ని స్వారీచేసి,

గొప్ప వీరత్వం ప్రదర్శించాననీ, చిన్నతనంలోనే అశ్వమేధయాగాశ్వం వెంటవెళ్ళి దిగ్విజయం సాధించాననీ, ఎవరినోటనో విన్నది కాని ఎప్పుడూ కూడా వీటి గురించి ప్రస్తావించనే లేదు, వినాలనే కుతూహలం కూడా చూపలేదు! సరికదా........

సంశయ స్వభావురాలు అయిన కారణంగా నేనే చాలా చిక్కులనెదుర్కోవలసి వచ్చేది. శర్మిష్ఠ కట్టి ఇచ్చిన తాంబూలంతో చక్కగా నోరు పండింది. ఇదే విషయాన్ని నేనోకసారి ఆమెతో ఎగతాళిగా అన్నాను - 'శర్మిష్ఠ కట్టి ఇచ్చిన తాంబూలం కంటే ఎక్కువగా నోరు పండింది. ఎవరికైతే ప్రేమ అధికంగా ఉంటుందో వారిచేతితో కట్టి ఇచ్చిన తాంబూలం అధికంగా పండుతుంది!'. ఆ సంఘటన గురించి ఆమె ఎంత చిర్రు బుర్రులాడిందో, ఎంతగా తనలోతాను గొణుక్కుందో చెప్పలేను!. ఆ రోజు నుండి, కావాలసి శర్మిష్ఠను నాకు దూరంగా ఉంచడం మొదలుపెట్టింది.

అలక, తన జ్ఞాపక చిహ్నంగా ఇచ్చిన బంగారు రంగు కేశాన్ని నేనొక బంగారపు పెట్టిలో భద్రంగా దాచాను. ఒకరోజు ఆ పెట్టి దేవయాని చేతిలో పడింది. ఆ పెట్టిలో ఏముందో చూపించమని పట్టుబట్టింది. చివరికి నేను తెరచి చూపించాను. ఆ బంగారు రంగు కేశాన్ని చేతిలోకి తీసుకుని నన్నడిగింది - 'మీ ఈ ప్రేయసి ఇప్పుడెక్కడుంది?'.

'ఆమె నా ప్రేయసి కాదు, చిన్ననాటి స్నేహితురాలు' అని చెప్పాను! ఆమె సంశయంగా మళ్ళీ ప్రశ్నించింది, 'ప్రస్తుతం ఎక్కడుందో ఆమె!' నేను ఆకాశం వైపు చూశాను.

ఆమె నవ్వుతూ ........ 'ఐతే ఈ వెంట్రుకను భద్రంగా ఎందుకు ఉంచినట్లో' అన్నది.

'ఆమె జ్ఞాపకార్థం'

ఆమె వ్యంగ్యంగా ఇలా అడిగింది, 'ఒకవేళ రేపు నేను మరణిస్తే'

'నా మామూలు జ్ఞాపకాన్ని కూడా మీరు ఉంచుకోరు. బహుశా, ఈమె అంటే

చాలా ప్రేమకదా? అందుకే పాపం, చా .......... లా భద్రంగా దాచి ఉంచారు ఈ వెంట్రుక!.....''

ఆమె ఆ వెంట్రుకను పారవేయాలనుకుంది. ఈపీడ దగ్గర మరలా ఆ వెంట్రుక తీసుకొని భద్రపరచడం ఎంత కష్టమో నాకు తెలుసు!.

ఒకరోజు, ఆమె నిద్రలోనే ఏదో మాట్లాడుతున్నట్లనిపించింది. ఎవరితో మాట్లాడుతుందో తెలీదు!

స్వప్నంలో, బహూశా నాతోనే మాట్లాడుతుండవచ్చు? అంటే దేవయాని నన్ను అంతగా ప్రేమిస్తుందా? స్వప్నంలో కూడా నాతో ..........! నా శరీరం గుగ్గుర్పొడిచింది ఆనందంతో! అతిశ్రద్ధగా చెవులురిక్కించి వినడం మొదలెట్టాను.

ఆమె నిద్రలో కలవరిస్తుంది, ఆం ..... హం ........ బహూశా, ముద్దుపెట్టుకోబోతుంటే తిరిస్కరిస్తున్నట్లుంది. నిశ్చయంగా, నేనే ఆమె కలలోకి వచ్చి ఉంటాను.

ఆమె ఇంకా ఇలా అంటున్నది - 'ఎంత! అందంగా ఉన్నాయి ఈ పూలు! కాని ........' కొంచెం ఆగి మరలా అంది, 'ఆం హాం! నా జడలో మీరే స్వయంగా మీచేతితో ఈ పూలను ........'

మరలా కాసేపు స్తబ్ధత, అటుతరువాత 'లేదు? మీరుగాని అలంకరించకపోతే? నేను ఈ పూలని నలిపి - నలిపి పారేస్తాను?'

ఆమె ముఖంపై చిరునవ్వు అదృశ్యమైపోయింది. ఇంక ఆమె కలవరించడం నిలిచిపోయింది. నిద్రలో ఇవన్నీ ........ ఎవరితో అంటోందో! నాకు అర్థంకావటం లేదు. ఆమె నీవు నువ్వు అని సంబోధించక మీరు అని సంబోధిస్తోంది. అలంకరిస్తారా అని మన్నించి మాట్లాడుతోంది!

ముందు రాత్రి కల జ్ఞాపకముందో లేదో తెలుసుకోవడానికి నేనిలా అన్నాను. 'ఈ రోజు ఒక ధార్మిక కార్యక్రమాన్ని నెరవేర్చాలి! స్నానం చేసిన తరువాత నీవు.........'

'ధార్మిక కార్యం? ఈరోజు అలాంటి పండగ ఏమీ లేదే!'

'ఇదొక కొత్త పండగలే'.

'దానికి ఏదో పేరుంటుంది కదా?'

'దాని పేరు ........ పేరు - గౌరీ పూజా!'

'అదెలాగూ రోజూ జరిగేదే!'

'ఆం..... హాం. ఈ గౌరీ వేరులే. సూర్యుడు, వరుణుడు, మరుత్తు మొదలైన దేవతలతో సమానమది! ఆమె స్వర్గనివాసిని కాదు'.

'మరెక్కడ?'

'ఆ పూజ ప్రతి ఇంట్లో జరుగుతుంటుంది. దాని వలననే ఇల్లు స్వర్గ సమానంగా ఉంటుంది. భార్యాపూజ ఈ పండగలో ముఖ్యభాగం'.

ఆమె నవ్వుతూ ........ అడిగింది, 'ఈ పూజా విధానం ఏమిటి? దేవతకు భక్తుడంటేనే భయం కలిగే పూజకాదు కదా?'

'లేదు! లేదు! విధానం, చాలా సులువు, సరళం కూడా. పతి, తన పత్ని కురులలో సువాసన కల్గిన అందమైన పూలను అలంకరించడమే!'

'ఓస్, ఇంతేనా?'

'అం.....హాం.. అంతేకాదు, ఆపూలను తనివితీరా ఆఘ్రాణించడం! ప్రసాదం తీసుకోకుండానే ఏపూజకూడా పరిసమాప్తం కాదుగదా?'

'చూడండి, నేనా, హస్తినాపుర మహారాణిని. మీరు ....... మహారాజు. ఇలాంటి లేనిపోని చిలిపిచేష్టలు ఎవరైనా దాస - దాసీలుగాని చూస్తే మన ప్రతిష్ఠ - మర్యాద ఏమౌతుందో, ఒక్కసారి ఆలోచించండి'.

ప్రతిష్ఠ, మర్యాద, గౌరవం లాంటి విషపూరిత శబ్దాలు మొదటి చెవులలోను, పిదప హృదయంలోను పదేపదే గ్రుచ్చుకోసాగాయి. అమ్మకూడా ఇవే పదాలను ఇది వరకు ప్రయోగించింది! ...... అలకకు విషం పెట్టిన పిదప! రాజవంశం యొక్క ప్రతిష్ఠ! రాజమహలు ప్రతిష్ఠ! మనిషిని జీవసమాధిచేసి, ఆ స్థానంలో నిర్మించే సుందర మైన సమాధే ఈ ప్రతిష్ఠ.

ఒకవేళ ఈ దేవయానికూడా, తన తల్లి సంస్కారాన్ని పుణికిపుచ్చుకున్న వారసులారా? ప్రపంచం మారిపోతున్నది. తరాలు మారిపోతాయి, కాని మనిషి మాత్రం? మనుషులెప్పటికీ మారరా?

# అధ్యాయం 12

అప్పుడప్పుడూ అనిపిస్తుంటుంది, నేను చెప్పాలనుకున్నది సరిగా చెప్పలేక పోతున్నానేమో అని! మనిషి మనసు విప్పి పూర్తిగా ఏమీ చెప్పలేడా? ఈ హృదయంలో ఎన్ని ద్వారాలుంటాయి? లజ్జ, సంకోచం, ప్రతిష్ఠ - వీటన్నింటిని ఒక పక్కనపెట్టి దేవయానితో నా సహజీవనపు తొలి సంవత్సరాన్ని అభివర్ణించాలని ఉంది. ....... కాని,

అది చాలా కష్టం, చాలా - చాలా కఠినం. కాని ఒక్క విషయంమాత్రం నిశ్చయంగా చెప్పగలను, నాలోని అసంపూర్ణత నన్నెప్పుడు గుచ్చి - గుచ్చి విసిగిస్తూంది. అందుకే నేను పూర్ణత్వపు పిపాసిని. ఆ పిపాస శారీరకంగాను, మాన సికంగానూ, రెండు విధాలా ఉంది.

దేవయాని కొంచెం ........ శారీరిక సుఖాన్నిచ్చింది. ఆ ఋణాన్ని నేనెప్పుడూ కాదనలేను. కాని, అప్పుడు కూడా ఆమెలో ఆ ఉత్కంఠ, కామోద్రేకంలేవు. చాలా సార్లు నిద్రసాకుతో ఆమె పరుండిపోయేది. శయన మందిరంలో అడుగుపెట్టిన పిమ్మట నాకీ విషయం స్ఫురిస్తుంది. నేను ఇంత నెమ్మదిగా, అడుగుల చప్పుడు వినపడనంత నెమ్మదిగా ఆమె దగ్గరకు చేరి, ముద్దు పెట్టుకుంటాను, ముద్దుపెట్టుకొనే టప్పుడు నేను మాత్రమే పులకించిపోతాను. ఆమెలో ఎటువంటి కదలిక ఉండదు.

అలాంటి సమయంలో నాకు, అశ్వమేధయాగ పర్యటనలో మన్మథుని భార్య రతీదేవి శిలాప్రతిమను ముద్దుపెట్టుకున్న సంఘటన జ్ఞప్తికి వస్తుంది. అటువంటి చుంబనంతో నాశరీరంలో ఎలాంటి సుఖానుభూతి కలుగదు. నా ఒంటరితనం, అసంతృప్తి అలాగే మిగిలిపోతాయి - సూర్యుని వెలుగులో తిరిగే గ్రుడ్డివాడిలా!

మేమిద్దరం శారీరికంగా దగ్గరైనా, మానసికంగా మాత్రం కాదు అని తరచు అనిపిస్తుంటుంది.

అనురాగం అంటే ఏమిటో నేను 'ముకుళిక' వద్ద నేర్చుకున్నాను. ఆమె అనురాగం మహారణ్యంలోని అపరిచిత ముళ్ళదారి లాంటిది. ఎవరికి తెలుసు? ఆ దారిలో కాటువేయడానికి అనేక విష, సర్పాలు పొంచి ఉండి ఉండొచ్చు. కాని, దేవయాని అనురాగం అలాంటిది కాదు. మెకు దాగుడుమూతలతోగాని లేదా పాపపు ఆలోచనలతో గాని ఏమాత్రం సంబంధంలేదు. ఆమె అనురాగం అతి పవిత్రమూ, ధర్మ సమ్మతమూ అయినది. అది ఒక అందమైన రాజమార్గంలాంటిది. ఆమార్గంలో ఎన్నో రంగవల్లులు అలంకరించబడి, జపాకుసుమాలు పరుచబడి ఉంటాయి. ఆ మార్గం అత్యంత సుకుమారం, సుందరం.

కాని...... అటువంటి మార్గంలో కేవలం నేను ఏకాకిగా పయనిస్తూ ఉండేవాణ్ణి!.

నేను పూల సుగంధం లాంటి అనురాగాన్ని కోరుకునే వాడిని, కనులకు కన్పించనిది, నలుదిశలా మంద్రంగా, మధురంగా జల్లులు కురిపంచే అనురాగం! కాని....... అలాంటి ప్రేమ - అనురాగం దేవయాని నుండి నాకెన్నడూ లభించలేదు!.

సముద్రంలో ఈదులాడే ఆనందం తనివితీరా పొందాలంటే ఒడ్డును విడిచి కాస్తే లోతుకు వెళ్ళవలసి ఉంటుంది, ఒక్కొక్కసారి కెరటాల కౌగిలి లభిస్తుంది. ఒక్కొక్కసారి వాటి గిరవాటులను కూడా అనుభవించవలసి ఉంటుంది. క్షణ - క్షణం ఉప్పునీటి ముద్దులతోనే తీపి అనుభవాన్ని పొందాల్సి ఉంటుంది, నీలిరంగు నీళ్ళలో ఈదుతూ, నీలంగా అందంగా కన్పిస్తున్న చెలియలకట్టను తన బాహు వులతో బంధించాలనే కోరిక కూడా కల్గుతుంటోంది, మృత్యుకూపంలోనే నవ్వుతూ సముద్రపు అమరగీతానికి వంత పాడవలసి వస్తుంది. ప్రేమికునికి మత్తులో తనకు తాను ఒరిగి పోవలసి కూడా వస్తుంది. అణువణువులో వికసించే పూలను నలిపివేసి వాటి సుగంధాన్నుండి దూరమవ్వవలసి వస్తుంది.

దేవయాని ఎప్పుడు కూడా ఈ విషయాన్ని ఎరుగదు. తెలుసుకోలేదు, తెలుసుకోవాలనే ప్రయత్నంకూడా చేయలేదు. సరికదా, ఆమె - బహుశా తెలియ కేనేమో నా ఆవేశపూరితమైన ప్రేమని ఉపేక్షించింది! నేను ఎప్పుడు కూడా ఆమె సమక్షంలోనే ఒంటరితనమనే బాధను అనుభవించాను.

పోనీ, కనీసం మానసికంగానైనా ఒకటైందా? అంటే అదిలేదు!

ఆమె ఎప్పుడు కూడా, తాబేలులా తనకవసరమైనంత వరకే, తన కవచంలో నుండి తలను బయటికి తెచ్చేది, ఆ కవచం కేవలం శరీరానికి సంబంధించినదే కాదు. మానసికమైనది కూడా. ఆమెకు ఎప్పుడైనా ఏదైనా వస్తువు అవసరమనిపిస్తే దాన్ని పొందేవరకే కాస్త బయటపడి మరలా కవచంలో దూరిపోయేది - సిద్ధిపొందిన హఠయోగిలా అదృశ్యమయ్యేది! ఆమె మానసిక కవచంలో కేవలం ఒకేఒక్క వ్యక్తికి స్థానముండేది - ఆ వ్యక్తి - ఆమె తండ్రి శుక్రాచార్యుడు! అక్కడ నాకు కూడా కాస్త స్థానమిస్తే ........! అలాగయితే ఈ యయాతి జీవితం అత్యంత అద్భుతంగా ఉండి ఉండేది.

ఈ 'అయితే' మరియు ఆయి ఉంటే వంటి పదాలు కేవలం 'గగన-కుసుమాల వంటివి', దేవయాని లాంటి అందమైన భార్యను పొంది కూడా నేను శారీరిక మానసిక సంతృప్తిని పొందలేదు అనేది నిజమా! ....... ముమ్మాటికి నిజం!'

కామవాంఛ - ఒక రకంగా ఆకలే - మధ్యాహ్నపు ఆకలి లాగ, అర్ధరాత్రి నిద్రలాగ - నిద్రలో దాహంలా, చాలా విచిత్రమైనది సుమా ఈ ........ ఆకలి! ఎంత సూక్ష్మమో అంత తీవ్రంగా కూడా ఉంటుంది.

ప్రేమలో, శారీరకమైన ఆకలి ఏదైతే ఉంటుందో, దాన్ని అభివర్ణించడం అతి సరళం, యౌవనంలో అడుగుపెడుతూనే, ఎవరైనా సరే ఈ అనుభూతిని పొందు తారు. కాని ప్రేమలో మనోసంబంధమైన ఆకలి ఏదైతే ఉంటుందో, అది చాలా విచిత్రంగా ఉంటుంది. నేను కూడా దాని స్వరూపాన్ని స్పష్టంగా వివరించలేక పోతున్నాను. దేవయాని, నేను ఏకశయ్యగతులమై వున్నా ఎన్నోసార్లు ఒంటరితనం భరించలేకపోయేవాడిని

ఒక్కోసారి అనిపిస్తూ ఉంటుంది, నేను ఏదో నిర్జన ద్వీపంలో ఉన్నానేమో అని! ......... ఆ ద్వీపపు ఇసుక తిన్నెలపై ఎప్పుడూ కూడా మానవ పాదముద్రల జాడేలేదు. ఇచ్చట పశు, పక్షి, వృక్ష, లతాది వస్తువులు ఏమీలేవు. అతి నిశ్శబ్దంగా, బంజరుగా పెద్దపెద్ద రాతిఫలకాలతో నిండి ఉంది ఈ ద్వీపం. సాగరా వృతమైయున్న ద్వీపపు రాతిఫలకాలపై క్రోధంతో సముద్రకెరటాలు ఛళ్ళుమని

కొడుతున్నాయి. ఇక్కడ, కేవలం స్మశానంలో భూతాల అరుపులాంటి భయంకర మైన గాలి ఒక్కటే నాకుతోడు! సూర్యుని వెలుగులోనైతే ఈ ద్వీపంయొక్క నిర్జన త్వంలో ఒంటరితనం సహించలేనిదిగా ఉంటుంది. ఇక చీకటిలో రాత్రి అంధ కారంలో దీని భయంకర స్వరూపం గురించి వేరే చెప్పాలా!.

అటువంటి భయంకరమైన ఒంటిరితనంలో నేను జీవించవలసివచ్చేది. అక్కడ నాకు ఎనిమిది ఝాములూ ఎవరో ఒక సహచరి ఉండి ఉండాల్సింది. ఎవరితోనైతే నేను నా మనసులోని మాటలు చెప్పినా దుఃఖభారాన్ని కొంత తగ్గించుకోగలనో, ఎవరితోనైతే నేను హాస్య - పరిహాసంగా సరస - సల్లాపాలాడ గలనో, ఎవరితొడపైనైతే నేను నా తలను ఆనించి పడుకోగలనో, ఒకవేళ ఆమెకు తేలు కుట్టినా ఆ బాధను సహిస్తూ నా నిద్రను నిర్విఘ్నంగా కొనసాగనిచ్చేటటు వంటి మనసైన మగువతోడు ఉండాల్సింది. ఆమెతో నేను నా బంగారు కలలల గురించి చెపుతూ ఆ కలలను వర్ణిస్తూ అందు దొర్లే తప్పులను ఒప్పుకుంటూ ఉండాలి. నేను అటువంటి సహచరినే అన్వేషిస్తూ వుంటేవాడిని. నా ఈ నిర్జన ప్రదేశంలోని ఒంటరి తనాన్ని పోగొట్టి, నాలో ఆత్మ విశ్వాసాన్ని పెంపొందించి, 'ఏమండీ! ఇక్కడ త్రాగడానికి - తినడానికి ఏమీ దొరక్కపోయినా, మనం ఇరువురం అధరామృతాన్ని సేవిస్తూ జీవిద్దాం', అని చెప్పగలిగే సహచారిణి, నా ప్రాణాలను హరించడానికి ఒకవేళ యముడే తరలివస్తే, నవ్వుతూ ........ అతనితో, 'నా ప్రియునితోపాటు నన్నుకూడా తీసుకొని పొండి!' అని ఆత్మత్యాగం చేయ గలిగే స్త్రీని, సహధర్మచారిణిగా కోరుకుంటూ వుండేవాణ్ణి.

దేవయాని నాఈ ఆకలిని మాత్రం తీర్చలేకపోయింది.

ఒక్కసారి నేను దేవయానితో యథాలాపంగా అన్నాను, 'నాదొక చిన్నకోరిక, బహుశా అది ఈ జన్మలో తీరకపోవచ్చు!'

ఆమె నవ్వుతూ అన్నది - 'హస్తినాపుర మహారాజు కోరినా దొరకని విషయం - వస్తువు ఈ ప్రపంచంలో ఏం వున్నది?'

నేను వెంటనే అన్నాను - 'పేదరికం!'

'అంటే? దరిద్రుడుకావాలనే మీ కోరిక?'

'ఔను! ఒక్కొక్కసారి నాకు అనిపిస్తూ ఉంటుంది, ఎవరో బలమైన శత్రువు మన రాజ్యంపైకి దండెత్తివచ్చి, నన్ను ఓడించినట్లైతే అప్పుడు నీవు, నేను చాటు మాటుగా ఏదో అడవిలోకి వెళ్ళిపోయి, అక్కడ కొండ - కోనల్లో గుహల్లోనూ గడిపితే బాగుండేదని. నేను వేటాడిన జంతువుని తెస్తే, దాన్ని చక్కగా నీవు కాల్చి నాకు తినిపించాలనీ, నేను చెట్టెక్కి పండ్లుకోస్తుంటే నీవు క్రింద పడిన పండ్లన్నీ ఏరుతూ ఉండాలనీ, ఏదైనా పాము ప్రక్కగా సరసరమని వెళ్ళుతుంటే నీవు భయ పడి ఒక్క ఉదుటున నన్ను కౌగలించుకొంటే భయంపోయి ప్రేమ ఉప్పొంగాలనీ, గుహలో రాత్రి మనం ఒకరినొకరం సుదీర్ఘమైన ముద్దుల్లో ముంచేస్తుంటే, అప్పు డప్పుడు ఒక్కొక్క మిణుగురు పురుగు మన ముఖాలికి దగ్గరగా వచ్చి వెలుగు తూంటే, మన ఈ రహస్య సమాగమం యొక్క రహస్యాన్ని వనదేవత తెల్సుకుంటే, నీవు సిగ్గుతో తలదించుకొంటే ........'

ఇలా నేను చాలా సేపు వరకూ అభివర్ణించుకుంటూ పోతుంటే, దేవయాని నన్నుడెకిస్తూ ఇలా అంది, 'మహారాజా వారు పొరపాటున నహుషునింట్లో జన్మించి నట్లుంది! మీరు ఏ కవి ఇంట్లోనో ........'

కాని, నేను మాత్రం నహుష మహారాజు కుమారుణ్ణే, హస్తినాపురానికి రాజుని కూడా! అందుకే ఆమె నన్ను వివాహమాడింది. ఆమెకు రాజవైభవం అంటేనే ప్రేమ, మహారాణిత్వమంటే ప్రేమ, యయాతంటే ప్రేమకాదు, యయాతి కేవలం ఆమె ఇచ్ఛాపూర్తికి సాధనం మాత్రమే.

ఈ అనుభూతి నన్ను తరచూ విసిగిస్తూ ఉండేది. కాని, దేవయానిని సుఖ పెట్టడానికి నా శాయశక్తులా ప్రయత్నించాను. ఆమె అమ్మను అవమాన పరుస్తూం డేది. శర్మిష్ఠను కూడా సరిగ్గా బ్రతకనివ్వలేదు, రాత్రింబవళ్ళు తనకిష్టం వచ్చినట్లు ప్రవర్తించేది. ఆయినా నేనెప్పుడూ ఆమెకు అడ్డుచెప్పలేదు అది, నా మంచితనం కాదు, కేవలం బలహీనత మాత్రమే! తగాదాలు నాకు ఇష్టముండేది కాదు, దుఃఖంకూడా నాకిష్టముండేదికాదు. వీలైనంతవరకు జీవితంలో సుఖాన్ని అనుభవిం చాలనుకునేవాణ్ణి. పగలంతా దేవయాని ఆచరణపై కోపంగా ఉన్నా, చీకటి పడేసరికి ఆమెను కలవాలనే కోరిక కట్టలు తెంచుకొని బయటపడేది. ఎప్పుడూ అనిపించేది, ఇది బహుశా రెండు మనసుల కలయిక కాదు, అయినా, ఏమాత్రం సుఖానుభూతి లభించినా చాలు ఆమెతో అని ....... ...... తెలిసో, తెలియకో ఆమె మాత్రం

నన్ను తన సౌందర్య పాశంలో బంధించి వేసింది. కాని నాబాధను ఒక్కసారికూడా మనసు విప్పి ఆమెతో చెప్పలేకపోయాను.

మా వివాహమయిన కొద్ది కాలానికొక వృద్ధమంత్రి మరణం సంభవించింది. ఆతని పెద్దకుమారుణ్ణి మంత్రి చేయడం జరిగింది. కాని, అతని కార్యదక్షత మీద నాకు పూర్తి నమ్మకంలేదు.

అప్పుడప్పుడు అందిన సమాచారాన్నిబట్టి, ఉత్తర సరిహద్దు ప్రాంతంలో శత్రువులు ఉపద్రవం సృష్టిస్తున్నారని, తెలిసేది, అప్పుడప్పుడూ ఉపేక్షించినా, తరచు ఉగ్రుడనైపోయేవాణ్ణి. కాని, దేవయాని మాత్రం ఏఒక్కసారి కూడా నా ఈ ఆవేశానికి కారణం అడిగి తెలుసుకొనే ఆసక్తి చూపలేదు. నేను కూడా ఆమెకు చెప్పలేదు. ఎవరి మనసులోనైనా నా అనే భావనను ప్రేరేపించడానికి ముందు, వారి మనసును జయించవలసి ఉంటుంది. కాని దేవయానికి ఈ విషయమే అర్థంకాదు.

నిరంతరం, తన గురించి ఎవరైతే ఆలోచిస్తూంటారో, తననుతాను పొగుడు కుంటూ తనే గొప్ప అనుకుంటారో, రాత్రింబవళ్ళు తన దృష్టికోణంతోనే లోకాన్ని చూస్తారో, అంతేకాదు, తనకంటే ఈ ప్రపంచంలో దేనినీ గొప్ప వస్తువుగా అంగీ కరించరో, అలాంటి వాళ్ళకి బహుశా ఈ విషయం అర్థంకాదు. బధిరుడు సంగీతం విని రసానుభూతి పొందలేనట్లు, అంధుడు ప్రకృతిసౌందర్యం చూసి ఆనందించ లేనట్లు, అరసికులకి రసజ్ఞత ఎలా కలుగుతుంది! తననుతాను గొప్పగా భావించే వారు, మానసికంగా అంధులుగా వుంటారు.

దేవయాని కూడా అంతే, ప్రతి విషయం గురించి - తనదంటూ ఒక అభిప్రాయాన్ని ఏర్పరచుకునేది. ఈ దృఢ అభిప్రాయాన్ని ఎట్టి పరిస్థితిలోనూ మార్చుకోవడానికి సిద్ధపడేదికాదు. అంతేకాక ఆ విషయాన్ని ఇంకా గంభీరంగా, లోతుగా ఆలోచించి, తన అభిప్రాయాన్ని మరింతగా దృఢపరచుకునేది.

మా వివాహం తరువాత మొదటి వసంతోత్సవంనాటి మాట. ఆ ఉత్సవం చాలా ఆడంబరంగా జరిగింది. అడుగడుగునా, కొత్తగా వచ్చిన మహారాణిపై ప్రశంసాత్మక పూలవర్షం కురిసేది. ప్రతిరాత్రి అనేకమైన, ఆసక్తికరమైన మనోరంజక కార్యక్రమాలు జరిగేవి. మేమిద్దరం ........ వాటిని చూడటానికి వెళ్ళేవాళ్ళం.

మొదటిరోజునే, మా ముత్తాత పురూరవుని జీవితం ఆధారంగా రచించబడిన నాటకం ప్రదర్శించబడింది. అందులో మౌలిక కథావస్తువు - శృంగారం, కరుణ రసాలు ప్రధానంగా కలిగినట్టిది. అందుచేతనే ప్రేక్షకులు అందులో పూర్తిగా లీనమై పోయారు. పురూరవుని పాత్రధారి కేవలం ఆకర్షణీయమైన విగ్రహంకలవాడే కాక, నటనలోనూ, సంగీతంలో కూడా అతను తనకుతానే సాటి. అందుచేతనే ప్రేక్షకులు తమనుతాము మరిచి, నాటకంలో లీనమైపోయారు.

ఊర్వశి కొన్ని షరతులు విధిస్తూ పురూరవునితో సహజీవనానికి అంగీ కరిస్తుంది. అనుకోకుండా ఒకసారి పురూరవుడు షరతును అతిక్రమిస్తాడు, తత్ఫలి తంగా ఊర్వశి అతనిని విడిచి వెళ్ళిపోతుంది. పురూరవుడు పిచ్చివాడిలా అయి పోతాడు. ఆమెను అన్వేషిస్తూ, కొండకోనల్లోనూ, అడవుల్లోను సంచరిస్తూ తుదకు ఒక జలాశయం దగ్గరకు చేరుకుంటాడు. అక్కడ అతనికి ప్రియురాలు కన్పిస్తుంది. ఊర్వశిని మరలా తనతో రమ్మని అనేక విధాలా ప్రార్థిస్తాడు. అయినా ఆమె అంగీకరించదు. నిరాశతో అతను ఆత్మహత్యకు పూనుకుని ఇలా అంటాడు - 'ఊర్వశి! నీతో క్రీడించిన నీ పతి శరీరం ఈ ఒడ్డున ప్రాణరహితంగా పడిపోనీ! నేల వాలిపోయిన ఈ నా శరీరాన్ని క్రూరజంతువులు, తోడేళ్ళు చీరుకుని తిననీ!' అనగానే ఊర్వశి ఇలా అంటుంది, 'ఓ పురూరవా! మీరు ప్రాణాలు త్యజించవద్దు మీ శరీరాన్ని అమంగళకరమైన తోడేళ్ళకి ఆహారంగా వేయవద్దు. రాజా! ఒక్క విషయం ఎప్పుడూ జ్ఞాపకం ఉంచుకో, స్త్రీలతో ఎల్లపుడూ స్నేహంగా ఉండట మనేది అసంభవం, ఎందుకంటే వాళ్ళ మనసుకూడా తోడేళ్ళ మనసులాంటిదే'; అని చెప్పి ఊర్వశి అదృశ్యమైపోతుంది. రాజు, ఆమె అప్పటివరకు నిలబడిన ప్రదేశాన్ని కౌగలించు కోబోయి, మూర్ఛతో నేలమీద పడిపోతాడు.

ఈ చివరి దృశ్యం చూసిన ప్రేక్షకుల హృదయాలు వేదనాభరితమైపోయాయి. అంతా నిశ్చేష్టులైపోయారు. స్త్రీలకైతే ఊర్వశి పలికిన చివరి మాటలు చాలా కఠోరంగా తోచాయి. కొందరైతే ఆ మాటలు విని తలలు క్రిందకు వాల్చేసారు. ఆ మాటలకు కరతాళధ్వనితో హర్షం వ్యక్తంచేసింది దేవయాని ఒక్కతే. ఆ శబ్దంతో కరుణా రసభరితులైన ప్రేక్షకులు తేరుకుని, ఆమె వంక కోపంగా చూశారు. దేవయాని విజయగర్వంతో నవ్వుతూ నాపైపు చూసింది.

ఈ జన్మలో ఈ దేవయాని ఆ ఊర్వశి ఆయి ఉంటుందనీ; నేనేమో ఆ

పురూరవుణ్ణి అనిపించింది. అప్పటి ఆ బాధేకాదు, కనీసం అప్పటి ఆ సంఘటనే జ్ఞాపకము ఉండకపోవడం మంచిదనే నా అభిప్రాయం. అదే నా కోరిక.

రెండవరోజు కార్యక్రమంలో ఋగ్వేదంలోని అగస్త్య లోపాముద్రల సంభాషణపై ఒక ప్రహసనం ప్రదర్శించ బడింది. అగస్త్యుడు బ్రాహ్మణుడు. లోపాముద్ర క్షత్రియ రాజకన్య దేవయానిని, నేను ఆశ్రమంలో నూతిలోనుండి బయటకు తీసినప్పుడు ఆమె లోపాముద్ర ప్రస్తావన తెచ్చింది. అది గుర్తుకువచ్చి నేను ఎగతాళిగా అన్నాను, - 'నీవు లోపాముద్రగాను, నేను అగస్త్యుని గాను అభినయం చేస్తే ఎలా ఉంటుంది'.

ప్రహసనం మొదలైంది.

వివాహితుడై ఉండి కూడా అగస్త్యుడు చాలాకాలం వరకూ బ్రహ్మచర్యాన్ని పాటించాడు. కాని ఇప్పుడు అతనికి లోపాముద్రతో శారీరిక సుఖం పొందాలనే కోరిక కలిగింది. ఆతడు, ఆమెతో రతి సుఖాన్ని పొందాలని ఉబలాటపడుతూ అన్నాడు - 'ప్రతిరోజూ ఉషాబాల సూర్యోదయంతో ప్రపంచంలోకి వస్తుంది. కాని అదే ప్రతి సూర్యోదయం నిన్ను - నన్ను ముసలితనానికి దగ్గరరగా తీసుకు పోతోంది. ముసలితనంలో ఇంద్రియాలన్నీ శిథిలమైపోతాయి. శారీరిక సౌందర్యం వాడిపోతుంది. ప్రియా! లోపాముద్రా! ఈ కఠోర సత్యాన్ని తెలుసుకొని కూడా మనిద్దరం ఒకరికొకరు ఇలా దూరంగా ఉండడం, నీకు వ్యర్థమని పించటంలేదా? ఇలా విడిగా ఉండటం ఎంతవరకు సమంజసం? అందులో ఏం సుఖముంది?' అగస్త్యుని మాటలతో లోపాముద్రకు అతనిమీద అనుమానం కలుగతుంది. ఆమె అనుమానాన్ని దూరం చేయాలనే ప్రయత్నంతో అగస్త్యుడు - 'భార్యాభర్తల', 'రతి' సుఖంలో అనుచితం ఏమాత్రంలేదు. ఒకవేళ ఈ సంభోగం నిషిద్ధమే అయితే, ఆదిశక్తి స్త్రీ, పురుషలను వేరుగా ఎందుకు పుట్టించినట్టు?' - అని అంటాడు.

అయినా, లోపాముద్ర అతనిని కౌగలించుకోనివ్వదు. అగస్త్యుడు, అతని శరీరం ఎలా కామోద్రేకంతో వేడెక్కిపోతోందో చెపుతూ, మహానది, తన ప్రవాహానికి అడ్డువచ్చే కొండ కోనల్ని, చెట్టుపుట్టల్ని, ఎత్తుపల్లాల్ని అధిగమించి ఎలా బయట పడుతుందో, అలాంటిదే తన కామోద్రేకమని అంటాడు. చివరకు లోపాముద్ర తన

తలని భుజంపైవాల్చి ఇలా అంటుంది, 'మీరు పురుషులు బయటకి చెప్పు కుంటారు, స్త్రీలు బయటికి చెప్పుకోలేరు, కాని ఇరువురికీ ఒకే రకమైన సుఖాకర్షణ ఉంటుంది!'

ఈ ప్రహసనాన్ని ప్రేక్షకులు రసిక హృదయంతో - వివిధ ప్రతిక్రియల ద్వారా - స్వీకరించారు. కాని, దేవయానికి మాత్రం నచ్చలేదు, ప్రత్యేకించి ఆ చివరి దృశ్యం. ఆమె నాతో 'ఈ లోపాముద్ర ఒట్టి మూర్ఖురాలు. ఆ ముసలివానికి, నిన్న ఊర్వశి, పురూరవుడికిచ్చిన సమాధానం ఇచ్చి ఉండవలసింది!'

మూడవరోజు కార్యక్రమం దేవయానికి మంచి ఆనందాన్ని కలిగించింది. ఒక రాజు శత్రువుల రహస్యాన్ని తెలుకోడానికి, నాట్యగత్తె వేషంలోవెళ్ళి వారి రహస్యా లను తెలుసుకొని తిరిగి వచ్చేస్తాడు. వాస్తవానికి నర్తకి అభినయం నిజమైన నర్తకీయే చేస్తుంది. అది చూసి దేవయాని నాతో అంది, 'ఆ నర్తకీమణి వేషం రాజుకి బాగానే కుదిరింది కదా! మీకీవేషం సరిగ్గా సరిపోతుందా అని నేను చాలా కాలంగా అనుకుంటున్నాను. కొంచెంసేపు ఆలోచించిన తరువాత మరలా అన్నది, మీకు మునివేషం అయితే సరిగ్గా సరిపోతుంది!, జడలు, గడ్డమూ పెట్టుకుని, మెడలో రుద్రాక్షమాల, కాళ్ళకి పాంకోళ్ళు, చేతిలో దండమూ, కమండలమూ, చంకలో లేడి చర్మం పెట్టుకుంటే బహుశా నేనుకూడా మిమ్మల్ని గుర్తుపట్ట లేనేమో!'

అలా అని ఆమె గట్టిగా నవ్వసాగింది.

రంగస్థలంమీద నర్తకి చివరి నృత్యం ప్రదర్శించబడుతున్నది. నృత్యం చాలా రసవత్తరంగా సాగుతున్న ఆ సమయంలో నవ్వవలసిన విషయమేమిటో, ప్రేక్షకుల కెవరికీ అంతుబట్టటంలేదు.

నేను ఆమెను ఊరుకోమని సైగచేసాను. ఆమె నవ్వు ఆపివేసింది. ఆమె చేసిన ఎగతాళికి నేను కూడా ఎగతాళిగా అన్నాను,

'చిన్నప్పుడే నేను మా అమ్మకి మాటిచ్చాను!'

'దేని గురించి?'

'నేనెప్పుడూ సన్యాసినికానని!'

'అలాగా, చూస్తాను, మీరెందుకవరో!'

'అంటే, ఏమిటి నీ ఉద్దేశ్యం?'

నావైపు ఒక్కసారి చూసి ఆమె మరలా చాలాపెద్దగా నవ్వసాగింది.

## అధ్యాయం 13

ఉత్తర సరిహద్దు ప్రాంతంలో దస్యుల ఆగడాలూ రోజురోజుకీ ఎక్కువై పోతు న్నాయని వార్తాహరులు పదేపదే సమాచారం తెచ్చేవారు. మధ్యకాలంలొ తండ్రిగారి పరాక్రమం కారణంగా - ముఖ్యంగా ఆయన చేతిలో ఇంద్రుడు పరాభవం పొందిన కారణంగా - ఇలాంటి ఆటవిక జాతివాళ్ళు మారాజ్యంపై ఎప్పుడూ దండెత్తి వచ్చే వారు కాదు. మరలా ఒక్కసారి తండ్రిగారిలా నా పరాక్రమం, శక్తి చూపిస్తేగాని ఈ ఉపద్రవం బహుశా ఆగేటట్టు లేదని అనుకొని, సైన్యాన్ని తీసుకుని అక్కడకు వెళ్ళ డానికి నిశ్చయించుకున్నాను.

ప్రయాణానికి ముహూర్తం కూడా నిర్ణయించబడింది. సరదాగా సరస సలా పాలకు సమయముంటుదో లేదో తెలియదు. దేవయాని కూడా ఎప్పుడూ యుద్ధం చూడలేదు. యుద్ధం ఎంత భయంకరంగా ఉంటుందో కూడా ఆమె ఉహించనైనా లేదు! యుద్ధభీభత్సం అంటే ఆమెకు ఏమీ తెలియదు, కాని నేను ఆమెకు దూరంగా వెళుతున్నందుకుగానీ, యుద్ధంలోనాకు గాయాలు తగులు తాయేమోనని ఉహించిగానీ నా గురించి అమె ఆందోళన చెందితే చూడా లనిపించేది. తన గురించి ఇంకోక వ్యక్తి అలా ఆందోళన వ్యక్తంచేస్తే ఆ వ్యక్తి అపూర్వమైన ఆనందానుభూతిని పొందుతాడు. కేవలం ఆనందమేకాదు, ధైర్యం తెచ్చుకొనే శక్తి కూడా వస్తుంది, ఆందోళనతోకూడిన ఆ కన్నీళ్ళతో, కాని నేనూహించినట్లుగా దేవయాని అలా కన్నీరు కార్చలేదు - ఎప్పుడూ దుఃఖించలేదు.

అరుణోదయం అవుతూండగా నేను అమ్మపాదాలకు నమస్కరించి ఆశీర్వదించ మన్నాను. ఇక దేవయాని కుంకుమ పళ్ళెం పట్టుకుని, నాకు వీర తిలకం దిద్ది, హారతి ఇవ్వడం - ఇంకా మిగిలి ఉంది. శర్మిష్ఠ హారతిపళ్ళెం పట్టుకుని వచ్చింది.

ఇంక ఆమె దేవయానికి అందించబోతూ ఉంది. ఇంతలో ఎవరో ఒకదాసి త్వర - త్వరగా పరుగెత్తుతూ లోపలికి వచ్చి, ఇలా అన్నది, 'బయట ఎవరో దూత వచ్చాడు'.

'దూతా? ఎవరిదూత?'

'మహారాజు వృషపర్వుల వారి దూత! మహర్షి శుక్రాచార్యులవారి లేఖ పట్టు కుని........ తండ్రిగారి లేఖా? అంటే? ఆయన క్షేమమే కదా?'

దేవయాని బయటికి నడిచింది.

రాజపురోహితుడు, 'అమ్మా! మహారాణీ ముహూర్తం.......', అని గొణుక్కు న్నాడు. దేవయాని విన్నదో లేదో కూడ తెలీదు. ఆమె త్వరత్వరగా బయటకి వెళ్ళి పోయింది.

ముహూర్తం దాటిపోతోంది, పురోహితుడు విసుక్కున్నాడు. చివరకు శర్మిష్ఠను హారతిమ్మని అమ్మ ఆజ్ఞాపించింది. ఆమె నా నుదుటిపై కుంకుమ తిలకందిద్దింది.

శర్మిష్ఠయొక్క ఆ మొదటి స్పర్శ....... మనిషి స్వభావం స్పర్శచేతకూడా అభివ్యక్త మవుతుందా? దేవయాని నిస్సందేహంగా శర్మిష్ఠకంటె అందంగా ఉంటుంది - కాని ఆమె స్పర్శ నాకు ఎప్పుడూ రాతివిగ్రహం స్పర్శలా కఠోరంగా అనిపించేది. శర్మిష్ఠ స్పర్శ నాకు పుష్పలతలా కోమలంగా అనిపించింది.

హారతిఇచ్చి, నాతలపై అక్షంతలు వేస్తూ, అతికోమలమైన స్వరంతో వినిపించీ వినిపించనట్లుగా అంది - 'జాగ్రత్తగా ఉండండి!'

ఆ రెండు మాటలతో నా మనసు శాంతపడింది. నేను శర్మిష్ఠవైపు చూసాను. ఆమెకళ్ళు కన్నీటితో నిండిపోయాయి. దేవయాని నాకు ఇవ్వలేనిది, శర్మిష్ఠ నాకు అందిస్తూంది.

దేవయాని చిన్నపిల్లలా గెంతులేస్తూ తన తండ్రిగారి లేఖ పట్టుకుని లోనికి వచ్చింది. మూహూర్తం దాటిపోతుందని పురోహితుడు ఇంకా చిరుబురులాడు తున్నా, ఎవరూ అతనిని పట్టించుకోలేదు.

నా నుదుట కుంకుమ తిలకం చూసి దేవయాని అంది, 'అరే! నేనలాగే వెళ్ళిపోయానా?.......? హారతి ఇవ్వకుండానే! ......... వెంటనే ఆమె అమ్మవైపు తిరిగి అంది, అమ్మా, మహారాజు నిశ్చయంగా విజయులై తిరిగి వస్తారు. సరిగ్గా ఇదే సమయానికి తండ్రిగారి ఆశీర్వాదం కూడా ఆయనకు లభించింది'.

ఆమె లేఖ నా చేతికందించింది, చదవడానికి. నేను చదవడం మొదలెట్టాను.

'నీ క్షేమ - సమాచారం విని చాలా సంతోషించాను. ఇప్పుడు నేను తపస్సు చేసుకోనేంటందుకు నిశ్చయించాను. నిజానికి నా ముద్దుల కుమార్తెను ఒక్క సారి చూసి తపస్సుకు వెళ్ళాలని ఉంది! కాని .........'.

నీవు ఆశ్రమం విడిచి వెళ్ళిన నాటినుండి, ఈ ఆశ్రమం నాకు అప్రియంగా తోస్తున్నది. నాకు అడుగులకు మడుగులొత్తే శిష్యులున్నా, వృషపర్వ మహారాజు తన కంటిపాపలా చూసుకుంటున్నా, బాహ్యంగా ఏలోటు లేకున్నా, ఇంకా నా మనసులో ఏదో మూల తెలియని వెలితి, నాముద్దుల బిడ్డలేని లోటు ...... ......

అత్తవారింటికి వెళ్ళిపోయినా ఆడబిడ్డ యొక్క ప్రతి తండ్రికి ఇలాంటి మానసిక అవస్థ ఉంటుందో లేదో తెలియదు కాని, ఈ లోటుకు, ఈ దుస్థితికి కారణం బహుశా నీవు నాఏకైక పుత్రిక కావడం వల్లనేమో! నీకు ప్రియాతిప్రియమైన లతలు పూల భారంతో క్రుంగిపోతుంటే, నా మనసులో అనిపిస్తూ ఉంటుంది, నా దేవయాని గాని ఇక్కడ ఉండి ఉంటే, ఈ పూలనన్నింటిని శ్రద్ధగా కోసి నా పూజ కొరకు పూల సజ్జలో పోగుచేసి వుండేది. నీవు నాకై చేయించిన లేడిచర్మ ఆసనం పై కూర్చుంటేనే నాకు ఊరటగా ఉన్నట్లుంటుంది. నీ చిరుగజ్జెలు ఇక్కడే - ఆశ్రమంలో ఒక మూల - పడి ఉన్నాయి. ఆశ్రమం ఊడ్చేటప్పుడు ఎవరైనా శిష్యుడు వాటిని తీసి మరల ఎక్కడో పెడుతుంటే, అప్పుడు, అవి ఘల్లుఘల్లు మంటూంటే, నాకు అనిపిస్తూంటుంది-

'మా యజమానురాలు ఎప్పుడొస్తుంది' అని అడుగుతున్నాయేమోనని.

అలాంటి మనఃస్థితిలో, సమయం వ్యర్థంగా గడిపేకంటే, తపస్సు కొరకు కూర్చుంటే బావుణ్ణు అని అనిపించింది. సంజీవిని విద్యని గుప్తంగా ఉంచుకోలేక పోయాను. బహుశా శివుడు నాపై కోపంగా ఉండి ఉంటాడు. బహుశా ఇప్పుడు ఇంకా కఠోరంగా తపస్సు చేయవలసి వచ్చినా నమ్ము, నమ్మకపో నా చిట్టితల్లి! నీ

తండ్రి ఏదో ఒక అపూర్వమైన విద్యను పొందనిదే తపస్సును పరిసమాప్తం చెయ్యడు.

బహుశా నీవనుకోవచ్చు, ఎందుకు నాతండ్రి ఇలా శరీరాన్ని శుష్కింప జేసుకోవడం అని. కానీ, దేవయానీ, ఇది శక్తితో నిండిన ప్రపంచం. అలాటి అపూర్వ శక్తిని ఇదివరకు నేను సాధించాను. నా దుర్భాగ్యంవల్లనో - దౌర్భాగ్యం కాదు, మదిరాసక్తి కారణంగా - దాన్ని నేను పోగొట్టుకొన్నాను. కాని ఇలా ఏదో అలౌకిక శక్తితో సమస్త ప్రపంచంపై అధికారం చలాయిస్తూ గౌరవంగా జీవించడం వేరు, ఏ శక్తీలేక, ఎద్దు ఎండలోకి ఎనుబోతు నీడలోకి అన్నట్లు దుర్బలమైన, నీచమైన జీవితం జీవించడం వేరు. మొదటిరకం జీవితమే జీవితం. రెండవ రకం జీవితం, మృత జీవనంతో సమానం.

మృత్యువు తరువాత, ఆదిశక్తి నన్ను ఆకాశంలో జీవించమని ఆదేశిస్తే, నేను అక్కడే ఉంటాను, ఇతర నక్షత్రాలన్నింటికంటె ప్రకాశవంతంగా వెలిగేలా చేస్తే, నేను తప్పకుండా ఈ గగనమండలంలో ఉంటాను. ఒకవేళ అలాకాకపోతే, ఏదో మామూలు తారలా మిణు మిణుకుమంటూ ఈ గగనంలో ఉండేకంటే, భూ మండలంమిద శ్రేష్ఠమయిన రాయిగా జీవిస్తాను. అదే ఉత్తమం.

ఇప్పుడు ఎందుకు నేను తపస్సుకు తొందర పడుతున్నానని నీవు అనుకోవచ్చు. ఈ లేఖ అందినవెంటనే నీవు వస్తే, గుహలో ప్రవేశించక ముందే మనంకలవవచ్చు. మొదటి సంవత్సరం ప్రతి మూడు నెలలకొకసారి, రెండవ సంవత్సరం ఆరుమాసాల కొక్కసారి, ఒకరోజు గుహ వెలుపల ప్రజలకు దర్శన మివ్వడానికి వస్తుంటాను. ఆ తరువాత తపస్సు పూర్తి అయ్యేటంతవరకు గుహలోనే ఏకాంతంగా మౌనంగా ఉంటాను. ఆ తరువాత ప్రజల దర్శనార్థం గుహనుండి బయటికి రావడమో, రాకపోవడమో, అది ఆ పరమశివుడి మీద ఆధారపడి ఉంది.

లేఖ చదివేసి నేను పైకి చూసాను. శర్మిష్ఠ ఉత్కంఠగా నావైపు చూస్తూంది. బహుశా శుక్రాచార్యులవారు తన గురించి ఒక మాటవ్రాసి ఉంటారేమోనని, కనీసం ఆశీర్వాదం అనైనా వ్రాసి ఉంటారని, నేను ఆమెకు తెలియజేస్తానని అనుకుంది. నేనేమీ చెప్పకపోయేసరికి, నిరాశగా నిట్టూర్చింది. భావపూరితమై కరుణతోకూడిన ఆమె కనులు నన్నడుగుతున్నట్లనిపించింది నేనొక మామూలు

దాసిని, కాని నేను కూడా ఒక తండ్రి కుమార్తెనేగా! నాకు కూడా నా తల్లిదండ్రుల క్షేమసమాచారం తెలుసుకోవాలనే ధ్యాస అహోరాత్రాలు ఉంటుంది. నేనొచ్చి ఇన్ని దినాలు గడిచిపోయినా తండ్రిగారు ఒక్కసారి కూడా నాక్షేమ సమాచారం గురించి తెలుసుకోనే ప్రయత్నం చేయలేదు. దేవయాని మాత్రం తన తండ్రికి ప్రతి పది హేను రోజులకు లేఖ వ్రాసి పంపిస్తూంటుంది. వాటితో పాటు నేను కూడా పంపించవచ్చు. కాని తండ్రిగారికి లేఖలో ఏమని వ్రాస్తాను! దాసిగా ఉన్న నీ కుమార్తె చాలా సుఖంగా ఉంది అనా? లేక..... .....

అలా ఆలోచిస్తూ నేను గట్టిగా నిట్టూర్చాను. నా నిట్టూర్పు విని దేవయాని అంది - 'మహారాజా! మరోవిధంగా ఏమీ అనుకోవద్దు! నేను తండ్రిగారిని ఇలా చూసి అలా వచ్చేస్తాను. అక్కడ నేను ఎక్కువరోజులుండను. ఆడవాళ్ళు కన్న వారింటికి వెళ్ళినా, మనసంతా అత్తవారింటివైపే ఉంటుంది'.

రాజప్రాసాదం నుండి బయటపడవలసిన సమయం దాటిపోయిన కారణంగా పురోహితులు చేతులు నులుముకుంటున్నారు. కాని వారిని పట్టించుకోకుండా దేవయాని అంది, 'గొప్ప - గొప్ప ఋషీశ్వరులకు, మునీశ్వరులకు ఈరోజే ఆహ్వానం పంపించాలని అనుకుంటున్నాను'.

'ఎందుకు?' నేను ఆశ్చర్యంగా అడిగాను.

'తండ్రిగారిని కలిసి నేను తిరిగి వచ్చేసిన పిదప, ఆయన అభీష్టసిద్ధికి యజ్ఞం చేయించాలని అనుకుంటున్నాను. అప్పటికి మీరు కూడా తిరిగి వచ్చేస్తారు'.

నేను నవ్వుతూ అన్నాను - 'నేను దస్యుల ఉపద్రవాన్ని అంతమొందించ డానికి వెళ్తున్నాను. వాళ్ళని ఆహ్వానించడానికి కాదు! బహూశా నెల రోజులు పడుతుందో లేక ...... .......'.

'అదేం కుదరదు! మీరు మధ్యలోనే రావాలి. యజ్ఞం చూసి, ఒకవేళ అవసర మైతే మళ్ళీ వెళ్ళుదురుగాని'.

ఆమె మాటను గట్టిగా కొట్టిపారేయాలని అనుకున్నాను. కాని ఇంతలోనే దేవయానిని సమర్థించడానికి అమ్మ అక్కడికి వచ్చింది. బహూశా వార్ధక్యం కారణం

గానో, లేక దేవయాని తన అధికారాన్ని చేజిక్కించుకొన్న కారణంగానో అమ్మ, పారమార్థిక చింతనవైపు మొగ్గుచూపిస్తూంది. యజ్ఞానికి గొప్ప - గొప్ప ఋషులు, మునులు వస్తారు వాళ్ళ దర్శన భాగ్యం కలుగుతుందనే ఆశతోనేమో, లేక వాళ్ళ ఉపదేశ - ప్రవచనాలు వినే భాగ్యం నాకు కలగాలనేమో, అమ్మ దేవయానిని సమర్థించింది. కిమ్మనకుండా నేను అంగీకరించాను. ఆమె నాతో అంది, 'యజ్ఞానికి కావలసిన ఏర్పాట్లన్నీ పూర్తిచేసుకోనే నేను వెళ్తాను. కనీసం ఏబది మంది ప్రసిద్ధ ఋషి - మునులకు తగిన ఏర్పాట్లు చేస్తాను. కచునికి కూడా ఆహ్వానం పంపాలి......'

కచునికి? నేను ఆశ్చర్యపోయాను. కచుడంటే ఇంత ఆదర సత్కారం ఎందుకు చూపిస్తుందో? ఆ మొదటి రాత్రి నాతో చెప్పింది, కచునికి మద్యమంటే అసలుగిట్టదని, అప్పుడప్పుడు తన తండ్రి గొప్పతనాన్ని, అతని తపశ్శక్తిని గురించి చెప్తుంటే, ఏమోలే, అనుకునేవాణ్ణి! కాని, కచుడంటే ఈమెకు ఇంత ఇష్ట మెందుకో? సంజీవిని విద్య పొందడానికి అతడు శుక్రాచార్యుని ఆశ్రమంలో చాలారోజులు ఉన్నాడు. ఆరోజుల్లో బహుశా వీరి మధ్య ఏదో సంబంధం ఉండి ఉంటుంది? వీరి మధ్య ప్రణయభావన ఉండేదో లేక ఇంకా ఎలాంటి సంబంధమో?

ఒకసారి కలలో పూలగురించి దేవయాని కలవరించిది. అప్పుడు ఆ మాట లకు అర్థం, నాకు బోధపడలేదు. ఇప్పుడర్థమయింది, ఒక్క క్షణంలో! బహుశా అప్పుడు స్వప్నంలో కచునితోనే ....... మాట్లాడి ఉంటుంది. అతను ఆశ్రమంలో ఉండేటప్పుడు ఈమె గురించి పూలుకోసి తెచ్చి ఉండి ఉంటాడు, ఆ పూలని తన చేతితోనే తన కురులలో అలంకరించమని అడిగి ఉంటుంది, అదే ఈమె కోరిక ......!

ఇదే ప్రణయ భావంతోకూడిన స్త్రీ కోరిక, మామూలు సఖితో అయి ఉండదు,

వద్దు! కచుని ఈ యజ్ఞానికి పిలవవలసిన పనిలేదు.

నేను శర్మిష్ఠను చూసాను. కచుని ప్రసంగం రాగానే, ఆమె వాడిపోయిన ముఖం మరలా వికసించింది. ఈమె కూడా ఒకసారి చెప్పింది, కచుడే తనకు ప్రేమించడం ఎలాగొ చెప్పాడని, అంటే దానర్థం? ఏమైనా కాని! కచుడు ఇక్కడికి

వస్తే, శర్మిష్ఠను తప్పకుండా కలుస్తాడు, బందీగా జీవిస్తున్న ఈ అభాగ్యురాలికి కాస్త అయినా సుఖం దొరుకుతుంది.

నేను దేవయానితో అన్నాను, 'మహామంత్రి సలహాతో అందరికి ఆహ్వానాలు పంపించు. ఆం........ అందులో అంగీరస మహర్షికి పంపించడం మరచిపోవద్దు'.

అలా అంగీరసమహర్షి అనుకోకుండా జ్ఞాపకం రావడంతో, ఉత్తరభాగంలో, హిమాలయ పర్వతాల సుందర శిఖరాలు కన్పించసాగాయి ..... ...... ......... ఆ శిఖరాలలో శంకరుని త్రిశూల ఆకారంలో ఆ శిఖరం ...... ఎన్నిసార్లు చూసినా తనివి తీరదు - ఆ అభిమాలంలో పదే పదే నాకు యతి జ్ఞాపకాలు చుట్టు ముట్టాయి. గత సంవత్సరం నేను అతన్ని బొత్తిగా మరిచేపోయాను. రాక్షస - రాజ్యం వెళ్తూ అక్కడ శుక్రాచార్యుని కుమార్తెను వివాహమాడి తిరిగైతే వచ్చేసాను, కాని యతిని వెతికి అతన్ని అడుగుదామని నిజంగా అతను ఇష్టసిద్ధి పొందడానికి, ఇల్లు విడిచి వెళ్ళిపోయాడా? ఒకవేళ అలా వెళ్ళిపోయి ఉంటే, ఆ తర్వాత అతనేమయ్యాడు? మనిషి కూడా, ఎలా అనుకోని విధంగా తనచుట్టూ తానే పరిభ్రమిస్తూ ఉంటాడో! అనేక గ్రామాలను సహితం ముంచి వేయగలిగే మహత్తర మైన వరదకంటె, దుఃఖంతో ఉప్పొంగే కన్నీళ్ళకే అధిక ప్రాధాన్య ముంటుంది. అలా కాకపోతే అహోరాత్రులు మా సహజీవనంలో దొర్లేతప్పుల పట్టిక మనిగీత లతో అంకితమైన నా మనోఫలానికి, తప్పని సరిగా యతి జ్ఞాపకానికి ఉండవల సింది. ఈ రోజు దస్యులు సృష్టించిన ఉపద్రవం కారణంగా మళ్ళీ పర్వత గుహల జ్ఞాపకం వచ్చింది. అలాగే హిమాలయ ప్రాంతంలో యతిని మళ్ళీ వెతుకుదామని ఒక్కసారి అనిపించింది. యయాతి మహారాజు సైన్యంతో సహావచ్చాడని తెలుసు కొని ఆ అడవిజాతి దస్యులు పారిపోయారు. ఆ కారణంగా ఇంక యుద్ధం చేయ వలసిన పనిలేకపోయింది.

పరిస్థితిబట్టి చూస్తే యతిని వెతకడానికి ఇదే తీరకైన సమయం అని పించింది. కాని, దేవయాని పదే - పదే జ్ఞాపకం రాసాగింది. అయితే, దేవయానితో నా ప్రేమ కేవలం శారీరికమైనదేనన్న విషయం తెలియనిదికాదు! కాని ఎందుకో ఆమె పట్ల వ్యామోహం! ఆప్రాంతంలో మరలా దస్యులు ప్రవేశించడానికి వీలులేకుండా తగిన ఏర్పాట్లు చేసి తిరిగి రాజధానికి చేరుకున్నాను.

శుక్రాచార్యులవారి గుహ - ప్రవేశ - ఉత్సవానికి హాజరై, దేవయాని, రాజధాని చేరుకుంది. యజ్ఞానికి కావలసి ఏర్పాట్లన్నీ భారీగా జరుగుతున్నాయి. అంతా ఆమె ఇష్టప్రకారమే జరుగుతున్నది. అయినా ఆమె నన్ను ప్రసన్నంగా ఆహ్వానించ లేదు.

ఆమె క్రోధానికి కారణమేమిటో ఆ రాత్రి తెలిసింది. మొదటి కారణం - అంగీరస మహర్షి లేఖ పంపిస్తూ అందులో ఇలా వ్రాసారు - 'ఈ యజ్ఞంలో పాల్గొనడానికి నేను రాలేను. శుక్రాచార్యులువారు చేస్తున్న తపస్సు సాత్వికమేనని, ఆ సిద్ధిఫలితాన్ని కల్యాణానికే తాను వినియోగిస్తాడని విశ్వాసం కలిగేవరకు నేను అతని అభీష్టసిద్ధి కొరకు ఆచరిస్తున్న ఈ యజ్ఞంలో పాల్గొనలేను'.

ఆ లేఖను నాముందు ఉంచుతూ దేవయాని అంది, 'ఎవడో ముసలి పీనుగ అయి ఉంటాడు, ఈ అంగీరసుడు! మా తండ్రిగారి గొప్పతనం చూచి ఓర్వ లేని వాడిలా ఉన్నాడు!'

అంగీరసుడు, కచుని గురువు అని నేను కావాలనే చెప్తే, ఆమె ఒక్కక్షణం విస్తుపోయింది. ఇంక కచుని నిందించసాగింది. వార్తాహరుడు కచుని కలుసుకో లేకపోయాడు! అతనెక్కడో తీర్థయాత్రలకు వెళ్ళాడట! అతని గురించి ఎదురు చూడకుండా, అతని కుటీరంలో ఆహ్వానం విడిచి వచ్చాడు, వార్తహరుడు. 'హస్తినాపుర ప్రజలందరూ ఇంతేనేమో! ఏ ఒక్కరికీ బుద్ధి ఉండదేమో!'

కచుడు రాకపోతే శర్మిష్ఠ చాలా నిరాశపడుతుందని నాకు తెలుసు. అందుకే నేనన్నాను, 'కచుడు వస్తే బావుణ్ణు! అతను నా బాల్యస్నేహితుడు కూడా!'

ఆమె చాలా గర్వంగా అంది, 'కాని అతను వస్తేమటుకు నాగురించే వస్తాడు. తండ్రిగారి కాళ్ళమీద పడి నేనే అతణ్ణి మూడుసార్లు బ్రతికించాను!

చాలా సేపటినుండి శర్మిష్ఠ గురించే ఆలోచన. నేను తిరిగి వచ్చినప్పటి నుండి ఎక్కడా చూడలేదు ఆమెను. అందుకే మామూలుగా ఆమె గురించి దేవయానిని అడిగాను. ఆమె అంది, 'ఆమెను అశోకవనం పంపించివేశాను!'

'ఏం? ఎందుకని?'

'అక్కడికి చాలామంది ఋషులు, మునులు వస్తారు, వాళ్ళ ఆదర - సత్కారాలు చూడాలి గదా?'

ఆమె జవాబు నాకు బాధకల్గించింది. నేను ఊరకే ఉండటం గమనించి కాసే పాగి మరలా అంది 'ఇక మీదట కూడా ఆమెను అక్కడే ఉంచుతాను!'

'అక్కడా? వద్దు! రాజమహలులో నలుగురిలో తిరిగే అలవాటు కల్గిన రాజ కన్య ఆమె! ఆ ఏకాంత ప్రదేశంలో ఆమెకు బాగుండదు!'

'ఆవిడకు అక్కడ బాగోదా, లేక ఆమె లేకుండా తమరికి ఇక్కడ బాగుండదా?'

'ఏమిటా ప్రేలాపన?'

'అవును నేననేదాంట్లో తప్పేముంది? మీరే చెప్పండి, మీరు యుద్ధానికి వెళ్ళిబోయే ముందు మీకు కుంకుమదిద్ది, హారతిపట్టే అధికారం ఆమె కెక్కడది?'

'శుక్రాచార్యులవారి లేఖ వచ్చింది, అనగానే నీవు బయటికి వెళ్ళిపోయావు?'

'అంటే, నా తండ్రి మీద ప్రేమ చూపించగూడదనేగా మీ అభిప్రాయం? ఆ లేఖ పట్టుకొని, నేనేమీ హిమాలయాలకి పారిపోలేదే!'

'ఉఫ్ ....... ఫ్ ......... అమ్మ అలా చేయమని చెప్పిందామెకు ..........'

'ఎందుకు చెప్పారు? ఆమె క్ష ..... త్రి ....... య కన్య కదా! ఆమెకు నా కంటే శర్మిష్ఠ అంటేనే ఇష్టం, ఆమె దగ్గరదానిలా అన్పిస్తుందేమో? రక్త సంబంధ మేమో! బహుశా ఆమెను పట్టపురాణిని చేయాలని ఉండి ఉంటుంది మీ తల్లిగారికి!'

నేను నవ్వుతూ అన్నాను, 'అమ్మ, ఒకవేళ అలా అనుకున్నా, నువ్వు అలా జరగనిస్తావా?'

'ఆం ..... హాం! అదంత కష్టమైన పనేంకాదే? విషమిచ్చి అడ్డుతొలగించడం అత్తగారికి వెన్నతో పెట్టిన విద్యేకదా! అలాగే నన్నుకూడా ......... ........'

'ఇష్టం వచ్చినట్లు నిందలు వేస్తూ మాట్లాడటం మంచిదికాదు'.

'మీకేం మీరు మగవాళ్ళు, ఇంట్లో జరిగే గూడుపుటాణి మీకు తెలియదు, కాని మేము ఆడవాళ్ళం, పొగనుచూసి అగ్నిని అన్వేషించగలం! ఆవులిస్తే ప్రేగులు

లెక్క పట్టగలం. నన్నడగండి చెప్తాను. ఈ కోటలోనే మీ తల్లిగారు ఒక దాసికి విషమిచ్చి చంపేసింది! నాకంతా తెలుసులెండి!'

ఇలా సంభాషణ అనుకోని విధంగా మారడంతో నేను నోరు మెదపలేదు.

వాస్తవానికి, ఇలాంటి తీవ్రమైన సంభాషణ జరిగినందుకు నాకు ఆరాత్రి నిద్ర పట్టకుండా ఉండాల్సింది, కాని అందుకు విరుద్ధంగా ఆరోజు బాగా నిద్రపట్టేసింది. అంతేగాక ఆనిద్రలో, నా జీవితంలో ఎన్నడూరాని సుఖస్వప్నాన్ని చూసాను.

దేవయాని ఒక మంచికబురు(మంచివిషయం) నాచెవిలో చెప్పింది. చాలా తీయని కబురు(విషయం) అది! ఆడదాని జీవితంలో అది ఒక అద్భుత రహస్యం! ఆమె తల్లికాబోతున్నది.

నేను పులకించిపోయాను. దేవయానికి బిడ్డపుట్టబోతోంది! దేవయాని తల్లి కాబోతుంది! నేను తండ్రిని కాబోతున్నాను. పుత్రుడు లేక పుత్రికా? కుమారుడు పుడితే తను ఎవరిలా ఉంటాడు? తల్లి పోలికతో పుడితే, పుత్రుడు బాగా సుఖపడ తాడని అంటారు! దేవయానికి ఎవరైనా గాని - పుత్రుడో లేక పుత్రికా! కాని, మేమిద్దరం ఇక రోజూ భగవంతుని ప్రార్థించాలి, పుట్టబోయే బిడ్డ తల్లిపోలికతో పుట్టాలని!

ప్రస్తుతం మేము మానసికంగా ఒకటిగా లేకపోయానా, ఈ పుట్టబోయే సంతానం వల్లనైనా మేమిద్దరం చేరువకావాలి! మనుమణ్ణి చూసి, అమ్మ సంతోషం పడుతుంది. ఈమధ్య ఆమె చాలా ఉదాసీనంగా ఉంటోంది. లేదు! నేను ఆమెపట్ల మౌనంగా వ్యవహరించడం మంచిదికాదు! మనుమడిని ఆమె చేతిలోపెడుతూ అంటాను ......... ఏమని అంటాను? ఆం ......... అదే ........... ఇలా సరదాగ అంటాను.

నేనింకా అదే ధ్యాసలో ఉన్నాను. నేను తండ్రిని గాబోతున్నాను. న....... న... న............ అంటూ నన్ను ఎవరో పిలిస్తారు. దేవయాని తల్లిగాబోతూంది. ఒక బుల్లి ...... జీవి ......... ఆం ........ ఆం ......... ఆం........... అంటూ పిలవబోతోంది.

ఆ రాత్రి, ప్రతి క్షణం ........ ప్రతి నిమిషం .......... నా నిద్రాలత, కొత్త కొత్త కలల పూవులను విరబూస్తోంది. కలల అలల మీద హంసల అలా అనంత విహారం చేస్తూనే ఉన్నాను.

స్వప్నదేవత ....... ఎవరు? ఇలాంటి సుఖస్వప్నాలని నిజం చేయగలిగే శక్తి ఆ దేవతలకు లేకపోవటం చాలా విచారించదగ్గ విషయమే!

# అధ్యాయం 14

యాగం యథాప్రకారంగా పరిసమాప్తమయింది. అగస్త్యుడు, అంగీరసుడు మొదలైన ప్రముఖ ఋషులు రాకపోవడం తప్ప, మిగతా కార్యక్రమం యథావిధిగా జరిగిపోయింది. దేవయాని మాత్రం, కచుడు ఈరోజు వస్తాడు, రేపు వస్తాడు అని ఎప్పటికప్పుడు అనుకుంటూండేది. గాని, అతను రాలేదు సరికదా, అతని దగ్గర నుండి ఎటువంటి సమాచారమూ రాలేదు.

యాగానికి హాజరైన పెద్దలందరికీ, వీడ్కోలు సభ ఏర్పాటుచేయబడింది. ఆ ఉత్సవాన్ని తిలకించటానికి అమ్మకూడా హాజరైంది. ఆమె రాజసింహాసనానికి వెనుక తెరచాటున కూర్చుంది.

సస్యశ్యామలమైన భూమిలా, గర్భవతియైన స్త్రీ శరీరకాంతి అద్భుతంగా ఉంటుంది. ఈ విషయం నా మనసులో లీలగా మెదిలింది. సభలోకి దేవయాని నెమ్మదిగా అడుగిడగానే, నగర స్త్రీల ప్రశంసాపూర్వకమైన కన్నులు ఆమెనే చూస్తూ ఉండిపోయాయి, ఆ దృశ్యం చూసి, నా జన్మ ధన్యమైంది అనుకున్నాను.

దేవయానితోపాటు నేను, ఋషులకు మునులకు అభివాదం చేస్తున్నప్పుడు ఆమెతో కలిసి సింహాసనంపై ఆసీనుడై ఉన్నప్పుడు నా మనసు ఉవ్వెత్తున లేచే కెరటాలతో ఉప్పొంగిపోయిన సముద్రంలా ఆనందంతో నిండిపోయింది.

దేవయాని ఈరోజు ప్రత్యేకించి శర్మిష్ఠను అశోకవనం నుండి పిలిపించింది. బహుశా ఈ ఉత్సవాన్ని చూడడానికి పిలిపించిందని నేననుకున్నాను. సభలో చూసిన తర్వాతగాని, దేవయాని ఉద్దేశ్యం నాకు బోధపడలేదు. శర్మిష్ఠను తన ప్రక్కగా నిలిపి ఆమె చేత వింజామర వీయించుకోడానికి పిలిపించింది!.

మమ్మల్ని ఆశీర్వదించడానికి, ఋషి - మునులంతా చేతిలో అక్షంతలు పెట్టు కొని, ఆశీర్వచన మంత్రాలు ప్రారంభించారు. అప్పుడే మహామంత్రి నాచెవిలో 'బయట కచదేవులు వేచియున్నారు!' అని చెప్పగా, ఆ మాట దేవయాని చెవిలో కూడా పడింది. వెంటనే ఆమె 'మహామంత్రి! మీరు తక్షణం వెళ్ళి, అతన్ని సమ్మాన పూరితంగా తోడ్కొనివచ్చి, మునిశ్రేష్ఠుల ఆసనాలలో ఉచితమైన ఆసనంపై అతనిని కూర్చోబెట్టండి' అని ఆజ్ఞాపించింది.

'బహుశా, ఆయన లోనికి రావటానికి సుముఖంగా లేరు!'

దేవయాని, కోపంతో అడిగింది, 'ఏం? ఇతనికి కూడా, ఆ అంగీరసముని గాలి సోకిందా? రాజధానిలో ప్రవేశించి కూడా అతను మమ్ములను అవమానపరచాలను కుంటున్నాడా? అలా అయితే ..........'

'అం..... హాం...... హాం! అలాంటిదేమీలేదు, మహారాణీ! ఆయనతోపాటు మరొక తాపసి కూడా ఉన్నాడు - అతను ఉన్మాదస్థితిలో ఉన్నాడు! అందుకే కచదేవుడు బయటే ........'.

'ఇంకేమీ నాకు చెప్పవద్దు. ఆ యోగినికూడా అతనిపాటు తీసుకొని రండి! ఇదిగో, ఇలా చూడండి, నేను అతనికి - గురుపుత్రికను - సోదరిని అవుతాను! అతను లోనికి వచ్చిన తర్వాత అతనికి నమస్కారం చేయకుండా ఇలా సింహా సనం మీద కూర్చోవడం అంత ఉచితం కాదు. అలాగని మహారాణి సింహాసనం వీడి ఋషిగణం మధ్యగుండా అతనిని ఆహ్వానించడం కూడా సబబుకాదు. అందుచేత మీరు అతనిని సరాసరి సింహాసనం దగ్గరికి తీసుకొనిరండి. నేను అతనికి నమస్కారం చేస్తాను. తరవాత అతని ఆశీర్వాదం పొందుతాను. ఆ తర్వాత మీరు అతనిని ఉచిత ఆసనంపై కూర్చోబెట్టండి'.

మంత్రి మహారాణి ఇంతసేపూ దేని గురించి చర్చిస్తున్నారో ఎవరికీ అర్థం కావటంలేదు! పురజనులకేకాదు, ఋషిగణానికి కూడా అర్థంకావడంలేదు, దాంతో సభలో కలకలం చెలరేగింది. సభలోనివారి అందరి దృష్టివారిమీదే ఉంది. 'దయ చేయండి కచమహర్షిలవారూ, దయచేయండి' ఋషిగణంలో కొంతమంది స్పష్టం గాను, కొంతమంది అస్పష్టంగానూ అనడం వినిపించింది. సభలోని కొంతమంది స్త్రీ - పురుషులు, కచుని వైపు వేళ్ళు చూపిస్తూ, ఏదో గుస - గుసలాడారు.

అదొక అద్భుతమైన కథ, శరీరానికి గగ్గుర్పాటుకల్గించే కథ, కచుడు సంజీవినీ విద్య ఎలా పొందగలిగాడో, దానవుల పన్నిన - పన్నాగం నుండి ఎలా బయట పడ్డాడో, ఆబాల గోపాలమూ ఎరుగుదురు. అందుకే కచుని చూడగానే అందరికి అంత ఆనందం, ఆశ్చర్యం కలిగాయి. అందరి మనసూ పులకించి పోయింది.

కచుడు బాగా ముందుకు రాగానే, అతని కూడా వచ్చిన తాపసి వైపు చూసాను. నాకళ్ళను నేనే నమ్మలేకపోయాను, ఇది కలా ....... నిజమా! నాకు అర్థం కావటంలేదు.

అతనే యతి! అతను ఉన్మాదస్థితిలో ఉన్నాడు, ఈ విషయం, కచుడు ముందే మంత్రిగారితో చెప్పాడు. ఈ ఉన్మాద అవస్థ ఎలాంటిది? ఆత్మజ్ఞానం పొందిన కారణంగా అతను శారీరిక స్థితిగతిని కోల్పోయినాడా? లేక రకరకాల సిద్ధులు పొందడానిక ప్రయత్నించి ఇలా పిచ్చివాడయ్యాడా?

కచుని, ఆ బైరాగిని వెంటబెట్టుకొని మంత్రివర్యులు సింహాసనం దగ్గరగా వచ్చి ఎదురుగా నిలుచున్నారు. దేవయాని కచునికి నమస్కరించాలని నిలబడి పోయింది. ఆమె నిలబడి, నేను కూర్చుని ఉండడం సమంజసంగా ఉండదని, నేను కూడా నవ్వుతూ నిలబడిపోయాను. కచుడు నాకు మిత్రుడుకూడా.

దేవయాని కచునికి నమస్కరించబోతూ ఉంది, ఇంతలో అతని దృష్టి ప్రక్కనే నిలబడి వింజామర వీస్తున్న శర్మిష్ఠపై పడింది. అతను చికితుడయ్యాడు! ఒక్క సారిగా ...... 'అరె ....... రాజకన్య, నీవా, ఇక్కడ .......?'

వంగి సమస్కరించబోతున్న దేవయాని, వెంటనే తలపైకెత్తి కచునితో అంది, 'కచదేవా, ఈమె ఇప్పుడు రాజకన్యకాదు?'

'అంటే?'

'ఆమె ఇప్పుడు నా దాసి!'

'దాసి? నీ ....... దాసీ?'

జవాబుగా దేవయాని నవ్వింది.

అంతవరకూ యతి ఇటూ - అటూ బిక్కమొగంతో చూస్తూన్నాడు. ఒక్క సారిగా, శర్మిష్ఠవైపు, వేలు చూపిస్తూ, దేవయానిని అడిగాడు, 'ఏయ్ నీ దాసిని నాకు ఇస్తావా?'

ఒక బైరాగి తనను ఏయ్! అని ఏకవచన ప్రయోగం చేసినందకు దేవయాని, ఇంకొక సందర్భంలో అయితే అతనిపై విరుచుకుపడేది! కాని, బహూశా ఆమెకు, ఒక పిచ్చివాడు నిండుసభలో శర్మిష్ఠను అడిగినందుకు. ఆనందంగా అనిపించి ఉంటుంది.

ఆమె యతిని అడిగింది - 'ఈమెను మీరేమి చేసుకుంటారు స్వామీ? ఈమెను మీభార్యగా చేసుకుంటారా?'

కచుడు, యతివైపు కోపంగా చూసి వద్దని వారించాడు. అయినా అతను శర్మిష్ఠను అలా చూస్తూ ఉండిపోయాడు. ఈ సంఘటన పరిణామమేమిటో నాకు అర్థంకావటంలేదు. నేను బొమ్మలా నిలబడిపోయాను.

అన్నదమ్ములమిద్దరమూ ఎటువంటి సందర్భంలో కలుసుకుంటున్నామో! యతి పరిస్థితిని చూసి నాకు మళ్ళీ ఈ నహుషుని పుత్రులు సుఖపడరు అన్న శాపం జ్ఞాపకం వచ్చింది.

యతి బిగ్గరగా నవ్వుతూ అన్నాడు 'భార్యా! కాదు! నేను ......... ఈమెను మగవాడిగా మార్చేస్తాను!'

సభ నవ్వులతో ప్రతిధ్వనించింది. వెంటనే సర్వత్రా నిశ్శబ్దం, భయం అలముకొంది.

పరదా వెనుకనుండి, అమ్మకోపంగా అరిచింది - 'మహామంత్రీ! ఆ పిచ్చి వాడిని వెంటనే బయటకు పంపే ఏర్పాటుచేయండి. అతను, ఇంకా అసందర్భంగా మాట్లాడితే, కొరడాతో కొట్టించండి!'

మహామంత్రి సైగతో, సేవకులు అతణ్ణి పట్టుకోవడానికి వచ్చారు.

నాకేమి జరుగుతున్నదో అర్థంకావటంలేదు. నా మనసులో పదేపదే ఆ శాపం ...... ...... ప్రతిధ్వనించసాగింది! యతి పరిస్థితిని నేను చూడలేకపోతున్నాను,

నేనొక్క ఉదుటున లేచి గట్టిగా అరిచాను, - 'జాగ్రత్త, ఇతనిపై ఎవరైనా చేయి వేశారంటే, మర్యాద దక్కదు. ఈ సింహాసనంపై హక్కు అతనికే వుంది'.

దేవయాని గుడ్లప్పగించి నావైపు చూసింది. బహుశా, ఒకవేళ నేను గాని పిచ్చివాడి నయ్యేనేమో అని, ఆమె అనుకుని వుంటుంది. వెంటనే నేను శాంత స్వరంతో అందరికీ వినిపించేటట్లు సభలో ప్రకటించాను - 'ఇతను నా అగ్రజుడు! పేరు యతి!'

'యతి?' అని వినగానే అమ్మ 'యతీ!' ......... అని ఏడ్చుకుంటూ పరదాను తొలగించి, శిష్టాచార బంధనాన్ని తెంచుకొని పరుగెత్తి వచ్చింది. యతిని ఒక్కక్షణం అలా చూస్తూనే ఉండిపోయింది, అతని భయంకర స్వరూపాన్ని ఆమె చూడలేక పోయింది!. కళ్ళుమూసుకుంది. యతీ? నా యతీ? అంటూ రెండుచేతులు చాచుకుంటూ నేలకొరిగింది.

## దేవయాని

ఒకవేళ ఈ కచుడు, నా పూర్వజన్మ శత్రువు కాదు కదా? యజ్ఞ కార్యక్రమం అంతా ఎంతో చక్కగా - దిష్టితగిలేటంత చక్కగా ముగిసింది. కానీ చివరిగా ఇతను తగలడ్డాడు. ఆకాశం నుండి ఊడిపడినట్లు! చూస్తూండగానే చేసిన కార్య క్రమం అంతా వ్యర్థమయింది. సందడి అంతా అపహాస్యంపాలయ్యింది.

అప్పుడెప్పుడో నాకు శాపమిచ్చి, కచుడు వెళ్ళిపోయాడు. అతని శాపం నన్నేమీ చెయ్యలేదని తెలపటానికీ, నేనింత ఉన్నతస్థితిలో వున్నానో చూపడానికే నేనీ యజ్ఞం నెపంతో అతనికి ఆహ్వానం పంపింది. అతని శాపానికి విరుద్ధంగా ఇంత ఐశ్వర్యంతో, రాజభోగంతో కుబేరుణ్ణి తలదన్నినట్లున్నానని చూసి, అతని కళ్ళుకుట్టాలి. ఈ దేవయాని, ఆ దేవయాని నా! ఒకప్పుడు నా కుటీరం శుభ్రం చేయటానికి సిద్ధపడింది. ఈరోజు రాజసింహాసనాన్ని అధిష్టించిందా! అని అను కోవాలి. ఇదంతా చూచి అతను సిగ్గుతో తలవంచుకుని, నన్ను క్షమించమని అడగాలి.

మహారాణిగా మారిన తన ప్రేయసిని చూసి సహించలేని, కచుడు, ఈ యజ్ఞానికి రాడనే అనుకున్నాను. నాకు తెలుసు, అతను ఒకప్పుడు దేవయానిని గాఢంగా ప్రేమించాడు. మనిషి ప్రేమను తిరస్కరించగలడేమో కాని, మరచి పోగలడా?.

నా మనసు చెప్తోంది, కచుడు వస్తాడు, తప్పకుండా వస్తాడు, కాని యజ్ఞం ప్రారంభమయినా రాలేదతను, యజ్ఞం సమాప్తం అయినా రాలేదు. మహారాణిగా నా మనస్సు సంతోషించింది. కాని దేవయానిగా మాత్రం చాలా దుఃఖించాను.

సరిగ్గా సభకొలువుతీరి ఉన్న సమయంలోనే మంత్రి అతని ఆగమనవార్త తెచ్చారు. నాకు సంతోషం ఆగలేదు. శర్మిష్ఠ నా చీరకట్టుకుని మంచిపనేచేసింది. బహుశా అప్పటినుండే నా దశ తిరిగింది. లక్ష్మీదేవిని తలదన్నే ఆభరణాలను అలంకరించుకొని నేను సింహాసనంమీద ఆసీనురాలనై ఉన్నాను. వేలకొద్దీ కన్నులు నన్నే చూస్తుండిపోయాయి. రాజకన్య శర్మిష్ఠ నాకు దాసిగా వింజామరువీస్తున్నది. గొప్ప గొప్ప ఋషివర్యులు - మునిపుంగవులు వేదోక్త మంత్రోచ్చారణతో ఆశీర్వది స్తున్నారు. ఇప్పుడు ఈ విచిత్ర వాతావరణంలో కచుడు ....... దేవయాని ప్రేమని తిరస్కరించిన కచుడు, సిగ్గుతో తనుచేసిన పొరపాట్లకు తల్లడిల్లుతాడు.

ప్రేమానుభూతి వలన కలిగే ఆనందాన్ని కచుడు నాకెలాగూ దక్కనివ్వలేదు. అలా అని నాకిప్పుడు విచారంలేదు. ఇప్పుడు పగతీర్చుకోగలిగే అవకాశం వచ్చి నందుకు చాలా సంతోషంగా ఉంది ..... కాని ..... ఇలా చివరి క్షణంలో - నేను తీసిన గోతిలో నేనే పడ్డాను. పగతీర్చుకో గలినందుకు సంతోషం లభించింది, కాని, నాకు కాదు, కచుడికి!.

అత్తగారు, మహారాజు యయాతి, అందరూ ఒక్కసారిగా పిచ్చివాళ్ళలా వ్యవ హరించారు! మహారాజుకు సరిగ్గా అదే సమయానికి బంధుప్రీతి ఉప్పొంగింది. కొంచెం సేపు ఓపిక పట్టి ఉంటే, ఆయనదేంపోయేది? ఆ పిచ్చివాణ్ణి, నౌకర్లు బయటికి తీసుకొని పోయేవాళ్ళు! నాలుగు కొరడాదెబ్బలు కొట్టి ఉండేవాళ్ళు! దాంతో అతనికి ఉన్మాదం పోయి వాస్తవిక ప్రపంచానికి వచ్చేవాడు, తనెక్క డున్నాడు ఏం చేస్తున్నాడా, అతనికి తెలిసివచ్చేది.

అత్తగారు ఎప్పుడూ రహస్యాన్నిలోలోపలే దాచుకుంటుంది. ఆమె మనస్సు లోతైన బావిలాంటిది. లోపల ఏం, ఏమి జరుగుతుందో బయట ఎవరికీ ఏమీ తెలియ నివ్వరు! కాని, ఆమె కూడా............ తానొక రాజమాత అన్న సంగతి మరచిపోయి, రాజమర్యాదని, మంటగలిపింది. ఒక్కసారిగా పరదాతొలగించుకొని, 'యతీ! నా యతీ.......!' అని కేకలు వేసుకుంటూ బయటికి రావడమూ, నిండు సభలో వేలాది మంది సమక్షంలో ......... ఈ ఏడుపూ, ఆపైన మూర్ఛపోవడం ....... ఛీ ....... ఛీ ........ ఒక రాజమాతగా ఆమెకి ఇది తగినపనా?

ఆమె అలా మూర్ఛపోవడంతో సభలో కలకలం చెలరేగింది! మహారాజు కూడా పిచ్చిపనిచేసారు. ఆయన ఏకంగా ప్రకటించేసారు. ఇతను నా అన్నగారు, ఇతనే ఈ రాజసింహాసనానికి వారసుడు అని! ఇంకేముంది, ఋషుల ఆశీర్వాదం, మొదలైన వన్నీ ఎక్కడివక్కడ ఆగిపోయాయి. ఛీ! ఛీ! ఈ కచుడు ఇక్కడికి వచ్చి, తండ్రిగారి తపస్సుకు అపశకునం కల్గించాడు.

ఇంక, ఈ యతి ఎలాగూ పిచ్చివాడే! కాని, మహారాజు కాస్త తెలివిగా ప్రవర్తిస్తే ఏంపోయింది! యతి తన అన్న అని ఆయన ఒక్కడికే తెలుసు. ఆఖరికి (చివరికి) కచుడికి కూడా ఈ విషయం తెలియదు.

ఏదో గ్రామంలో అతణ్ణి అందరూ రాళ్ళతో కొట్టి ఆనందిస్తూంటే, అతణ్ణి చూసి కచుడికి దయకలిగి తనతోపాటు ఇలా తీసుకొచ్చాడు. కచుడు ఎలా గుర్తు పట్టగలడు, ఆఖరికి యతి తల్లి, మా అత్తగారే గుర్తుపట్టలేకపోయారు. ఒక్క క్షణం మహారాజుగాని ఓపిక పట్టి ఉంటే! ఇలా రసాభాస జరిగి ఉండేదికాదు.

ఈ నహుషుడి వంశానికి పిచ్చితనం శాపంకాదుగదా? ఈ యతి కూడా ఎంత విచిత్రమైన మనిషి! మరి మహారాజు తీరో - ఈ పిచ్చివాడు ఇంకా ఇక్కడ ఉండి ఉంటే ఏమేమి అనర్థంచేసేవాడో! ఒకవేళ రాజమాత, యతి పేరుతో రాజ్యభారాన్ని మోయమని యయాతిని శాసిస్తే! అలా ఎందుకు కాకూడదు! పుత్ర ప్రేమ, ఏమైనా చేయిస్తుంది. అప్పుడు నా గతి ఏం కావాలి? ఇప్పుడిప్పుడే మహారాణిగా చలా మణి అవుతూ, అందర్నీ నా ఆజ్ఞమేరకు తిప్పుకుంటున్నాను. అలా జరిగితే నాకు అవమానం జరగక తప్పదు. నాపై అసూయతో రాజమాత అలాచేసినా చేయొచ్చు. నేనా ఋషికన్యను! బ్రాహ్మణపుత్రికను! మహారాణిగా అర్హురాలు కానని చెప్పి నా

అధికారాన్ని వమ్ము చేయడానికి, యతిని రాజును చేయకుండా పీడుస్తుందా? ఆమె జ్యేష్ఠపుత్రుడు కూడా! మహారాజే స్వయంగా నిండు సభలో ప్రకటించారు, 'అతనికే ఈ సింహాసనంపై అధికారం ఉన్నది'.

ఛీ! మహారాజు ఒట్టి పిచ్చిపనిచేసారు నిండు సభలో! ఈ వంశమే అంత......

ఈ నహుషుడి వంశానికి కేవలం పిచ్చితనమే శాపంకాదు. కాముకత కూడా శాపమే. స్త్రీ వ్యామోహం కూడా వంశపారంపర్యంలా ఉంది. మా మామగారు ఇంద్రుణ్ణి కూడా పరాభవించారని అంటూంటారు! చేసి ఉండొచ్చు! ఇంద్రాణి సౌందర్యం చూసి ఆయన కామ మోహితుడుకాలేదా, మరి - అత్తగారు ఈ విష యాన్నీ నాదగ్గర దాచి పెట్టింది! అంతేకాదు, ఇక్కడ దాసీలు కూడా తక్కువాళ్ళే మీకాదు, ఇక్కడి విషయాలన్నీ ఒక ముసలి దాసీ నాకు చెప్పేసింది.

అలాంటి నహుష మహారాజు సంతానమిది! పెద్దపెద్ద జడలతో బైరాగి గుడ్డలు కట్టుకొని పిచ్చివాడిలా తిరిగే ఆ యతి! శర్మిష్ఠను చూసి అంతమంది ముందు - 'ఈమెను నాకిస్తావా' అని అడిగేసాడు. ఆ తరువాత కూడా కొంత అసందర్భంగా మాట్లాడాడు. అతని మాటలతో అందరికీ అప్పటికే అర్థమయి ఉంటుంది ఇతనిది ఎలాంటి పిచ్చో!

హుం ........ ఇందులో అతని తప్పేముందిలే? చిన్నప్పుడెప్పుడో ఇల్లు విడిచి అడవిలోకి పారిపోయిన పిచ్చివాడు. కాని, అంత పరాక్రమశాలి యయాతి! అశ్వ మేధయజ్ఞ సమయంలో దిగ్విజయం సాధించిన మహారాజు! రాజసింహాసనాన్ని అధిష్ఠించి రాజ్యకార్యాలను చక్కదిద్దే మహారాజు! అడవిలో ఎక్కడో నూతిలో నుండి బయటపడిన అందమైన స్త్రీని చూసి నీరుగారిపోయాడే! స్త్రీ, పురుషుణ్ణి, ఇట్టే పసిగట్టేస్తుంది. పురుషుని గుణగణాలు, అతని కళ్ళలోకి సూటిగా చూసి గ్రహింపచేస్తుంది. పురుషుని కళ్ళల్లో గుణ-దోషాలు స్పష్టంగా కన్పిస్తాయి. నేను నీతిలోనుండి బయట పడ్డానో లేదో, ఎంతో ఆకలిగా, ఎంతో ఆదుర్దాగా చూసారు మహారాజు నన్ను.

పురుషుడి కళ్ళలోకి చూసి ఇట్టే పసిగట్టేస్తుంది స్త్రీ, అతను కాముకుడో, కాదో అని! స్త్రీలను అతితేలికగా వశపర్చుకోగల శక్తి అతనికి కలదని అతని ఆకర్షణీయ

మైన చూపులనుబట్టి అర్థంచేసుకోగలదు. నూతిలోనుండి బయటికి వచ్చిన తర వాత 'నాకు భయం వేస్తుంది: చేయి పట్టుకుని ఒడ్డుకు లాగండి' అని తడి బట్ట లతో నిలబడ్డాను, అలాగే జరిగింది.

అతని స్థానంలో కచుడేగనుక ఉంటే? 'నా చేయి పట్టుకోండి' అనే ధైర్యమే నాకుండేదికాదు. ఒకవేళ ధైర్యంచేసి అన్నా - 'నీవు నూతిలో పడ్డావు. నిన్ను బయటికి తీయడం నా ధర్మం. దాన్ని నేను నెరవేర్చాను. ఇంక నీవు ఒడ్డుకి వస్తావో లేక మరలా నూతిలో దూకుతావో, అది నీ ఇష్టం'. అని ముక్కుసూటిగా అనే వాడు!.

కచుడు, అలా మాట్లాడుతూ వుంటే నాకు అతనిపట్ల ఆకర్షణ మరీ అధిక మవుతుండేది! ఆశ్రమంలోకి రాగానే, నన్ను వలలో వేసుకోవాలని నా వెనుకాలే తిరుగుతూ ఉన్నా, నా స్పర్శ గురించి పరితపించినా, నా అందాన్ని అలా రెప్ప వాల్చ కుండా చూస్తున్న .......... అలాంటి ఆలోచన కలిగివున్నా నేనతడివైపు ఆకర్షితురాలనై వుండేదాన్నికాదు. అతని కళ్ళలో ఎప్పుడూ 'ఆకలిచూపు'ను నేను చూడలేదు. అతని వ్యవహారంలో ఎప్పుడూ కూడ కాముకత మచ్చుకి కూడా కన్పించలేదు. స్త్రీలు అలాంటి పురుషులంటేనే ఇష్టపడతారు. ఏ పురుషులైతే ఆడవాళ్ళ వెంటపడతారో, అలాంటి వాళ్ళని స్త్రీలు అసహ్యించుకుంటారు. అలాగే ఏ పురుషుడైతే స్త్రీలకు దూరంగా ఉండాలనుకుంటాడో, స్త్రీలు అతనివెంటే పడతారు! ఏమిటో ఈ విచిత్రం.

ప్రాణాలు సహితం లెక్కచేయక, నాకిష్టమైన పూలుకోసి తెచ్చేవాడు కచుడు. ఆపూలే నాతో చెప్పేవి, కచుడికి నేనంటే ఎంతో ప్రేమని. అర్ధరాత్రప్పుడు కూడా నా చెవిలో చెప్పేవి, కాని, కచుడెప్పుడూ తన నోటితో అలా నాకు చెప్పలేదు.

ఒక్కసారి వనంలో నా కాలికిముల్లు గ్రుచ్చుకుంది. పాము కరిచిందని నేను ఊరికే తమాషాకి అన్నాను, అప్పుడు అతడి కళ్ళలో కన్నీరు, ఆ కన్నీళ్ళే అతడి మనసు గురించి నాకు చెప్పాయి.

కచుడికి పడుకోనేముందు, తోటలో మూలగా ఉన్న లతాకుంజంలోనికి వెళ్ళి ఆదిశక్తి ప్రార్థన చేయడం అలవాటు. దేవయానిని సుఖంగా ఉంచు తల్లీ! అని

ఒకసారి ప్రార్థిస్తున్నాడు. నా శరీరం పులకించిపోయింది. ఆ ప్రార్థనలోని పదాలే నాతో చెప్పాయి, కచుడికి నేనంటే ఎంత ప్రేమో! పదేపదే నా చెవులతో ఆవే మాటలు ప్రతిధ్వనించాయా, మధుర సంగీతంలా!

నేను అలాంటి ప్రేమను కోరుకునేదాన్ని. కాని, అందమైన ప్రతి స్త్రీని చూసి వెంటనే మోహించే పురుషుడు, ప్రేమికుడు, అవుతాడా? అతడు కేవలం కాముకుడే అవుతాడు. ఏ స్త్రీకూడా అలాంటి ప్రేమను కోరుకుని తనని - తాను సమర్పించుకోవాలని కోరుకోదు.

కాని, ఒక భగ్నప్రేమికురాలిగా, దుఃఖిత ప్రణయినిగా జపమాల తిప్పుకుంటూ జీవించాలని నేననుకోలేదు. కచుడు నా హృదయాన్ని గాయపరిచాడు. ఆ గాయాన్ని నేను మాన్పుకోవాలి. ఆ సంఘటన మరచిపోవాలి. అందుకే నేను నా లోని ప్రణయ భావాన్ని శాశ్వతంగా అణగద్రొక్కి బంధించేశాను. ప్రణయినిగా కాక యజమానురాలిగా జీవించాలని, ఆమత్తులోనే కాలం వెళ్ళబుచ్చాలని నిశ్చయించు కున్నాను. అనుకోకుండా, శర్మిష్ఠ నా చీరకట్టుకోవడం, నన్ను నూతిలో త్రోసివేయడం, మహారాజు యయాతి అదే నూతి దగ్గరికి రావడం అన్నీ ఒకేసారి జరిగిపోయాయి!. కాని, నూతిలోపడిన దేవయాని, నూతిలోనుండి బయటికివచ్చిన దేవయాని ఇరువురిలో ఎంత తేడా! నూతి ఒడ్డున నిలబడిన పురుషుడు హస్తినా పుర మహారాజు యయాతి, అని తెలియగానే ........

అదే క్షణం నేను నిశ్చయించుకున్నాను. అతనికి రాణిని కావాలని, కేవలం రాణియేకాదు, మహారాణిని కావాలి.

భగ్నప్రేమను, ఆవేదనను మరచిపోవడానికి నాకు ఐశ్వర్యమనే మత్తు అవసరం, అధికార ఉన్మాదం కావాలి, ఎప్పుడూ నా కనుసన్నలలో మెదిలే భర్త కావాలి! కాముకుడైన భర్తే, భార్య చేతిలో కీలుబొమ్మగా ఉంటాడు.

ఇదంతా నేను చేజిక్కించుకున్నాను - కేవలం ఒక్క క్షణంలో

కాని కచునితో వచ్చిన ఆ బైరాగి ........ ........

ఈ మా బావ ......... అంటే జ్యేష్ఠుడు, హస్తినాపుర సింహాసనానికి నిజమైన వారసుడు? అంటే .........

ఈ పిచ్చివాడు ఇక్కడున్నా, లేదా ఎక్కడికైనా పారిపోయినా! నేను మహా రాణిని, నేను చివరి వరకూ మహారాణీగానే ఉంటాను. ఆ పిచ్చివాడికి శర్మిష్ఠ గనుక నచ్చితే, శర్మిష్ఠ కూడా ఆ పిచ్చివాడిని పెండ్లాడడానికి సిద్ధపడిపోతుంది, రాజ్యానికి వారసుడు అతడే కనుక! అలా జరుగదు కదా! ఏమో!

ఈ యతి ఆటలిక్కడ సాగనివ్వకూడదనీ, అతనిక్కడ కోటలో ఉంచొద్దనీ గట్టిగా పట్టుపట్టాను. కాని అత్తగారు, ముద్దులకొడుకు చాలారోజుల తర్వాత తిరిగొ చ్చాడు. అందుకే ఆమె యతినికూడా అక్కడే ఉంచాలని కోరింది. నేను మాతండ్రి గారి దగ్గరకి వెళ్ళిపోతానని బెదరించాను. అప్పుడు మహారాజు తల్లినే వారించారు.

అశోకవనంలో ఏం జరుగుతుందో, ఎప్పటికప్పుడు సమాచారం అందించే టట్లు, అత్తగారి సేవకోసమనే నెపంతో నేనొక ముసలిదాసిని నియమించా నక్కడ. ఆ దాసీ అక్కడి వింతలన్నీ రోజూ చెపుతూ ఉండేది. ఇంతవరకు ఆ పిచ్చివాడు తల్లిని గుర్తుపట్టలేదు. అత్తగారు మాటి - మాటికీ అతనికి దగ్గరగా వెళ్ళి కళ్ళలో కళ్ళు పెట్టి 'యతీ, ఒక్కసారి నన్ను అమ్మా! అని పిలువు నాయనా!' అని అంటున్నారు. అతను బదులుగా 'నువ్వు అమ్మవా, అవునా? అయితే నీవు నీచు రాలివి! దుష్టురాలివి! ప్రపంచంలోని తల్లులందరూ, స్త్రీలందరూ, బాలికలందరూ, నీచులే! నేను వాళ్ళందర్నీ నాశనం చేయాలనుకుంటున్నాను, నువ్వు తండ్రివి అయిపో, అప్పుడు నిన్ను పిలుస్తాను!'

తీర్థయాత్రలు చేసిన కచుడికి భగవంతుడు ప్రసన్నుడైనాడా! అతనికి ఏమైనా ఫలితం దక్కిందా? ఏమైనాకానీ, అతన్ని తీసుకొని సరాసరి ఇక్కడికే వచ్చాడు!.

# అధ్యాయం 15

ఈ యతి కాలుపెట్టినవేళ మంచిది కాదనిపిస్తున్నది. ఆ వీడ్కోలు ఉత్సవం కొరకు మేము రథంపై కూర్చొని రాజసభకు వెళ్ళాం, అప్పుడు వాతావరణం స్వచ్ఛంగా ఉంది. సువర్ణకిరణాలతో సూర్యుడు ప్రకాశాన్ని వెదజల్లుతున్నాడు. ఆకాశంలో ఎక్కడా ఒక్క చిన్న మేఘం మచ్చుకి కూడా లేదు. వర్షాకాలం అయినా, వసంత ఋతువులా అన్పించింది. కాని, సభలో యతి అడుగుపెట్టాడో లేదో, లోపలా బయటా అంతా గందరగోళంగా మారిపోయింది.

ఆరోజు తిరిగి వస్తున్నప్పుడు, ఆకాశమంతా కారుమబ్బులు కమ్మిఉన్నాయి. మార్గమంతా ఏదో వెలుతురులేని సొరంగంలా అన్పించాయి.  నాగులేకాదు అవి దయ్యాలూ భూతాల్లాగాకూడా అన్పించాయి. వికృత ఆకారంతో తలవిరబోసుకుని అపశకునాలు పలుకుతూ ఇటూ అటూ తిరుగుతున్న భూతాలవలే ఉన్నాయి.

ఆ తర్వాత వర్షం కుండపోతగా పడింది. అప్పటినుండి నాలుగు రోజుల వరకూ ముసురు పట్టినట్లయ్యింది. యమునా నదికి వరద వచ్చింది. నగరంలోని కార్యక్రమాలన్నీ అస్తవ్యస్త మయ్యాయి. వర్షం ఇలాగే పడుతూ ఉంటే, యమునా నదికి వరద అధికమై,, ఒడ్డునున్న గ్రామాలన్నీ ముంపుకి గురైపోతాయని మంత్రిగారు ఆందోళన చెందుతున్నారు.

ఆరోజు ఆ యతి వచ్చాడు కదా? అతనే ఈ వర్షాన్ని అతనితోపాటు తెచ్చాడు. అతనిక్కడ నుండి కదలకపోతే ఈ వర్షం తగ్గదని నేను అన్నాను.

నాల్గవరోజు అర్ధరాత్రి వర్షం పడుతూనే ఉంది! మొదట ఒకటి రెండు జల్లులుపడి, అలాగే తగ్గిపోతూండేది. అలా వర్షం ఆగినపుడు చెట్లఆకుల నుండి

చినుకుల పడుతూ టప్ - టప్ శబ్దం వినిపించేది. కొంచెం సేపటిలోనే మళ్ళీ పెద్ద వర్షం కురుస్తూండేది.

మహారాజు నిద్రపోయారు. నేను మాత్రం మేలుకొనే ఉన్నాను. నాకు పుట్ట బోయే బిడ్డ గురించిన రకరకాల ఊహలు, తల్లిగా సహజం. తనని చూడగానే అందరికి నేనే గుర్తువచ్చేటట్టు నా బిడ్డ నాలాగే వుంటుందేమో! ముక్కు - తీరు ఎవరిలా ఉంటుంది? జుట్టు ఎలా ఉంటుంది? ముఖం ముద్దుగా ఉంటుంది? ..........త ............ త ............ త ......... అంటూ మహారాజును పిలవడానికి ముందే పరుగు పరుగున వచ్చి అమ్మా అంటు నన్ను అల్లుకుపోతాడా?

ఇలా ఊహాలతో ఎంతవరకూ ఆడుకున్నాననో నాకే తెలియదు. హఠాత్తుగా గుర్రపు డెక్కల చప్పుడు వినిపించింది. తుళ్ళిపడి కళ్ళు తెరిచాను. ఒకవేళ నేనేమీ కల గనటంలేదు కదా? కాని ...... ఆ శబ్దం - ఎక్కడో, ఏం జరిగిందో తెలియదు.

తలుపు తెరచి త్వరత్వరగా నేను బయటికి వచ్చేశాను. నేను విన్న ఆ శబ్దం నిజమైనదే. అత్తగారు ఒక సేవకుణ్ణి పంపించారు.

ఆ నౌకరు నన్ను గాబరాగా అడిగాడు, 'ఋషి మహారాజు గాని రాజమహ లుకి వచ్చారా?'

కచుడికి ఏకాంత ప్రదేశంలో కూర్చుని ధ్యానంచేసుకునే అలవాటువున్న సంగతి నాకు తెలిసు. అర్ధరాత్రి దాటినాకూడా అతడింకా అశోకవనం చేరుకుని ఉండడు. అందుకే అత్తగారు గాభరాపడి ఉంటారు. అతను బహుశా ఇక్కడికి వచ్చి ఉంటాడేమోన అని కబురు పంపింది!.(సందేశం పంపింది).

'లేదే! కచుడు ఇక్కడికి రాలేదే?' అన్నాను.

'హాం ..... హాం ...., హాం ....... కచదేవులు అక్కడే ఉన్నారు, ఆ రెండో ఋషి, అదే యతి మహారాజ్!'

'అతనికి ఏమైంది?'

'ఎక్కడికి పారిపోయారో తెలీటంలేదు?'

'ఎప్పుడు?'

'రాత్రి ఒకటన్నరు ఝాము వరకూ అశోకవనంలోనే ఉన్నారు. తర్వాత అందరూ నిద్రపోయారు. మధ్యరాత్రి రాజమాత మేల్కొని చూస్తే, యతి మహారాజ్ లేరు!'.

నేను మహారాజుని నిద్రలేపాను. ఆయన వెంటనే గుర్రంపై అశోకవనం వెళ్ళారు. రెండో రోజు ఉదయం తిరిగి వచ్చారు. యతి గురించి ఆయన అంతా వెతికారు. సేన అంతా రాత్రి వరదతో ఉప్పొంగుతున్న యమున దగ్గర గస్తీ తిరిగింది. కాని ఎవరికీ అతను కన్పించలేదు!.

రెండోరోజు నగరంలో అందరినోట ఇదేమాట. నిన్నరాత్రి వరదతో ఉప్పొంగిన యమున మీద నుండి వెళ్తుండగా యతిని ఎవరో చూసారట!.

యతి అదృశ్యం అవడానికి కారణమేమిటో నాకు, ముసలిదాసి ద్వారా తెల్సింది. దాంతో నాకు నవ్వు ఆగలేదు. కడుపుబ్బేలా నవ్వాను. అతను ఎప్పుడూ శర్మిష్ఠ వెంటపడేవాడు. బహుశా ఆ పిచ్చివాడికి శర్మిష్ఠ అంటే ప్రేమను కుంటా! ఇలా మొదటి చూపులోనే ప్రేమించుకోవడం బహుశా ఎవరూ చూసి ఉండరు! నాలుగు రోజులవరకు అతను ఆమెను చూస్తూ ఆనందించాడు. కాని, వుత్తచూపుతోనే ఏ ప్రేమికుడైనా సంతోషిస్తాడా? ఆ తర్వాత ఈ తపస్వి స్పర్శకోసం తపించాడు. అర్ధ రాత్రి అందరూ నిద్రించిన తర్వాత, అతను మెల్లగా అడుగులువేసుకుంటూ శర్మిష్ఠ పడక దగ్గరక వచ్చాడు. అతని స్పర్శ తగలగానే శర్మిష్ఠ కేకలు పెట్టిందో లేక ఇంకా ఎవరో చూస్తున్నారేమో అని భయంతో కేకలు పెట్టిందో తెలియదు! కాని అర పడం మాత్రం నిజం. ఆమె కేకలు వినగానే బాబాజీగారి పై ప్రాణం పైనేపోయింది. వెంటనే కిటకీలోనుండి దూకి పారిపోయాడు! కాని ఆ తర్వాత అతనేమయ్యాడో ఎవరికీ తెలీదు. ఆ చీకటిలో ఎక్కడో దాగి కూర్చున్నాడో, వెతుకుతున్నవాళ్ళని పసి గట్టి వారి కంటపడకుండా తప్పించు కొంటున్నాడో, లేక ఆ వర్షంలోనే అలా ఎటో వెళ్ళిపోయాడో! ఇదీ ముసలిదాసి కథనం.

మంచిపనే జరిగింది. కాగలకార్యం గంధర్వులే తీర్చారు! అని నేననుకున్నాను.

అత్తగార్ని పరామర్శించడానికి నేనూ అశోకవనం వెళ్ళాను. రాజమందిరానికి మళ్ళీ తిరిగి వచ్చేయమని కోరాను, కాని ఆమెకు నామీద ఇంకా కోపంగా ఉంది, నేనే యతిని రాజమందిరంలో ఉండనివ్వలేదని, కాని ఆ కోపాన్ని బయటకి మాత్రం ప్రదర్శించలేదు. నాకు ఇక్కడే బాగుంది! అని ఆమె అక్కడే ఉండి పోయింది.

అశోకవనంలో కచుణ్ణి కలిసాను. కాసేపు మాట్లాడుకున్నాం కూడా. ఆ మాటలు కేవలం పొడిపొడిమాటలే! కచుడు రాజమందిరం వైపు రానేలేదు. కాని అక్కడి అతని విషయాలు రోజూ నాకు తెలుస్తున్నాయి. ఈరోజు సంపెంగ చెట్టెక్కి సంపెంగ పూలు కోసి ఎవరో అపరిచిత బాలికకు ఇచ్చాడు, నిన్న ఒక అనా రోగ్యంగా ఉన్న దూడ సేవలోనే ఉండిపోయాడు. మహారాజు, ప్రతిరోజూ సాయం కాలం తల్లిని ఊరడించడానికిక, అశోకవనం వెళ్ళివస్తుండేవారు. తిరిగి వచ్చిన తర్వాత నేనడగకుండానే చెప్పేవారు, మాట్లాడుకోవడానికి, కచుడిలాంటి చిన్ననాటి స్నేహితుడు దొరికాడు, అతడు నాకు చాలానచ్చాడు! అతని మాటలు వింటూంటే సమయమే తెలియదు. అందరితోనూ మాట్లాడటానికీ, బొత్తిగా తుచ్ఛ మైన, నీచమైన పనులు చేయడానికీ కచుడికి సమయముంటుంది. కేవలం దేవయాని దగ్గరకు రావాలంటేనే ..... .....

అశోకవనంలో నేను అతణ్ణి అడిగాను - 'రాజమందిరానికి ఎప్పుడు వస్తు న్నావు?' ఇష్టంలేని అతని జవాబు, 'ఎప్పుడు సమయం ఉంటే అప్పుడు'. అతనికి గొప్ప అహంభావం. ఇప్పుడు కూడా. ఇప్పటికి కూడా దేవయాని అంటే ఏమిటో అతనికి తెలియదు.

నా మనసు రోజూ నాతో అంటుంది, ఏమైనా సరే, కచుడు తనంతటతానే నన్ను చూడడానికి వస్తాడు. ప్రతిరోజూ ఉదయం నవ్వుతూ ఊహాసుందరి నా చెవుల్లో గుసగుసలాడు తుంది...... ఈ రోజు కచుడొస్తాడు. హఠాత్తుగా వచ్చి నిన్ను ఆశ్చర్యంలో ముంచేద్దామని అతనికోరిక! అటుపిమ్మట అతడికి అతిథి - సత్కారానికి ఏర్పాట్లు అతి ఆనందంతో చేస్తాను. దూరం నుండి చూస్తే సింహాస నంలా కన్పించే ఆసనం, స్వర్ణపాత్రలో ఆకర్షణీయంగా అలంకరిచబడిన రకరకాల పండ్లు, అతడికి ఇష్టమైన చిన్నచిన్న పూల మాలలు, నెమలి ఈకలతో చేయబడ్డ విసనకర్ర లతో అన్నీ నా మందిరంలో సిద్ధపరిచి ఉంచుతాను. కచుడు మనసైన

మహర్షికదా? ఎప్పుడు హఠాత్తుగా వచ్చి ఎదురుగా నిలబడతాడో, ఎవరికి తెలుసు?

సుకుమారమైన పూలమాలలు వాడిపోతున్నాయి. పళ్ళు ఎండిపోతున్నాయి, కాని అతడు రావడంలేదు! పడమటి సూర్యకిరణాలు కిటకీనుంచి తొంగిచూసి, ఈ సామగ్రి అంతా అలాగే ఉండటం చూసి, ఉదాసీనంగా, వ్యాకులతతో పాపం వెను దిరిగిపోతున్నాయి.

యతి అదృశ్యమైపోయి, ఒకటి, ఒకటి చొప్పున ఏడు రోజులు గడిచి పోయాయి. మహారాజు ప్రతిరోజూ సాయంత్రం అశోకవనం వెళ్తారు. అతనితో మాట్లాడటానికి, కచుడికి సమయం చిక్కుతుంది. కాని నన్ను కలవడానికే అతనికి తీరిక దొరకటంలేదు. ఈ విషయంలో మాత్రం నాకు లోలోపల కోపం పెరిగి పోయింది! అసలు అతను హస్తినాపురం ఎలా వచ్చాడు? యజ్ఞానికి ఆహ్వానం అందుకొనే కదా? ఆ ఆహ్వానం పంపింది నేను! మహారాజుకైతే అతణ్ణి పిలవాలన్న జ్ఞాపకమేరాలేదు, నాకు జ్ఞాపకం ఉంది, అందుకే అతను ఇక్కడికి రాగలిగాడు. కాని రాజమందిరానికి వచ్చిన తర్వాత కూడా అతను మామూలు మర్యాదను పాటించలేదే! దేవయాని మాటిమాటికి ముక్కుపట్టుకుని ముందుకులాగి తన్ను బ్రతిమలాడాలని అనుకుంటున్నాడేమో కచుడు! కాని.......

కాని, నాకు మాటిమాటికి అన్పిస్తుంది, అతను తప్పకుండా ఒక్కసారైనా రావాలి, మనసు విప్పిమాట్లాడాలి, నా యోగక్షేమాలు అడగాలి, తీయగా గత స్మృతులైన సంఘటనలను ఒకరికొకరం గుర్తు చేసుకోవాలి, విని నేను వికలమై పోవాలి, నా కళ్ళు చెమర్చాలి, ఆ కన్నీటిలో మహారాణి అయిన గేవయాని ప్రవహించిపోవాలి........

వద్దు, వద్దు, కచుడు నన్ను శపించి వెళ్ళిపోయాడు, అప్పుడైతే ఎన్ని రోజులో నేను కన్నీటిని దిగమ్రింగుకున్నాను! ఆ తర్వాత నేను జాగ్రత్తపడ్డాను, ఆలోచించి, యోచించి అడుగుముందుకేసాను. ఆ తర్వాత గట్టిగా నిర్ణయించు కున్నాను, ఇక ముందెన్నడూ బేలగా కన్నీరు కార్చకూడదని! అత్తవారింటికి వచ్చే ముందు తండ్రిగారికి నమస్కరించి సెలవు అడిగాను. అప్పుడు తండ్రిగారు ఆశీర్వదించడానికి చేతిని నాతలపై ఉంచారు. ఆయన ఎంతగా వణికిపోయారో!

నేను కూడా ఖిన్న మనస్కురాలినై తలపైకెత్తాను. అప్పుడే తండ్రిగారి కళ్ళనుండి రెండు కన్నీటిబొట్లు నా శిరసుపై రాలాయి. లోలోపల నేను కూడా కుమిలి పోయాను. కాని నాకళ్ళ వెంట నీళ్ళు రానివ్వలేదు! దేవయాని ఇక మీదట ఎన్నడూ ఏడవదు.

కాని ఇప్పుడు నాకు అన్పిస్తుంది, హస్తినాపురం వచ్చిన తరువాత కచుడు నా వద్దకు రావాలనీ, ఇద్దరం మాట్లాడుకుని గత స్మృతులను, మధురస్మృతులను తలచుకొంటూ అందులో లీనమై ఏడవాలనీ అన్పిస్తోంది. అలాగైనా నా కన్నీటితో దుఃఖ భారాన్ని దించుకుని మనసును తేలిక పరచుకోవాలని ఉంది.

ఏడవడంలో కూడా ఆనందం ఉంటుందా? కాదు! కన్నీళ్ళు నిర్బలతకి చిహ్నాలు!.

అయితే, మరి మహారాణి దేవయాని దేన్ని గురించి దుఃఖించాలి? అది కూడా, గతించిన విషయాల్ని గుర్తు తెచ్చుకొని? వద్దు, అలా ఎన్నటికీ కాకూడదు, ఏం? ఒక మహారాణి, ఒక ఋషిని కలియడానికి ఇంతలా విన్నవించుకోవాలా? లేదు, తను ఎటువంటి పరిస్థితిలోనూ అలా చేయదు.

అటుపిమ్మట నా మనసులో గట్టిగా నమ్మకం కుదిరిపోయింది, ఇంక కచుడు నన్ను కలవకుండానే హస్తినాపురం నుండి వెళ్ళిపోతాడు. ఎనిమిదవరోజు నేను అతడి స్వాగత - సత్కారానికి ఎలాంటి ఏర్పాటుచేయలేదు. కాని హఠాత్తుగా అదే రోజు అతను రాజమందిరానికి వచ్చాడు. అతని అతిథి - సత్కారానికి నేను చాలా హడావుడి పడవలసి వచ్చింది.

నౌకర్లు ఉరుకులు పరుగులతో, అతనికని ప్రత్యేకంగా చేయించి, అందమైన ఆసనాన్ని త్వరత్వరగా నామందిరానికి తరలించారు. కాని, అంతకుమునుపే అతను తన మృగాజినం పరచుకొని కూర్చుండిపోయాడు.

నేను అతన్ని ఆ ఉన్నతాసనంమీద కూర్చోమని ప్రాధేయపడ్డాను. కాని అతను నవ్వుతూనే తిరస్కరించాడు. బహుశా దేవయాని ఐశ్వర్యానికి అతని దృష్టిలో ఏమాత్రం విలువలేదని తెలియజెప్పడానికేమో!

నాకు కోపం వచ్చింది, కాని పైకి నవ్వుతూ అన్నాను, 'కచదేవా! మీరు తప్పనిసరిగా ఈ ఆసనంమీద కూర్చోవాలి!'

'ఎందుకు?'

'అందుకే, ఎందుకంటే అతిథికి, ఇంటినిబట్టి మర్యాదననుసరించవలసి ఉంటుంది!'

'కాని, నేనేమీ అతిథిని కానే!'

'అలా అని మీరెలా చెప్పగలరు? యజ్ఞానికి ఆహ్వానించిన గొప్ప అతిథుల్లో మీరొకరు'.

'తనింట్లోనే, ఎవరైనా అతిథి కాగలరా?'

'మీరు ఇంటిని మీదిగా భావిస్తున్నారా?'

'నిశ్చయంగా, ఇది నాయిల్లే! సోదరి ఇంట్లో కూడా అన్న పరాయి వాడవుతాడా? దేవయానీ! నీ యింట్లో నేను అతిథినికాను. ఇక్కడ నాకెలాంటి సంకోచమూ ఉండదు. మన ఇంట్లో మనం ఎక్కడైనా, ఎలాగైనా కూర్చుంటాం కదా, అవునా? అలాగే, నేను ఇక్కడ ..... .......' చెపుతూ చెపుతూ అతను ఆగిపోయాడు కేవలం ఒక నవ్వు నవ్వాడు.

అతని మాట అతనికే అప్పగించాలని నేనన్నాను, 'కాని, అన్న చెల్లెలి పట్టుదలని నెరవేర్చాలి కదా? నా కోసం .......'

ఆ ఆసనం వైపు చూస్తూ అతను అన్నాడు - 'ఈ అందమైన ఆసనం పై కూర్చుంటే, నిశ్చయంగా ఎలాంటి ముళ్ళుకూడా గుచ్చుకోవని నాకు తెలుసు, కాని, నాకొక నియమం ఉంది, వ్యర్థంగా దాన్నెందుకు అతిక్రమించాలి?'

'మీ నియమం ఏమిటో సెలవివ్వండి?'

'అది చాలా మామూలు నియమమే! చూడు, అసలు విషయమేమిటంటే, మృగాజినం మీద నడుంవాలిస్తేనే నిద్రవచ్చేస్తే, ఇక మంచంమీద మెత్తని పరుపులు వేసుకొని పడక తయారు చేయడంవలన ప్రయోజనం ఏముంది?

ఎలాగూ, రోజూ కందమూల - ఫలాలుని తినే జీవించాలి. అలాంటిది, ఒకటీ - అరా రోజులకి ఈ జిహ్వాచాపల్యా మెందుకింక? దేవయానీ; మనిషి నాలుక చాలా చెడ్డది. అది ఇతరు లకు బాధకల్గించే మాటలు పలుకుతుంది. అంతేకాకుండా ఏదో ఒకరోజు రుచికర మైన ఆహారం దొరికితే, అదే జిహ్వాచాపల్యంతో రోజూ రుచికరమైన, వస్తువులు కోరుకుంటుంది, అలాంటి లాలసే కళ్ళు, ముక్కు మొదలైన జ్ఞానేంద్రియాలూ కోరుకుంటాయి. ఇంక వాటి కోరిక తీర్చడానికి మనిషి ఏం చేయడానికైనా సిద్ధపడ తాడు! ఎలాంటి పాపకార్యం, అత్యాచారం చేయడానికైనా సిద్ధపడతాడు. నీవు చూపించిన ఈ సుందరమైన, మెత్తని ఆసనంపై ఇప్పుడు నేను కూర్చుంటాను. కాని రేపు అడవిలో తపస్సు చేయడానిక కూర్చుంటే, పదే - పదే దీని విషయమే జ్ఞాపకం వస్తూంటుంది........'

అతన్ని ఉడికించడానికి నేనన్నాను - 'అంటే, మహారాణిని అయి ఉండి నేను కూడా, ఈ వస్త్ర - ఆభూషణాలు ధరించడం ఉచితంకాదా?'

అతను నవ్వుతూ అన్నాడు, 'కాదు, కాదు! నీ విషయం వేరు, నీవు గృహిణివి. "గృహస్థ ధర్మం నీది, నేను యోగిని, సన్యాసం నా ధర్మం," గృహస్తుకి భోగం మర్యాదాకరం, సన్యాసంలో భోగవాంఛ క్షమించరానిది!'

కృష్ణాజినం మీదనే కూర్చుంటానన్న మొండి పట్టుదలని అలా నెరవేర్చు కున్నాడు. తర్వాత కొంచెం ఫలాహారం తీసుకొని, ప్రక్కనే ఉన్న స్వర్ణపాత్ర, దాని లోని పూలహారాల వంక ప్రేమగా చూసాడు! చూస్తూ .......... అన్నాడు - 'అంటే ........ ఇప్పటి వరకు నా ఇష్టాఇష్టాలు జ్ఞాపకమున్నాయన్నమాట! మహారాణి పదవిలో నిమగ్నమై ఉన్నా ఇలాంటి చిన్న చిన్న వి షయాలు కూడా .......'

'మిమ్మల్ని మరచిపోలేకపోయాను, అందుకే అంతమర్యాదగా మీకు యజ్ఞానికి ఆహ్వానం పంపాను!'

'నేను నిన్ను శపించి వెళ్ళిపోయినా, ఇంకా నీవు నన్ను మరచిపోలేదు. అంతే కాక యజ్ఞానికి కూడా ఆహ్వానం పంపించావు! ఎంతటి మహాభాగ్యం నాది! ఇంతటి ఉదారస్వభావురాలు నాకు చెల్లెలుకావడం నిజంగా ...... కోపంతో నిన్ను నేను శపించాను. ఘోరమైన అపరాధం జరిగిపోయింది, నా వలన నేను, ఇప్పుడు నిజంగా పశ్చాత్తాపపడుతున్నాను. నాలాంటి ఋషికుమారుడికి అలాంటి కృత్యం ఎన్నటికీ శోభనీయమైనదికాదు! అదీకాక ఒక సోదరునికి ఎంతమాత్రమూ శోభ

నీయంకాదు! నా అపరాధాన్ని క్షమించమని హృదయపూర్వకంగా అడుగుతున్నాను'.

చెప్తూ - చెప్తూ అతను రెండు చేతులూ జోడించాడు. అతని ముఖం ఎంత శాంతంగా, ఎంత గంభీరంగా ఉంది. నాకు చాలా ఆశ్చర్యం కలిగింది, అతను ........ నన్ను ......... క్షమాయాచన ......... నా మందిరంలో ........ నాఎదుట చేతులు జోడిం చడం!! నేను చాలా సందిగ్ధంలో పడ్డాను! ఇప్పుడేం చేయను! ఏం చేయ కూడదు నేను! ఇదే ........ ఆశ్రమంలోనైతే, అతనిలా చేతులు జోడించినందుకు, వెంటనే పరుగెత్తివెళ్ళి అతని రెండు చేతులూ వేరుచేసి ఉండేదాన్ని.

కాని, నేనిప్పుడు యయాతి మహారాజు భార్యను. కచుడు ఒక పరాయి పురుషుడు. నేను హస్తినాపురానికి మహారాణిని, అతను, ఒక సామాన్య సన్యాసి, నేను ఏమీ ....... ఏమీ చేయలేను. అతను ప్రశ్నించాడు - 'నన్ను క్షమించావు కదా?'

తలదించుకొని ఉన్న నేను ఆ అనేశాను. కాని వెంటనే నాకనిపించింది, ఇదంతా ఒకవేళ నాటకం కాదుగదా? దేవయాని అంటే అంత అభిమానం, ప్రేమ కలిగి ఉండి కూడా, వచ్చి ఇన్నిరోజులైనా ఒక్కసారైనా నా మందిరానికి రాలేదేం?

నేను నవ్వుతూ అడిగాను, 'కచదేవా! మీరు హస్తినాపురం వచ్చి ఇన్నిరోజులైనా, ఇటు మందిరంవైపు రానందుకు, చెల్లెల్ని గాని మరిచి పోలేదుగదా? అని అనుకోనేదాన్ని'.

'ధనవంతుడైన అన్న చెల్లెల్ని మరచిపోతాడేమోగాని, దరిద్రుడైన అన్న భోగ భాగ్యాలతో తులతూగుతున్న చెల్లెల్ని ఎక్కడానా మరచిపోతాడా?'

'ఆ...... హా, అలాగా! అయితే, రాజమందిరానికి త్రోవ తెలియలేదా అతనికి?'

'అతనింకేదో మార్గాన్ని వెదకుతున్నాడు?'

'ఎక్కడికి వెళ్ళాలని?'

'రాజమందిరంలోని యజమానురాలి హృదయంలోనికి వెళ్ళాల్సిన వాడతను!'

ఈ మాటలకు అర్ధమేమిటో తెలియలేదు, కాని నా మనసు, రాత్రి అయిన తర్వాత తన గూటిని చేరడానికి మార్గాన్ని వెదుకుతూ, రెక్కలు టపటపా కొట్టు కుంటూ విలపిస్తున్న చిన్న పక్షిపిల్లలా, విలవిలలాడింది. కచుడు మిన్నకుండి పోయాడు. నా మనసులో ఒక అనుమానం తల ఎత్తింది, మహారాజుగాని నా గురించి కచుణ్ణి ఏమీ అడుగలేదు కదా? ఇతనూ ఏమీ చెప్పలేదు కదా? అతడి పక్షం వహించి నాకు ఉపదేశంఇవ్వడానికి గాని రాలేదు కదా?

అతను అతి శాంతంగా అన్నాడు, 'నేను నిన్నొకటి అడగాలని వచ్చాను!'

నేను కాస్త తటపటాయిస్తూ, 'ఏమిటది?' అన్నాను.

'అదే, శర్మిష్ఠను దాస్య విముక్తురాలిని చెయ్యి!'

నేను కోపంతో అడిగాను - 'మరి, విడిచిపెట్టి ఆమెను ఏం చేయను? మహా రాణిగా నాస్థానం ఆమెకిచ్చేయనా? లేక సవతిగా చేసుకుని నా గుండెలమీద కుంపటిలా కూర్చోబెట్టుకోనా? లేక నేనే ఆమెకు దాసీగా ఉండనా?'

ఆయినా అతను శాంతంగానే ఉన్నాడు, అతను మరలా అన్నాడు, 'కోపంతో, పట్టుబట్టి నీవు ఆమెను నీదాసీగా కోరుకుని ఉండొచ్చు, అంతమాత్రన నీది తప్పు అనను, ఈ ప్రపంచంలో కోపంలేనివాళ్ళు ఎవరున్నారు? కాని మానసిక వికారంతో కొట్టుకుపోవడం గొప్పతనంకాదు. ఆలోచన సహాయంతో మనోవికారం పైన విజయం సాధించడమే ఆసలైన మానవధర్మం'.

నేను మిన్నకుండిపోవడం చూసి, అతను ఇంకా ఇలా అన్నాడు, - 'దేవయానీ, ఒక్కక్షణం ఊహించి చూడు, శర్మిష్ఠ స్థానంలో నీవే ఉంటే, జీవితాంతం దాసిగా ఉండే ఖర్మ నీకు పడుతుందా ........'

తిరస్కారపూర్వకమైన కంఠంతో నేనన్నాను - 'నేను ....... నేను? నేను దాసిన వడమా? నేను దాసినవుతానా? అదీ........ ఈ శర్మిష్ఠకి........ హు .......?'

మరలా అదే శాంతస్వరంతో అతనన్నాడు విధివ్రాత చాలా విచిత్రంగానూ, కఠినంగా కూడా ఉంటుంది. దేవయానీ! చూస్తూండగానే విధి ఆకాశంలో మెరిసే ఉల్కను భూమిపై పడేసి పాషాణంగా మార్చేయగలదు. .ఏమో ఎవరు చెప్ప

గలరు? ఆలాగే ఎవర్ని దాసీగా చేస్తాడో, లేక ఏదాసీని రాణిగా చేస్తాడో ఎవరి కెరుక?......

నేను చాలా ఖచ్చితంగా చెప్పేశాను - 'ఈ మాటలన్నీ నాకిప్పుడిప్పుడే అర్థ మవుతున్నాయి, కచదేవా!'

'నీకు కష్టం కల్గించే మాటలేమైనా అని ఉంటే క్షమించు. ఈ ప్రపంచంలో ఎవరి దుఃఖాన్ని గురించైనా తెలుసుకోవాలనుకుంటే దానికి ఒకటే మార్గం, మనం వారి స్థానంలో ఉండి ఊహించైనా తెలుసుకోవాలి. గత కొద్దిరోజులుగా నేనూ ఇదే విధంగా శర్మిష్ఠ దుఃఖాన్ని తెలుసుకోవడానికి ప్రయత్నిస్తూ వచ్చాను. ఈ రోజు వరకూ కచుడు దేవయానిని ఏమీ అడగలేదు! కాని ఇప్పుడు, తన అన్నకి ఆమె ఇంత భిక్ష ...... ........'

నాకు తెలుసు, కచుణ్ణి మాటలలో ఓరడించడం అసంభవం. నేను మూగదాన్నై చెవుటిదాన్నై, గ్రుడ్డిదాన్నై కూర్చున్నాను. మాట్లాడుతూ - మాట్లాడుతూ ఆగి, మరలా కచుడు పిచ్చివాడిలా నావైపు తదేకంగా చూస్తూండిపోయాడు. అతని చూపులో - చూపుకలపడమా - అమ్మో! అది నాకు కానిపని! అతని చూపులో కఠోరతే కాదు, కరుణకూడా లేదు. ఏమీలేదు. కాని, మంత్రవిద్యలూ, అన్ని గారడీ విద్యల సారం అతని కళ్ళలో ప్రస్ఫుటమౌతోంది. చిన్నప్పుడు, అడవిలోని పెను బాముల గురించిన కథలు వినేదాన్ని, అందులో ఒక రకమైన సర్పం తన దృష్టితోనే బాటసారిని స్థంభింపజేస్తుందట. అలాగే ఇప్పుడీ కచుడి దృష్టికూడా!

అతనితో దెబ్బలాడటానికి నా సర్వశక్తినీ, నా సాహసాన్నీ కూడ గట్టు కోవలసి వచ్చింది.

యతిని, రాజసభలోకి తీసుకొచ్చి అక్కడ కార్యక్రమాన్ని సర్వనాశనంచేసింది ఈ కచుడే కదా! ఉఫ్ఫ్ ...... ఫ్ ........ తండ్రిగారి తపస్సుకు ఇతను ఎంత పెద్ద అపశకునం కల్గించాడు! ఆ విషయం గురించి ఇతను ఒక్కమాట కూడా అనలేదే. అక్కడ రాజదర్బారులే, కన్నుల మిరుమిట్లుగొలిపే వైభవాన్ని ఇతను చూసాడు, అయినా కాని, నన్ను గురించిగానీ, నా వైభవం గురించిగానీ ఇతనినోటివెంతట ఒక్క ప్రశంసాత్మకమైన మాటరాలేదు కదా! పైగా శర్మిష్ఠను దాస్యవిముక్తురాలిని చేయమని అడగడానికి ఈ రోజు ఏం ముఖం పెట్టుకుని వచ్చాడు! ఇతని

వ్యామోహంలో ఈ దేవయాని ఎన్నటికీ పడదు, పడబోదు. నిస్సంకోచంగా ఇతనే ఆనాడు నా మనసు విరిచేశాడు. లేదు, కచుడు దేవయానికి ఏమీకాదు, దేవయాని కూడా అతనికి ఎలాంటి భిక్షాపెట్టదు .........

అతని వంక చూడకుండానే, నేను బయటికి వెళ్ళిపోవడానికి లేచాను.

కచుడు కూడా నాతోపాటే లేచి నిలబడ్డాడు. అతను సహనంగా, శాంతంగా అన్నాడు, 'మహారాణీ, నేను రేపు భృగుపర్వతానికి వెళ్ళిపోతున్నాను. అక్కడ ఏకాంతంలో తపస్సు, ధ్యానం చేసుకొంటూ కాలం వెళ్ళబుచ్చాలని నిశ్చయించు కున్నాను. ఇప్పటికి కూడా నేను ఇంకా పరిపూర్ణుడనుకాదు. ఈ అసంపూర్ణత ఇంకా తగ్గాలి. ఒక క్షణం కంటేకూడా చిన్నదిగా కావాలి, ప్రపంచంలోని దుఃఖాన్ని తగ్గించే మార్గం దొరకాలి .......... అందుకే ....... ........'

అతను చెప్పడం అయిపోవడానికి ముందే నేను నమస్కారం చేసాను. ఆశీర్వదిస్తూ, 'మరలా మన కలయిక ఎప్పుడవుతుందో, ఎలాంటి స్థితిలో అవు తుందో, ఆ ఆదిశక్తికే తెలియాలి! ఆ ఆదిశక్తి మహారాణికి సద్బుద్ధినివ్వాలని, దేవయానిని క్షేమంగా చూడాలని కోరు కుంటున్నాను' అన్నాడు.

# అధ్యాయం 16

కచుడితోపాటు భృగుపర్వతం వెళ్ళడానికి అత్తగారు కూడా నిశ్చయించు కున్నారని, రెండవరోజు ఉదయాన్నే అత్తగారి నుండి వర్తమానం వచ్చింది. ఆ కబురు(విషయం) విని మహారాజు అచేతనంగా ఉండిపోయారు. ఆయన తల్లిని వెళ్ళవద్దని వారించారు, మనుమడి ముఖం చూసిన తర్వాత వెళ్ళమన్నారు. పెండ్లయిన తర్వాత అతను అత్తగారితో మనసు విప్పి మాట్లాడం ఇప్పుడే చూసాను. అంతేగాక, వినయంగా ప్రాధేయపడ్డంకూడా ఇప్పుడే చూసాను. కాని, రాజమాత వానప్రస్థానికి వెళ్ళిపోతుందనితెలియగానే, మహారాజు పరిస్థితి చిన్నపిలా డిలా ఆయిపోయింది. మహారాజుని ఊరడించడానికైనా, అత్తగారు ఈ నిర్ణయం మానుకుంటారేమో అని నేను అనుకున్నాను. లోకులు నన్నుకూడా నిందించవచ్చు. కోడలి వ్యవహారంతో విసిగి ఆమె ఈ నిర్ణయం తీసుకుంది అని అనవచ్చు. అందుకే నేను కూడా బ్రతిమిలాడాను, వెళ్ళవద్దని వారించాను. కాని అందరికీ ఆమె ఇదే జవాబు ఇస్తూ వచ్చింది - 'రోగికి, ఏమితిన్నా అరుచిగానే ఉంటుంది, అలాగే నా పరిస్థితికూడా, ఈ ఇల్లు - సంసారంతో నాకు విసుగుపుట్టింది. రోగికి బలవంతంగా తినిపించడం వలన ప్రయోజనమేముంది? అలా తింటే రోగికే నష్టంకదా!'

ఆమె అశోకవనం నుండే వానప్రస్థానికి వెళ్ళిపోయింది. వెళ్ళేముందు నన్ను ఒక ప్రక్కకు పిలిచి అలా చెప్పింది, 'చూడమ్మా, నా మనసు ఏ విషయంపైన నిలవలేదు కాని, యయాతి గురించే సదా, నాచింత. వాడి మనస్సు చిన్నపిల్లాడి లాంటిది! ఎంత సున్నితమో, అంత మొండిది కూడా. కాని, అవి అన్ని అలా విడిచిపెట్టు. ఈ తల నెరపిన ముసలిదాని అనుభవం కూడా విను. దాన్ని ఎల్లప్పుడూ కూడా జ్ఞాపకం ఉంచుకో, గుర్తుపెట్టుకోవలసిన విషయం ఏమిటంటే, స్త్రీ

కేవలం తన పతికి భార్యగా ఉండగానే సరిపోదు. ఆమె అతనికి స్నేహితురాలిగా, సోదరిగా, కుమార్తెగా - అదే, అవసరం అనుకుంటే తల్లిగా కూడా వ్యవహరించ వలసి ఉంటుంది!'

ఆమె చెప్పిన ఈ ఆఖరి(చివరి) మాట నాకు చాలా ప్రత్యేకంగా అన్పించింది. కాని, ఆమెకు ప్రస్థాన సమయం ఆయిపోయింది, మరి ........ .......

మహారాజు అత్తగారు మాట్లాడుకుంటుండగా చాటుగా విన్న ముసలిదాసి నాకు చెప్పింది, దాన్నిబట్టి ఆలోచిస్తే ఆమెనాకింత సేపూ ఇచ్చిన ఉపదేశం, మోసపూరితమైనదిగా, నాటకంగా అన్పించింది.

ఆ దాసి వారి సంభాషణను పూసగ్రుచ్చినట్లుగా చెప్పింది -

మహారాజుని ధైర్యంగా ఉండమని ఊరడిస్తూ అత్తగారిలా అన్నారు - 'నాకు మనుమడు పుట్టగానే, సమాచారం పంపించు! అతని ఏం పేరు పెట్టారోకూడా వ్రాయి. అతనికి నీ తండ్రిగారి పేరు పెట్టినట్లయితే నేను చాలా సంతోషిస్తాను. కొంచెం, నాతో ఇలా తోటలోనికి వస్తావా ........?'

'ఎందుకూ?' మహారాజు అడిగారు.

'ఒక మొక్కను చూపిస్తాను నీకు!'

'అదేమైన ఓషధికి సంబంధించినదా?

'ఆ(·'

'అయితే దాన్ని రాజవైద్యులకు చూపించాలి, నాకెందుకు? తెలుసుకుని నేనేం చేస్తాను?'

'అది రాజవైద్యునికి చూపించదగినది కాదు!'

'అంటే?'

'అది స్వయంగా స్వీకరించడానికో లేక ఇవ్వడానికో పనికివస్తుంది!'

'ఏ రోగానికి పనికి వస్తుందది?'

'ఆ రోగానికి ఒక పేరు అంటూ ఉండదు! కాని మనిషి జీవితంలో ఒక్కొక్క ప్పుడు ధైర్యం కోల్పోతే, తనంతటతానుగానో లేక ఇతరువలనో యయూ, కాని ఇలాంటి సమయం ఒకటి రావాలని, నీతో ఇలా చెప్పవలసి వస్తుందని నేనను కోలేదు. కాని ....... బాబూ! నీకు శర్మిష్ఠ లాంటి స్త్రీ భార్యగా లభిస్తే నేను నిశ్చిం తగా వానప్రస్థానికి వెళ్ళిపోయేదాన్ని!'

అత్తగారు, కచుడూ ఇద్దరూ ఒక్కటే! ఇద్దరూ ఒకే మాలలోని పూసలే. మోస గాళ్ళు, కపటబుద్ధులు, నాటకాలరాయళ్ళు! వెళ్తూ వెళ్తూ కచుడు మహారాజు కిమ్మని శర్మిష్ఠచేతికి ఒక లేఖ ఇచ్చాడు. ఆమె ఆ లేఖను రాజమందిరానికి పంపించివేసింది.

లేఖ చదివిన తర్వాత మహారాజు ఏదో ఆలోచనలో మునిగిపోయారు. ఆ లేఖలో అతను ఏం రహస్యం వ్రాసి ఉంటాడో, ఏమిటో నాకర్థంకాలేదు! ఒకవేళ నా గురించి గాని వ్రాసి, మహారాజు మనసుని విరిచేయడానికి ప్రయత్నించలేదు కదా? లేఖ .......... శర్మిష్ఠని దాస్యం నుండి విముక్తురాలిని చేయమనిగాని కోరలేదు కదా?

కాని ఆనీచురాలు, శర్మిష్ఠ, దేవయానికి దాసి, మహారాజుకి కాదు! దానిపై మహారాజుకి ఎలాంటి అధికారంగానీ, హక్కుగానీలేదు.

చివరికి సాహసించి నేనే మహారాజుని అడిగేసాను, 'ఆ లేఖలో ఏముంది, ఏమైన ముఖ్యమైన విషయమా?'

లేఖను నాచేతికందిస్తూ మహారాజు అన్నారు - 'పెద్ద విషయమేమీలేదు, కాని, పదే - పదే అనిపిస్తూ ఉంటుంది, భగవంతుడు నాకుకూడ కచుడిలాంటి తాపసి జీవితాన్ని ప్రసాదించి ఉంటే, ఎంత బాగుండేది, అని!'

ఆయన భుజంపై తల ఆనించి నేనన్నాను - 'భగవంతుడు తెలివి తక్కువవాడు కాదు, అతను దేవయాని గురించి కూడా ఆలోచించి ఉంటాడు'.

'అలా అని ఎలా చెప్పగలవు?' అని నవ్వుతూ అడిగారు.

'మీరు గనుక ఋషి అయిఉంటే, నేనుకూడా ఋషిపత్నిని అవవలసి ఉండేది, అప్పుడు నేను పడే బాధ ...... ....... ఆ బాధ ...... .......'

నా తలనిమురుతూ ఆయన అడిగారు, 'యయాతిపత్నిగా నిజంగా నీవు సుఖ పడుతున్నావా?'

నేను సిగ్గుతో అవునన్నట్లు తల ఊపుతూ 'ఆ(.' అన్నాను.

'పూర్తిగా సుఖంగా ఉన్నాను?'

మరలా నేను తలాడిస్తూ అవును అని, తలఎత్తి చూసాను, ఒక క్షణంలోనే ఆయన ముఖం తామరపూవులా వికసించింది. అత్తగారు చెప్పినట్లు నిజంగా ఇతని మనసు చిన్నపిల్లాడి మనసు లాంటిదే!

కచుడు వ్రాసిన ఆ లేఖను చదవడం మొదలుపెట్టాను -

'మనం చాలా రోజుల తర్వాత కలుసుకున్నాం. హస్తినాపురం మహారాజు యయాతితో మాట్లాడుతున్నంతసేపూ, నాకు అంగీరస మహర్షి ఆశ్రమంలోని యయాతితో మాట్లాడుతున్నట్లే అన్పించింది. అందుచేత నాకు చాలా ఆనందంగా ఉంది.

ప్రియమైన లేదా అపరిచితమైన వ్యక్తితో జరిగిన సంభాషణ, లేదా కలయిక వలన కేవలం వ్యావహారికంగా కాకుండా, ఒక రకమైన అనుభూతి కల్గుతుంది. ఆ అనుభూతి ఆత్మిక అనుభూతి, ఆత్మిక సహానుభూతి పాళ్ళు ఎక్కువగా ఉంటుంది. అందుకే ఆ కలయిక ఒక్క క్షణమే అయినా, ఉన్ముక్త ఆత్మాను భూతితో ఆనందం పొంద గల్గడం జరుగుతుంది. ఇలాంటి శాశ్వత ఆనందాన్ని పొందడానికే ఋషులు - మునులు తపస్సు చేస్తూంటారు. మీ సహవాసంతో నాకు ఆ ఆనందం కల్గింది. ఆనందం పొందిన ఆ క్షణాల్ని నేనెన్నటికీ మరువను.

'మీరిరువురుకు నా విన్నపం ఏమంటే, ఒక్క విషయంలో మీరు నన్ను క్షమించాలి. ఇక్కడికి వచ్చేంతవరకూ, యతిని గురించి నాకు తెలియదు. తీర్థ యాత్ర చేస్తుండగా అతనితో కలవడం జరిగింది! ప్రజలు అతనిపట్ల చెడుగా ప్రవర్తించడం చూసి, ఒక అనామకుడు, బుద్ధి భ్రష్టుడు అయిన సన్యాసినిచూసి, నాకు దయ, సహానుభూతి కల్గింది. అందుకే అతని మంచిచెడ్డలు చూడాలని నిశ్చయించుకున్నాను. అతన్ని నాతోపాటు ఉంచుకున్నాను. నెమ్మదిగా అతనికి నాయెడల విశ్వాసం ఏర్పడింది. అలాంటి స్థితిలో అతన్ని రాజసభలోనికి తీసుకొని

రాకుండా ఉండాల్సింది. కాని, మహారాణిగారి ఆదుర్దా - ఆజ్ఞ, మహామంత్రి నాకు విన్నవించారు. లోనికి వచ్చేముందు నేననుకున్నాను - లోపల చాలామంది ఋషులు - మునులు ఉంటారు, వాళ్ళని చూసి యతి ఆనందిస్తాడు అని'.

కాని నేను అనుకున్న దానికి విరుద్ధంగా జరిగింది, చాలా విచిత్రంగా నా కారణంగా మీ ఉత్సవం చెడిపోయింది. బహుశా, స్త్రీ పురుషులను చూసిన కారణంగానో లేక, పారివారిక జీవితం యొక్క ప్రతిక్రియ కారణంగానో, యతియొక్క ఉన్మాదం ఎక్కువయింది. అతను ఆకస్మికంగా అదృశ్యం అయిపోవడం వలన రాజమాతా చాలా దుఃఖించారు.

అనుకోకుండా మీ అందరికి నా వలన ఇబ్బంది కల్గింది. స్నేహం, క్షమా శీలాన్ని కల్గి ఉంటుందని విన్నాను. అందుకే మిమ్మల్ని క్షమించమని అడుగుతున్నాను.

యతిని గురించిన వివరాలు మీ వల్లనే నాకు తెలిశాయి. నేటి అతని స్థితి నిజంగా శోచనీయమైందే. చిన్నతనంలోనే భగవంతుణ్ణి వెతుకుతూ ఇల్లువదలి వెళ్ళిపోయి, ఈ యౌవనంలో, తనలోని మనిషినే మరచిపోయాడు. ఇలాంటి విపత్తు యతికి ఎందుకు కలిగింది అని నేనూ చాలా ఆలోచించాను. ఈ ఉన్మాద స్థితికి మూలకారణం, బహుశా అతని ఏకపక్షమూ, దోషపూర్ణమైన ఆలోచనే అయి ఉంటుంది. మన జీవితం, శరీరం ఆత్మ, స్త్రీ పురుషుడు మొదలైన అనేక ద్వంద్వాత్మకమైన విషయాలతో నిండివుంటుంది. ఈ మౌలిక మానవీయ సంబంధాలకు విరుద్ధంగా యతి ప్రతీకారం తీర్చుకో ప్రయత్నించాడు. అలాంటి ప్రయత్నం సఫలం ఎలా అవుతుంది? ఈ ప్రపంచంలో తన కాళ్ళనుతానే నరుక్కుని ఎవరు నడవగలుగుతారు? తన కళ్ళను తానే పొడుచుకొని ఎవరు చూడగలరు?'

'ఈ ప్రపంచం అసంఖ్యాకమైన ద్వంద్వాలతో నిండివుంది. ఇది నిజం, ఒక సన్యాసి నిర్ద్వంధ్వావస్థలోనే బ్రహ్మానందాన్ని పొందగలుతాడు! ఇలాంటి స్థితిని పొందడానికి అతను ప్రయత్నం చేస్తాడు. అనేకమైన కఠోర నియమాల పాలన కూడా ఇలాంటి అనుభవాన్ని పొందడానికి చేస్తాడు. ఇవన్నీ చేస్తూ కూడా జీవితంలో ఎదురయ్యే ద్వంద్వాత్మక స్థితులను స్వీకరించవలసి వస్తుంది. ఆత్మను దర్శించాలనుకునే ప్రపంచం, ఆ ఆత్మ శరీరాన్ని ధరించిన తర్వాత మాత్రమే

దర్శించగలదు! స్త్రీ నవమాసాలు గర్భం ధరించకుండానే మనిషి ఎలా జన్మిస్తాడు! ఈ విషయాలన్నీ కూడా ఎంత సరళం! సామాన్య మానవుడు ఈ విషయాలన్నీ! ఒప్పుకుంటాడు. అతనూ ఈ ప్రకృతిలో ఒక భాగం అని నమ్ముతాడు. అందుకే అతను దాని స్వామిత్వాన్ని ఒప్పుకుంటాడు'.

'కాని యతి..... ప్రకృతియొక్క స్వామిత్వాన్నిగాని, దాని అస్తిత్వాన్నిగాని ఒప్పుకోడానికి బదులు, దాన్ని తిరస్కరించాడు! ఇదే, అతను చేసిన పెద్దపొరపాటు! మనిషి కేవలం ప్రకృతియొక్క సంతతి కాదన్నది నిజం. దానియొక్క సగభాగం అంటే శరీరం ప్రకృతియొక్క నియమాలతో బంధింపబడి ఉంటుంది. ఆ శరీరం ద్వారానే ఆత్మవికాసం సంభవం. ఈ విధంగా వికాసం పొందిన మానవుడు ప్రకృతిపై అధికారం పొందగలడు. కాని ప్రకృతిని విస్మరించి కాకుండా, దాని సహాయంతోనే ఆ అధికారాన్ని పొందగలడు. జీవితం అంటే కేవలం ఆత్మ శరీరం అని మాత్రమే అనుకోవడం చాలా పొరపాటు. ఇలాంటి ఏకపక్షమైన ఆలోచన వల్లనే మనిషి తనని తాను సర్వనాశనం చేసు కుంటాడు'.

'మనిషి, ప్రకృతికి పరమాత్మకి మధ్య సర్వశ్రేష్ఠమయిన రేఖవంటివాడు. పరమాత్మ ద్వంద్వాతీతుడు. ప్రకృతిని కూడా ద్వంద్వాత్మకంగా ఊహించడం పొరపాటు. అలాంటి కల్పన కేవలం మనిషే చేయగలుగుతాడు. మనిషి దాహం తీర్చి ప్రాణాలు నిలిపేనదే లోతుకుదిగితే ప్రాణాలుతీస్తుంది'.

జీవితపు ఈ ద్వంద్వాత్మ కల్పన కేవలం మనిషి మనసులోనే జాగృత మవుతుంది. జీవితపు ప్రత్యేకస్థితితోపాటు ఈ జ్ఞానంకూడా సూక్ష్మం మరియు వ్యాపకం అవుతుంది. జీవించాలనే తీవ్రమైన కోరిక, దానిని గురించి చేసే ప్రయత్నం కూడా ప్రకృతి ప్రసాదించిన వరమే. కాని మనిషి కేవలం పశువులా జీవించాలని కోరుకోడు. అతను ఒక మనిషిలా, ప్రత్యేకతతో మంచిగా జీవించాలనుకుంటాడు. అందుకే, అతను మంచి - చెడులను విచారిస్తాడు. కాని, ప్రకృతి మాత్రం ధర్మధర్మాలను నిర్ణయించదు, అది కేవలం మనిషికే సాధ్యం. ఒక తల్లియొక్క ఏకైక సంతానం నదిలో మునిగిపోతూంటే నది ఏమాత్రం దుఃఖించదు కదా! కాని, అదే నదిఒడ్డున కూర్చున్న మనిషి - కేవలం జీవించాలని కోరుకునే మనిషే, విచక్షణా జ్ఞానం కలిగిన మనిషే, తన ప్రాణాలను లెక్క చేయకుండా మునిగిపోతున్న వాడిని బ్రతికించడానికి ప్రయత్నం చేస్తాడు.

కాదు! ఇంతవరకూ చాలా విషయాలు వ్రాసినా, నేను చెప్పవలసిన విషయం ఇంకా స్పష్టంగా లేదు. నా ఆలోచన; ఎంత అసంపూర్ణమయినది! నేను సత్యాన్వేషణ కోసం బయల్దేరిన ఒక మామూలు యాత్రికుణ్ణి. ఇంకా నేను చాలా దూరం ప్రయామించాలి! మీతో సంభాషించినప్పుడు, 'ఆత్మ' శబ్దాన్ని చాలాసార్లు ప్రయోగించాను. మీరు నవ్వుతూ అడిగారు కూడా, - ఈ ఆత్మ ఇంతకీ ఎక్కడుంటుంది? ఆ సమయంలో నేను మీ సందేహాన్ని తీర్చ లేకపోయాను. నాదొక చిన్నవిన్నపం - ఇదిగో ఇది - అది ఋషులద్వారా చిత్రింపబడిన ఈ రూపకాత్మకమైన స్వరూపాన్ని ఎప్పుడూ మీరు జ్ఞాపకం ఉంచుకోవాలి. రూపకం ఈ క్రింది విధంగా ఉంది -

'మానవ జీవితంలో 'ఆత్మ' రథికుడు, 'శరీరం' రథం, 'బుద్ధి' సారథి, మరియు 'మనస్సు' కళ్ళెం. వివిధములైన ఇంద్రియాలు గుర్రాలు. ఉపభోక్తములైన అన్ని విషయాలు ఆ రథానికి మార్గాలు. ఇంద్రియాలు మనసుతో కలిసిన ఆత్మ ఉపభోక్త'.

'రథమే లేనప్పుడు, ధనుర్ధారి ఎక్కడ కూర్చుంటాడు? త్వరగా యుద్ధభూమిలోకి ఎలా చేరుకుంటాడు? అతను శత్రువులతో ఎలా పోరాడగలడు? అందుకే శరీర రూపమైన ఈ రథం యొక్క విశిష్టతను ఎప్పుడూ కూడా తక్కువగా అంచనా వేయొద్దు. యతి చేసిన పొరపాటు ఇదే'.

ఇంద్రియాలు, శరీరరూపమైన రథానికి గుర్రాలు, అలాంటి గుర్రాలే లేకుండా ఈ రథం ఒక్క అడుగుకూడా కదలలేదు. అంతేకాకుండా ఆ రథాన్ని తీసుకుపోతే, ఎక్కడో లోతైన లోయలోపడి మొత్తం చిత్తుచిత్తుగా అవుతుంది. అందుకే ఇంద్రియాలనే గుర్రాలకు మనస్సునే కళ్ళెం ఎప్పుడూ అవసరం. ఇంకా గుర్తుంచుకోవలసిన విషయం ఏమంటే, ఆ కళ్ళెం కూడా సారథి అదుపులోనే ఉండాలి. అందుకే మనస్సుపైన బుద్ధి అనే సారథి నియంత్రణ ఉండాలి. బుద్ధి, మనస్సు కలిసి మాత్రమే శరీరమనే రథాన్ని ఒడుదుడుకులు లేకుండా నడపగలవు.

'ఈ విధంగా నడపగలితే రథం సక్రమంగా నడుస్తుంది, కాని, అందులో రథికుడే లేనప్పుడు, ఆ రథం ఎక్కడికి వెళ్తుంది? ఏ దిశగా వెళ్తుంది? దాని గమ్యం ఏమిటి? కార్యం ఏమిటి? అందరి మనుష్యులలో ఉండే, నీలో, నాలో అందరిలో

'అహం'గా ప్రకాశించే, కేవలం మనస్సు, బుద్ధి కంటే అతీతమైనదేకాకా, జన్మ - మృత్యువులకు కాకుండా అతీతమైన ఈశ్వరాంశమైన శక్తియే ఈ 'ఆత్మ', అదే ఈ శరీరమనే రథముపై అధిరోహించిన 'రథికుడు'.

'నేను చాలా పెద్ద లేఖనే వ్రాసాను. నాలాంటి యోగికి, ధర్మాన్ని ఆచరించే వాళ్ళకి ఇలాంటి విషయాలు కూడా చాలా రసాత్మకంగా ఉంటాయి. కాని, ఇతరులకు మాత్రం ఇదంతా వ్యర్థప్రలాపనలా ఉండుాచ్చు. అలాగే, మీలాంటివాళ్ళకి ఇలాంటి వేదాంత పరమైన చాదస్తపు విషయాలు అవసరం ఏం ఉందిలే? రాజధర్మం మరియు పతిధర్మం యొక్క ఆచరణ కొరకు మీకు, మరియు గృహిణిధర్మం - పత్నీ ధర్మం ఆచరణ కొరకు కొంచెం కఠినంగా ఆభివర్ణించి ఉంటాను! అవునా?

'అతి వినయాన్ని ప్రదర్శిస్తూ నేనేమీ రాయటంలేదు, కాని, నాకు చాలాసార్లు అనిపించేది, యోగి ధర్మాచరణకంటె గృహస్థధర్మం ఆచరించడం చాలా కఠినం అని.. ప్రతి మనిషిలోనూ 'ఆత్మ' శరీరమనే పంజరంలో బంధింపబడే ఉంటుంది. ఈ అభిన్నమైన అనుబంధాన్ని మరచిపోవడానికే ప్రయత్నిస్తూ ఉంటుంది. ఈ ఆత్మ, అంతేకాకుండా సుఖంకంటే మించి బ్రహ్మానందాన్ని పొందడానికి నిరంతరం ప్రయత్నిస్తూంటుంది. ముక్తికోసం ఆత్మ చేసే ఈ ప్రయత్నం, ప్రపంచంలో అనంత రూపాలలో వ్యక్తమవుతుంది. యోగిధర్మం కూడా ఇదే ప్రయత్నానికి ఒక చక్కటి ఉదాహరణ.

ఇందుకు విరుద్ధంగా, స్త్రీ - పురుషుల అనురాగం కూడా ఇదే ముక్తికోసం చేసే ప్రయత్నం యొక్క వేరొక రూపమే. కాని ఈ అనురాగంలో కేవలం శారీరిక ఆసక్తి మాత్రమే ఉండదు, ఆ ఆసక్తివలన శారీరిక కలయిక జరుగుతుంది. నిజమైన అనురాగంలో మనసుల కలయిక కూడా ఉంటుంది. ఇంకొక కాలానికి ఆత్మల కలయిక కూడా జరగవచ్చు. ఆత్మల కలయిక అయిన ఈ రమణీయమార్గం ఈశ్వర ప్రాప్తికి శ్రేష్ఠమార్గమే అయినా అతి కఠినమైనది. గృహస్థధర్మం ఈ విధంగా శ్రేష్ఠమూ, పవిత్రమయిన యజ్ఞం కూడా. సహస్ర అశ్వమేధ యజ్ఞఫలం కూడా ఈ గృహస్థ ధర్మంలో ఉంది. కాని, ఈ గార్హస్థ్య యజ్ఞం సఫలం కావాలంటే భార్యాభర్తలిరువురూ కూడా తమలోని అహంకారాన్ని మొదటి ఆహుతిగా సమర్పించాలి.

దేవయాని, త్వరలోనే తల్లి అవుతుంది. తల్లి హృదయం, ప్రపంచంలోని అన్ని వేదాంతాలా నిధి లాంటిదని అంటూంటారు. అన్నికావ్యాలు - పురాణాలు, వాదాలు సమస్త వాఙ్మయంకూడా ఆమో హృదయంలోనే రూపుదిద్దికుంటాయని అంటారు. దేవయానితో చెప్పండి, ఆమె ఆహ్వానం పంపించివలసిన అవసరం లేదనీ కూడా చెప్పండి. ఎందుకంటే నేను ఆమె సోదరుణ్ణికూడా! శుక్రాచార్యుల ఆశ్రమంలో ఆమె సాహచర్యంతో గడిపిన రోజులు, ఇప్పటికీ నాకు గుర్తున్నాయి! ఆమె తల్లి, తన చిన్నతనంలోనే చనిపోయింది. నాకు కూడా మా అమ్మ గుర్తు లేదు. ఈ విషయంలో మేమిద్దరమూ సమ - దుఃఖితులమే. బహుశా అందుకేనేమో మా ఇద్దర మధ్య స్నేహం అంత త్వరగా ఏర్పడింది. బహుశా, సుఖంకంటే దుఃఖ సమయంలోనే మనుష్యులు ఒకరికొకరుతోడుగా దగ్గరవుతారేమో!

'చూసారు కదా? మరలా, నేను చెప్పిన విషయాలే పదే - పదే చెప్పి విసిగిస్తున్నాను కదా! అందుకే ఇంతటితో లేఖను ముగిస్తున్నాను'.

'ఆదిశక్తి మీ ఇరువురుని సదా కాపాడి రక్షించుగాక!'

ఈ లేఖ చదివి - చదివి విసిగిపోయాను. ఈ కచుడు కూడా, ఏదో ఒక రోజు, ఆ యతి లాగా పిచ్చివాడై నాముందు ప్రత్యక్షమవుతాడోమో.

అమ్మో వద్దు! వద్దు! కచుడు ఎంతటి కఠినుడైనా కావచ్చు, కాని ఇలాంటి అమంగళ కల్పన నేను సహించలేను.

లేఖంతా చదివిన తర్వాత కూడా ఇలాంటి ఆలోచన నాకెలా వచ్చింది?

ఆత్మ, ఆత్మ, ఆత్మ! స్త్రీ - పురుషుల ప్రేమానురాగంలోకూడా అతనికి ఆత్మ కన్పిస్తుందా! వివాహం చేసుకుంటే తెలిసివచ్చేది మహాశయుడికి. ప్రేమలో ఆత్మ ఏమాత్రం ఉంటుందో! నరమాంస భక్షణకు అలవాటుపడిన సింహం, స్త్రీ సౌందర్యం పై మోహితుడైన పురుషుడూ - ఇరువురూ ఒక్కటే. అలాంటి పురుషుడు, లావణ్యం, తారుణ్యం, శారీరిక సుఖంకోరుకుంటాడు, కేవలం అతనికి నషా, కైపు కావాలి. వీణావాదకుడికి కూడా బహుశా వీణపై దయ కల్గుతుందేమో కాని సౌందర్య లోలుడైన పురుషుడికో .........

మహారాజు ఆ లేఖని ఇమ్మని అడిగారు. బహుశా, మరలా చదవాలనేమో! నేను నవ్వుతూ అన్నాను, 'ఈ లేఖ నాకంటె కూడా అందమైనదా?'

నావైపు తదేకంగా చూస్తూ ఆయన అన్నారు, 'విధాతకూడా బహుశా ఈ సమయంలో ఆలోచనలో మునిగి ఉంటాడు. నీకంటె అందమైన వస్తువును మరలా సృష్టించలేనందుకు!'

'అంతే! ఇలా ముఖస్తుతి చేసి తప్పించుకుందామనుకుంటున్నారేం! అని సిగ్గుతో నేనన్నాను. నా గడ్డం పట్టుకుని పైకెత్తుతూ నాకళ్ళల్లోకి చూస్తూ ఆయన అన్నారు, నిజం, దేవయానీ! మునుపుకంటె నీవు మరీ అందంగా ఉన్నావు!'

'కాని దేనికి కారణమేమిటో మీకు తెలుసా?'

'ఉం , హుం! తెలీదు!'

అతని ఒడిలో ముఖం దాచుకుంటూ నేనన్నాను, 'మగవాళ్ళు ఉత్త తెలివి తక్కువ వాళ్ళే, ఓయి మగడా, నేను ఇప్పుడు తల్లినిగాబోతున్నాను!'

అప్పుడు అతనికంతా అర్థమయ్యింది. నేను వద్దు, వద్దంటున్నా ఆయన నా ముఖంపైకెత్తారు. అలా చాలా సేపు రెప్పవాల్చకుండా చూస్తూండిపోయారు. తర్వాత అన్నారు, 'ఈ స్త్రీలంటే విధాతకి ఎందుకో అంత దయ! ప్రకృతిలో అత్యంత విచిత్రమైన రహస్యం మీ చెవిలో వేస్తాడు!' కొంచెం ఆగి మరలా అన్నారు,

'ఇంక, ఇప్పుడు నీ గర్భిణీ కోరికలు మొదలౌతాయన్నమాట!'

'మొదలౌతాయి ఏమిటి, అప్పుడే మొదలైపోయాయి'

'అయితే మరి ఇంతవరకూ ఏమీ చెప్పలేదే?'

'మీరేమో పనుల్లో మునిగిపోయారు, ఇంక, నా కోరిక కూడా చాలా కఠిన మైనది!'

'అదేమంత పెద్ద విషయమా? ఏమిటో, నీ కోరిక చెప్పిచూడు, ఇంక నీ నోటిలో మాట నోట్లో ఉండగానే తీరిపోయిందనుకో'.

'అయితే చెప్తున్నాను వినండి! నా మొదటి కోరిక, ఈ లేఖ, అదే మీ మిత్రుడు కచుడు వ్రాసిన లేఖని ఇంకెప్పుడూ చదవకూడదు!'

'ఎందుకని?'

'ఆ లేఖ చదివినవాళ్ళెవరైనాసరే పిచ్చివాళ్ళైపోతారు. నాకైతే అందులోని విషయం ఏమాత్రం అర్థంకాలేదు'.

'కాని ...... .......'

'కాని ........ గీని ఏమీలేదు. మీ చిన్ననాటి స్నేహితురాలి తలవెంట్రుక అదే, బంగారు తలవెంట్రుక, భద్రంగా దాచేరే, అదే పెట్టిలో ఈ వుత్తరంకూడా పెట్టే యండి. వృద్ధాప్యంలో మరలా దీన్ని బయటికి తీసి నచ్చినంతకాలం మాటిమాటికి పారాయణంచేద్దాం. కాని ఇప్పుడు మాత్రం వద్దు. ఈరోజు నా మనసు మాటి మాటికి, తల్లినికాబోతున్నానన్న సంతోషంతో పులకరించిపోతోంది, ప్రపంచంలోని సుఖాలన్నీ రెండు చేతులూ జోడించి మనముందు వంగి నమస్కరిస్తున్న సమయంలో, ఈ ఆత్మ ....... ...........కి సంబంధించిన వ్యర్థ ప్రలాపన ఎందుకు............

అతను నవ్వుతూ అన్నారు, 'అలాగే, నీకెలా నచ్చితే అలాగే సరేనా!'

ఆ తర్వాత నెలా, నెలన్నర సుఖంగా గడిచిపోయింది. గర్భిణీ కోరికలు తీరడంలో నాకెలాంటి లోపంలేదు. చెప్పడమే తడవుగా పూర్తవుతుండేవి. మహా రాజు ఆనందమైతే ఇంకా చెప్పనలవికాదు. నేనేం చెపితే అది అక్షరాలా పాటిస్తున్నారు.

నగరోత్సవంలో ప్రదర్శించిన నాటకాలను మరొక్కసారి చూరడాలనిపించింది. మహారాజు వెంటనే తగు ఏర్పాట్లు చేసారు. ఆ నాటకాలు చూస్తున్నంతసేపూ మా మధ్య జరిగే పూర్వసంభాషణలన్ని జ్ఞప్తికి రాసాగాయి. ఆ సమయంలో నేనాయనతో అన్నాను, మీరు ఋషి వేషంలో చాలా బాగుంటారు! ఆ రోజు కచుడు వ్రాసిన లేఖ చదివిన తర్వాత ఆయనే స్వయంగా అన్నారు, నేనే గనుక కచుడిలా తపస్వి నయిఉంటే!'

నేను ఏదే - పదే ఊహించుకోనేదాన్ని. మహారాజు ఋషివేషంలో ఎలా ఉంటారో గదా అని.

ఎంతటి విచిత్ర కల్పన! కాని ఆకోరిక తీరేదెలా? చివరికి నాకొక మెరుపు లాంటి ఆలోచన వచ్చింది. నేనాయనతో అన్నాను, 'వెన్నెలరాత్రిలో ..... యమునానది ఒడ్డున, ఎవరైనా ఒక ఋషితో విహరించాలని, మనసు చాలా ఉబలాట పడుతుంది'.

ఆయన నవ్వుతూ అన్నారు, 'వెన్నెలలో యమున ఒడ్డుకి ఎప్పుడైనా వెళ్ళొచ్చు! కాని ఎవరైనా ఋషితో విహరించాలనే నీ కోరిక ....... చాలా విచిత్రంగా ఉందే!'

'మహర్షి ఆశ్రమంలో పెరిగిన కన్యనుకదా! మహారాణి అయినంతమాత్రాన, ఆ పూర్వ సంస్కారపు వాసన పోతుందా?'

'కాని, ఈ నీ కోరిక తీర్చడానికి, తెలిసిన ఋషిని ఎక్కడనుండి తీసుకు రాగలం? మీ తండ్రిగారా ....... తపస్సులో కూర్చున్నారు. పోనీ .......... కచుడి క్కడ ఉండి ఉంటే ........ ...........'

'అరె, నేనేం అలాంటి ఋషులతో వేదాంతం మాట్లాడటానికి కాదు? ఊరికే, నాది పిచ్చికోరికే అనుకోండి! మీరే స్వయంగా ఋషి వేషం వేసుకొని వచ్చినా నాకేం అభ్యంతరంలేదు!'

'తత్ ......... భలే దానివే!'

'మీరు నన్ను హృదయపూర్వకంగా చూడటంలేదు, మీ ప్రేమంతా ఉత్త నాటకం! అని నేను బుంగమూతి పెట్టి అలక నటించాను. ఒకటి రెండురోజులు మహారాజుతో మాట్లాడ్డం కూడా మానేశాను. ప్రయత్నపూర్వకంగా కావాలనే దూర దూరంగా ఉండసాగాను.

ఇంతకు మునుపు కూడా ఇలా ఎప్పుడైనా అలిగితే ఆయన తగు విధంగా నన్ను తనవైపు ఆకర్షించే ప్రయత్నం చేసేవారు. ఈ సారి మాత్రం నేను పట్టిన పట్టు విడవకపోవడంతో, సంకోచిస్తూ ఋషివేషం ధరించడానికి ఒప్పుకున్నారు. నగరో

త్సవంలో వేషధారణకు సహాయపడిన కళాకారుడికి చెప్పి మహారాజును అలంకరింపజేయడానికి ఒప్పించాను. ఒక వెన్నెలరాత్రిని నిర్ణయించడం జరిగింది. ఆరోజు సాయంత్రం రంగశాలలో ప్రవేశించి చూసాను. అక్కడ నుండి ఒక తేజస్వి ఋషి వేషంలో, చేతిలో దండ - కమండలాలు పుచ్చుకొని నాతో సహా నడుస్తున్నారు.

నేను సారథికి చెప్పి, యమునా నది ఒడ్డుకు తీసుకుపొమ్మన్నాను. నేను సారథిని ఈ నాటకంలో మొదటే భాగస్వామిని చేసాను. లేదంటే ఆ సారథి మాటి మాటికి వెనుదిరుగి చూస్తూ ....... మహారాణి ఏమిటి ....... ఎవరో ఋషితో ఇంత సన్నిహితంగా.........? అని ఆశ్చర్యపడవచ్చు.

యమున ఒడ్డున మనసుదీరా వెన్నెల ఆనందాన్ని అనుభవించిన పిదప నేను మహారాజుతో అన్నాను, 'నేను ఈరోజు ఒక పెద్ద విజయం సాధించాను!'

'ఎలాంటి విజయం?'

'మీకు జ్ఞాపకముందా? - నగరోత్సవ నాటక సమయంలో నేను మీతో అన్నాను - మీకు ఋషివేషం బాగా కుదురుతుందని! అప్పుడు మీరన్నారు, నేనెట్టి పరిస్థితిలోనూ, ఋషినికాను అని! కాని, ఈరోజు? ......... చెప్పండి! ఎవరు పందెం గెలిచారు?'

ఆ తర్వాత ఎంత సేపటివరకూ ఈ విషయం గురించి ఇద్దరమూ తనివి తీరా నవ్వుకున్నాము.

యమునా తీరం నుండి తిరిగి వస్తున్నప్పుడు నా మనసులో ఇంకొక చిలిపి ఆలోచన తట్టింది. అక్కడ నుండి అశోకవనం పెద్ద దూరమేమీకాదు. ఈ వేషంలో శర్మిష్ఠ ఎలాగూ మహారాజుని గుర్తుపట్టలేదు! ఒక్కసారి శర్మిష్ఠను ఎందుకు ఆట పట్టించ కూడదని మనసులో అన్పించింది.

మహారాజు, వద్దు - వద్దు అంటున్నా నేను మాత్రం సారథికి చెప్పి అశోక వనం వైపు రథం నడపమన్నాను.

రథం ఆగగానే ఇంతరాత్రప్పుడు ఎవరొచ్చారో తెలుసుకుందామని ఇద్దరు

నౌకర్లు వచ్చారు. నేను వాళ్ళతో అన్నాను - ఈరోజు రాజమందిరానికి ఈ మహాత్ములు వచ్చారు. ఆయన మన అతిథి. శర్మిష్ఠకూడా ఆయన దర్శనం చేసుకుటుందని ఇక్కడికి తీసుకువచ్చాను. నాలుగు ఘడియలలో మళ్ళీ ఈయనను తీసుకొని పోవడానికి వస్తాను. ఈయనను లోనికి తీసుకువెళ్ళి శర్మిష్ఠను దర్శనం చేసుకోమని చెప్పండి!

మహారాజు అవును అనిగాని కాదు అనిగాని అనలేకపోయారు. ఒకవేళ అనుకోకుండా ఈ రహస్యం బయటపడుతుందేమోనని భయం! మనసులో ఇష్టం లేకున్నా లోనికి వెళ్ళారు.

నాకు శర్మిష్ఠమీద మాటిమాటికి నవ్వు వస్తుండేది. ఈరోజు పాపం శర్మిష్ఠ ఋషి మహాత్మునికి ఆదర - సత్కారాలు చేస్తుంది. తర్వాత ఎప్పుడో ఈ నాటకం గురించి చెప్పి ఆమెను ఆశ్చర్యపరుస్తాను. అప్పుడు ఆమె సిగ్గుతో చస్తుంది.

రెండు, మూడు ఘడియల తర్వాత, యమున ఒడ్డున వెన్నెలలో ఏకాంతంగా విహరించిన పిదప, మహారాజుని తోడ్కొని వచ్చేసాను.

రాజమందిరానికి వచ్చేటప్పుడు మహారాజు నాతో అన్నారు, 'నాలుగు ఘడియలు ఈ ఋషి వేషం వేయించావు, ఈ పాత్రను పోషించడానికి నాకు భగవంతుడు గుర్తుకొచ్చాడు! ఉ ......... ఫ్ ......... ఫ్ దేవ - దానవులు సముద్ర మథనం చేసినప్పుడు, విష్ణువు మోహినీ వేషం ధరించి ఎంత అవస్థపడి ఉంటాడో నేనూ ఊహించుకో గలిగాను'.

అని ఆయన మిన్నకుండిపోయారు. కాని ఆయన ముఖంలో ఏదో ఉల్లాసం, ఉత్సాహం కన్పించాయి. ఇంత సంతోషంగా ఉండడానికి కారణమేమిటో నాకు అర్థంకాలేదు. ఆయన ముఖంలోని ఆ సంతోషాన్ని చూసినప్పుడు, ప్రాతఃకాలంలో తూర్పు దిశలో నవీనకాంతులలో, రంగురంగులతో కళకళలాడుతున్న ప్రాతః సంధ్యాసుందరి నాకు జ్ఞప్తికి వచ్చింది.

నేను అడిగాను - 'శర్మిష్ఠని, ఈ నా ఋషి మహారాజు ఆశీర్వదించారా? లేదా?'

'ఎందుకాశీర్వదించను? ఋషి పాత్రము పోషించాలి కదా! మంచి విశేషమైన హృదయ పూర్వకమైన ఆశీర్వాదం ఇచ్చి వచ్చాను!'

'అది ఒక తుచ్ఛమైన దాసి, అలాంటి దానిని ఏమని ఆశీర్వదించారో?'

'అదే, ప్రతి కన్యకూ ఇచ్చేదే - అపురూపవర ప్రాప్తిరస్తు!'

మహారాజు ఇచ్చిన ఆశీర్వాదం విని నాకు నవ్వలేదు. ఆహా! ఏం చెప్పను! ఇప్పుడు ఇతనిచ్చిన ఆశీర్వాదంతో ఆమెకు తగిన భర్తలభిస్తాడు, అంటే, అశోక వనంలోనే ఎవడో నౌకరుతో పెండ్లి అవబోతుంది!

తండ్రిగారు గుహలో ప్రవేశించి మూడునెలలు కావచ్చింది. ఆయన దర్శనం చేసుకొనే సమయం దగ్గర పడింది. నేను అక్కడికి వెళ్ళడానికి తొందర చేయ సాగాను. కాని మహారాజు, అంతదూరం నీవు ప్రయాణం చేయలేవు అని అన్నారు. కాని, నాకు మాత్రం వెళ్ళాలని ఉబలాటంగా ఉంది. తపస్సు కారణంగా ఆయన ఆరోగ్యం దెబ్బతిన్నదేమోనని పదేపదే మనసులో అనిపించేది. అందుకే నా కళ్ళతో ప్రత్యక్షంగా ఒక్కసారి చూస్తేగాని నా మనసు కుదుటపడదు.

నేను తండ్రిగారిని దర్శించడానికి అక్కడికి చేరుకుని, ఆయన స్వస్థతగా ఉండటం చూసి చాలా సంతోషించాను, కాని అక్కడికి వెళ్ళిన తర్వాత నాకు కాస్త అస్వస్థత చేసింది. అనుకున్న సమయం కంటే కాస్త ఎక్కువకాలం, మహారాజుగారికి దూరం కావలసివచ్చింది.

స్వచ్ఛందంగా విహరిస్తున్న లేడిలాగ కాలం గడిచిపోయింది!

నెలలు నిండిన పిదప నేను తల్లినయ్యాను. నాకు పుత్ర సంతానం కల్గింది. మహారాజు గారైతే మొదటవారి తండ్రిగారి పేరుపెడదామన్నారు. లేదా వారి ముత్తాత పేరు పెడదామన్నారు. కాని, అలా ఎరువు తెచ్చుకున్న పేర్లు పెట్టడం నాకు సుతారామూ ఇష్టంలేదు, నాకిష్టం వచ్చిన పేరు - 'యదు' అని సూచించాను -

నామకరణ మహోత్సవానికి శర్మిష్ఠకూడా రాజమందిరానికి వచ్చింది. ఆమె శరీరఛాయ, నడకపూర్తిగా మారిపోయాయి. దేహంలో ఏదో అపూర్వమయిన మెరుపు వచ్చింది. ముఖం కళకళలాడుతుంది. ఈ దాసిపని ఈమెకు ఇంతలా

కుదురుతుందని నేననుకోలేదు సమా! అశోకవనంలో నిర్జన ప్రదేశంలో బిక్కుబిక్కు మంటూ ఉంది, తన ఓటమిని అంగీకరించి, తనను దాస్య విముక్తిచేయమని నా ముందు ప్రాధేయపడుతుందని, నేననుకున్నాను! కాని, ప్రత్యక్షంగా చూస్తున్న విషయం అందుకు విరుద్ధంగా ఉంది. ఆమె ఎప్పుడూ, సుఖంగా, సంతోషంగా, ప్రసన్నంగా కన్పిస్తున్నది.

ఆమె ముఖం చూస్తే నాకలాగే అన్పించింది. కాని, ఆమె నడకతీరు చూసి ఇంకొక అనుమానం కూడా వచ్చింది. నేను, మాముసలి దాసిని ఆమెపై ఒక కన్ను వేసి కనిపెట్టమని చెప్పాను. ఒక్క అర ఘడియలోనే ఆ ముసలిదాసి వచ్చింది. వచ్చి నాచెవిలో గుసగుసలాడింది. మనసులో తర్క - వితర్కంతో సంఘర్షణ ప్రారంభ మయింది. ఒక రాజకన్య అయి ఉండికూడా, ఆమె వ్యభిచారం చేసి ఉంటుందా? ఏ నౌకరుతోనో అక్రమ సంబంధం?

ఏమైనా కాని! ఇది ముమ్మాటికి నిజం, ఆమె వ్యభిచారం చేసింది! పాపం ఎక్కడైనా రహస్యంగా ఉంటుందా?

ఆమె మరలా నాకు చిక్కింది, నా ముందు సిగ్గుతో తలవంచుకొని నిల బడటం తప్ప ఆమెకు గత్యంతరంలేదు. తనుచేసింది మామూలు అపరాధమా?

దాసీలందరినీ బయటికి వెళ్ళమని శర్మిష్ఠను లోనికి పిలిపించాను. ఆమె వచ్చి ముఖం వాల్చి నిలబడింది. నేను మిన్నకుండటం చూసి అంది - 'చెప్పండి, ఏమి ఆజ్ఞ?'

'కేవలం తలఎత్తి చూడు?'

ఆమె తలఎత్తి చూసింది.

'నాదొక ప్రశ్న! దానికి సరైన జవాబు ఇవ్వాలి, మీ తల్లిదండ్రులమీద ఒట్టుపెట్టి మరీ చెప్పాలి'

ఆమె మౌనంగానే నిలబడింది.

కొంచెం కర్కశంగా అడిగాను, 'నీవు ........ గర్భవతివా?'

ఆమె పెదవులు కొంచెం వణికాయి. కాని నోటినుండి ఏమీ మాట పెగల లేదు. చివరికి ఆమె తలఎత్తి ...... 'ఆం అవును' అంది.

'ఛీ! కులటా!'

'నేను కులటనుకాదు, ఒక గొప్ప ఋషి ఆశీర్వాదం వలన ......'

'ఋషి ఆశీర్వాదం ......... వలన? ఎవరా ఋషి? ఎవరు ఇలా దయ చూపిం చింది నీపైన? కచుడా?'

ఆమె మరలా ఏమీ జవాబివ్వలేదు. నవ్వలేదు. భయపడలేదు. కేవలం రాతి బొమ్మలా నిలబడింది.

## శర్మిష్ఠ

దేవయాని 'నీవు గర్భవతివా?' అని ప్రశ్నించినప్పుడు నేను సిగ్గుతో వణికిపోయ్యానో, లేదో? కాని నేను కేవలం గాభరాపడ్డాను, సందిగ్ధంలో పడ్డాను. మనసులో ఒకేసారి లజ్జ, భయం రెండూ భావాలు జాగృతమయ్యాయి. శరీరమంతా కూడా గడ గడ వణికింది. ఛాతీవిరిచి, గర్వంగా 'ఆం' అని అనాలనే తీవ్రమయిన కోరిక మనసులో కలిగింది. 'ఆం' ఏకాక్షర శబ్దము! అతి చిన్న శబ్దము! కాని అది లోలోపలే ఎక్కడో మనసులో ఇరుకున పడి ఉండిపోయింది.

మేమిద్దరమూ చిన్ననాటి స్నేహితురాళ్ళం. అలాంటి స్నేహితురాళ్ళు వివాహితలై ఒకరినొకరు కలుసుకొని, నవ్వుతూ - తుళ్ళుతూ మాట్లాడుకుంటూ ఒకరి నొకరు సరదాగా ఆటపట్టిస్తూ 'ఏమే సఖీ! ఎవరైనా పుట్టబోతున్నారా!' అని అడిగితే ఒకరి చెవిలో ఇంకొకరు రహస్యాన్ని చెపుతూంటే! ఆహాం............ కాని విధాత. ఎంత కఠినుడో కదా, నా జీవితంలో అలాంటి మధుర సన్నివేశం రాయలేదు.

శర్మిష్ఠ తప్పును పట్టుకొన్న దేవయానికి చాలా ఆనందంగా ఉంది. శర్మిష్ఠ దొంగ చాటుగా ప్రేమించిన వ్యవహారం బట్టబయలు చేయడమే ఆమెకు ఆనందం. ఆమెకు మరొకందుకు కూడా చాలా సంతోషంగా ఉంది, శర్మిష్ఠ ఆమె చేతిలో

చిక్కింది, సింహానికి కొత్త ఆహారం దొరికితే సంతోషించినట్లుంది, ఆమె వ్యవహారం. ఇంక ప్రతిసారి నన్ను ''కులటా' అని సంబోధిస్తూ అవమానించబోతుంది.

ఆమె నోటితో కులట అనే మాట వింటూనే నా రక్తం ఉడికిపోయింది. నేను తలచుకొంటే ఒక్క మాట చెప్పి ఆమె నోరు మూయించగలను. ఆ ఒక్క మాటతో రాజమందిరం మొత్తం అల్లకల్లోలం అయిపోతుంది. నా కడుపులో పెరిగే బిడ్డకు తండ్రెవరో చెపితే ఆమె నోటికి తాళంపడిపోతుంది.

ఆయన పేరు బయటపడితే, ఒక్క క్షణంకోసం, నా ప్రతీకారం తీర్చుకున్నాననే సంతోషం లభించినా, ఆ ఒక్క 'పేరు' కారణంగా 'యదు' నామకరణ మహోత్సవం చెడిపోతుందని ఆలోచించాను! చూస్తూండగానే రాజమందిరంలో అంతటా ఉదాసీనత అలముకుంటుంది. దేవయాని మహారాజుని విసిగించిగాని వదిలిపెట్టదు. ప్రశాంతంగా బ్రతకనివ్వదు. ఇద్దరికీ ఇక పొత్తుకుదరదు. ఇంకా ఏమి జరిగిపోతాయో? క్షణికమైన నా సుఖం కోసం, నేను అలా చేయగలనా, అలా చేయడం వలన నాకు ప్రియాతి ప్రియమైన వ్యక్తికి దుఃఖం కలిగదా? అలా ఎన్నటికీ చేయను! అలా చేస్తే అది ప్రేమ అనిపించుకోదు! ఎవరైతే తన సర్వస్వాన్ని ప్రేమ కోసం ధారపోస్తారో, అదే నిజమైన ప్రేమ!

'నేను కులటనుకాదు, ఒక ఋషి ఆశీర్వాదం వలన ......' ఈ మాటలు అప్రయత్నంగా ఎలా అనగలిగానో, నాకే తెలియదు! కాని ఆ మాటలు నాకు కాస్త ధైర్యాన్నిచ్చాయి. అవి నా పరువునిలబెట్టాయి. ఆ మాటలు అసత్యమే అయినా యదార్థంకూడా!

సూర్యుడు లేదా గొప్ప గొప్ప ఋషుల ఆశీర్వాదంతో అవివాహితలైన కన్యలు గర్భవతులుకావడం వంటి కథలెన్నో అందరికీ తెలుసు. అలాగే నా జవాబు వినికూడా దేవయాని ఒప్పుకుంటుందని అనుకున్నాను. కాని, స్వభావాన్ని మార్చగలిగే మందు ఎక్కడైనా ఉందా? వెంటనే ఆమె నామీద విరుచుకుపడి, 'ఎవరు నీ మీద ఇలా దయ చూపింది? కచుడేనా?' అన్నది ఈ దేవయానే .... ఒకప్పుడు కచుని మనసారా ప్రేమించింది. కచుని స్వభావం తెలిసి కూడా ఇలా నింద వేయడానికి రవంతకూడా సందేహించలేదు!.

ఎవరు నీపై ఇలా దయచూపింది? ఎంత సందిగ్ధం, ఎన్ని సూదిపోట్లు, ఆ మాటలు ఎంత విషపూరితాలు! కచునివంటి పవిత్రమయిన పురుషునిపైనా ఇలాంటి అపనింద!

స్వచ్ఛమయిన కమలాలతో పూజించబడవలసిన దేవతను బురదతో ఎవరైనా అభిషేకిస్తారా? కాని, అందాలరాణి దేవయాని ఖచ్చితంగా అలాగే చేసింది.

నేను మాత్రం కేవలం 'ఒక ఋషి ఆశీర్వాదం వలన' అన్నాను! దేవయానికి క్రూరంగా నన్ను హేళన చేయాలని ఉంటే, ఆ పిచ్చి యతి పేరునుగాని ఉదహ రించి ఉంటే నా మనసు అంతగా బాధపడి ఉండకపోను.

అలాగే ఆరోజు నిండుసభలో కూడా దేవయాని నన్ను ఎంతగా అగౌరవ పర చిందా? ఆ పిచ్చి యతి నాపైపు చూస్తూ అడిగేశాడు - 'ఏయ్, నీ ఈ దాసీని నాకిస్తావా?' నిజానికి దేవయాని, ఈ పిచ్చివాడి మాటలకేంలే, అని సరిపుచ్చుకుని మిన్నకుండవలసింది. కాని, నన్ను మరింత అవమానపరచడానికే ఆమె అతన్నిలా అడిగింది 'ఈమెను ఏం చేసుకుంటారు స్వామీ? ఈమెను మీ భార్యగా చేసు కుంటారా?' అయితే మంచిదే అయింది, అతను నిజంగా పిచ్చివాడే, అంతేకాక, ఇంటి నుండి పారిపోయిన రాజుగారి పెద్దకుమారుడు. మహారాజుకు అన్నగారు. లేకపోతే నా పరువేం కాను? అతని స్థానంలో ఎవడో దొంగసాధువుని ఉంటే అతను అలాగే అని ఒప్పేసుకునేవాడు. ఈ రాక్షసి దేవయాని కూడా నన్ను వాడి కిచ్చి కట్టబెట్టేది! అంత నిండు సభలో దేవయాని అలాంటి ప్రశ్నవేయడంతో నా శరీరం స్థాణువులా అయిపోయింది. సరిగ్గా ఊపిరి తీసుకోవడం కూడా నావల్ల కాలేదు.

కాని యతి పిచ్చివాడవటంలో సందేహంలేదు. అతనిలా పిచ్చివాడవటానికి కారణమేమిటో తెలీదు. పదే - పదే నా మనసులోని ఒకే ఒక ఆలోచన నన్ను విసిగించేది. ఇల్లువాకిలే విడిచి అడవిలో తపస్సుచేసుకోవడానికని వెళ్ళిన మనిషికి ఈ దుస్థితేమిటి? అతనితోపాటు కచుడు కూడా అశోకవనంలో ఉండటానికి వచ్చాడు! ఇద్దరూ జప - తపాలు చేయాల్సిన యోగులే - కాని ఇద్దరిలోనూ - భూమ్యాకాశాల తేడా ఉంది. కచుడు, ఎంత స్నేహశీల, ఎంత వివేకి, ఎంతగా సంభ్ర మాశ్చర్యపరిచే వ్యక్తి! కాని, యతి ఒక్కొక్కసారి నా కళ్ళల్లో కళ్ళు పెట్టి

గుచ్చి గుచ్చి చూస్తాడు - కాని ఆచూపులో కోరిక లేదు! కాని భయంకరంగా ఉంది ఆచూపు, అతని చూపు గురించిగానీ, వేషభాష గురించిగానీ, ప్రవర్తన గురించి గానే, మాట్లాడే విధానం గురించిగానీ, అంతేకాదు అతనికి సంబంధించిన ఏ విషయం గురించి నేను చెడ్డగా ఎవరితోనూ అనలేదు, ఎందుకంటే రాజమాతకు తెలిస్తే ఆమె బాధపడుతుంది! కాని ఏం జరగాలో, అది జరిగేపోయింది.

ఒక రాత్రి నేను గాఢంగా నిద్రపోతున్నాను. ఎవరిదో చల్లని స్పర్శతో ఉలిక్కి పడి లేచాను. నా కంఠంపై ఎవరిదో చేయి. కేవలం చేయి వేసినట్టులేదు. రెండు చేతుల్తో నా గొంతు నొక్కుతున్నారెవరో! నా శ్వాస ఆగిపోయేటట్టు ఉంది, నేను చాలా భయపడ్డాను.

గజగజ వణికిపోతూ కళ్ళుతెరిచాను, యతి నాప్రక్కనే కూర్చున్నాడు. నాగొంతు నొక్కుతున్నప్పుడు అతని కళ్ళు గూటిలోని గుడ్లగూబల్లా విచిత్రంగా మెరుస్తున్నాయి. అతను తనలోతానే నవ్వుకుంటున్నాడు. ఎంత భయంకరమైన నవ్వో! నేను శక్తినంతా కూడ గట్టుకుని గట్టిగా అరిచాను. అతను ఒక్కసారిగా నిల బడి కిటికీ పైపుగా వెళ్ళి, కిటికీలోనుండి బయటికి దూకేశాడు. భగవంతుడికే తెలి యాలి, ఎక్కడికి వెళ్ళిపోయాడో.

అయితే నీకడుపులో పెరుగుతున్న బిడ్డ ఆ పిచ్చివాడిదా, అని దేవయాని అని ఉండినా నేను ఆమె మాటను సహించేదాన్ని. దాంట్లో అవమానం అంటూ ఏమైనా ఉంటే నేనే భరించేదాన్ని, కాని కచుని పేరు ఎత్తి ఎంత పాపానికి ఒడిగట్టింది ........

నిన్నటి ప్రేమని మనిషి నేడు మరచిపోతాడా? ఆయి ఉండవచ్చు! అందుకే దేవయాని కచుడి గురించి విచిత్రమైన, విషపూరితమైన భావాన్ని వ్యక్తపరచ గలిగింది.

దేవయాని, బహుశా నిన్నటి ప్రేమని మరచిపోయి ఉంటుంది. కాని, శర్మిష్ఠ అలా మరచిపోయే స్త్రీ కాదు. నిన్నటి ప్రేమను ఈరోజు మరవదు. అంతేకాక రేపు కూడా మరవదు - సృష్టి అంతమయ్యేంతవరకు కూడా - ఆమె ప్రేమతో ఎప్పుడు చెలగాటం ఆడదు.

కచుడికి ఒకవేళ, దేవయాని ఈ మాటలు ఎవరి వలనైన తెలిస్తే, అతను ఏమనుకుంటాడు? లేదు! అతను ఏమి అవుతాడు. కేవలం ఒక నవ్వునవ్వుతాడు! అతనికి దేవయాని స్వభావం బాగా తెలుసు.

అశోకవనం నుండి రాజమాతతో సహా వానప్రస్థానికి వెళ్తున్నప్పుడు నేను అడిగాను, 'కచదేవా! మరలా మీ దర్శనం ఎప్పుడు?'

అతను నవ్వుతూ! 'ఎవరికి తెలుసు? విధి లీల విచిత్రం, బహూశా రేపే ఇటు రావచ్చు! లేదా పది - ఇరవై సంవత్సరాల వరకూ రానేమో!'

అతని చివరి మాట విని మనసు మూగపోయింది. పది - ఇరవై సంవత్సరాల వరకూ కచుని దర్శనం అవదా! పది - ఇరవై సంవత్సరాల వరకు సూర్యుడు ఉదయించడు అని ఎవరైనా అంటే ఎలా ఉంటుంది?

కచుడు అశోకవనంలో చాలాకొద్ది రోజులే ఉన్నాడు! కాని ఆ కొద్ది సమయం లోనే అతను నాకెంతగానో ధైర్యం చెప్పాడు. నాకెంతగానో సహాయపడ్డాడు. శర్మిష్ఠ ఆత్మకు అతను పునర్జన్మనిచ్చాడు అనిపించింది.

అందుకే నేనడిగాను, 'పది - ఇరవై సంవత్సరాలు మీరెక్కడుంటారు?'

'హిమాలయాల్లో! తపస్సు కోసం!'

'ఎందుకు తపస్సుకోసం వెళ్తున్నారు మీరు?'

'ఏదో కారణం ఎందుకుంటుంది? నా తపః ఫలము, దేవయాని స్వభావాన్ని మార్చగల్గితే, నేను అందుకు కూడా తపస్సు....... గొప్ప....... ఘోరమైన తపస్సు చేయడానికి సిద్ధపడతాను'

'దేవయాని అంటే నాకు - కలలోకూడా - ఈర్ష్యలేదు. ఆమె హస్తినాపుర రాణి అయినప్పుడు కూడా నాకు ఈర్ష్యలేదు! ఆమె గురించి కచునియొక్క ఈ అభిప్రాయం తెలిసి నేననుకున్నాను, దేవయాని ఎంత అదృష్టవంతురాలు! ఆమె గురించి కచుడు ఈ రోజువరకు సంపాదించిన తపః ఫలం ధారపోయడానికి కూడా సిద్ధమైతే, ఆమెకీ ప్రపంచంలో లోటేముంటుంది. భావావేశపూరితమై, నిం 'పేక్షతో కూడిన ప్రేమను మించినది ఏముంటుంది?

కచుడు పై విషయం నవ్వుతూనే చెప్పాడు. కాని ........ కాని అతని నవ్వుతో పాటు అతని మనసులోని వేదన కూడా వ్యక్తమయింది. దేవయాని స్వభావం కారణంగా - ఆమె దుందుడుకు పనుల కారణంగా - అతను చాలా బాధ పడ్డాడు. అయినా, దేవయాని పట్ల అతని ప్రేమ ఏమాత్రం తగ్గలేదు.

ప్రేమతో నిండిన ఈ మూగవ్యథకంటే మించిన దుఃఖం ఈ ప్రపంచంలో ఇంకేమీలేదు. కాని, ఆవేధనాభరితమైన ఈ మూగవ్యథని పోగొట్టటానికి ఎవరైనా ప్రయత్నించాలనుకున్నా, అది ఎలా సాధ్యం?

నేనేమీ మాట్లాడలేకపోవటం చూసి కచుడు ఇలా అన్నాడు - 'శుక్రా చార్యులు మరలా తపస్సు ఆరంభించారు. సంజీవనీవిద్యలాంటి విచిత్రవిద్య ఆయన మరలా సంపాదిస్తారు. అప్పుడు మరలా, దేవ - దానవుల మధ్య యుద్ధం జరుగుతుంది. ఈ ప్రపంచం దేవతలూ, దానవులూ, దస్యులూ, మానవులూ అందరిదీ. కాని, ఈ ప్రపంచంలో ఎప్పుడూ ఏదో ఒక కలహం చెలరేగడంచూసి నాకు నిద్రపట్టడం లేదు. ఈ సంప్రదాయం తరతరాలవరకూ ఇలాగే సాగుతుందా! అని అన్పిస్తున్నది. ఈ విశ్వంలో యుద్ధం, కలహం, దుఃఖం, సంఘర్షణలే రాజ్యమేలాలని భగవంతుడయిన పరమశివుడు కోరుకుంటున్నాడా! కఠోరమైన తపస్సు చేసి పరమశివుణ్ణి ప్రసన్నం చేసుకొని, ఆయన పాదాలపై పడి మొండిగా, భగవాన్ ఈ విశ్వంలో శాంతి సామ్రాజ్యాన్ని స్థాపించగలిగే మంత్రాన్ని వరంగా నాకు ప్రసాదించమని కోరుకోవలని వుంది. అందుకే బహూశా మనం పది - ఇరవై సంవత్సరాల తర్వాత కలుసుకుంటా మేమోనని నీతో అన్నాను'.

# అధ్యాయం 17

ఆరోజు కచుణ్ణీ, రాజమాతను తీసుకుని రథం భృగుపర్వతంవైపు వెళ్ళి పోయింది. అశోకవనం బోసిపోయినట్లయ్యింది. అహోరాత్రాలు నా మనస్సులో నా దుస్థితికి సంబంధించిన ఆలోచనలే, నేనొక నిర్భాగ్యురాలివైన దాసీని, నా మనసును బాధపెట్టాలనీ దేవయాని నన్ను అశోకవనంలో ఉంచింది. ఈ నిర్జన ప్రదేశంలో నికృష్ట జీవితం గడుపుతూ ఏదో ఒకరోజు నా జీవితం అంతమవు తుంది, దేవయాని మాత్రం తన స్త్రీ జీవితాన్ని మూడు పువ్వులు - ఆరు కాయ లుగా అతి సంతోషంగా గడపడానికి ప్రయత్నిస్తూ, స్త్రీ పొందవలసిన ఏమాత్రం సుఖంకూడా నాకు దక్కనీయకుండా చేయడానికి ప్రయత్నిస్తూ, నా ఈ పరిపూర్ణ యౌవ్వనంలో వార్ధ్యక్యాన్ని చూస్తేగాని ప్రతీకారవాంఛతీరి, ఆమె సంతోషంగా ఉండదు. కాని, కచుడు మాత్రం ఎంతో ఓదార్పుగా, అతి సున్నితమైన, ముక్తసరి పలుకులతో నాలోని మానసిక వేదనను పొగొట్టాడు.

'శర్మిష్ఠ నా దాసి' అని నిండు సభలో దేవయాని కావాలనే కచునితో చెప్పింది. ఆ విషబాణం నా మనస్సులోతులలోనికి చొచ్చుకుపోయింది. ఆ మాటలు విచ్ఛిన్నమై గాలిలో ఇంకా కలవనేలేదు, కచుడు నావైపు కరుణతో, స్నేహ పూరితంగా చూసాడు. అతని ఆ చూపు గాయపడిన మనసుపై అమృతం చిలికినట్లయింది. ఆ మాటవలన చెలరేగిన గుండెమంటలు ఒక్కసారిగా శాంతిం చాయి.

అశోకవనానికి వస్తూనే కచుడు అతిథిగృహానికి చాలా దూరంగా ఉన్న నా నివాసానికి, నా యోగక్షేమాలు విచారించటానికే ప్రత్యేకంగా వచ్చాడు. అతన్ని చూస్తూనే నేను లేచి నిలబడ్డాను. అతను వద్దే - వద్దే నన్ను కూర్చోమని చెప్పాడు.

నేను చివరకు 'కచదేవా! మీ ఎదురుగా కూర్చోవడానికి శర్మిష్ఠ ఇప్పుడు రాజకన్య కాదు, ఆమె ఇప్పుడు దాసీ!'

అతను ప్రశాంతంగా నావైపుచూసి నవ్వుతూ అన్నాడు - 'శర్మిష్ఠా, తన నాభిలోనే సుగంధభరితమైన కస్తూరివున్నదని, కస్తూరి మృగానికి తెలుసా? నీ పరిస్థితి కూడా అంతే. దాసీత్వం నీ శరీరానికి మాత్రమే. నీ ఆత్మకు కాదుగదా? ఆత్మ ఎవరికీ దాసోహంకాదు, అవదు. అలాగే నీ ఆత్మకూడా! అది పూర్తిగా స్వతంత్ర మయినది. ఉన్ముక్త అవస్థను పొందిన ఆత్మకలిగినవారే ఈ ప్రపంచంలో భగవంతుని దర్శించగలరు. గొప్ప గొప్ప ఋషులు - మునులు సంవత్సరాల కొలదీ తపస్సు చేసినప్పటికీ ఏ మోక్ష మైతే ప్రాప్తించదో ......... .........' సిగ్గుతో ఎర్రబడ్డ, ముఖం దించుకుని నేనన్నాను - 'కచదేవా! నేను దేవయానికి ఒక అప్రియమైన దాసిని. నా లాంటి దాసికి ఈ ఆత్మ గురించి ఏం అర్థమవు తుంది?'

'మొదట నీవు ఆసనంమీద కూర్చో! కూర్చోవడమనేది శరీరానికి సంబంధించినది, ఆత్మకుకాదు. అందుచేత చేయడంలో తప్పేమీలేదు! అని కచుడు వారించగా -

'మీ సమక్షంలో నేను కూర్చున్నానన్న విషయం ఎవరైనా దేవయానికి చాడీలు చెప్తే నేను ఆవిడచేత చీవాట్లు తినాలి. నేను దాసిని, ఈ దాసిని..... ......'

'నీవు దాసివి కావు!'

'అయితే నేనెవరిని? నేనుఎప్పుడో రాజకన్యని! కాని ఈరోజు? నేనెవరికీ కన్యను కాను, ఎవరికీ భార్యనుకాను, ఇంకా నేను ఎవరికి తల్లినికాను! ఈ ప్రపంచంలో నేనేమీకాను!'

'అలాగని ఎవరన్నారు?'

'నేను!'

'నిన్ను నీవు ఇంకా గుర్తించలేదు. నీవు సోదరివి కూడా!'

'సోదరినా? ఎవరి సోదరిని?'

'నా సోదరివి! కచునికి ఇద్దరు చెల్లెళ్ళు. ఒకరు దేవయాని, ఇంకొకరు శర్మిష్ఠ'.

ఎంత సాధారణమైన మాటలివి! కాని మనసులో అవి ఎంతో స్ఫూర్తిని కలుగ చేసాయి. నేను కచుడికి సోదరిని. ఇంతటి గొప్ప విరాగి, త్యాగి, తపస్వి, పవిత్రుడయిన సోదరుడు నాకు లభించాడు. నా శరీరానికి దాసత్వం ఆపాదించ బడిందని, ఏడుస్తూ, కుమిలిపోతూ, చస్తూ బ్రతకాలా? లేదు - నేనెప్పటికీ అలా బ్రతకను!.

కచుడింకా ఇలా అన్నాడు, 'నీవు కేవలం నా సోదరివేకాదు, నాకు గురువువి కూడా. నేను సంజీవనీ విద్యను పొంది నాజాతి గురించి గొప్ప త్యాగం చేసానని అనుకుంటూ వుండేవాణ్ణి, కాని, నీవు నాకంటే కూడా గొప్ప త్యాగంచేశావు. దాసత్వమనే దుఃఖంతో వ్యర్థంగా జీవితం గడపవద్దని నీ ఈ శిష్యుని విన్నపం. ప్రపంచం దృష్టిలో నీవు దాసీవి కావచ్చు, కాని నా దృష్టిలో నీవు మహారాణివే. దాసీ - నిజానికి దాసి దేవయానే! ఆమె ఐశ్వర్యానికి, ప్రతిష్ఠకి, అహంకారానికి బానిస అయిపోయింది. తన ఆత్మని స్వార్థానికి, కోరికలకు, భోగానికి బలి ఇచ్చు కొనేవాళ్ళే ఈ ప్రపంచంలో దాసత్వంతో కుళ్ళిపోతూ ఉంటారు. స్వార్థాన్ని, సర్వ సుఖాలనూ త్యజించి నీవు ఇక్కడికి వచ్చేసావు, మనుషుల్లో దేవుణ్ణి చూపగలిగే కఠినమైన గొప్ప త్యాగమార్గాన్ని నీవు ఎన్ను కున్నావు. వాస్తవానికి నీవే యజమాను రాలివి, దాసివి ఎన్నటికీకావు! శర్మిష్ఠా! అన్నగా ఒక చెల్లెలికి నమస్కరించకూడదని నాకు తెలుసు, వయసులో నీవు నాకంటే చిన్నదానివే అయినా, తపస్సులో నీవే నాకంటే గొప్పదానివి. అందుకే .........'

చెప్పుతూ - చెప్పుతూ అతకను నాకు నమస్కరించడానికి రెండు చేతులూ జోడించపోతుండగా ............

అప్పుడు నేనెక్కడున్నానో, ఏం చేస్తున్నానో, ఏమాత్రం ఆలోచించకుండా, ఒక్కసారిగా ముందడగువేసి అతని రెండు చేతులూ, నాచేతుల్లోకి తీసుకున్నాను. మరుక్షణం నా మనసులో అన్పించింది. బహూశా నేనిలా చేయడం అతనికి ఆకతాయితనంగా అన్పించవచ్చు, కోపగించుకోవచ్చు లేదా నా రెండుచేతులనూ ఒక్కసారిగా విదిలించ వచ్చు. ఆశ్రమంలో ఉండేటప్పుడు అతను దేవయాని స్పర్శను ఎంతో తెలివిగా తప్పించు కొనేవాడు, ఆ విషయం గుర్తుకు రాగానే

నేను సిగ్గుతో సందిగ్ధంలో పడిపోయాను. అతని చేతులనుండి నాచేతులను మెల్లగా వదిలించుకున్నాను! బహుశా అతనికి కూడా ఆ విషయం జ్ఞప్తికి వచ్చి నట్లుంది. నా చేతులను ఒక్కసారి నొక్కిపట్టి నవ్వుతూ అన్ని స్పర్శలూ ఒకేలా గుండవు, సోదరీ! ఈరోజు నాతల్లేగనుక ఉంటే, ఆమె నాచేతులు ఇలాగే గట్టిగా నొక్కి పట్టుకుని, హిమాలయాలకువెళ్ళవద్దని వారించేదికదా?' అన్నాడు.

క్షణం తర్వాత అతను నా చేతులు విడిచిపెట్టేసి 'అక్కా' అని పిలిచాడు.

నేను పిచ్చిదానిలా అతణ్ణి గుడ్లప్పగించి చూస్తూండిపోయాను. అతను రెండవ సారి కూడా 'అక్కా' అని పిలిచాడు. కచుడు నన్ను 'అక్కా' అని పిలిస్తు న్నాడు. నేను కచునికి సోదరినయిపోయాను. ఇంకా నేను దేనికి దుఃఖించాలి?

'అక్కా! భార్యకాక మునుపే నీవు తల్లివి అయిపోయావు. సంపూర్ణదానవ కులానికి నీవు తల్లివైపోయాను. ఏ ఆత్మశక్తితో నీవు ఇంతటి త్యాగంచేసావో, అదే నీలో ఇంకా పెరగాలి, అదే నా కోరిక' అన్నాడు కచుడు.

అతని ఒక్కొక్క మాటను ఎవరో నామనస్సుపై ముద్రిస్తున్నట్లనిపించింది.

కచుడు అశోకవనంలో ఉన్నంతవరకూ, ఏదో సాత్వికత మనసు నావరించి వుండేది. కాని అతను వెళ్ళిపోవడంతో ఆ ఉన్మాదం అంతా మాయమయి పోయింది. చంద్రుడు అంతర్ధానమయిన తర్వాత ఆకాశంలో నిష్క్రియమూ, రస హీనమైన జీవితంతో వినిగిపోయాను. రానున్న ప్రతిక్షణం ఎలా గడుస్తుందోనని ఇప్పుడనిపిస్తున్నది.

రాజమందిరలో నేను చిత్రాలు గీస్తుండేదాన్ని. ఇప్పుడు ఆ అలవాటునే మళ్ళీ కొనసాగించాలని ప్రయత్నిస్తున్నాను. మొదట్లో కొన్నిరోజులు వరకూ చెట్లూ - చేమలూ, రకరకాల వస్తువుల చిత్రాలు వేస్తుండేదాన్ని, కాని కొన్నిరోజుల తర్వాత ప్రాకృతిక వైవిధ్యానికి సంబంధించిన ప్రేరణ లభించలేదు. బాహ్య సౌందర్యపు ప్రతిబింబం, మనసనే అద్దంలో కన్పిస్తేకదా? నా మనోదర్పణం, నేను దాసినయిన నాడే ముక్కలైపోయింది! ఆ విరిగిపోయిన ముక్కల్ని ఒకటిగా చేస్తూ వంకర - టింకర ప్రతిబింబాల్ని చూస్తుండేదాన్ని. కాని ఇప్పుడు ఇంకా ఆ ముక్కల్ని జతచేయడం అసంభవం అన్పించింది. నా మనసు ఒక స్మశానంలా మారి

పోయింది! ఆ స్మశానంలోని మొక్కలు, వాటికి పూసేపూవులు వికారంగా భూతాల్లా కన్పించసాగాయి.

కొంచెం సమయం, ఆకలితో వేటకుబయల్దేరే సింహాలా నన్ను కబళించి వేస్తున్నది. అప్రియమైన సంఘటనలను, విషయాలను నేను కావాలని మనసులోని చెత్తకుండీలోకి విసిరేస్తున్నా, మళ్ళీ అవి నెమ్మదిగా దొంగచాటుగా వచ్చి మనసనే మంచంమీద తిష్ఠ వేస్తున్నాయి. యుద్ధానికని బయల్దేరిన మహారాజుకి నేను వీర తిలకం దిద్దినప్పుడు కలిగిన ఆకస్మిక స్పర్శ, కచుని చేతుల స్పర్శ! కాని రెండింటిలోనూ ఎంత తేడా! కచుని స్పర్శ గుర్తుకు వస్తే, - అరణ్యంలోని సుందరమూ, ప్రశాంతమూ, పవిత్రమూ, అయిన ఏదో ఋషి ఆశ్రమం గుర్తు వస్తుంది. కాని మహరాజు స్పర్శ - ఉద్యానవనంలోని మత్తెక్కించే సువాసనతో నిండిన లతాకుంజం కనుల ముందు సాక్షాత్కరిస్తుంది.

మహారాజుగారి ఆ స్పర్శ, మనసులోని చెత్తకుప్పలోంచి ఒంటరిగా బయటికి రాదు! దాంతోపాటు మహారాజు - దేవయానిల ఆ మొదటిరాత్రి సంఘటనకూడా గుర్తుకువస్తుంది. శయనమందిరం బయట శర్మిష్ఠ తాంబూలం పళ్ళెం పట్టుకుని నిలబడి ఉంటుంది. తగవుపడి మందిరం నుండి బయటికి వెళ్ళిపోయిన దేవయాని స్థానంలో నేనే గనుక ఉండి ఉంటే, అంత సిగ్గుచేటయిన సంఘటన జరిగి ఉండేది కాదు. నేనయితే మహారాజుకు ఒక్కక్షణం కూడా దుఃఖం కల్గించేదాన్నికాదు. నాకూ మద్యం ఇష్టం లేనప్పటికీ, ఆయన గురించి ఆ వాసన నేను భరించి ఉండేదాన్ని -

ఆ రాత్రి, నాకు ప్రతిరాత్రీ గుర్తుకు వచ్చేది - నా మనసు వికలమైపోయేది. సముద్రంలో సంగమించాలని ఉత్సాహంతో పరుగులుతీసేనదిలా, నా మనసు పరుగులు తీసేది. శరీరంలోని ప్రతి అణువూ దప్పికతో 'ప్రేమ! ప్రేమ' అంటూ ఆక్రోశించేది.

ఒకరోజు ఆలోచనలతో నిండిన మనసుతో నిద్రపట్టలేదు. నేను చిత్రం వేయ డానికి కూర్చున్నాను. ఊర్వశి - పురూరవుల నాటకం జ్ఞప్తికి వచ్చింది. అదే ప్రసంగానికి సంబంధించిన చిత్రం వేయాలనుకున్నాను. పురూరవుణ్ణి ఊహించడం మొదలెట్టాను. ఒక్క క్షణంలో నాకళ్ళ ముందు మహారాజు మూర్తివచ్చి నిలబడింది. ఆహా! మంచి గొప్ప పురూరవుడే దొరికాడు అనుకొని మనసులో చాలా

సంతోషించాను. ఊర్వశి ఎలా ఉండాలి? అని మళ్ళీ ఆలోచించ సాగాను. ఒక్క సారిగా దేవయాని ఆకారం గుర్తుకు వచ్చింది. అప్సరస యొక్క చిత్రం వేయడానికి అప్సరసలాంటి సౌందర్యవతి, లావణ్యవతి లభించినందుకు నాకు చాలా ఆనందం కల్గింది.

దేవయాని అందంలోనేకాక మహారాజుని దుఃఖపెట్టడంలోకూడా ఊర్వశికి సరి జోడే నని మళ్ళీ అనిపించింది. రాజా! స్త్రీలతో ఎల్లప్పుడూ ఒకేలాగున స్నేహంగా ఉండటం అసంభవం, ఎందుకో తెలుసా! వారి మనసుతోడేలు స్వభావం వంటిది!

అలా చిత్రం వేయడానికి నాకు ధైర్యం చాలటంలేదు. కాని పురూరవుడి వేషంలో మహారాజు యొక్క ఆకారం నా కనులముందు కదలాడుతున్నది. అది నాకనుపాపల్లో స్థిరంగా నిలచిపోయింది, చివరికి, ఒక్క మహారాజు చిత్రమే వేయాలని నిశ్చయించాను.

ఆ చిత్రం వేస్తూ, కొన్ని రోజులు ఆనందంగా గడిచాయి. చిత్రం పూర్తయింది. దాన్ని గోడకి ఆనించి పెట్టి దూరంగా నిలబడి చూసాను. చిత్రకళలో నాకు పెద్దగా నైపుణ్యం లేకపోయినా, ఆ చిత్రం, అందులో మహారాజు ఆకృతి ..... ఓహో! ఎంత సజీవంగా ఉంది!

చిత్రం పూర్తయిన రాత్రి దాన్ని గోడకు ఆసించి పెట్టిన ఆ చిత్రాన్ని అలా ..... చూస్తూ ఉండిపోయాను. నిద్రకూడా రాలేదు. కొంచం సేపటి తర్వాత, మహారాజు నాతో ఏదో మాట్లాడుతున్నట్లనిపించింది. ఆయన నన్ను 'ఆటపట్టిస్తూ' భగవంతుడు నీకు ఇంత అందమైన కురులనిచ్చాడు, కాని నీవు యోగినిలా ఒక్కముడే వేసుకుంటావేం! అలాగైతే నాకిష్టముండదు! సింహంలా కేశాలను విరబోసుకుంటేనే అందం?'

నేను సిగ్గుతో తలదించుకున్నాను. కొంచెం సేపయ్యాక ఆయన పరిహాసానికి జవాబివ్వడానికి తల ఎత్తి ఏదో చెప్పపోయాను. కాని .....

నేను ఎవరితో చెప్పేది? చెప్పడానికి అక్కడ మహారాజు ఉంటేకదా! ఆయన మహారాజు, ఈ అశోకవనంకు ఎందుకు వస్తారులే? అదిగో, నేను గీసిన మహారాజు చిత్రం మాత్రమే ఉంది.

నా చిన్నతనంలో, పొడవుగా, వత్తుగా ఉండే నా జుట్టుచూసి అమ్మ మురిసి పోయేది. తనే స్వయంగా నాకు జడవేసేది. రోజుకొక రకంగా జుట్టు ముడివేసేది. చిన్నప్పుడు తల స్నానం చేసేరోజు, తలారబోసుకుంటే మోకాళ్ళవరకూ పరచు కున్న నా కురులు చూసి నాకే భలే సరదా వేసేది. ఒక్కోసారి అన్పించేది. నేను కూడా పురివిప్పిన నెమలిలా కురులు విరబోస్తూ నాట్యం చేస్తే ఎంత బాగుం డునో? కాని నృత్యంలో దేవయానే నిష్ణాతురాలు, ఎంత ప్రయత్నించినా నాకు సరిగా నాట్యం అబ్బలేదు. అంతేకాకుండా ఈ కేశాలు ఎలా విరబోసి, ఎలా అభినయించాలో, నాకు ఎవరూ నేర్పలేదు.

జడ అల్లేటప్పుడు, అమ్మ అంటూండేది, 'శమా! ఎంత అదృష్టవంతురాలివి నీవు. మోకాళ్ళ వరకూ జుట్టు ఏ నూటికో, కోటికో, ఒక్కరికే ఉంటుంది. అలా ఉంటే అకస్మికంగా అదృష్టం కలిసివస్తుందంటారు!'

అమ్మది ఎంత పిచ్చి ఆలోచనో? ఇదిగో ఇదేనా అదృష్టం. రకరకాల ఆభరణాలు ధరించవలసిన నేను ఒట్టిచేతులతో వచ్చేసాను. ఈ అశోకవనంలో ఒక దాసిగా, దేవయానికి అప్రియమైన దాసిగా వేదనతో రోదిస్తూ, కుమిలి - కుమిలి చస్తున్నాను. కేశాలను సవరించుకోవాలని అన్పించటంలేదు. అందుకే విరాగినిలా ఉంటున్నాను.

అందంగా అలంకరించుకొని, ముస్తాబు కావాలని ఏ స్త్రీకి మాత్రం ఉండదు? కాని ఈ అందం, అలంకారం ఆమె కొరకేనా?

రాత్రి ప్రక్కకు తిరిగి పడుకునేటప్పుడు అనుకోకుండా నా చేయి జుట్టు మీదకు వెళ్తుంది. అప్పుడు, నేను చదువుకునే రోజుల నాటి ఒక మధురకావ్యం జ్ఞప్తికి వస్తుంది.

ఆ కావ్యంలోని నాయిక కూడా నాలాగే రాత్రి మేల్కొనే ఉంటుంది. నాయకుడు మత్తుగా నిద్రిస్తుంటాడు. ఎదురుగా ఉన్న కిటికీలోనుంచి చంద్రుడు కన్పిస్తాడు. నాయిక నిద్రిస్తున్న భర్తవైపు చూస్తుంది. చంద్రుణ్ణి, తన భర్త ముఖాన్ని పోల్చిచూస్తే, చంద్రుడి కంటే తన భర్తముఖమే అందంగా ఉన్నట్లు అన్పిస్తుంది. ఇంత అందమైన ముఖంచూసి చంద్రుడు ఈర్ష్యపడతాడేమో! అలా అయితే నా భర్తకి దిష్టితగులుతుంది. చంద్రుడికి కన్పించకుండా భర్త ముఖం కప్పివేయాలను

కుని, మరుక్షణమే ఆ(. నా, అతి సన్నని, పలచని గుడ్డ కప్పినా, ఆ స్పర్శకు అతను మేల్కొంటాడేమో అనుకుని నాయిక, తన సుందరమైన మెత్తని చీరకొంగుని కప్పటానికి కూడా సంశయిస్తుంది. అయితే ఇప్పుడేం చేయాలి? ఆకాశంలో ప్రకాశిస్తున్న ఆ ఈర్ష్యాలువైన చంద్రుడి దృష్టినుండి ఎలా రక్షించడం? అని అనుకుంటుండగా ఆమెకు మెరుపులాంటి ఉపాయం తోచింది. ఆ రాత్రి ఆమె తన కురులను అందంగా అలంకరించుకుంది. కాని ఇప్పుడు ఆ అలంకారంతో పని లేదు. వెంటనే తన కేశాల ముడిని విప్పి విరబోసింది. అలా విరబోసిన కేశలను, తన భర్తముఖానికి - చంద్రునికిరణాలకు మధ్యగా వచ్చేటట్లు వంగి భర్తముఖంవైపు తృప్తిగా చూస్తుండిపోయింది. ఈ విధంగా ఆమె భర్తముఖానికి స్పర్శ తగలకుండా చంద్రుడి దృష్టినుంచి రక్షించ గలిగింది.

ఈ కావ్యం చదివిన తరువాత, పదహారు, పదిహేడేళ్ళ శర్మిష్ఠ చాలాసార్లు అనుకునేది - నా జుట్టుకూడా అలాగే పొడవైనదే - రేపు నా వివాహం అయిన తర్వాత చంద్రుడుగాని, నా ప్రియుని ముఖాన్ని చూసి ఈర్ష్యపడితే, నేను కూడా ఇలాగే చేస్తాను?

మనసులో అలా అనుకుంటున్నప్పుడు ఎంత ఆనందంగా ఉండేదో! కాని, ఇప్పుడు ఆ జ్ఞాపకాలు నా హృదయాన్ని కొరుక్కుతింటున్నాయి. ఎక్కడ తన ఆ ప్రియుడు? ఎక్కడ తన భర్త? ఎక్కడ తన ఆ ముఖచంద్రుడు? ఇప్పుడు అందంగా కేశాలను అలంకరించుకోపోతే ఏం? ఎవరికోసం, ఈ అలంకరణ? ఆలయంలో దేవుడే లేనప్పుడు, అడవి అంతా తిరిగి రంగురంగుల, రకరకాల పూలు శ్రమపడికోయడం దేనికి? ఎవరిని పూజించడానికి?

కచుడి మాటలు గుర్తుకు తెచ్చుకున్నప్పుడల్లా నాకు కాస్త మనశ్శాంతి లభించేది. పగలు - ఏదోలా గడిచిపోయేది. కాని రాత్రి ..... .....!

రాత్రి గంభీరమైన నిశ్శబ్దంలో, ఆ మహారాజు చిత్రపటమే నాకుతోడు. నేను దాని కెదురుగా కూర్చుండిపోతాను. పూలమాలతో అలంకరించి ఆ చిత్రానికి పూజ చేస్తూ ఉంటాను. తర్వాత ధ్యానం చేస్తూ కూర్చుంటాను. కళ్ళు మూసుకుని మహారాజుకి, నాకు మధ్య జరిగే సంభాషణవింటూ ఉండిపోతాను. గంటలకొద్దీ మాట్లాడతావు, కాని మాకు ఒక్కమాట కూడా విన్పించదే!

ఒకరోజు నేను, మహారాజు చిత్రపటానికి పూలమాల అలంకరించి ధ్యాన మగ్నంగా కళ్ళు మూసాను. కాని మహారాజు ఒక్కమాటకూడా మాట్లాడ లేదు, ఒకవేళ నామీద కోపమేమో అనుకుని కళ్ళు తెరిచినా పెదవులతో చిత్రంలోని మహారాజు పెదవులను ముద్దు పెట్టుకుని అడిగాను, ఇప్పుడు అలక తీరి నట్లేనా? ఐదు, పది నిమిషాల తర్వాత గాని నేను వాస్తవానికి రాలేదు, ఆయన మహారాజు కాదు, అది ఆయన చిత్తరువు మాత్రమేనని -

ఆ ముద్దుతో నాలోనేను సిగ్గుపడిపోయాను. కచుడికి ఒకవేళ ఈ విషయం గాని తెలిస్తే, అతనేమంటాడో? తన సోదరి, తన ప్రియమైన అక్క శర్మిష్ఠ తన మనసుని ఆ మాత్రం నిగ్రహించుకోలేదా? అని -

చాలా సేపటివరకూ నేనలా నిరీక్షిస్తూ, చీకటిని దూరం చేసే వెలుగుకోసం ఎదురు చూసాను! మనసులోని కవాటాలు మూసి ఉంచడం కష్టమే అయినా అదేమి అంత కష్టమైన పనిగాదు. నేటి వరకూ ప్రయత్నపూర్వకంగా నేను అదే చేస్తూ వచ్చాను. కాని, ఎంతగా కవాటాలు మూసివేసినా ఏదో ఒక సందులోంచి, ఒక చిన్న రంధ్రంలోంచి చంద్రకిరణం లోనికి రాకమానదు కదా? అలాగే నా మానసిక స్థితి కూడా!

ఆలోచిస్తూ - ఆలోచిస్తూంటే నాకనిపించింది - కచుని మార్గాన్ని అనుసరించడం చాలా కష్టం. అతను పవిత్రమైనవాడు, స్నేహశీల, అనుసరణీయుడు కూడా. కాని అతను పురుషుడు! అతని పవిత్రత, స్నేహశీలత, ప్రామాణికత శర్మిష్ఠకు పూజనీయాలే కాని .....

కాని, శర్మిష్ఠ ఒక స్త్రీ. స్త్రీ - పురుషుల మధ్య ఈ శారీరికమైన, మానసికమైన భేదం ఎంతో ఉంది. అలాగే జీవితంకూడా వేరు, పురుషుడు అప్రత్యక్ష వస్తువుని అన్వేషిస్తూ ముందుకు సాగిపోతాడు. అందుకే అతను కీర్తి, ఆత్మ, పరాక్రమం, పరమేశ్వరుడు మొదలైన విషయాలపట్ల ఆకర్షితుడౌతాడు. కాని స్త్రీ, ఈ విషయాల పట్ల అంత తేలికగా ఆకర్షించబడదు. ఆమెకు ప్రేమ, భర్త, సంతానం, సేవ, ఇల్లు, గృహిణీ ధర్మంవంటి లౌకిక విషయాలంటే ఎక్కువ మక్కువ. ఆమె ఎంతో ఓర్పు, సహనం వహిస్తుంది, త్యాగానికి కూడా సిద్దమే. కాని అవన్నీ లౌకిక విషయాల కోసమే. తన సర్వస్వమూ విడిచి పూజించాలన్నా, తన కన్నీటితో పాదాలను

అభిషేకం చేయాలన్నా ఆమెకు ఒక ప్రత్యేకమైన మూర్తికావాలి. పురుషుడు ఆకాశాన్ని పూజిస్తే, స్త్రీ భూమిని పూజిస్తుంది. భూమి అంటేనే ఆమెకు ఎంతో ప్రేమ.

చాలా సేపటివరకూ ఆ ఆలోచనలు మనసులో మెదుల్తూనే ఉన్నాయి. ఈ ఆలోచనలు ఒక నిశ్చితమైన దిశలోగాక వాటి ఇష్టంవచ్చినట్లు స్వచ్ఛందంగా విహరిస్తూన్నాయి. కాని ఈ ఆలోచనలు నాకు కొంత మనశ్శాంతిని కల్గిస్తున్నాయి.

ఎన్నో పగళ్ళు, సూర్యాస్తమయాలు, ఎన్నో రాత్రులు గడిచిపోయాయి. వెన్నెల రాత్రులు, అమావాస్య రాత్రులు రెండూ నాకు ఒకేవిధంగా రసహీనంగా అన్పించేవి! ఇలా విసుగుపుట్టించే జీవితం ఎప్పుడు ఎలా అంతం అవుతుందో నాకే తెలియదు. 'ఒకవేళ దేవయాని కావాలని నన్నిలా బాధించరడం లేదు కదా?' అని అన్పించేది. పిల్లిని చంపడానికి ఎలుకని చూపి ఆశపెట్టినట్లు బహుశా దేవయాని, నా అంతట నేనే దాసీ జీవితంతో విసిగిపోయి ఆత్మహత్య చేసుకోవాలని, కోరుకుంటున్నదేమో?

అలా అనిపించినప్పుడు నా ఒళ్ళు జలదరిస్తుంది. ఒకవేళ ఆత్మహత్యే శరణం అయితే ఎప్పుడో ఎందుకు, ఈరోజే ఎందుకు చేసుకోకూడదు? అని అన్పిస్తూంటుంది. యమునా నది దగ్గరలో ప్రవహిస్తున్నది, అలా విహరించడానికి వెళ్ళి, విహరిస్తూ విహరిస్తూ ఒడ్డుకివెళ్ళి ...... ......

ఒక వెన్నెలరేయి ఇలాంటి భయంకరమైన ఆలోచనలో మునిగి ఉండగా, బయట ఏదో గుర్రపుడెక్కలు సవ్వడి, రథం ఆగిన చప్పుడు విన్పించింది. ఇంత రాత్రప్పుడు నాలాంటి దాసీని చూడడానికి, అదీ రథంలో ఎవరు వస్తారు? శర్మిష్ఠ బ్రతికి ఉందా, చచ్చిందా అని దేవయాని స్వయంగా చూడడానికి రాకపోయినా, ఎవరినైనా క్షేమసమాచారం కనుక్కోవడానికి కూడా పంపించదు. ఆ సంగతి నాకు బాగా తెలుసు. బహుశా ఎవరో అతిథి అయి ఉండొచ్చు. లేదా ఏ ఋషో లేక మునో! దేవయానే ఇక్కడికి పంపించేసి ఉండి ఉంటుంది. అయినా వాళ్ళతో నాకేం పని? ఎవరో వస్తే నౌకర్లు అతిథిశాలకు తీసుకెళ్ళి ఏదో ఏర్పాట్లు చేస్తారు.

అలా అనుకుంటున్నానోలేదో ఒక నౌకరు ఋషిని వెంటబెట్టుకుని లోనికి ప్రవేశించాడు. ఈ మూలగా ఉన్న నా గదిలోకి అప్పుడప్పుడు కచుడు వచ్చి కాసేపు మాట్లాడి వెళ్ళిపోయేవాడు. అయినా కచుడు సంగతి వేరు. ఇలా నా గది

లోకి నౌకరు ఒక అపరిచిత ఋషిని తీసుకురావడం నాకు నచ్చలేదు.

నేను నౌకరుతో కోపంగా అన్నాను - 'నీకు జ్ఞానం లేదా? ఇది అతిథిశాల కాదు కదా! ఈ ఋషి మహారాజుని ఇక్కడికెందుకు తీసుకొచ్చావు?'

'మీ దగ్గరికే తీసుకొని వెళ్ళమని చెప్పారు నాకు' అన్నాడు నౌకరు.

'ఎవరు?'

'మహారాణి గారు!'

'మహారాణి? ఆమె ఎక్కడున్నారు?'

'ఆమె రథంపై వెళ్ళిపోయారు. నాలుగు ఘడియల తర్వాత వచ్చి ఈయనను రాజమందిరానికి తీసుకుని వెళతారట. ఈలోగ ఈయనను దర్శించవలసిదిగా మీ దగ్గరికి పంపారు ......'

నేను ఋషివైపు చూసాను. ఎక్కడో ఇంతకముందు చూసినట్లనిపించింది. నాలో నాకే నవ్వొచ్చింది. అయినా నా పిచ్చిగాని, ఇతన్ని నేనెక్కడ చూసి ఉంటాను? కాని ఎందుకో నాకలా అన్పించింది.

ఋషివర్యుల శరీరం ఎవరో మహారాజులా కాంతివంతంగా ఉంది! మెడలోని రుద్రాక్షమాలలు, రత్నమాలలూ చాలా అందంగా ఉన్నాయి. కాని ఆయన సిగ్గుతో కుంచించుకు పోతున్నట్లు అన్పించింది. ఆయన నాకు దర్శనమివ్వడానికి వచ్చారు - కాని, ఎలా దర్శించు కోవాలో నాకర్థంకావటంలేదు? కళ్ళలోకి చూస్తే ఆయన కళ్ళు తిప్పేసుకుంటున్నారు. నాకు మరలా సందేహం వచ్చింది. దేవయాని మరలా నామీద పగతీర్చుకోడానికి ఎవరో స్త్రీ ద్వేషిని, ఋషివేషంలో పంపలేదు కదా! ఎందుకైనా మంచిది, ఈయనతో చాలా సమయస్ఫూర్తితో వ్యవహరించాలి అని నిర్ణయించుకున్నాను.

మందిరం మధ్యగా ఉన్న ఆసనం చూపి ఆయనను కూర్చోమన్నాను. కాని ఆయన ఆ ఆసనంపై కూర్చోవడానికి ఇష్టపడలేదు. గంభీర స్వరంతో అన్నారు - 'మేము యోగులం! నిరంతరం గుహలలో ఉండేవారం! అలా ఆ మూల కూర్చుంటాను!'

ఆయన 'నేనీ ఇంటిపై కప్పుమీద కూర్చుంటాను', అన్నా ఒప్పుకోవలసిందే, నేనేం చేయగలను? అంతకంటే ఈ మూల కూర్చోవడం నయమే కదా అనుకొని, ఆ ఆసనంతీసి మూలగా వేశాను. వెంటనే ఆ మహాశయుడు దానిపై కూలబడ్డాడు. ఆయన కూర్చోగానే నేను కొంచెం గాభరా పడ్డాను. అక్కడే నేను గీసిన మహారాజు చిత్రంకూడా ఉంది. ఇప్పుడే, పూలమాలకూడా అలంకరించాను దానికి! ఈ యోగి దాన్ని చూసి, దేవయానితో ఏవో లేనిపోనివి చెప్తే .....?

హే భగవాన్! ఆయన ఆ చిత్రపటాన్నే రెప్ప వేయకుండా చూస్తున్నారు. నా శరీరమంతా చెమటలు పట్టేసింది. కాని ఆయనేమి దానిని గురించి అడగలేదు. కొంచెం సేపు ధ్యానమగ్నంగా కూర్చుని తర్వాత మాట్లాడాడు, ఆయన గొంతు గంభీరంగా విచిత్రంగా ఉంది. ఆయన ముఖం మునుపటికంటె ప్రసన్నంగా ఉన్నట్లని పించింది.

నేను నమస్కరించాను. 'బాలికా! ఏం కావాలి?'

'ఏమీ అక్ఖరలేదు స్వామీ!'

'నీవు అసత్యం చెపుతున్నావు'

నేను మాట్లాడకుండా ఉండిపోయాను.

ఆయన నవ్వుతో అన్నారు - 'నీవు ఎవరినో ప్రేమిస్తున్నావు. నువ్వు ప్రేమించే వ్యక్తి నీకు అతి చేరువలోనే ఉన్నాడు. కాని, అతను నీకు ఎల్లప్పుడూ దూరంగా ఉన్నట్లు అన్పిస్తుంది. అతను నీకు లభించాడని అన్పిస్తుంది, అవునా?'

'అవును - కాదు' అనడానికి నాకు ధైర్యం చాలలేదు. కాని, నా మనసులోని మాట ఇతనికెలా తెలిసిపోయింది? ఇతను త్రికాలజ్ఞుడైన ఋషియా?

'చెప్పు, ఎవరిని ప్రేమిస్తున్నావు, అతని గురించి నీవు ఏం చేయగలవు?'

'నా ప్రాణాన్నయినా ఇవ్వగలను. అన్న మాటలు అప్రయత్నంగా నానోటి నుండి వెలువడ్డాయి. కాని వెంటనే తొందరపాటును తమాయించుకొంటూ నాలుక కరచు కొన్నాను. కాని బాణం విడిచిపెట్టేసిన తర్వాత చింతిస్తే ఏం లాభం?

ఋషి పుంగవులు కేవలం ఒక చిరునవ్వునవ్వి ఊరుకున్నారు. మళ్ళీ కొంచెం సేపు ధ్యాన మగ్నంగా కూర్చున్నారు. నేను పిచ్చిదానిలా ఆయనను అలా చూస్తూ ఉండి పోయాను.

కొంచెంసేపాగి ఆయన కళ్ళు తెరిచి అన్నారు - 'నా మాటల మీద నీకు నమ్మకం కుదిరినట్లులేదు. అయితే ఒకపని చేయ్, ఆ మందిరద్వారం మూసిరా, నా మంత్రశక్తి ఏమిటో నీకు ఇప్పుడే చూపిస్తాను?'

మందిర ద్వారం మూసివేయునా? ఆ యతిలాగ ఇతను కూడా నా పీక నొక్కేస్తే?

నేను సందిగ్ధంలో పడడంచూసి, ఆయన లేచినిలబడ్డారు. ఒకవేళ ఆయనకు కోపం వచ్చి వెళ్ళిపోతారేమోనని భయపడ్డాను. కాని ఆయన బయటకు వెళ్ళి పోలేదు. నాకు దగ్గరగా వచ్చి తలమీద చేయివేసి సుతారంగా నిమురుతూ అన్నారు, 'వెళ్ళు, తలుపుమూసిరా, నీ జీవితంలో బంగారు ఘడియలు ఇప్పుడే ప్రవేశించాయి. వెళ్ళు ......'

ఆయన స్పర్శలో ఏదో వింత పులకింత, ధైర్య చెప్తునట్లుగా ఉంది, ఏదో ఉపశమనం కలిగినట్లనిపించింది.

తలపుమూసి వచ్చాను. మూలగా ఉంచిన మహారాజు చిత్రంవైపు చూపిస్తూ ఆయన అడిగారు, 'ఈ యయాతిని నీవు ప్రేమిస్తున్నావా?'

నేను సిగ్గుతో తలవంచి మౌనంగా ఉండిపోయాను. ఆయన మరలా - 'ఇప్పటికీ నీకు నామీద నమ్మకం కలగటంలేదా! దివ్యజ్ఞానంతో మాకు ఈ ముల్లో కాలలోని విషయాలు తెలిసిపోతాయి. ఆగు, ఇప్పుడే నీకు నిరూపించి చూపిస్తాను! ఈ మందిరంనుండి ఏదైనా సొరంగమార్గం ఉందా?'

'లేదే!'

ఆయన నవ్వారు! వెంటనే మంచం పక్కనున్న గోడవారగా వెళ్ళారు. అక్కడ ఒక చిన్న మీట ఉంది. ఆయన దానిని నొక్కారు. అంతే గోడ మధ్యలో పైభాగంలో రెండు మూడు గజాలు ఖాళీఏర్పడింది. సొరంగమార్గం స్పష్టంగా

కన్పించింది. కానీ, అశోకవనంలో ఉంటున్న ఏఒక్కరికీ తెలియని విషయం ఈ ఋషికి ఎలా తెలిసింది?

మళ్ళీ ఆయన మీాటనొక్కగా ఎప్పటిలా గోడ కన్పించింది.

ఆయన నన్నడిగారు - 'నీవు ఎక్కడ నిదురిస్తున్నావు?'

'ఇక్కడే!'

'ఒక్కదానివే?'

'ఒక్కొక్కసారి ఒక్కదానినే. ఒక్కసారి నాకుతోడుగా ఎవరో ఒకదాసి వుంటుంది'.

'ఈరోజు నుంచి ఒక్కదానివే శయనించు. అదీ మందిరద్వారం మూసివేసి! నీవు యయాతిని ప్రేమిస్తున్నావని నాకు తెలుసు. నీ ప్రేమ సఫలం కాపడానికి ప్రయత్నిస్తాను. అవసరమైతే నా తపస్సంతా ధారపోస్తైనా! నిజమైన ప్రేమకు ఋషి - మునుల ఆశీర్వాదం ఎప్పుడూ ఉంటుంది. కాని ఒక్క విషయం జ్ఞాపక ముంచుకో! యయాతి ఏదో ఒకరోజు నీదగ్గరకి వస్తాడు. ఇదే సొరంగమార్గం గుండా వస్తాడు. అతను నిన్ను పిలుస్తాడు. అవునూ ..... మీా తల్లిదండ్రులు నిన్నే పేరుతో పిలుస్తారు .....?'

'శమా .....'

'ఆ(., అతను కూడా నిన్ను 'శమా' అని పిలుస్తాడు. అతని పిలుపు విని గాభరాపడవద్దు. భయపడకుండా ఈ మీాటనొక్కి ద్వారం తెరువు. కాని ఒక్క విషయం. నీమీాద అనుమానంలేని దాసీలను మాత్రమే మందిరానికి బయట పడు కోమను. నీవు ఎన్నుకున్న ఈ ప్రేమమార్గం ముళ్ళతో నిండినది. కాని ఆ ముళ్ళ కింద సువాసనలు పెదజల్లే పూలు కూడా ఉన్నాయని మరువవద్దు'.

నేను ఏం వింటున్నానో, నాకే అర్థంకావటంలేదు! ఒకవేళ దేవయాని ఎవరైనా నాటకాలు వేసే అభినేతని ఋషివేషం వేయించి నన్ను పరీక్షించడానికి పంపలేదుకదా? అనుకొని నేను భయంతో ఆపాదమస్తకం వణికిపోయాను.

'లేదు! ఈ మందిరం నుండి సొరంగమార్గం ఉందని, ఎవరైనా అభినేతకి ఎలా తెలుస్తుంది?'

నేను ఆ ఋషివైపు తదేకంగా చూస్తూండిపోయాను. ఆయన వెంటనే తన దృష్టి మరల్చుకొన్నారు. మందిరం ద్వారం తెరవడానికి ఆయన ముందుకు నడుస్తుంటే. ఆ నడక సుపరిచితమైనదిగా తోచింది. వెంటనే ఊర్వశీ - పురూరవుల నాటకం జ్ఞప్తికి వచ్చింది. ఆ నాటకంలో పురూరవ వేషధారికూడా మంచి దేహచ్ఛాయగలవాడు. ఒకవేళ ...... అతన్నేగాని, దేవయాని నన్ను ఎగతాళి చేయడానికి పంపలేదుకదా?

ఆ మహారాజు చిత్రానికి నాకూ ఈ నాటితో సంబంధం తీరిపోయినట్లనిపించి, ఇక ఆ విషయమే ఋషితో 'నేను యయాతి మహారాజుని ప్రేమిస్తున్నానని మిమ్మల్ని మోసగించినందుకు క్షమించాలి!' అని చెప్పుదామని ముందుకు సాగాను.

సరిగ్గా చిన్నప్పుడిలా సంబోధిస్తూ 'శమా అక్కా! చెప్పు ఎలాగున్నారు మా ఋషి పుంగవులు? ఏమన్పిస్తుంది నీకు?'

ఓహ్ ...... ఎన్నో ..... రోజులకి. కాదు, కాదు ఎన్నో సంవత్సరాల తర్వాత దేవయాని నన్ను 'శమా అక్కా!' అని పిలిచింది. కృతజ్ఞతతో నేను అన్నాను 'చాలామంచివారు. మహారాణి గనుక అనుమతిస్తే, నేను జీవితాంతం ఆయన సేవ చేసుకుంటాను!'

దేవయాని ఒక్కసారిగా నవ్వింది. ఆ నవ్వులోని కర్కశత్వం, గుర్రాన్ని తోలేటప్పుడు కొట్టే కొరడా దెబ్బలా ఉంది.

ఆ రాత్రంతా ..... రాత్రేకాదు, అనేక రాత్రులు నేను, ఉత్కంఠ, భయం కుతూహలం మొదలైన అనేక భావాల మిశ్రిత భావ సమ్మిశ్రణంతో గడిపాను. అప్పుడప్పుడూ అన్పించేది. ఒకవేళ ఆ సొరంగం గుండా దేవయానే వచ్చేస్తే! మహారాజు ధ్వనిని అనుకరిస్తూ 'శమా, శమా' అని పిలిస్తే! మాటనొక్కి నేను సొరంగ ద్వారం తెరిస్తే అట్టహాసంగా నవ్వుతూ తిట్టినట్టు తిట్టకుండా ముఖంవాచేటట్లు చివాలు పెట్టి నన్ను బ్రతక నివ్వకుండా చేస్తుంది.

రోజులు గడిచిపోతున్నాయి. ఆ ఋషి ..... ఆయన ఆశీర్వాదం, అంతా ఒక కల అన్పించేది. స్వప్నంలో, మనసు ఏం కోరితే అదే కన్పిస్తుందా!

కాని నియమం ప్రకారం రోజూ మందిరద్వారం మూసి ఉంచుతున్నాను. ద్వారం బయట నమ్మకమైన ఇద్దరు దాసీలను పడుకోబెడుతున్నాను. రోజూ, ఆ గోడవైపు చూస్తూ ఆపేక్షగా ధ్వనికోసం నిరీక్షిస్తూ గడుపుతున్నాను. నమ్మకంతో ఆయన పిలుపుకోసం రోజూ ఎదురు చూస్తున్నాను. నమ్మకాలు ఎంత నిరాధార మైనవైనా, నమ్మకంతోనే ఈ ప్రపంచం నిలుస్తుంది. కలలు ఎంతటి అసంభవాల నిపించినా, మనిషి కలలోనే జీవిస్తుంటాడు.

రెండు - మూడురోజులలో దేవయాని, తన తండ్రిగారి దర్శనానికి వెళ్తుందని తెలిసి, ఒకవేళ దాసిగా నన్నుకూడా తన వెంటరమ్మంటుదేమోనని భయపడ్డాను. నాకు కూడా ఒక్క సారి అమ్మను, నాన్నగారిని చూడాలని ఉంది. అలాగని నేను వెళ్ళిపోతే ..... ఆ ఋషి చెప్పినట్లు మహారాజుగాని వస్తే? .....

కాని, నేను భయపడినట్లు దేవయాని నన్ను తనతో తీసుకువెళ్ళలేదు. ఆమె వెళ్ళిపోయింది. కాని ఆరోజంతా నాకు పదే - పదే అమ్మ, నాన్నగారు జ్ఞాపకం వస్తూనే ఉన్నారు. మనసంతా విసుగ్గా ఉంది. కాని రాత్రి కాగానే ఆ చికాకు - విసుగు మాయమయ్యాయి. వాటికి బదులు ఉత్కంఠ అధికమయ్యింది. ఎప్పటి లాగే మందిరం తలుపులు మూసి మహారాజు చిత్తరువు చూస్తూ మంచంపై వాలాను. కనులెప్పుడు మూతపడ్డాయో తెలీదు. అస్పష్టంగా 'శమా! శమా' అన్న పిలుపు విని మెల్కొన్నాను. కాసేపు అన్పించింది. ఒకవేళనేను కలలోగాని ఆ పిలుపు విన్నానేమో! అని వెంటనే కళ్ళు తెరిచాను. మంచానికి ఎదురుగా ఉన్న గోడలో నుండి పిలుపు విన్పించింది. నాకు కాళ్ళు వణికాయి. అలాగే గోడవరకూ వెళ్ళి ఆ మీటనొక్కాను. మధ్యభాగం దూరంగా తొలగింది! సొరంగం మెట్లపై మహా రాజు నిలబడి ఉన్నారు. నా కళ్ళను నేనే నమ్మలేకపోయాను. నాకు పట్టలే నంత ఆనందం కలిగింది. ఆశ్చర్యంతో తల తిరిగినట్లనిపించింది, నేలకూలబోతు న్నాను. ఇంతలో మహారాజు ముందుకు వచ్చి నన్ను తన బాహువులలో బంధించారు.

క్షణమాత్రపు ఆలస్యంకూడా లేకుండా నది సాగరంలో సంగమించింది.

నేను కళ్ళు తెరిచి చూసాను.

ఎక్కడున్నాను నేను? ఇంద్రలోకంలోని నందనవనంలోనా? మందాకినీనదిలో ప్రవహించే పూలపాన్పుపైనా? మలయానిల సుగంధ వీచికల మీదా? లేక విశ్వంలోని అజ్ఞాత సౌందర్యాన్ని వెతుకుతూ బయల్దేరిన మహాకవి నావలోనా?

ఏమో! ఏమీ అంతు చిక్కడంలేదు! మహారాజు గాఢాలింగనంకూడా తెలియనంతగా మైమరచిపోయాను.

కొద్దిసేపటి తర్వాత వాస్తవంలోనికి వచ్చాను. ఆ చిలిపి చంద్రుడు కిటికీలోనుంచి నన్నే చూస్తూ నవ్వుతున్నాడు. నాకు సిగ్గేసింది. మహారాజునా చుబుకం పైకి లేపుతూ అన్నారు - 'వివాహ సమయంలో, పెండ్లికూతురు, పురోహితుణ్ణి చూసే సిగ్గుపడితే ఎలా?' నేనన్నాను - 'చంద్రుణ్ణిచూసి గొప్ప - గొప్ప కవులందరూ చిత్రవిచిత్రమైన కల్పనలు చేసారు. కాని ఎవరూ ఇంతవరకూ పురోహితుడిగా వర్ణించలేదు!'

'యుగ - యుగాలగా మనలాగే గాంధర్వ వివాహాలన్నీ ఈయన సాక్ష్యంతోనే జరుగుతున్నాయి. ప్రేమికుల అసలైన పురోహితుడు చంద్రుడే!' అన్నారు మహారాజు!.

మహారాజు భుజంపై నా తల ఆనించి చంద్రునివంక తదేకంగా చూస్తుండి పోయాను. చంద్రుని కిరణాలు నా అణువణువులోనూ వెలుగును నింపాయి.

కాదు! కాదు! అది వెన్నెలకాదు, అనురాగంతో నిండిన కలల సుగంధాన్ని నిద్రిస్తున్న ఈ భూమికి అందిస్తున్న పరిమళం అది.

చూస్తుండగానే ఆ సుగంధంలో నేను మునిగిపోయాను! ఇప్పుడు శర్మిష్ఠ రాజ కన్య ....కాదు! దాసీ ....... దాసీకూడా కాదు! ఆమె మహారాజు వృషపర్వుని కూమార్తె .... కూడా కాదు! ఆమె, తపస్వి కచునికి సోదరి! ఉ(. హు(., ఆమె ..... ఆమె ..... కేవలం ఒక ప్రణయిని!

ఆ రాత్రి తర్వాత ఎన్నో రాత్రులు, ఆ రాత్రులలో ఎన్నో గంటలు, ఆ గంటలలోని ఎన్నో నిమిషాలు, ఆ నిమిషాలలోని ఎన్నో విప్తలు, ఆ విప్తల్లో ఎన్నో లిప్తలు ..... ఊటబావిలోని ఒక్కొక్క నీటిబిందుపై ..... ఆనందపుటంచులదాకా .....!

అది సుఖమా ..... అది ఆనందమా ..... కాదు! దానిని వర్ణించాలంటే, ఆ బ్రహ్మానందాన్ని వర్ణించడం ఎవరితరం?

ఆలిచిప్పల్లో నీళ్ళునింపుతూ, సముద్రం అంటే ఏమిటో ఎవరైనా అంచనా వెయగలరా! పూలను చిత్రించి వాటి సుగంధాన్ని ఎవరైనా ఇవ్వగలరా? ప్రేమానుభూతి కూడా అలాంటిదే! అది వర్ణనాతీతం.

మోక్ష - ప్రాప్తి అనే మాట నేను చిన్నప్పుడు వింటూండేదాన్ని. కాని దాని అసలైన అర్థమేమిటో నాకు తెలిసేదికాదు. నిశ్శబ్దగీతంతో గడిచిన ఆ రాత్రులే నాకు దాని అర్థాన్ని తెలియజేసాయి.

ఆడదాని మనసు, పదాలకు అర్థం వెతికే వ్యర్థప్రయత్నం చేయక, అందులోని భావమేమిటో తెలుసుకోవడానికి ప్రయత్నిస్తుంది. పార్వతీదేవి మండుటెండలో, జడి వానలో, ఎముకలు కొరికే చలిలో, వాటినిలెక్క చేయకుండా ఉగ్రతపస్సు చేసింది! కాని, ఆ తపస్సు మోక్షప్రాప్తికా? కాదు, పరమశివుని సేవ చేసే అవకాశం పొందడానికి! జగన్మాత పార్వతి ఈ మహత్కార్యాన్ని తాను ఆచరించి స్త్రీలుకు మార్గదర్శకురాలైంది. నేనుకూడా అదే మార్గాన్ని ..... .....

ఆ(. అవును, ఆమె అడుగుజాడల ననుసరించే నేను ప్రేమించాను. యయాతి మహారాజుని ప్రేమించాను. అతను దేవయాని భర్త అని తెలిసికూడా నేను అతన్ని ప్రేమించాను. మందిరం బయట పడుకుంటున్న నా ఆంతరంగిక దాసి లకు తప్ప ఈ నా ప్రేమ విషయం ఎవరికి తెలియదు. ఇది ఒక మధురమైన రహస్యం! ప్రేమికులకు చిరకాలమిత్రురాలైన రాత్రి రహస్యం అది. నా మందిరపు గోడలమధ్య జరిగే రహస్యం. ఎనిమిది ఝాములూ చీకటిలో ఒంటరి జీవితం గడిపే సౌరంగ రహస్యం.

మహారాజు స్పర్శతో నా రోమం - రోమం ప్రణయంతో పులకించి పోయినా, పాపభీతి వలన ఒళ్ళు జలదరించేది.

నాలో నేను పదే - పదే సరిపుచ్చుకోనేదాన్ని. ప్రేమంటే అర్థం - దానం - సర్వస్వం సమర్పించుకోవడం. అది పాపం ఎలా అవుతుంది? నేను దేవయాని కంటికి కంటకాన్ని అయిపోయాను! నేనంటే ఆమెకు పడదు. ఈ విరోధభావమే

గనుక లేకపోతే నేనే స్వయంగా దేవయానితో, మహారాజుపై నాకు మనసున్న విషయం చెప్పేదాన్ని! కొంగు చాచి ఇలా యాచించివుండేదాన్ని - సవతిని శత్రువుగా భావించరాదని, ఆమెను స్నేహితురాలిగా అభిమానించి ప్రేమతో వ్యవహరించాలని - ఏ రాజకన్యకైన అత్తవారింటికి వెళ్ళేటప్పుడు తల్లిలాహితబోధచేస్తుంది. నేను నీవు చిన్ననాటి స్నేహితులం, మనఇద్దరమూ మహారాజుని సుఖపెడదాం! నీవే పట్టపురాణిగా ఉండి, ఆయనతోపాటు సింహాసనంపై కూర్చో. నాకు అలాంటి కోరిక ఏమీలేదు. రాజకార్యం ముగించి వచ్చిన మహారాజుకి పాదసేవచేసే భాగ్యం కల్గించు, ఆయన అలసట తొలగించే ఉపచారం చేయగలిగే అవకాశం, కల్పించు, అంతటితో నా జన్మ ధన్యమైందని భావిస్తాను. నీవు ఉషోదయంగా వెలిగిపో! పిదప సాయం సంధ్యగా మారిపో. నీకు నేను ఎదురు చెప్పను. నేను ప్రొద్దు తిరుగుడు పూవునై, నా దేవుణ్ణి దూరం నుంచే పూజించుకుంటాను. అతని కదలిక ప్రకారం నేను కూడా తిరిగి చూస్తూ ఆనందిస్తాను.

పాపభీతితో నిండిన మనసుకు ఇలాంటి ఓదార్పు ఆలోచనలతో ఊరట కల్గించే ప్రయత్నం చేస్తుండేదాన్ని. కాని ఆ పాపభీతి కలిగినప్పుడల్లా, పార్వతీదేవిని తలచుకుని ఇలా ప్రార్థించేదాన్ని - 'తల్లీ! నీవు పరమశివుణ్ణి ఎలా ప్రేమించావో, అలాగే మహారాజుని ప్రేమించగల శక్తిని నాకు ప్రసాదించు. నీ తండ్రి, నీ భర్తను అవమానిస్తే, నీవు యజ్ఞగుండంలో ఆత్మాహుతి చేసుకున్నావు! ఆ అగ్నిపరీక్షను నేనెప్పుడూ మరువను. తల్లీ! ప్రియునికోసం ఎంతటి కఠిన త్యాగమైనా చేయడానికి సిద్ధమైతేనే నేనుకూడా అసలైన ప్రేయుసినవుతాను. నేను ఎన్నటికీ పాపిని కాను'.

మధ్య, మధ్య ఈ భయం నన్ను పీడించేది. కాని అప్పుడప్పుడూ ఈ భయం నుండి బయటపడినప్పుడు సర్వస్వం మరచి ఆనంద శిఖరాలనధిరోహిస్తుండేదాన్ని. చిన్న-చిన్న రంగురంగుల మెత్తని రెక్కలతో విహరిస్తూ రంగురంగుల పూలపై వాలే సీతాకోకచిలుకలా నా మనసు ఆనంద పారవశ్యం చెందేది. మహారాజుకని తాంబూలం సిద్ధపరుస్తూ, మంచి సువాసన కల్గిన పూలమాలను అలంకరిస్తూ, మహారాజుకి నచ్చినట్టుగా కురులను అలంకరిచుకొంటూ, అందమైన ఆభరణాలను ధరిస్తూ, ఆయనను ఆకర్షించే విధంగా కొత్త కొత్త విషయాలను అన్వేషిస్తూ ఎంత వేగంగా పొద్దుగడిచిపోయేదో తెలిసేదికాదు. రాత్రి వెంటనే వచ్చేసి

నట్లుండేది. ఏదో అభిసారికలా తను తన నియమిత ప్రదేశానికి చేరుకుంటున్నట్లు అన్పిస్తుంది. కాని, నాలుగు ఘడియలు గడిచిన రాత్రి తర్వాత విరహంతో క్షణ మొకయుగంలా అతి నెమ్మదిగా గడుస్తున్నట్లనిపించేది. గడిచిపోయిన ప్రతిక్షణంతో పాటు మనసులో అధైర్యంచోటు చేసుకునేది. సరిగ్గా అదే సమయానికి ఏదో సమస్య ఎదురై మహారాజు రావడానికి కుదరదేమో! అని అన్పించినప్పుడు మనసు ఎంతో వ్యాకుల పడేది.

అసలు ప్రేమంటే ఏమిటో తెలుసుకోవటానికే నేను అనేక శృంగార కావ్యాలు చదివాను. అలాగే నేను అనుకోకుండానే కొన్ని ప్రణయ - గీతికలు వ్రాసాను. కాని చదివిన ఆ ప్రేమ కావ్యాలలోని విషయాలూ రచించిన ఆ ప్రేమగీతకలూ ఈ ప్రత్యక్ష అనుభూతికి - ఈ బ్రహ్మానందానికి కేవలం ఛాయారూపాలు మాత్రమే నని పించింది. యవ్వన ప్రాంగణంలో అడుగిడే నాటి ప్రణయభావాల ప్రహేళికకూడ అద్దంలో కన్పించే చంద్రుని ప్రతిబింబమే నిజమైన చంద్రుడని భ్రమించే చిన్న పిల్లాడి కల్పనలాంటిదే!

నిజమైన ప్రేమ ఎలా ఉంటుంది? అది తెలుసుకోవాలంటే స్వయంగా ప్రేమిం చాలి. చంద్రుని చల్లదనం, సూర్యుని ప్రచండత, అమృతంయొక్క సంజీవనీ శక్తి, విషంయొక్క ప్రాణహారణశక్తి - వీటన్నిటికలయికే. లేదు! ప్రేమని వర్ణించడం అంత తెలికైన విషయం కాదు!

ఒకరోజు మహారాజు మహామంత్రితో రాజకార్యాలను గురించి చర్చించుతూ అర్థ రాత్రివరకూ కూర్చుండిపోయారు. అందుచేత ఆయన వేగంగా రాలేక పోయారు. అర్థరాత్రి గడిచి పోయింది. నాకు పిచ్చెక్కినంతపనైంది. మనసులో లేని పోని ఆలోచనలు చెలరేగాయి. ఒకవేళ మహారాజు ఆరోగ్యంగాని బాగుండలేదా? ఆయనకు అస్వస్థతగా ఉంటే నేనాయన సేవచేయడానికి వెళ్ళకూడదా? అయినా ఆయన ఏమని కబురు చేస్తారు? నేన కూడా నిస్సంకోచంగా రాజమందిరానికి వెళ్ళేదెలా? శర్మిష్ఠకు మహారాజు మనసులో స్థానమైతే ఉంది, కాని నేను ఆయన దరిదాపులకి కూడా ఎలా వెళ్ళగలను! అదృష్టదేవత కూడా ఈ ప్రేమను ఎంతో పిసినారిగా ప్రసాదించింది. కుబేరుడు ఒక స్త్రీకి ఒక అలంకార వస్తువుని ఇచ్చి, రాత్రిపూట మాత్రమే అలంకరించకోమని షరతు పెట్టినట్లుంది నా పరిస్థితి.

ఆ రాత్రి మనసంతా ఆందోళనతో నిండిపోయింది. మనసు పరిపరి విధాల పరిభ్రమించింది. ఆ మీటనొక్కాను. సొరంగం మెట్లు మీద నుండి గబగబా దిగేసాను. కాని అక్కడి నుండి ఒక్క అడుగుకూడా ముందుకు పడలేదు. చీకటికీ భయపడలేదు. పోనీ ఆ సొరంగంలో ఏదైనా సర్పం నన్నుచుట్టివేసి, కాటువేస్తుందని కూడా భయపడలేదు. కాని, సొరంగం గుండా రాజమందిరం చేరుకుంటే, మా ప్రేమ రహస్యం తెలిసిపోతుందేమో? అని భయపడ్డాను. ఇంతవరకు నాకు సహకరించిన విధి ఒక్కసారిగా నాకు ఎదురు తిరిగితే? లేదు! దేవయాని కపటంతో మహారాజుని ఋషివేషం వేయించి నాదగ్గరకి పంపించినప్పటి నుండి విధి నాకు సహకరించింది. కాని దేవయానిని మోసగించింది. అదే పరిస్థితి ఇప్పుడు మరలా నాపట్ల ఎదురైతే? నేను ఈ మార్గంగుండా రాజమందిరం చేరుకుంటే, సరిగా అదే సమయానికి దేవయాని కన్నవారింటినుండి తిరిగి వచ్చేస్తే ఈ మా ప్రేమ రహస్యం తెలిసిపోదా? ఊహ మేరకు కూడా అలా జరగకూడదు. దేవయానికి ఎప్పటికీ ఈ రహస్యం తెలియకూడదు.

నేను మౌనంగా, మరలా మెట్లపైకి వచ్చి నా మందిరాన్ని చేరుకున్నాను. నేనెంత అభాగ్యురాలినని పదే - పదే అన్పించేది. భగవంతుడు నాకు ధైర్యంగా ప్రేమించే అధికారం కూడా ఇవ్వలేదు హస్తినాపురంలో ఎంతటి పేదదాసికయినా ప్రేమించే హక్కు, అధికారం ఉన్నాయి, కాని రాజకన్య శర్మిష్ఠకు ఆ భాగ్యం లేదు విధిరాత ఎంత విచిత్రమైంది?

మహారాజు వచ్చే సమయానికి నాతలగడ కన్నీటితో తడిసిపోయింది.

ఆ రాత్రి మహారాజుకి గాఢంగా నిద్రపట్టేసింది. అయినా నేను మాత్రం మేల్కొనే ఉన్నాను. ఆయన బాహుపాశంలో నన్ను నేనే మరచిపోయాను. కాని ఆ పారవశ్యం ఒక్క క్షణంమాత్రమే. మరలా పైశాచికపుటాలోచనలు చెచలరేగాయి. ప్రేమపారవశ్యంలో శాంతంగా ఉన్న మనసు మృత్యువువైపు పరుగుతీసింది. మనసులో ఒక విచిత్రమైన కోరిక ..... మేమిలా గాఢాలింగనంలో ఉండగా, భూ కంపంవచ్చి, ఈ అశోకవనం, ఈ మందిరం, అంతా భూస్థాపితమైపోనీ! కొన్ని వేల సంవత్సరాల తర్వాత, ఎవరైనా భూగర్భ పరిశోధకులు త్రవ్వకాలు జరిపితే, ఇలా గాఢాలింగనంలో, గాఢనిద్రలో మునిగి ఉన్న ఈమాజంట అస్థిపంజరాలు లభిస్తాయి.

ఎవరైనా కవిగాని ఆ దృశ్యం చూస్తే ఆయన ఇవి అస్థిపంజరాలు కావు! ప్రాచీనకాలంలో ఎవరో శిల్పిచేత రాతిపై చెక్కబడిన రతీమన్మథుల శిల్పం అని అభివర్ణిస్తాడు. ఎవరైనా చరిత్ర పరిశోధకుడైతే అతను, ఖచ్చితంగా ఇవి హస్తినాపుర మహారాజు, మహారాణీల అస్థిపంజరాలే అని నిరూపిస్తాడు. కాని ప్రియునితో స్వేచ్ఛా ప్రణయాన్నికూడా నోచుకోని ఒక ప్రేయసియొక్క దోచుకోబడ్డ మధుర క్షణాలని ఎవరూ ఊహించలేరు

మరుక్షణంలోనే నా వింత కోరికపై నాకే కోపం వచ్చింది! నేనెంత పిరికిదాన్ని, ఎంత స్వార్ధపరురాల్ని! తన సుఖం గురించి ఆలోచిస్తూ, నేను యువరాజుకు తల్లిని ......!

ఆ ఆలోచన వస్తూనే నా తనువు పులకరించింది. గాఢనిద్రలోకూడా నా పుల కింతకు తెలివి తెచ్చుకున్న మహారాజు నన్ను మరింత గాఢంగా కౌగిలించుకొని, గొణుగుతున్నట్లుగా, 'పిరికిదానివి!' అని మరలా నిద్రలోని జారుకుంటూ నా పెదవులను తనపెదవులతో ముద్దాడారు. రాత్రిచీకటి చంద్రుని ప్రకాశంతో దూరం అయిపోయినట్లుగా, ప్రణయభావంతో నా మనసులోని భయం మాయమైపోయింది.

కాని, రెండవరోజు సూర్యోదయంతో మరలా భయం ఆవరించింది. కాని ఇప్పుడు మరింతగా ఎక్కువయ్యింది. ఉదయం నిద్రలేవగానే నాకు కాస్త కళ్ళు తిరిగినట్లనిపించింది. నాకు నమ్మకమైన దాసీలిద్దరికీ అర్ధమైపోయింది. తలనుదురు పట్టుకుని ఇద్దరూ ఒకరినొకరు చూసుకున్నారు. వాళ్ళు చెప్పక పోయినా, నాకు తెలిసిపోయింది, నేను తల్లినికాబోతున్నానని. మనసులో పట్టరాని ఆనందం, దానితోపాడు భయం, సిగ్గు, ఉత్కంఠ, కుతూహలం మొదలైన ఎన్నో భావాలు.

మహారాజుతో నా వివాహం అందరి సమక్షంతో జరిగి ఉంటే, ఈ రోజు ఈ శుభవార్త విని హస్తినాపురం మొత్తం ఆనందంతో ఉప్పొంగిపోయేది. ఏనుగు మీద పంచదార బస్తాలువేసి అందరికీ పంచడం జరిగేది. కాని ఈరోజు ఈ శుభవార్త నా మందిరంలోని చీమకుకూడా చెప్పలేకపోయాను.

పెండ్లికూతురై అత్తవారింటికి వెళ్ళిన తన కుమార్తె గర్భవతి అయిందని తెలిస్తే ఏ తల్లికి మాత్రం ఆనందం కలుగదు? ఈ విషయం తెలిసి మా అమ్మకు కూడా

అలాంటి ఆనందమే కల్గుతుంది! కన్నవారింట్లో అడుగుపెడుతూనే సిగ్గుతో నేను అమ్మ ఒడిలో తలదాచుకుంటే అమ్మ నా తల నిమురుతూ అంటుంది - 'శమా, చిన్నప్పటి ఒక సంఘటన నీకు గుర్తుందా? ఒకరోజు సాయంత్రం తోటమాలి తోటలో పనిచేస్తున్నాడు. అతన్ని చూసి నీవుకూడా ఆడుతూ, గెంతుతూ ఒక చిన్నమొక్క నాటావు! రాత్రి పడుకోబోయే ముందు పదే - పదే నీవు దాసీలను తీసుకువెళ్ళి ఆ మొక్కని చూసివచ్చేదానివి, అర్ధరాత్రి సమయంలో నీవు నా బుగ్గలను రక్కుతూ, 'అమ్మా నా మొక్క ఎప్పుడు పూలు పూస్తుంది?' అని అడిగావు. నేను నవ్వుతూ అన్నాను - 'పిచ్చిపిల్లా, అంత తొందరగా ఎక్కడైనా మొక్క పూలుపూస్తుందా? మొదట మొగ్గలు తొడుగుతుంది. ఆ తర్వాతే పూలు విరబూస్తాయి!' నీవు అలిగావు, అప్పుడే మొక్కకి మొగ్గలున్నయో లేవో చూస్తానని పట్టుబట్టావు. అప్పుడు నేను కొంతమంది దాసీలను తోడిచ్చి నిన్ను ఆ మొక్క దగ్గరకి పంపాను. నీవు తిరిగి ఏడ్చుకుంటూ వచ్చావు. నీ మొక్కకు మొగ్గలు లేవని తెలిసి దుఃఖంతో నీవు ఏడ్చావు. ఆ రాత్రి నీవు బహూశా ఏవందసార్లో అడిగి ఉంటావు 'అమ్మా! నా మొక్కకు మొగ్గలు ఎప్పుడొస్తాయి? అసలు మొగ్గలు ఎలా వస్తాయి?' నేను విసిగి చివరికి ఇలా జవాబిచ్చాను - 'నీకు పెళ్ళి అయిన తర్వాత తెలుస్తుంది. మొగ్గలు ఎలా వస్తాయోనని, అటు తర్వాత నీవు ఇంకొక మొండి పట్టుపట్టావు. నాకు పెళ్ళి చేసేయ్ ముందు నాకు పెళ్ళి చేసేయ్! మొగ్గలు ఎలా తొడుగుతాయో నేను తెలుసుకోవాలని'.

యవ్వనంలో అడుగుపెట్టిన తర్వాత ఈ సంతోషకరమైన ప్రసంగం నాకు జ్ఞప్తికి వచ్చినప్పుడల్లా ఎంతో ఆనందంగా ఉండేది. కాని ఈరోజు ఆజ్ఞాపకం నా హృదయాన్ని తొలిచివేస్తున్నది. ఎవరైనా ఎప్పుడైనా ఊహించి ఉంటారా, చిన్న తనంలోనే, 'అమ్మా నాకు పెళ్ళి చేసేయ్' అని మంకుపట్టుపట్టిన శర్మిష్ఠకు అసలు పెళ్ళేకాదని! ఒక్కొక్కసారి నిజం కలకంటె కూడా భయంకరంగా ఉంటుంది.

మహారాణి కావలసిన శర్మిష్ఠకు దాసి కావలసిన కర్మ పట్టింది. కాని ప్రకృతి మనిషిలా దుర్మార్గమైనదికాదు. అందుకే ఈ దాసి ఇప్పుడు తల్లికాబోతున్నది. కాని ప్రకృతి ప్రసాదించిన వాత్సల్యమనే వరం కూడా శాపంగానే అన్పించేది.

నాకు ఎంత ఆనందంగా ఉండేదో, అంతే అయోమయ పరిస్థితిలో చిక్కుకునే దాన్ని, ఏదో తెలియని భయంతో నా గుండెకొట్టుకునేది. ఈ రహస్యం దేవయానికి

తెలిస్తే - ఆమె ఏమైనా చేస్తుంది. అలాగే మా తల్లిగండ్రులకు ఈ విషయం తెలిస్తే, వాళ్ళేమంటారో? 'కులటా'! అని నన్ను తిరస్కరిచరా? నేనేం పాపం చెయ్యలేదని వారికెలా నచ్చచెప్పగలను?

నాకు నమ్మకమైన దాసీలిద్దరుకూడా చిక్కల్లోపడ్డారు. దేవయాని తండ్రిని చూడడానికి వెళ్ళి ఇంతవరకూ తిరిగిరాలేదు. కాని, వచ్చిన తర్వాత ... ......

ఆలోచించి - ఆలోచించి, మనసు శూన్యమైపోయింది. ఒక్కసారిగా నాకు కచుడు జ్ఞాపకమొచ్చాడు! అతనే కనుక ఈ సమయంలో ఇక్కడ ఉంటే, తప్పకుండా నాకు ధైర్యం చెప్పేవాడు. తన సోదరి పాపంచేసిందని నమ్మినా, ఉపాయంతో ఈ గండంనుంచి బయటపడే మార్గం చెప్పేవాడు. అందుకు, తన తపస్సునైనా ధారపోయడానికి సిద్ధపడేవాడు. కాని .... అతను ఇక్కడలేడే! ఈ ప్రపంచంలో నేను ఒంటరిదాననయ్యాను, అనాథనయ్యాను! ...... బొత్తిగా అనాథ......

లేదు, నేను అనాథనుకాను. హస్తినాపుర మహారాజుయొక్క ప్రేయసిని, అనాథను ఎందుకవుతాను? యయాతి మహారాజు ప్రియపత్ని అనాథ ఎలా అవుతుంది? నా పిరికితనంపై నాకే నవ్వు వచ్చింది.

ఈ రోజు ఎలాగైనా మహారాజు చెవిలో ఈ శుభవార్తవేయాలని ప్రతిరోజూ ఉదయం అనుకున్నేదాన్ని. ప్రతిరాత్రి అలా చెప్పాలని మాటలుపెదవి వరకు వచ్చి ఆగి పోయేవి. ప్రతిరాత్రి భావావేశాన్ని వ్యక్తం చెయ్యటానికి పదాలకై వెతుకులాడే కవిలా వుండేది నా పరిస్థితి.

చివరికు ధైర్యంచేసి నేను నవ్వుతూ మహారాజుతో అన్నాను - 'ఇంక మన ప్రేమ వ్యవహారం ఎన్నోరోజులు రహస్యంగా ఉండదు!'

'అంటే? మనపై ఎవరైనా కన్నువేసి ఉంటారా? ఎవరు? చెప్పకూడదా! దేవయాని నియమించిన చాడీకోరు దాసియేనా!'

'కాదు! ఇది దాసిల పనికానేకాదు. కాని ఒక్క విషయం చెప్పండి, ఈ మందిరంలో ఉన్నది కేవలం మనిద్దరమేనా?'

గట్టిగా ఒడిసి పట్టుకుని మహారాజు నన్ను తనగుండెలకు హత్తుకుంటూ అన్నారు - 'ఇద్దరా? లేదే! ఎవరా ఇద్దరు? ఇక్కడ ఇద్దరు లేరు. యయాతి - శర్మిష్ఠ వేరు కాదు!'

ఆ మాటలు నాకు ఎంతో ధైర్యాన్నిచ్చాయి! కాని మహారాజుకు ఈ రహస్యం ఎలా చెప్పడం, సమస్య అలాగే వుండిపోయింది. నేను సిగ్గుతో నెమ్మదిగా అన్నాను - 'కా ..... కాని.....?'

'సరే, ఒప్పుకుంటున్నాను, ఈ మందిరంలో మనమిద్దరమే అని!'

'ఇద్దరుకాదు, ముగ్గురు!'

'ముగ్గురా! ఆ(. ఆ(. ముగ్గురు! అవును నిజమే! భగవంతుడు - నీటిలోను, నేలమీద, కఱ్ఱలోను, రాతిలోను అన్నింటిలోనూ ఉంటాడు! ఆయన సర్వవ్యాపి! ఆయన ఇక్కడా వుంటాడు. ఆయనతో కలుపుకొని మనం ముగ్గురమే'.

' ఆయనతో కలిపి ఇక్కడ మనం నల్గురం!'

'నలుగురా? అదెలా?'

'నేను ..... నేను ..... నేను ..... త్వరలోనే తల్లిని .......'

నేను ఆ వాక్యాన్ని పూర్తిచేయలేకపోయాను. ఆడుకొని అలసిపోయిన పాపలా నేను మహారాజు ఒడిలో ముఖందాచుకున్నాను.

నా చుబుకం పట్టి పైకి లేపి తదేకంగా నాకళ్ళలోకి చూస్తూ మహారాజు అన్నారు - 'ఎంత అందంగా కన్పిస్తున్నావు, శమా! నీ చెరగిన కేశశృంగారం, అతి శ్రద్ధతో అలంకరించుకున్న ఆభరణాలకంటే అతి మనోహరంగా ఉంది. స్వచ్ఛందతలోని సౌందర్యవిలాసం వికసిస్తుంది .....'

నా అందానికి పొగడ్తకాదు నాకు కావలసింది, ధైర్యంకావాలి. మనసులో నేనను కున్నాను 'జీవితాంతం నా అందం ఇలాగే ఉండిపోదు!'

'ఎందుకు ఉండదు?'

'త్వరలోనే నేను తల్లిని అవుతాను, ఆ తర్వాత .....'

మహారాజు శృంగార చేష్టలన్నీ, కారుమబ్బుల్లో మునిగిపోయిన చంద్రవంకలా అదృశ్యమైపోయాయి. ఆయన ముఖంలో విచారరేఖలు స్పష్టంగా కన్పించాయి. ఆయన మరలా నన్ను గట్టిగా కౌగలించుకున్నారు. కాని, ఆ కౌగిలింతలో ప్రణయానికి బదులు భయం ..... భయంతో ఉలిక్కిపడిన పసివాడు తల్లిని అల్లుకుపోయినట్లుంది.

ఆయన ఈ మౌనచర్యకు అర్థమేమిటో నాకు తెలియలేదు! తర్వాత ఆయన మాట్లాడిన అసందర్భపు మాటలద్వారా ఆయనను ఏదో భయం ఆవహించినట్లు గ్రహించ గలిగాను. తన తండ్రి జీవితం ఒక మునిశాపం వలన మట్టిలో కలిసి పోయింది. దేవయానికి ఈ రహస్యం తెలిసిపోతే, తపస్సు చేసుకుంటున్న ఆమె తండ్రి శుక్రాచార్యుడి దగ్గరికి వెళ్ళి మొరపెట్టుకుంటుంది. దానితో ఆయన కోపోద్రి క్తుడై మహారాజును ఘోరంగా శపిస్తాడు.

దేవయాని ఈర్ష్యాసూయల సాకారరూపమైతే, శుక్రాచార్యుడు కోపంలో దూర్వాసుణ్ణి మించినవాడు. ఇద్దరి స్వభావాన్ని నేనెరుగుదును. అందుచేత మహా రాజు భయపడడంలో తప్పులేదు.

ఒకవేళ మహారాజు శుక్రాచార్యుని శాపానికి బలైతే? శర్మిష్ఠ సిగ్గుతో జీవితాంతం తలదించుకోవాలి. ముందు తరం ప్రేమికులు తనని పరిహసిస్తారు. తన సుఖంకోసం, తన తాపాన్ని శాంతింపజేయడంకోసం, తన ప్రియుణ్ణి బలి చేసింది, అని భావితరం కవులు తిరస్కార దృష్టితో చూస్తారు.

నిజమైన ప్రేమ నిస్వార్థమైనది. మహారాజును నేను ప్రేమించాను. కాని కేవలం సుఖంకోరే ప్రేమించానా? నేను జగన్మాత పార్వతిదేవి అడుగుజాడలలో నడుస్తు న్నాను అని అనిపించగానే ధైర్యం కలిగింది. నా విచారం దూరమయ్యింది. ఇప్పటికీ ఆ జగన్మాత మార్గాన్నే అనుసరించాలని నేను గట్టిగా నిర్ణయించు కున్నాను. దేవయానికి మహారాజుపై ఏమాత్రం అనుమానం రాకుండా ప్రవర్తిస్తాను. అందుకు ఎలాంటి పరిస్థితినైనా ఒంటరిగానే ఎదుర్కొంటాను.

నా మనసును పదే - పదే హెచ్చరించేదాన్ని - 'శర్మిష్ఠా ఒక్క విషయం

ఎప్పుడూ మరువకు, జగన్మాత పార్వతి మార్గాన్ని అనుసరించగలననుకోగానే సరిపోదు. అది బలిపీఠం వరకూ తీసుకువెళ్తుంది. తండ్రి దక్షుని యజ్ఞంలో పార్వతి ఆత్మాహుతి చేసుకుని సతి అయిందన్న సంగతి కూడా మరువకు'.

# అధ్యాయం 18

రెండో రోజో, మూడో రోజో దేవయాని తిరిగి వచ్చేసింది. నాగదిలో తాంబూల పళ్ళెంలోని తాంబూలం రోజూ ఎండిపోసాగింది. మహారాజు, దేవ యానికి అనుమానం కలుగకుండా ఉండేందుకు రాత్రంతా ఆమె మందిరంలోనే ఉండిపోతారని నాకు తెలుసు. కాని ఆయన స్పర్శ, ఆ సుఖం పొందిన తనువు, మనసూ, పదేపదే ఆ సుఖాన్ని కోరుకుంటూ తపించసాగాయి. కొంచెంసేపు రెప్ప వాల్చగా, ఏదో, దూరంగా శబ్దం వినపడింది. ఒకవేళ మహారాజేమో! సొరంగ మార్గం గుండా వచ్చి పిలుస్తారేమో? అయినా, పిచ్చిగాని ఇప్పుడు దేవయాని తిరిగి వచ్చేసింది. అందుచేత ఆయన ఎప్పుడొస్తారో, ఎవరు చెప్పగలరు? ఒక ప్పుడు వేళకాని వేళలో కూడా ......

కాని అదంతా నాభ్రమ మాత్రమే. మళ్ళీ మనసులో నిరాశ. తెల్లవారు ఝామున పట్టేనిద్రలో కూడా ఏదో అసౌకర్యం. నా తలను ప్రేమతో నిమరలేదనే అసంతృప్తి. ఉద్యానవనంలో పక్షుల కిలకిలలకంటె ఆలోచనలతోనే నిద్రలేస్తాను. తర్వాత తనకిష్టమైన బొమ్మలభించలేదని వెక్కి - వెక్కి ఏడ్చే చిన్న పిల్లలా ఏడుస్తాను!.

రాత్రులు అలా శూన్యంగా, వేదనతో గడుస్తుండేవి. కళ్ళు ఎలాగూ తీరని దాహంతో తపించేవి, వాటికి తోడు పెదవులు కూడా చివరికి ఓర్పునశించి లేచాను. లేచి మహారాజు చిత్రపటాన్ని ముద్దులతో ముంచేశాను. ఎన్ని అని అడ గొద్దు. ఎవరో చెప్పారుకదా, ప్రేమ పిచ్చిదని.

కాలం, చంచలంగాను, అల్లరిగాను పరిగెత్తే గుర్రంలా పరుగులు తీస్తోంది. దేవ యానికి తొమ్మిదో నెల వచ్చింది. అందుకే ఆమె అశోకవనం వైపురాలేదు. ఒకసారి

నన్ను తన మందిరానికి పిలిపించింది. వెళ్ళాను. ఆమెకు నామీద ఏమాత్రం అనుమానం కలగనందుకు సంతోషించాను.

అదేరోజు నా విరహం కూడా అంతమైంది.

మందిరం కిటికీ నుండి సాయంసుందరిని చూస్తూ నిల్చున్నాను. ఒక్కసారిగా, ఒక పెద్ద చెట్టు వెనుకనుంచి అర్ధచంద్రుడు కన్పించాడు. అలా చూస్తూ - చూస్తూ నేను కూడా అకాశమంత విశాలంగా అయిపోయాను. నా దగ్గరకూడా అలాంటి చంద్రుడున్నాడు కదా! చిన్న - చంద్రుడు, ముద్దులొలికే చంద్రుడు - ప్రస్తుతం ఎవరికీ కన్పించని చంద్రుడు, ఈ ఆలోచనలో మునిగిపోతూ, నా గర్భంలోని బాబుతో మాట్లాడసాగాను. మహారాజు పొందుసంగతి అలా ఉండనీ, ఎప్పుడోఒక రాత్రివస్తే, ఒక్కోసారి రానేరారు! కాని, ఈ చిన్న ప్రాణి ఎప్పుడూ నాతోనే ఉంటుంది. అతని మధురమైన సంగీతం నాకు తప్ప ఎవరికీ విన్పించదు. ఆ మధుర సంగీతంలో సహగానం చేస్తూ నా దుఃఖాన్ని మరచి పోసాగాను. మహా రాజు విరహంతో దుఃఖం, ఆయన శారీరిక సుఖం పొందాలనే లాలస, భవిష్య త్తులో నన్ను, నాబిడ్డని దేవయాని ఎలా చూస్తుందోనన్నభయం, వీటన్నిటినీ ఆ చిన్నిప్రాణి సహవాసంతో మరచిపోగలిగాను. ఆ చిన్ని బాలుడెలా ఉంటాడో, అతని కంఠధ్వని ఎలా ఉంటుందో? ఎరక్కపోయినా ఏదో సంతృప్తి, కచుడిలాంటి తాపసులకు బహుశా భగవత్ - సాక్షాత్కారం కూడా ఇలాగే ఉంటుందేమో? లేకపోతే అతని మనసెప్పుడూ ప్రశాంతంగా ప్రసన్నంగా ఎలా ఉండగలదు?

స్త్రీకి తల్లికావడానికి మించిన ఆనందమేముంది? పూవులు పూయకపోతే ఎంత అందమైన లత ఆయన? ఆకులు ఎంత అందంగా వున్న ప్రయోజనమేముంది?

ఆకులు తలయొక్క వైభవమైతే, పూలుధాని సౌందర్యం మరియు సుఖం యొక్క సారం. పూలతోనే అదొక అద్భుత ప్రపంచాన్ని నిర్మిస్తుంది. అలా స్వయంగా నిర్మించుకొన్న పూల వైభవంలో లత ఎంతో ఆనందానుభూతి పొందు తుంది. కాని ప్రపంచం ఆ ఆనందాన్ని పొందకపోవచ్చు. అందుకే కదా శుక్రా చార్యుడు తాను సాధించిన సంజీవనీ విద్యపై అంత గర్వపడతాడు.

ఏకాంతంలో నా కడుపులోని బిడ్డతో మాట్లాడూతూంటే నాకు ఎంతో ఆనందంగా ఉంటుందా? నేను తనని ఇలా అడుగుతాను. 'ఇప్పటివరకూ ఎక్క

డుండే వాడివి నీవు? తను ఏం జావాబివ్వగలడు? మరలా నేనే అంటాను - 'నీకు ఈ అమ్మ అంటే ఇష్టమేనా? నీ తల్లి దాసీది - కాని ...... కాని ఆమె తన దేశంకోసం దాసిగా అయ్యింది. నీవు పరాక్రమవంతుడివి అవుతావుకదా? నీ తల్లిని సుఖపెడతావు కదా? నా తండ్రి అంతపెద్ద మహారాజు. కాని అతను నన్ను సుఖపెట్ట లేకపోయాడు. నా భర్త హస్తినాపుర సామ్రాజ్యానికి అధినేత. కాని, ఆయన కూడా నన్ను సుఖపెట్టలేకపోతున్నారు! ఇప్పుడు నా ఆశలన్నీ నీమీదే నాన్నా! నా బాల చంద్రా, నాచిన్నిరాజా! నీవు తప్ప ఈ ప్రపంచంలో నాకెవరు దిక్కురా కన్నా!'

అలా చాలా సేపటి వరకూ నేను మాట్లాడుతూనే ఉంటాను. అప్పుడప్పుడు అన్పించేది. నేను చెప్పే మాటలకి తను ఊ(. కొడుతున్నాడని. కాని అలా చెప్పు కోవడంలో నా దుఃఖం అంతరించి, గుండెలోని భారం తగ్గినట్టుగా అన్పిస్తుంది. మనసు స్వచ్ఛంగా, నిర్మలమైన ఆకాశంలా ప్రకాశిస్తుంది. ఎన్నో సంవత్సరాలుగా కమ్ముకున్న కారు మేఘాలు తొలగి ఆకాశం స్వచ్ఛంగా అయినట్లుంటుంది నా మనసు.

నాలో గర్భిణి కోరికలు ప్రారంభమయ్యాయి. అమ్మగాని దగ్గరుంటే నా కోరిక లన్నీ ఆర్భాటంగా తీర్చేది! కాని ..... కోరికలు చాలా విచిత్రమైనవి.

దట్టమైన అడవిలో, బాగా విహరించాలనీ, క్రూరమృగాలను వేటడాలనీ, రాత్రి పూట ఎత్తైన చెట్ల కొమ్మలపై పాకుతున్న నీలి తలపూలను కోసి సిగలో ముడుచు కోవాలనీ, ఏదైనా సింహం కన్పిస్తే దాన్ని పట్టుకుని నోరుతెరచి దాని దంతాలను వెక్కిరించాలనీ.

అలా ఎన్నో కోరికలు మనసులో మెదిలేవి. నామీద నాకే ఆశ్చర్యం వేసేది. అయితే ఇవి నా కోరికలు కావు అన్పించింది. నేనంత స్వతంత్రురాలను ఎప్పు డయ్యాను గనుక? బహుశా నా గర్భంలోని శిశువు ఆటగాడై నన్నిలా ఆడిస్తున్నాడేమో?

ఒకసారి నా మదిలో విచిత్రమైన ఆలోచన తళుక్కున మెరిసింది. నేను ముసలిదాని వేషం, బొత్తిగా ముసలిదాని వేషం వేసుకొని మహారాజు దగ్గరికి వెళ్ళా లని. ఆయన నన్ను గుర్తుపట్టలేక సతమతవుతుండగా వేషం తొలగించి ఆయనతో

'మహాశయా, మీరు ఋషివేషం వేసుకొచ్చి నన్ను మోసగించలేదా? వేషం వేయడం మీకొక్కరికే వచ్చనుకున్నారా? ఇప్పుడు చూసారా మిమ్మల్ని ఎలా బోల్తా కొట్టించానో?' అని అనాలనిపించింది.

# అధ్యాయం 19

దేవయానికిమగబిడ్డ కలిగాడు. నామకరణ మహోత్సవానికి నేను వెళ్ళాను. కాని వెళ్ళేముందు అద్దం ఎదురుగా కూర్చుని శృంగారపు ఆభరణాలు ధరించుకుంటుంటే, నా కాళ్ళు వణికాయి. నా శరీరం పూర్తిగా మారిపోయింది. ఇంతవరకూ రహస్యంగా ఉంచిన ప్రకృతికి కూడా, నన్ను రక్షించడం సాధ్యంకాదు.

ఆ(. దేవయాని తన ఆనందంలో నన్ను పట్టించుకోదులే, అంతమందిలో, అతి శ్రద్ధగా నన్ను పరికించి చూసే సమయమెక్కడుంటుంది ఆమెకు, అని నాకు నేను సరి పుచ్చుకుని భయపడుతూనే వెళ్ళాను. ఆమె కంటపడకుండా ఉండ టానికి తప్పించుకుతిరిగే ప్రయత్నం చేసాను. అయినా తప్పలేదు. ఆమె తన దర్పం చూపించడానికి నన్ను దగ్గరికి పిలిపించి పసివాడిని చూపిస్తూ నావంక ఆపాదమస్తకమూ పరీక్షగా చూసింది. చూసి 'శర్మిష్ఠా! అశోకవనం వాతావరణం నీ శరీరానికి బాగా పడినట్లుందే' అని అన్నది.

నేను కేవలం హు(. అనేశాను. వెంటనే మరొక ప్రశ్నవేసింది. 'అక్కడ నీకు ఒంటరిగా అనిపించదా?'

'మొదట్లో అలాగే అన్పించేది. చిన్నప్పటినుండి నాతో పాటే ఉండే దాసీ లున్నారు కదా, చిన్ననాటి సంగతులు వాళ్ళతో ముచ్చటిస్తూంటే కాలం గడిచి పోతుంది!'

'అలాగా! అక్కడకు ఇంకా ఎవరు వచ్చిపోతున్నారు?'

'అక్కడికి ఇంకెవరు వస్తారు? అప్పుడప్పుడూ ఎవరో ఋషి - మునులు వస్తే వాళ్ళ సేవలో అసలు సమయమే తెలియదు!'

ఆమెను వదలించుకొని బయటపడేసరికి, సింహం గుహలోంచి ప్రాణాలతో బయటపడ్డ జంతువులా అనిపించింది:

రాజమందిరంలో తెలిసిన దాసీలతో మాట్లాడుతున్నాను. కాని, నేనెక్కడికి వెళ్ళినా అక్కడికి, ఆ ముసలిదాసి అదే దేవయానికి నమ్మకమైన దాసి, నా వెంట పడేది. మొదట్లో నేను పట్టించుకోలేదు. తర్వాత గమనించాను. అది నావైపు నిక్కి - నిక్కి చూస్తుండేది. నా నడక నిలబడటం, వంగటం - అన్నింటినీ గమనిస్తూంది. కొంచెం సేపటి తర్వాత అది వెళ్ళిపోయింది. నాకు ప్రాణం వచ్చినట్లయింది. ఇంక ఆలస్యం చేయకుండా దేవయానితో చెప్పి అశోకవనం వెళ్ళిపోదామని అనుకున్నాను. అప్పుడే ఆమె నన్ను రమ్మని కబురు పంపింది. భయపడుతూనే వెళ్ళాను. తక్కిన దాసీలనందరిని బయటికి వెళ్ళిపోమని తలుపులు మూసేసి, చాలా గట్టిగా గద్దిస్తున్న స్వరంతో నన్నడిగింది 'నీవు గర్భవతివా?'

నేను తలాడిస్తూ - 'అవును' అన్నాను.

'ఇంత వ్యభిచారమా .....'

'నేను వ్యభిచారిణినికాదు - ఒక గొప్ప ఋషి ఆశీర్వాదం వలన ..... .....'

'ఋషి ఆశీర్వాదం వలన? ఎవరా ఋషి? అతని పేరు, గోత్రం, కులం? ఏం మాట్లాడవేం? ఏం నోరు విప్పవు? ఎవరు నీమీద ఇంత దయచూపింది? కచుడా?'

రాత్రంతా నేను కుమిలిపోయాను. నా ప్రేమ పాపిష్టిది కాదు. ఒకవేళ పాపిష్టిదే అయినా అందులో కచుడి కేమి సంబంధం? అతను ఎంతో పవిత్రమైనవాడు. నామీద నాకే కోపం వచ్చింది. దేవయాని ఇలాంటి విషం కక్కినప్పుడు నేనెందుకు మౌనం వహించాను? అనవసరంగా కచుణ్ణి నిందించవద్దని, దీనిలో అతనికే మాత్రం సంబంధం లేదని నేనెందుకు వెంటనే చెప్పలేదు?

అలా నేను జవాబిచ్చి ఉంటే ఇంకా లేనిపోని ప్రశ్నలు వేసి నన్ను వేధించి ఉండేది, అప్పుడు ..... .....

మనసులోనే కచుని క్షమించమని అడగడంతప్ప ఇంకేమి చేయగలను! అతని స్నేహపాత్రమైన ఆకారం నాకళ్ళ ముందు ఒక్కసారి మెదిలింది. ఆ స్వరూపం

ముందు నేను మోకాళ్ళపై కూర్చుని, రెండు చేతులూ జోడించి ప్రార్థించాను - 'సోదరా, క్షమించు, నీ ఈ బలహీనురాలైన సోదరిని క్షమించు!'-

ఇదే జీవిత సిద్ధాంతమా? - దుఃఖంతో సముద్రాన్ని ఈది, ఆవలిఒడ్డు చేరు కుంటే గాని ఆనందపు మల్లెలు లభించవా?

ప్రసవవేదన నన్ను మృత్యుద్వారం వరకూ చేర్చింది. జనన మరణాల ఈ విచిత్రకలయిక చూసి నా మనస్సు కుంగిపోయింది. మహారాజు బాహుపాశంలో క్షణం - క్షణం అంతులేని ఆనందాన్ని పులకింతను అనుభవించిన శరీరం ఇప్పుడు బాధతో, వ్యధతో నొప్పులతో, తీరని క్షోభను అనుభవిస్తోంది. అసహనీయమైన బాధతో కళ్ళు మూసుకున్నప్పుడు, ఇంక ఈ కళ్ళు శాశ్వతంగా మూతపడితే, అందమైన ప్రపంచం మరలా నాకు కనిపించదు. కాని, బిడ్డ - తను ఎలా ఉంటుందో కదా? ఆడబిడ్డా లేక మగబిడ్డా? 'హే భగవాన్, ఒకవేళ నన్ను నీ దగ్గరికి తీసుకుపోవాలనుకుంటే, నా బిడ్డను ఒక్కసారి, కనీసం ఒక్కసారైనా తనివితీరా చూసుకున్నాక తీసుకొనిపో, ఒక్కసారి తృప్తిగా గుండెలకు నా బిడ్డని హత్తుకొని, ఆ తర్వాత నన్ను తీసుకుపో' అని వేడుకొన్నాను.

అడవిలోని దట్టమైన పొదలు ఒక్కసారిగా మాయమైపోయి, గాఢాంధకారం అలముకొన్నట్లుగా అనిపించింది. ఆ తర్వాత ఏమైందో తెలీదు. నాకళ్ళు తెరిచే సరికి ఎన్నో యుగాల తర్వాత నిద్రలేచినట్లనిపించింది. నా ఇద్దరు దాసీలు, నా చెవిలో ఏదో గుసగుస విన్పించారు. కాని నాకు అర్థంకాలేదు. కాని, ఐదు, పది క్షణాలతర్వాత వాళ్ళు చెప్పిన మాటలు అతిమధురమైన సంగీతంలా, ముల్లోకాలను మైమరపింపజేసే స్వరధునిలా వినిపించసాగాయి, నేను వింటున్నాను - చెవులలో ప్రాణం నింపుకొని మరీవింటూ వుండిపోయాను. నా దాసీలు చెప్పారు - 'మగబిడ్డ పుట్టాడు! మగబిడ్డ - మగశిశువు - తెల్లగా, బొద్దుగా, ఆరోగ్యంగా - మగశిశువు - మగబిడ్డ!'

నా బిడ్డ నామకరణ మహోత్సవానికి - మహోత్సవమని ఎలా చెప్పగలను? - ఆ రోజు కేవలం మేము ముగ్గురమే ఉన్నాము. నేనూ నా ఇద్దరు దాసీలు. దేవయాని దూరంగా ఉండే అన్నీ తెలుసుకుంటున్నది. నాకు మగబిడ్డ అని తెలిసి కూడా ఏమీ తెలియనట్లుగా నటిస్తుంది. ప్రత్యక్షంగా నామీద శత్రుత్వం చూపక

పోయినా, ఎప్పటికప్పుడూ నాపై ఒక కన్నువేసి ఉంచే ఏర్పాటు చేసింది. అశోక వనంలో ఏం జరుగుతుందో ఎప్పటికప్పుడు ఆమెకు తెలుస్తుండేది.

నా బాబు - ఒక చక్రవర్తి కుమారుడు. కాని, శర్మిష్ఠ పేగు తెంచుకు పుట్టిన అభాగ్యుడు. అందంగా అలంకరించిన ఊయలలో వేసి నామకరణ మహోత్సవం ఎవరు జరిపిస్తారు? నా మనసులో, పురూరవుని పేరు పెట్టాలని ఉంది. కాని, నా మనసులో ఒక సందేహం కొట్టుమిట్టాడింది. ఒకవేళ ఈ పేరుపెడితే దేవయానికి అనుమానం రాకతప్పదు. ఆ పేరు మహారాజుగారి ముత్తాతది. ఆయన చాలా పరాక్రమశాలి కూడా. అందుకే ఆ పేరును వదలుకోలేక 'పురు' అని పేరు పెట్టాను. ఇంతకీ ఈ నామకరణం ఎక్కడ జరిగిందో తెలుసా! బయట ఉద్యానవనంలో ఒక మూలన. నా చేతులే ఊయలగా, ఆ ఊయలపై చంద్రునివంటి బాబు, చుట్టు ప్రకలా చెట్లు లతలు - ఇవే నా బిడ్డ నామకరణ మహోత్సవానికి అలంకారాలు.

'పురు' నా జీవితాన్ని ఆనందసాగరంలో ముంచేసాడు. తనని ఎంత ముద్దులాడినా ఇంకా తృప్తిగా ఉండేదికాదు. పుట్టుకతోనే అతని జుత్తు ఒత్తుగా అందంగా ఉండేది. నేను దానిపై వేళ్ళతో నిమురుతూ ఉంటే నందనవనంలో పూలగుత్తులపై నడిచే అనుభూతి కలిగేది. ఆకలి వేసినప్పుడు 'పురు' నా గుండెలకు హత్తుకుపోయి పాలకోసం తడుము తుంటే నాకు అంతులేని ఆనందం కలిగేది. నా పాలు తాగుతూ - తాగుతూ మధ్యలో ఆగి నాపైపు చూసేవాడు. ఒక్కోసారి పాలను పెదవులతో 'పూ - పూ' అంటూ పాలబిందువుల్ని విరజిమ్మేవాడు. ఆ- బిందువులు మరలా తన బుగ్గలపైనే పడితే ఎంతో ముద్దులొలికే ఆ బుగ్గలను చూసి పదే - పదే ముద్దు పెట్టుకునేదాన్ని. అతని చిన్ని - చిన్ని పిడికిళ్ళలో కుబేరుని సంపదంతా ఉండేది. నాపైపు బిక్కు - బిక్కుమని చూసే వాడి కన్నులు రెండు చంద్రబింబాలలా ఉండేవి. నావైపు చూసి ఒక్కోసారి తన చిన్నిపెదవులపై తారాడే చిరునవ్వులో నాకు నవవసంతపు వైభవం కన్పించేది.

పురు దినదిన ప్రవర్ధమానుడయ్యాడు. వాడు ఒక్కోసారి బొర్లపడేవాడు, ముంగాళ్ళతో పాకేవాడు, కూర్చుండేవాడు, చిలకలతో - కాకులతో, పూలు - సీతాకోకచిలకలతో, పక్షులతోను, వెన్నెలతోను అతనికి స్నేహం కుదిరింది.

శుక్రాచార్యులువారు ప్రజలకు దర్శనమివ్వడానికి గుహవెలుపలికి వచ్చే సమయ మయిందని విన్నాను! కాని, అప్పుడు 'యదు'కి జబ్బుచేసింది. అందుకే

దేవయాని వెళ్ళలేదు. ఆమె హస్తినాపురం నుండి ఎటో బయటికి వెళ్తేగాని మహారాజుగారిని కలుసుకోవడం జరగదని నాకు బాగా తెలుసు. కాని, పురు బాలచేష్టలతో నాకు మహారాజు విరహ దుఃఖంగాని మరి ఏ యితర దుఃఖంగాని కలుగలేదు. అన్నీ మరిచిపోగలుగుతున్నాను. నేను ప్రస్తుతం కేవలం వర్తమానంలో జీవిస్తున్నాను. గడిచిపోయిన కాలం గురించి గానీ, భవిష్యత్తు గురించిగానీ నాకు ఏమాత్రం బెంగలేదు.

సుఖమైన రోజులు లేడిలా గంతులేస్తాయేమో?

'పురు'కి మొదటి జన్మదినం సమీపించింది. అప్పుడు కూడా శుక్రాచార్యులవారు గుహనుండి రెండోసారి బయటికి వచ్చేసమయమది. దేవయాని తండ్రిని చూడటానికి, తన తండ్రికి మనుమణ్ణి చూపించడానికి వెళ్ళింది. ఆరోజు నా మనసు కొత్త పెళ్ళికూతురిలా సిగ్గుతో నిండుకుపోయింది. ఆరోజు పగలంతా చాలా నెమ్మదిగా గడుస్తున్నట్లనిపించింది. నేను ఉత్సాహంతో చేసుకున్న అలంకరణంతా 'పురు' తన చిన్ని చేతులతో చెదరగొట్టేవాడు. మొదటిసారి - బొత్తిగా నేను కోపంతో. కళ్ళెర్రచేసి చూసాను. అయినా ఇంకా మొండిగా అల్లరిచేస్తుంటే ఒక్క చెంపదెబ్బ కొట్టాను. కాని, వెంటనే నా మనసు దుఃఖంతో నిండిపోయింది. నేను బాగా ఏడ్చాను, ఏడ్చి, ఏడ్చి నా కన్నీళ్ళతో బాబుని తడిపేశాను. అలా ఏడ్వడంలో కూడా ఎంత సుఖం ఉంది?

అర్ధరాత్రి గడిచిపోయింది. అయినా సొరంగద్వారం వద్ద శబ్దంకాలేదు. నేను చాలా నిరాశపడ్డాను. మహారాజు నన్ను మరచిపోయి ఉంటారులే అనుకున్నాను. కన్నీళ్ళతో తలగడ తడిసిపోయింది.

అర్ధరాత్రిదాటి ఇంకో రెండుఘడియలు కూడా గడిచిపోయాయి. ఆ సొరంగపు తలుపుల శబ్దం వినిపించింది. నెమ్మదిగా తలుపులు తెరుచుకున్నాయి. నాకు కళ్ళల్లో ప్రాణం లేచివచ్చినట్లనిపించింది. కొంచెం సేపట్లోనే మేఘాల మధ్య మెరుపులా నేను మహారాజు కౌగిలిలో ఉన్నాను.

చాలా కాలం ఎడబాటు తర్వాత ఇది తొలి కలయిక - అలాంటి ఈ కలయికలో ఎంత ఆనందం! మేము ఎన్నెన్నో మాట్లాడుకోవాలి, ఎంత

ప్రయత్నించినా ఒక్కరికీ నోటమాట రావటంలేదు. అయినా మేము ఒకరికొకరు చెప్పుకుంటున్నాం - కళ్ళతోనా, కాదు! కన్నీళ్ళతో, స్పర్శతో!.

బాగా నిద్రపోతున్న 'పురు' వైపు మహారాజు చాలాసేపు చూస్తూ ఉండి పోయారు. తర్వాత నా రెండు చేతులూ తన చేతుల్లోకి తీసుకుంటూ 'శమా', నన్ను క్షమించు, ఈరోజు మన ఈ ముద్దుల 'పురు' కొరకు ఏమీ చేయలేక పోతున్నాను, కాని రేపు ...... రేపు ...... అన్నారు. నేను ఆయనను ఇంకా మాట్లాడనివ్వలేదు.

దేవయాని నామీద గట్టిగా నిఘా ఏర్పాటుచేసి వెళ్ళింది. ఆమెకు దొరక కుండా ఉండాలని మేము నిర్ణయించుకున్నాం. మహారాజు రోజూ కలిసే అవకాశం వున్నా నేనే దూరంగా ఉండటానికి అంగీకరించి, వారానికొకసారి కలుసుకునే విధంగా ఏర్పాటు చేసుకుని, దానితోనే తృప్తిపడసాగాను.

ఒక రాత్రి ఆయన వచ్చారు. 'పురు' మేల్కొనే ఉన్నాడు. నా దాసి బాబుని తీసుకుని ఉద్యానవనంలోకి వెళ్ళి బాబుచేతనే చిన్ని చేతులతో పూలు కోయి స్తున్నది. ఆకాశంలో నక్షత్రాలు ఒక్కొక్కటీ మెరుస్తూ కన్పించాయి. నక్షత్రాలతో నిండిన ఆకాశం చూసి బాబు ఆనందంతో ఉక్కిరిబిక్కిరయ్యాడు. లతల నుండి పూలు కోయడం ఎలాగు తనకు తెలుసు కదా. అలాగే ఆకాశంలోని ఆ పూలు కూడా కోయవచ్చుననుకున్నాడేమో, దాసీని మీదకి ఎత్తమన్నాడు, తన చేతులని పైకి చాచుతూ నక్షత్రాలని కోయాలనే ప్రయత్నం చేసాడు. ఎంత మీదకెత్తిన, ఆకాశంలోని నక్షత్రాలు వాడి చేతికి అందవు కదా! 'పురు' వాటిని అందుకోవాలని మొండిపట్టు పట్టి ఏడ్వసాగాడు. ఏడ్చి - ఏడ్చి కళ్ళు ఎర్ర బారిపోయాయి. బాబుకి అన్నం తినిపించేటప్పుడు ఒక్కొక్క ముద్ద చేతిలో పట్టుకుని, అదిగో చిలుకా, ఇదిగో కాకి, అదిగో పిట్ట, ఇదిగో పిల్లి అని తన మిత్రులపేర్లన్నీ పెట్టి తినిపించాలని ఎంత ప్రయత్నించినా ఒక్క మెతుకు కూడా తినలేదు. అర్ధరాత్రివరకు భుజంమీద వేసుకుని జోకొడుతూ పడుకోబెట్టాలని ప్రయత్నించాను. అయినా మొండిగా, పడు కోకుండా మేల్కొనే ఉన్నాడు.

మహారాజు ఆరోజు మొదటిసారి వాడు మేల్కొని ఉండగా చూసారు. బాబుని రమ్మని రెండు చేతులూ చాచారు. ఒక్క క్షణం చూసాడు 'పురు'. ఆయన దగ్గరికు

వెళ్ళడానికి ఒక్కసారి ముందుకురికాడు. మళ్ళీ అంతలోనే రాను - రాను అన్నట్లు తలాడిస్తూ ముఖం తిప్పేశాడు. అలా తిరిగి నా భుజంపై తల ఆనించి పడుకొన్నాడు. తల్లి భుజంమీద నిశ్చింతగా పడుకున్న ఆచిన్ని, ముద్దు ఆకారాన్ని మహారాజు తృప్తిగా చూసారు.

అప్పుడే 'పురు' తన చిన్నిచేతులతో నా ముఖం పట్టుకొని తిప్పసాగాడు. బహుశా నాకు ఏదో వస్తువు చూపించాలనుకుంటున్నాడేమో! తను ఏం చూపించాలనుకుంటున్నాడో నాకు మొదట్లో అర్థంకాలేదు. తర్వాత - మూలగా ఉన్న మహారాజు చిత్రం చూపి తర్వాత మహారాజువైపు వేలు పెట్టి చూపించాడు. ఆ చిత్రం, మహారాజు ఒక్కరే అని వాడు చెపుతున్నట్లు వాడి మూగభాష ద్వారా నాకర్థమయ్యింది.

'అబ్బ ఎంత గడుసువాడో!' అని మహారాజు వాడిని పదేపదే ముద్దాడారు. ఆయన బాబుకి ముద్దుపెట్టినచోటే నేను ముద్దు పెట్టినప్పుడు నాకు ఎంత ఆనందంగా ఉందో చెప్పలేను. ఆ ముద్దు రెండింటికి ప్రతీక - ఒకటి శృంగారం, రెండవది వాత్సల్యం. రెండు రసాల కలయికే ఆ ముద్దు.

దేవయాని తిరిగి వచ్చేసిన తర్వాత ఈ రకమైన అనుభూతి, ఆనందం, మరలా లభించలేదు. కాని 'పురు' ఇప్పుడు ఒక్కొక్క అక్షరం ఉచ్చరిస్తున్నాడు. అలా ఆ చిన్నినోటి నుండి ఒక్కొక్క ధ్వని వెలువడుతూంటే - దేవదానవులు సాగర మథనం చేసినప్పుడు అమృతం బయటికి వస్తున్నప్పుడు కలిగినంత ఆనందం కలిగింది. రోజూ సాయంత్రం 'పురు'ని తీసుకొని మహారాజు చిత్రం దగ్గర కూర్చునేదాన్ని. ఆ చిత్రపటానికి నమస్కరించి 'నా-నా, నా-నా' అనడం బాబుకి నేర్పించాను. ఒక్కోసారి పట్టుబట్టి రెండో అక్షరం కూడా ఉచ్చరించేవాడు. కాని, నాకు భలే ఆనందంగా ఉండేది. సంతోషం ఉండబట్టలేక బాబుని నా గుండెలకు గట్టిగా హత్తుకుని, పదే - పదే ముద్దాడేదాన్ని. తొందరగా 'నాన్న, నాన్న' అనడం వచ్చేస్తే బాగుండనిపించేది. ఏదోరోజు మహారాజు వచ్చినప్పుడు, ఆయనను చూసి 'నాన్నా' అని పిలిస్తే నాకళ్ళలో ఆ వేడుక చూడాలని ఉంది. భగవంతుడు మనిషికి, ఊహాశక్తి ఇచ్చి ఉండకపోతే - అని అనిపించేది.

'పురు' లేకపోతే నా మనోవ్యథ అధికమై ఉండేది. వాడిని చూసుకుంటూ నా

దుఃఖాన్నంతా మరచిపోగలుగుతున్నాను. కాని ఒక్కొక్కరోజు చాలా విచిత్రాలు జరుగుతాయి.

అలాగే ఒక విచిత్రం జరిగిన రోజు! వర్షఋతువు అయిపోవచ్చింది. అయినా ఆకాశంలో నల్లని మబ్బులు క్రమ్ముకున్నాయి. మనసంతా ఎందుకో ఉదాసీనంగా ఉంది. ఒక దాసి, పురు చేసిన అల్లరిని వర్ణిస్తూ, నా చిన్నప్పటి అల్లరికి సంబంధించిన ఒక కథ చెప్పడం ప్రారంభించింది. నా చిన్ననాటి జీవితం, చీకూ - చింత లేని జీవితం ఒక్కసారి నా కళ్ళముందు మెదిలింది. అదృష్టం నిండిన ఆ బాల్యం తర్వాత ఇదిగో ఈ నిర్భాగ్యపు దాసీజీవితం వచ్చింది.

మనసులోని ఒక్కొక్క గాయం రేపి బాధించసాగింది.

నాకిలా బాధ కలిగినప్పుడల్లా, కచుడు చెప్పిన ధైర్యవచనాలు గుర్తుకు తెచ్చుకుని ఉపశమనం పొందకడానికి ప్రయత్నించేదాన్ని. ఇంకా మనశ్శాంతి లభింపకపోతే, స్నానం చేసి కచుడు దేవయానికిచ్చిన ఆ ఎర్రచీరను, అదే నేను పొరపాటున ఆరోజు జలక్రీడలప్పుడు ధరించాను కదా - కట్టుకునేదాన్ని, ఆరోజు కూడా నేను అలాగే చేసాను.

కాని అనుకోకుండా ఆరోజు దేవయాని దగ్గర నుండి రాజమందిరానికి బాబుని తీసుకొని రమ్మని నాకు కబురువచ్చింది. నేను గాభరపడిపోయాను. చీర మార్చుకోవాలనే ధ్యాసేకలగలేదు నాకు!

ఒకవేళ మా ప్రేమ రహస్యం దేవయానికి గాని తెలిసిపోలేదు కదా? ఏదో రాత్రి మహారాజు నన్ను కలవడానికి వచ్చినప్పుడు, కాపలా ఉంచిన దాసీ, మహారాజు తన మందిరంలో లేరని చెప్పి ఉండొచ్చు. అయినా అంత మాత్రానికి భయపడవలసినదేముంది? రాజకార్యంపై మహారాజు ఇంకెక్కడికో వెళ్ళి ఉండవచ్చు. ఆయన శయన మందిరంలోలేరంటే, దానర్థం ఆయన అశోకవనానికే వెళ్ళి ఉంటారని ఎందుకు అనుకోవడం?

భయపడుతూనే నేను రాజమందిరానికి వెళ్ళాను. దేవయాని, నేనుకట్టుకున్న ఆ ఎర్రచీర చూసింది. అయినా ఆమె ముఖంలో ఏమాత్రం అసూయ కన్పించ లేదు. 'హమ్మయ్యా బ్రతికాను' అని అనుకుని గట్టిగా ఊపిరి పీల్చుకున్నాను.

ఇంతకుముందు ఒకసారి రాజమందిరానికి, సాముద్రికశాస్త్రంలో సిద్ధహస్తుడైన ఒక జ్యోతిష్కుడు వచ్చాడు. అప్పుడు రాజమాత నా చేయికూడా ఆయనకు చూపించింది. ఆయన పెదవి విరుస్తూ ఈమె అభాగ్యురాలు అని చెప్పి, అయితే ఈమెకు పుట్టేబిడ్డ రాజసింహాసనాన్ని అధిష్ఠిస్తాడు, అని చెప్పాడు. ఆ జ్యోతిష్కుడు ఈరోజు మరలా రాజధానికి వచ్చాడు. అందుకే దేవయాని మరలా నన్నూ, నా బాబుని పిలిపించింది.

ఆ రోజు ఆ పండితుడు పరీక్షించడానికే 'పురు'ని తీసుకు రమ్మంది. ఆమె 'యదు'కి 'పురు'కి ఒకేరకమైన వస్త్రాభూషణాలను అలంకరించమని దాసీలకు చెప్పింది. చూసినవారికి వాళ్ళు కవల పిల్లలేమో అన్పించడానికి, వాళ్ళిద్దరికీ బోలెడన్ని బొమ్మలు ఆడుకోడానికి ఇచ్చి తన మందిరంలోనే ఉంచింది. అప్పుడు జ్యోతిష్కపండితుణ్ణి రమ్మని కబురుపంపింది. ఆయన పిల్లలిద్దరి కుడి అరచేతులను చాలాసార్లు పరీక్షించి, చివరికి పెదవి విరిచి యదు వైపు చూపిస్తూ 'ఇతను చాలా అభాగ్యుడు అవతాడనిపిస్తుంది', అని అన్నాడు.

దేవయాని పెదవికొొరుక్కుంటూ కోపాన్ని లోలోపలే దాచుకుంది. తర్వాత 'పురు' వైపు చూపిస్తూ 'మరి ఈ బాలుడో?' అని అడిగింది.

మరలా కొంచెంసేపు పురు చేతిని పరీక్షించి చెప్పాడు - 'ఇతడు చక్రవర్తి అవుతాడు!'

దేవయాని స్థితి మిన్ను విరిగిమీదపడ్డట్టయింది. దేవయాని తనని తాను నిగ్రహించుకొని జ్యోతిష్కుణ్ణి కంగారు పెట్టాలని 'అయ్యా! వీళ్ళిద్దరూ అన్న దమ్ములు! ఇద్దరూ రాజకుమారులే, వాళ్ళ జీవితంలో అంత తేడా ఎలా ఉంటుంది?' అన్నది.

జ్యోతిష్కుడు ప్రశాంతంగా సమాధానం చెప్పాడు - 'మహారాణీ, అదృష్టం ఒక అద్భుతశక్తిలాంటిది! ఏ ఆకాశంలోనైతే శుక్రతార దేదీప్యమానంగా వెలిగిపోతూ ఉంటుందో, అదే ఆకాశం నుండి ఒక ఉల్క భూమిమీద పడి రాయిగా మారి పోతుంది!'

దేవయాని జ్యోతిష్కుణ్ణి తొందరగా పంపే ప్రయత్నం చేయించింది, అయినా ఇంతలో మహారాజు అకస్మాత్తుగా మందిరంలోకి వచ్చారు. ఆయనతోపాటు మిత్రుడు మాధవుడు కూడా వచ్చాడు. మహారాజుని చూచి 'నా..... నా.....' అంటూ పురు ఆయన వైపు వెళ్ళసాగాడు. నాకు పై ప్రాణాలు పైనే పోయాయి. ఇంతలో దేవయాని నావైపు కోపంగా చూస్తూ అడిగింది కూడా - 'ఏమే! వీడేమంటున్నాడు? నేను ఏమీ నోరు మెదపలేదు. అదృష్టంకొద్దీ 'పురు' ఉచ్చరించిన ఆ ఏకాక్షర మంత్రం అర్థం ఎవరికీ తెలియలేదు.

జ్యోతిష్కుడు వెళ్ళిపోగానే, మహారాజుతో ఒక్క మాటైనా చెప్పకుండా దేవయాని నావైపు చూసి అన్నది - 'నీతో కొంచెం పనుంది పద, మహారాజు మందిరంలో మనం ఏకాంతంగా మాట్లాడుకుందాం. నగరానికి కొందరు గొప్ప నాట్యకళాకారులు వచ్చారు. వాళ్ళు మన ముందు ప్రదర్శన ఇవ్వాలనుకుంటున్నారు. పద వెళ్దాం. 'పురు'ని కూడా తీసుకొనిరా'.

మేము మహారాజు మందిరంలో అడుగుపెడుతూ వుండగానేనే దేవయాని రెండు తలుపులూ మూసేసింది. నేను ఆశ్చర్యపోయాను. మంచంమీద కూర్చుని గద్దింపు స్వరంతో అడిగింది - 'శర్మిష్ఠా! నీవు నా దాసీవన్న సంగతి మరచి పోయావా?'

నేను నెమ్మదిగా తలాడిస్తూ 'లేదు. నేను నీదాసీనే'. అన్నాను.

'దాసీలు ఎలాంటి తప్పు చేసినా క్షమిస్తాను - క్షమించగలను, కాని దాసీల వ్యభిచారాన్ని.....'

'నేను వ్యభిచారిణిని కాదు!'

గట్టిగా వికటాట్టహాసం చేస్తూ అన్నది - 'ఆహాః, ఎంత మాట! భర్తలేకుండా ఒక స్త్రీకి బిడ్డపుట్టడం, అప్పుడుకూడా ఆమెను ఎవరూ వ్యభిచారిణి అనకూడదా? బాగుంది, చాలా బాగుంది?'

'ఒక ఋషి కృప వలన నాకు 'పురు' జన్మించాడు!'

'ఆ ఋషి పేరు?'

'ప్రపంచానికి అతని పేరుతో పనేముంది?'

'ఆ ఋషి కృపతో కొడుకు పుట్టాడన్న బూటకపు కథలను ఈరోజుల్లో ఎవరూ నమ్మరు. అందుకే ఆ బిడ్డకి తండ్రెవరో, అతని పేరేమిటో, ప్రపంచానికి తెలియాలి!'

'శుక్రాచార్యులు సంజీవనీ విద్యతో మరణించిన వారిని బ్రతికిస్తారన్నది కూడా బూటకపు కథేనా?'

అది వింటూనే దేవయాని పళ్ళు కొరుకుతూ - పళ్ళతో పెదవి నములుతూ కోపంగా అంది, 'ఛీ పొగరుబోతుదానా! నీకు బుద్ధిలేదా? చిన్న నోటితో పెద్ద మాటలు మాట్లాడితే నాశనమవుతావని తెలియదా! ముల్లోకాలనూ గడగడ లాండించిన నాతండ్రి శుక్రాచార్యుడెక్కడ, నీలాంటి దాసీదాని కాళ్ళుపట్టుకున్న బైరాగి గాడెక్కడ? చెప్పు, ఎవడే, ఆ దొంగ ప్రేమికుడు ఎవరే?'

'నేను చెప్పను?'

'నేను మహారాణిని, నాఆజ్ఞ ధిక్కరిస్తే, నేను విధించిన శిక్షని అనుభవించాలి. రేపే సభను ఏర్పాటు చేస్తున్నాను. అందులో, వ్యభిచారమనే అభియోగంపై నీపై విచారణ జరుపుతాను. నీ పవిత్రత అక్కడ నిరూపించుకో, నీవు చెప్పిన సమాధానం అందరికీ సమ్మతం కాకపోతే - ఎర్రనిచీర కట్టుకుని మంచి పనిచేసావు - శూలం వేయబడ్డవాళ్ళు ఎర్రని వస్త్రమే ధరించాలి కదా!'

నాకు పట్టపగలే నక్షత్రాలు కన్పించసాగాయి. నా బుర్ర గిర్రున తిరుగుతున్నది. ఇంక ఒక్కమాట కూడా దేవయాని నోటినుండి వినకూడదని మనసులో అనుకుని, జరిగేది జరుగుతుందని అక్కడ నుండి బయటపడాలి అనుకొని 'పురు'ని గుండె లకు హత్తుకుని ద్వారం వైపు నడిచాను.

'ఎక్కడి కెళ్ళిపోతున్నావు?' దేవయాని ప్రశ్నతో నా అడుగులు ఆగాయి. ఆమె మాటల్లో ఏదో అఘోరీతాంత్రికశక్తిలాంటిది ఉంది.

'మహారాజా! మహారాజా!' అని గట్టిగా అరవాలని పదేపదే అనిపించింది. కాని, నోరు పెగలలేదు! అయితే మహారాజు గనుక నాకు సహాయం చేయడానికి

వస్తే సమస్య మరింత జటిలం అవుతుందని వెంటనే అనిపించింది. రాజ మందిరంలో మంటలు చెలరేగుతాయి! నేను ఇంతవరకూ ఈ రహస్యాన్ని అతి జాగ్రత్తగా కాపాడుకుంటూ వచ్చాను. ఇప్పుడు అది బయటపడితే అంతా వ్యర్థ మవుతుంది. మహారాజు దేవయాని కోపానికి గురి అవుతారు. శుక్రాచార్యులు మహా రాజుకి ఘోరమైన శాపమివ్వవచ్చు.

దుఃఖాన్ని, భయాన్ని దిగమింగుకుంటూ రాయిలా అచేతనంగా నిలబడి పోయాను.

దేవయాని నన్ను తన వెనక రమ్మని చెప్పింది. యంత్రలా నేను ఆమె వెనకే నడిచాను. ఆ మందిరంలో తూర్పుగోడదగ్గరగా వెళ్ళి ఆగింది. అన్ని గోడల లాగే ఉంది అదికూడా. ఇక్కడో మీట ఉంది - అశోకవనంలో లాగానే. దేవయాని మీట నొక్కగానే ద్వారం తెరచుకుంది. ఆమె 'పద! ఈలోపలికి! పద!' అన్నది.

యంత్రంలా ఆ సొరంగపుమెట్లు దిగాను. నా వెనుకగా ఆమె కూడా వచ్చింది. ఈ సొరంగమార్గంగుండా ఆమె నన్ను ఎక్కడికి తీసుకువెళ్తుందో నాకు అంతుచిక్క లేదు. కాని ఆ సొరంగం పెద్దపొడవైనదేమీకాదు. రెండోవైపు ఒక భూగృహం ఉంది.

దేవయాని నావైపు తిరిగి అన్నది - 'లోపలికి వెళ్ళు. ఈ భూగృహంలో పూర్తి ఏకాంతంగా ఉండు, కావాలంటే, ఆ దొంగ ప్రియుణ్ణి కూడా రప్పించుకుని కులుకు! కాని, ఒక్క విషయం మాత్రం జ్ఞాపకముంచుకో. నీ ప్రియుడి పేరు చెప్పాలో, వద్దో ఈరాత్రికి బాగా ఆలోచించుకొని ఒక నిర్ణయానికిరా! నీ ప్రియుడు ఋషి, గదా! అయితే మంత్రబలంతో ఇక్కడికి రాగలడు. ఒకవేళ రాకపోతే, నీబిడ్డ సలహాతీసుకో. నేను మరలా ఉదయం వస్తాను. అప్పటికి నీ ప్రియుడి పేరు చెపితే సరేసరి. లేకపోతే నగరంలో దండోరావేయించి సాయంత్రం విచారణ సభ ఏర్పాటు చేస్తాను. నీ వ్యభిచారం సంగతేదో అప్పుడు తేలిపోతుంది .....'

చెపుతూ - చెపుతూ ఆగింది. తర్వాత ఒక నవ్వు నవ్వింది. ఆ నవ్వులో ఎంత విషమో! వెంటనే అతి సున్నితంగా చెప్పసాగింది 'ఇక్కడ ఇంతకుమునుపు ఎవరైనా తపస్సు చేయడానికి కూర్చుంటే, వారి సేవకి ఎవరినో ఒకరిని ఉంచే వాళ్ళం. అలాగే ఎవరైనా కాపలావాణ్ణి పెడదామనుకున్నాను. కాని వాడు నీ

సౌందర్యంచూసి ఏమైనాచేస్తే ..... ఉదయం, ప్రియుడి పేరుతో వాడినే చూపి వాడి పేరు చెప్పడానికి నీకు తేలిక అవుతుంది: అందుకే ఎవరినీ కాపలా పెట్టడంలేదు. కాని, ఒక్క విషయం మరచిపోవద్దు ఇంకా నాలుగు ఝాముల సమయమే ఉంది. నిజంచెప్పు. ఈ పిల్లవాడిచేతిలో చక్రవర్తి రేఖలు ఎలా వచ్చాయి?'

నేను అతి శాంతంగా సమాధానమిచ్చాను. 'ఋషి ఆశీర్వాదంవలన!'

'అయితే ఆ ఋషి ఆశీర్వాదంతోనే ఈ రాత్రి భూగృహం నుండి అదృశ్య మైపోతావు!'

'తప్పకుండా అవుతాను! ఇందులో అసంభవమేముంది? అశోకవనంనుండి యతి అదృశ్యమైపోలేదా? నీకు తెలియదా? వరద నీటిలో యమునా నదిపై నుండి అతను ఆవలి ఒడ్డుకి వెళ్ళాడని అనుకున్నారు. అలాగే నేను కూడా ఈ భూగృహం నుండి .....'

ప్రాణం పోయినాసరే, దేవయాని ముందు తలవంచకూడదని - నాకు, ఏది తోస్తే అది అనేశాను. కాని, ఆమె తలుపు మూసుకుని వెళ్ళిన తర్వాత - నా ఆవేశం పూర్తిగా చల్లబడిపోయింది. వెంటనే ఒక్కసారిగా ముందుకుదూకి భూగృహ ద్వారం తెరిచి దేవయాని కాళ్ళు పట్టుకుని - 'నీవు నన్ను ఎంతైనా బాధపెట్టు, ఆఖరికి నా ప్రాణం కావాలంటే తీసుకో, కాని, నా బిడ్డ - నా బిడ్డకి ఎలాంటి కష్టం కలగనీయకు. ఈ అంధకారంలో, ఈ భూగృహంలో.....' అని ప్రాధేయపడదా మనుకున్నాను. కాని .... ..... ......

ఆ చీకటిలో ..... ఎన్నో యుగాలుగా కూర్చున్నట్లనిపించింది. చీకటికి భయ పడి పురు ఏడ్వడం మొదలు పెట్టాడు. నేను వాడిని గుండెల్లో దాచుకున్నాను. తర్వాత నిశ్చింతగా నా ఒడిలో పడుకున్నాడు. 'పురు'కి అమ్మ ఉంది. అమ్మ అండ ఉంది. కాని, నాకో ..... .....

ప్రతీ క్షణం యుగంలా వుంది. చీకటి కొంచెకొంచెం దట్టమవుతున్నట్లని పించింది. తర్వాత చీకటిలో ఎవరో కదులుతున్నారనిపించింది. భూతమేమో? కాదు! ఎమీ అర్థంకావటంలేదు.

బహుశా! ఆ నీడ ఎవరో యువతిదిలా ఉంది. ఎవరై ఉంటారు? ఈ

భూగృహంలో నాలాంటి మరో నిర్భాగ్యపు ప్రియురాలా? ఎవరామె? ఏమిటి వెతుకుతోంది?

నాకు పిచ్చెక్కించాలని దేవయాని నన్నిక్కడ బంధించలేదు కదా? అని ఒక్కసారి అనిపిస్తున్నది.

ఆ గది గోడలు నాలుగూ, ఒకదాన్నిమించి ఒకటి భయంకరమై కథలు చెప్ప సాగాయి. కాముకుడైన రాజుప్రేమ, సవతిపోరు, వంశ గౌరవంకోసం చేయబడిన హత్య, అమాయకులైన స్త్రీలుకు త్రాగించే విషపు పాత్రలు ..... .....

ఈ యమయాతన అనుభవిచేకంటే గోడకేసి తలబద్దలుకొట్టుకొని చావడమే మేలు అన్పించింది. ఆత్మహత్య ఆలోచనా ప్రేరణతో లేచి నిలబడాలనుకున్నాను, కాని లేవలేక పోయాను. నా ఒడిలో 'పురు' పడుకొని ఉన్నాడే. వాడికి నిద్రా భంగమౌతుందే..... .....

భగవంతుడు నా జీవితాన్ని ఈ ప్రపంచంతో గట్టితాళ్ళతో, అందమైన తాళ్ళతో బంధించివేశాడే!.

గదిలో ఎక్కడో మెరుపు మెరిసింది. నేను ఉలిక్కిపడి పైకి చూసాను. మూలగా ఒక దీపం కన్పించింది. బయట మెరుపుల వెలుగేమో, బహుశా .....

ఆ వెలుగు నాకు కాస్త ధైర్యాన్నిచ్చింది. నేను కచుణ్ణి గుర్తుకు తెచ్చుకో సాగాను. ప్రాణాపాయంలో అతని జ్ఞాపకచిహ్నమైన చీర నా ఒంటిమీద ఉంది. నేనెంత భాగ్యశాలినో అన్పించింది. నా మనసు శాంతించింది. 'పురు'ని గుండెలకి హత్తుకొని నేలపైనే చేరబడ్డాను. కొంచెం సేపట్లోనే కళ్ళుమూతలు పడ్డాయి.

తలుపుశబ్దంతో ఒక్కసారిగా మెలకువ వచ్చింది. మొదట్లో ఇదంతా కలేమో అన్పించింది. కాని అంతలోనే కలకాదు వాస్తవమన్పించింది. ఎవరో భూగృహం తలుపు తెరిచారు. ఆశ, భయం అనే అడకత్తెరలో మనసు ముక్కలు కాసాగింది. ఎవరైనా నన్ను విడిపించాలని వచ్చారా లేక దేవయానిగాని, విషంపాత్రపట్టుకుని మళ్ళీ వచ్చిందా?

మళ్ళీ మెరుపు వెలుగుతో ఒక్కసారి చీకటి తొలగిపోయింది. ఆ వెలగులో

లోపలకు వచ్చే వ్యక్తిని బాగా గుర్తుపట్టాను. ఆయన మహారాజు. దగ్గరగా వచ్చి నా భుజంమీద చేయ వేశారు. ద్వారం వైపు నడిచారు. పురుని ఎత్తుకుని ఆయన వెనకాలే నేను నడిచాను.

ఒక్క క్షణంలో పైన మందిరంలోకి వచ్చేసాము. మందిరపు దక్షిణపుగోడకున్న మీటనొక్కి, మహారాజు ముందుకి నడిచారు. వెనకాలే నేనూ నడిచాను. ఈ తొందరలో 'పురు' మేల్కొన్నాడు, 'నా .... న, నా .... న' అని మహారాజుని పిలవసాగాడు. నేను అరచేతితో బాబు నోరు మూసేసాను.

మళ్ళీ సొరంగ మార్గంగుండా తొందర - తొందరగా అడుగులువేస్తూ అశోక వనం చేరుకున్నాము. సొరంగం నుండి గదిలోకి వెళ్ళే మార్గాన్ని మహారాజు తెరిచారు. ఆయన నాతో అన్నారు, 'ఇంక ఒక్కక్షణంకూడా ఇక్కడ ఉండొద్దు. దాసీలను కూడా కలవవద్దు. బయట రథం సిద్ధంగా ఉంటుంగి. మామిత్రుడు, మాధవుడు అందులో ఉంటాడు. అతను నిన్ను .... వెళ్ళు, వెళ్ళు, తొందరగా......!'

అలా చెప్తూ ఆయన కళ్ళు చెమ్మగిల్లాయి. కన్నీటితోనే ఆయన నన్ను ముద్దు పెట్టుకున్నారు. ఆ కన్నీళ్ళు నాబుగ్గలపై ప్రవహించాయి. పురు తలమీద చేతితో ఒకటి రెండుసార్లు నిమిరి, తర్వాత సొరంగమార్గం మూసేసారు.

నా దాసీలు చాలా గాభరాపడిపోయారు. నన్ను వెదకటం మొదలెట్టారు. కాని వాళ్ళను కలవకుండానే నేను తిన్నగా వెళ్ళి రథంలో కూర్చున్నాను. వెంటనే రథం పరుగెత్తసాగింది.

సారథి గుర్రాలని పదే - పదే కొరడాతో కొట్టడంతో రథం మెరుపువేగంతో పరిగెత్తసాగింది. ఆకాశంలో మేఘాల వీపుమీద మెరుపుల కొరడా దెబ్బలు తగుల్తుంటే, మేఘాలు గుర్రంలా సకిలిస్తున్నాయి.

మేము నగరం పొలిమేరలు దాటేసరికి కుండపోత వర్షం కురవసాగింది. చూస్తూండగానే ప్రకృతి రౌద్రరూపం దాల్చింది. రేపు ఉదయం భూగృహంలో శర్మిష్ఠ లేకపోవడం చూసి, దేవయానికూడా ఇలాగే తాండవనృత్యం చేస్తుంది.

రథం ముందుకు సాగిపోతోంది. చివరికి, దారిలో ఉన్న ఒక జీర్ణ దేవాలయం దగ్గర ఆగింది.

'మహారాణీ!' అని శబ్దం విన్పించింది. ఆ గొంతు ఎప్పుడో విన్నదిలా అన్పించింది. కాని, ఆ సంబోధనకి అర్థమేమిటో నాకు బోధపడలేదు. నేను మౌనంగా ఉన్నాను. మరలా అదే పిలుపు. సారథి దగ్గర కూర్చున్న మాధవుడే అలా నన్ను సంబోధించింది - 'మహారాణీ .....'

ఆ సంబోధనతో నా తనువు పులకించింది. క్షణకాలం ఆ సంబోధనని తలచుకుంటూ తృప్తిగా ఆనందించసాగాను.

'మహారాణీ మీరు ఇక్కడ దిగిపోవాలి!'

'ఇదే మహారాజుగారి ఆజ్ఞా?'

'అవును, ఎవరికీ అనుమానం రాకుండా ఉండటానికి, వెంటనే నేను రథం తీసుకుని రాజధానికి వెళ్ళిపోతున్నాను. మహారాణీ, మళ్ళీ ఎప్పుడూ హస్తినాపురం రావద్దు. చాలా అపాయం'. అలా ...... చెప్పుతూ ...... చెప్పుతూ అతను ఆగిపోయాడు.

'పురు'ని పట్టుకుని నేను రథం దిగిపోయాను. మహారాణి మీద కుండపోత వర్షం పడుతోంది. పర్జన్యాభిషేకం జరుగుతోంది. భావిచక్రవర్తికి మెరుపులు వింజామరలై వీస్తున్నాయి.

నేను మాధవునితో అన్నాను! 'మహారాజుకి నా మాటగా ఒకటి చెప్తారా?'

'తప్పకుండా! చెప్పండి?'

'శర్మిష్ఠ తన మనసులో ఎప్పుడూ మహారాజు పాదాలను పూజిస్తూ ఉంటుందని మృత్యుద్వారం దగ్గరికి చేరుకున్నప్పుడుకూడా ఆయన ఆజ్ఞనెప్పుడూ శిరసా వహిస్తానని చెప్పండి'.

'ఇంకా ........ చెప్పండి?'

'నా పురు ఎక్కడున్నా సరే, మహారాజు తన అభయ హస్తం పురుయొక్క శిరస్సుపై ఉంచాలని! మహారాజు ఆశీర్వాదంతో .......'

ఇంకా ఆపైన నేనేమీ మాట్లాడలేకపోయాను. వర్షంలో తడిసిపోయిన పురుని గట్టిగా గుండెలకు హత్తుకుని అన్నాను - ''పద నాన్నా! పద! ప్రకృతిని నవనవో న్మేష మొనరించిన మేఘాలే నీకుతోడు, ఆకాశంలో వెలుగులు విరజిమ్మే మెరుపులే మీ అమ్మ చేతిలోని కరదీపికలు. పద, మేఘాలకంటె కూడా చల్లగా అయ్యేం దుకు, ఈ మెరుపులకంటే కూడా అధికమైన తేజోవంతుడయ్యేందుకు పద, ముందుకి పద!'.

## యయాతి

దేవయాని మొదటి నృత్యం పూర్తయ్యింది.

ప్రేక్షకులు హర్షధ్వానాలతో ప్రశంసించారు. ఇంతలోనే మేఘాలు గర్జించ సాగాయి. దేవయానిని తీసుకుని నేను నృత్యశాలకి వచ్చినప్పుడే - నల్లని మబ్బులు - ఆకాశంలో అలముకొన్నాయి. బహుశా దేవయాని మనసులోకూడా అంతే నల్లనిమబ్బులలాంటి ఆలోచనలు పోటీపడుతూ ఉండిఉంటాయి. అప్పుడే నేనడిగాను - 'నీ నాట్యం చూడడానికి శర్మిష్ఠని ఎందుకు ఉండమనలేదు?' - 'నేను చాలా ప్రాధేయపడ్డాను ఉండమని, మనసు బాగాలేదని చెప్పి సాయంత్రమే తను అశోకవనం వెళ్ళిపోయింది'. నవ్వుతూ జవాబిచ్చింది దేవయాని.

కాని నా మనసులోని సందేహం నన్ను పట్టిపీడిస్తున్నది. దేవయాని కన్నులలో నల్లని భయంకరమైన మేఘాల మధ్య మెరుస్తున్న మెరుపుల్లా - ఏదో పైశాచిక ఆనందం కనపడతూంది.

నేను మెల్లగా మాధవుని చెవిలో చెప్పాను. అతను రథం తీసుకుని అశోక వనం వెళ్ళివచ్చాడు. శర్మిష్ఠకి నమ్మకమైన దాసీలను కనుక్కుంటే, శర్మిష్ఠ ఇంత వరకూ తిరిగి రాలేదని చెప్పారట. అప్పుడే నాకనిపించింది దేవయాని ఏదో పన్నాగం పన్ని ఉంటుందని, బహుశా ఆమెను హతమార్చడానికి పూనుకున్నట్లుంది. దేవయాని, శర్మిష్ఠని ఎక్కడదాచి ఉంటుందా? అని ఆలోచించసాగాను. వెంటనే నాకు రాజమందిరంలోని ఆ సొరంగం జ్ఞాపకం వచ్చింది. అదే సొరంగంలోని భూ గృహంలోని అమ్మ 'అలక'కు విషం పెట్టి హతమార్చింది. బహుశా అదే సాంప్రదా

యాన్ని ఇప్పుడు దేవయాని కూడా అనుసరించబోతుందేమో! శర్మిష్ఠని అక్కడి నుండి ఎలా విడిపించడం?

దేవయాని వసంత - నృత్యం ప్రారంభం కాబోతూంది. రాజధానికి వచ్చిన గొప్ప - గొప్ప కళాకారులందరూ, ఇంతకుపూర్వం, దేవయాని నాట్యనైపుణ్యం గురించి విని ఉన్నారు. ఒకసారి వాళ్ళు రాక్షసరాజ్యం వెళ్ళినప్పుడు వృషపర్వ మహారాజు స్వయంగా అన్నారట - 'ఈ రోజు, గురుపుత్రిక దేవయానే గనుక ఇక్కడ ఉండి ఉంటే, మీలో ఎవ్వరూకూడా ఆమె ముందు నాట్యంచేసేందుకు సాహసించేవారుకాదు!' అందుచేత వారందరూ దేవయాని నాట్యంచూడడానికి ఉవ్విళ్ళూరడం సహజమే కదా! చాలాకాలమైంది. అభ్యాసం కూడాలేదు అని నాట్యప్రదర్శనకు వెనుకాడింది. కాని చివరికి ఆమె అహంకారం ఆమెను తట్టి లేపింది. అందుచేత రెండు మూడు ఝాముల వరకూ ఎలాగూ దేవయాని తన నాట్య ప్రదర్శనలో నిమగ్నమై ఉంటుంది.

ఎదురుగా కన్పిస్తున్న వసంత నృత్యంలో దేవయాని ఎంతో అందంగా, మృదువుగా, కోమల మనస్కురాలిగా కన్పిస్తోంది. కాని అదే సమయంలో ఆమె అంతరంగంలో ఎంతో క్రూరమూ, భయంకరమూ, ప్రాణాంతకమూ అయిన తాండవ నృత్యం జరుగుతూ ఉండి ఉంటుంది. మానవుడు కూడా దేవదానవుల అద్భుత వర్ణసంకరమేమో!

వసంత ఋతువుయొక్క ప్రథమ స్పర్శతో పల్లవించి, మరలా పుష్పించి, అటుపిదప తన సుగంధాన్ని మందసమీరంతో కలిసి నర్తిస్తూ, మత్తుగా ఆనందానుభూతితో మైమరచిపోయే వసంతలత భూమికను చాలా చక్కగా ప్రదర్శించింది దేవయాని. ఆమె గజ్జెల సవ్వడి కలకోయిల జితంలా ఎంతో మధురంగా కర్ణపేయంగా ఉంది. చివరకు ఆ తల పక్కనే ఉన్న ఒక వృక్షాన్ని పెనవేసుకుని, దాని భుజంపై తన శిరము, వాల్చి - ప్రియుని భుజంపై తల ఆనించి ఆనందానుభూతిని పొందిన ప్రేయసిలా, ప్రణయానందానుభూతిని పొందుతుంది. ఇదే సన్నివేశాన్ని దేవయాని ఎంతో స్వాభావికంగా తన నాట్యం ద్వారా వ్యక్తం చేసింది.

మనిషిలో దాగి ఉన్న కళ, కళాత్మకత అతని నిజస్వభావానికి అన్నివిధాలా భిన్నంగా ఉంటుందా? వసంత నృత్యం ద్వారా ప్రణయ భావాల వివిధ అంశాలను

ప్రదర్శించడంలో ఎంతగానో లీనమైపోయింది. ఆమె దేవయానికాదు, మహారాణి కాదు. బాహ్యంగానూ, ఆంతరంగికంగానూ కూడా ఆమె పదహారణాల ప్రణయినియె - కాని అలాంటి కోమలమైన మధురమైన ఆమె రూపాన్ని నేనిదివరకెన్నడూ చూడలేదు. మా ఏకాంత జీవనంలో అతి ఉన్నతమైన ఆనంద పారవశ్య క్షణంలో కూడా, ఆమె ఏదో ఆలోచిస్తున్నట్లే ఉండేది. శర్మిష్ఠని కౌగిలించుకున్నప్పుడు ఆమె చూపిన ఆ ఉత్కంఠ, దేవయానిలో నేనెప్పుడూ చూడలేదు. ముద్దుపెట్టుకున్నప్పుడు కూడా నానుండి ఆమె ఏదో దాస్తున్నట్లనిపించేది.

ఒక కళాకారిణిగా ఆమె ప్రణయినిగా అయిందేమోకాని నిజజీవితంలో పత్నిగా ఆమె ఎప్పుడూ ప్రణయిని కాలేకపోయింది. ఇలా ఎందుకు జరుగుతున్నది? బహూశా మనిషి కళాత్మ కంగానూ, నిజజీవితంలోనూ ఒకేలా ఉండకూడదని విధాత శాపమేమో! మనసుని ఇలా విభజించకుండా ఉంటే, బహూశా మనిషికి ఎప్పుడూ దుఃఖమనేదే ఉండదేమో! ఇదే విషయాన్ని దృష్టిలో పెట్టుకునే బహూశా బ్రహ్మ దేవుడు మనిషీ - మనసూ ఏకరూపం కాకూడదని శాపమిచ్చి ఉంటాడు.

వసంతనృత్యం తర్వాత ఆమె 'ఉమాచరితం' నాట్యం ప్రదర్శించబోతుంది. అందులో దక్షయజ్ఞంలో సతి మొదలుకొని, క్రోధంతో బయల్దేరిన శంకరుణ్ణి వశ పరచుకొనే పార్వతి వరకు స్త్రీ వ్యక్తిత్వానికి సంబంధించిన ఆ ప్రదర్శనలో దేవయాని నాట్యం చేయబోతున్నది.

నేను నాట్యాలంకరణ గదిలోనికి వెళ్ళి వసంత నృత్యంలో ఆమె చూపిన ప్రతిభను కొనియాడాను. అది విని దేవయాని చిన్నపిల్లలా నవ్వింది. ఇప్పుడు ఆమె కళ అనే ప్రపంచంలో, కళాకారిణి అనే అనుభూతిలో మునిగిపోయి వున్నది.

నేను నెమ్మదిగా నృత్యశాల నుండి బయటపడ్డాను, మాధవుని ముందే బయటకు పంపించి వేశాను. అతను రథం తీసుకుని సిద్ధంగా ఉన్నాడు. నన్ను రాజమందిరం దగ్గర విడిచిపెట్టి తను రథం తీసుకొని అశోకవనం వెళ్ళిపోయాడు. నేను దేవయానికి నమ్మకస్తురాలైన ఆ ముసలి దాసీకి మంచి బహుమానం ఇచ్చాను. ఆమె అంతా చెప్పేసింది. నేను ఊహించినది నిజమే అయింది. శర్మిష్ఠ అదే భూగృహంలో ఉంది. పురు కూడా ఉన్నాడు. నా ఒళ్ళు గగుర్పొడిచింది.

దేవయాని, ఆమెను కాస్త కనిపెట్టమని హెచ్చరించి వెళ్ళింది, అలాగే రాజ-ప్రాసాదంలోని ద్వారపాలకులకి కూడా చెప్పి వెళ్ళింది.

మెట్లుదిగి భూగృహంలోకి వెళుతుంటే గుండె వేగంగా కొట్టుకోసాగింది. ఇంతకు ముందు ఇక్కడ అలకకు అమ్మ విషం ఇచ్చి చంపేసింది. అదే భూగృహంలో నేడు శర్మిష్ఠను అంతం చేయడానికి దేవయాని బంధించింది. అలక - ఘుద్దు లోలికే బంగారపు వర్ణపు జుట్టు గల ఆ పిల్ల, ఏ పాపం ఎరుగనిది! నా కారణంగా ... ..... మరలా ఇప్పుడు?

ఆలోచించడానికి సమయంలేదు, జీవన్మరణాల సరిహద్దు రేఖపై ఒక్కొక్క క్షణం పరుగులు తీస్తున్నది. శర్మిష్ఠను అక్కడి నుండి విడిపించి త్వరత్వరగా సొరంగ మార్గంద్వారా అశోకవనం చేర్చాను. సొరంగమార్గపు చివరి మెట్టుపై నిల బడి శర్మిష్ఠకి వీడ్కోలు చెపుతున్నప్పుడు నా మనసు వేయి ముక్కలైపోయింది! పరుగెడుతున్న కాల చక్రాన్ని ప్రాధేయపూర్వకంగా ఆడుగుదామనుకున్నాను - 'కొంచెం సేపు ఆగిపో, అంత తొందర పడవద్దు. ఈ అభాగ్యురాలిని, ఈ పసి కందుని కాస్త కనికరించు!'

కాని, సమయం - ఎప్పుడైనా ఎవరికోసమైనా ఆగిందా! ఊఁ. హుఁ. శర్మిష్ఠని దగ్గరకు తీసుకొని గట్టిగా నా బాహుపాశంలో బంధించి ఆమెతో పెనవేసుకుపోయి ముద్దుల్లో ముంచెత్తాలని, మరచిపోదామన్నా మరువలేనంత గట్టిగా కౌగలించు కోవాలని, మరణాసన్నసమయంలో కూడా జ్ఞప్తికి వచ్చి ఆనందంతో పులకరింపజేసే ముద్దొకటి ఇవ్వాలని పరితపించాను.

మరి ఆ పసికందు! బాబూ! గతజన్మలో ఏం పాపం చేశావని నీకీకష్టం! ఒక చక్రవర్తి కూమారుడివై ఉండికూడా నేరస్తుని కుమారునిలాగా నిరాధారమైన జీవితం నీ నొసటను వ్రాయబడిందా? నాన్నా! ఈరోజేకదరా! జ్యోతిష్కుడు నీ అరచేయి చూసి చక్రవర్తి రేఖలున్నాయని చెప్పింది! అలా చెప్పి రెండు ఝాములైనా గడి చిందో లేదో, నీవు ఇలా నిస్సహాయుడైన బికారి సంతానంలా నగరం విడిచి పోవలసి వచ్చిందే!

ఒకసారి 'పురు'ని చేతిలోకి తీసుకొని మనసుదీరా ముద్దాడాలని ఎంతో ఆరాట పడింది మనసు. కాని ఒకసారి చేతుల్లోకి తీసుకొని మరలా నా నుండి దూరం

చేసుకోవడం ఎలా సంభవం? మనసు రాయిచేసుకొని శర్మిష్ఠకు వీడ్కోలు పలి కాను. నోటితోకాదు - పెదవులతో, కళ్ళతో, కన్నీళ్ళతో!

నాట్యశాలకి తిరిగి వచ్చేటప్పుడు ఒక అందమైన మఽఽహారం తీసుకొని వచ్చాను. నేను తిరిగి వచ్చేటప్పటికి దేవయాని నాట్యం చేస్తోంది. ప్రేక్షకులంతా ప్రదర్శనలో నిమగ్నమైపోయారు. పార్వతి తన చూపుల బాణాలతో శంకరుణ్ణి గాయపరుస్తున్నది. తన అంగసౌష్టవాన్ని ఆకర్షణీయంగా ప్రదర్శిస్తూ శంకరుణ్ణి రెచ్చ గొడుతున్నది. ఆయన కొంచెం అనురక్తి చూపిస్తూ ఆమెను అందుకోబోతే వెంటనే ఆమె జారిపోతూ దూరంగా జరిగిపోతున్నది. ప్రియుడితో అలా సరససల్లాపా లాడుతూ అతన్ని సమ్మోహితుణ్ణి చేయడం దేవయానికి బాగా తెలుసు. అయితే అది కేవలం కళాభివ్యక్తిలో మాత్రమే. నాతో ఎప్పుడూ అలా ప్రణయకేళి జరప లేదు. ఎందుచేత? అలా ఎందుకు జరగాలి? దేవయానికి కాస్త విశ్రాంతి ఇవ్వ డానికి మధ్యలో ఇంకా ఏవో నాట్య ప్రదర్శనలు జరుగుతున్నాయి. చివరిగా దేవయాని వర్ష - నృత్యం ప్రారంభ మయింది. వసంత - నృత్యంలో ముగ్ధ ప్రణయ భావం ప్రదర్శింపబడింది. ఈ నాట్యంలో ఉన్మత్త - ప్రణయం ప్రదర్శించాలి. కాని ఈ నృత్యం కూడా దేవయాని ఎంతో అద్భుతంగా చేసింది. నాలో మరలా అదే చిక్కు ప్రశ్న. దేవయానిలోని ఈ ప్రణయభావాలు, ఈ నైపుణ్యం ఏమై పోతాయి? నా కౌగిలింతలో గలాగలా ప్రవహించే నీరు ఒక్కసారి గడ్డకట్టుకుపోయినట్టై పోతుంది ఆమె. బొత్తిగా, భావశూన్యంగా, జడపదార్థంలా, అచేతనంగా, అలా ఎందుకు జరుగుతున్నది?

నాట్య ప్రదర్శన రక్తిగా సాగుతున్నా నేను అనురక్తుడను కాలేకపోయాను. నా మనసంతా మా మిత్రుడు మాధవుని మీదే ఉంది. అతనింకా ఎందుకు తిరిగి రాలేదు. ఎవరైనా రథాన్ని మధ్యలో ఆపేశారా? లేదు! అలా జరగడానికి వీలులేదు. అతని దగ్గర రాజముద్ర ఉంది. మరి తిరిగి రావడంలో ఇంత ఆలస్యం ఎందు కయ్యింది? బహుశా రథం దిగేటప్పుడు శర్మిష్ఠ ఏడ్చి ఉండి ఉంటుంది. మాధవుడు బహుశా ఆమెను ఓదార్చుతూ ఉండి ఉంటాడు. ఒకవేళ జాలిపడి ఆమెను తిరిగి తీసుకొని వస్తాడా! నిజంగా అలాగాని చేస్తే - ఈ చండిక - దేవయాని గుప్పిట్లోంచి తప్పించిన ప్రయత్నమంతా వ్యర్థమవుతుంది.

ఇంతలో ఒక సేవకుడు వచ్చి నా చేతిలో రాజముద్ర పెట్టాడు. దాంతో నాకర్థమయింది. నగరం బయట ఆ శిథిలమైన దేవాలయం దగ్గర శర్మిష్ఠని విడిచిపెట్టేసి మాధవుడు తిరిగి వచ్చేసాడు. నా మనసు కుదుటపడింది.

ఆ నాట్యం పూర్తయ్యింది. ప్రేక్షక కళాకారులంతా హర్షధ్వానాలు చేసారు. దేవయాని అందరికీ ప్రతినమస్కారం చేస్తున్నది. అప్పుడే నేను లేచి ఆ రత్నహారం ఆమె మెడలో అలంకరించి, ప్రేక్షకులనుద్దేశించి ఇలా అన్నాను - 'ఇది ఒక భర్త భార్యకు ఇచ్చే బహుమానం కాదు. ఒక సాధారణ రసికహృదయునిగా ఒక అసాధారణ కళాకారిణి ప్రతిభను ప్రశంసిస్తూ సమర్పించుకుంటున్న చిరుకానుక మాత్రమే!'

నృత్యశాల అంతా నవ్వులతోనూ చప్పట్లతోనూ ప్రతిధ్వనించింది. కొంత సేపటివరక: నేను కూడా ఆనందానుభూతిని పొందాను.

## అధ్యాయం 20

రెండవరోజు దేవయాని చాలా ఆలస్యంగా నిద్రలేచింది. ఆమె బాగా అలసిపోయి ఉంది. రాత్రి నృత్యంలో ఆమె శరీరమంతా నొప్పిగా ఉండే ఉంటుంది.

ఆమె బాగా అలంకరించుకుని నాగదిలోకి వచ్చింది. కిటికీలోంచి బయటకు చూస్తూ అన్నది - 'ఈ ప్రభాతం ఎంత అందంగా వున్నది? కాస్త చూడండి!' నేను కిటకీ దగ్గరగా వెళ్ళాను. ఆమె నవ్వుతూ అన్నది, 'రాత్రి మహారాజుగారు నాకు రత్నమాలను అలంకరించారు కదా, నాకు చాలా ఆనందం కల్గింది. ఎంత ఆనందం కలిగిందో ఎలా చెప్పగలను! కాని ఒక్క నిజం చెప్పనా?'

'ఊ(.'

'ఆ రత్నమాలతో నాకు ఆనందం కలగలేదు!'

'నీవు హస్తినాపుర మహారాణివికదా, నీవు కోరుకుంటే కుబేరుని అలంకారాలు కూడా లభిస్తాయి!'

'నాకు అలాంటిదేమీ అవసరంలేదు! అంటూ ఉద్యానవనంలోని వికసించిన పూలవైపు చూస్తూ అంది, స్త్రీ మనసును పురుషులు తెలుసుకోలేరు!'

'అయితే! నీ మనసులో ఏముందో, అదేమిటో చెప్పు - అప్పుడే తెలుస్తుంది కదా ఈ పురుషునికి?'

ఎంతో మనోహరంగా నవ్వుతూ, ఓరగా చూస్తూ అన్నది 'ఒక చిన్న కోరిక!'

'అదేమిటో చెప్పు!'

'ఉద్యానవనంలో ఎన్నెన్నో అందమైన పూలు ఉన్నాయి. మహారాజు తనకు నచ్చిన పూలు స్వయంగా కోసితేవాలి! చాలా! చాలా ఎక్కువ! నేను ఆపూలతో ఒక పెద్దమాల, ఒక చిన్న పూలచెండు తయారుచేస్తాను. మహారాజు ఆ పూల చెండను స్వయంగా తన చేత్తో నా జడలో తురమాలి, తర్వాత ఆ మాలతో నేను స్వయంగా మహారాజు కంఠాన్ని అలంకరించాలి - ఇదేనా చిన్న చిలిపి కోరిక, కాని .... .....'

నన్ను ఎందుకు మందిరం నుండి బయటికి పంపిస్తుందో నాకర్థమయ్యింది. నాలో నేను నవ్వుకుంటూ ఉద్యానవనంవైపు నడిచాను. చాలాపూలు కోసాను. ఎంత సేపైనా దేవయాని ఇంకా ఉద్యానవనంలోకిరాలేదు. ఎండెక్కిపోతున్నది. నేను మరలా నా గదివైపు వచ్చేసాను. కాని దేవయాని అక్కడలేదు. ఆ ముసలిదాసీని తీసుకుని తన మందిరానికి వెళ్ళిపోయి తలుపులు బిగించి వేసింది. మిగతా దాసీ లంతా తమతమ పనులు చూసుకుంటున్నారు. ఆయినా అందరికళ్ళూ దేవయాని గదివైపే ఉన్నాయి. వాళ్ళందరి కళ్ళూ, గాలివానకు భయభ్రాంతులై దిక్కుతోచక బెదురుచూపులు చూస్తున్న పక్షుల్లా ఉన్నాయి.

మధ్యాహ్నం దేవయాని నాగదిలోకి వచ్చింది. ఆమె ముఖం పూర్తిగా కళావిహీ నంగా ఉంది. ఒక్కసారిగా నావైపుచూసి అడిగింది - 'నిన్న రాత్రి మహారాజుగారు నృత్యశాల నుండి మధ్యలో లేచి రాజమందిరానికి వచ్చారా?'

'అవును!'

'ఎందుకు?'

'నీ వసంత నృత్యం చూసిన పిదప నీకు రత్నమాల బహుమానంగా ఇవ్వా లని అన్పించింది!'

నా ముఖకవళికలను పరిశీలనంగా చూస్తూ అన్నది - 'శర్మిష్ఠ అదృశ్యమైన సంగతి మహారాజా వారికి తెలియదా?'

'శర్మిష్ఠ కన్పించడంలేదా? ఏమయ్యింది?'

'అశోకవనం నుండి ఆమె పారిపోయింది!'

'ఎక్కడికి వెళ్ళిపోయింది?'

'పారిపోయేవాళ్ళు ఎక్కడికి వెళతారో చెప్పి వెళతారా?'

దేవయాని తాను పన్నిన వలలో తానే చిక్కుకున్నది. కాదు. నేనే అలా చిక్కుకునేలా చేసాను. విజయగర్వం మత్తుపానీయం కంటె కూడా విలక్షణమైనది సుమా! సాయంత్రవరకూ నేను అదే మత్తులో ఉన్నాను. ఎక్కడికీ వెళ్ళలేదు. మిత్రుడు మాధవుని దగ్గరికి కూడా వెళ్ళలేదు. ఏమీ చేయలేదు. కాని, ఆమెను ఓడించానన్న ఆనందం ఎంత క్షణికమైనదో నాకు నాలుగు పూటల తర్వాత తెలిసింది. ప్రొద్దు క్రుంకింది. రాత్రయ్యింది. ఈ రాత్రి నిన్నటిలాంటి తుఫాను రాత్రి కాదు. నిన్నటి ప్రళయంతర స్వరూపాన్ని వదిలివేసింది రాత్రి. పూర్తిగా తన పాత్రను మార్చేసింది. ఈ నాటి రాత్రి ఏదో ప్రణయ సుందరిలా సిగ్గుపడుతూ ఆకాశపు రంగమహల్ లోనికి ప్రవేశించింది. ఆ రంగమహల్‌లోనికి వస్తూనే ఆ నిశాసుందిరి ఒక్కొక్క రత్నదీపాన్ని వెలిగిస్తున్నట్లు నక్షత్రాలను వెలిగిస్తూ వచ్చింది.

ఒక్కొక్క నక్షత్రం, నా మనసులో శర్మిష్ఠకి సంబంధించిన ఒక్కొక్క సంఘటనని గుర్తుచేసింది. ఆలోచిస్తూండగానే మనసులో ఆమెను గురించి మధురమైన జ్ఞాపకాలు పెల్లుబికాయి.

కొన్ని సుఖం కల్గించేవి, మరికొన్ని దుఃఖాన్ని కల్గించేవి. చాలా సేపటివరకూ కొన్ని దుస్సంఘటనలు నా మనసుకు ముళ్ళలా గుచ్చి బాధించసాగాయి. అర్ధ రాత్రి గడిచినా నాకు నిద్రపట్టలేదు. ఆజ్ఞాపకాలు నన్ను వెంటాడుతూనే ఉన్నాయి. తేనెపట్టుని కదిపిన వాడికి, ఆ తేనెటీగలు ఎలా వెంటాడి కుట్టి బాధిస్తాయో, అలాగే నన్నీ జ్ఞాపకాలు కూడా బాధిస్తున్నాయి.

నిన్న రాత్రి శర్మిష్ఠను విడిపించినప్పుడు నేనేదో గొప్ప ఉపకారం చేస్తున్నానని పించింది. కాని ఆ భ్రమ ఇప్పుడు దూరమైంది. బదులుగా నాలో అంతర్మథనం ప్రారంభమయ్యింది. ఇప్పుడు శర్మిష్ఠ ఎక్కడున్నదో? ఎవరినైతే నీవు తన బాహువులలో బంధించి స్వర్గసుఖాన్ని అనుభవించేవాడివో, అదే శర్మిష్ఠ! ఈరోజు నువ్వు సుఖంగా పాన్పుపైన దర్జాగా పడుకున్నావు. కాని ఆమె? చూడు, ఓ నిర్దయుడా, కొంచెం ఆలోచించి చూడు! కళ్ళు తెరిచి చూడు! నిర్జన ప్రదేశంలో ఏ కటిక

నేలపై పడుకొని, ఉందో, ఆ అభాగ్యురాలు! నీ హృదయంలాంటి కఠిన పాషాణాన్ని తలదిండుగా చేసుకొని, ఆ అభాగ్యురాలైన ప్రేయసి విశ్రమించడానికి ప్రయత్ని స్తున్నది. అంతేకాదు రాతి తలగడను తన కన్నీళ్ళతో అభిషేకిస్తున్నది. 'నీవు నా దానివి కదా? నీవు నా దానివి. అవునా?' అని నన్ను గట్టిగా హృదయానికి హత్తు కునే ప్రియుని మనసు - ఇలా గాలివానతో కూడిన తుఫానులో నిర్ధయగా విడిచి పెట్టేటప్పుడు కాస్తంతకూడా - కరగలేదే! అలాంటిది ఇప్పుడు నా కన్నీళ్ళతో ఈ రాతి తలదిండు ఎలా కరగుతుంది? 'అంతా నా భ్రమగాని' అంటూ తనను తాను సమాధానపరచుకుంటున్నది. ఏ పెదవులను, ఏ చెక్కిళ్ళను నువ్వు ముద్దుల్లో ముంచెత్తావో, ఆ పెదవులు ఇప్పుడు భయంతో, చలితో వణుకుతున్నాయి. ఓ నిర్ధయుడా! చూడు! కళ్ళు నులుముకొని మరీ చూడు. 'పురు'ని చలి నుండి కాపాడడానికి ఆమె తన శరీరంలోని వేడినంతా ఇవ్వడానికి ప్రయత్నిస్తున్నది, చూడు! ఇక్కడ నీకు ఈ మెత్తని పరుపుపై పడుకోవడానికి ఎలా మనసొప్పింది? ఇదేనా శర్మిష్ఠపై నీ ప్రేమ? ఇదేనా నీ 'పురు'పై నీ వాత్సల్యం? నీ స్థానంలో కచుడే గనుక ఉండి ఉంటే - నిన్నరాత్రి తుఫాను, వర్షంలో తనే స్వయంగా రథం తోలుకుని, శర్మిష్ఠను తీసుకొని హిమాలయాలకు నవ్వుతూ ఆనందంగా వెళ్ళేవాడు! ...... ......

'నీ స్థానంలో కచుడే ఉండీ ఉంటే!'

ఎంత విచిత్రమైన ఆలోచన! కచుడు ..... యయాతి! ఎంత విచిత్రమైన పోలిక! కాని ఈ పోలిక కారణంగా నా మనసులో కచుడి జ్ఞాపకాలు కొన్ని గుర్తుకు వచ్చాయి. అంగీరస ఋషి ఆశ్రమంలో - అది మా మొదటి పరిచయం. నేను ఆ అందమైన పక్షిపై బాణం విడిచి పెట్టబోతున్నాను. కచుడు నన్ను ఆపి వేసాడు. 'ఆ పక్షిరంగూ, అందమూ నాకు బాగా నచ్చాయి!' అన్నాను నేను. 'చాలా రసికుడిలా ఉన్నావు! కాని ఒక విషయం మరచిపోవద్దు మిత్రమా, నీకీ రసికత్వం ఇచ్చినవాడే ఆ పక్షికి ప్రాణం ఇచ్చింది కూడా!' - అంటూ వెంటనే జవాబిచ్చాడు.

నా పురు! తను కూడా ఆ పక్షిలాగానే, పసిహృదయుడు, ఏమీ తెలియని వాడు, కాని అలాంటి పసిబాలుని, నిన్నరాత్రి నేను ..... .....

ఆశ్రమంలో ఒక చిన్న బాలిక! కచునిపై ఆమెకు తగని శ్రద్ధ! విరిసీ విరియని మొగ్గనొకదానిని త్రుంచి ఆమె కచునికిచ్చింది. కాని కచుడామెను మందలించాడు. ఆ అమ్మాయి చేతులను తన చేతులలోనికి తీసుకొని ఇలా నచ్చ చెప్పాడు - 'చూడమ్మా, నీవు ఇచ్చిన ఈ అందమైన కానుక నాకు అందింది, కాని దీనిని ఆ లతపైనే ఉండనీ, అక్కడే దానిని వికసించనీ, నేను ప్రతిరోజూ ఇక్కడికి వస్తాను. ఆ లతతో మాట్లాడతాను. ఏం సరేనా?'

నా 'శమా'! ఆమె కూడా ఇలాగే విరిసీవిరియని, సువాసనగల, అందమైన మొగ్గలాంటిదికాదా? నిన్న రాత్రి అలాంటి మొగ్గని నేను ...... .......

నేను చాలా వ్యాకులపడ్డాను. కొంచెం సురాపానం చేస్తే బాగుంటుందని కొంచెం సేవించాను. దానితో శరీరానికి కొంత విశ్రాంతి అన్పించింది. మనసుకూడా శాంతించింది. నెమ్మదిగా నిద్రకూడా పట్టేసింది.

కాని నిద్రలో నేనొక విచిత్రమైన కలగన్నాను. నిద్రపట్టకపోయినా బాగుండే దేమో అన్పించింది. ఆ స్వప్నంలో నేను చీకటిలో పాము కాటువేస్తుందేమోనని భ్రమించి ఉలిక్కిపడ్డట్లు లేచి కూర్చున్నాను.

ఆ కలకంటూ నేను నిద్రలో పలవరించాను కూడా. నిజానికి కలలో చెప్ప దగిన విశేషమేమీలేదు. కలలో నాకు రెండు ధ్వనులు విన్పించసాగాయి. మొదటిది నా కంఠధ్వని, కాని రెండో కంఠధ్వని ఎవరిదో గుర్తించలేకపోయాను. బహుశా! ఆ కంఠధ్వని, అంగీరస ఋషి ఆశ్రమంలోని కచుడిదికాదు కదా! లేక 'యతి' కంఠధ్వనా! ఆఁ. హాఁ. కాదు! ఆ రెండో కంఠధ్వని కూడా నాదే, కాని మొదటి దానికంటె భిన్నంగా అతి విచిత్రంగానూ, అతి కఠోరంగానూ ఉంది!

ఆ రెండో యయాతి మొదటి యయాతిని అడుగుతున్నాడు - 'నీవు శర్మిష్ఠని ప్రేమిస్తున్నావా? నిజంగా ప్రేమిస్తున్నావా?'

మొదటి యయాతి సగర్వంగా జవాబు ఇచ్చాడు - 'ఇందులో సందేహా మేముంది? నేను ఆమెను ప్రేమించకపోతే నిన్నరాత్రి భూగృహం నుండి తప్పించే సాహసం చేసి ఉండే వాడినేకాదు!'

'నువ్వు ఆమెతోకూడా అడవిలోకి వెళ్ళిపోయి ఉంటే నీవు చెప్పింది నిజమని పించేది! నీ గురించి శర్మిష్ఠ ఏం ...... చేయలేదో? చెప్పు! ఆమె తన సర్వస్వాన్ని నీ కర్పించింది. నీ పాదధూళిని పూలనుకొని నొసటిన అలంకరించు కుంది! మరి నీవో! ఆమె కొరకు రాజ ప్రసాదాన్ని విడిచిపెట్టడం నీరక్తవ్యం. ఒక క్షణమో, లేక రెండు క్షణాలో మత్తెక్కించే శారీరిక సుఖమే ప్రేమకాదు. ప్రేమంటే అతిశ్రేష్ఠమైన పవిత్రమైన భావం, ఆ భావం, అవసరమైతే తన ప్రియమైన వ్యక్తికోసం ప్రాణాలైనా ఇవ్వడానికి సిద్ధపడుతుంది, లే. ఇప్పటికీ సమయం మించిపోలేదు. ఇప్పుడే రాజ మందిరం విడిచివెళ్ళి ఆమెను వెదుకు. ఆమెను వెదికి పట్టుకొన్న తర్వాతే విశ్రమించు. ఆమెను ఇక్కడికే తీసుకొనిరా. తీసుకొచ్చి దేవయాని ముందు నిలబెట్టి - 'మనిషి అంతరాత్మ ఏ ప్రేమానురాగంకోసం పరితపిస్తుందో, అది ఈమె నాకు అందించింది. నా రాణిగా, ప్రియరాణిగా ఈమెకూడా ఇక్కడే ఈరోజునుండి రాజ మందిరంలోనే ఉంటుంది!' - అని చెప్పు.

'అసంభవం! ఎట్టి పరిస్థితిలోనూ అలా జరగదు! నాకు అంత ధైర్యమా? దేవయానితో అలా చెప్పగలిగే ధైర్యం నాకెక్కడిది? మనుషులపై విరుచుకుపడే ఆమె స్వభావం, కోపిష్ఠి అయిన ఆమె తండ్రి, వద్దు, ఇది జరగని పని'.

'తుఫాను, కుంభవృష్టిలో, తన భవిష్యత్తు గురించి కొం .... చెం .... కూడా ఆలోచించ కుండా, శర్మిష్ఠ అంత సాహసం చేయగలిగిందే? మరి నీవు .....'

'ఊరుకో!'

'పిరికివాడా! స్వార్థపరుడా! కాముకుడా!'

ఆ రాత్రంతా మనోవేదనతో నిద్రపట్టలేదు. మధువు సేవిస్తే బాగుంటుందేమోనని పదే పదే అన్పించేది. మనసులోని ఈ బాధను మరచిపోవాలని ఉంది! దీనికి రెండేరెండు సరైన మందులు - ఒకటి మదిర, రెండవది మదిరాక్షి! కాని ...... ......

కాని ఉదయాన్నే నేను మధువు సేవించిన విషయం దేవయానికి తెలిసిపోతే? అసలే నామీద గొంతుదాకా కోపంగా ఉంది, ఈ విషయం తెలిస్తే ఇక అగ్నిలో ఆజ్యంపోసినట్లు, మండిపడుతుంది?

అతి కష్టంమీద నన్ను నేను నిగ్రహించుకున్నాను

నిన్న రాత్రి నుండి మాధవునికి ఒంట్లో బాగుండలేదని, అతనికి తీవ్రమైన జ్వరం వచ్చిందని, ఉదయమే అశుభ సమాచారం తీసుకువచ్చింది.

ఈ కబురు చెప్పి కొంచెంసేపు అక్కడే నిలబడి నావైపు తదేకంగా చూస్తూ పకపకా నవ్వుతూ అన్నది - 'మీకు తెలుసా! మీ మిత్రునికి ఇంత తీవ్రమైన జ్వరం ఎందుకొచ్చిందో!'

'లేదే! మొన్నరాత్రి, నీ నాట్యం చూడడానికి నాతో పాటే నాట్యశాలకి వచ్చాడు. మధ్యలోనే లేచివెళ్ళిపోయాడు. బయట తుఫానుగా ఉంది కూడా. ఎక్కడికి వెళ్ళాడో నాకు అర్థంకాలేదు. అందుకే అతన్ని వెతకడానికి నేను కూడా బయటికి వెళ్ళాను. కాని అతను ఎక్కడా కన్పించలేదు!'

మహారాజుగారికి అతనెలా కన్పిస్తాడు? ఆ మహాశయుడు ఏదో స్వర్గం చూద్దామని వెళ్ళాడు. చాలారాత్రి తర్వాత తిరిగి వచ్చాడట. బాగా తడిసిపోయాడని అనుకొంటున్నారు. 'ఏమి, మద్యంసేవించి వర్షంలో ఎక్కడ పడి ఉన్నాడో!'

రాజవైద్యుణ్ణి వెంటనే మాధవుని దగ్గరికి పంపించే ఏర్పాటు చేసాను. కొద్ది సేపటి తర్వాత నేను కూడా అక్కడికి వెళ్ళడానికి బయల్దేరాను. కాని రథంలో కూర్చోగానే మనసంతా ఉదాసీనమయ్యింది. జీవితం కేవలం సుఖ - దుఃఖాల దోబూచులాటేనా?

మాధవుని ఇంటి దగ్గరగా వస్తూ రథం వేగం తగ్గింది. నేను యువరాజుగా ఉన్నప్పుడు ఒకసారి ఇలాగే చింతాక్రాంతుడై మాధవునితో కలిసి వచ్చాను. ఆరోజు సంఘటన నాకింకా గుర్తుంది. మాధవుని మేనకోడలు 'తారక' తన మాటలతో నాకు మనశ్శాంతిని, ఆనందాన్ని కల్గించింది! ఆ చిన్నపిల్ల ముద్దుముద్దు నత్తి మాటలు ఇంకా నా చెవుల్లో పదేపదే విన్పిస్తున్నాయి. 'యువరాజు అంతే ఎవలు?' 'నమచకాలము చేయలానికి అతలు ఏవైనా దేవులా?', 'యువరాజూ మీ గుల్లము నాకిస్తాలా?', 'ఏయ్ యువరాజూ, మీలు మా బొమ్మకి పెల్లికొడుకు అవుతాలా?'

రథం ఆగింది. ద్వారం దగ్గర ఎవరో పిల్ల నిలబడి ఉంది. ఆ( గుర్తొచ్చింది,

ఆమె 'తారకే!' కాని, ఇప్పుడెంత పెద్దది అయిపోయింది! ఆమె ఇప్పుడు వికసించని మొగ్గకాదు, వికసించబోయే మొగ్గలా ఉంది.

నన్ను చూస్తూనే ఆమె సిగ్గుపడింది. దృష్టి నేలవైపు మళ్ళించింది. చిన్నప్పటి చిలిపితనం నుండి బయటపడి యౌవనంలో అడుగిడబోతోంది. ఒక్కసారి కను రెప్పలెత్తి చూసింది. ఆమె కన్నుల్లోని మెరుపు, ఆ ఆకర్షణ! రెండు శుక్రతారలు ప్రక్కప్రక్కనే మెరుస్తున్నట్లనిపించింది.

ఆమె వెంటనే సర్దుకుని మెరుపులా వెనుదిరిగిలోనికి వెళ్ళిపోయింది. మాధవుని గదిలో అడుగుపెడుతూనే అన్పించింది, ఇంత వేగంగా ఆమె ఎందుకులోనికి వెళ్ళిపోయింది. ఆమె నాకోసం ఒక మంచి ఆసనం తెచ్చి ఉంచింది.

మాధవుడు నీటి బయట చేపలా విలవిలలాడిపోతున్నాడు. రాజవైద్యులు అతని నాడి చూస్తున్నారు. మాధవుడు నా వైపు నిరాశగా చూశాడు. నా మనసు విలవిలలాడిపోయింది.

అప్పుడే ఎవరో ఒక యువతి లేహ్యం తీసుకొచ్చింది. ఆమె ముఖం నేను గుర్తు పట్టలేకపోయాను. వైద్యుని సహాయంతో ఆమె మాధవునిచేత లేహ్యం తిని పించింది. ఆమెను నేను వెనుకవైపునుండి. చూశాను. ఎక్కడో చూసినట్లు, తెలిసిన స్త్రీలాగా అన్పించింది. మాధవుని ఇంటిలో ఈ వయసు స్త్రీలు ఎవరూలేరే. మాధవుని తల్లి వృద్ధురాలైపోయింది. పోని తారక తల్లి! ఆమెకూడా ఎప్పుడో మరణించింది.

మాధవునికి సన్నిపాత జ్వరం వచ్చింది. స్పృహాలోలేడు. మధ్యలో 'మహారాణీ ...... మహారాణీ' అని కలవరిస్తున్నాడు.

మహారాణి కాదు. మహారాజు వచ్చారని ఆమె నెమ్మదిగా మాధవునితో అన్నది.

ఆమె, మాధవుని నుదుటిపై తడిగుడ్డను మార్చి లోనికి వెళ్ళిపోవడానికి తిరిగింది. ఇప్పుడు ఆమె ముఖం స్పష్టంగా కన్పించింది. ఆమె - ముకుళిక.

ముకుళిక! అమ్మ ఆమెను నగరం నుండి బహిష్కరించింది. కాని పాపం ఆమె

చేసిన నేరం ఏమిటి? ఆమె ఒక్కదానిదే తప్పుకాదు! ఎదురుగా మృత్యుముఖంతో పడి ఉన్న మాధవుడు - నా గురించి కుంభవృష్టిని కూడా లెక్కచేయకుండా బాగా తడిసిముద్దైపోయాడు. ఈరోజు స్పృహలేకుండా ఇక్కడ పడి ఉన్నాడు. అలాగే ఈ ముకుళిక -

నేను సానుభూతినిండిన స్వరంతో - 'ఎలా ఉన్నావు ముకుళికా? బాగున్నావా?' అని అడిగాను.

కొంచెం ముందుకొచ్చి నమస్కరించి 'మహారాజుగారి దయవలన ఈ దాసి క్షేమమే' అన్నది.

సిగ్గుతో నిండిన చిరునవ్వు నవ్వుతూ ఆమె అలా ఓ ప్రక్క నిలబడి ఉంది. ఆమెను చూస్తూనే నాకనిపించింది - ముకుళిక నా సేవకోసం అశోకవనంలో ఉన్నప్పుడు - యౌవనం ఎంతో అందమైన పూవులాంటిది.

ఆ రాత్రి సంఘటన నాకింకా గుర్తుంది. తండ్రిగారి మరణంతో నా మనసంతా విషాదంతో నిండిపోయింది. ఎడారిలో నడుస్తూ వచ్చిన బాటసారి చెట్టునీడకోసం పరితపించినట్లు, నేను మానసిక వేదననుండి బయటపడే ప్రయత్నం చేస్తున్నాను. అప్పుడు ముకులికే నాకు ఊరటకల్గించింది. ఆమె పెదవులను నా పెదవులతో ముద్దాడగానే నాలో అప్పటి వరకూ చోటుచేసుకున్న మరణభీతి ఒక్కసారిగా దూరమైపోయింది.

ఒకరోగిని ఎదురుగా ఉంచుకుని ఇలా నా కామప్రవృత్తికి సంబంధించిన సంఘటనలను నెమరువేసుకోవడం - నిజంగా నాకు చాలా సిగ్గనిపించింది. రాజ వైద్యుని అక్కడే, అతని దగ్గరే ఉండమని ఆజ్ఞాపించి నేను గదిలోనుండి బయటికి వచ్చేసాను. ముకులిక కూడా నా వెనకే వచ్చేసింది. సిగ్గుతో నిండిన చిరునవ్వుతో అంది, 'మహారాణిని నేనింతవరకూ చూడనేలేదు!' అన్నది.

'మాధవునికి జ్వరం తగ్గిపోయి, కోలుకున్నాక రాజమందిరానికి రా, మహారాణిని చూడవచ్చు!'

'యువరాజు నడుస్తున్నారా? మాట్లాడుతున్నారా? మహారాజుని వారు ఏమని పిలుస్తారు?'

నేను ఆమెకు ఏమీ జవాబివ్వలేదు. కాని, నా చెవిలో 'నా .... నా .....నా' అన్న శబ్దాలు ప్రతిధ్వనించసాగాయి. మొన్నరాత్రి నేను దేవయాని మందిరానికి వెళ్ళినప్పుడు, శర్మిష్ఠ ఒడిలోన్న 'పురు' నన్ను ఇలాగే పిలిచాడు. కలకల ధ్వనితో ఎత్తైన కొండలపై నుండి క్రిందకి దూకే జలపాతంలా పురు శర్మిష్ఠ ఒడిలో నుండి చేతులాడిస్తూ నావైపు తిరిగి ముందుకురికాడు. దేవయానికి అనుమానం రాకుండా ఉండాలని, నేను ఆ పిలుపుని పట్టించుకోనట్లుగా ముందుకొచ్చేసాను. నా ఈ ఉపేక్ష కారణంగా, పాపం ఆ పసి హృదయం ఎంత తల్లిడిల్లిపోయి ఉంటుందో! శర్మిష్ఠను బయటకు పంపేటప్పుడు కూడా చివరిసారిగానైనా నేను 'పురు'ని ఎత్తుకో లేదు. జీవితాంతం గుర్తుండేటట్లు ముద్దుకూడా పెట్టుకోలేదు. వాడి శిరస్సును నా కన్నీళ్ళతో అభిషేకించలేదు. ఏ తండ్రైనా ఇంత కఠినంగా ప్రవర్తిస్తాడా?

ఇప్పుడు పురు ఎక్కడున్నాడో? శర్మిష్ఠ ఏం చేస్తున్నదో? బాల్యంలో ఆట లాడు కునేటప్పుడు బొమ్మల పెళ్ళిచేస్తూ బొమ్మలపై ముత్యాలతో అక్షతలు చల్లిన ఆ రాజకన్య, ఇప్పుడు ఏ ఇంటిముందు కన్నీరు కారుస్తూ ఆకలితీర్చమని ఎవరి ముందు ప్రాధేయపడుతున్నదో?

నేను నెమ్మదిగా ఉండడం చూసి, ముకులిక కాస్త సందిగ్ధంలో పడింది. మళ్ళీ ఆమె నెమ్మదిగా 'నావల్ల ఏమైనా పొరపాటు జరిగిందా, మహారాజా?' - అని అడిగింది.

నా మానసిక వికలతను కప్పిపుచ్చుకొంటూ - 'లేదు! లేదు! పొరపాటు ఏమీ లేదు, నావల్లనే జరిగింది. నీవు ఇన్ని రోజుల తర్వాత కన్పించావు. మాధవుడి వంటి మంచి మిత్రుడి సేవచేస్తూండగా నిన్ను చూసాను. పోనీలే, చెప్పు, ఎలా ఉన్నావు?' అని నేను మౌనం వహించాను. మళ్ళీ, 'ఇంతకీ నీవు మాధవుని దగ్గరికి ఎలా చేరుకున్నావు?'

ఆమె చెప్పసాగింది - 'నేను ఒక మహాత్ముని సేవచేస్తూ ఉండేదాన్ని, తీర్థ యాత్రాలు చేస్తూ - చేస్తూ ఆయన ఇక్కడికి వచ్చారు. నృత్యశాల ప్రక్కగా ఉన్న మఠంలో ఉండేవాళ్ళం. మాధవునికి జ్వరం వస్తే వాళ్ళమ్మ చాలా గాభరాపడి పోయింది. పాపం ఆమె ఎన్ని కష్టాలు అనుభవించిందో! ఇప్పుడామె మానసికంగా బాగా దెబ్బతిన్నది. ఈ మధ్య మాధవుడు ఎవరినో ప్రేమించినట్లు వినికిడి.

త్వరలో వాళ్ళ వివాహం కూడా జరగవలసి ఉంది. ఈ విషయం మీతో మొన్న రాత్రే చెప్పాలనుకున్నాడు. కాని ఇంతలోనే మాయదారి రోగం ముంచుకొచ్చింది. వృద్ధురాలు, పాపం ఇంతవరకూ కొంచెం ధైర్యంగా ఉండేది, కాని ఇప్పుడు పూర్తిగా భయపడుతున్నది. ఆమె గురుమహారాజ్ ప్రవచనాలు వినడానికి వస్తూవుండేది. గురుమహారాజ్‌కు ఈ విషయం చెప్పి సహాయం చేయమని అర్థించింది. గురూజీ మంత్రించిన విభూతి ఇచ్చారు. మాధవుని ఇంటిలో తారక తప్ప ఇంకెవరూ లేరని తెలిసి, నన్ను సేవచేయమని పంపించారు!'.

'మీ ఈ గురుమహారాజ్‌ని మేము ఒకసారి తప్పక దర్శించాలి. ఆయన ప్రవచనాలతో మనశ్శాంతి లభిస్తేచాలు. నాకు ప్రస్తుతం అది అవసరంకూడా'.

ముకులిక ఏమీ మాట్లాడకుండా చిరునవ్వు నవ్వి ఊరుకున్నది.

నేను అక్కడినుండి వచ్చేస్తూ 'ముకులికా! మాధవుడు నా రెండో ప్రాణం. ఇలాంటి మిత్రుడు ఈ ప్రపంచంలో ఎంత వెతకినా దొరకడు. బాగా సేవచేయి. నీ ఈ ఉపకారం మరచిపోను?' అన్నాను.

మళ్ళీ సిగ్గుతోనవ్వి 'చాలు మహారాజా! ఇదేమంత ప్రాధేయపడవలసినంత గొప్ప విషయమా?' అన్నది.

ఆరాత్రికూడా నాకు నిద్రపట్టలేదు. మొదట కొంత సేపు ముకులిక గురించి ఆలోచిస్తూ ఉండిపోయాను. రాజమాత వానప్రస్థానికి వెళ్ళిపోయారు. అందుకే ఈమె నగరంలో ప్రవేశించగలిగే ధైర్యం చేసింది. ఇందులో నాకేమీ ఆశ్చర్యం అన్పించలేదుకాని, అప్పుడెప్పుడో అశోకవనంలో ఉన్నప్పటి ముకుళికకు, ఇప్పటి ఈ ముకుళికకు ఎంతో తేడా ఉన్నది. ఆ ముకుళిక కాముకురాలు, ఈ ముకుళిక సేవావ్రతురాలు! ఏ సాధు మహారాజు మఠంలో ఉంటుందో, తప్పకుండా అతన్ని ఒకసారి దర్శించాలి. అతను ఒకవేళ మహిమాన్వితుడైన త్రికాలజ్ఞుడేమో ఎవరు చెప్పగలరు. శర్మిష్ఠ, పురును గురించి ఏమైనా చెప్పగలడేమో? ......

నన్నెవరో నిప్పుల మీద నుండి ఈడ్చుకుని వెళుతున్నట్లుగా ఉంది. శర్మిష్ఠ ఎక్కడ వుండి ఉంటుంది? 'పురు' ఏం చేస్తున్నాడో? నా ..... నా ...... నా అంటూ ఆ పసిహృదయం తల్లడిల్లుతుంటే శర్మిష్ఠ ఎలా సముదాయిస్తుందో? ఆమె

తన తల్లిదండ్రుల దగ్గరికి తిరిగి వెళ్తుందా? ఎక్కడికెళ్తుంది? లేక నిరాశతో పురుని గట్టిగా గుండెలకు హత్తుకుని ఎత్తైనకొండ శిఖరంనుండి క్రిందకి దూకి ఆత్మహత్య చేసుకుంటుందా?

అదే దృశ్యం నాకళ్ళముందు - రకసిక్తమైన పురు, శర్మిష్ఠ మృతకళేబరాలు కదలాడాయి. కళ్ళు గట్టిగా మూసుకున్నాను. కళ్ళు మూసుకున్నా అదే దృశ్యం నా కళ్ళముందు పదే - పదే కదలాడింది. గాయాలతోనిండిన ఆ దేహాలనుండి రక్తపు మంటలు పైపైకి ఎగసి తాండవనృత్యం చేస్తున్నాయి - ఎక్కడ ఆ కపట ప్రియుడు? ఎక్కడ ఆ కాముకుడైన భర్త? ఎక్కడ ఆ బాధ్యతలేని తండ్రి?

ఆ అగ్నిజ్వాలలు రోజంతా నన్ను చుట్టుముట్టాయి. రాత్రికూడా నన్ను వదలలేదు. అర్ధరాత్రి గడిచింది. అయినా నిద్రరాలేదు. చివరకు నేను నిన్నటికంటే కాస్త ఎక్కువగానే మధువు సేవించాను. నిద్రపట్టాలంటే, ఇంకా ఎక్కువ త్రాగా లన్పించింది. ఎలాంటి పీడకల కూడా రాకుండా ఉండేందుకు! మ....త్తు......గా తాగి స్పృహలేకుండా పడిపోవాలని ఉంది. కాని దేవయానికిచ్చిన మాట గుర్తు వచ్చింది. ఆమె ముక్కుమీద కోపం గుర్తువచ్చింది. అతి కష్టంమీద మనసు నిగ్రహించుకున్నాను.

మనసుని ఒకవైపు నియంత్రిస్తుంటే, మరోవైపు స్వేచ్ఛగా విహరిస్తున్నది. మత్తు పానీయం సేవించిన మనిషికి స్త్రీసుఖం కావాలనే కోరిక కాస్త అధికంగా ఉంటుం దేమో! అదే కోరిక - కోమలమైన స్త్రీ స్పర్శకోసం నా మనసు పరితపించింది. లేచి, తిన్నగా దేవయాని గదిలోకి వెళదామనుకున్నాను. కాని ఈ మధువు వాసనచూసి ఆమె చండిక అయిపోతుందన్న సంగతి గుర్తుకువచ్చింది. ఒకవైపు శర్మిష్ఠను గురించిన జ్ఞాపకాలు, ఆమెతో గడిపిన మధుర క్షణాలు, ఒక్కొక్కటిగా గుర్తు రాసాగాయి. ఆ రాత్రంతా అలానే గడిచిపోయింది.

మాధవుని క్షేమసమాచారం అడగడానికి రోజూ వెళ్ళేవాడిని, మరలా విచారంతో తిరిగి వచ్చేవాడిని! ఈరోజుకాక పోతే రేపైనా మాధవునికి స్పృతి వస్తుంది. నన్ను లోనికి తీసుకుని నా అంతరంగ భావాలను అతనితో చెప్పి కుంటూ, నేను కన్నీరుకారుస్తుంటే, తను తనచేత్తో వాటిని తుడవడానికి ప్రయత్ని స్తాడు. కాని రాజవైద్యులు శతవిధాల ప్రయత్నిస్తున్నారు. మాధవుని తల్లి అతని

దగ్గరే రాత్రిపగలు కనిపెట్టుకుని ఉంటుంది. ముకుళిక ప్రతిక్షణం అతని సేవ నిర్విరామంగా చేస్తున్నది. తారక అతని కాళ్ళువత్తుతూ, వచ్చేపోయేవారిని భయవిస్మయాలతో చూస్తూన్నది.

అయిదవరోజు మాధవుడు కొంచెం తేరుకుంటాడేమో అన్పించింది. అతను గట్టిగా మూల్గుతున్నాడు. తారక, చిన్నాన్నా, చిన్నాన్నా అని పిలిచింది. ఆమెకు జవాబు ఇచ్చినట్లనిపించింది మాకు. అతను ఊఁ., ఊఁ. అనటం విని తారక సంబరపడిపోయి పరుగెత్తుకుంటూ 'నాన్నమ్మా - నాన్నమ్మా' అంటూ లోనికి వెళ్ళింది. రాజవైద్యుని ముఖంలో కూడా ప్రసన్నత కన్పించింది. ముకుళికకు, నాకూ కూడా ఎంతో ఆనందం కలిగింది. మాధవుని తన దగ్గర కూర్చుని, 'మాధవా, మాధవా! గుర్తుపట్టావా నన్ను!' అని పిలిచాను.

మూలుగుతూ అస్పష్టంగా అన్నాడు - 'మహారాణీ - ఇది మహారాజుగారి ఆజ్ఞ!'

'ఈరోజే - ఈరోజే మొదటిసారి' - పూర్తి వాక్యం పలికాడు. కాని ఆ మాటలు వింటున్నప్పుడు, నా మనసుని ఎవరో గునపంతో పొడుస్తున్నట్లు అన్పించింది. ఆ భయంకరమైన రాత్రి, పురుని పట్టుకుని శర్మిష్ఠ రథం దిగుతూ అడిగి ఉంటుంది - 'నేను దిగిపోవాలా?' మాధవునికి కూడా చాలా బాధ అన్పించి ఉండవచ్చు. కాని అలా చేయడం తప్పనిసరికూడా. అందుకే బహుశా అతను వివశుడై శర్మిష్ఠతో 'ఇది మహారాజుగారి ఆజ్ఞ' అని వుంటాడు.

మాధవుని మనసేమిటో నాకు బాగా తెలుసు. ఆ రాత్రి ఆ పెనుతుఫానుకి తట్టుకో లేకపోయాడు. అలాగే, శర్మిష్ఠని నేను ఇలా నిర్దయంగా విడిచిపెట్టమనడం కూడా తను సహించలేకపోయి ఉండవచ్చు. అతనిది అతి సున్నితమైన మనసు.

నేను ..... యయాతి మహారాజుని ..... అన్నెంపున్నెం ఎరుగని శర్మిష్ఠలాంటి ప్రేమమూర్తిని - ఏప్రేమమూర్తి నా భుజంపై తల ఆన్చి బ్రహ్మానందం పొందిందో, ప్రణయని నా బాహుపాశాన్ని, మృత్యువుకు కూడా చిక్కని సురక్షితమైన చోటుగా విశ్వసించిందో, అలాంటి ప్రేమమూర్తిని విడిచిపెట్టి రమ్మని ఆజ్ఞాపించినపుడు ఏమీ అన్పించలేదు! మనసులో కొంచెం కూడా బాధపడలేదు.

ఆ రాత్రికలలో అవే రెండుగొంతులు మళ్ళీ నాకు వినిపించాయి. రెండూ గట్టిగా వాదులాడుకుంటున్నాయి. ఉలిక్కిపడి లేచి, తలదగ్గర ఉన్న మధువును మళ్ళీపుచ్చుకున్నాను. అది విషపుపాత్రకాదు. ఒక మహాసముద్రం. నా మనసులో లేచే బడబాగ్నిని ఆర్పగలిగేశక్తి దానికే ఉంది.

ఎనిమిది రోజులైనా ఇంకా మాధవునికి జ్వరం తగ్గే సూచనలేవీ కన్పించలేదు. తొమ్మిదోరోజు జ్వరం తగ్గుతుందని ఎవరూ అనుకోలేదు - ఆఖరికి రాజవైద్యులు కూడా.

ఆరోజు అతనికి బాగా చెమటపట్టింది. జ్వరం తగ్గుతుందని అన్పించింది. స్పృహలోకి కూడా వచ్చాడు. అతను నన్నడిగాడు, - 'ఆమె ఎక్కడుంది?' తను శర్మిష్ఠ గురించే అడుగుతున్నాడని నాకు తెలుసు, నేను మౌనం వహించాను. కాని అతని తల్లికి అర్థంకాలేదు. ఆమె అతనికి కొబోయే భార్యకు కబురంపింది. నేను కూడా ఇంతవరకూ ఎప్పుడూ చూడలేదు. 17 - 18 సంవత్సరాల వయస్సు గల ఆ యువతి చాలా వినయంగా మాధవుని మంచానికి దగ్గరగా వచ్చి నిల్చుంది. ఆమె అందం, ఈ పరిస్థితిలో కూడా నన్నాకర్షించింది. మాధవుడు చాలా అదృష్టవంతుడే అన్పించింది. మాధవుడు ఆమెతో అన్నాడు - 'ఇలా వచ్చి కూర్చో, సిగ్గుపడొద్దు!' రాజవైద్యునివైపుచూసి మరలా అన్నాడు - 'ఏమండీ! నేను ఈ రోగం నుండి కోలుకుంటాను కదా?'

రాజవైద్యుడు - 'పూర్తిగా కోలుకోవటానికి కొద్దిరోజులు పట్టినా, మీరు తప్పకసంపూర్ణ ఆరోగ్యవంతులవుతారు' అని అన్నాడు.

తర్వాత నావైపుచూసి అన్నాడు - 'మహారాజా, నేను అప్పుడే చావాలను కోవడం లేదు. నేను చనిపోతే 'తారక'ని ఎవరు చూస్తారు? నేనిలా అర్థాంతరంగా చనిపోతే ఈ మాధవి గతి ఏం కాను? ఆమె - నేను కలసి ఎన్నో కలలుకన్నాము. మహారాజా, ఈమె ఏపాపం ఎరుగని అమాయకురాలు, మీరు, వదినగారు మా వివాహం అయిన తర్వాత మా ఇంటికి విందుకు వస్తారుకదా! అప్పుడు ఏఏ వంట కాలు వండాలో, ఇప్పటినుండే మేము నిర్ణయించుకున్నాం. లతాకుంజంలో కూర్చొని మేం గంటలకొద్దీ తీయని కబుర్లు చెప్పుకున్నాం. నది ఒడ్డున కూర్చొని కేవలం స్పర్శతో ఒకరితో ఒకరు ఎన్నో మాటలు చెప్పు కున్నాం. మా

నాలుగు కళ్ళలో మేము కన్నకలలన్నీ నిజం చేసుకునే వరకూ నేను జీవించాలి. మహారాజా, నేను బ్రతికి ఉంటానుకదా? మహారాజా, నాకొక మాట ఇవ్వాలి! ఎలాగైనా నన్ను బ్రతికిస్తానని మాట ఇవ్వండి మహారాజా!'

అతని మాటలలో ఏమాత్రం అనౌచిత్యంలేదు. ఇదంతా తను స్పృహలో లేకుండా మాట్లాడుతున్నాడేమో అన్పించింది నాకు. అతని ఆనందంకోసం, అతని సంతృప్తికోసం, అతని చేయి నాచేతిలోకి తీసుకొని మాట ఇచ్చాను! - ఏదో విధంగానూ, విషాదంగానూ చూసాడు. వెంటనే అతను సంచిలోనుంచి ఏదో మాత్ర తీసి, ముకులికకు ఇచ్చి అరగతీసి తీసుకొని రమ్మని చెప్పాడు.

ఇన్నిరోజులూ స్పృహలేకుండా పడి ఉన్న మాధవుడు ఇప్పుడు ఒకసారిగా గడగడా మాట్లాడేస్తున్నాడు. అతను మాధవితో అంటున్నాడు - 'నీకు గుర్తుందా, మనకి మొదట ఆడపిల్ల పుడితే నాకు నచ్చిన పేరు పెట్టాలని. మగబిడ్డపుడితే నీకు నచ్చినపేరు పెడదామనుకున్నాం, గుర్తుందా? అలాగేనా? హాఁ. గుర్తుంచుకో! లేక పోతే అప్పుడు మరలా కీచులాడుకోవలసి ఉంటుంది'.

పాపం ఆమె ఏం చెప్తుంది. ఏకాంత సమయంలోని తరళస్వప్నాల ఆ సంగీతం, మృత్యుశయ్యపై ...... ......

ముకులిక ఆ మాత్రను అరగదీసి తీసుకొచ్చింది. దాన్ని రాజవైద్యుడు మాధవుని చేత నాకించసాగాడు. కాని ఒక్కసారిగా అతను రాజవైద్యునిచేతిని బయటికి తోసేసాడు. అప్పుడు రాజవైద్యుడు మాధవి చేతికి ఆ మందిచ్చి నాకించమన్నట్లుగా సైగచేసాడు. ఆమె తన చేతిని మాధవుని ముఖం దగ్గరగా పెట్టగానే ఆమె చేతిని గట్టిగా పట్టుకుని అన్నాడు - 'చూడు, మన వివాహం జరిగిపోయింది కదా?' అలాగే రెండు మూడు ఘడియలు వేగంగా మాట్లాడి మరలా మౌనంగా ఉండిపోయాడు. ఒక్కసారిగా శరీరమంతా చెమటపోసింది. వెంటనే కాళ్ళు చేతులు చల్లబడిపోయాయి. ఎగఊపిరితో ఉక్కిరిబిక్కిరయ్యాడు. రాజవైద్యులు తన ప్రయత్నం చేస్తూనే ఉన్నారు. కాని అంతా వ్యర్థం! చివరికి అతని ప్రాణాలు అనంతవాయువుల్లో కలిసిపోయాయి.

# అధ్యాయం 21

మధ్యాహ్నం, మాధవి చేతిని తన చేతిలోకి తీసుకుని ఆమెతో, ఇదిగో, మన వివాహం అయిపోయింది, అని చెప్పిన మాధవుని శరీరం సాయంత్రానికల్లా శవమై చితిపై చేరుకుంది. ఆ అచేతనమైన పార్థివ శరీరాన్ని చూసి సహించలేకపోయాను. ఆ నిష్కపటమైన నవ్వు ఎక్కడికి అదృశ్యమైపోయింది? ఎప్పుడూ నన్ను ఊరడిస్తూ, నాకు ధైర్యం చెప్పే అతని చేయి ఇప్పుడు కదలకుండా ఎందుకు అచేతనంగా పడి ఉంది? 'మహారాజా' అని ఎప్పుడూ పిలిచే ఆ మధుర కంఠధ్వని ఏది? నాకోసం ప్రాణాలర్పించడానికైనా వెనుకాడని అతని ప్రేమపూరితమైన హృదయం ఇప్పుడు ఏమైపోయింది? నా మాధవుడు ఎక్కడికి వెళ్ళిపోయాడు?

ఈ ప్రశ్నలు చిన్నపిల్లలకు వచ్చే సందేహాల్లా నన్ను నిరంతరం వేధిస్తూనే వున్నాయి.

కాలుతున్న చితిలో మాధవుని శరీరం అగ్నికి ఆహుతి అయిపోసాగింది. ఆదృశ్యం చూస్తూ - మొదట కన్నీళ్ళు తుడుచుకుంటూ, తర్వాత శిలాప్రతిమలా స్థబ్దంగా నిలబడిపోయాను.

'ఎలాగైనా సరే, నేను నిన్ను బ్రతికిస్తాను' అని మాధవునికి మాట ఇచ్చాను. నేను హస్తినాపురానికి చక్రవర్తిని. అయినా నా మాట నిలబెట్టుకోలేకపోయాను.

జీవితం - మృత్యువు! ఎంతక్రూరమైన ఆట ఇది. మనిషి కేవలం ఈ నాటకం ఆడడానికే ఈ ప్రపంచంలో జన్మిస్తాడా? తను ఎందుకు జీనిస్తాడు? ఎందుకు మరణిస్తాడు? మాధవునిలాంటి నవయువకుడు ఇలా అకాలమృత్యువాతపడి, ఈ ప్రపంచాన్ని వదలి ఎందుకు వెళ్ళిపోతాడు? మనసులో సగం విరిసిన కలల

మొగ్గలను విడిచి మాధవుడు ఎక్కడికి వెళ్ళిపోయాడు? అతను 'మాధవి'ని విడిచి వెళ్ళాలని అనుకోలేదు. అయినా వెళ్ళవలసి వచ్చింది. అలా ఎందుకు వెళ్ళవలసి వచ్చింది అన్నది ప్రశ్న. అతను ఏం అపరాధం చేసాడని, విధి అతనికి ఈ శిక్ష ఎందుకు విధించింది?

చితి పూర్తిగా రగులుకుంది. చితినుండి, మంటలు పైకెగస్తూ తమవంతు కర్తవ్యాన్ని నెరవేరుస్తున్నాయి. మాధవుడు! నా మాధవుడు! ఎదురుగా చితి కాలి భస్మపురాశి కన్పిస్తోంది. ఇతనేనా నా మిత్రుడు! అతనెక్కడికిపోయాడు? ఇప్పుడు అతను ఎలాంటి స్వప్నమూ చూడబోడు. మాధవి గురించిన కల కూడా!.

మృత్యువు! జీవితంయొక్క భయంకర రహస్యం! సముద్రం ఒడ్డున ఎవరైనా చిన్న పిల్లాడు ఇసుకుతో కట్టుకున్న గూటిని ఉవ్వెత్తుని లేస్తూవచ్చిన భయంకర కెరటం గుర్తుపట్ట లేనంతగా తుడిచివేస్తుంది. ఈ మానవజీవితం కూడా అంతే. ఈ రెంటికీ ఏమైనా భేదం ఉందా? ఏ వ్యక్తినైతే మనం అత్యధికమైన గౌరవమిచ్చి, పరమాత్మయొక్క ప్రతిరూపమని విశ్వసించి, అతని కర్తవ్యాన్ని పూజ్యనీయంగా భావిస్తామో, అతను కూడా ఎవరు? ఏమిటి? విశ్వమనే విశాల వృక్షంలో ఒక చిన్న ఆకుతో సమానం.

అలాంటి ఆకు, గట్టిగా వీచిన గాలికి ఎప్పుడు రాలిపోతుందో, ఎవరికీ తెలియదు. మరి - మరి నేను - నేను యయాతిని - నేను హస్తినాపురానికి మహారాజుని - నేను కూడా ఆఖరికి ఎవరిని? నేను కూడా తుచ్ఛ మానవుణ్ణే - ఒక చిన్న ఆకు - ఎప్పుడు రాలి పోతుందో, ఎవరికి తెలుసు?

మాధవుని నుండి చివరి వీడ్కోలు తీసుకుని ఇంటికి తిరిగి వచ్చాను. అది రాత్రి! కాదు, బుసలు కొడుతూ కాటువేయబోయే భయంకర నాగిని అది!

మనస్సు మాటి మాటికి మృత్యువు గురించే ఆలోచిస్తోంది. ఆలోచనల సుడిగుండం నుండి బయటపడటం నాకు అసంభవమనిపించింది. అలాంటి సమయంలో దేవయాని వచ్చి నాచెంత కూర్చుంటే బాగుండుననిపించింది. ఆమె మాధవుని గుణ - గుణాలను వర్ణిస్తూ నేను కన్నీరు కారుస్తూంటే, తనుకూడా తన దుఃఖాన్ని కన్నీటిధారలతో వ్యక్తపరిస్తే ఆ కన్నీటి సంగమంలో నేను ఆమె చేతుల్లో తలదూర్చి విలపించాలని ఉంది. అలా, విలపిస్తూ తల్లి ఒడిలో నిద్రపోయే

పసిపాపలా నిద్రతో సోలిపోవాలని ఉంది. కాని దేవయాని మాత్రం - 'మాధవుడు చనిపోయాడా, పాపం! చాలా అనర్థం జరిగింది' అనేసి ఊరుకుంది. అంతేకాని ఆమె ఏమాత్రం సానుభూతిని వ్యక్తపరచలేదు. నాకు భోజనం చేయాలనిలేదని నేనన్నప్పుడు కనీసం నన్ను ఓదారుస్తూ - పదండి, రెండు మెతుకులు తిని పడు కోండి! అని కూడా అనలేదు. నేను నా పడకగదిలో దుఃఖంతో తల్లడిల్లి పోతుంటే కనీసం నా గదివైపుకూడా తొంగిచూడలేదు.

చాలాసేపటివరకూ బయట చీకటిలోకి శూన్యమనస్కుడనై చూస్తూ ఉండిపోయాను.

ఆ చీకటిలో, నాకు రాజమార్గంలో ఒక రథం కన్పించింది. నేను అలా ఆ రథంవైపు చూస్తూండిపోయాను. కాని ఆ రథచక్రాల శబ్దం ఏమాత్రం విన్పించటం లేదు. ఆ చీకటిలో కూడా, రథానికి జతకూర్చిన ఆ నల్లటి గుర్రాలు నాకు స్పష్టంగా కన్పిస్తున్నాయి. నేను రెప్ప వార్చకుండా చూస్తూండిపోయాను. నా కళ్ళను నేనే నమ్మలేకపోయాను. ఉద్యానవనంలోని పూలమొక్కలని తొక్కుకుంటూ ఆ రథం వచ్చి నేను నిలబడిన కిటికీ పక్కగా ఆగింది. సారథి - 'పదండి మహారాజా' అని నెమ్మదిగా అన్నాడు.

మహారాణి నిదురించిందా? మరి యదు కూడా పడుకున్నాడా! వాళ్ళ దగ్గర వీడ్కోలు తీసుకోకుండానే .......

ఆ తర్వాత మాటలు నాకేం విన్పించలేదు. చూస్తూండగానే ఆ సారథి చేయి పొడవుగా సాగుతూ కిటికీ వరకూ వచ్చింది. అతను నన్ను ఏదో చిన్న మొక్కనుండి పూవును త్రెంచినంత తేలికగా చేతిలో ఎత్తి రథంలో కూర్చోబెట్టాడు.

రథం సాగింది. హస్తినాపురంలో చిరపరిచితమైన ఒక్కొక్క ప్రదేశం దాటి పోతున్నది. దేవాలయం, నృత్యశాల, మాధవుని ఇల్లు, క్రీడాప్రదేశం - చిన్నప్పుడు నగరోత్సవ సమయంలో పిచ్చిగుర్రంపై స్వారిచేసి వీరత్వం చూపించాలనుకున్న స్థలం ఇదే -

రథం చాలా వేగంగా గాలిలో తేలిపోతున్నది. ఇది ..... ఇది అశోకవనం, అదికూడా దాటిపోయింది. ఇంక నేను సహించలేకపోయాను. సారథిని అడిగాను - 'ఎక్కడికి తీసుకోపోతున్నావు?'

- 'నాకు తెలియదు!'

'మనం ఎప్పుడు తిరిగి వస్తాము?'

'నాకు తెలియదు!'

నేను కోపంతో అడిగాను - 'అయితే నీకేం తెలుసు?'

'కేవలం రెండు పేర్లు!'

'ఎవరివి?'

'ఒకటి మహారాజుది ......!'

'మరి రెండవది?'

'నా పేరు ......!'

'నీ పేరేమిటి?'

'మృత్యువు!'

ఎంత భయంకరమైన అనుభూతి! నేను కిటికీ ఊచలను రెండు చేతులతోనూ గట్టి .....గా పట్టుకున్నాను. అయినా, భయంతో నా శరీరం అంతా గజాగజా వణికి పోతూంది, నేల కూలిపోతానేమో అన్పించింది.

అతి కష్టంమీద, మంచం దగ్గరకు చేరుకుని దానిమీద కూర్చున్నాను. గుండె వేగంగా కొట్టుకొంటున్నది. కాళ్ళు గజగజా వణికిపోతున్నాయి. ఎంత ప్రయత్నించినా మనసు కుదుటపడలేదు.

పదే - పదే మదిర సేవించాను. చప్పరిస్తూ ఒక్కొక్క గుటకా వేశాను. కొంచెం సేపటికి కాస్త ఉపశమనం కలిగింది. నెమ్మది - నెమ్మదిగా మత్తు తలకెక్కింది. కళ్ళు బరువుగా మూతపడసాగాయి. కాని ఆ పరిస్థితిలోనే నేనొక భయంకరమైన కల గన్నాను. ఆకలలో నాకు ఎదురుగా ఒక చితి మండుతోంది. ఆ చితిలో - నా శరీరంలోని ఒక్కొక్క అంగం కాలిబూడిదైపోతున్నది.

చూస్తూండగానే, నా కళ్ళు, చెవులు, పెదవులు, కాళ్ళు - చేతులు అన్నీ కాలి

భస్మమైపోయాయి. ఇక నాకు వాటి ఉపయోగమేమిలేదు. కళ్ళలోని ఆ అంద మైన సున్నితమైన కాంతి, ఇప్పుడులేదు. మధువుయొక్క ఉన్మాదం, ఆవేశంతో నిండిన ఆ పెదవులతో, అమృతంతో నిండిన తీయని పెదవులను ఇంక ముద్దాడలేను.

ప్రేయసి కురులలో అలంకరించిన సంపెంగపూలను, మిగలముగ్గిన పనసపండు వంటి సుగంధం వెదజల్లే ప్రియురాలికేశాలను ఇక ఆఘ్రాణించలేను.

ఈ దృశ్యాన్ని చూస్తూ - చూస్తూ నామత్తంతా దిగిపోయింది. మరలా మంచంపై లేచికూర్చున్నాను. గుండె వేగంగా కొట్టుకుకంటున్నది. మృత్యుభీతి పదే పదే నాహృదయాన్ని పట్టి పీడించసాగింది. మృత్యువు నాహృదయంలో ఒక్కొక్క దెబ్బ గట్టిగా కొట్టుతున్నట్లు అనిపిస్తున్నది. ఆ దెబ్బల ప్రతిధ్వనులు నా చెవులలో గింగురుమంటున్నాయి.

వేటగాడి గురి నుండి తప్పించుకుని పరుగెడుతూ బెదురు బెదురుగా చూస్తూ నిలబడిన లేడిలా ఉంది నామానసిక స్థితి. మధువు తప్ప, మనసును చక్కపరిచే ఉపాయం వేరొకటి కన్పించటంలేదు.

ఇన్ని సంవత్సరాలుగా, నేనెప్పుడూ ఇంతగా త్రాగలేదు. నెమ్మది - నెమ్మదిగా మత్తు ఎక్కుతోంది. ఆ ఉన్మాదం, వేరొక ఉన్మాదాన్ని తట్టిలేపుతోంది. ముకుళిక, అలక, శర్మిష్ఠ, దేవయానిల అందమైన ఆకారాలు నాలోని కోరికను అధికం చేస్తు న్నాయి. కళ్ళముందు నాట్యం చేస్తున్నాయి.

అలక ముందుకు వంగుతూ, తన జడలో తురుముకున్న పూలచెండు సుగంధాన్ని నాచేత ఆఘ్రాణింపజేసున్నది. ఆ సువాసనని పీలుస్తూ నేను మత్తెక్కి పోయాను. ఆమె దూరంగా జరిగిపోసాగింది. వెంటనే నేను ఆమె జడలోని పూల చెండుని చేతితో లాగేసి రెండు చేతులతో నలిపి, వాసన చూడసాగాను. వణుకు తున్న కంఠంతో అలక అడిగింది - 'యువరాజా! అదేమిటి? అలా .....? నేను జవాబిచ్చాను, అయినా నాకు సంతృప్తిగాలేదు, ఇంకా, ఇంకా నాకు సువాసన కావాలి!'

అలక అధరాలను, కళ్ళను, కేశాలను, బుగ్గలను అన్ని సుగంధాలను గట్టిగా పీల్చాలని, మత్తుగా వాసనచూడాలని చేతులను చాచి ఆమెను నా బాహువులలో బంధించాను. కాని - నేను కళ్ళు తెరిచిచూసాను - పదే - పదే చూసాను. నా

గదిలో నేనే ఒంటరిగా ఉన్నాను. మరి అలక? ఆమె ఎక్కడ? భూగృహంలోనా? కాదు! లేక ఇంకెక్కడైనా దాక్కుని ఉందా? కుందేలు తొర్రలోనా, లేక సింహం గుహలోనా? అలకా - అలకా! చాలా గట్టిగా అరిచాను.

నా పిలుపుకి ఎవరో జవాబిచ్చారు. కాని ఆమె అలక కాదు, ముకుళిక, ఆమె ఎక్కడుంది? దూ ..... రంగానా? లేదు! నా కౌగిలిలోనే! నేను ఆమెను ముద్దుపెట్టుకుంటున్నాను - ఆమెకూడా నాకు ముద్దుపెడుతోంది! నేను ఆకాశంలో ఒక్కొక్క నక్షత్రాన్ని లెక్కిస్తూ పదే - పదే ముద్దుపెడుతున్నాను. నక్షత్రాలు లెక్కించడం పూర్తి అయినా ఇంకా ముద్దులు పెట్టడం ఆగలేదు. కాని - కాని నా పెదవులకు - ఏమిటిది - ఇలా ఇంత చల్లగా తగుల్తోంది? ముకులిక ఎక్కడ? ఆమె మాధవుని ఇంటిలో అతని సేవచేస్తున్నదా? అయినా మాధవుడు ఎక్కడున్నాడు? అతను - మృత్యువు చేయిపట్టుకుని - నా పెదవులకు ఇలా చల్లగా తగులుతోంది, ఒకవేళ మృత్యువుకాదు కదా?

మరలా నేను కళ్ళు తెరచిచూసాను. నేను ఒంటరిగానే ఉన్నాను, నా గదిలో. ఒకవేళ మృత్యువుగాని నాచుట్టూ పరిభ్రమిస్తున్నదా! జీవితంలో బహూశా ఇది నా చివరి రాత్రేమో? ఎవరికి తెలుసు? కనీసం ఈ చివరి రాత్రయినా ఆనందంగా అనుభవించనీ! ఖాళీ అయిపోతున్న ఈ జీవిత మధుపాత్రను ఒక్కసారి, ఒకే ఒక్కసారి స్త్రీ - సుఖమనే నురుగలుకక్కే మధువుతో నింపనీ. చివరి మధుపాత్ర - ఇది ఆఖరి మధుపాత్ర!

'శర్మిష్ఠా ..... శర్మిష్ఠా ...... శమా ...... శమా!'

నేను లేచాను, నాకాళ్ళు నేలపై సరిగా ఆనడంలేదు. శరీరాన్ని సంభాళించుకోలేక పోతున్నాను. అయినా లేచి ద్వారం తెరచుకుని బయటికి నడవసాగాను.

# అధ్యాయం 22

దేవయాని గదిముందు దాసి కునుకుతోంది. నా అలికిడి విని తను సర్దుకుంటూ లేచి నిలబడింది.

ఆమె పరుగెడుతూ లోనికి వెళ్ళిపోయింది. ఆమె తిరిగి వచ్చేటంతవరకూ నేను ఎదురు చూడాలనుకున్నాను. మహారాణి సందేశం తెలుసుకుని లోనికి వెళ్ళడం మంచిదని - ఈ విషయం మనసుకు తెలుసు, కాని శారీరకవాంఛకు తెలియదు.

ప్రతి కోరిక సింహం లాంటిదా? సింహానికి ఒకసారి ఏ జంతువు మాంసం రుచిగా అన్పిస్తుందో, ఇంక అదే జంతువుని వేటాడాలని వెంటపడినట్లు, ఈ కోరిక కేవలం జిహ్వాదే, భగవంతుడు ఆ నాలుకకు కళ్ళు, చెవులు, మనసు, హృదయం, ఇంక ఏమీ ఇవ్వలేదు. దానికింక దేనితోనూ సంబంధంలేదు. కేవలం తన రుచి సంతోషం మాత్రమే వెతుక్కుంటుంది!.

చాలా ఎక్కువగా త్రాగడంవలన నేను ఒక్కొక్క అడుగూ లెక్కవేసుకుంటూ నెమ్మదిగా వెళ్ళి దేవయాని గదిలోకి చేరుకున్నాను. అక్కడ ఏమైందో, ఇప్పుడు సరిగా గుర్తులేదు. ఏదో దట్టమైన పొగమంచులోనికి వెళ్ళిపోయినట్లన్పించింది.

నాకొకే ఒక విషయం గుర్తుంది. అప్పుడు నాకు దేవయానిని పొందాలని ఉంది. ఒక్కక్షణం కూడా ఆలస్యంచేయకుండా ఆమెను కౌగలించుకోవాలని ఉంది. ఆమె తన సౌందర్యాన్నంతా నాముందు ప్రదర్శిస్తే బాగుండుననిపించింది. కాని, నేను మధువు సేవించినట్లు ఆమెకు తెలిసిపోయింది. తన కోపం నామీద ప్రదర్శించింది. చిర్రుబుర్రులాడింది. తిట్టింది. నిందించింది. నేనుకూడా గట్టిగా అరిచాను.

పెద్ద గొడవ జరిగింది. మధ్యలో అకస్మాత్తుగా నానోటినుంచి శర్మిష్ఠ పేరుకూడా బయటకు వచ్చేసింది. ఇంక అగ్నిలో ఆజ్యంపోసినట్లు కోపంతో మండిపోయింది. ఆమె తన తండ్రి శుక్రాచార్యుని కోపం, ఆయన శాపం గురించి మాట్లాడింది. చివరిగా నాచేత ప్రమాణం చేయించుకుంది. అదీకూడా శుక్రాచార్యులమీద ప్రమాణం చేస్తూ -

'నేను ఇకముందు ఎప్పుడూ నిన్ను ముట్టుకోను!'

నేను ఓడిపోయి, అసంతృప్తితో ఆమె మందిరం నుండి బయటకి వచ్చేసాను. ఈ రాజప్రాసాదంలో నా భార్యనే ముట్టుకోవడానికి అధికారం లేనప్పుడు, ఇంక ఇక్కడ ఉండడంలో అర్థంలేదు. నేను గట్టిగా నిర్ణయించుకున్నాను. ఇంక ఈ రాజ ప్రాసాదంలో అడుగుపెట్టను. ఇకమీదట అశోకవనంలోనే ఉంటాను. ఈ దేవయాని ముఖంకూడ ఇక చూడను. అశోకవనంలోనే శర్మిష్ఠ జ్ఞాపకాలను నెమరువేసుకుంటూ గడిపేస్తాను.

అశోకవనం వెళ్ళడానికి రథంలో కూర్చున్నాను. ఒకటి తర్వాత ఒకటి దేవయాని, శర్మిష్ఠల స్వరూపాలు నా కనుల ముందు నాట్యమాడసాగాయి. ఇద్దరూ నాకు కావాలి. కాని ఒకరు నన్ను బయటకు నెట్టివేసారు. ఒకరిని నేనే నానుండి దూరంగా నెట్టివేసాను! -

రథం అశోకవనం వైపు వెళుతుండగా ఆ రెండు రూపాలు ఒకటిగా అయి పోయి, దానిలోనుండి ఒక సుకుమారమైన యువతి ఉద్భవించింది. ఆ యువతి క్షణ - క్షణం ఒక్కొక్క ఉన్మత్తమైన రూపం ధరిస్తోంది. చివరికి అది అలకగాను ఆ తరువాత ముకుళికగాను రూపుదిద్దుకుంది.

ముకుళిక! ఆమె గురువు! నృత్యశాలకు దగ్గరలోనే వాళ్ళుండేది. ఆ విషయం నాకు గుర్తొచ్చింది. అశోకవనం వెళ్ళి రాత్రంతా అక్కడ శోకాన్ని అనుభవించే బదులు, ఇక్కడ ఈ గురుమహారాజ్‌ని ఎందుకు దర్శించకూడదు? చూద్దాం. మనశ్శాంతికి వారేదైనా ఉపాయం చెప్పగలరేమో! సారథికి చెప్పి రథం ఆ మఠంవైపుగా పోనిమ్మన్నాను.

వేళకాని వేళలో నేనక్కడికి రావడంచూసి ముకుళిక ఆశ్చర్యపడింది. అయినా

వెంటనే సంభాళించుకుని సిగ్గుతో పలకరిస్తూ నన్ను గురుమహారాజ్ వద్దకు తీసుకు వెళ్ళింది.

గురుమహారాజ్ రాజయోగిలా ఉన్నారు. ఆయనను ఇంతకుముందెక్కడో చూసినట్లుగా అన్పించింది. కాని ఒక్క క్షణం మాత్రమే అలా అన్పించింది. ఎక్కడ, ఎప్పుడు చూసానో గుర్తుకు రాలేదు.

నా దుఃఖకారణం ఆయనకు వివరించాను. మధువు సేవించి అటువంటి పవిత్ర ప్రదేశానికి వచ్చినందుకు క్షమించమని అడిగాను. వెంటనే ఆయన చిరునవ్వునవ్వి, 'మహారాజా, మనస్శాంతి కొరకు సగం ఉపాయం మీరే ఆలోచించుకున్నారు!'

నాకు అర్థంకాలేదు. సందేహంగా అడిగాను, 'అంటే?'

'మహారాజా! ఇది మృత్యులోకం. ఇక్కడ మానవజీవితం కష్టాలతోనూ, దుఃఖంతోనూ నిండిపోయి ఉంటుంది. ఈ దుఃఖాన్ని మరచిపోడానికి ఇక్కడ రెండే రెండు దివ్య ఔషధాలున్నాయి!'

నేను ఉత్సుకతతో అడిగాను, 'ఏమిటవి?'

'మదిర - మదిరాక్షి!'

నేను ఆశ్చర్యపోయాను. కాని మనసును నిగ్రహించుకుంటూ అడిగాను - 'మద్యపానం మహా పాపంకదా .....'

'పాప - పుణ్యాలు ధూర్తులైన పండితులద్వారా, మూర్ఖమానవులద్వారా, కల్పించబడిన అపోహాలు. ఈ ప్రపంచంలో కేవలం సుఖం - దుఃఖం మాత్రమే సత్యాలు. మిగిలినదంతా మిథ్యే. పాప - పుణ్యాలు కేవలం మానసికాలోచనలు మాత్రమే. కాల్పనిక క్రీడ మాత్రమే. నేను మాత్రం నా భక్తులకు తీర్థంగా మదిరనే ఇస్తుంటాను!' - అన్నారాయన, నేనేమైనా కలగంటున్నానా అన్పించింది.

'మహారాజా! మీకు మనశ్శాంతి కావాలి కదా? అది అందించే దేవేరు లెందరో నావశంలోవున్నారు. వారిలో ఎవరినైనా మీరు ఆరాధించవచ్చు అంటూ' - ఆయన లేచి లోనికి వెళుతుంటే నేను కూడా ఆయన వెనకే మంత్రముగ్ధుడిలా నడవసాగాను. నడవడం మామూలుగానే నడుస్తున్నా, ఏదో పర్వత శిఖరం నుండి

క్షణం - క్షణం క్రిందకు అగాధం లోనికి దొర్లిపోతున్నట్లనిపించింది నాకు. ఈ అగాధానికి ఒక అంతు అంటూ ఏమీ లేదు. ప్రకృతి పుట్టింది మొదలు నేటివరకూ ఒక్క సూర్యకిరణం కూడా ఈ అగాధాన్ని సోకలేదు.

## శర్మిష్ఠ

నేను హస్తినాపురం వెళుతున్నాను. పదునెనిమిది సంవత్సరాల తర్వాత మళ్ళీ హస్తినాపురం వెళుతున్నాను. ఏ మార్గంలో వచ్చానో, మళ్ళీ అదే మార్గంలో ప్రయాణిస్తున్నాను. అంతేకాక ఆనాడు ఎంత మానసిక వేదనతో వచ్చానో నేడు కూడా అదే భయగ్రస్థమైన మానసిక స్థితి!

ఈ దారిలో పెద్ద పెద్ద వృక్షాలు అలాగే ఉన్నాయి. మందిరాల - కలశాలు కూడా అప్పటిలాగే సూర్యుని బంగారు కాంతులలో ధగధగా మెరసిపోతున్నాయి. గ్రామమూ, గ్రామీణులు రాత్రి ఒడిలో ఎప్పటిలాగే ప్రశాంతంగా నిద్రిస్తున్నారు. ఈ పదునెనిమిది సంవత్సరాలలో ఏమీ మార్పు జరగలేదు! ఒక్క శర్మిష్ఠ తప్ప .....

పదునెనిమిది సంవత్సరాల పూర్వపు శర్మిష్ఠను నేనేనా? కాదు! ఈ శర్మిష్ఠ పూర్తిగావేరు, ఆ శర్మిష్ఠ ఒక తల్లి, భార్య, ప్రణయినిగా ఉండేది. కాని నేటి శర్మిష్ఠ కేవలం తల్లిగా మాత్రమే మిగిలింది. నా పురు కుశలమే కదా? అనే ప్రశ్న తప్ప వేరొక ధ్యాసే లేదు.

శుక్రాచార్యుని ఘోరతపస్సు కారణంగా చింతాగ్రస్తులైన కచుడు, యతి, అంగీరసుడు, మొదలైన ఋషి - మునులకు కలిగే భయం లాంటి భయంకాదు నాది. నా భయం అంతా ఒక్కటే - పురు ఎక్కడుంటాడు? విజయుడైన 'యదు' తోపాటు హస్తినాపురం వెళతాడా? వెళ్ళి ఉంటే దేవయాని 'పురు'ని గుర్తు పట్టేస్తుందా? పురు ముఖకవళికలన్నీ మహారాజులాగే ఉంటాయి. దేవయాని ఒకవేళ 'పురు'ని గుర్తు పట్టేస్తే .... ....

నాతోపాటు నా సంరక్షకులు ఉన్నారు. వాళ్ళే కాకుండా ఈ అలక కూడా నాతోపాటు వస్తున్నది. ఈ బంగారు తీగలవంటి కేశాలతో అందమైన ఈ పిల్ల మా పురుని ప్రేమించింది. ఆ విషయం తను ఎప్పుడూ బయటపెట్టలేదు. అయినా

పూవు వికసిస్తే దాన్ని ఎంతదాచిపెట్టినా, దాని పరిమళం ఎక్కడికి పోతుంది. ఎలాగో ఒకలాగ ఆ పరిమళాన్నిబట్టి ఆ పూవుని గుర్తించవచ్చుకదా! ఈ పిల్ల కూడా నాతోపాటు వస్తానని మొండికేసింది. నాకు కూడా ఈ అమ్మాయి నాతో పాటు రావడం మంచిదే అనిపించింది. కాని ఒక్కోసారి పురుని తలచుకొని ఈ అమ్మాయి ఏడుస్తూంటే, చూసి నా మనసు కరగి పోతూంటుంది. అర్ధరాత్రి అయినా కళ్ళుమూతలు పడటంలేదు. గత పదునెనిమిది సంవత్సరాల జ్ఞాపకాలు సజీవంగా నా మనోపటలం మీద ప్రత్యక్షంకాసాగాయి. మొట్ట మొదటి ఆ భయంకరమైన రాత్రి మొదలుకొని.....

ఆ అర్ధరాత్రి మాధవుడు వెళ్ళిపోయాడు. నేను ఆ గాఢాంధకారంలో, కుండ పోతవర్షంలో ఒంటరిగా మిగిలిపోయాను, ఒంటరిగానా? కాదు! నా పురు కూడా నాతోపాటు ఉన్నాడు. పురు తడిసి ముద్దయిపోయాడు. - రేపు తనకేమైనా జబ్బు చేస్తే?

ఆ భయంకరమైన పంచభూతాలమీద నాకు చాలా కోపం వచ్చింది. ఒక తల్లి తన బిడ్డతో ఈ నిర్జన ప్రదేశంలో నిస్సహాయంగా పడి ఉందనే కనికరం కూడా లేకుండా ప్రవర్తిస్తున్నాయి. కావాలంటే అవి నాకు ఆత్మస్థైర్యాన్ని ఇవ్వగలవు. ధైర్యాన్ని పెంపొందించగలవు. కాని అందుకు విరుద్ధంగా నన్ను భయపెడు తున్నాయి. ఎముకులు కొరికేటంత ఈదురుగాలీ, కారుమేఘాలతో నిండిన ఆకాశం, ఉరుములూ, మెరుపులూ ఇవన్ని ఎందుకిలా నాపై పగతీర్చుకోవాలనుకుంటు న్నాయి? మనిషే పాషాణహృదయుడుగా మారు తున్నప్పుడు, పాషాణాల నుండి మానవతను ఆశించడం వ్యర్థం. దేవయాని నా ప్రాణాలు తీయడానికే చూసింది! మహారాజు ధైర్యంచేసి ఆ భూగృహంనుండి విడిపించి ఉండకపోతే ఈపాటికి అభాగ్యురాలైన ఈ శర్మిష్ఠ జీవితం ఎప్పుడో అంతమై ఉండేది! కానీ ....

ఒక హద్దుమీరి మనిషి ప్రేమించకూడదనేదే జీవితంలో ఒక సాంప్రదాయమా? మహారాజు నా ప్రాణాలను కాపాడిన విషయం నిజమే. కాని తన ప్రియమైన శర్మిష్ఠను, ప్రియురాలిని ఇలా నిస్సహాయురాలిగా, అనాథగా గాలీ, వానలో, అది రాత్రిపూట ఎలా వదిలివేయగలిగారు? ఇందుకు భిన్నంగా ఆయన - శర్మిష్ఠా! నాకు రాజసింహాసనం వద్దు, ఐశ్వర్యం వద్దు, నీవే నాకు కావాలి. పద, నేను కూడా నీతో

పాటే వస్తాను. రా, మనం ఏ హిమాలయ ప్రాంతానికోపోయి సుఖంగా ఉందాం! అని వుంటే నాకెంత ధైర్యంగా ఉండేదో, ఎంత ఆనందం కలిగేదో!

కాని, ఆయనను నాతోపాటు రానిచ్చే దాన్నికాదు. ఆయన పలికిన ఆ ధైర్యపు మాటలనే పదే - పదే స్మరించుకొని ఈ భయంకర వాతావరణాన్ని ఎంతో ఆనందంగా భరించేదాన్ని, కాని, శర్మిష్ఠకు, ఈ శర్మిష్ఠకు అంత అదృష్టమా?

ఆ రాత్రి నేను ఎంతదూరం నడిచానో నాకే తెలియదు. 'పురు'ని ఎత్తుకొని, పిశాచాల కూతల వంటి భయంకరమైన ఈదురుగాలికి భయపడకుండా, ఉరుము లకూ - మెరుపులకూ భయపడకుండా, గాలిపటంలా, అవిశ్రాంతంగా ఎగిరే పక్షిలా, ఊగుతూ - తూగుతూ - గాఢాంధకారాన్ని, చీల్చుకుంటూ, ఎలా ఆరాత్రంతా నడి చానో నాకే ఆశ్చర్యం వేసింది. బహూశా, ఆపద సమయంలో మనిషిలో, అంతర్లీనంగా ఉన్న శక్తులన్నీ బయటికి వచ్చి శత్రువులను ఎదుర్కొంటాయేమో! రాజకుమారిగా అతి గారబంగా పెరిగి, ఎప్పుడూ పల్లకీలో విహరిస్తూ పూలబాటలో నడిచిన నేను ఇప్పుడు అరణ్యమార్గంలో, ముళ్ళబాటలో ఎన్ని ఝూములో అలా నడుస్తూ ముందుకు సాగిపోయానో! హస్తినాపురాన్ని వదలి, మృత్యుకూపంనుండి బయటపడి చాలాదూరం పరుగెత్తుతూనే ఉన్నాను. ఆ సమయంలోనేను వృషపర్వ మహారాజు కుమార్తె శర్మిష్ఠగా, యయాతి మహారాజు ప్రియురాలిగా గాక, కేవలం ఒక బిడ్డకుతల్లిగా, బిడ్డను రక్షించుకునేతల్లిగా ముందుకు సాగిపోతున్నాను. ఈ ప్రపంచంతో నాకు ఎటువంటి బంధాలు లేవు, ఒక్క 'పురు' తప్ప. ఆ చిన్నారి బాలుడు చలికి వణుకుతూ గుండెలకు హత్తుకుపోతూంటే ఎలాగైనా నా బిడ్డను కాపాడుకోవడంకోసం, జీవించాలనుకుని నేను ముందుకు సాగి పోయాను. నా బిడ్డను పెంచి, పెద్దచేసిన తర్వాత నా బిడ్డ పరాక్రమాన్ని కనులారా తృప్తిగా చూసు కున్న తర్వాతే మృత్యువును ఆహ్వానించాలని నిశ్చయించుకున్నాను.

రెండవరోజు ఉదయం ఒక చిన్న పల్లెలోని దేవాలయంలో కాసేపు విశ్రాంతి తీసుకుందామని కాస్త ఆగాను. అంతలోనే నాలో ఒక ప్రశ్న తలఎత్తింది. ఇంకా ముందుకు వెళ్ళాలనుకుంటే, ఎక్కడి వరకు? తండ్రిగారి దగ్గరకు వెళ్ళనా? మనుమణ్ణి చూసి ఆయన చాలా సంబరపడతారు. కాని, తనముద్దుల కుమార్తె శర్మిష్ఠ - దేవయానికి సవతి అయిందని, దేవయాని నా ప్రాణాలు తీయడానికి పూను

కుందని తెలిసిన తర్వాత ఆయన ఆనందం అంతా ఒక్కసారిగా అదృశ్యమైపోతుంది. ఈ విషయం తెలిస్తే గురువు శుక్రాచార్యులువారు తన వంశం నాశనం అయ్యేటట్లు శపిస్తారేమోనన్న భయం ఆయనను పట్టిపీడిస్తుంది. అందుచేత తండ్రి దగ్గరకువెళ్ళి ఆయనను ధర్మసంకటంలో పడవేసే కంటే ... ...

నేను ఆలోచించసాగాను. ఈ విశాల ప్రపంచంలో, జనసమూహంతో ఎంతో సందడిగా ఉన్నా ఒక్కొక్కసారి మనిషి ఒంటరిగానే మిగిలిపోతాడు. ఈ ప్రపంచంలో ఎంతో మంది ఉన్నా, నాకెవరూ లేరు. కేవలం నా చిన్నారి పురు తప్ప.

ఉదయమే దేవాలయానికి ఒక దయార్ధహృదయురాలైన స్త్రీ వచ్చింది. ఆమె నాగురించి అడిగింది. నన్ను ఓదారుస్తూ, ధైర్యం చెపుతూ తనతోపాటు ఇంటికి తీసుకు వెళ్ళింది. ఆమె చూపించిన మమతానురాగాలకు ఆనందంతో నాకళ్ళు చెమ్మగిల్లాయి. ఈ లోకంలో భగవంతుడు ఎవరిని ఏ అవతారంలో ఆదుకుంటాడో ఎవరికీ తెలియదు కదా! నన్ను చూచి ఆమె చెల్లెలే కన్నవారింటికి వచ్చినంతగా ఆనందపడింది.

నాలుగు రోజులు అలాగే ఆనందంగా గడచిపోయాయి. ముందు రాత్రి - ఆ భయంకరమైన రాత్రి అనుభవించిన కష్టాలకారణంగా, బహుశా పురుకి ఏమైనా జబ్బుచేస్తుందేమోనని భయపడుతూ, అలా జరగకూడదని కోరుకున్నాను. అలాగే పురుకి ఏమీ జరగలేదు. నేను ఉంటున్న ఊరు హస్తినాపురానికి అంతదూరం ఏమీ కాదు. అందుకే ఇక్కడ ఉండాలా, వద్దా! అని సందిగ్ధంలో పడ్డాను. కాని ఆ స్త్రీ ప్రేమ కారణంగా మా మనసులు కలిసాయి. ఆమె స్నేహబంధాన్ని ఎలా వదలుకోను?

ఐదవరాత్రి నాకు చాలా గాఢంగా నిద్రపట్టేసింది. నా ప్రక్కనే 'పురు' నన్ను ఆనుకొని పడుకొని ఉన్నాడు. సుఖస్వప్నాలకెరటాలలో నేను ఈదుకుంటూ ఆనందాన్ని అనుభవిస్తున్నాను. ఆ కలలో 'పురు' నా - నా - నా, అంటూ మహారాజుని పిలుస్తున్నాడు. తన చిన్ని - చిన్ని చేతులు చాచుతూ, ముందుకు ఉరుకుతున్నాడు, చివరికి తన రెండు చేతులూ మహారాజు మెడచుట్టూ వేసేసాడు.

అదే క్షణంలో నాకు మెలుకువ వచ్చేసింది. నామెడ చుట్టూ ఎవరివో చేతులు?

కాని, ఏదో విచిత్రమైనచేతుల స్పర్శ, మోటైన స్పర్శ, క్రిందకి పైకి నిమురుతున్న స్పర్శ ... వెంటనే కళ్ళు తెరిచిచూస్తే ... ఆ ఇంటి యజమాని యొక్క కళ్ళు కామవాంఛతో మెరుస్తూ కన్పించాయి. ఆ పాపిష్ఠి స్పర్శ, ఆ చూపులోని అర్థం గ్రహించాను. 'అక్కా' అని గట్టిగా అరిచాను. ఆ కేకకు అతను త్వరత్వరగా బయటికి వెళ్ళిపోతున్న చప్పుడు వినిపించింది. దీపం వెలిగించి చేత పట్టుకుని, ఆమె త్వర - త్వరగా నా గదిలోకి వచ్చింది. నా వీపుపై చేతితో నిమురుతూ, 'ఏమైందమ్మా?' అని అడిగింది. నేను గాభరాగా లేచి కూర్చున్నాను. ఏదో ఒంటిమీద నుండి చరచరా ప్రాకుకుంటూ వెళ్ళినట్లనిపించిందని చెప్పాను. ఆమె గట్టిగా తన భర్తను పిలిచింది. అప్పుడే నిద్ర నుండి లేచినట్లు నటిస్తూ కళ్ళు నులుముకుంటూ లోనికి వచ్చాడు. ఇద్దరూ చాలా సేపటివరకు దీపం పట్టుకుని మూలమూలలా వెదికారు. కాని, మనిషి రూపంలో ఉండే సర్పం, వాళ్ళకెలా కన్పిస్తుంది. ఏ పూర్వజన్మబంధమో! ఆ పూర్వజన్మ బంధరూపమైన సోదరిని చూసి నాకు జాలి అన్పించింది. విధి ఎంత కఠినమైనది? ఆ విధి, పూవులాంటి నా శరీరంతోపాటు ముళ్ళు అనే బాధలనికూడా జన్మతః జతకూర్చింది.

నేటివరకూ నేను నా సౌందర్యం రాజమందిరంలో సురక్షితంగా ఉన్నాయి, నేడు ఈ సౌందర్యం కారణంగా బయటి ప్రపంచంలో చాలా కష్టాలను ఎదుర్కోవలని ఉంటుందేమో! కేవలం 'పురు'ని కాపాడుకోవడమే కర్తవ్యంకాదు. నన్ను నేను రక్షించుకోవడంకూడా అవసరమేనని మనసులో నిశ్చయించుకున్నాను.

రెండో రోజు ఉదయాన్నే ఏదో నెపంతో అతికష్టంమీద ఆ సోదరి ఇంటి నుండి బయటపడ్డాను. అలా ఆమె నుండి విడిపోతున్నప్పుడు పదే - పదే వెను దిరిగి చూసాను. బహుశా, మరలా కలుసుకంటామో, లేదోనని, పదే - పదే ఆమెను చూడసాగాను. నాకళ్ళు చెమ్మగిల్లాయి. ఇలా కలుసుకోవడం, విడిపోవడమనే ఈ అద్భుత నాటకం పేరే జీవితమా?

ఒక్కొక్క గ్రామాన్ని దాటుకుంటూ సాగిపోతున్నాను. ఒంకర - టింకరదారిని కావాలనే ఎన్నుకుని ఆ దారి వెంట, గ్రామాల బయటిదారి గుండా ముందుకు సాగి పోతున్నాను. హస్తినాపురానికి వీలైనంత దూరంగా వెళ్ళిపోవాలని, ఏదైనా ఊరిలో ఉండవలసి వచ్చినా, ఒక్క రోజుకంటే ఎక్కువ సమయం ఉండకూడదని, అసలు

విషయాన్ని ఎవరికీ చెప్పకూడదని, ముఖ్యంగా నా గురించి ఎవరికీ తెలియ నీయకూడదని నిశ్చయించుకున్నాను. ఎవరైనా మరీ పట్టుబట్టి అడిగితే నన్ను - నా బిడ్డని విడిచిపెట్టి నాపతి హిమాలయాలకు వెళ్ళిపోయాడని ఆయనను వెతు క్కుంటూ వెళ్తున్నానని చెప్పేదాన్ని. అది విని కొందరు సానుభూతి వ్యక్తం చేసే వాళ్ళు. కొంతమంది చెవులు కొరుక్కుని ఎగతాళిగా మాట్లాడేవాళ్ళు.

ప్రయాణం కారణంగా పురు అలసిపోతాడేమోనని భయపడ్డాను. కాని, అలాంటి దేమీ జరగలేదు. 'పురు'కి ఒక్కొక్క ఊరు కొత్త - కొత్త ఆటవస్తువులా అన్పిం చేది. ప్రతిరోజూ, రోజుకొక కొత్త ఇల్లు, రక - రకాల పక్షులు, రంగు - రంగుల పూలు, కొత్త మనుషులు - పిల్లలు, కొత్త దేవాలయాలు చూస్తూ ఆనందపడేవాడు.

నెమ్మది - నెమ్మదిగా నేను హస్తినాపురం నుండి చాలా దూరం వెళ్ళి పోయాను. చాలా అలసిపోయాను. అందుకే ఈ ఊరిలో కొన్నిరోజులుంటే బాగుండునేమో అన్పించింది. ఒక ధనికురాలైన విధవరాలు మాకు ఆశ్రయ మిచ్చింది. ఆమె పట్టుబట్టి అడిగింది - 'ఎవరమ్మా నీవు? ఏ ఊరు మీది?' ఇంతకు మునుపు అందరికీ ఇచ్చే జవాబే ఆమెకు కూడా ఇచ్చాను. ఆమె అతి ప్రేమగా అన్నది - 'చంద్రబింబంలాంటి భార్యను వదలి సన్యాసుల్లో కలిసాడా నీ భర్త! ఏమిటో ఒక్కొక్కరి జీవితం అతి విచిత్రంగా ఉంటుంది!'

పగలంతా, పదే పదే నావైపు కన్నార్పకుండా చూస్తుండేది. నాకు అర్థం కాలేదు. ఇదంతా నా సౌందర్యం గురించిన ప్రశంసే. తప్పకుండా ఇందులో ఏదో ఆంతర్యం ఉంది అనుకున్నాను. నాకు అనుమానం కల్గింది. మనసంతా ఏదోలా ఉంది. రాత్రి మంచం మీద వాలాను. చాలా సేపటివరకూ నిద్రపట్టలేదు. ఆ సమయంలో, మహారాజుతో గడిపిన మధుర క్షణాలు గుర్తువచ్చాయి. ఆ మధుర స్మృతులు - పూలలోని సౌరభం అంతా వేరుచేసి ఒకచోట చేర్చినట్లు, ఒకదాని వెంట ఒకటి గుర్తుకు రాసాగాయి. చివరికి ఆ క్షణాలను వర్తమాన స్థితితో సరిపోల్చు కుంటే దుఃఖంకూడా ఉప్పొంగింది. చివరికి నెమ్మదిగా నిద్రలోకి జారుకున్నాను.

సగం సగం నిద్రతో సతమతమవుతుంటే ఇంతలో దీపపు వెలుతురుకు మళ్ళీ మెలకువ వచ్చింది. ఎవరో నా ముఖం దగ్గరగా దీపం పెట్టిచూస్తున్నట్లనిపించింది.

వెంటనే వెలుగు ఆరిపోయింది. నేను నగం మూసిన కన్నులతో పరీక్షగా చూడ సాగాను. ఆ ముసలిది ఎవరో యువకుడితో ఏదో మాట్లాడుతున్నది. నేను చెవులు రిక్కించి వినసాగాను. హస్తినాపురం, చాటింపు, పెద్దగా పారితోషికం మొదలైన పొడి - పొడి మాటలు, విషబిందువుల్లాంటి మాటలు వినిపించాయి. నా పై ప్రాణాలు పైనే పోయాయి.

అలా మాట్లాడుకుంటున్న వాళ్ళ మాటలు కాస్త గట్టిగా వినిపించాయి. ఆ యువకుడు అంటున్నాడు, 'లేదు! ఈమె శర్మిష్ఠ కాదు. శర్మిష్ఠ కావడానికి అవకాశంలేదు. ఆమె ముఖంలో రాజకుమారి కళ లేదే? నీకు పారితోషికం మీద దురాశ పుట్టింది! అందుకే ....'

ఇద్దరూ ఒకరితో ఒకరు దెబ్బలాడుకుంటూ బయటికి వెళ్ళిపోయారు. నా ప్రాణాలు ఎగిరిపోతున్నట్లనిపించింది. నన్ను అల్లుకుని పడుకుని ఉన్న పురు నా కన్నీటి చెమ్మకు మేల్కొన్నాడు. కాసేపటి తర్వాత, ఆ రాత్రికి - రాత్రే అక్కడి నుండి బయటపడ్డాను.

# అధ్యాయం 23

క్రూరమృగాల బారి నుండి తప్పించుకోడానికి భయంగా పరుగెత్తేలేడిలా నేను దాక్కుంటూ పెద్ద - పెద్ద గ్రామాల నుండి బయటపడుతూ, కేవలం రాత్రిపూట ఏదో దేవాలయంలోనో లేక ఏ సత్రంలోనో తలదాచుకుంటూ ప్రయాణం సాగిస్తూండేదాన్ని. ఎప్పుడైనా ఒకరోజు పూర్తిగా విశ్రమిద్దామన్నా భయంపట్టి పీడించేది. ఇన్నిరోజులూ ఎలాగో తప్పించుకుని బయటపడటానికి చేసిన ప్రయత్న మంతా వ్యర్థమవుతుంది. ఒక్కొక్కసారి అనిపిస్తుంది. ఈరోజు కాకపోతే రేపైనా మృత్యువు తప్పదు, దాని గురించి ఇన్ని కష్టాలు అనుభవించడం దేనికి? దీనికంటే అదే మంచిది. ఈ వెళ్ళడమేదో ఆ హస్తినాపురమే వెళ్ళి, దేవయాని ముందు ధైర్యంగా నిలబడి నీవు నా శిరచ్ఛేదం చేయాలనుకుంటున్నావు కదా? ఇదిగో నేను సిద్ధం! అనాలనిపించేది. కాని, వెంటనే నాఒడిలో నిద్రిస్తున్న 'పురు' ముఖంలో చిందించే చిరునవ్వుపై నా దృష్టి పడేది. అప్పుడు 'ఏం ఫరవాలేదు, ఒకవేళ దేవయాని నా శిరస్సు ఛేదించినాసరే కాని నా కుమారుడికి మాత్రం ఏమీ కాకూడదు!' - అని మనసులోనే సర్దిచెప్పుకునేదాన్ని.

ఈ 'పురు' గురించైనా నేను బ్రతకాలి. ఎన్నికష్టాలొచ్చినా సరే, 'పురు' పెరిగి పెద్దవాడయ్యేవరకూ నేను బ్రతికి ఉండాలి. ఉండితీరాలి. అప్పటివరకూ విష సాగారాన్నే మ్రింగవలసి వచ్చినా, ఆపదలతోకూడిన మేరుపర్వతాన్ని దాటవలసి వచ్చినా, సిద్ధపడవలసిందే.

నాలుగురోజులతర్వాత ఒక గ్రామంలో దేవాలయం దగ్గరకు వచ్చాను. పొద్దు పోయింది. అందుకే దేవాలయానికి ప్రక్కనే ఉన్న సత్రంలో ఆరాత్రి ఉండి పోదామనుకున్నాను. పక్కనే ఉన్న నూతి దగ్గర పురు కాళ్ళు చేతులు కడిగి,

మందిరం ముందుగాఉన్న మండపం మీద ఆడుకోడానికి వదిలివేసాను. బెదురు బెదురుగా ఇటూ - అటూ చూస్తూండిపోయాడు. వచ్చే - పోయే భక్తులు జేగంట మోగిస్తున్నారు. ఆ ధ్వనికి 'పురు' తన చిన్ని చేతులతో చప్పట్లు కొడుతున్నాడు. పదే - పదే గంటమోగడంచూచి, తనుకూడా మోగించాలనే కుతూహలంతో చేయి మీదికి జాపసాగాడు. నన్ను ఆ గంట ఉండే ప్రదేశం వైపు లాగుతున్నాడు. నేను ఒక స్థంభానికి చేరబడి విశ్రాంతి తీసుకుంటున్నాను. మొదట్లో నేను పట్టించుకోలేదు. వద్దని వారించాను కూడా. కాని చిన్న పిల్లల మొండిపట్టుదల ముందు తల్లి ఓడి పోవలసిందే! ఒక్కసారిగా రెండు చేతులతో గంట దగ్గరకు ఎత్తాను. కేరింతలు కొడుతూ తను గంటకొట్టడానికి చేతులు చాచాడో లేదో, ఇంతలో డప్పుమోతతో చాటింపు వినపడింది. చాటింపు వేసేవాడు గొంతు చించుకుని ఇలా చాటు తున్నాడు-

'వినండి - వినండహో! ఈ ప్రకటన వినండహో! హస్తినాపుర మహారాణి దేవయానీ దేవి రాజమందిరం నుండి ఒక అందమైన దాసి తప్పించుకు పారి పోయింది. ఆమె పేరు శర్మిష్ఠ. ఆ శర్మిష్ఠ దగ్గర ఒక చిన్న బాబుకూడా ఉంటాడు. ఈ దాసి వ్యభిచారిణి. ఆమెను, ఆమె బిడ్డతోసహా పట్టి అప్పగించినవారికి, మహారాణీ దేవయాని మంచి బహుమానమిస్తారు.....'

చాటింపు మొదటి మాటలు వినేసరికే నాకాళ్ళు గజగజావణకసాగాయి. పురుని నేను మీదకి ఎత్తిపట్టుకుని ఉన్నాను. నాచేతుల్లోంచి జారిక్రిందపడిపోతాడేమోనని భయం వేసింది. నాకు చాలాభయం వేసింది. ఒక్కసారిగా నేలకూలబడ్డాను.

చిన్నపిల్లలు, వారి లోకంలో వాళ్ళుంటారు. ఏ బెదురూ - బెంగా ఉండదు. ఎప్పుడూ ఆనందంగా ఆడుకుంటారు. అజ్ఞానంలోనే వాళ్ళకు ఎంతో ఆనందం ఉంటుంది. ఈ చాటింపులోని ఒక్క పదంకూడా పురుకు అర్థంకాదుకదా! అందుకే ఇంకా గంట మోగించాలనే ఆరాటపడుతున్నాడు. గంట మోగించాలనే కోరిక తీరక కాళ్ళుచేతులూ కొట్టుకుంటూ ఏడ్వడం మొదలు పెట్టాడు. నా చెవుల్లో అదే చాటింపు పదే - పదే మార్మోగుతున్నది. గుండె వేగంగా కొట్టుకుంటున్నది 'పురు' ఏడ్వడం చూసి ఒక నడివయసు వ్యక్తివచ్చి 'పిల్లవాడు ఏడుస్తున్నాడు! ఎందుకు ఊరుకో బెట్టడంలేదు? చూడవేం? ఇంతకీ తను ఏం కావాలంటాడు?' అంటూ వెంటనే అతను నన్ను అదే పనిగా చూడసాగాడు.

అతని చూపు, భీకరారణ్యంలో తను వేటాడబోయే జంతువుని ఆకలితో చూస్తున్న సింహంలా ఉంది. నేను ఏడుస్తూ పురుని ఎత్తుకుని సత్రంవైపు నడిచాను. కాస్త చీకటి పడగానే మరలా ప్రయాణం సాగించాను.

ఆ చాటింపు నన్ను చాలా సందిగ్ధావస్థలో పడేసింది. నలుగురూ గుమికూడే చోట, బజారులో, గుడిలో, సత్రం లాంటి ప్రదేశాలలో, సంచరించడం ఇంక మంచిదికాదనిపించింది. ఏమో, ఎవరికి తెలుసు, అనుమానంతోనైనా, ఎవరో ఒకరు నన్ను పట్టుకుని, బహుమానం కొరకు ఆశపడి దేవయానికి అప్పగించినా అప్పగించవచ్చు. ఆ చాటింపులో చెప్పిన స్త్రీని నేనుకాదు అని ఋజువు చేసేందుకు, ఇప్పుడు నేనొక కొత్త అవతారం ఎత్తాలి. పురుని ఎవరో పిల్లలులేని స్త్రీకి అప్పగిస్తే? కాని అంతలోనే ఈ ఆలోచనతో నా మనస్సు వికలమైపోయింది. నా పురుని నానుండి వేరుగా, దూరంగా ఉంచడమా? వద్దు! అలా ఎన్నటికి జరగ కూడదు. వత్తిలేకుండా దీపం ఎక్కడైనా వెలుగుతుందా? 'పురు' రెండు కళ్ళూ నాకు సూర్య - చంద్రులు. అతని కోమలమైన స్పర్శ నాకు సుదర్శన చక్రమంతటి రక్ష. వాడి ముద్దు నాకు కొండంత ధన - సంపత్తి. దాని ముందు కుబేరుని సంపత్తి కూడా తుచ్ఛమే. నిద్రలోవాడు నవ్వుతూంటే నాకు అర్ధరాత్రి సూర్యోదయమవు తున్నంత ఆనందం లభిస్తుంది. ఇంక నేను వాడి గురించే జీవించి ఉండాలి.

పురు కోసమే నేను అంత చీకటిలోనూ బయల్దేరాను. ఒక్క విషయంమాత్రం గట్టిగా నిర్ణయించుకున్నాను. ఇంకా ఏ ఊరిలోనూ, ఎవరి ఇంటి దగ్గరా ఉండ కూడదు. గ్రామం బయట, గుడిలోనో, ఏ కుటీరంలోనో, ఎక్కడో ఒక దగ్గర, ఇంకా అవసరమైతే ఏ మైదానంలోనో, నేలనే పడకగా జేసుకొని పడుకోవాలి. ప్రాణం పోయినాసరే ఈ నియమాన్ని పాటించితీరాలి అనుకున్నాను.

ఆ తర్వాత నాలుగైదు రోజులు ప్రశాంతంగా గడిచిపోయాయి. ఆ చాటింపు గురించిన జ్ఞాపకాలు మరుగున పడ్డాయి. కచుణ్ణి తలచుకుంటూ ధైర్యం తెచ్చుకో సాగాను. కచుడి ద్వారా ఇవ్వబడిన ఆ చీర నా సంచిలోనే ఉంది. ఈరోజు మొదటిసారి నేను దాన్ని మరలా కట్టు కున్నాను. ఆరోజు నేనొక నిర్జన ప్రదేశంలోని దేవాలయంలో మజిలీ చేసాను. ఆ దేవాలయానికి రెండోవైపు ఒక దట్టమైన అడవి ఉంది. కొంచెం సేపటి వరకూ చాలా భయపడ్డాను. అయినా

దుష్టులైన మనుష్యులకంటె ఈ క్రూరజంతువులే నయం అనుకొని, సరిపుచ్చు కొన్నాను. దేవాలయంలోని ఆరాధనా మూర్తికి ఎదురుగా అఖండదీపం వెలుగుతోంది. 'పురు'ని జోకొడుతూ నిద్రపుచ్చుతున్నాను. అప్పుడే ఎవరో బైరాగి గుళ్ళోకి వచ్చాడు. అతను తిన్నగా గర్భగుడివైపు వెళ్ళిపోయాడు. బహుశా నా ఒడిలో పడుకోబోతున్న పురు దృష్టి అతనిపై పడిందేమో, నా - నా - నా అంటూ లేచి కూర్చున్నాడు. భగవంతుని మూర్తి ముందు వంగిన ఆ బైరాగి లేచి నిలబడ్డాడు. అతని ఆకృతి చూసి నాకు ఆశ్చర్యం వేసింది. వెనుక నుండి అచ్చం అతను మహారాజులాగే కన్పిస్తున్నాడు. అప్పుడు నాకు ఆలోచన తట్టింది. 'పురు' అతన్ని ఎందుకు నా - నా - నా అనిపిలుస్తున్నాడో! మనిషి మనసు ఎంత దుర్బలమైనదో కదా! ఆశ కారణంగా మనిషి ఒక్కొక్క క్షణం పిచ్చివాడుగా మారిపోతాడు. ఆరోజు అశోకవనంలో నేనున్నప్పుడు మహారాజుగారు ఋషివేషం వేసుకుని వచ్చారుకదా! ఇప్పుడు కూడా బహుశా అదే వేషం వేసుకుని నన్ను వెదకడానికి రాలేదు కదా? ఇలా ఈ జీర్ణదేవాలయంలో ఈ భయంకరమైన అడవి ప్రదేశంలో మా పునః సమాగమం కావాలని - విధి ఆడే నాటకం కాదుకదా?

ఆ బైరాగి వెనుదిరిగి గబగబా అడుగులు వేసుకుంటూ నా ముందుగానే వెళ్ళి పోయాడు. అతన్ని పరిశీలించి చూసాను. అతను మహారాజుకాదు. మహారాజు ముఖంతో పోల్చిచూస్తే ముఖాకృతి వేరుగా ఉంది.

కాని ఎందుకో పురు మాత్రం నా - నా - నా అంటూ ఏడ్వడం మొదలు పెట్టాడు. అశోకవనంలో ఉన్నప్పుడు ఎప్పుడైనా పురు ఏడిస్తే మహారాజుగారి చిత్ర పటాన్ని చూపించి ఊరుకోబెట్టేదాన్ని. అది చూసి ఊరుకునే వాడు. కాని ఇక్కడ ...... మహారాజు యొక్క మూర్తి నా హృదయంలో అంకితం అయిపోయింది. కాని పురుని ఎలా ఓదార్చాలి?

దేవాలయం బయట చల్లగాలికైనా పురు త్వరగా పడుకుంటాడేమోనని, అలా బయటికి తీసుకువెళ్ళాను. వెన్నెల పిండారబోసినట్లు తెల్లగా ప్రకాశిస్తోంది.

దారి తప్పిన ఒక చిన్న పక్షి అరచుకుంటూ నా ముందు నుంచే వెళ్ళి పోయింది. అదిగో అటుచూడు - చూ(. - చూ(. ! అంటూ నేను ఆ పక్షివైపు వేలు ఎత్తిచూపించాను, పురుకి. పురు అది చూచి ఆనందంతో చప్పట్లు కొట్ట సాగాడు.

మరికొంచెం ముందుకి వెళ్ళాను. కాని ఆ పక్షి కన్పించలేదు. అయినా పురు ఆ పిట్టని చూపించమని మొండి పట్టుపట్టాడు. ముందుకు పదమన్నట్లు చేత్తో సైగ చేసాడు. ఒక చిన్నదారి గుండా అలా ముందుకు సాగిపోయాను. ఆ దారి చివర్లో ఏదో అడవిలత విరబూసింది. ఆ లతకు గోళ్ళ ఆకారంలో చిన్న - చిన్న సలిరంగు పూలు ఉన్నాయి. ఆ పూలగుత్తులు చాలా అందంగా ఉన్నాయి. రెండు గుత్తులు తుంచి పురుకిచ్చాను. వాటిని చేతిలో ఇటూ - అటూ ఆడిస్తూ చాలా సంబరపడిపోయాడు.

ఇప్పుడింకా ఆ వెన్నెల నన్నాకర్షించి నన్ను పిచ్చిదాన్ని చేసింది. చెట్లక్రింద ఎంతో సుందరమైన రంగవల్లులు గీచినట్లు అందంగా ఉంది. చెట్లకొమ్మలపైన ఆ వెన్నెల గులాబీ జలాన్ని చిలకరిస్తున్నది. హస్తినాపురం నుండి బయటపడిన తర్వాత నేటివరకూ ఎప్పుడూ కూడా సరదాగా పాడుకోవాలసిపించలేదు. అది కాకుండా, ఏపాటా గుర్తుకూడారాలేదు. కనీసం పల్లవి కూడా. కాని నేడు ఈ ఆహ్లాదకరమైన వాతావరణంలో అప్రయత్నంగా నా మనసులోంచి కూనిరాగాలు బయల్దేరాయి. ఏ మొగ్గఎప్పుడు వికసిస్తుందో ఎవరికి తెలుసు. నేను నా వర్తమాన పరిస్థితిని, ఎటువంటి సంకటస్థితిలో ఉన్నానో కూడా మరచిపోయి, నేనెక్కడు న్నానో, ఎక్కడికి వెళ్తున్నానో కూడా మరచిపోయాను. ఏదో రాగం ఆలాపిస్తూ అలా ముందుకు సాగిపోతున్నాను. మన్మథుడు, చంద్రునికి మిత్రుడని కవులు వర్ణిస్తుంటారు. ఈరోజు నాకు అలాగే అనిపించింది. ఈ వెన్నెలలో కూడా అదే మత్తు - ఉన్మాదం ఉంది - ప్రేయసీ - ప్రియుల కలయిక సమయంలోని ఉన్మత్త స్థితిలా!

ఆ దారి చాలా తిన్నగా ఉంది. చూస్తూండగానే ఆ దారిగుండా చివరి వరకూ వెళ్ళిపోయాను. ఇంక అటువైపు అడవిలేదు. ఎదురుగా ఒక పెద్ద శిల. తాబేలు ఆకారంలో ఉంది, దాన్నిచూసి ఆశ్చర్యపోయాను. దాని క్రిందగా ఒక పెద్దలోయలా ఉంది.

అటూ - ఇటూ చూసాను. ఎడం ప్రక్కకూడా అలాంటిదే ఇంకొక బండరాయి కాస్త ముందుకు సాగినట్లుగా ఉంది. బండమీద నిలబడి కిందకులోయలోకి చూసి భయపడిపోయాను. అయినా మరలా చూడాలనిపించిచంది. ఇంకా ఆ బండ చివరి

వరకూ వెళ్ళి అక్కడినుండి లోయలోకి తొంగిచూస్తే బాగుణ్ణనిపించింది. చిన్నప్పుడు ఇలాంటి సాహసమైన ఆటలు ఆడుకునేవాళ్ళం కదా!

ఈరోజు, వెన్నెల ఎంత ఆద్భుతంగా ఉందో అన్పించింది. వెన్నెలలో కన్పించే కనుచూపుమేర ప్రకృతి దృశ్యం అత్యంత అద్భుతంగా అపూర్వంగా ఉంది. తనివితీరా వెన్నెలను ఆస్వాదించాలనిపించింది. ఈ బండరాతి చివరికొన, తిన్నగా లోయవరకూ ముందుకు సాగి, లోయ ఉన్న ప్రదేశంవైపు వంగి ఉంది. అయితే ఏం? ఇందులో భయపడవలసిన పనేముంది? జీవితకాలమూ మృత్యువు వెంటబడి తిరుగుతున్నా, మానవుడు ఆనందాన్ని అనుభవించడం మానేస్తాడా? జీవితంలో అలాంటి శుభఘడియలు, మంచి క్షణాలు వచ్చినప్పుడు, మధుర రసానుభూతిని పొందుతున్నప్పుడు ఇతర విషయాల గురించి ఎందుకు ఆలోచించడం.

నేను మొండి పట్టుదలతో, ముందుకు వెళ్ళి దుస్సాహసం చేసాను - నెమ్మది నెమ్మదిగా ఆ బండరాతి చివరి కొనవరకూ వెళ్తున్నాను. అప్పుడే ఎవరో గట్టిగా కేక వేశారు. 'ఆగు, ఆగు', నేను తుళ్ళి పడ్డాను. అదృష్టవశాత్తు నేను ఇంకా అంత చివరి కొనవరకూ వెళ్ళలేదు. వెళ్ళే ఉంటే, అలా ఉలిక్కిపడినందుకు ........ నా చెవిలో 'ఆగు, ఆగు', అనే మాటలు ప్రతిధ్వనించాయి. వెంటనే వెనుదిరిగాను. కాని వెంటనే అచేతనంగా నిలబడిపోయాను! ఈ వెన్నెలరాత్రి వ్యామోహం మరలా నన్ను సంకటస్థితిలో ముంచేసింది. ఇప్పుడేం జరగనున్నదో కదా! అనుకున్నాను. నేను వచ్చిన దారినే గబగబా నడుచుకొని వెళ్ళిపోతే బావుణ్ణు అనిపించింది. 'ఆగు! ఆగు!' అనే ఆ ధ్వని ఏదో పురుషుని గొంతులా ఉంది. ఈ బండరాతి మీదగాని ఉంటే నన్ను పట్టుకోవడం అతనికిగాని, అతనితోపాటు వచ్చే అనుచరులకుగాని అంత కష్టమైన పనేమీకాదు. ఎలాగో ఇక్కడి నుండి తప్పించు కుని అడవిలో ఎక్కడో దాక్కుంటే ... ... ...

ఎవరో పురుషుడు నావైపే వస్తున్నాడు. ఆ ఆకారం కొద్ది - కొద్దిగా నాకు దగ్గరగా వస్తుంది. బహుశా ఎవరో బైరాగిలా ఉన్నాడు. ఉఫ్ ... ఇప్పుడిప్పుడే దేవాలయంలో ఎవరో బైరాగిని చూసాను. ఇతను ఇంకొక బైరాగేమో! అయితే ఇక్కడ దగ్గరలో ఏదో ఋషి ఆశ్రమం ఉండి ఉంటుందనిపించి కాస్త ధైర్యం

వచ్చింది. ఆ దుర్బలమైన ఆకారం సరాసరి నాకు దగ్గరగా వచ్చింది. వెన్నెల వెలుగులో అతని ముఖాన్ని స్పష్టంగా చూడగలిగాను. నా మనసు ఆశ అనే శిఖరంనుండి భయం అనే లోతైన లోయలోకి దొర్లిపడింది. ఆ తపస్వి ఎవరోకాదు - 'యతి'!

యతి వావైపు గుడ్లప్పగించి చూస్తున్నాడు. అతని ఆ చూపు కారణంగా చిన్న పిల్లాడి చేతిలో గిలగిలాకొట్టుకుంటున్న సీతాకోక చిలుకలా .నా పంచప్రాణాలు పైపైనే ఎగిరిపోయాయి. రాజసభలో ఆనాడు అతను పలికిన అసందర్భపుమ్మాటలు, అశోకవనంలో అతను చేసిన అత్యాచారం, అతని నారీద్వేషం - అన్నీ నాకు ఒక్కొక్కటిగా వరుసగా గుర్తుకు రాసాగాయి. ఇంక ఇక్కడ నన్నాదుకునే వాళ్ళెవరు న్నారు అన్పించగానే, శరీరమంతా చెమట పట్టేసింది. కాళ్ళు చేతులూ వణకసాగాయి.

అతను కూడా ఏదో దీర్ఘాలోచనలోపడినట్లున్నాడు. కొద్దిసేపటి తర్వాత అడిగాడు - 'ఇక్కడికెలా వచ్చావు, శర్మిష్ఠా'?- అతని కంఠంలో ఏదో ఆప్యాయత, కరుణ ప్రస్ఫుట మయ్యాయి. నాకు ఒక్కసారిగా దుఃఖముంచుకొచ్చింది, వెక్కి వెక్కి ఏడ్వసాగాను. అతనికి ఏమని చెప్పాలో నాకు అర్థంకాలేదు.

నేను అలా వెక్కి ఏడ్వడంచూసి అతను కూడా సందిగ్ధంలో పడ్డాడు. కాని వెంటనే నన్ను నేను సంభాళించుకున్నాను. నవ్వడానికి ప్రయత్నిస్తూ అన్నాను - 'కావాలనే నేను హస్తినాపురం విడిచి వచ్చేసాను'.

'కావాలని, ఇంత దూరమా?'

'ఆ(. , ఔను!'

'ఎందుకు? దేనికోసం?'

భుజంపై పడుకొని ఉన్న పురువైపు చూసి అన్నాను - 'పెదతండ్రికి, తమ్ముని కుమారుణ్ణి చూపించదామని. మీరు ఎలాగూ ఇతన్ని చూడ్డానికి హస్తినాపురం రాలేదు కదా! అందుకే నేనే స్వయంగా మీ కుల - దీపకుణ్ణి చూపించడానికి ఎందుకురాకూడదని వచ్చాను'.

నా ఈ భావావేశం కారణంగా మా ఇద్దరి మధ్య ఉన్న ఆ సందిగ్ధ అవస్థ తొలగిపోయింది.

యతి నా దగ్గరగా వచ్చి అడిగాడు - 'ఇతను మా యయాతి కుమారుడా?'

నేను దించిన తలఊపుతూ జవాబిచ్చాను - 'ఔను'. యతి పురుకు దగ్గరగా వచ్చి 'పురు' మేల్కొని ఉన్నాడో, నిదురిస్తున్నాడో చూసాడు. తర్వాత నవ్వుతూ 'పెదనాన్నకు ఈ చిన్ని 'పురు' ముద్దు దొరుకుతుందేమోనని చూసాను. కాని యువరాజు గారు మంచి నిద్రలో ఉన్నారే! పడుకోనీ, నా జీవితంలో ఇదే మొదటి ముద్దు. ఒక మంచి ముహూర్తంలోనే ఆ ముద్దు తీసుకోవాలి'.

నేను అవాక్కయి చూస్తూండిపోయాను. అతని మాటలువిని ఇతను యతేనా? లేక కచుడే యతిరూపంలో వచ్చాడా? అనిపించింది. ఆ ఉన్మత్త యతి, ఇతడేనా? అనిపించింది. ఆ పిచ్చి, ఉన్మాదానికి బదులు ఇలా సంస్కారవంతమైన ఆ మాటతీరు, ఆ స్నేహభావం, ఆ మమకారం -ఎక్కడినుండి ఎలా వచ్చాయి? ఇది చాలా విచిత్రంగా ఉందే? నిర్జనమైన ఎడారిలో సుందరమైన సరోవరం ఎక్కడనుండి ఉద్భవించింది?

యతితోపాటు అతనుండే ఆశ్రమం చేరుకున్నాను. అది అంగీరస ఋషి శిష్యులలో ఒక శిష్యుని ఆశ్రమం. ఆయన శిష్యులంతా ఇలాగే అక్కడక్కడా అడవులలో ఆశ్రమాలు నిర్మించుకొని ఉంటున్నారని అనుకుంటారు.

జీవితం అనుకూల పరిస్థితుల యజమానురాలా? ఈ క్షణంలో మాత్రం నాకు అలాగే అనిపిస్తుంది. దేవయానికి కచుడిచ్చిన బహుమానపు చీర పొరపాటున ఆరోజు నేను ధరించాను. మామూలుగా నిప్పు దానంతటదే ఆరి బూడిదైపోతుంది. కాని దేవయాని మాత్రం దానిని మరింత రగిల్చి భీషణ దావానలాన్నే సృష్టించింది. ఒక రాజకుమార్తెను తనకు దాసీగా చేసుకుంది. మహారాణి ఏ పిచ్చిపని కారణం గానో మహారాజు దాని జీవితంలో ప్రవేశించి ఇంత ప్రేమ భిక్షపెట్టి, నీ జీవితాంతం ఇదే సరిపెట్టుకో అన్నట్లు వదలివెళ్ళారు. అంతేకాకుండా ఉన్న ఊరు వదలిపెట్టి రావలసి వచ్చింది. ఈ లోకంలో ఎక్కడా ఆశ్రయం దొరక్క నిరాశ్రయురాలిగా ఉండవలసివచ్చింది. ఈ అభాగ్యురాలికి. అలాంటి ఈ దుస్థితిలో ఆశ్రయం

లభించింది. అదీ కూడా ఎవరి వద్ద? ఒక తపస్వి దగ్గర, ఎవరినైతే లోకమంతా పిచ్చివాడని వెలివేసిందో ఆ తపస్వి దగ్గర.

ఫలాహారం కానిచ్చిన తర్వాత పురుని ఆశ్రమంలో బాగా నిద్రపుచ్చి నేను బయటికి వచ్చాను. యతికూడా నాతోపాటు బయటికు వచ్చాడు. వచ్చి నాకెదురుగా ఒక రాయి మీద కూర్చున్నాడు. మామధ్య సంభాషణ ప్రారంభ మయింది. ఆ వెన్నెల రాత్రిలో నేను ఎరుపురంగు చీరకట్టుకుని ఉండటంచేత అతనికి స్పష్టంగా కన్పించాను. నేను ఆ బండమీద నుండి లోయలో పడిపోతా నేమో అని ఆదుర్ధగా అతను కేకవేశాడట.

నేను కూడా ఇంతవరకూ జరిగిన విషయమంతా దాచుకోకుండ చెప్పేశాను. కచుడు నన్ను సోదరిగా భావించి నాకు ఎలా ధైర్యం చెప్పాడో, అతను నన్ను దాస్యత్వంనుండి విముక్తి చేయడానికి దేవయానికి ఎంత నచ్చచెప్పాడో, ఆ విషయం తలచుకుంటే నా మనసు ఎంతో సంతృప్తితో నిండిపోయింది. మా ఇద్దరి మధ్య ఎలాంటి రక్తసంబంధం లేకపోయినా ఆ స్నేహ భావం, ఆ ప్రేమ, ఊహించ నంత మమకారం, అభిమానం గల వ్యక్తిదొరకడం నిజంగా నా అదృష్టం అని భావించి, ఆనందంతో కళ్ళు చెమ్మగిల్లాయి. వెంటనే కళ్ళు తుడుచుకుని కాసేపు చెప్పడం ఆపేసాను.

బహుశా, నా మాటలు విన్న తర్వాత యతికి తన గురించి కూడా చెప్పాలని పించిందేమో! అతను ఎంతో ప్రశాంతంగా చెప్పడం మొదలు పెట్టాడు. తన గురించి చెప్పేకథను - ఏ ఒక్క విషయం గూడా దాచకుండా, తను తన గురించే చెప్పుకుంటున్నాడన్న సంగతి మరచి, ఎవరో మూడవ వ్యక్తి గురించి చెప్పు తున్నట్లుగా - విశదంగా, ఏ మాత్రం దాపరికంలేకుండా చెపుతున్నాడు. అతను అశోకవనం నుండిపారిపోయేటప్పటికి అతని పరిస్థితి పిచ్చివాడిలాగే వుండేదనీ, అందుచేతనే అతను ఊరూరా తిరిగేవాడనీ, కాని అంగీరస మహర్షి శిష్యుల ఆశ్రమాలు ఎక్కడికక్కడే ఉన్నాయి. కచుడు అన్ని ఆశ్రమాలకూ నా గురించి - కబురు పంపించాడు - యతి ఎక్కడైనా ఎవరికైనా కన్పిస్తే అతన్ని భృగుపర్వతానికి పంపించివేయవలసిందని. ఉన్మాదస్థితిలో పట్టుబడ్డయతిని బుజ్జ గించి, నచ్చచెప్పి అంగీరస మహర్షి శిష్యులు కొందరు అతనిని కచుడిదగ్గరకు చేర్చారు. కచుడు, తన రక్తం పంచుకు పుట్టిన సోదరునిగా భావించి అతనికి సేవచేసాడు.

జీవితం గురించి తప్పుగా అర్థంచేసుకున్న కారణంగా యతికి, ఇల్లు - గృహస్తు జీవితం. దానివల్ల ఎదురైయ్యే కష్టాలను ఊహించుకుని. చిన్నతనం నుండి ఒకరకమైన భయం పట్టుకుంది. 'ఈ నహుషుని కుమారులు ఎన్నటికీ సుఖపడరు' - అనే శాపం వినగానే అతని మనసు వివశమైపోయింది. సుఖపడటానికి కావలసిన ఉపాయం వెతుక్కుంటూ అతను ఇల్లు విడిచి వెళ్ళిపోయాడు. తన తండ్రి నహుషుడు, ఇంద్రుని భార్యపై వ్యామోహితుడైనాడని, అందుకే అతనికి ఈశాపం అని తెలిసిన దగ్గరనుండి అతనికి స్త్రీ అన్నా, తీపిఫలం, తీపి పదార్థమన్నా, సుఖాన్నిచ్చే వస్తువు ఏదైనా సరే, అసహ్యం ఏర్పడింది. అంతేకాకుండా ఇలా సుఖ - భోగాలను విడిచిపెడితేనే ఆత్మసుఖం, ఆత్మశాంతి కలుగుతుందని అతను ఊహించుకుంటూ ఉండేవాడు. భగవత్ప్రాప్తి పొందుదామని ఇల్లువిడిచి వచ్చిన వాడు, లేనిపోని చిక్కుల్లోపడ్డాడు. మంత్రాలు - మాయలు, అద్భుతసిద్ధులు సంపాదిద్దామని వాటి గురించి కొన్నాళ్ళు సాధనచేసాడు. శుక్రాచార్యులు తపస్సు చేసి సంజీవనీ విద్యను సాధించారని తెలిసి, ఆత్మక్లేశం, దాని ద్వారా లభించే సిద్ధులకు అతను ఎన్నుకున్న మార్గం సరైనదే అన్పించిదతనికి. అతనికి స్నేహితు లెవరూ లేరు, శిష్యుడుకూడా, అతడు కావాలనుకునే, ప్రేమించే వ్యక్తి అతని జీవితంలో తారసిల్లలేదు. మహాసుడిగాలిలో చిక్కుకున్న ఆకు ఆకాశంలో సుడులు తిరుగుతూ పైపైకి ఎగిరిపోతూ ఉంటుంది. నేను ఆకాశంలో పైకి, చాలాపైకి ఎగిరి పోతున్నానని ఆ ఆకు అనుకుంటుంది. ఇంక స్వర్గం రెండడుగుల దూరంలోనే ఉంది అని అనుకుటుంది. ఆ ఆకులాగే ఈ యతి జీవితంకూడా సాగిపోయింది.

'సుడిగాలి' ఆకు, మొదలైన పదాలు యతి నోటితోనే విన్నాను. అతను ఇంకా ఏదో చెప్పుకుపోతున్నాడు. హిమాలయాలపై మంచు ఎక్కువగా కరిగిపోతే గంగానదికి వరద వస్తుంది కదా? ఇప్పుడు యతి పరిస్థితి అలాగే ఉంది. అతను చెప్పిన విషయాలన్నీ నాకు పూర్తిగా జ్ఞాపకం లేవు. కాని అతను చెప్పిన ఒక్కొక్క విషయం వెనుక అనుభవం ఉంది. అందుకే వాటిని జీవితంలో ఎప్పటికీ గుర్తుంచు కోవలసిందేననిపించాయి. కాని, అతను చెప్పిన విషయాలు కేవలం స్మృతి గానే మిగిలిపోయాయి - గాలిలో వ్యాపించిన దివ్య సుంగంధంలా, ఆ స్మృతి, ఆకాశంలో తళుకు తళుకున మెరిసే మెరుపులా ఆ స్మృతికూడా జీవితంలో ఎంతో స్ఫూర్తినిచ్చేదిగా ఉంది.

భృగుపర్వతంపై రాజమాత ఉంది. ఆమె పరిరక్షణలో యతి కాస్తకుదుట పడ్డాడు. కచుడు కూడ అతని మనసును స్థిరంగా ఉంచటానికి చాలా ప్రయాస పడ్డాడు. యతికి కచునికి మధ్య గంటలకొద్దీ ఏదో విషయంపై చర్చ జరుగు తుండేది. ఇలా చర్చించుకోవడం కారణంగా జీవితానికి సంబంధించిన సువర్ణభాగం అతనికి దొరికింది. అతను కచునితో చర్చించిన అనేకమైన వేదాంత విషయాలు గురించి, ఆ వెన్నెలరాత్రిలో నాతో చెప్పాడు. వాటిలో కొన్ని ఇప్పటికీ గుర్తు న్నాయి. కాని ఒక క్రమంలో చెప్పలేను. అక్కడక్కడి విషయాలు చెప్పుతున్నాను.

యతి ఇలా చెప్పాడు - 'శరీరం, ఆత్మ ఒకదానికొకటి శత్రువులు కాదు, అవి ఒకే రథానికి ఇరుప్రక్కలా ఉండే రెండు చక్రాలు. ఇందులో ఏ ఒక్క చక్రం విరిగి పడిపోయినా ఆ భారమంతా రెండో చక్రం మీదపడుతుంది. అందువలన ఆ రథం సమతౌల్యాన్ని కోల్పోతుంది. ఆత్మోన్నతికి దేహాన్ని కష్టపెట్టడంగాని లేక శరీరాన్ని సుఖపెట్టడానికి ఆత్మవంచన చేసుకోవడంగాని, రెండూ తప్పే. పరమాత్మ ద్వారా నిర్మితమైన ప్రకృతిలో వివిధ సుందర వస్తువులు - అపవిత్రం లేదా అస్పృశ్యం ఎలా అవుతాయి? స్త్రీ - పురుషుల సంబంధం - శరీరం - ఆత్మల సంబంధం లాంటిదే! ఒకరి నొకరు ద్వేషించుకోకుండా, అమితమైన ప్రేమతో, అంటే తన్ను తాను మరచిపోగలిగేటంత ప్రేమ - అనురాగంతో మసలుకొని, గృహస్థ జీవితంలో స్వర్గసుఖాన్ని ఇరువురూ పొందుతారు. అందుకే మన భారతీయ సంప్రదాయంలో భార్య - భర్తలు యజ్ఞనిర్వహణకు అర్హులుగాను, పవిత్రులుగాను భావించబడతారు. మనుష్య జాతిలో అందరికీ ఈ విషయం వర్తిస్తుంది. శుక్రాచార్యులు, కచుడు, యతి లాంటి తాపసులు లోక కళ్యాణాన్ని కాంక్షిస్తూ ఉండాలి. ఇంద్రుడు, వృషపర్వ మహారాజు, యయాతి మహారాజు మొదలైన గొప్ప - గొప్ప రాజులు తమ ప్రజల్ని సుఖపెట్టాలనే ప్రయత్నం చేస్తూ ఉండాలి, గృహస్థ జీవితం గడిపే సాధారణ ప్రజలతా, తమ భార్య, పిల్లలూ, స్నేహితులూ తమకు కావలసినవారందరి క్షేమం కోరుతూ ఉండాలి. అయితే తమ సుఖం ఈ ప్రపంచంలో ఎవ్వరికీ దుఃఖకారణం కాకుండా చూసుకోవాలి. వ్యక్తిధర్మం, గృహస్థధర్మం, రాజధర్మం, యతిధర్మం అందరి యోగ్యతా ఒక్కలాంటిదే. ఇందులో తేడా ఏమీలేదు. ఇందులో ఏ ఒక్క ధర్మానికి కూడా జీవితాన్ని అసహ్యించుకొనే అధికారంగాని, మౌలిక సూత్రాలను ఉల్లంఘించే అధికారం గాని లేదు. స్వధర్మాన్ని విస్మరించడం పాపం. అందుచేత

ప్రతి వ్యక్తి, తను నిర్వర్తించవలసిన ధర్మం ఏమిటో తెలుసుకొని దానిని ఆచరించడం ఉత్తమం. కాని 'ఏ వ్యక్తికూడా యతి నుండి పతి వరకు తన విధిని, తన ధర్మాన్ని నిర్వర్తించేటప్పుడు అన్ని ధర్మాలకు, ప్రేమ ఒక్కటే సర్వాధికారి అన్న విషయాన్ని గుర్తుంచుకోవాలి'.

ఈ విషయాలన్నీ వింటుంటే, కచుని గొప్పతనం తలచుకొని అతనియెడల మరీ అభిమానం పెరిగిపోయింది. దేవయాని ఎంత దురదృష్టవంతురాలో! భూమి - స్వర్గాల మధ్య సేతువులాంటి స్వభావం గలిగిన కచుని శ్రేష్ఠమైన ప్రేమ దొరి కింది, కాని అలాంటిమనిషికి ఆమె శాపమిచ్చింది. వాకిట మొలచిన కల్పతరువును ఆమె చేతులారా తుంచేసింది.

నా ఎదుట ఒకే ప్రశ్న - పురుని తీసుకొని ఎక్కడికి వెళ్ళాలి? యతి ఈ నా ప్రశ్నకు పరిష్కారం చూపించాడు. 'హిమాలయ ప్రాంతంలో నాకు తెలిసిన కొండ జాతివాళ్ళు చాలా మంది ఉన్నారు. వాళ్ళు చాలా పరాక్రమవంతులు, సత్యనిష్ఠకలవాళ్ళు. ఎవరైనా ఒకసారి తనవారని, తమతో సమానంగా చూసు కుంటామని చెపుతారో, వారి గురించి తమ ప్రాణలివ్వడానికైనా సిద్ధపడతారు. వాళ్ళతో నేను చాలా సంవత్సరాలు గడిపాను. నా మంత్ర - తంత్రాలమీద వారికి చాలా నమ్మకం. అందుచేత నేనంటే వారికి ఎంతో భక్తి భావం కూడా. వాళ్ళు నిన్ను - పురుని తమ ప్రాణంలా చూసుకుంటారు' - అని చెప్పాడు.

కాని నా మనసులో ఉద్దేశ్యం వేరుగా ఉంది. హిమాలయ ప్రాంతంలోనే ఎక్కడో ఒక చిన్న కుటీరం వేసుకుని మా ముగ్గురమూ ఉంటే బాగుండేది. ఇంత వరకూ శారీరకంగా ఎన్నో కష్టాలు అనుభవించిన బావగారి సేవ చేసుకునే అవకాశం కలుగుతుంది. చివరికి అదే మాట ధైర్యంచేసి అతనితో అన్నాను కూడా. యతి నవ్వుతూ అన్నాడు - 'లేదు శర్మిష్ఠా ఇది సంభవంకాదు! కచుడు ఒక ఉగ్ర తపస్సుకు ఉపక్రమిస్తున్నాడు. అలాంటి సమయంలో.....'

నేను మధ్యలో కల్పించుకుని అడిగాను - 'కచుడు ఉగ్రతపస్సు చేయ బూనాడా? ఎందుకు?'

'శుక్రాచార్యులు కూడా అక్కడ అలాంటితపస్సు ప్రారంభించారు కదా, అందుకే!'

'గురువు ఏది చేస్తే శిష్యుడు కూడా అదే చేయాలని శాస్త్రంలో చెప్ప బడిందా?' అని నవ్వుతూ అడిగాను.

యతి గంభీరంగా అన్నాడు - 'కచుడు వాస్తవానికి ఒక ఆదర్శ పురుషుడు, అతనికి అసూయ అనేదే లేదు, కీర్తికాంక్ష అసలేలేదు. దేవగురువు అవుదామనే కోరిక కూడా లేదు. కాని అక్కడ శుక్రాచార్యులు ఒక మహత్వాకాంక్షతో మరలా ఒక క్రొత్త విద్యను, సంజీవని విద్యకంటే గొప్ప విద్యను పొందాలనే సంకల్పంతో, దానవులను మరలా దేవతలకంటే శక్తి వంతులుగా చేయాలని తపస్సు చేస్తున్నారు'.

నేను వృషపర్వమహారాజు పుత్రికను. ఆ కారణంగా నేను ఆ విషయం విని ఆనందించాలి. శుక్రాచార్యుల తపఃఫలం దానవరాజుకు వారి ప్రజలకు చెందు తుందనీ, అడిగాను - 'శుక్రాచార్యులు ఇప్పుడు ఎలాంటి విద్యను పొందాలని తపస్సు చేస్తున్నారు?'

'సంజీవని విద్యతో మృతులైన వారిని మరలా బ్రతికించవచ్చు. కాని ఇప్పుడు ఆయన కోరుకునే విద్యవేరు. మంత్రబలంతో బ్రతికున్న వారిని చంపేశక్తిగల విద్య'.

'కచుడు కూడా ఈ విద్యను కోరుకునే, తపస్సు చేయబోతున్నాడా?'

'ఈ విషయం గురించే అతను చాలా బాధపడుతున్నాడు. తాపసులు, వినాశం కోరుకునే విద్యను పొందాలని ఆశించకూడదు. కాని శుక్రాచార్యుల విధ్వంసక శక్తిని ఎదుర్కోవాలంటే మరో విధ్వంసక శక్తిచేతనే అది సాధ్యమవు తుంది. వేరొక మార్గంలేదు. అందుకే కచుడు కూడా ఘోర తపస్సును ఆచరించ బోతున్నాడు. ఈ తపస్సుకు ఎన్ని సంవత్సరాలు పడుతుందో కూడా చెప్పలేము. కాని అతని తపస్సుతోపాటు మా గురువుగారి శిష్యులందరమూ తన మిత్రుడిగా విశ్వ శాంతికొరకు యథాశక్తి తపస్సు చేయాలి. ఇదే అసలైన యతి ధర్మం. అందుకే నా విధిని నేను నిర్వర్తించాలనుకుంటున్నాను'.

అలా అంటే ఇంక నేనేమి చెప్పగలను? కాని ఒక విషయం నా మనసులో మెదిలింది. నేనొక స్త్రీని, తల్లిని, నా మనసెప్పుడూ సాంసారిక బంధంవైపు, సంతానం వైపు మాత్రమే లగ్నమయి ఉంటుంది. కచుడు - యతి అంటే వాళ్ళు పురుషులు. ఇల్లే ఇల్లాలికి స్వర్గం. కాని కచుడులాంటి విశ్వశ్రేయోభిలాషికి ఈ ప్రపంచంమంతా తన ఇల్లే.

రెండో రోజు ఉదయం నేను యతితోపాటు బయల్దేరాను. కొన్నిరోజులకు హిమాలయ ప్రాంతానికి చేరుకున్నాము. పురు అయితే ఆ హిమాలయ పర్వతాలు చూసి ఆనందంతో ముందుకు ఉరకసాగాడు. నాకు ఆ ప్రాంతం కొత్తగా అన్పించ కుండా ఉండేందుకు కావలసిన ఏర్పాట్లన్నీ యతి చేసాడు. అతను వెళ్ళిపోవడానికి సిద్ధమవగా, పురుని అతని పాదాలవద్ద ఉంచి, ఇలా అన్నాను. 'మళ్ళీ మీ దర్శన భాగ్యం ఎప్పుడు కల్గుతుంది?' అతను నవ్వుతూ అన్నాడు, 'ఎప్పుడు? అది ఆ పరమాత్ముడికే ఎరుక?'

యతి అలా అనగానే నా హృదయం కంపించింది. నేను వెంటనే అతనితో అన్నాను - 'ఈ అభాగ్యురాలికి ఆశాజ్యోతియైన ఈ పురుని ఆశీర్వదించండి' అతను పురుని ఎత్తుకున్నాడు, అతని తలపై జుత్తుని నిమురుతూ, నా వైపు తిరిగి అన్నాడు - 'చూడమ్మా, నీవేమీ దిగులు పడకు. నీ పురు ఇప్పుడు వనవాసిగా ఉండవచ్చు, కాని రేపు ఇతడే హస్తినాపుర సింహాసనాన్ని అధిష్ఠిస్తాడు'.

# అధ్యాయం 24

శుక్లపక్ష చంద్రునిలా పురు దిన - దిన ప్రవర్ధమానంగా పెరుగుతూ కాస్త పెద్ద వాడయ్యాడు. చాలా అల్లరి పిల్లాడు సుమా! వాడికి చెప్పి చెప్పి విసుగు వచ్చేస్తుంది. కాని ఆ అడవి ప్రాంతంలో నా సేవకు చాలామంది ఉన్నారు. యతి దయవల్ల నేనక్కడ వనరాణిలా జీవిస్తున్నాను. నా చుట్టూఉన్న పరిజనం నాకుగాని, నా పురుకిగాని ఎలాంటి కష్టం లేకుండా చూసుకుంటున్నారు. అడుగులకు మడుగులొత్తి సేవచేస్తున్నారు.

'పురు' కొంచెం - కొంచెం మాటలాడసాగాడు. వాడి ముద్దు ముద్దు మాటలు విని నాకు చాలా ఆనందం కలిగేది. పురు చిన్న విల్లు - బాణం పట్టుకుని లక్ష్యం వైపు గురిపెట్టివదిలేవాడు. అతని ఆ చిన్న బాణం సరిగ్గా దేనిపైగురి పెట్టివదిలేవాడో దానికే తగిలేది. నాకు అది చూసి చాలా సంతోషం కలిగేది. పురు మరి కొంచెం ఎదిగాడు. క్రోసు - క్రోసున్నర దూరంలో ఉండే ఒక ఋషి ఆశ్రమానికి వేదాధ్యయ నానికి పంపించే దాన్ని.

నాతోపాటు నా బిడ్డ పెద్దవాడు కాసాగాడు. అతను స్వతంత్రంగా సంచరి స్తుంటే పురు నావాడని నాకు చాలాగర్వంగా ఉండేది. పురు నా ఒక్కదాని స్వంతం. అలా ఒక్కొటొక్కటిగా చాలాఏళ్ళు గడచిపోయాయి. పురు పది సంవత్సరాల వయసు వాడయ్యాడు. ఇప్పుడు అతని పరాక్రమంచూసి గర్వపడుతున్నాను. కాని అతని సాహసంచూసి భయపడేదాన్ని.

తల్లి మనసు ఎంత పిచ్చిదోకదా! ఒకవైపు, నా పురు వేగంగా పెద్దవాడుగా గొప్ప పేరు సంపాదించాలనీ, గొప్ప పరాక్రమం చూపించాలనీ, ప్రపంచాన్ని జయించే వీరునిగా తిరిగి రావాలనీ, మరోవైపు నా చిన్నారి బిడ్డ ఎప్పుడూ చిన్నారి

గానే నాతోడుగా. నానీడలోనే పెరగాలనీ, మృత్యువుకూడా అతని దరిదాపులకు రాకూడదనీ! ఏవేవో ఆలోచనలు, ఒక్కొక్కసారి వేటకు వెళ్ళిన 'పురు' తిరిగి రావడం కాస్త ఆలస్యమైతే నాకు చాలా భయంగా ఉండేది. మనసులో ఏవేవో అమంగళప్రదమైన ఆలోచనలు మెదిలేవి. లోకంలోని దేవతలందరికీ మొక్కుకునే దాన్ని, కుటీర ద్వారం దగ్గర నిలబడి కళ్ళల్లో వత్తులు వేసుకుని 'పురు' రాక గురించి ఎదురు చూస్తూండేదానిని. 'పురు' కన్పించగానే మరలా మనస్సు ప్రశాంతంగా ఉండేది. అతను తెచ్చిన పెద్ద పెద్ద వేట జంతువుల్ని చూసి నాకే ఆశ్చర్యం వేసేది. నేను కలగనటం లేదుకదా? అనిపించేది. పురు చిన్ని - చిన్ని పిడికిళ్ళు నాకళ్ళముందు నాట్యం చేస్తుంటాయి. ఎంత చమత్కారమో - ఈ చిన్న విల్లు - బాణంతో చంపిన వేట జంతువేనా ఇది అన్పిస్తుండేది. చిన్నప్పుడు గోడ మీద తన నీడను చూసి జడసుకునే ఆ పురుయేనా వాడు అనిపించేది. వీడు ఇప్పుడు భయంకరమైన అడవిలోకి వెళ్ళి ఎంతో ధైర్యంగా జంతువులను వేటాడగల్గుతున్నాడే!

ఏ నది అయినా తన జన్మస్థానంలో చిన్నధారగానే పుడుతుంది. అది కొండలపై నుండి కిందికి ఉరికి, సమతల ప్రదేశాలలో ప్రవహిస్తుంది. అప్పుడది వ్యాపించి ప్రవహిస్తుంది. వంకరలు తిరుగుతూ ప్రవహిస్తుంది. మధ్యలో మరికొన్ని చిన్న నదులు వచ్చి ఆ ప్రవాహంలో కలుస్తాయి. అప్పుడు ఆ నది మరింత పెద్ద దిగా ప్రవహిస్తుంది. పురు కూడా అలాగే పెద్దవాడయ్యాడు. ఈ వనప్రాంతంలో ఎందరినో తన మిత్రులుగా చేసుకున్నాడు. ఒకడు ఋషి కుమారుడైతే, ఇంకొకడు వనవాసి, ఇలా ఎంతోమంది స్నేహితులు. ఇక్కడ జరిగే ఉత్సవాలు వినోదాలు, సుఖ - దుఃఖాలు అన్నీ కలబోసుకున్న జీవిత విధానమంతా బాగా నచ్చింది పురుకి.

ఇప్పుడు నా మనసు కాస్త విచిత్రంగా ఆలోచిస్తుంది. పురు నా దగ్గరే ఉన్నాడు. తొమ్మిదో నెల్లో నా గర్భంలో ఉన్నంత దగ్గరగా ఉన్నాడు! మరుక్షణమే అన్పిస్తుంది. లేదు! ఇది కేవలం నా భ్రమ. అతను నా నుండి దూరమౌతున్నాడు. ఆకాశంలో, రెక్కలు విచ్చుకుని విహరించే పక్షికి, పక్షిగూటికి ఉన్నంతదూరం, ఇప్పుడు నాకు నా పురుకి మధ్య ఉన్నట్లుంది. వాడి లోకం వేరుగా ఉంది. వాడి ధోరణి వేరు. ఈలోకం గురించి పూర్తిగా అవగాహన చేసుకున్నాక ఈ అభాగ్యురాలైన తల్లిని చూస్తాడా? లేక ...... ......

ఇలాంటి పిచ్చి ఆలోచనలతో మనసు ఒక్కసారిగా ఉదాసీనంగా మారి పోతుంది. పురు చాలా ప్రేమగా అడుగుతాడు - 'అమ్మా, నీకేమైంది? ఎందుకలా విచారంగా ఉన్నావు?' ఈ ప్రశ్నకు నాదగ్గర జవాబులేదు. మనిషి అంతరాత్మతో ఏకాంతంగా చర్చించుకోవడం ప్రకృతి నియమమేమో? నేను, తల్లిదండ్రుల నుండి దూరమైపోయాను. భర్తకు దూరమయ్యాను. నా భవిష్యత్తు గురించి భయపడ సాగాను.

ఇలా ఎప్పుడు మనసు బాగా లేకపోయినా, కుటీరంలో నుండి బయటికివచ్చి, మంచుతో నిండిన ఆ హిమశిఖరాలను చూసి వాటితో మాటలాడుతూ గంటలు కొద్దీకాలం గడిపేస్తాను. ఆకాశాన్నంటే ఆ ఉన్నతశిఖరాలను చూసినప్పుడు అవి నాకు ధైర్యం చెప్పుతున్నట్లనిపిస్తుంది. ఈ పరిసర ప్రాంతంలోనే పార్వతి తపస్సు చేసింది. ఇది పుణ్యభూమి. ఈ నా వనవాసంకూడా అలాంటి తపస్సులాంటిదే. ఈ తపస్సు ఎన్నటికీ వ్యర్థంకాదు. ఆ పరమశివుని దయవలన అంతా సవ్యంగానే జరుగుతుందని ఆ పవిత్ర హిమాలయాలను చూసినప్పుడు నాకనిపించేది.

ఒక్క హిమాలయాలేకాదు, అడవిలోని ప్రతివస్తువు నాకు ధైర్యాన్ని, స్ఫూర్తిని ఇస్తున్నాయి. జీవితపు అంతిమ సత్యమేమిటో నాకు తెలియచెప్పుతున్నాయి. తలలపై మొగ్గలు పూలుగా వికసిస్తాయి. రంగు - రంగులుగా సుగంధం వెదజల్లే ఆ పూలు ఒకరోజు వాడి రాలిపోతాయి. వాడిపోయినా, వాడిపోతూ కూడా అవి ఆనందంగా నవ్వుకుంటున్నాయేమో అన్పిస్తుందినాకు. నా యౌవనంకూడా ఈ పూలలా, ఈ వనవాస జీవితంలో వాడిపోనున్నదని నేను భయపడతూంటే ఈ పూలు నవ్వుతూ అంటాయి - 'ఎంత పిచ్చిదానివి, శర్మిష్ఠా! ఇది సృష్టి నియమం, ఈరోజు వికసించినది, రేపటికి వాడిపోవలిసిందే! లతలపై ఎన్ని పూలు పూస్తాయో అవన్నీ అక్కడే వాడిపోతాయి. అయినా మేమెప్పుడైనా దుఃఖించామా? జీవితంలో సుఖపడాలనుకుంటే అవకాశం వచ్చినప్పుడు దాన్ని అనుభవించడమే, అందులోని ఆనందాన్ని, మాధుర్యాన్ని, రసాన్ని, సుగంధాన్ని అనుభవించడమే!'

కలకలమని ప్రవహించేనది కూడా నన్ను ఓదారుస్తుంది. వర్షఋతువులో ఆ నది గంభీరతను, ఉన్మాదాన్ని చూసి నాకు అన్పించేది - యౌవనం కేవలం వరం మాత్రమేకాదు, శాపంకూడా, యౌవన - ఉద్వేగంలో మనిషి ఎంత కావరంతో ప్రవర్తి

స్తాడో, సుఖాన్ని వెతుక్కుంటూ, చిక్కుల్లో చిక్కుకుని అధఃపాతాళానికి చొచ్చుకు పోతాడు. అలా వెతుక్కుంటూ పరుగెత్తేటప్పుడు ఎన్ని శుభకరమైన, మృదువైన వస్తువులను పాదాలతో త్రొక్కి, నలిపివేస్తాడో ఎవరికీ తెలియదు.

ఈ వనవాసంలో ఉంటూ నేను ఇంకొక విషయం - ఋషి - మునులు ఎందుకు అడవిలో తపస్సు చేస్తారో - కూడా గ్రహించాను. ప్రకృతి - మనిషి సంబంధం అనాది కాలం నాటిది, అనంతమైనదికూడా. ఈ రెండూ కవలల వంటివి. అందుకే ప్రకృతి సన్నిధిలో జీవితం తన నిజాలను వెలికి తీసుకొనివచ్చి ప్రస్ఫుటమవుతుంది. జీవితం ఎలా గడపాలోకూడా తెలుస్తుంది. జీవితంలో పాటించవలసిన సరియైన మర్యాద - మన్ననలు ఏమిటో కూడా - తెలిసివస్తుంది. ప్రకృతికి దూరంగా బ్రతికే మనిషి జీవితం ఏకపక్షంగా ఉంటుంది. ఆ కృత్రిమ జీవితంలో, అతని కల్పనలు, ఆలోచనలు, భావాలు, కోరికలు, అన్ని అవాస్తవిక మైనవిగా, వికృతమైనవిగా కన్పిస్తాయి. నిజంగా ఇది నా అదృష్టమే, నిర్భాగ్యురాల నైయుండికూడా ఇక్కడికి వచ్చి జీవితంయొక్క వాస్తవిక సత్యాన్ని దర్శించగలిగాను.

కాని మనసు ఎప్పుడూ కూడా ఇలా ఆలోచించ తగినదిగా ఉండదు. నేనొక విరహిణిని. నాలో నేనే ప్రశ్నించుకుంటాను - చిరకాలంగా భర్తనుండి వియోగం అనుభవిస్తున్న భార్యను, అలాంటి నాకు ఈ ఆభరణాలు, అలంకారాలు ఎందుకు? ఎవరికోసం? అయినా ఒక్కొక్కసారి అలంకరించుకోవాలన్పిస్తుంది. అక్కడ విరబూసిన రంగు రంగుల రూపాలన్నీ నాతో ఇలా అంటున్నాయి - 'ఓసి పిచ్చిదానా, మేము నీ గురించే వికసించేది. నీవు సింగారించుకోవడానికే మేము జన్మించేది. మానుండి అలా దూరం దూరంగా పారిపోతావేం?' అప్పుడు మహారాజు గుర్తుకు వచ్చి విరహవేదనను అనుభవించేదాన్ని. ఇలాగే, అశోకవనంలో ఉండేటప్పుడు కూడా. చక్కగా అలంకరించుకుని మహారాజు గురించి నిరీక్షించే దాన్ని. ఆ మధుర స్మృతులు నా మనసును తొలిచివేస్తున్నాయి. పగలంతా ఏమీ తోచేదికాదు. రాత్రిపూట అలా పచ్చికపై శయనిస్తే, మానసికమైన విరహవేదన. ఈ విరహాగ్నితో, శరీరం మరీ వెడెక్కిపోయేది. యతికి, అనేకమైన సిద్ధులు ప్రాప్తించి నట్లుంది. నేను కూడా ఆ సిద్ధులను ఎలా పొందడమో తెలుసుకొని ఉండ వలసింది. మహారాజు నోటితో ఒక్కమాట - 'శమా' అనే ఒక్క పిలుపు ఈ పర్ణ శాలలో రోజుకి ఒక్కసారి వినగలిగినట్లయితే, ఆ అనుభూతి

ముందు నాకు స్వర్గం సుఖంకూడా తీసికట్టే. ఆయన స్పర్శ ఒక్కసారి - ఆప్యాయంగా ఆయన చేతిముని వేళ్ళను నా కురులలో జొప్పించి గోముగా నిమిరితే ..... చాలు, ఆ మాత్రం స్పర్శ లభిస్తే చాలు....

మనసులోని ఈ మాయదారి ఆటను ఆపివేయాలని శతవిధాల ప్రయత్నించాను. యతి, కచుల వైరాగ్యాన్ని గుర్తుకు తెచ్చుకుని, కామపీడిత మనస్సుని అదుపుచేయాలని ఎంత ప్రయత్నించినా, అన్నీ తెంచుకుని పరుగులు పెట్టే పశువులా, మనసు పరుగులుతీసేది. ఏ విధంగా ప్రయత్నించినా మనసు వశంలోకి రావడంలేదు. వాయువేగంతో గెంతుతూ - పరుగెడుతూ హస్తినాపురంవైపు, ఆ పిమ్మట అశోకవనంలోని భవనంవైపు వెళుతోంది మనసు. అక్కడ మహారాజు గురించి సారంగ మార్గం నిరీక్షించేది. లేదు, మనిషి శాశ్వతంగా తన శరీరాన్ని మరచిపోలేడు. అది అసంభవం.

అతి కష్టంమీద వశంలోనికి తెచ్చుకోనే ఆ కోమలమైన కోరికలు ఎప్పుడో ఒక్కసారి అకస్మాత్తుగా ఎంతో వేగంతో బయటపడేవి. పురుకు అప్పుడు ఏడెనిమిది సంవత్సరాల వయస్సు. పక్కనే వనవాసులంతా ఏదో ఉత్సవం జరుపుకుంటున్నారు. అది చూడ్డానికి ఇద్దరమూ వెళ్ళాము. ఆ ఉత్సవంలో ఒక నాటకాన్ని చూస్తున్నాను. పురు ఋషికుమారులతో కలసి దూరంగా కూర్చున్నాడు. నా పక్కనే కూర్చున్న ఒక స్త్రీ ఒడిలో నాలుగైదు సంవత్సరాల పిల్ల ఉంది. ఆ అమ్మాయి కళ్ళు చాలా అందంగా ఉన్నాయి. ఆమె కళ్ళకంటె ఆ అమ్మాయి కేశాలు నన్ను ఆశ్చర్యంలో ముంచెత్తాయి. ఆ కేశాలు మధ్య మధ్య బంగారపు రంగుతో మెరుస్తున్నాయి. ఆ కేశాలు కూడా చాలా ఒత్తుగా ఉన్నాయి. ఆ కేశాలు నల్లని మబ్బుల్లో బంగారపు తీగెలాంటి మెరుపులా మెరుస్తున్నాయి. ఆడపిల్ల కదా చాలా ముద్దుగా, అందంగా ఉంది. కొంచెం గడుసు పిల్లకూడా. నేను చేతులు చాచకుండానే నావైపు ఉరికి వచ్చి నా ఒడిలో కూర్చుంది. నా ముఖం పరీక్షగా చూస్తోంది. ఆ అమ్మాయి గడ్డం పట్టుకుని ఎత్తి 'నీ పేరేమిటమ్మా?' అని అడిగాను.

'అలక!' అన్నది.

ఎంత అందమైన పేరు. వాళ్ళమ్మతో, అప్పుడప్పుడూ మా ఇంటికి వస్తూ వుండండి అని చెప్పి మధ్యలోనే లేచి కుటీరం చేరుకున్నాను. కాని ఎంత ప్రయత్నించినా కునుకు పట్టడం లేదు. పదే పదే ఆ అమ్మాయే గుర్తుకువస్తోంది.

మహారాజు పరిచయం, ఆ పరిచయం వలన పొందే సుఖం గుర్తొచ్చి మనసు వివశమైపోసాగింది పురుకి ఇలాంటి చిన్న - చెల్లెలు ఒకతె ఉండి ఉంటే ఎంత బాగుండునన్పించేది. ఇదే ఆలోచన చాలారోజుల వరకూ ఉండేది. కాలిలో గుచ్చుకున్న ముల్లులా అప్పుడప్పుడూ ఆ ఆలోచనకూడా నొప్పి కలిగిస్తుండేది.

ఈ ప్రశాంత జీవితంలో, ఎన్నో దుస్సంఘటనలు పదే - పదే గుర్తుకొచ్చి మనసుని కలవర పరుస్తున్నాయి. మధ్యలో ఒకసారి యతి వచ్చి మాక్షేమ సమాచారం గురించి తెలుసుకుని వెళ్ళిపోయాడు. రాజమాత స్వర్గస్తురాలైన సంగతి కూడా చెప్పాడు. అది విని నాకు చాలా బాధకల్గింది. ఆమె నా పట్ల మంచిగానే వ్యవహరించింది. ఆమె నాకు అత్తగారు కూడా అవుతారు. నేను ఆమెకు, కోడలిగా సేవ చేయవలసింది. కాని ఆ అవకాశం నాకు కలగలేదు. అందుకు నాకు చాలా బాధకలిగింది.

ఒకసారి, హస్తినాపురం నుండి వచ్చిన తాపసితో పరిచయం కల్గింది. అతను చెప్పిన సమాచారం ప్రకారం, మహారాజు రాజకార్యం అసలు చూడడమేలేదట, యదు చిన్నవాడైన కారణంగా, రాజకార్యం దేవయానే వహిస్తున్నది. అలా ఎందు కయ్యిందో నాకు అర్థం కావటంలేదు? దేవయానికి మహారాజుకి మధ్య ఏమైనా విభేదం ఏర్పడిందా? ఒకవేళ అలా జరిగినా, ఎవరైనా తన భాధ్యతను కర్తవ్యాన్ని విస్మరిస్తారా? వాళ్ళిద్దరి మధ్య కీచులాట కారణంగా మహారాజుపై దాని ప్రభావం ఎలా ఉందో ఏమో? కొందరి మనస్తత్వం విచిత్రంగా ఉంటుంది. వారికి ఎప్పుడూ ప్రేమతో నిండిన ఆర్ధ్రత గాని లభించకపోతే వారి మనసు పూర్తిగా వాడిపోతుంది. దేవయానికి మహారాజుకి మధ్య శాశ్వతమైన మానసిక విరక్తి కలిగి ఉంటే, మహారాజు పరిస్థితి ఎలా ఉంటుందో, ఏమో?

ఆరోజు నేను చాలా విచారంగా ఉండిపోయాను. నా ప్రాణాలు పోయినా సరే, వెంటనే హస్తినాపురం వెళ్ళి, మహారాజుతో 'పదండి, నాకుటీరానికి! అక్కడే మనం రాజమందిరం నిర్మించుకోవచ్చు!' అని అనాలనిపించింది. కాని 'పురు' ఇంకా చిన్నవాడు కదా. వాణ్ణి విడిచి ఎలా వెళ్ళిపోగలను. దేవయాని వేయించిన దండోరా, ఆ ప్రకటన పాతబడిపోయింది. అయినా నా మనసులో అది స్థిరమైన ముద్రవేసి పోయింది. నాకు చాలా ఏడుపొచ్చింది. రాత్రి ఏడుస్తున్నప్పుడు,

ఎప్పటిలాగే భగవంతుణ్ణి ప్రార్థించాను 'ఓ భగవంతుడా, ఆయన సుఖంగా ఉండేటట్టు చూడు!'

దేవుణ్ణి ప్రార్థించేటప్పుడు - 'పురు' చిన్నవాడుగా ఉండేటప్పుడు, నేను చెప్పిన ప్రార్థనని అనుకరించేవాడు. కాని ఇప్పుడు కాస్త పెద్దవాడైపోయాడు. కాని ఆరోజు ఎందుకోమరి, తనకు ఏమనిపించిందో ఏమో, నన్నిలా అడిగాడు, 'అమ్మా, ఆయనను అంటే ఎవరిని?'

నేను నవ్వుతూ అన్నాను - 'ఆయన అంటే, ఆయనే!'

పురు పట్టుబట్టి మరలా అడిగాడు, 'ఆయన పేరు చెప్పు!'

'నీవు మరికొంచెం పెద్దవాడవయిన తర్వాత చెపుతాను'

'అయితే నేనిప్పుడు చిన్నవాడినా! పెద్దవాణ్ణి అయిపోయాను! నేను సరిగ్గా గురిపైనే బాణం వదుల్తున్నాను, మంత్రం - పాఠం వల్లిస్తున్నాను. ఈతకొట్టగలను, చెట్లు ఎక్కగలుగుతున్నాను ...... ......'

'ఆఁ. హఁ.! నీవు ఇంకా మరి కొంచెం పెద్దవాడివవ్వాలి. ఇంకా ఎన్నో విద్యలు అభ్యసించాలి, యుద్ధంలో గొప్ప - గొప్ప విజయాలు సాధించాలి!'

'అదైతే ఇప్పుడు కూడా సాధించగలను. చెప్పు! ఎవరితో యుద్ధం చేయాలి?'

వాడి ముఖాన్ని గోముగా నిమురుతూ అన్నాను - 'నాన్నా! ఇప్పుడే ఎవరితోనూ యుద్ధం చేయనక్కరలేదు. మున్ముందు చేద్దువుగాని! నీవు పదహారెండ్ల వాడివి అవనీ. అప్పుడు చెపుతాను. అంతవరకూ యుద్ధం వద్దు.'

కాని, పురు పదునారేండ్లవాడు కాక మునుపు, ప్రతిసారి నేను ప్రకృతితో చెప్పేదాన్ని. నా ప్రార్థనలో 'వారిని' అంటే ఎవరినో. ఆయనెవరో ప్రకృతికీ, నాకు మాత్రమే తెలుసు. పది పన్నెండేండ్ల వయసు వాడుగా ఉన్నప్పుడు పురు అమ్మంత ఎదిగాడు. కాని ఆ తర్వాత ఒకటిరెండు సంవత్సరాలలోనే వాడి శరీరం, బాగా ఎదిగింది. ఇంచుమించు మహారాజు ఆకారంలో ఆయన పోలికలతో కన్పించ సాగాడు. వాడిని చూస్తున్నప్పుడల్లా నాకు మహారాజే గుర్తుకు వచ్చేవారు. ఈలోగా, హస్తినాపురం నుండి వచ్చే తాపసులు ఏదో ఒక సమాచారం

తెస్తూండేవాళ్ళు. ఒకటా - రెండా. ఎన్నో అమంగళకరమైన వార్తలు మోసుకొచ్చేవాళ్ళు. మహారాజు పూర్తిగా రాజ్యభారాన్ని విడిచిపెట్టేశారని, నెలల కొద్దీ రాజధాని విడిచి బయట ఎక్కడో గడుపుతున్నారని, ఒకవేళ నగరంలో ఉన్నా అశోకవనంలోని విడిది గృహం విడిచి ఎక్కడికీ వెళ్ళడం లేదని, ఆయన విలాస జీవితానికి అంతు - పొంతూ లేదని ..... ....., నేనెవరో, ఆయనకు ఏమి అవుతానో తెలియక వాళ్ళు ఇలా వాస్తవాన్ని నాతో నిర్భయంగా చెప్పుకు పోయేవాళ్ళు. ఆ మాటలు విని నా ప్రాణాలు గిలగిలా కొట్టుకోసాగేవి.

ఏం చేయాలో తోచేదికాదు. ఆయన గురించి, ఆయన సుఖంకోసం ఆయన నాశనం అయిపోకుండా రక్షించడంకోసం తక్షణం నా ప్రాణాలు అర్పించడానికి నేను సిద్ధమే, కాని ఓ మనసా! మనిషి ఎంత నిర్బలుడో కదా!

ఈ కొత్త దుఃఖాన్ని దిగమింగుకుని, దాన్ని మరచిపోవడం కోసం నేను మరలా చిత్రాలు గీయడం మొదలుపెట్టాను. కాని చిత్రాలు వేసేందుకు కావలసిన ఉపకరణాలు - అశోకవనంలో అందుబాటులో ఉన్నట్లు ఇక్కడ ఎలా దొరకుతాయి? అయినా వనవాసులలో కూడా సౌందర్యానుభూతి ఉంటుంది. వారికి కూడా కళ అంటే ఎంతో ఇష్టమే, కేవలం నగరవాసులకేకాదు! ఇక్కడ ఏం కొరత? రంగు - రంగుల పూలు - పత్రాలు, వెంట్రుకలతో నానారకాల కుంచెలు చేయవచ్చు. ఉన్నత శిఖరాలతో నిండిన హిమాలయ పర్వతాలు, అందమైన వనదేవత, ఆకాశంలో మార్పు చెందే అనేకమైన రంగులు, మొదలైనవన్నీ ముకుళిత హస్తా లతో నాముందు నిలుస్తాయి, తమ చిత్రం గీయమంటూ, పాత అభిరుచే అయినా, మరలా కొత్తగా ప్రారంభించిన కారణంగా రాత్రిపగలు తెలియకుండా, చిన్నపిల్లాడికి ఏదైనా కొత్త ఆటవస్తువు ఇస్తే, దానితో సమయం తెలియకుండా ఎలా ఆడు కుంటాడో అలా, అదే పనిగా చిత్రించసాగాను.

ఒకరోజు పురు చిత్రం వేస్తే బాగుండునేమోననిపించింది. మనసులోనే ఆ చిత్రాన్ని ఊహించుసాగాను. కాని నా మనసులో మెదిలే ఆ చిత్తరువు ఆకారం, అశోకవనంలో, నేను గీసిన - మహారాజు చిత్రంలాగే ఉంది. నాకే ఆశ్చర్యంవేసింది. పురు కూడా కాస్త పెద్దవాడైతే అలాగే ఉంటాడు కదా అనిపించింది.

పురు పదహారేండ్లవాడయ్యాడు. నేను అసలు రహస్యం విప్పి చెప్పేసాను.

తను సామాన్య మనిషికాదని, హస్తినాపుర మహారాజు కూమారుడు యువరాజని, కాని అది తెలిసిన మరుక్షణం అతను ఉబ్బితబ్బిబ్బు అయిపోలేదు. తన తల్లి ఇలా ఎందుకు ఈ వనవాసం చేస్తున్నది, తన తండ్రి ఎందుకిలా ఈమెను పంపి వేశాడో అని తెలుసుకుని చాలా బాధపడ్డాడు. దేవయాని మత్సరం కారణంగా ఇలా హస్తినాపురం విడిచివచ్చేసానని నేనప్పుడు చెప్పాను. అయినా వాడి మనసులో బాధ పోలేదు. 'పద, మనిద్దరం ఇప్పుడే హస్తినాపురం వెళ్ళిపోదాం. మహారాజుని కలుద్దాం. నేను నీ కుమారుడనని మహారాజుకు చెపుతాను. మీకోసం ఎలాంటి సాహసకార్యమైనా చేయడానికి నేను సిద్ధమే, కాని, నా తల్లిని ఇకమీదట కష్టపెట్టవద్దు అని చెపుతాను'.

పదిహేను - పదిహారు సంవత్సరాలు వయసు, పిల్లలకు నచ్చచెప్పడం అంత తేలికైన పనికాదు. చాలాకష్టం. యావ్వనంలో ఎంత ఉత్సాహం, స్ఫూర్తి ఉంటుందో, అంతే పాళ్ళలో కండకావరం కూడా ఉంటుంది. వ్యవహారపరమైన ముళ్ళుకూడా కన్పించవు. కాని కలలోని పూల తీయనిసుగంధం యావనంలో, వ్యక్తిచుట్టూ పరిభ్రమిస్తూ ఉంటుంది. మహారాజు త్వరలోనే మనల్ని తీసుకురమ్మని ఎవరినైనా పంపిస్తారులే అని పురుకి పదే - పదే నచ్చ జెప్పేదాన్ని. అంతవరకూ మనం ఇక్కడ ఉండటమే మంచిది అని చెప్పేదాన్ని. అయినా నా మాటలు వాడికి నచ్చలేదు. తల్లిమాట జవదాటకూడదనే నియమానికి కట్టుబడి ఏమీ చేయలేక సతమతమైపోయేవాడు. తను మహారాజు కుమారుడినని ఎవరితోనూ, ఎట్టి పరిస్థితి లోనూ చెప్పకూడదని, వాడిచేత ఒట్టుపెట్టించుకున్నాను. అప్పుడు 'పురు' నన్ను ఇలా అడిగాడు - 'మహారాజు దగ్గరకూడా చెప్పకూడదా?'

'పిచ్చి నాన్నా! మహారాజు ఇక్కడికెప్పుడు వస్తారు కనుక?' అని నవ్వుతూ అన్నాను.

'ఇక్కడ కాదు, ఇంకెక్కడైనా ఆయనను కలవడం జరిగితే, అప్పుడుకూడా నోరుమూసుకొని కూర్చోవాలా? కొడుకుగా తండ్రికి నమస్కరించి ఆయన ఆశీర్వాదం కూడా తీసుకోకూడదా?' - అన్నాడు.

వాడి మనసు నొప్పించకూడదని నేనన్నాను - 'అలా అని నేనెప్పుడన్నాను? నీవు తప్పకుండా మహారాజుతో చెప్పు, నేను నీ కుమారుడను 'పురు'ను అని,

నీవు చాలా చిన్నవాడివి, అప్పుడు నీకు బాగా తెలియదు. కాని మహారాజుకి నీవంటే చాలా ప్రేమ. కాని ఒక్క విషయం మాత్రం గుర్తుంచుకో, నీవు మహా రాజుతో తప్ప ఇంకెవ్వరితోనూ ఈ రహస్యం చెప్పకూడదు, తెలిసిందా! ఇలా చెప్పావంటే నా మీద ఒట్టే!'

ఇన్ని సంవత్సరాలూ రహస్యంగా ఉంచిన ఈ విషయం ఈరోజు పురుకి చెప్పేసాను. కాని వాడు తన కొత్తరహస్యం గురించి ఒక్కమారు కూడా నాతో చెప్పలేదు.

పిల్లలు పెద్దవాళ్ళవుతూంటే వాళ్ళు తల్లిదండ్రులకి దూరమౌతారనేది నిజమే నేమో అన్పిస్తోంది. ప్రేమ, పరాక్రమం రెండూ కూడా యౌవనంలో మనసులో ప్రేరితమౌతాయి. సురక్షితమైన బాల్య జీవితాన్ని మరపింపజేస్తూ, యువతీ - యువకులను ఈ ప్రేమా, పరాక్రమాలు ఏదో లోకానికి తీసుకొని వెళ్ళిపోతాయి. కాని తల్లిదండ్రులు మాత్రం వాళ్ళని ఎప్పుడూ చిన్నవాళ్ళగానే చూస్తూ తమచెంతనే సురుక్షితంగా ఉంచాలనుకుంటారు.

పురుకూడా అంతే, వాడి విషయంలో ఈ నియమం ఎందుకు వర్తించదు? ఇప్పుడువాడు వేటకోసం అడవిలో చాలాదూరం వెళ్ళిపోతాడు. హిమాలయ శిఖరాలని ఎక్కాలనే కలలు కుంటున్నాడు. ధనుర్విద్యకాకుండా, దీనికి మించిన విద్య ఇంకెక్కడ లభిస్తుందని అడుగుతుంటాడు. భయం అంటే ఏమిటో వాడికసలు తెలియనే తెలియదు.

భయం ఎలాగైతే వాడికి ఒకవైపు దూరమైందో, అలాగే మరోవైపు నుండి వాడి మనసులో ప్రణయం చోటుచేసుకుంది. ముగ్ధత్వంతో, చిలిపితనంతో, సిగ్గుతో కూడినది, ఇచ్ఛారహితమైనది అయిన ప్రణయం - అరుణోదయానికి మునుపు తూర్పు దిక్కున కన్పించే అందమైన గులాబీరంగుతో ప్రకాశించే ప్రణయం అది!

కాని, ఈ రహస్యం నాకెప్పుడూ చెప్పలేదు. ఆమె, బంగారు రంగుకేశాలు గల అందమైన పిల్ల, అదే అలక! ఆమె తల్లి నాకు ప్రాణ స్నేహితురాలైంది. మెల్లమెల్లగా పిల్లల్లో కూడా స్నేహం పెరిగింది. కాని పురుకు పదహారేళ్ళు వచ్చినప్పటి నుండి అతనిలోనూ, ఆపిల్ల ప్రవర్తనలోనూ కాస్త మార్పు కన్పిస్తోంది. ఇంతకు మునుపులా ఇద్దరూ, ప్రతి విషయానికీ పోట్లాడుకోవడం మానేశారు. ఇద్దరిలోనూ ఏదో తెలి

యని వింత భావం ఉత్పన్నమైంది. ఇతరులెవరైనా వారి పనిలో కల్పించుకొంటే వాళ్ళు అలా కళ్ళప్పగించి చూస్తూండిపోతున్నారు. మనసులోనే నవ్వుకుంటు న్నారు. వెంటనే అలక తలవంచి నేలపైకి చూస్తూ కాలిబొటనవ్రేలితో నేలపై రాస్తుంది. ఆమె చిన్న పిల్లగా ఉన్నప్పుడు, పురుకోసం ఏదైనా పని చేయమని అడిగినప్పుడు, కచ్చితంగా జవాబు చెప్పేది - 'నేనెందుకు అతని పని చేయాలి? అతను నా పని ఏమైనా చేస్తున్నాడా?', అని. కాని, ఈ మధ్య ఎప్పుడూ ఇంటికి వచ్చినా ఆమె దృష్టి నామీద కంటె, పురుమీదే ఎక్కువ కేంద్రీకరిస్తుంది. వాడి కోసం కల్పించుకొని ఏదో ఒక పని చేస్తున్నది.

నెమ్మది - నెమ్మదిగా ఈ వ్యవహారమంతా నాకు గుర్తుకు రాసాగింది. అందులో అనుచితం ఏమీలేదు. కాని, ఈ ప్రణయాంకురాన్ని పెరగనివ్వడం సబబేనా? 'పురు' రాజకుమారుడు. యయాతి మహారాజుకుమారుడు. రేపు అంతా సవ్యంగా జరిగితే 'పురు'కు ఏ రాజకుమార్తెనోచూసి వివాహం జరిపించడం జరుగు తుంది. అప్పుడు ఈ అమ్మాయి గతి ఏంకావాలి? మనసులోనే కుమిలిపోతూ, నిరాశతో జీవితం గడపాలా? అలా కాకూడదు? ప్రేమ సఫలం కాకపోతే అది భరించరాని వేదనగా మారుతుంది. అందుచేత అటువంటి అనుభవం ఈ అమ్మాయికి కలుగకుండా ఇప్పుడే ఈ ప్రేమ అంకురాన్ని తుంచివేస్తే? నిరాశకంటె అసత్యమైన ఆశ చాలా చెడ్డది. ఈ అమ్మాయి పెద్దమ్మ ఒకప్పుడు హస్తినాపుర రాజమందిరంలో దాసి అని కూడా విన్నాను. అలాంటి కుటుంబంతో సంబంధం..... ఒకవైపు 'పురు' రాజవంశానికి చెందినవాడుకూడా - మట్టితో చేయబడ్డ దీపపు ప్రమిద ఆకాశంలో నక్షత్రంలా పెరిగేపోవాలనే కోరిక కోరుకుంటే, అది జరిగే పనేనా?

అప్పుడు, నా మనసులో రెండో పక్షం, ఇలా ఆలోచించసాగింది, నీవు ఒక ప్పుడు రాజకన్యవి! కాని ఆ తర్వాత దాసివి కాలేదా? 'అలక' వంశం గొప్పది కాకపోవచ్చు! కాని ఆమె ప్రేమ, స్వచ్ఛమైనది, పవిత్రమైనది కదా? దాసీకీ - రాజ కన్యకు ప్రేమ వేరువేరుగా ఉంటుందా?

ఇలా మనసులో ఏవో లేనిపోని ఆలోచనలు వస్తున్నాయి. కాని, పురు - అలక గురించి ఏ విషయమూ నిర్ణయించే ధైర్యం చేయలేకపోయాను. అలాంటి వ్యవహారంలో యువకులేకాక పెద్దవాళ్ళు కూడా సందిగ్ధంలో పడిపోతారు.

అలాగే రెండు - మూడు సంవత్సరాలు గడిచిపోయాయి. ఒకరోజు వేటకని వెళ్ళిన పురు మనసేమీ బాగులేదని చెప్పి మధ్యలోనే ఇంటికి తిరిగి వచ్చేసాడు. ఉత్తర భాగంలో దస్యులు మరలా తిరుగుబాటు చేసినట్లు విన్నాడట. వాళ్ళు హస్తినాపురం మీద దాడిచేయడానికి వెళ్ళారట. యువరాజు యయు కాస్త పెద్ద సైన్యాన్నే తీసుకొని, వాళ్ళతో యుద్ధం చేయడానికి బయల్దేరాడట.

ఆరోజు రాత్రి నాకంటిమీద కునుకు పట్టలేదు. సేనని తీసుకొని ‘యయు’ యుద్ధానికి వెళ్ళాడు. అంటే మహారాజు ఎక్కడున్నట్లు? పదే - పదే ఇదే ప్రశ్న నా మనసులో మెదిలింది. రాజధాని మీద దాడి జరుగుతున్నాకూడా, మహారాజు ఊరికే చేతులు ముడుచుకొని కూర్చున్నారా? లేదు! అలా అయి ఉండదు. అయితే మరి ..... మహారాజుకి ఏమైనా జబ్బుచేసిందా? లేక కఠినాత్మురాలు ఆ దేవయాని మహారాజుని గాని ఏకారాగారంలోనైనా బంధించి వేసిందా? సవాలక్ష సందేహాలు - సంకోచాలు మనసులో మెదలసాగాయి.

పక్కనే వేరొక పక్కమీద పడుకున్న పురుకూడా రాత్రంతా ఇటు అటూ ఒత్తిగిల్లుతూనే ఉన్నాడు. నేను అడిగాను - ‘ఏం పూరూ, నిద్ర రావటంలేదా? ఏమైంది నీకు?’

‘ఏమీ లేదమ్మా’. అనేసి ఊరుకున్నాడు, తర్వాత ఏమీ అనలేదు. నాకు నవ్వు వచ్చింది. బహుశా, అలక గుర్తొచ్చి ఉంటుందనుకున్నాను. ఈరోజు అలక మొదటిసారి ముద్దుపెట్టుకుని ఉంటుంది, అందుకే ........ !

రాత్రంతా ఎందుకు అలా ఉన్నాడో, నాకు రెండవరోజు అర్ధమయింది. ఉదయాన్నే వేటకని వెళ్ళిపోయాడు. సాయంకాలం చాలా పొద్దుపోయినా ఇంటికి తిరిగి రాలేదు. రాత్రయి పోయింది. అయినా ఇంకా రాలేదు. నా మనసులో భయాందోళన మొదలైంది. అతనితోపాటు వెళ్ళిన మిత్రుల గురించి వాకబు చేసాను. వాళ్ళు కూడా తిరిగి రాలేదని తెలిసింది. వీళ్ళందరికీ ఏమైంది? ఎవరికీ అంతు చిక్కడంలేదు. రాత్రి నా మనసును మింగేస్తుంది. నన్ను విడిచి ఇలా ఎప్పుడూ పురు బయట ఉండలేదు. ఇలా చెప్పకుండా ఎప్పుడూ ఏమీ చేయలేదు. ఆ రాత్రంతా మనసు మనసులో లేదు. మరలా దురదృష్టం నన్ను వెంటాడుతున్నాదా? ఇలా ఎన్నో ఆలోచనలు అలాంటి రాత్రి, బహుశా జీవితంలో ఏ తల్లికి రాకూడదు భగవంతుడా! అని వేడుకొన్నాను.

రెండో రోజు మధ్యాహ్నం వరకు నీటినుండి బయటపడ్డ చేపలా నా మనసు గిలగిలా కొట్టుకుంది. ఆ తర్వాత అలక వచ్చింది. పురు, అతని స్నేహితులు కలిసి దస్యులుతో యుద్ధం చేయడానికి వెళ్ళారు. ఇంటి దగ్గర చెపితే పెద్దవాళ్ళు ఒప్పుకోరని, అందరూ ఆలోచించుకుని ఆ నిర్ణయం తీసుకున్నారు. దారిలోనే అలక ఉండే ఇల్లు. అక్కడ ఆమెకు ఈ ఉత్తరం ఇచ్చి నాకిమ్మని చెప్పి 'పురు' వాళ్ళని తీసుకొని ముందుకి సాగి పోయాడట. వణకుతున్న చేతులతో ఆ ఉత్తరం నాకందించింది అలక! నేను విప్పి చదివాను. అందులో కేవలం ఇంతే వ్రాసి ఉంది

-'హస్తినాపుర రాజ్యంమీద శత్రువులు దాడిచేసారు. అలాటి సమయంలో నాకర్తవ్యం ఏమిటో, నీవు చెప్పవలసినపనిలేదు. జీవితంలో మొదటిసారి నీ ఆజ్ఞను ధిక్కరిస్తున్నాను. నీకు చెప్పకుండా, నీకు దూరంగా వెళుతున్నాను. అమ్మా! నన్ను క్షమించాలి. నా గురించి ఏమీ బెంగపడవద్దు. నాతోపాటు ప్రాణానికి ప్రాణం ఇచ్చి యుద్ధం చేసే స్నేహితులున్నారు. నీ పురు మహాపరాక్రమం చూపించి, దస్యులను ఓడించి, విజయుడిగా వచ్చి నిన్ను కలుసుకుంటాడు'.

లేఖ చదువుతూ - చదువుతూ నాకళ్ళు చెమర్చాయి. క్షత్రియ పుత్రుణ్ణి యుద్ధ భూమికి వెళ్ళవద్దని ఎవరు ఆపగలరు? కాని నాలాంటి తల్లి మనసు....? ఏవిధంగానైనా శాంతపడదు కదా? తల్లి మనసులోని భావం కంటి వెంట కన్నీరుగా వ్యక్తమయ్యింది.

అలక నా కన్నీళ్ళు తుడిచింది. 'ఏడవ వద్దు, ఏడవ వద్దు!' అంటూ నన్ను పెనవేసుకుని ఊరడించింది. మనసుని గట్టిబరచుకుని కన్నీళ్ళు తుడుచుకున్నాను. ఆ అమ్మాయివంక వాత్సల్యంగా చూసాను. ఆ అమ్మాయి బంగారురంగు కేశాలపై సూర్యుని కిరణాలు పడ్డాయి. ఎంతో అందంగా కన్పించసాగాయి. ఏ నూటికో, కోటికోగాని లభించని అందమైన కోడలు నాకు లభించబోతున్నదనే ఆనందంతోనేను పురుని గురించి మరచిపోయాను.

అప్పుడు అలక ఏడవసాగింది. వెక్కి వెక్కి ఏడుస్తూ - 'ఆయన క్షేమంగా తిరిగి వచ్చేస్తారు కదూ?' అని అడిగింది. ఆమె అడిగిన ప్రశ్నతో నా మనసుకూడా వ్యాకుల పడింది. కాని అదేమీ వ్యక్తం చేయకుండా నన్ను నేను సంబాళించు కుంటూ, అమ్మాయిని దగ్గరకు తీసుకుంటూ అన్నాను - 'పిచ్చిపిల్లా ...... యుద్ధా

నికి ఏ కొద్దిమందో వెళతారనుకున్నావా? యుద్ధం మన క్షత్రియ ధరకూడా!' అలక కన్నీళ్ళతోపాటు నేనుకూడా కన్నీరు కార్చాను. కాసేపటి తర్వాత ఇద్దరమూ స్థిమితపడ్డాము.

ఇద్దరమూ కాసేపు మాట్లాడుకున్నాం. కాసేపు ఆలోచించ సాగాము. మనమున్న ప్రదేశం యుద్ధభూమి నుండి చాలా దూరం. ఇక్కడికి ఏ సమాచారం అందాలన్నా కాస్త ఎక్కువ సమయం పడుతుంది. అందుచేత, హస్తినాపురానికి అయిదు, పది క్రోసుల దూరంలో ఏదైనా గ్రామంలో ఉంటే బాగుంటుందని అనుకున్నాము. అంటే అటూ - ఇటూ వెళ్ళివచ్చే సైనికులు ద్వారానో లేక వార్తాహరుల ద్వారానో ఏదో సమాచారం అందుతుంది. లేదంటే, పురుగాని లేక పురు స్నేహితులలో ఎవరో ఒకరు తారసపడటం కూడా జరగవచ్చు. అలక, తల్లి అతి కష్టంమీద ఆ అమ్మా యిని నాతో పంపడానికి ఒప్పుకుంది. మాకు వీడ్కోలు చెప్పుతున్నప్పుడు నవ్వుతూ అంది - 'ఆడపిల్ల ఎప్పుడైనా పరాయిదే, ఎప్పుడో ఒకప్పుడు అత్తవారికి అప్పగించాలి కదా!'

యతి మమ్మలను అప్పగించినవారిలో కొంతమంది ముఖ్యమైనవాళ్ళు, వీరులైన యువకులు ఇద్దరు మాతోపాటు ప్రయాణానికి సిద్ధమయ్యారు. రకరకాల ఆలోచలనతో, అప్పుడప్పుడు చెమ్మగిల్లిన కళ్ళను తుడుచుకుంటూ, దుఃఖాన్ని దిగమ్రింగుకుంటూ, దుఃఖాన్ని బయటకు వ్యక్తపరచకుండా ఉండడానికి ప్రయత్నిస్తూ ప్రయాణం సాగించాను. ఒక్కొక్కసారి పురు పరాక్రమానికి సంబంధిం చిన సంఘటనలు కళ్ళముందు మెదలాటుతూంటే, వేరొక సారి యుద్ధంలో తనకి బాగాదెబ్బలు తగిలి, రక్తసిక్తమైన శరీరంతో కళ్ళముందు కన్పిస్తుంటే, ఆ కల్పనకి శరీరమంతా భయంతో కంపించిపోయేది. ప్రయాణం అంతా అలాంటి ఆలోచనల తోనే సాగింది.

నేను మరలా హస్తినాపురంలో అడుగుపెట్టబోతున్నాను!. పద్దెనిమిది సంవత్స రాల తర్వాత! ఏ మార్గంగుండా, ఎలాంటి భయంకరమైన స్థితిలో వచ్చానో, మరలా అదే మార్గంలో అదే ఉద్వేగంతో భయంతో వెళుతున్నాను. అప్పటినుండి నేటివరకూ భవిష్యత్తుని గురించి ఆలోచనలు కూడా. ఆ ఆలోచనలు ఒకసారి అతిభవ్యంగా కన్పిస్తే, వేరొకసారి అతిభయంకరంగా అనిపించేవి.

పద్దెనమిది సంవత్సరాల క్రితం, దేవయాని బారి నుండి పసిబాలుడైన పురుని రక్షించడంకోసం ఇదేమార్గం గుండా వచ్చేసాను. ఈరోజు ఆ పురు తన తల్లిని చింతాగ్రస్తురాలిని చేసి యుద్ధభూమికి వెళ్ళిపోయాడు. మనసులో పదే - పదే ఆతురత. అక్కడ నా బాబు క్షేమంగానే ఉండి ఉంటాడు కదా? మానసికమైన వేదన, నీడకుతోబుట్టువా? నీడ ఏవిధంగా మనిషిని విడిచి ఉండదో, అలాగే వేదన కూడా విడిచి ఉండకూడదని విధాత రాసిపెట్టాడా?

చివరకు మేము హస్తినాపురానికి ఆరుక్రోసులు దూరంలో ఉన్న ఒక గ్రామం చేరు కున్నాము. ఆరోజు చాలా అశుభమైనరోజు. మాకు పిడుగుపాటులాంటి సమాచారం ఒకటి తెలిసింది. ఒక దాడిలో దస్యులు, యయుని, అతనితోపాటు కొంతమంది శూరవీరులైన సైనికుల్ని బందీగా చేసి తమతోపాటు తీసుకు పోయారట. దస్యులకు ఒక సంప్రదాయముంది. దాని ప్రకారం శత్రువుల తలలని నరికి వాటిని శూలానికి గుచ్చి నగరంలో ఊరేగిస్తారు.

ఆ చిన్నగ్రామంలో అంతా ఇదే విషయం మీద చర్చించుకుంటున్నారు. యువరాజుకి ఏమౌతుందోననే బాధ వారి మనసులను పట్టిపీడించసాగింది.

కాని ఆ వార్త వాళ్ళకంటే మాకే ఎక్కువ బాధకల్గించింది. యయుని విడిపించ డానికి పురు, అతని స్నేహితులు వెళ్ళి ఉంటారు, వీళ్ళనికూడా అక్కడ బంధించే ఉండొచ్చు.

పురుని ఏ పరిస్థితిలో చూస్తానో ఏమో? విజయుడిగానో లేక శత్రువుల శూలంపై అతని తలనో? ....... .......

ఆ ఆలోచనే ...... ......

పూర్వ జన్మలో నేనేం పాపం చేసానని భగవంతుడు నన్నిలా యాతన పెడు తున్నాడు?

# యయాతి

నేను - నేను ఎవరిని? ఎక్కడ ఉన్నాను? స్వర్గంలోనా లేక నరకంలోనా?

నేను యయాతిని కదా? నహుష మహారాజు కుమారుణ్ణి, హస్తినాపుర చక్రవర్తిని, దేవయాని భర్తను ..... .....

దేవయాని? ఎక్కడ ధేవయాని? దేవయాని నాకేమీ కాదు - ఏమీ కాదు!

నేను నరకంలో ఉన్నానా? లేదు. నేను కూడ పిచ్చివాడిలా మాట్లాడుతున్నానా? ఇది నరకం కాదు. స్వర్గం. చాలా సంవత్సరాలుగా నేనీ స్వర్గసుఖాన్ని అనుభవిస్తున్నాను.

ఎన్ని సంవత్సరాలైంది? పద్దెనిమిదా? కాదు, పద్దెనిమిది వందల ఏండ్లుగా నేనీ స్వర్గంలో ఉన్నాను. అప్సరసల అధరామృతాన్ని నిరంతరం గ్రోలుతున్నాను. నా పానుపు కల్పవృక్షం క్రింద వేయబడింది. పారిజాతపుష్పాల పానుపుపై నేను రాత్రీ పగలూ పడుకుంటున్నాను. నక్షత్రాలను సైతం సిగ్గిల్ల చేసే అందాల అతివల చూపుల్లో నేను ప్రతిక్షణం గాయపడుతున్నాను. ఇప్పుడు - ఇప్పుడు నేను ఇంద్రాణిని నా కౌగిలిలో .....

ఇంద్రాణి ... ఇంద్రాణి కారణంగానే నహుష మహారాజు భయంకరమైన శాపం పొందాడు. నా చెవుల్లో ఎవరో గొణగుతున్నారు. 'నహుషుని కుమారులు ఎప్పుడు సుఖంగా ఉండరు.....'

కాని నేను నహుష మహారాజు కుమారుణ్ణే. నేను సుఖంగా ఉన్నాను. నా సోదరుడు యతి - అతను అడవులలోకి పారిపోయాడు. చివరకు పిచ్చివాడయ్యాడు. కాని నేను సుఖసాగర తరంగాలలో తేలాడుతున్నాను. నా దుఃఖాలనన్నిటినీ ఈ సముద్రంలో ముంచివేశాను.

కాని ... కాని ... శర్మిష్ఠ స్మృతే నాకున్న ఒకే ఒక వేదన. శర్మిష్ఠ ఇప్పుడు ఎక్కడ ఉన్నది? లేదు, లక్షప్రయత్నాలు చేసినప్పటికీ ఈ ఆవేదన సారా మత్తులో మునగడంలేదు. వేటలో ప్రవహించే రక్తంతో సైతం ఆవేదనను మాయంచేయలేకపోతున్నాను. నిరంతరం శారీరక సుఖాన్ని అందించే అందాల భామినులు సైతం తమ కౌగిళ్ళలో నన్ను బంధించినా ఈ వేదనను మరిపించలేకపోయారు

లేదు - యయాతి సుఖంగా లేడు. యయాతి దుఃఖితుడు. నేను దుఃఖితిణ్ణా? కాదు. నేను సుఖంగా ఉన్నానా లేక దుఃఖంగా ఉన్నానా? నాకే అర్థం కావడంలేదు. సుఖమంటే? దుఃఖమంటే? బహుశా ఈ ప్రపంచంలో ఇంత కన్నా చిక్కు ప్రశ్నలు ఉండి వుండవు. నేను యయాతినేనా లేక మరెవరినోనా? నేను ఎక్కడకు వెళ్ళు తున్నాను? ఎందుకు? ఎవరికోసం?

నేను ఎక్కడ ఉన్నాను? సూర్య, చంద్ర నక్షత్రాల ప్రకాశం - ప్రీతి, వాత్సల్యం మానవత్వాల వెలుగు - ఆ వెలుతురంతా ఎక్కడకు పోయింది? వీటన్నిటి ప్రకాశం ఎలా మాయమైంది? ఈ భయంకరమైన చీకటిలో నేనెక్కడకు వెళుతున్నాను?

చీకటి - ఎక్కడుంది చీకటి? అరే! నేను పిచ్చివాణ్ణి కాలేదు గదా?

నా ముందు ఈ మధుపాత్ర ఉంచబడింది. మాధవుడు చనిపోయిన తరువాత ఇదే నాకు వీడని తోడు. రాత్రి పగలు నిరంతరం నన్నంటి పెట్టుకున్న మిత్రుడు. ఇదే నా ప్రాణం కంటే ప్రియమైన మిత్రుడు. నా హృదయంలో నాటుకున్న సమస్య లను మూలంతో సహా పెకలిస్తున్నది.

నా ముందు ఈ మధుపాత్ర ఉంచబడింది. నన్ను బ్రహ్మానందంలో ముంచి కృతార్థుణ్ణి చేసిన ఈ ఖాళీపాత్ర - ఈ పాత్రలో నుండి .....

నేను పిచ్చివాణ్ణికాలేదు కదా? ఈ ఖాళీపాత్ర నుండి నాకెవరి గొంతు వినిపిస్తున్నది? ఈ పాత్ర నుండి ఎవరో బయటకు వస్తున్నారు? ఇది ఏదో ఒక ఆకారమే కాదు. ఒకటి, రెండు, మూడు .... ....

పదిహేడు, పద్దెనిమిది! పద్దెనిమిదో నగ్ననారీభూతం ఆ పాత్ర నుండి ...

ఈ ఆడభూతాలు ఎంత భయంకర నాట్యంచేస్తున్నాయి. ఈ ఆడభూతాలు ఎక్కడ నాట్యం చేస్తున్నాయి? అరే, ఇవి మృదువైన, కోమలమైన అందమైన శవాలపై నాట్యం చేస్తున్నాయి. తొలి ప్రణయపు పిలుపు విని భ్రాంతిపడ్డ ప్రియబాలిక ఒక ఆమె, పాదాలచెంత అంకితమైన లజ్జితముగ్ధ ఒకామె. మరొకామె ప్రేమాంకితమైన పవిత్ర స్పర్శతో పులకితమైన రమణి. ఆ వైపు గృహస్తు బంగారు కలలో కట్టిన మందిరంలోకి వెళుతూ ఉన్న ఆమె శాంతి స్వరూపిణి - వీరందరి శవాలపై ఈ అందమైన ఆడభూతాలు ఉన్మాదంతో నాట్యం చేస్తున్నాయి.

నాట్యం చేస్తూ అవి పాడుతున్నాయి. వారి స్వరం క్రోధంతో బుసుకొడుతున్న నాగుల స్వరంలా ఉంది ...

ఓ భగవంతుడా! వారి ప్రతి స్వరాలాపనతో ఆకాశంలోని ఒక్కొక్క నక్షత్రం ఆరిపోతున్నది. చూస్తూ ఉండగానే ఆకాశమంతా కటిక చీకటి అలుముకున్నది. ఆకాశంలోని ఆ దీపాలన్నీటినీ ఈ ఆడదయ్యాలు తమ పాటలతో ఆర్పివేశాయి.

ఈ ఆడదయ్యాలు భయంకరమైన ప్రళయ గీతాన్ని ఆలపిస్తున్నాయి.

అది పాటకాదు, చీకటి పొగడ్త. పాడుతూ ఈ ఆడదయ్యాలు గాఢాంధకారాన్ని పిలుస్తున్నాయి. అందులో మనిషి తననుతాను గుర్తించలేడు, అందులో వెలుగుకిరణాలు ప్రవేశిస్తూనే నల్లబడిపోతాయి. అన్ని హద్దులూ చెరిగిపోతాయి.

పాడుతూ - పాడుతూ ఒక ఆడదయ్యం ముందుకు వచ్చి వికటాట్టహాసం చేస్తూ నాతో చెప్పింది, - 'నన్ను గుర్తించావా? ఒట్టి మూర్ఖుడవు, ఇప్పటికీ మా సోదరీమణులను గుర్తించలేదా? అరే, మేమంతా ప్రాణప్రదంగా నీకు ఆనందా న్నిచ్చేందుకు ప్రయత్నించాం - కృతఘ్నుడా! మా సహచర్యంలో తనివితీరా సుఖాన్ని అనుభవించి కూడా నువ్వు మమ్మలను గుర్తించ లేకపోతున్నావా?'

మరో పొడవైన, ఉన్మత్తురాలైన ఆడదయ్యం నాకు బాగా దగ్గరగా వచ్చి నరమాంసాన్ని వండే కాపాలికలా పకపక నవ్వింది.

ఆమెను సన్నిహితంగా చూచి నేను భయపడి కళ్ళు మూసుకున్నాను. నా మెడపై తన చేయి వేస్తు ఆమె అన్నది - 'పద, నాతో ఆడుకోడానికి పద. మనం జూదమాడుదాం. ఈ జూదంలో నేను ఓడిపోతే, ప్రతిరాత్రి నీకు కొత్త నాజూకైన అమ్మాయిని తెచ్చి ఇస్తాను. కానీ నీవు ఓడిపోతే, నాతోపాటు ఈ అంధకార సముద్రంలోకి రావాలి. అక్కడ మనం తిమింగిలం కడుపులో దాగి కూర్చుందాం. ఆభగవంతుడికి సైతం మన ఉనికి తెలియదు. ఆ అందమైన ఏకాంతంలో మనం తనివితీరా రతికేళి ఆడుదాం. నేను నీ పట్టపురాణి నవుతాను. నువ్వు -' చెపుతూ, చెపుతూ ఆమె ఆగిపోయింది. నేను భయపడుతూ భయపడుతూ కళ్ళు విప్పాను. నా మెడపై ఉన్న తన చేతిని తీసి పిడికిలి బిగించింది.

తిరిగి వెంటనే పిడికిలి తెరిచింది. తెరిచిన పిడికిలిలో నాకు గవ్వలు కనిపించాయి.

గవ్వలు? కాదు, ఇవి మోహంతో నిండిన కనుగుడ్లు ఇవి మాధవి కళ్ళు,
అవి తారకవి .

ఇవి గవ్వలుకావు. ఇవి యువతుల కనులు. ఈ కళ్ళనే నేను లక్షలసార్లు ముద్దాడాను. ఇవన్నీ కోమలమైన కనురెప్పలే చుక్కానిగా, ప్రేమను వెతుక్కొంటూ బయలుదేరిన నావలు, ఈ నావల్లోనే నేను ఎన్నోసార్లు స్వర్గపు అంచుల్ని చూసాను.

ఆ ఆడభూతం నవ్వుతూ అడిగింది. 'పద, ఈ గవ్వలతో జూదం ఆడుదాం.' అది విని నేను ఆపాదమస్తకం వణికిపోయాను. శక్తినంతా కూడదీసుకుని ఆ ఆడ దయ్యాన్ని ఎంతో కష్టంతో దూరంగా త్రోసివేసి దాని పీడ వదల్చు కున్నాను.

ఇదంతా భ్రమా? గత పద్దెనిమిది సంవత్సరాలలో ఇటువంటి భ్రమ ఇంతకు ముందు నాకు కలగలేదు. మరిప్పుడెందుకు కలుగుతున్నది? ఇది భ్రమా లేక నిజమా?

నాముందు ఖాళీపాత్ర మాత్రమే ఉంది. ఖాళీపాత్ర - శూన్యమైన మనసు - ఖాళీ హృదయం -

ఈ శూన్య ప్రభావం మనసును ఎప్పుడూ మండిస్తున్నది. మనసు ఈ శూన్య గుహలో కొట్టుకుంటూ, కారుచిచ్చులో చిక్కుకున్న పక్షి 'కూ, కూ' అంటూ బయటపడడానికి ఆదుర్దాతో ఎగురుతున్నట్లు తిరుగుతున్నదీ. ఎక్కడా దానికి ఆధారం దొరకడంలేదు. నేను ఓడిపోయి మధుసంద్రంలో మునిగిపోయాను. ఆసంద్రపు ప్రతి అలతో నేను చెపుతూ వున్నాను - 'నన్ను లోతుల్లోకి మరింత లోతుల్లోకి తీసుకుపోండి, పూర్తిగా స్మృతిరాహిత్య మహాసాగరపులోతుల్లోకి. అక్కడ నన్ను విశ్రాంతిగా నిద్రపోనివ్వండి. అనంతకాలం వరకు నన్ను సుఖంగా అక్కడే ఉండనివ్వండి'.

ఆరోజు నేను ఈవిధంగా చాలా గాఢనిద్రలో మునిగిపోయాను. కాని అక్కడ కూడ ఒక్కసారిగా నాకు మెలుకువ వచ్చింది. దూరపు తూరుపు తీరాన తెల్లవారు

తున్నది. పక్షుల కూతలు వినడానికి నేను ప్రయత్నించాను. కాని ఏది సరిగ్గా పినిపించలేదు. ఏమీ అర్థం కాలేదు. ఏమీ కనిపించలేదు.

చాలాసేపటికి నాకు వినిపించింది. 'ఆయిపోయింది మహారాజా!'

'ఏమి అయ్యింది?'

'సాయంకాలమయ్యింది'.

మాట్లాడింది ఎవరు? ఎవరైనా దేవదూతా? అతనేమి చెప్పాడు? సాయంత్ర మయ్యిందని చెప్పాడా? సాయంకాలమయ్యిందా? నా జీవితానికి సాయంకాలమా?

అది ఎలా సాధ్యం? ఈ దేవదూత దారి మరచిపోయి ఉంటాడు - 'అరే పిచ్చివాడా? ఇది హస్తినాపుర అశోకవనం. నేను సామ్రాట్ యయాతిని. ఎవరో ముసలి రాజుకు చెప్పవలసిన సమాచారం పొరపాటున నీవు నా దగ్గరకు తీసుక వచ్చావు. వెళ్ళిపో, నా జీవితానికి ఇంత త్వరగా సాయంకాలం ఎలా వస్తుంది? నా యవ్వనం ఇప్పటికీ అసంపూర్ణం. నా కళ్ళు, చెవులు, పెదవులు, చేతులు - శరీరంలోని ప్రతి అణువూ ఈ నాటికీ సుఖభోగాలకై పరితపిస్తున్నాయి. ఎంతో ఉత్సాహంతో రాత్రికై ఎదురుతెన్నులు చూస్తున్నాయి. వెళ్ళు, దేవధూతా! తిరిగి వెళ్ళు. సరిగా గుర్తు తెచ్చుకో, ఆ ముదుసలి, వడలిన శరీరం కలిగి, మృత్యు శయ్యపై ఉన్న ఆ రాజు వేరు. నీ ఈ వార్త అతనికి చెప్పు, వెళ్ళు'.

'సాయంకాలం అయ్యింది. మహారాజా'

నన్ను చూసి నేనే నవ్వుకున్నాను. అరే! ఈమె ముకుళిక. ఈమెను దేవధూతగా భావించి నేను ఆందోళన చెందాను - ఎంత భయపడ్డాను!

'చాలా అందమైన సాయంకాలం. పూజకు ఏర్పాట్లు చేయనా?'

నేను నవ్వుతూనే అడిగాను 'పూవులు దొరికాయా?'

'ఆ(.'

'ఆ తాజాగానే ఉన్నాయి. దేవునికి వాడిన పూలు ఎవరైనా సమర్పిస్తారా? ఇప్పుడే వికసించిన మొగ్గలు మహారాజా!

ఆ విరిసిన మొగ్గల సురభిళపరిమళాల అలలకై నా మనస్సు ఏదో లోకాలలో విహరించి తిరిగి వచ్చింది. నేను ముకుళికతో అన్నాను - 'పాత్రలో మధువు పోసి పూజకు ఏర్పాట్లు చెయ్యి!' నేను కిటికీ దగ్గరకు వెళ్ళాను. ఈనాటి సాయంకాలం నిజంగా ఎంతో అందంగా వున్నది.

కవులందరూ ప్రతీకలకు దాసులౌతారు. ఇటువంటి మనోహరమైన సాయం సమయం ముందు వారి ఊహాకల్పనలు మొక్కుబడిగా ఉంటాయి. పశ్చిమాన అలుముకున్న ఈ గాఢమైన గులాబిరంగు, నిజంగా సంధ్యాదేవిదేనా? కాదు, సూర్యుడు తన పెదవులపై మదిరా పాత్రను సంధ్యాదేవి అధరాలకందించాడు. ఆమె వద్దు, వద్దంటూ కుంచించుకుపోయి తన చేతిని ముందుకు చాచింది. అరచేయి తగిలి మధుపాత్ర కింద పడింది. ఆ మధుపాత్ర చుట్టూ ఒలికిన మధువే ఇది.

ఆ గాఢమైన ఎరుపు రంగు సాయంకాలానిది. మృగయానందానికి సాక్షాత్తూ అది ప్రకటిత రూపం. నల్లని భిల్లు స్త్రీ చేతి నుండి తెల్లవారు ఝామున తప్పించుకు పారిపోయిన సూర్యోదయం అనే జంతువు ఇప్పుడామె చేతికి తిరిగి చిక్కింది. ఆమె వదిలిన బాణం దాని గుండెలో లోతుగా గుచ్చుకున్నది. ఆ పగటి - హృదయం నుండి ప్రవహించిన రక్తమే పడమట అలుముకున్నది.

త్వరగా మారుతున్న సాయంకాలపు రంగు సింధూరం, అరటిపండు రంగు, నారింజ రంగు, ఇవి ఖరీదైన చీరల రంగులు. బహుశా స్వర్గద్వారం వద్ద ప్రియునికై జిహ్వాలతతో ఎదురుచూస్తున్న అప్సరస ప్రియుడికి ఏ రంగు చీరకట్టుతుంటే ఇష్టమో అనే సంశయంలో మునిగినట్లుంది. అలా ఆలోచించే ఆమె ఈ రంగు చీర కట్టుకున్నది. కాని కట్టుకున్న తరువాత బాగాలేదనిపించి మరో మంచిచీర కట్టుకోవాలనుకున్నట్లుంది. అందుకే ఆమె దానిని విడిచి - మరొక విలువైన చీర కట్టుకున్నది. కాని ఆమెకు ఏ చీరతోనూ సంతృప్తి కలగలేదు. ఆమె ఆవిధంగా చీరలు మారుస్తూనే ఉన్నది.

నా ముందున్న ఆ అద్భుత సౌందర్యం నా దృష్టి నుండి దూరం కాకూడదని భావించి, కనులు మూసుకునే ఆలోచించసాగాను.

# అధ్యాయం 25

ఈ ప్రపంచంలో మూడే సత్యాలు - మృగయా (వేట), మదిర, మగువ. ఈ మూడింటితో మనిషి తన దుఃఖాన్నంతా మరచిపోతాడు.

ఈ ప్రపంచంలో వేటకు గురికాకుండా వుండాలంటే, ఇతరులను వేటకు గురి చేయవలసి ఉంటుంది. జీవితపు ఈ అంతిమ సత్యం తెలియచేయటానికి వేట కన్నా గురువు మరొకటి లేదు. ఇది నిష్టుర సత్యం, క్రూరమైన యథార్థం. కాని జీవిత మహాకావ్యాల్లో అది అన్నిటికన్నా గొప్ప శ్లోకం. 'పవిత్రత', 'సుందరత' అనే పదాలు నిర్బలులు, బలహీనులు, నిస్సహాయతలు సృష్టించినవి. పవిత్రత యజ్ఞ వేదికపై బలి ఇచ్చే జంతువు యొక్క ధ్యానం. ఏ పాపమెరుగని లేడి, పౌర్ణమినాటి మధ్యాహ్న భోజనానికి ప్రకృతి ప్రసాదించిన వంటకం.

మధుసేవనంతో మనిషికి రెక్కలొస్తాయి. ఆ రెక్కల చప్పుడుతో వారి కాళ్ళకు ఉన్న సంకెళ్ళు తొలగిపోతాయి. మధువు మత్తులో నీతి, కర్తవ్యం, పాపం, పుణ్యం మొదలైన అన్ని కల్పనలు కరిగిపోతాయి.

అందమైన స్త్రీ క్షణికమైన కామాన్ని తృప్తిపరిచే సజీవమైన ఆటబొమ్మ మాత్రమే. అందమైన సుందరి సాహచర్యంలో మధువు మృగయానందాల సుఖసంగమ మవుతుంది.

నేను కనులు విప్పి ఎదురుగా చూసాను. సాయంకాలపు రంగులన్నీ ఆకాశం నుండి మాయమయ్యాయి. అంతటా చీకటి అలుముకున్నది. ఆ చీకటివైపు కళ్ళు చిట్లించుకుని చూసాను. అజ్ఞానమనే గోతి నుండి లేచిన ఒక పెద్ద తాబేలు, లేడిలాగా పరుగెత్తుకుంటూ నావైపు రాసాగింది. కాదు అది తాబేలుకాదు. అతడు

కాలపురుషుడు. అందరినీ భక్షించే మహాకాలుడు. అతనే ఆ సాయంకాలపు రంగులను భక్షించాడు.

నేను కిటికీ దగ్గర నిలబడలేక వెళ్ళిపోసాగాను. బయటకు చూద్దామంటే ఏమీ కనబడటంలేదు. వెనుతిరిగి నేను భవనంలోకి వచ్చాను. శయ్యపై విశ్రమించాను. ముకుళిక అప్పటికే పూజకు ఏర్పాట్లు పూర్తిచేసింది. ఆమె నా చూట్టూ సీతాకోకచిలుకలా తిరుగుతున్నది. నేను ఆమె చర్యలన్నీ చూస్తూ ఉన్నాను. నేను ఆమెతో ఏదైనా తమాషా చేస్తానసే ఉద్దేశంతో ఆమె అలంకరించుకుని నా దగ్గరే అటూ ఇటూ తిరుగుతున్నది. కాని నేను నిర్వికారంగా ఉన్నాను. స్త్రీ పురుషుల మధ్య గల ఆకర్షణ రహస్యాన్ని తొలిసారిగా తెలుసుకున్నది ఈ ముకుళిక దగ్గరే. కాని ఆ ముకుళికేనా ఈమె అనే నమ్మకం కలగటంలేదు. ఈ ఇరవై సంవత్సరాలలో ఆమె సౌందర్యం వన్నెతగ్గిపోయింది. యవ్వనం వడలిపోయింది. ఆమె లావుగా కురూపిగా కనిపిస్తున్నది.

తన స్పర్శతో పులికింపచేసిన ఇరవై సంవత్సరాల నాటి ఆ ముకుళిక..... అందమైన ముకుళిక ఎక్కడకు పోయింది? ఈమె ఇప్పుడు ప్రౌఢ అయ్యింది. రేపు వృద్ధురాలవుతుంది. నేను కూడ ఆమెలాగే రేపు ..... .....

నిన్న ... నేడు ... రేపు ... లేదు గడిచిన నిన్న, రాబోయే రేపటితో మనిషికి ఏమి సంబంధం? మనిషికి కేవలం వర్తమానంతోనే సంబంధం ఉంటుంది. పదునెనిమిదేండ్ల నుండి నేను వర్తమానంలోనే బ్రతుకుతూ వస్తున్నాను. మెరుపు వేగంతో తిరిగే కాలచక్రాన్ని నేను మదిరాపాత్రలో ముంచి నిలిపాను. ప్రియ రమణుల కంటి చూపులలో దాచి, వారి కౌగిళ్ళలో బంధించి నేను కాలాన్ని కదల కుండా చేసాను.

లేదు, ఇప్పుడు నేను ముందు వెనుకల గురించి ఏమీ ఆలోచించను. ఈ మధ్య వయసు ముకుళికను చూస్తుంటే మెత్తని అడుగులు వేసుకుంటూ మనుషులపై తన పాశాన్ని విసరి ఈడ్చుకుంటూ తీసుకుపోయే కాలపురుషుడు గుర్తుకు వస్తాడు. ఈ ముకుళికను ఇప్పుడు ఇక్కడ నుండి తీసివేయాలి. నా పూజకై వేరే అందమైన యవ్వనవతియైన దాసీని ... ...

ముకుళికను తొలగించాలా? ఆమెను తొలగించటం అంత తేలికా? లేదు. విధి నా ఆనందాన్ని ఆమె అస్తిత్వాన్ని కలిపివేసింది. విధి నా సుఖంకోసమే ఆమెను సృష్టించింది. పదునెనిమిదిఏండ్ల నాటి ఆ భయంకరమైన రాత్రి. ఇక నుండి నీ శరీరాన్ని ఎప్పుడూ తాకను. అని ప్రతిన బూని నేను దేవయాని మందిరం నుండి బయటకు వచ్చేసాను. తీరని కోరికతో నేను కామాగ్నిలో వేగిపోయాను. అవమానపు విషశూలాలు నా గుండెల్లో గుచ్చుకుంటుండేవి. అనేక రకాలైన మంచి - చెడుల ఆలోచనలు మనసులో ముసురుకున్నాయి. ప్రతీకారం, సన్యాసం, ఆత్మహత్య ...

చివరకు నేను ముకుళిక గురువుగారి మఠానికి వెళ్ళాను. ఆ మహనీయుణ్ణి ఇంతకుమునుపు ఎక్కడో చూసినట్లనిపించింది. కాని అప్పుడు సరిగా గుర్తురాలేదు. ఆ తరువాత అతని గుట్టు బయటపడింది. అతను 'మందారుడు' అమాయకురాలైన అలక మరణానికి కారణమైన నీచుడీ మందారుడు. అతనే అమ్మచేత అలకను చంపించాడు - బంగారపు శిరోజాలుగల నా ప్రియమైన స్నేహితురాలు - మందారుణ్ణి గుర్తించగానే నా మనసులో అలక మరణానికి ప్రతీకారం తీర్చుకునే కోరిక పెరగాలి, కాని అందుకు విరుద్ధంగా అతని కనుసన్నలలో మెలిగాను, అనుకోకుండా అతని చేతిలో కీలుబొమ్మనయ్యాను.

మందారుడు గొప్పసాధువుగా మారి తిరుగుతున్నాడు. అతను సాధువుగా బాగానే నటిస్తున్నాడు. అతని మాటల్లో విలక్షణమైన ఆకర్షణ ఉంది. అశాంతితో బాధపడే మనసుకు శాంతినిచ్చే శక్తి అతని ఉపదేశంలో ఉంది. అతను రకరకాల మనుషులను పోగుచేసి ఉంచాడు. సంసార జీవనంతో విసిగినవారు కొందరు, జీవితంపై విరక్తి చెందినవారు, కొందరు లౌక్యం తెలియక భయపడి పారిపోయి వచ్చినవారు. ప్రపంచంలో ఎన్ని రకాల బాధలున్నాయో, అన్ని రకాల వారూ ఈ భక్తులలో ఉన్నారు. బయట సులభంగా దొరకని సుఖాలు అతని సాన్నిహిత్యంలో దొరకడం వలన అనేకమంది అతని భక్తులయ్యారని అనుభవం ద్వారా తెలిసింది. ఆ మండలిలో మధ్యవయస్సువారు, ముసలివారేకాక అందమైన యువతులూ ఉన్నారు. ఆ సుందరాంగులను మందారుడు చాకచక్యంగా ఉపయోగిస్తాడు. పదునెనిమిదేండ్ల నాటి ఆ రాత్రి అతను ఇదేరకంగా నన్ను తన వశం చేసుకున్నాడు.

ఆ రాత్రి, నేను శర్మిష్ఠ జ్ఞాపకాలను మరచిపోవాలనే దృష్టితో మత్తును కోరుకున్నాను. నేను దేవయాని చేసిన అవమానాన్ని ఏదో ఒక మత్తులో ముంచి మరచి పోవాలనే ఉన్మాదంతో ఉన్నాను. పాపం - పుణ్యం, నీతి - అవినీతి అనే వాటిగూర్చి ఆలోచించే సమయం లేదు నాకు. ఆ దుఃఖం నుండి విముక్తి పొందే మార్గాన్ని ఆ రాత్రి మందారుడు నాకు చూపాడు. అతను నా గురువు అయ్యాడు. గత పదునెనిమిది సంవత్సరాలు భోగవిలాసాలలో మునిగిపోయేందుకు, ముకుళిక, మందారుడు నాకు అన్ని విధాలా సహాయం చేసారు. ఆరోజు మందారుడు నా జీవితంలోకి ప్రవేశించకుండా వుండివుంటే .... ....

ఆ రాత్రి దుఃఖాన్ని మరచిపోయేందుకు ఈ సులభ మార్గాన్ని మందారుడు నాకు చెప్పి ఉండకపోతే ... ఆత్మహత్య వైపు దారితీసే నా మనసనే చుక్కానిని ఆ రాత్రి అతను సరి చేసి ఉండకపోతే - ఉఫ్ ... ! ఏం జరిగి ఉండేదో! ఊహించుకోలేకపోతున్నాను. బహుశా ఏ లోయలో అస్తవ్యస్తంగా పడి ఉన్న, హస్తినాపుర చక్రవర్తి శరీరాన్ని గద్దలు పొడుచుకు తినేవి. శర్మిష్ఠయొక్క అధరామృతాన్ని తాగి కూడ సంతృప్తి చెందని అతని పెదవులను, ఏ నదిలోని చేపలో పొడచుకుంటూ తినేవి.

ఆ రాత్రి మఠంలో మందారుణ్ణి చూడగానే యతి గుర్తుకొచ్చాడు. అడవిలోని ఒక గుహలో ఇలాగే అనుకోకుండా అతన్ని కలవడం జరిగింది. శరీరానికి కష్టం కలిగిస్తే దేవుడు కనిపిస్తాడేమో అనే ఉద్దేశ్యంతో యతి ప్రయత్నిస్తూవచ్చాడు. చివరకు అతను పిచ్చివాడయ్యాడు. మందారుడు భగవద్భక్తి నాటకం ఆడు తున్నాడు. ఒక సాధువు వేషంలో ప్రపంచ నాటక రంగంపై ఆడుతున్నాడు. కాని ఈ నాటకరంగం చివరి పరదా వెనక అతను ఓ రాజులా అన్ని భోగాలూ తనవితీరా అనుభవిస్తున్నాడు.

యతి - మందారుడు ఎంత పరస్పర విరుద్ధమైన వ్యక్తిత్వాలు. మందారుని తత్వజ్ఞానం, యతి తత్వజ్ఞానానికి పూర్తి వ్యతిరేకం. సామాన్య ప్రజలను అతనే పరిశీలిస్తాడు. తన వారిని చేసుకుంటాడు. నేను కూడ ఈ విధంగానే అతని వేటకు గురి అయ్యాను. మందారుని ముఖ్యసూత్రం - జీవితం నేడు వికసించి రేపు వాడి పోయే పూవులాంటిది. ఆ పూవు సువాసనను ఎంత ఆస్వాదించగలిగితే అంత ఆస్వాదించు, ఏదోవిధంగా ఆస్వాదించు, ఇందులో పాపం లేదు.

మందారుని మార్గంలో వెళుతూ ఉంటే చిన్నప్పటి సంస్కారాల కారణంగా నా మనసు చాలా అశాంతికి గురయ్యింది. అంగీరస ఋషి ఆశ్రమంలో కచుడితో జరిగిన సంభాషణ మొదలుకొని, అతను వ్రాసిన ఉత్తరాల వరకు అనేక సంఘటనలు గుర్తుకొచ్చి నన్ను తీవ్రస్వరంతో అడుగుతున్నాయి - 'అరే, పిచ్చి వాడా, నీవు ఏ దారిలో వెళ్తూ ఉన్నావు?'

అటువంటప్పుడు మందారుడు రకరకాలుగా నా మనసుకు సర్ది చెప్పడానికి ప్రయత్నించేవాడు. అందుకై తన సిద్ధాంతాన్ని సమర్థించేందుకు ప్రాచీన ఋషుల వాక్కులను ఉదాహరణగా చెప్పేవాడు. గొప్ప గొప్ప స్త్రీ పురుషుల స్వేచ్ఛా శృంగారాన్ని కథలుగా చెప్పేవాడు, వ్యావహారిక కథలు ఉదాహరణగా చెప్పి జీవితపు అశాశ్వత తత్త్వాన్ని తెలియ చేసేవాడు.

ఒకరోజు నేను అతనితో కలిసి రథంపై కూర్చుని నగరమంతా తిరగసాగాను. రాజమార్గం నుండి తొలగి రథం ఒకవైపు వెళ్ళింది. ఆ మార్గం మొదట్లో ఒక కుమ్మరి దుకాణం ఉంది. ఆ దుకాణంలో రకరకాల ఆకారాలుగల కుండలు ఉంచ బడ్డాయి. ఆకర్షణీయమైనవి, అందమైనవి వాటి వైపు చూపిస్తూ మందారుడు అన్నాడు - 'మహారాజా, కుండలు చాలా అందమైనవి, పెద్దవి, ఔనా?'

నేను జవాబు చెప్పాను. 'నిజంగానే ప్రతీ వృత్తిలో తనదైన ఒక కళ ఉంటుంది'.

మందారుడు నవ్వుతూ చెప్పాడు - 'విధాత వృత్తిలోనూ అది ఉంది. అతను కూడా ఒక కుమ్మరే'.

నేను కుతూహలంతో అడిగాను - 'అది ఎలా?'

విధాత కూడా ఇలాగే మట్టితో కుండలు చేస్తూ ఉంటాడు. మీలాంటివిని, నాలాంటివి తయారు చేస్తాడు. ఈ కుమ్మరివాడి కుండలు పగిలితే అవి మట్టిలో కలిసిపోతాయి. మానవుడు కూడా ఈవిధంగా ఏదో ఒకరోజు మట్టిలో కలసి పోతాడు. ఆ కుమ్మరి కుండలలో ప్రాణం ఉంటుంది, నేను వారికి భోధిస్తూ ఉంటాను - 'సోదరులారా! జీవితమంతా నీరు తాగుతూ ఉండకండి, మధువు తాగండి, అమృతాన్ని తాగండి. ఏది తాగాలనుకుంటే అది ఈరోజే తాగండి. రేపు నీవు ముక్కలైతే ఏనీటి బిందువూ నీకు దొరకదు'.

ఒకరోజు తిరుగుతూ - తిప్పుతూ మందారుడు నన్ను స్మశానానికి తీసుకు వెళ్ళాడు. అక్కడ ఒక యువకుని శవం కాలుతున్నది. క్షణక్షణం అతని అందమైన శరీరం కాలి బూడిదవుతున్నది. మందారుడు ఆ యువకుని కథ నాకు వినిపించాడు. భగవంతుని పొందేందుకు అతను బ్రహ్మచారిగా మారాడు. అందు కోసం అతను తన చిన్ననాటి స్నేహితురాలి హృదయాన్ని భగ్నం చేసాడు. ఆమె జీవితమంతా దుఃఖాన్ని భరిస్తూనే ఉన్నది. ముకుళిక అతనిని మనశ్శాంతికోసం మందారుని దగ్గరకు తీసుకు వచ్చింది. నేడు ఆ యువకుడు చితిశయ్యపై అగ్ని జ్వాలల దుప్పటి కప్పుకుని, మృత్యువును కౌగిలించుకుని శూన్యంలో కలిసి పోతున్నాడు. నేటి వరకు అతను ఏ శరీరసుఖమూ పొందలేదు. ఇప్పుడిక అతనే సుఖం అనుభవించాలన్నా అసాధ్యమే అవుతుంది.

ఆ జ్వలిస్తున్న చితిని చూస్తూ ఉంటే నేనే ఆ చితిపై ఉన్నట్లనిపించింది. నా అందమైన ధృఢమైన కుడిచేయి కాలుతున్నది. తిరిగి ఎప్పుడూ ఆ చేయి మధు పాత్రను పెదవుల దగ్గరకు తీసుకుపోలేదు. కాని నా పెదవులు తమ స్థానంలో ఉన్నాయా? అవి కూడా కాలి బూడిదవుతున్నాయి. ఇక ఎప్పుడూ అవి ఏ అందమైన స్త్రీని ముద్దాడలేవు. అవి అసంతృప్తితో ఉన్నాయి, కాని .....

నా భుజంపై చేయినేసి మందారుడు చెప్పాడు, 'మహారాజా! జీవిత జమా ఖర్చులలో ఋణానికి ఎక్కడా స్థానంలేదు. నేడు పూలను వాసన చూడలేని వ్యక్తికి రేపు పూల సుగంధం దొరకుతుందని నమ్మకం లేదు. రేపు బంగారు సూర్యోదయం తప్పక వస్తుంది. రేపు సుగంధాన్నిచ్చే పూలు తప్పక వికసిస్తాయి. కాని ఆ పూల సుగంధాన్ని ఆస్వాదించేవాడు రేపు ఈ ప్రపంచంలో ఉండడు.

ఇదేవిధంగా ఒకసారి మందారుడు నన్ను నగరంలోని ఒక పండితుడి వద్దకు తీసుకువెళ్ళాడు. ఆ పండితుణ్ణి చూసి నేను ఆశ్చర్యపోయాను. నాన్నగారు మరణా వస్థలో ఉన్నప్పుడు మాధవుడు నన్ను ఈ పండితుడి వద్దకే తీసుకువెళ్ళాడు. అప్పుడు ఈ పండితుడు నా ఎదుట బ్రహ్మమాయ అంటూ చాలా మిథ్యా వేదాంతం చెప్పాడు. నేడు ఆయన చాలా ముసలివాడైపోయాడు. ఆయనకు జ్ఞాపకశక్తి కూడా పోయింది. సరిగా చూడలేడు. సరిగా నడవలేడు. కాని యవ్వనంలో ఈయనచే తృణీకరించబడిన సుఖాలన్నీ ఆయనపై తిరగబడ్డాయి. ప్రతీకారం తీర్చుకుంటున్నాయి. బుట్టమూత తీయగానే పడగెత్తి బయటకు వచ్చే

నాగుపాములా ఆయన మనసులోని అసంతృప్తకామం వికృతరూపాన్ని ప్రకటిస్తు న్నది. ఆ పండితుడు ఇంటిలో ఎప్పుడూ శాంతిగా కూర్చోలేడు. ఆయన రాజ మార్గంలో నిలబడి వస్తూపోయే యువతులను కన్నార్పకుండా చూస్తూ ఉండేవాడు. పిల్లలు ఆయనను ఆట పట్టించేవారు. కాని వాటిని ఆయన పట్టించుకునేవాడుకాదు. ఆయన కొడుకులు ఆయన్ను గదిలో బంధించారు కాని అక్కడ అయన బొగ్గు ముక్కతో గోడలపై అశ్లీలపు బొమ్మలగీసేవాడు. ఆ బొమ్మల్లోని స్త్రీలు అర్ధనగ్నంగా ఉండేవారు. వారికి ఈ పండిత మహాశయుడు ముద్దులు పెడుతూ వుండేవాడు.

ఈ పండితునివలే మందారుని మఠంకువచ్చే రకరకాల యువతులు, మధ్య వయస్సు స్త్రీ పురుషుల జీవితాన్ని నేను దగ్గరగా పరిశీలించి చూసాను. అందరి సారం ఒకటే ధర్మం, నీతి, పుణ్యం, ఆత్మ అనే పవిత్ర పదాలను మనిషి ప్రతిక్షణం పూజిస్తాడు, కాని ఇవన్నీ ప్రపంచం కళ్ళలో దుమ్ముకొట్టటానికి మాత్రమే. మనస్సు లోపల అతన్ని ఒక విషప్పురుగు తొలుస్తుంటుంది. అదే సుఖం, శరీరం ద్వారా లభించే అన్ని సుఖాలు.

జీవితం అశాశ్వతం. ఎవరికి మరణం ఎప్పుడు వస్తుందో ఎవరూ చెప్పలేరు. అందుకే దొరికిన ప్రతిక్షణాన్ని బంగారంగా భావించి దాని రసాన్ని. ఆనందాన్ని పూర్తిగా బలవంతంగా పిండుకొని, తన ఆనందపు దాహన్ని మానవుడు తీర్చు కోవాలి. మందారుడు ఈ తత్వజ్ఞానాన్నే నాకు బోధించాడు.

ఈ కొత్త జీవనమార్గం పైన నా ప్రయాణం వాయు వేగంతో ప్రారంభమైంది. దేవయాని కఠినమైన ప్రేమరాహిత్య ప్రవర్తనతో దానికి మెరుపువేగం లభించింది. ఎనిమిది ఝామూలూ విలాసంలో మునగిఉండడమే నా లక్ష్యమైంది.

ఋతు చక్రం పద్దెనిమిదిసార్లు తిరిగింది. వసంత, వర్ష, హేమంతాలహేల నిరంతరం సాగుతూనే వున్నది. పద్దెనిమిది సంవత్సరాలుగా ఋతుచక్రం తిరుగు తూనే ఉంది. రాత్రి పగలు దొంగాట ఆడుతూనే ఉన్నాయి. రాత్రి పగలును వెదుకుతున్నది. పగలు రాత్రిని వెదుకుతున్నది. ఒకదాని తరువాత ఒకటి నడుస్తూ సంవత్సరం పూర్తి అయింది. కాని నా జీవితంలో ఎప్పుడూ ఏ ఆటంకమూ రాలేదు. ఏ మార్పూరాలేదు. దేవుని వద్ద ఉంచిన నేటి పూలు రేపు మంచివికావని పారవేసినట్లే, నా భోగవిలాసానికి నిత్యం కొత్తకొత్త యువతులు వస్తూ పోతూనే

ఉన్నారు. వారు ఎక్కడ నుండి వస్తున్నారు, తరువాత ఎక్కడికి పోతున్నారు అనే విషయాన్ని నేను ఎప్పుడూ ఆలోచించలేదు. నా సుఖపాత్ర ఎప్పుడూ నిండుగా ఉన్నదా లేదా అన్నదే నేను కోరుకున్నాను. మందారుడు, ముకుళిక గత పద్దెనిమిది సంవత్సరాల నుండి దాన్ని నింపుతూనే ఉన్నారు.

కాని ... కాని ...

ఈ శృంగారయాత్రలో రెండు రాత్రులు మాత్రం నేటికి నాకు గుర్తున్నాయి. ఇప్పటికి కూడా అవి నా మనసును వేధిస్తునేవున్నాయి.

ఒకరాత్రి ముకుళిక నా కొక చాలా అందమైన యువతిని తీసుకుని నా భవనంలోకి వచ్చింది. ఆమెను తీసుకొని వచ్చి నా మంచంపై కూర్చోబెట్టింది. నేను సారా మత్తులో ఉన్నాను. ఆ సమయంలో నా దృష్టి ఆ యువతి అందమైన కళ్ళపై ఉంది. మరే జ్ఞానమూ నాలో లేదు. తెల్లవారు ఝామున నేను తెలివిలోకి వచ్చాను, నా బాహువులలో ఉన్న యువతి మొదటిసారి 'మాధవా, మాధవా' అని గొణగసాగింది. ఆమె ఎవరిని పిలుస్తుందో నాకు అర్థంకాలేదు. కొందరికి నిద్రలో మాట్లాడం అలవాటని నాకు అనిపించింది. బహూశా ఈమె కూడా తన చిన్న తమ్ముణ్ణి పిలుస్తుందనుకున్నాను. ఆమె గడ్డం కిందనున్న నా చేతిని మెల్లగా తీయ సాగాను. అప్పుడు ఆమె మరింతగా నన్ను కరచుకుని గొణగసాగింది, 'నేను నీదాసిని కదా? కాదు, కాదు, మాధవా, ఈవిధంగా నన్ను విడచి వెళ్ళకు'.

నేను తుళ్ళిపడ్డాను. ఆమె వైపు తదేకంగా చూసాను. ఇప్పుడు నేను పూర్తిగా తెలివిలోకి వచ్చాను. నేను ఆమెను గుర్తు పట్టాను. ఆమె ...... ఆమె మాధవి. బహుశ ముకుళిక ఆమెకు ఏదో మందు తినిపించి ఆమెను నా భవనంలోకి తీసుకువచ్చింది. బహుశ మందారుడు తన మంత్రవిద్యతో ఆమెను ఆకట్టు కున్నాడు. నా సుఖంకోసం వారిద్దరూ, ఏమేమి చేసారో ఎవరికి తెలుసు?

మెల్ల మెల్లగా మాధవి తెలివిలోకి రాసాగింది. ఆమె నన్ను ఉరిమినట్లు చూసింది. బహుశ ఆమె ఎక్కడికి వచ్చిందో ఆమెకు తెలిసిపోయింది. ఆమె భంగిమ భయంకరంగా ఉంది. ఒక్కసారి 'మహారాజా!' అంటూ అరుస్తూ ఆమె నన్ను తోసి వేసింది.

శబ్దం వచ్చేటట్లు భవనం తలుపు తెరచుకొని ఆమె గాలిలా పరుగెత్తుకుంటూ బయటకు వెళ్ళిపోయింది. రెండో రోజు ఆమె శవం యమునలో తేలుతూ దొరికింది.

ఆదే విధంగా ఒకరాత్రి ముకుళిక నా ఎదుటకు ఒకపడుచును తీసుకొని వచ్చి నిలిపింది. నా ఎదుట నిలుచున్న ఆమె యవ్వనం అప్పుడే పూర్తిగా విచ్చుకున్నట్లు నాకనిపించింది. ఆమె తలెత్తి చూడడం లేదు. ఆమెను చూచినా ఈ మత్తులో ఆమెను నేను గుర్తుపట్టగలనా అనే సందేహం కలిగింది. కాని రెండోరోజు వేకువనే నిద్రలేచి నేను ఆమెను చూసాను. ఆమె తారక. నేను ఆమెను చూస్తున్నప్పుడే ఆమె లేచింది. ఆమె చూపు నాపై పడినపుడామె సర్పదృష్టలాగా అయ్యింది. ఆమె ముఖం నల్లబడింది. వెంటనే ఆమె గట్టిగా 'పాము - పాము' అని అరుస్తూ భవనం నుండి బయటకు పారిపోయింది. ఆమె పిచ్చిదైందని కొద్దిరోజులు తరువాత తెలిసింది. మండుతున్న అగ్నిని పూలు అనుకొని వాటిని తుంచాలని అగ్నిలోకి వెళ్ళి కాలి చనిపోయిందని, కొన్ని సంవత్సరాల తరువాత ఎవరో వచ్చి నాతో చెప్పారు.

నా ప్రాణ స్నేహితునికి కాబోయే భార్య. అతని ప్రియమైన మేనకోడలు, ఇద్దరి జీవితాలు నా కారణంగా పాడైపోయాయి. నన్ను బావగారిగా భావించిన మాధవిని క్షణిక సుఖంకోసం నేను జీవితం లేకుండా చేసాను. బొమ్మలతో ఆడుకునే తారకను నేను చూసాను. ఆమెతో ఈ ప్రపంచంలో ఎవరూ ఆడని విధంగా నిర్దయగా ఆడుకున్నాను. ఆమె తియ్య తియ్యని పలుకులు - 'మీరు నిజం చెప్పారు. పెండ్లి కొడుకును ఎక్కడ నుండి తేను? యువరాజా! మీరే నా బొమ్మకు పెండ్లి కొడుకుగా ఉండండి!'

హర! హర! ఆమెకు నేను బ్రతికుండగానే మరణాన్ని కలిగించాను. నవ్వుతూనే ఒక పువ్వును అగ్నిలోకి విసిరివేసాను.

ఆ తరువాత నేను ఎన్నో రోజులు అశాంతంగా ఉన్నాను. ఈ చైతన్యంతో మందారుని ఆనందమార్గం పతనోన్ముఖమైనదనీ, చెడుమార్గమని తెలిసింది. నేను చాలా బాధపడ్డాను. ఈ ఆలోచనలతో మనసు కలత చెందింది. సుఖంగా జీవించాలనే ప్రయత్నంలో నేను రాక్షసుణ్ణి కాలేదుకదా? మందారుడు చెప్పిన మార్గాన్ని విడిచివెళ్ళాలా? అయితే ఎక్కడకు వెళ్ళాలనేది నాకు అర్థంకావడంలేదు.

నేను పూర్తిగా సుఖంకోరుకుంటున్నాను. మధువు మత్తులో, వేట ఉన్మాదంలో, మగువ కౌగిలిలో నేను పూర్తిగా సుఖంగా ఉండగలనని దృఢంగా నిశ్చయమైంది. దానినుండి బయట పడితే నేను దుఃఖితుడనౌతాను, ఒంటరిగా ఉండాలి. రక్షణ పొందలేను. చావు ఎల్లప్పుడూ నాచుట్టూ తిరుగుతుంది. ఆ అనుభూతి కలిగి నప్పుడు నా మనసు అశాంతి చెందుతుంది.

ఋతుచక్రం తిరుగుతూ ఉంది. కాల చక్రం నడుస్తున్నది. నా సుఖ - భోగాల చక్రం కూడా తిరుగుతూనే వున్నది.

'రాత్రి పది ఘడియలు అయ్యింది మహారాజా. ఆ మాటలు వింటూ నేను కళ్ళు తెరిచాను. అప్పుడు నాకు తెలివి వచ్చింది. బయట చీకటికి భయపడి నేను మంచంపై ఒరిగాను. అలా కళ్ళుమూతలు పడ్డాయి. మనిషికి అంతరంగమే అతని శత్రువు. మెలుకువలో మనిషి విలువైన జరీ వస్త్రాన్ని మాటలపై కప్పుతాడో, ఆ మాటలనే నగ్నంగా చూసి అతని అంతరంగం చాలా ఆనందిస్తుంది. నా శరీరం నిద్రావస్థలో ఉన్నప్పుడు నా అంతరంగం పద్దెనిమిది సంవత్సరాల సంఘటనలను స్మరింపచేస్తున్నది. గాయంలోలోపల ఇప్పటికీ పచ్చిగానే ఉంది. దానిపై ఎండిన పొరను అంతరంగం గోకి తీస్తున్నది.

నేను ముకుళికవైపు నవ్వుతూ చూసాను. ఆమె వేగంగా ముందుకు వచ్చింది. చూస్తూ ఉండగానే నా అలంకరణ పూర్తి చేసింది.

నేను గోడకున్న అద్దం ఎదురుగా నిలబడ్డాను. నా పూర్తి ప్రతిబింబాన్ని చూస్తూ ఆనందించాను. ఆ రూపం ఏయువతినైనా సమ్మోహితం చేయగలదు. కాల పురుషుని ప్రభావం నా ముఖంపై పడింది. కాని అందుకు సాధారణమైన గుర్తు - ఒక్క ముడత కూడా - నా ముఖం పైన లేదు. నేనింకా యువకునిలాగానే కనిపిస్తు న్నాను. అనుభవంలేని అలకను నావైపు లాగి ముద్దాడిన యవ్వనోద్వేగం గలిగిన ఆనాటి యయాతి లాగానే కనిపిస్తున్నాను.

నేనొక్కసారి నా ప్రతిబింబాన్ని పరికించాను. కొద్ది క్షణాలు గడిచాయి. ఆ ప్రతిబింబం అలికినట్లనిపించింది. నా ప్రతిబింబం స్థానంలో అసంఖ్యాకులైన రమణులు - కొందరు పెదవులు తడిచేసుకుంటూ - కొందరు కూనిరాగాలు తీస్తూ

- కనిపించారు. నేనొక్కసారిగా ఉలికిపాటుతో వెనకకు జరిగాను. మరల నా ప్రతి బింబం స్పష్టంగా కనిపించసాగింది. మరుక్షణం నా నుదుట వజ్రాఘాతం తగిలినట్లయ్యింది. చిందరవందరైన నా జుట్టులో తెల్లని వెంట్రుకొకటి తొంగి చూసింది. అది తెల్లని వెంట్రుకకాదు. శాపమిస్తున్న మునియొక్క బూడిద రాసుకున్న చేయిగా నాకనిపించిది.

యయాతి తలపై ముసలితనం జండా పాతింది.

ముసలితనం! జీవిత నాటకానికి చివరి నీరస అంకం!.

నేనిప్పుడు ముసలివాడినవ్వాలా? అనుభవించడానికి నాశక్తి ఖాళీ అయి పోయిందా? లేదు, ఇప్పుటికీ నాకు అసంతృప్తే. ఆనందానుభవం దృష్టితోచూస్తే నేనిప్పటికీ దాహంతోనే ఉన్నాను. లేదు, ఇప్పుడే నేను ముసలివాణ్ణి కాకూడదు.

కాని ఆ తెల్లని వెంట్రుక, కావచ్చు. ఇప్పుడు చూస్తున్న యువతుల వంటిదే అది. నేను ఎంతో ఆశతో అద్దంలోకి చూసాను. ఆ తెల్లని వెంట్రుక అలాగే ఉంది. కనులు విప్పార్చుకుని నావైపు చూస్తున్నది. అది ప్రకృతి నిర్దయతకు చిహ్నం.

నేను రెప్పలు మూసాను. అద్దంలో కనిపిస్తున్న యయాతి నిజం కాదని మనసుకు చాలాసార్లు చెప్పాను. ఆనాడు అలకను ముద్దాడిన యయాతి నిజమైన వాడు. ఆ తెల్లని వెంట్రుక నానిర్దయమైన భవిష్యత్తుకు పునాది. నేను దాని సందేశం వినడానికి సిద్ధంగా లేను. దానిని తప్పించుకుని నేను గడిపిన జీవితంలోకి పారి పోయాను.

పారిపోతూనే ఉన్నాను. పారిపోతూ పారిపోతూ అలక దగ్గర ఆగాను. ఆ అందమైన సాయంకాలం చూసి అలక - ఆమె బంగారు శిరోజాలు ఇంతవరకూ వందలాది యువతుల అందాన్ని నేను అనుభవించాను, కాని బంగారు వర్ణపు శిరోజాలున్న యువతి ......

అద్దంపైపు నుండి తలపక్కకు తిప్పి నేను కళ్ళు విప్పాను. నేను ముకుళిక దగ్గరకు వెళ్ళి ఆమెనడిగాను - 'నువ్వు చెప్పిన ఆ ముగ్ధ ఎక్కడ?'

'రంగమహల్‌లో'

'ఆమె శిరోజాలు బంగారపు రంగువేనా?'

బహుశా నేను మద్యపు మత్తులో ఏదో వాగుతున్నానని ముకుళికకు అనిపించి ఉంటుంది. ఆమె నవ్వి, త్వరత్వరగా ముందుకు వెళ్ళి రంగమహల్ తలుపు మెల్లగా తెరిచింది. శయ్యపై కూర్చున్న యువతి ఒక్కసారి నిలబడింది. నాపైపు లోతుగా చూపు విసరి తరువాత ఆమె కిందకు చూడసాగింది.

ముకుళిక తలుపు మూసింది. నేను మెల్లమెల్లగా ముందుకు వెళ్ళాను. ఏ శిల్పి చెక్కిన అప్సరసలా వున్న ఆ యువతి ప్రతిమలా నిలబడి ఉన్నది. నా స్పర్శతో ఈ ప్రతిమ ఎలా సజీవంగా మారుతుందో అనే ఆలోచన నా మనసులో కదలాడింది. నేను దగ్గరగా వెళ్ళి మెల్లగా ఆమె భుజంపై చేయి వేసాను. కొద్దిగా ముడుచుకొని క్రీగంటితో నాపైపు చూడసాగింది. నేను చేతులు చాపాను ...

అంత లోనే 'మహారాజా! మహారాజా!' అన్న ముకుళిక కంఠస్వరం ఆందోళనతో వినిపించింది. ఈ సమయంలో ఏ ఆపద వచ్చిందో, నాకర్థంకాలేదు. అశోకవనం తగలబడిపోవడం లేదుకదా! ఏమయ్యిందని ప్రశ్నించాను.

ఆమె తలుపు చాటునుండి చెప్పింది - 'మంత్రిగారు మీకోసం వచ్చి బయట వేచి ఉన్నారు'.

'ఆయనను కలవడానికి నాకు సమయంలేదు'.

'ఆయన వచ్చి చాలా సేపయ్యింది మహారాజా! మహారాజా, ఆయన ఎంత చెప్పినా వినటంలేదు. యువరాజును శత్రువులు బంధించారని చెపుతున్నారు'.

యువరాజు - బందీ - అలక - బంగారు వర్ణపుశిరోజాలు తెల్లని తలవెంట్రుకలు - ముసలితనం - మరణం.

నా మస్తిష్కంలో ఈ మాటలన్నీ మదించిన ఏనుగుల్లా ఢీకొంటున్నాయి. గుర్రెపు డెక్కల చప్పుడులా వాటి ధ్వని నా చెవులలో ప్రతిధ్వనిస్తున్నది. నాకేం చెయ్యాలో పాలుపోలేదు.

మంత్రి ఏదో చెపుతున్నారు. చాలాసేపు ఆయన ఏదో చెపుతూనేవున్నారు. కాని ఈ పనికిరాని రాజదర్బారు విషయాలు ఒక్క క్షణం కూడా నాకు వినాలనిపిం

చటంలేదు. నా మనసు రంగమహల్‌లో కూర్చున్న ఆ యువతి చుట్టూ తిరుగుతున్నది.

యయు బంధించబడటంతో దేవయాని ఏడుస్తున్నది. కాని యయాతిని తన భవనం నుండి బయటకు గెంటినపుడు ఆమెకు కొంచెమైన దయ కలగలేదు. ఊర కుక్కను బయటకు తరిమినట్లు రాజభవనం నుండి ఆమె నన్ను బయటకు నెట్టింది. అప్పుడామె కళ్ళనుండి ఒక్క కన్నీటి బిందువు కూడా జారలేదు.

నాకిప్పుడు రాజధర్మం, పితృధర్మం గుర్తు చేయటానికి దేవయాని మంత్రిని పంపింది. కాని ఆమె భార్యగా తన ధర్మాన్ని ఎంత సాగించింది? ఇప్పుడే తిన్నగా రాజప్రాసాదానికి వెళ్ళి దేవయానిని నిలదీసి అడగాలనిపించింది - సిగ్గులేనిదానా! ఈ పదునెనిమిది సంవత్సరాలు ఏనాడూ భర్త గుర్తుకు రాలేదా? ఆతణ్ని క్షమించుదామనే ఆలోచన ఎప్పుడూ కనీసం మనసులోకి రాలేదా? అతడు ప్రవాహంలో కొట్టుకు పోతున్నప్పుడు, అందులో అతణ్ని రక్షించుదామనే కోరిక ఎప్పుడు కలుగ లేదా నీకు? నీవు ఆ భయంకరమైన వరద ప్రవాహానికి భయపడ్డావా? లేదు! ప్రేమ ఎవరికి భయపడదు. అదే శర్మిష్ఠ అయితే ఊరికినే కూర్చునేదికాదు. నిజానికి నువ్వు ప్రేమించలేదు. నీకు యయాతి కావాలి, కాని ఒక చక్రవర్తి భార్యగా అధికారాన్ని చెలాయించడానికి మాత్రమే నీకు యయాతి కావాలి. ఇప్పుడు ఎందుకు దుఃఖిస్తావు? నువ్వు చేసిన దానికి ఫలితం అనుభవించు. నేను రాజధర్మం, పితృధర్మం నెరవేర్చాలని నువ్వు ఈనాడు కోరుకుంటున్నావు. తన ధర్మాన్ని స్వయంగా పాటించినవారికే ఇతరుల నుండి దానిని ఆశించే అధికారం వుంటుందని తెలుసుకో. సిగ్గుమాలిన దానా! చెప్పు! గత పదునెనిమిది ఏండ్లు నీ పత్నీధర్మం గొడ్డుబోయిందా?

మంత్రిగారు చెపుతూనే ఉన్నారు. నాకు నచ్చచెప్పి రాజభవనానికి తీసుకు వెళ్ళడానికి ప్రయత్నం చేస్తూనే వున్నారు. కాని రంగమహల్‌లో ఉన్న ఆ యువతి ముఖ - కమలం చుట్టూ తిరిగే తుమ్మెదలా నా మనసు పరిభ్రమించసాగింది. నాకు అమాత్యుని వాగుడు కర్కశంగానూ, అసహనీయంగాను తోచింది.

యయుని విడిపించి తీసుకురావాలా? యుద్ధరంగానికి వెళ్ళాలా? అక్కడ నేను వధించబడితే! లేదు, ఇప్పుడు సగం జీవితమే అయ్యింది.

మనసింకా అసంతృప్తితోనే ఉన్నది. యవ్వనమూ అసంతృప్తితోనే ఉన్నది. బంగారు వర్ణపు కేశాలుగల అమ్మాయి - బంగారు కేశాలు - తెల్లని కేశాలు ముసలి తనం - మరణం - లేదు! నేను యయును విడిపించడానికి వెళ్ళను.

మంత్రిగారు చెప్పి చెప్పి అలిసిపోయారు. నాకు నా నాలుకపైనా, గడిచిన విషయాలపైనా నియంత్రణలేదు. కాని అమాత్యునికి ఏదో ఒక జవాబు చెప్ప వలసిన అవసరం ఉంది. నేనాయనతో చెప్పాను. 'ఇన్నేళ్ళ తరువాత గుర్తువచ్చి నందుకు మహారాజు మీకు ఋణపడి ఉన్నారని మహారాణితో చెప్పండి'.

కూటనీతిజ్ఞులు ఉడుముల్లాంటి వారు. తమ పట్టుదలను నెరవేర్చుకోవటంలో ఎవరికీ తీసిపోరు. మంత్రిగారు మరలా నాకేదో చెప్పసాగారు. నా కోపం అదుపు తప్పింది. నేను సమాధానం చెప్పాను - 'యయునే ఏమిటి, మహారాణినే శత్రువులు బంధించి తీసుకుపోయినా నేను ఇక్కడ నుండి కదలను'.

నేను తిరిగి రంగమహల్‌లోకి వెళ్ళాను. నా శయ్యపైన సుందరాంగి లేచి నిల బడింది. పాపం నాకోసం నిరీక్షిస్తూ విసుగు చెంది ఉంటుంది.

కాని నా మనసులో నా తలలోని ఆ తెల్లని వెంట్రుక గుచ్చుకుంటున్నది. ఈ యువతి దృష్టిలో అది పడితే? లేదు యయాతి పైపడిన వృద్ధాప్యపు నీడగానీ, దాని ప్రతిబింబంగానీ ఎవరి కంటా పడరాదు. యయాతి నిత్యయవ్వనుడు. అత నెప్పుడూ యువకుడుగానే ఉంటాడు.

నేను మరల అద్దం ముందు నిలబడ్డాను. ఆ తెల్లని వెంట్రుక ముఖం నల్లబడి ఉంటుందని నాకనిపించింది. కాని అది నా తలపై నిలబడి నవ్వుతున్నది.

నేనా తెల్లని వెంట్రుకను మరిచిపోదామని అలక బంగారు కేశాలను గుర్తుకు తెచ్చుకుంటున్నాను. అస్తమించే సూర్యుని ప్రకాశంలా మెరిసే ఆమె కేశాలు నాకళ్ళ ముందు నడయాడసాగాయి. కళ్ళు మూసుకొని నేను వాటిని చూస్తూ ఉన్నాను.

నేను తుళ్ళిపడి చూసాను. ఆ యువతి లేచి మెల్లగా నాదరి చేరింది. ఆమె నా భుజంపై చేయి వేసింది. నేనెందుకు ఆమె నుండి దూరంగా ఉన్నానో, బహుశా ఆమెకు అర్థం కాకపోయి వుండవచ్చు. ఇంత అల్లుకుపోయినా నేను కదలక

పోవడంచూచి ఆమె తన తలను నా ఎదపై వాల్చి నా మెడ చుట్టూ చేతులు వేసింది.

నేను ఆమె కేశాలను చూసాను. ఒక్కసారి ఆమెను తోసివేసి అరిచాను. 'పో, ఇక్కడ నుండి వెళ్ళిపో1 వెళ్ళిపో!'.

ఆమె వల్ల ఏమి అపరాధం జరిగిందో ఆమెకర్థంకాలేదు. పిచ్చిదానిలా వాపైపు చూడసాగింది. నేను కోపంతో అరుస్తూ ముకుళికను పిలిచాను. ఆమె పరుగెత్తు కుంటూ వచ్చి అయోమయంగా నాపైపు చూడసాగింది. వెంటనే ధైర్యం తెచ్చు కుంటూ అడిగింది. 'ఏమి జరిగింది మహారాజా!'

'నీ ఈ పూవును బయట పారవేయ్'

'ఎందుకు? ఏం జరిగింది? ఈమె మిమ్మలను అవమానించిందా?'

'నా ఇష్టం నీకు తెలియదా?'

'అయితే. మహారాజుకు ఇష్టమైనటువంటిదే ఇది ..... .....'

ముకుళిక ఆ యువతి దగ్గరకు వెళ్ళి ఆమె తల ఎత్తింది. ఆమె ఏడుస్తూ ఉంది. నేను ఆమె దగ్గరకు వెళ్ళి రెండు చేతులతో ఆమె తలను వంచుతూ చెప్పాను. - 'ఈమె కేశాలు చూడు. ఇందులో ఒక బంగారు కేశమైనా ఉందా? నాకు బంగారు కేశాలున్న అమ్మాయి కావాలి?'

బహుశా నేను మద్యపానపు మత్తులో ఏదో అంటున్నానని ముకుళిక అనుకుని ఉంటుంది. కాని ముఖంలో ఏ భావం ప్రకటించకుండా చెప్పింది - 'గురుమహారాజుతో అలాగే చెపుతాను'.

'ఏం చెపుతావో నాకు తెలియదు. నాకు మాత్రం బంగారు కేశాలున్న అమ్మాయి ఇప్పుడు దొరుకుతుందా ... రేపా?'

'రేపే ఎలా దొరుకుతుంది మహారాజా? మహారాజుగారి అభిరుచి విచిత్రమైంది. కొద్దిగా ఓపికపడితే ..... .....'

'ఓపిక పట్టడం ఏమీ లేదు. ఇన్ని సంవత్సరాలైంది. బంగారు కేశాలున్న అమ్మాయి ఈ భవంతిలోకి ఎప్పుడూ రాలేదు'.

ముకుళిక చేతులు జోడించి చెప్పింది - 'పదిహేను రోజులు గడువు ఇవ్వండి మహారాజా. ఈలోగా గురుమహారాజు ఎక్కడనుండైనా మీ అభిరుచికి తగ్గ అమ్మాయిని.....'

'మంచిది, పదిహేనురోజులు గడువిస్తున్నాను. కాని పదిహేనురోజులలోపు అటువంటి అమ్మాయి ఇక్కడకు రాకపోతే పదహారవరోజు నిన్ను, నీ గురు మహారాజ్ శిష్యులను గాడిదమీద కూర్చోబెట్టి నగరమంతా తిప్పి ఈ నగరం నుండి బయటకు వెళ్ళకొడతాను. నేటి తిథి ఏమిటి?'

అమావాస్య

'మంచిది నీకిచ్చిన గడువుకు అంతిమ తిథి పౌర్ణమి. పౌర్ణమి నాటికి నా భవంతిలో బంగారు కేశాలుగల అమ్మాయి రాకపోయిందో .....'

ముకుళిక చేతులు జోడించి ఎదుట నిలబడింది. ఆమెపై మండిపడుతూ నేను అన్నాను - 'ఇంకా ఇక్కడే ఎందుకు నిలబడి ఉన్నావు? ఆ మూర్ఖ అమాత్యుడు నాలుగు ఘడియలు నన్ను వేధించాడు. ఇప్పుడు నువ్వు ... వెళ్ళు, తక్షణం ఇక్కడ నుండి వెళ్ళు'.

రెండోరోజు సూర్యుడు ఉదయించిన చాలానేపటికి నేను లేచాను. లేస్తూనే అద్దం ముందు నిలుచున్నాను. ప్రతిబింబాన్ని మరింత పరీక్షగా చూచి ఆశ్చర్య పోయాను. రాత్రి కనిపించిన ఆ తెల్లని వెంట్రుక నాతలపై భూతంలా నాట్యం చేస్తున్నది. దానితో కలిపి మరో తెల్లని వెంట్రుక కూడ ... ...

అన్యమనస్కుణ్ణై మంచంపై పడుకుని దొర్లసాగాను. బాధపడ్డాను. వ్యాకుల పడ్డాను. కాని ఆ చింత నా మనసును తొలుస్తూనే ఉంది. శర్మిష్ఠ జ్ఞాపకం మాటి మాటికి బాధ కలిగిస్తున్నది. వృద్ధాప్యపు భయం, మృత్యుభయం, అసంతృప్తి జీవితం, ఈ దుఃఖం అంతా ఏ అరమరికలు లేకుండా సంశయించకుండా నే నామెకు చెప్పగలను. అంతరాలలో ఉన్న ఈ ఆరని అగ్నిని, శర్మిష్ఠ కన్నీటితో నేను ఆర్పి వేసుకుంటాను. కాని నేను ఒంటరిని. ఈ ప్రపంచంలో ఒంటరిని - పూర్తిగా ఒంటరిని.

పదునెనిమిదేండ్లు సుఖ - భోగాలలో తేలినప్పటికీ కూడా నాకెందుకీ అసంతృప్తి అని నేను తర్కించుకోసాగాను. ప్రతిరోజు ఒక కొత్త అందమైన సుందరిని పొంది

నప్పటికీ ఈ ప్రపంచంలో నేను పూర్తిగా ఒంటరివాడినెలా అవు తాను? హస్తినాపుర చక్రవర్తిని ఆయినందు వలన ఈ భయంతో అసహాయుడనని, భద్రతలేనివాడనని బాధ పడ్తున్నాను.

చివరకు జీవితమంటే ఏమిటి? మనిషి ఎందుకు జన్మిస్తాడు? ఎందుకు మరణిస్తాడు? జీవిత లక్ష్యమేమిటి? దాని అర్థమేమిటి? జననం - మరణం, యవ్వనం - వృద్ధాప్యం ఒకే నాణానికి ఉన్న రెండు వైపులా? రాత్రి పగళ్ళూ ఈ జంటలు కూడా సహజమేనా? అయితే మరి మనిషి వృద్ధాప్యానికి, మరణానికి ఇంత భయపడ్తాడెందుకు?

మనిషి దేనితో జీవిస్తాడు? ప్రేమతోనా? మరి ప్రేమంటే?

నాన్నగారు మరణావస్థలో ఉన్నప్పుడు జరిగిన చర్చ. ఒకపైపు ధనుర్బాణాలు మరోపైపు 'జయతు, జయతు నహుషః' అని ముద్రించిన ఆ బంగారు నాణెం. కాదు, ఆ మాటలు నిజంకాదు. జీవితమనే బంగారు నాణానికి ఒకపైపు ముద్రించిన ధనుర్బాణాలు యమధర్మరాజువి. రెండో పైపు దుఃఖిత మానవుడు. నాన్నగారు నన్నూ యతిని ప్రేమించేవారా? మరి ఆయన ఎందుకు ఇంద్రాణిని కోరుకున్నారు? తన పిల్లల అదృష్టంలో శాపమయ జీవితంరాగలదని అయన ఎందుకు భయపడ లేదు? లేదు. ప్రేమ, వాత్సల్యం, మమత, ఇవన్నీ నిజంకాదు. ఇవన్నీ ప్రపంచపు కృత్రిమ ముఖాలు. మనిషి కేవలం తన సుఖం కోరకే జీవిస్తాడు. తన అహంకారాన్ని తృప్తి పరుచుకునేందుకే జీవిస్తాడు. అలాకాకపోతే, అమ్మ నన్ను నిజంగా ప్రేమిస్తే, ఆమె అలకను నిర్దాక్షిణ్యంగా ఎందుకు హత్య చేసినట్లు? హత్యతో యయాతికి ఎంత దుఃఖం కలుగుతుందోనని ఆమె క్షణమాత్రం ఆలోచించలేదా?

ప్రేమ, అమ్మా నాన్నది కావచ్చు లేదా భార్యభర్తలది కావచ్చు, అంతా బూటకం, నాటకం. తన అంతరాంతరాలలో మనిషి కేవలం తనని మాత్రమే ప్రేమిస్తాడు. తన శరీరాన్ని, తన సుఖాన్ని, తన అహంకారాన్ని ప్రేమిస్తాడు. ప్రేమయొక్క ఈ సంపూర్ణ స్వార్థం స్త్రీ పురుషుల రహస్యమైన, మృదువైన అద్భుత మైన ఆకర్షణలోకూడ మారదు. దేవయాని నుండి నాకేం లభించింది? ఘడియ, రెండు ఘడియల శరీర సుఖాన్నే ప్రేమంటారా? క్షణికమైన కామాన్ని సంతృప్తి పరచడం ప్రేమ అవుతుందా?

కాదు, ప్రేమ వేరు, కామం వేరు. స్త్రీ పురుషుల ప్రేమలో కామం ఉండక తప్పదు. అది యాగాగ్నిలాంటిది. జీవిత ధర్మంయొక్క మర్యాదలను పాటింపజేసేదే ఆ అగ్ని.

నేను ఈ అగ్ని పవిత్రతను రక్షించలేదు. గత పదునెనిమిందేండ్ల నా జీవన స్వరం అడవిని కాల్చే దావాగ్ని అయింది. ఈ దావాగ్నిలో ఎన్నో అమాయక పక్షులు కాలి బూడిదయ్యాయి. ఎన్ని కోమలమైన సుగంధభరిత లతలు కాలి మసి అయ్యాయో తెలియదు.

ఇది పశ్చాత్తాపమా? కాదు. ఈ రెండు తెల్లని వెంట్రుకల వలన నా మనసులో వైరాగ్యం పుట్టిందా? గత పదునెనిమిదేండ్లలో ఏదైతే జరిగిందో, అందులో నా ఒక్కడిదే తప్పా? దేవయాని స్వయంగా ప్రేమించింది. నేను కూడా ఆమెనే ప్రేమించాను. ఆనందాన్ని వెదుకుతూ నేను ప్రపంచమంతా తిరిగాను. కావచ్చు. ఈ తిరగడంలో నా కాళ్ళకింద చాలా మొగ్గలు నలిగిపోయాయి. ఇందులో నేను చేసేదే ముంది?

పదునెనిమిది సంవత్సరాలు నేను ఆనందం వెంటబడ్డాను. దాన్ని పొందేందుకు ప్రతి క్షణం దాన్ని నేను అనుభవిస్తూ గడిపాను. అయినప్పటికీ నాకెందుకీ అసంతృప్తి? దుఃఖమెందుకు? అనంతమైన క్షణిక సుఖాల సముద్రంలో శాశ్వత ఆనంద బిందువు ఎందుకు తయారవదు?

వాస్తవానికి, చివరకు సుఖమంటే ఏమిటి?

ఆనందం తుమ్మెదవంటిది. అది ఒక పూవు నుండి మరో పూవుపై వాలుతూ తిరుగుతుంది. ప్రతి పువ్వులోని మకరందాన్ని గ్రోలుతూ ఉంటుంది. తుమ్మెద ఎప్పుడైనా వైనతేయుడు (గరుత్మంతుడు) అవుతుందా? స్వర్గం నుండి అమృత భాండాన్ని తేవడం, తుమ్మెద వల్ల కాదు, గరుడుని వల్లనే అవుతుంది. తుమ్మెద - గరుడుడు, శాశ్వతమైన ఆనందం - రెండూ వేరువేరు. నేను క్షణికమైన సుఖం వెనుక పరుగులుపెట్టాను. దాన్ని పొంది కూడా ఆనందాన్ని పొందలేకపోయాను.

ఎక్కడ దొరకుతుంది ఈ ఆనందం? దానికి ఏ శారీరిక సుఖంతోనూ సంబంధం లేదా? భగవంతుణ్ణి వెదుకుతూ పిచ్చివాడైన యతికి చివరకు ఎటువంటి

ఆనందం లభించింది? మందారుడు శ్మశానంలో చూపించిన ఆ యువకుడు చివరకు ఏ ఆనందం పొందాడు?

లేదు, గత పదునెనిమిదెండ్లలో నేను స్వేచ్ఛగా జీవితాన్ని అనుభవించాను, అందులో తప్పు లేదా? నన్ను నేను ప్రేమించాను, కేవలం నా సుఖాన్ని దృష్టిలో ఉంచుకున్నాను, ఇందులో తప్పుందా?

మనిషి కేవలం తననే ప్రేమించు కుంటాడా? అలక, మాధవుడు, కచుడు, వీరంతా నన్ను ప్రేమించారు. అది స్వార్థమా? కోరికలేని ప్రేమ కాదా?

మరి శర్మిష్ఠ - ఆమెకు నేనంటే వల్లమాలిన ప్రేమ. ఆమె ఈ పదునెనిమిదేండ్లు ఎలా గడిపింది? ఎక్కడ గడిపింది? అడవిలోనా? ఎవరి దాసిగా ఉన్నది? ఆమె ఇప్పుడు జీవించి ఉందా? లేక ... ....

'శర్మిష్ఠ, ఎల్లప్పుడూ తన మనసులో మహారాజు పాదాలను పూజిస్తూ ఉంటుంది'. అన్నదే శర్మిష్ఠ మాధవునితో నాకు పంపిన చివరి సందేశం. అడవిలో, ముళ్ళపొదల్లో, కందమూలాలు తింటూ, ఆమె నాచరణాలను పూజిస్తూ ఉంటుంది. మరి ఇక్కడ నేను? నేను ఆమె పవిత్ర జ్ఞాపకాలతో ఎప్పుడూ మధువును సేవిస్తూ ఉంటాను. ఆమె అధరామృతాలతో పవిత్రమైన పెదవులను ఎవరివో ఎంగిలి పెదవు లతో కలుపుతుంటాను.

అలా ఎందుకు జరగాలి? నేను శర్మిష్ఠ వలె ఎందుకు ప్రేమించలేక పోతున్నాను? కచునిలా నిగ్రహంలో జీవితాన్ని నేనెందుకు గడపలేకపోతున్నాను.

మానవుని ఎటువంటి కోరికైనా తప్పే అవుతుందా? కాదు, కోరిక మానవుని జీవనాధారం. నా వలన ఎక్కడైనా తప్పు జరిగిందా? నా కోరిక నిరంకుశమైనదా? ఈ ప్రపంచంలో ఏ చిన్న సుఖమైనా - అతని ప్రవర్తన, పరిస్థితి, అసంపూర్ణ జీవిత మర్యాదలలో పరిమితమై ఉంటుందని నాకు తెలుసు.

నాలాగే కచుని ఎదుట సుఖభోగాలు ఉన్నాయి. సంజీవని విద్య పొందిన తరువాత స్వర్గలోకం వెళ్ళాడు. దేవదేవతలు జయధ్వానాలు చేసి ఉంటారు. ఇంద్రుడు అతనికి అర్థ సింహాసనం ఇచ్చే ఉంటాడు. అప్సరసలు తమ అందమైన శరీరాలను అతనికి అర్పించే వుంటారు. కాని కచుడు చలించలేదు. అతనికి ఈ నిగ్రహశక్తి ఎలా వచ్చింది?

కచుడు పుట్టుకతో విరాగికాదు. అతను దేవయానిని హృదయపూర్వకంగా ప్రేమించాడు. అతను తన సుఖంకంటే జాతి పట్ల తన కర్తవ్యం ఎక్కువని అంటాడు. ఆ కర్తవ్యం కొరకు ప్రేమను త్యాగం చేసాడు. ఆ త్యాగం వలన అతని జీవితం విఫలం, ఉదాసీనం, క్రియాశూన్యం కాలేదు.

దేవయానితో నేను గృహస్థ సుఖాన్ని అనుభవించాను. శర్మిష్ఠ ద్వారా నాకు అందమైన ఉదాత్తమైన ప్రేమ లభించింది. అయినప్పటికీ కూడ నేను అసంతృప్తితో ఉన్నాను. యువతుల కోమలమైన పెదవుల అమృతం రుచి చూడని కచుడు తృప్తితో ఉన్నాడు. అలా ఎందుకు జరిగింది? నా వలన ఎక్కడో తప్పు జరిగింది?

ఈ అశోకవనం నుండే కచుడు ఉత్తరం వ్రాశాడు. ఆ ఉత్తరం మరోసారి చదవాలనిపిస్తున్నది. కాని అది రాజభవనంలో ఉంది. ఈ పదునెనిమిదేండ్లలో ఇంత తీవ్రంగా దానికోసం ఎప్పుడూ ఆలోచించలేదు. ఆ రెండు వస్తువులు - అలక బంగారు కేశాలు, కచుడు వ్రాసిన బంగారపు ఉత్తరం, రెండూ ఒకే చోట ఉంచాను.

ఉత్తరం ఎప్పుడైనా బంగారమవుతుందా? అధికంగా ఆలోచించడం వలన నేను పిచ్చివాడిని కాలేదుగదా? లేదు, నాకన్నీ సరిగ్గా గుర్తుకొస్తున్నాయి. పౌర్ణమి రాత్రికి మందారుడు బంగారుకేశాలు గల యువతిని ఈ భవంతిలోకి పంపించక పోతే ....

బంగారు కేశాలు - కచుని ఉత్తరం! ఆ ఉత్తరాన్ని చదివితే నా మనసుకు శాంతి లభిస్తుందా? కాని దేవయాని ఆ ఉత్తరాన్ని ఎవరి చేతికీ ఇవ్వదు. నేనే ఆ ఉత్తరం కొరకు రాజప్రాసాదానికి వెళ్ళనా? ఆహ(. ... అది అసంభవం. ఆ రాత్రి దేవయానిచేత అవమానించబడిన తరువాత నేను రాజప్రాసాదంలో అడుగుపెట్ట లేదు. ఎప్పుడూ అడుగు పెట్టను. ప్రాణం పోయినా కూడా! ఈ అశోకవనంలో నేను సుఖంగా ఉన్నానా? ఏదో తుమ్మెద అందమైన స్థంభాన్ని లోపలనుండి తొలిచి బోలు చేస్తున్నట్లు ఈ పనికిరాని అసంతృప్తి నా మనసును ఎల్లప్పుడూ ఎందుకు అశాంతిమయం చేస్తున్నది? తెల్లని వెంట్రుకల కారణంగా ఉత్పన్నమైన మృత్యుభయాన్ని బంగారు వెంట్రుకల ఉన్మాదంలో మరచిపోవాలనే కోరిక ఎందుకు నా మనసులో ఎల్లప్పుడూ కలుగుతున్నది?

కోరిక భూతంలా ఉంటుందా? బాల్యంలో అలక పట్ల నా కోరిక అసంపూర్తిగా ఉండిపోయింది. ఇన్ని సంవత్సరాలు మనసు పొరలలో బందీ ఆయి ఉన్న కోరిక నేడీవిధంగా విముక్తి పొందిందా?

ఈ కోరిక మీద నేను ఎందుకు విజయాన్ని పొందలేకపోయాను? నేను సామాన్యమైన మనిషినైతే మనసును అధీనంలో ఉంచుకోవడం చాలా సులభం అవుతుందా? మనిషి తన సుఖాన్ని వెదుకడం మానకపోతే అతనికి అంతిమ సత్యం బోధపడకూడదనేది ప్రకృతి సూత్రమా? దేవయాని యయుని ఎల్లప్పుడూ నానుండి దూరంగానే ఉంచింది. ఈ పదునెనిమిదేండ్లు నా వాత్సల్యం అసంతృప్తిగా ఉండి పోయింది. యయు నాతో ఉండి ఉంటే నా మనస్సులో ఉన్న శూన్యం పోయేదా? యయు లేడు. నిజమే. పురు దొరుకుతాడా? పురు ఎక్కడ ఉన్నాడు? అతనేమి చేస్తున్నాడు? ఎవరిలా వుంటాడు? నాలాగానా లేక శర్మిష్ఠ లాగానా? నేనెంత నిర్దయుణ్ణి! ఈ పదునెనిమిది సంవత్సరాలు వాడిని పూర్తిగా మరిచిపోయాను.

అత్యధికమైన విలాసం వలన మనసు చెవిటిదవుతుందా? ఈ చెవిటితనం వలన మానవత్వం నాశనమవుతుందా?

యమునలో మునిగి చనిపోయిన మాధవి - అగ్నిలో కాలి బూడిదైన పిచ్చి తారక - వీరంతా ఇక్కడకు ఎలా వచ్చారు? ఇక్కడ నుండి వీరు పారిపోయారు కదా? లేదు, నేను వారితో నిర్దయగా వ్యవహరించలేదు. నేను సుఖాన్ని వెదుకుతున్నాను - గుడ్డిగా వెదుకుతున్నాను.

కచుడు నిగ్రహాన్ని ఎలా పొందాడు? నేను ఎందుకు పొందలేకపోయాను?

నాకు కామం నాన్నగారి వారసత్వంగా లభించింది. అదే నాకు ఒక శాపంగా మారింది. నా భార్యే నాకు శత్రువయ్యింది.

నేను ఈ జీవిత స్వేచ్ఛా ప్రవాహంలో ఎందుకు కొట్టుకుపోతున్నాను? నేను ప్రవాహానికి ఎందుకు ఎదురీదలేదు? వర్షపునీటితో ఒడ్డులను ఒరుసుకుంటూ భయంకరంగా పొంగే నదిలాంటిది కామం. రెండు ఒడ్డులకు మధ్య ప్రశాంతంగా ప్రవహించే శరదృతువులోని ప్రవాహంలాంటిదని భావం. హే భగవాన్! ఈ రెండింటికి గల తేడా పదునెనిమిదేండ్ల ముందు నాకు అర్ధమై ఉండి ఉంటే!.

చూచేవారికి నేను గాఢనిద్రలో ఉన్నట్లనిపిస్తుంది. కాని మూసిన రెప్పల్లో, మనసులో భయంకరమైన యుద్ధం జరుగుతున్నది. అనుకోని విషయాల జ్ఞాపకాలు మనసులో మెదలుతున్నాయి. గుండెను పిండి చేస్తున్నాయి. గతంవైపు వెనుతిరిగి

చూడాలంటే నాకు ధైర్యం చాలడంలేదు. ఈ దుఃఖాల నుండి బయటపడడానికి ఒకటే మార్గం - ఆత్మహత్య!

నేను వణికిపోయాను. మనసు నన్ను చూచి నవ్వుతున్నది. ఆత్మహత్య చేసుకోడానికి కావలసిన ధైర్యమే ఉంటే, పదునెనిమిది సంవత్సరాల పూర్వమే నేను ఆత్మహత్య చేసుకునేవాడిని కదా?

మనసు యొక్క ఈ విచిత్రమైన ఉదాసీనత నుండి బయట పడాలంటే నాకు చిరపరిచితమైన ఉపాయం ఒకటే ఉంది. అది - అనుభవించిన భోగవిలాసపు సుఖ క్షణాలను స్మరించడం, దానిలోనే నేను ఈదులాడుతున్నాను.

నా సుఖాల పాత్రను నింపిన అనేక రూపాలు నాకళ్ళముందు నుండి వెళ్ళి పోతున్నాయి. ఆ ఉత్తరంలో ఉన్న సన్నని అందమైన యువతి! ఆమె కేశాలు ఎంత అందంగా ఉన్నాయి. వాటిని సవరిస్తూ ఉన్నప్పుడూ, ఇవి కేశాలుకావు, ఈమె ముఖ కమలంపై నున్న తుమ్మెదల గుంపని నాకనిపించింది. నా స్పర్శతో ఈ తుమ్మెదలు తమ సమాధి నుండి మేల్కొని ఝుం అంటూ ధ్వని చేస్తాయి ....

ఆ అందమైన శ్యామవర్ణపు చిన్నది, బహుశ కిందటి జన్మలో ద్రాక్షలత కావచ్చు. ఆమె అధరాల స్పర్శతో శరీరమంతా రోమాంచితమై పులకించింది. ఆమె, ఆ సిగ్గులొలికే శ్యామల వర్ణపు సుందరి తలను పైకెత్తి ముద్దిడుతుంటే కలిగిన ఆనందం! ఆకాశం మధ్యలో మబ్బులనుండి బయటకు వచ్చిన అర్ధ చంద్రునిలా ఉంది. ఆమె ప్రసన్నస్వరూపిణి, ఆమె శృంగారంలో నేర్పరి, మదనునికే రతిక్రీడ నేర్పగల జాణ.

ఈవిధంగా లెక్కలేని యువతులు వచ్చి పోయారు. అందమైన వాలు చూపులు, కోమలమైన కౌగిళ్ళు సుఖమంతా నేను తనివితీరా అనుభవించాను. కాని ఇప్పటి వరకు బంగారు వర్ణపు కేశాలు గల యువతిని ...

'మహారాజు మనసు ఈరోజు బాగున్నట్లు లేదు?' - ముకుళిక నా తలవద్ద నిలుచుని వంగి అడిగింది.

నేను కళ్ళు తెరిచాను. నా అశాంతి కోపంగా మారి బయటపడింది. కోపంగా అడిగాను - 'నన్ను ఎవరు మేల్కొల్పారు? నా ఏర్పాట్లు ఎవరు చూస్తారు? ఇప్పటి వరకూ నీవు ఎక్కడ ఉన్నావు?'

ఆమె భయపడుతూనే చెప్పింది - 'రాజభవనానికి వెళ్ళాను'.

'ఇంత ఉదయమా?'

'అవును, తెల్లవారుతూనే వెళ్ళాను'

'ఎందుకు?'

'నిన్నరాత్రి అమాత్యులు ఇక్కడనుండి చాలాకోపంతో వెళ్ళిపోయారు. ఆయన వెళ్ళి మహారాణితో ఏమేమి చెప్పారో తెలియదు. నాకు భయం వేసింది. మేము పేదవాళ్ళం, మహారాజుగారి దయతో రెండుపూటలా భోజనం చేస్తున్నాం. మహారాణిగారు కోపగించుకుని పనిలోనుండి తీసివేస్తే - అందుకే ఆలోచించి స్వయంగా వెళ్ళి అక్కడ ఏమి జరుగుతుందో తెలుసుకుందామనుకున్నాను'.

'అయితే అక్కడ ఏమి చూచి వచ్చావు?'

'రాజభవనంలో సర్వత్రా ఆనందోత్సవం జరుపుకుంటున్నారు'

'ఆనందోత్సవమా! మహారాణి ఆనందానికి కారణం ఏమిటి? ఇంకా నేను చావ లేదు కదా! సరే ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది. యయును శత్రువులు బంధించారనే ఆనందంలో ఆమె పండుగ చేసుకుంటూవుండవచ్చు!'

ముకుళిక ఉలిక్కిపడి నాపైపు చూస్తూ చెప్పింది - 'యువరాజు బందీగా లేరు, ఆయన బంధ విముక్తులయ్యారు'.

ఇదేమి తమాషా! యదు బంధించబడ్డాడని నిన్నరాత్రి కబురు వచ్చింది. తెల్లవారేసరికి అతను బంధవిముక్తుడయ్యాడనే వార్తా? చాలా విచిత్రమైన వార్త. నేను ఆశ్చర్యపోయి అడిగాను - 'యువరాజు ఎలా బంధవిముక్తుడయ్యాడు?'

'ఎవరో వీర యువకుడు తన ప్రాణాన్ని పణంగా పెట్టి యువరాజును విడిపించాడని విన్నాను. ఆ మిత్రుణ్ణి వెంటబెట్టుకుని యువరాజు హస్తినాపురం వస్తున్నారని ఈ శుభ వార్త తెచ్చిన దూత నాతో స్వయంగా చెప్పాడు'.

'నిజంగా శత్రువుల ఖైదునుండి యయు విడిపించబడ్డాడనే వార్త నాకు ఆనందాన్నివ్వాలి. కాని నానోటినుండి అప్రయత్నంగా మాటలు వెలువడ్డాయి -

'విడిపించబడ్డాడా? మంచిది' ఆ మాటలతో నాలో నేనే భయపడ్డాను. నా భావాలన్నీ ఆవిరి అయిపోయాయా? నా హృదయం మండిపోయిందా? గత పదునెనిమిదేండ్లుగా యయాతి ఎక్కువగా జీవితాన్ని అనుభవించాడా! అసలు యయాతి జీవితంలో ఏ భాగం తృప్తి చెందింది? ఎవరు - ఎవరు గొణుగుతున్నారు?

యయాతి శరీరం మాత్రమే బ్రతికున్నది.

ముకుళిక ఆదుర్దాగా చెప్పసాగింది. 'దేవిగారి తండ్రిగారు త్వరలో ఇటు వస్తారట'.

'ఎవరు శుక్రాచార్యులా? ఆయన ఇటెందుకు వస్తారు? ఆయన ఘోరమైన తపస్సు చేయడానికి కూర్చున్నారు కదా!'

'ఆయన తపస్సు పూర్తయ్యిందని విన్నాను. శుక్రాచార్యులు ఇక్కడకు వస్తారా? నేను హస్తినాపురం నుండి ఎక్కడకైనా వెళ్ళిపోతే!'

మహారాణి, కచుణ్ణి కూడా పిలిపిస్తున్నారు అంటూ ముకుళిక నా దగ్గరగా వచ్చి మెల్లగా నా చెవిలో గొణిగింది. - 'మహారాణి యువరాజుకు రాజ్యాభిషేకం చేయడానికి నిర్ణయించారు. కొత్త చక్రవర్తిని ఆశీర్వదించమని శుక్రాచార్యులవారినీ కచునీ ఈ సందర్భంలో -'

దేవయాని మరలా నాపై ప్రతీకారం తీర్చుకోవాలనుకుంటున్నది. ఏమైనాసరే హస్తినాపురం వదిలి వెళ్ళరాదని - సింహాసనాన్ని వదలరాదని మనసులోనే నిర్ణయించుకున్నాను. మహారాణి ఎంత అభిమానంగా పిలిస్తే మాత్రం కచుడెలా వస్తాడు? నేను ముకుళికతో అన్నాను - 'శుక్రాచార్యుల వలెనే కచుడు కూడా తపస్సు చేస్తున్నాడు కదా?'

'ఆయన తపస్సూ పూర్తయ్యిందని విన్నాను'

నేను నవ్వి చెప్పాను - 'అందరి తపస్సు పూర్తి అయ్యే సమయం ఆసన్నమైంది. మంచిది. నా తపస్సుకూడ ఇప్పుడు పూర్తిగాబోతుందని తెలుసుకో!'

'అంటే?'

'ముందు మదిరా పాత్రనింపు. అంతా చెప్తాను'

'ఉదయాన్నే?'

'దాసి ఎక్కువ మాట్లాడకూడదు. విషం అడిగినా ఇవ్వటమే నీ పని, అర్థమైందా?'

ముకుళిక అద్దం దగ్గర వున్న మదిరాపాత్రను తీసుకు రావడానికి వెళ్ళింది. ఆమె వెంటే నా చూపు కూడ అద్దం పై పడింది. ఆ రెండు తెల్లని వెంట్రుకలు నాకళ్ళ ముందే కదులుతున్నాయి. వెంటనే తెల్లని జటాజూటాలతో ఉన్న శుక్రాచార్యుడు కనిపించాడు. ఆయన కళ్ళు అగ్నిని కురిపిస్తున్నాయి. నేనాయన చూపుతో చూపు కలపలేకపోతున్నాను. ఆయన నుండి తప్పించుకొని దూరంగా పారిపోయే దారి...... ఆ నల్ల సముద్రపు అడుగున ఎత్తైన రాళ్ళలోకి వెళ్ళి దాక్కోవటమే నాకున త్రోవ. ఆ మార్గంలో మధువే నా సహచరుడు.

మదిరను గుటకేస్తూ నేను ముకుళికతో చెప్పాను. - 'ఆ బంగారు రంగు కేశాలున్న అమ్మాయి భవనంలోకి వస్తే నన్ను లేపు. అంతవరకూ నన్ను నిద్ర పోనివ్వు'.

ఆ పదిహేను రోజులు ఎప్పుడు సూర్యోదయం అవుతున్నదో, ఎప్పుడు సూర్యుడు అస్తమిస్తున్నాడో నాకు సరిగా తెలియదు. కాని ప్రతి రాత్రి నా మనసు ఆ నల్లని సముద్రపు అడుగు నుండి చేపలా పైకి వస్తుంది. ఆకాశంలోని చంద్రునివైపు ఒకసారి చూస్తుంది. ప్రతిరాత్రి ఒక్కోకళతో పెరుగుతున్న చంద్రుణ్ణి చూసి అది తనలోతానే అనుకుంటున్నది - 'నేడు చతుర్థి! నేడు సప్తమి! నేడు నవమి! నేడు ద్వాదశి, పున్నమికి ముందు ఆ బంగారు రంగు కేశాలుగల అప్సరస ... ....

ఈ క్షణంలో మరో అనుభూతి కలుగుతుంది. అది మెల్లగా చెప్పింది. 'యయాతీ! పిచ్చివాడా, ఎక్కడకు వెళుతూ ఉన్నావు? ఈ దారి నరకానికి తీసుకు పోతుంది'. నేను మధువును గుటకేస్తూ అన్నాను - 'స్వర్గం - నరకం రెండూ ప్రక్క ప్రక్కనే ఉంటాయి కదా?' అది గొణుగుతుంది. 'అవును, వాటి సరిహద్దులు ఒకదానితో ఒకటి కలిసే ఉంటాయి'. తిరిగి నేను నవ్వుతూ అన్నాను - 'అయితే

నా గురించి నీవెందుకు ఇంత భయపడ్తున్నావు? రేపు ఒక్క క్షణంలో నేను నరకపు దారి వదలి స్వర్గపు దారి పట్టవచ్చు'. అది కళ్ళల్లో కన్నీరు నింపుకొని చెప్పింది - 'పిచ్చివాడా! స్వర్గం - నరకం రెండింటి సరిహద్దుల్లో అడుగడుగునా ద్వారా లుంటాయి. పెరిగిన తరువాత మనిషి తన చేత్తో వాటిలో ఒక్కొక్క దానిని మూసి వేస్తూ ఉంటాడు. ఒకసారి మూసిన ద్వారం తిరిగి తెరుచుకోదు. ఓరి అభాగ్యుడా! ఇప్పుడు నీకు ఒకే ద్వారం తెరిచి వుంది. దానిని నీ చేతితో మూయకు, నా మాట విను'.

ఈ బాధను నేను మదిరాపాత్రలో ముంచి వేస్తాను. కాని ప్రతి రాత్రీ కనిపించే ఆ స్వప్నం దేనిలోనూ మునగదు. ఆ స్వప్నంలో ఒక ప్రచండరథం కనిపిస్తుంది. రథానికి ఆరు గుర్రాలు పూన్చి ఉంటాయి. అన్ని గుర్రాలు పెద్దవిగా ఉంటాయి. అందులో ఒక గుర్రం అందానికి ప్రతిరూపం. ఏదో అజ్ఞాత హస్తం ప్రతీగుర్రం తలను మొండెం నుండి వేరుచేసి దాని స్థానంలో మానవుని శిరసును ఉంచు తున్నట్లు కనిపిస్తుంది. మెల్ల మెల్లగా ఆ శిరస్సులన్నీ నాకు బాగా కనిపించాయి. ప్రతి తలా నా తలలా ఉంది. ఆ రథ సారథి! అక్కడ కూడ యయాతే కూర్చున్నట్లు కనిపించింది. ఆ సారథి చేతిలోని కళ్ళాలు - ప్రతి కళ్ళెం ఆ సారథి రక్తనాళాలతో తయారు చేసినట్లు కనిపిస్తున్నది. అతని చేతిలోని కొరడా - బహుశ అతని మూలిగలోని నరాలతో చేశారేమో, కలలోని ఆ సారథి గుర్రాలను అదుపులో ఉంచుకునేందుకు చాలా ప్రయత్నిస్తున్నాడు, కాని అవి అతని అదుపు లోకి ఏమాత్రం రావడంలేదు. స్వేచ్ఛగా పరుగెత్తుతున్నాయి, ఎటుపడితే అటు పరుగెత్తుతున్నాయి. రథం గుంటలు, గోతుల వెంట పోతూ సారథిని బలహీన పరుస్తున్నాయి.

ప్రతిరాత్రి నేనిదే కల చూస్తున్నాను, కాని పద్నాల్గవ రోజురాత్రి ఈ రథం చాలా వక్ర మార్గంలో వెళ్ళ సాగింది. ఒకవైపు చాలా ఎత్తైన పర్వతం. రెండో ప్రక్క అతి లోతైన లోయ. రథానికున్న ఆరు గుర్రాలలో అతి అందంగా కనిపించే గుర్రం ఒక్కసారిగా అదుపుతప్పి, లోయవైపు పరుగెత్తసాగింది. కళ్ళెం తెగిపోయింది. చూస్తూ ఉండగానే రథం లోయలోపడి పోయింది. లోయ నుండి చెవులు బద్ద లయ్యేంత ధ్వని వినిపించింది. - ఆకాశం విరిగిపడిందా అన్నట్లున్న భయంకర ధ్వని నేను 'శమా! శమా!' అంటూ అరుస్తూ మేల్కొన్నాను.

కలలో శర్మిష్ఠను నేను ఎలా పిలిచాను? ఆమె రథంలో ఎక్కడా లేదు. ఈ కల నాకు చాలా అశుభంలా తోచింది. ఇదే సమయంలో ఎక్కడో అజ్ఞాత వాసంలో పురు ఒడిలో శర్మిష్ఠ ఈ భయంకరమైన ప్రపంచం నుండి వీడ్కోలు తీసుకోలేదు కదా?

ఏం చేయాలో తెలియడంలేదు. నిద్రకూడ పట్టడంలేదు. రాత్రంతా నేను మధువు మత్తులోపడి శవంలాగ మంచంపై పరుండిపోయాను.

సూర్యుడు అస్తమిస్తున్నాడు. పౌర్ణమి చంద్రుడు ఉదయిస్తున్నాడు. ఈ చంద్రు డనే పాత్రలో మధువును తాగుతూ ఆకాశం ఆనందంలో మునిగిపోయింది. దాని చేతిలోని పాత్ర తొణకడంతో ఒలికిన మధువు భూమిని చేరుకుంటున్నది.

నా ధైర్యం జారిపోతున్నది. మూడవ ఝాము నుండి మనసు ఒకే విషయాన్ని ఆలోచిస్తున్నది. ఆమె బంగారు కేశాలను తాకినంత మాత్రాన, అలక దొరికినంత ఆనందం నాకు కలుగుతుందా?

నేను ముకుళికను పిలిచి అడిగాను - 'నీ బంగారు పూవు ఎక్కడ?'

'గురు మహారాజ్ మఠంలో .....'

గత పదిహేను రోజుల నుండి తాగుతూనే ఉన్నాను. మదిర మత్తు నన్నలు ముకుంది - 'ఒకమాట గుర్తుంచుకో. నీవూ, మందారుడు నన్ను మోసం చేయాలని చూస్తే ఇద్దరి తలను నరికేస్తాను. లేదు, నీతల తీసి నగరంలో నిన్ను తిప్పిస్తాను. ఆ మందారునీ తలను తగలేస్తాను. తెలుసా! నేను ఎవరినో?' - నేను హస్తినాపుర చక్రవర్తిని చెపుతూ చెపుతూనేనాగాను. మనసు వశం తప్పుతున్నది. లంపటత్వం నన్ను ఊరుకోనివ్వలేదు. నేను ముకుళికను అడిగాను - 'ఎక్కడ దొరికింది ఆ బంగారు అప్సరస నీకు?'

'ఇక్కడే'

'ఆమె ఇక్కడే ఉంటే మీరు ఇప్పటివరకు ఆమెను నా ముందు ఎందుకు ఉంచలేదు? ఆ మందారుడు కపటి. నీవు చాలా తెలివైన దానవు'.

'క్షమించండి మహారాజా! కాని - కాని - ఆమె హస్తినాపురానికి చెందినది కాదు. ఈ రోజే ఆమె ఈ నగరంలోకి వచ్చింది'.

'ఎందుకు?'

'తన ప్రియుణ్ణి వెదకడానికి'

'ప్రియుణ్ణి వెదకడానికా!' నేను పరిహాసం చేస్తూ పకపక నవ్వడం ప్రారంభించాను. నేను ఇంకా చెప్పాలనుకున్నాను. కాని నవ్వు ఆపుకున్నా ఆగ లేదు. చివరకు చాలా కష్టంగా నవ్వు ఆపుకుంటూ ముకుళికతో అన్నాను - 'ఆమె ప్రియుడు అశోకవనంలో ఉన్నాడని ఎవరూ చెప్పలేదా?'

'రేపు ఆమెకుకూడా అలా అనిపిస్తుంది, ఈరోజు మాత్రం .....'

'నేడు ఆమె ప్రియుడెవరు? నీవా?'

ముకుళిక నవ్వుతూ అంది - 'ఆమె ప్రియుడు యుద్ధభూమికి వెళ్ళిన యువకుడు. యువరాజుతో అతను కూడ నగరంలోకి వస్తాడని ఆమెకు ఎవరో చెప్పారు. ఆ పిచ్చి అమ్మాయి అతణ్ణి కలవడానికి చాలా వ్యాకులపడుతున్నది. తనతో ఉన్న ఒక ముసలిదాన్ని వెనుకనే విడచి ఆమె ఈరోజు ఉదయమే ఒంటరిగా నగరంలోకి వచ్చి తన ప్రియుణ్ణి వెదక సాగింది. యువరాజు ఈరోజు రాత్రికి వస్తాడని, ఇక్కడకు వచ్చిన తరువాత ఆమెకు తెలిసింది. పాపం ఆమె నిరాశచెందింది. ప్రియుణ్ణి వెతుకుతూ ఉన్నప్పుడు మఠంలోని శిష్యుడు ఆమెను చూసాడు'.

'ఇప్పుడామె ఏమి చేస్తున్నది?'

'పిశాచం లాంటి అమ్మాయి. గురు మహారాజ్ కూడ ఆమెను వశపరచుకోలేకపోయాడు. మఠం చీకటి గదిలో ఆమెను బంధించారు. అయితే ఆమె చాలా అల్లరి చేస్తున్నది. అందుకే ఇప్పుడామెకు స్పృహ తప్పే మందు ఇచ్చాం. రాత్రి పదిఘడియల తరువాత ఆమెకు మెల్లగా మెలుకువ వస్తుంది'.

'పది ఘడియల రాత్రి! నేను అంతవరకూ లేచి ఉండాలా? ఎందుకు? అంత మందు ఆమెకు ఎందుకు త్రాగించావు?'

'ఆమె చాలా అల్లరి చేసింది, మహారాజా! ఈరోజు మఠంలో రకరకాల ప్రజల రాకతో చాలా పెద్దగుంపు ఏర్పడింది. కొందరు శుక్రాచార్యుని చూడడానికి వచ్చారు. కొందరు యువరాజుని చూడడానికి వచ్చారు. ఈ పరాయి వారి కారణంగా ఎవరికైనా తెలిసిపోతే? శుక్రాచార్యులు ఆరు ఘడియలు రాత్రి గడిచిన తరువాత రాజప్రాసాదంలోకి వస్తారని ఇప్పుడే దూత వార్త తీసుకువచ్చాడు. అప్పుడే యువరాజు కూడ వస్తారు. అందుచేత చక్రవర్తి రాత్రి పది ఘడియల వరకూ భవనంలో ఉండాలని గురుమహారాజ్ చెప్పారు. అందుకే .....'.

'నువ్వు మూర్ఖురాలవు. నీ గురుమహారాజ్ మూర్ఖుడు. ఈ బంగారపు అప్సరసను వదలి ఆ జడల ముసలివాడికోసం రాజప్రాసాదానికి వెళ్ళాలా! ఈ యయాతి అరసికుడుకాదు. యువరాజు నగర ప్రవేశంతో నాకు సంబంధంలేదు. యయుని సింహాసనం పై కూర్చోపెట్టడానికి రాజభవనంలో కుట్ర పన్నుతున్నారు. పద. నువ్వు నీ పనిలో ఉండు. ఆ బంగారు అప్సరసను పల్లకిలో కూర్చోబెట్టి ఇప్పుడే ఇక్కడకు తీసుకురా. ఎవరికీ అనుమానం రాకూడదు'.

రంగమహల్‌లో నా మంచంపై అచేతనంగా పడివున్న ఆమెను చూస్తూఉంటే నేను కలగుంటున్నానో! లేక నిజంగా నా అలకను తిరిగి చూస్తున్నానో! నాకర్థం కాలేదు. మందారుడు, ముకుళికలు నన్ను మోసగించలేదు. ఆ యువతి కేశాలు బంగారం రంగులో ఉన్నాయి. అలకే మంచంపై నిద్రిస్తున్నదనిపించింది. చాలా సేపు నేను ఆమెను చూస్తూ ఉండిపోయాను. మధ్యలో మాయమైన నా అలక నాకు తిరిగి దొరికింది.

నేను ఆమెను స్పృశించాలని ఆతృత చెందాను. మందారుడు, ముకుళికలపై నాకు కోపం వచ్చింది. ఆమెను అచేతనం చేయడానికి ఇంతమందు తాగించమని వారికి ఎవరు చెప్పారు? ఎవరైనా శవంతో శృంగారాన్ని జరుపుతారా?

బయట ఎంతరాత్రి అయ్యిందో తెలియదు. గత పదిహేనురోజులుగా బాగా మధువును సేవించినందున నా బుద్ధి పని చేయడంలేదు. చేతిలో మదిరాపాత్ర ఉన్నా, దానిని పెదవులకు తాకించాలనే కోరిక కలగటంలేదు. ఈ క్షణం అన్నీ మరచిపోవాలని కోరుకున్నాను. నా పేరు కూడా. ఎవరికి తెలుసు, రేపు ఎలా ఉంటుందో! శుక్రాచార్యులు, దేవయాని ...

ఈరోజు - ఇప్పుడు - ఈ క్షణం నాది. అది బంగారపు క్షణం. సువర్ణావకాశం.

ఇప్పుడు నేను నిలవలేకపోతున్నాను. నేను అచేతనంగా పడివున్న ఆ యువతి తలదగ్గర నిలుచున్నాను. ఆమె బంగారు కేశాలను ముద్దు పెట్టడానికి కిందకు వంగాను. తెల్లని వెంట్రుకలు - మరణం - అన్ని భయాలు మనసు నుండి ఒక్కసారి మాయమయ్యాయి. నేను తిరిగి యవ్వనంలో కాలుపెడ్తూ ఉన్నాను. నేడు అలక నా ప్రేయసి కాబోతున్నది. సంవత్సరాలుగా మనసులో దాచుకున్న బంగారు కల నేడు నిజం కాబోతున్నది.

ఆమె బంగారు కేశాలపై నేను ముద్దిడబోతుంటే ముకుళిక తలుపు చాటునుండి కేకవేసింది. 'మహారాజా, బయటకు రండి'.

నేను కోపంగా పైకి చూస్తూ అడిగాను - 'ఎందుకు?'

'మహారాణి, శుక్రాచార్యులు లోపలకి వస్తున్నారు. మహారాజు ఎక్కడ? అంటూ శుక్రాచార్యులు కోపంతో ప్రతి ఒక్కరిని అడుగుతూ వస్తున్నారు'.

నాకాళ్ళు వణకసాగాయి. నాలుక ఎండిపోయింది. చాలాకాలంగా రోగగ్రస్తుడిగా వున్నట్లు చాలా కష్టంగా ఒక్కో అడుగు ముందుకు వేస్తూ నేను ఏదోవిధంగా భవంతి బయటకు వచ్చాను.

మంచంమీద కూర్చొన్న దేవయాని నన్ను చూడగానే ముఖం తిప్పుకుంది. శుక్రాచార్యుడు కోపంగా మహల్‌లో అటు ఇటు పచార్లు చేస్తున్నారు.

శుక్రాచార్యుడికి ప్రణామం చేయడానికి నేను ప్రయత్నించాను. కాని కాళ్ళు ముందకు పడలేదు. మహల్‌లో అంతా గిర్రున తిరుగుతున్నట్లు అనిపించింది. బహుశ మూర్ఛ వచ్చి పడిపోతానేమోననిపించింది. గోడకు ఏర్పాటుచేసిన అద్దాన్ని పట్టుకొని దానిసాయంతో నిలబడ్డాను. చాలా కష్టంగా నన్ను నేను సంభాళించుకున్నాను.

పచార్లు చేస్తున్న శుక్రాచార్యులు ఒక్కసారి ఆగిపోయారు. ఆయన కొద్ది క్షణాలు నన్ను కోపంతో చూసారు. తిరిగి కోపంతో అన్నారు - 'యయాతీ! నేనొక మహర్షిగా నీదగ్గరకు రాలేదు. నీ మామను. అందుకే సమయంకాని సమయంలో నీ

భవంతిలోకి వచ్చాను. నీ పాపంలో నా అడుగుకూడ పడింది. నువ్వు నన్ను గుర్తించావా?'

నేను భయపడుతూ తల ఊపి 'ఔను' అన్నాను.

వ్యంగ్యంగా నవ్వుతూ శుక్రాచార్యులవారన్నారు - 'మద్యపానంలో నీ బుద్ధి బహుశా సరిగ్గా పనిచేయడంలేదు. అందుకే నీకు మరోసారి చెపుతున్నాను. నేను ఎవరిని? శుక్రాచార్యుణ్ణి! సంజీవనీ విద్యపొంది సమస్త దేవలోకాన్ని గడ గడలాడించిన ఆ శుక్రాచార్యుడిని, రాక్షసుల అజేయ గురువును నేనే. ఆ శుక్రాచార్యుడు ఈరోజు నీముందు నిలుచున్నాడు. దేవయాని తండ్రే నీ ముందు నిలబడ్డాడు. సంజీవని విద్యకు సమానమైన మరో అద్భుతమైన విద్యను సంపాదించాను. ఇన్ని సంవత్సరాలు తరువాత నేనిక్కడకు నా కూతురు సంసార జీవితాన్ని చూడడానికి వచ్చాను. కాని నేను చాలా అభాగ్యుడను. ఇక్కడకు వచ్చిన తరువాత నా కుమార్తెను దుఃఖంతో చూడడం నా దురదృష్టం. ఒరేయ్ కోతీ, నేను అమూల్యమైన రత్నాన్ని నీకిస్తే దానిని రాయిగా భావించి విసరివేస్తావా?'

శుక్రాచార్యుని ఆ రుద్రావతారాన్ని చూచి నాప్రాణాలు గాలిలో కలిసిపోయాయి. ఏం చెప్పాలో, ఏం చెప్పకూడదో, ఏమీ అర్థంకాలేదు. ధైర్యాన్నంతా కూడగట్టుకొని చెప్పాను - 'మహాముని నేను దోషినే. కాని జరిగిన దానిలో దేవయాని తప్పుకూడా ఉంది'.

నానోటి నుండి వెలువడిన ఈ మాటలతో మంచంపై కూర్చున్న దేవయాని సిగ్గుతో ఆక్షేపిస్తున్నట్లు నాపైపు చూస్తూ అన్నది - 'నాన్నగారూ, అడుగడుగునా ఇక్కడ నాకు ఏదోవిధంగా అవమానం చేస్తారా? ఇది చూపడానికేనా మీరు నన్నిక్కడకు తీసుకు వచ్చారు. రేపు ఉదయం అశోకవనం వెళదామని నేను మీతో ముందే చెప్పాను. మీరు ప్రయాణంలో అలసిపోయారు. పదండి, రాజభవనానికి వెళ్ళిపోదాం. వ్యసనాలకు బానిసలయనవారు పిశాచాలకన్నా భయంకరమైనవారు. రాత్రివూట వారి ముఖం కూడా చూడరాదు'.

నాకు కోపం ఆగలేదు. అప్రయత్నంగా అన్నాను - 'మరి గర్వంలో మునిగిన వారు?'

దేవయాని మరింత కుపితురాలయ్యింది. శుక్రాచార్యుని దగ్గరకువెళ్ళి ఆయన భుజంపై చేయివేస్తూ అన్నది - 'నాన్నగారూ అక్కడ యదు అట్టహాసంగా నగరంలో ప్రవేశిస్తూ ఉంటాడు, మరి ఇక్కడ మీరు మదిర, మగువలమత్తులో మునిగిన ఒక .....'

శుక్రాచార్యులు ఆమె చేతిని విదిలిస్తూ కోపంతో అన్నారు - 'దేవయానీ, నీవు నా సర్వస్వంకాని మూర్ఖురాలవు. పిచ్చిదానవు. ఎప్పుడు ఎలా ప్రవర్తించాలో నీకు పూర్తిగా తెలియదు. మొదట ఈ పిచ్చితనంతోనే నీవు కచుణ్ణి బ్రతికించమని ప్రాధేయ పడితే బ్రతికించి సంజీవని విద్య పోగొట్టుకున్నాను. ఇన్ని సంవత్సరాల తరువాత నేనిక్కడకు వచ్చాను. నేను రాగానే భర్తమీద దోషారోపణచేసావు. ఇప్పుడు నీమాట వినను. నీ పదునెనిమిదేండ్ల దుఃఖానికి పరిష్కారం ఇప్పుడే జరగాలి. అల్లుడైనా యయాతిని నేనెప్పుడూ క్షమించను. ఇతనికి జీవితాంతం జ్ఞాపకం ఉండేటట్లు శిక్షిస్తాను .....'

దేవయాని ఆయన దగ్గరకు వెళ్ళి అతి మధురంగా చెప్పింది - 'యయు సింహాసనంపై కూర్చోగానే ఈయన కళ్ళు తెరుచుకుంటాయి. నాకిప్పుడు సంసారం పై ఎటువంటి ఆశలేదు. ఒకసారి యదు సింహాసనంపై కూర్చోవటం కనులారా చూసి మీరు ఎక్కడ తపస్సుకు కూర్చుంటే నేను అక్కడ మీ సేవ చేస్తాను'.

దేవయాని కపటవ్యవహారంతో నేను మండిపడ్డాను. సింహాసనంపై నాకు కొంచమైన కోరిక లేదు. కాని నా అనుమతి లేకుండా యయును సింహాసనం పై కూర్చోబెట్టి, దేవయాని నన్ను అవమానించాలనుకుంటున్నది. ఇది నేను భరించలేనిది. నేను కటువుగా చెప్పాను - 'నేను రాజును. నా ఆజ్ఞ లేకుండా, అంగీకారం లేకుండా యయు పట్టాభిషేకం ఎలా జరుగుతుంది?'

శుక్రాచార్యుడు శాంతంగా చెప్పారు - 'రాజా, నీ ఈ అధికారం నాకూ అంగీకారమే, కాని నేనొక సాధారణ ప్రశ్న నిన్ను అడగాలని కోరుకుంటున్నాను. రాజుగా నీకు కొంత అధికారం ఉంది. అలాగే నీ భార్య అయిన దేవయానికి అధికారం ఉందా? లేదా? ఆమెను వివాహంచేసుకునేటప్పుడు నీవు నాతి చరామి, అని ప్రమాణం చేసావుకదా?'

'ఔను, చేసాను'

'నీవు దానిని పాటించావా?'

'మహర్షీ నన్ను క్షమించండి, నేను పాటించలేదు'

'ఎందుకు?'

'అది నా యవ్వనం తప్పు, నేను ఆకర్షణకు లోనయ్యాను'

'యవ్వనం తప్పా? నీవు యువకుడవు, మరి దేవయాని వృద్ధురాలా? నీవు ఆకర్షణకు లొంగిపోయావు. దేవుడు ఈ ప్రపంచంలో మోహాన్ని నీ ఒక్కడికోసమే సృష్టించాడా? మూర్ఖుడా, మోహం నీకంటే మావంటి తాపసుల చుట్టూ ఎక్కువగా తిరుగుతుంది. మా తపస్సు భగ్నం చేయడానికి ఇంద్రుడు అప్సరసలను పంపుతాడు. కాని ఈ శుక్రాచార్యుని వంటి తాపసి ఆమోహంపైపు చూడడు. క్షుద్రమైన మోహానికి లొంగిపోయినవాడు క్షుద్రుడవుతాడు'.

'నన్ను క్షమించండి మహర్షీ! నేను అపరాధిని!'

'క్షమించడం మొదటి తప్పు చేసినప్పుడు. అదే తప్పు పదేపదే చేస్తూ ఉన్నవారికి సాధారణమైన శిక్ష సరిపోదు'.

మాట్లాడుతూ ఆయన విచారంలో మునిగిపోయాడు. నాపరిస్థితి అలాగే అయ్యింది. బద్దలయ్యే అగ్నిపర్వతం దగ్గర గట్టి సంకెళ్ళతో బంధించి వుంచి నట్లుంది.

నాపైపు ద్వేషంతో, తిరస్కారంతో చూస్తూ శుక్రాచార్యుడన్నారు - 'రాజా! దేవయానిని వదలి నీవు శర్మిష్ఠతో గడిపావు. ఇది నిజం కాదా?'

దేవయానిని నేను ప్రేమించడంలేదు, శర్మిష్ఠని ప్రేమిస్తున్నాను - అని నాలుక చివర వరకు వచ్చినమాటలు చెప్పటానికి నాకు ధైర్యం చాలలేదు.

శుక్రాచార్యుని స్వరం తీవ్రమవుతున్నది. ఆయన మాటలు పిడుగుల్లా ఉన్నాయి. ఆయన కోపంగా నాదగ్గరకు వచ్చి చెప్పారు - 'శర్మిష్ఠతో జాగ్రత్తగా ఉండమని నేను నీకు ముందే చెప్పాను కదా?'

నేను తల ఊపుతూ 'ఔను' అన్నాను.

'నీవు దేవయాని తండ్రి - మహర్షి శుక్రాచార్యుని ఆజ్ఞ భంగపరచావు. ఈ ఆజ్ఞాభంగానికి నీవు ప్రాయశ్చిత్తం పొందాలి'.

'కాని - కాని - మహర్షీ యవ్వనోద్వేగంలో తెలియలేదు'.

'నీ ఆవేశం పోవాలని నేను కోరుకుంటున్నాను. అందుకే శర్మిష్ఠలాంటి దాసీ వైపు కామంతో చూడుకుంటూ ఉండడానికి నీకళ్ళకు కాటుక రాయాలని కోరుకుంటున్నాను. యవ్వనపు ఆవేశంలో ఏమీ తెలియదు. ఆ యవ్వనమే నిన్ను బలిగొన్నది ఔనా? అయితే నేను నీకు ఇదే శాపమిస్తున్నాను - 'నీ యవ్వనం ఈ క్షణమే నాశనమవుగాక! ఈశ్వర కృపతో పొందిన నూతన విద్యను స్మరిస్తూ ఈ శుక్రాచార్యుడు తన ఎదురుగా నిలబడి ఉన్న యయాతి యవ్వనంపోయి ముసలితనం ప్రాప్తించాలని కోరుకుంటున్నాడు'.

పిడుగుపడినట్లున్న ఆ వాణి నేను విన్నాను. ప్రపంచమంతా శూన్యమైంది. మనసు చెవిటిదైంది.

చివరకు ధైర్యంచేసి నేను దగ్గరలో ఉన్న అద్దంలో నా ప్రతిబింబాన్ని చూసాను. నాకు ప్రాణాంతకమైన బాధ కలిగింది. నా ముఖం ముడతలు పడింది. తలంతా తెల్లని వెంట్రుకలే. అద్దం ఎదుట జీర్ణ శరీరం గల వృద్ధుడు నిలబడ్డాడు. అతను మరణం చిరునామా తెలుసుకునేందుకు ప్రయత్నిస్తున్నాడు.

కాని ఈ జీర్ణ శరీరంలో యయాతి మనసు మాత్రం మునుపటిలాగే యవ్వనం కలిగి ఉన్నది. నాకు రంగమహల్‌లో ఉన్న బంగారు కేశాలు గల సుందరి గుర్తు కొస్తున్నది. ఇప్పటికే పది ఘడియలరాత్రి గడిచిపోయి ఉంటుంది. ఆ యువతి తెలివిలోకి వచ్చిఉంటుంది. ఇప్పటి వరకూ ఆ యువతి బంగారు కేశాలు సరిగా సరిచేయనేలేదు. ఇప్పుడు - ఆమె ముద్దు నాకు మరి ఎప్పుడూ దొరకకపోవచ్చు. నాకోరికలన్నీ అసంతృప్తిగా ఉండిపోతాయి. మనసులోనే యింకిపోతాయి. అలకలా కనిపిస్తున్న ఆ సుందరి, ఆకర్షణీయమైన యవ్వనవతి ... ...

ఆలోచించి - ఆలోచించి నేను చాలా బాధపడ్డాను. నేను శుక్రాచార్యుని వైపు చూసాను. ఆయన వేదికపై తలవుంచి కూర్చుండిపోయారు. దేవయాని ఆయన కాళ్ళు పట్టుకొని ఏడుస్తూ ఉంది. ఆమె మాటి మాటికి అడుగుతున్నది - 'నాన్నగారూ, మీరేం చేసారు? ఏం చేసారు మీరు నాన్నగారూ?'

నా మనసులో ఆశ అంకురించింది. నేను ముందుకువెళ్ళి శుక్రాచార్యునికి సాష్టాంగ నమస్కారం చేసి చేతులు జోడిస్తూ అడిగాను - 'మహర్షీ! నాపై దయ చూపించండి. నా మనసు ఇప్పటికీ యవ్వనంతోనే ఉంది. నా కోరికలు ఇప్పటికీ అసంతృప్తిగానే ఉన్నాయి. దేవయానితో సంసార జీవితాన్ని గడపాలని ఉంది. కాని నాలాంటి వృద్ధునితో సంసారం చేసి ఆమె ఏమి సుఖం పొందగలదు? మీరు నా యవ్వనం నాకు తిరిగి ప్రసాదిస్తే ......'

దేవయాని మధ్యలో కరుణార్ద్రమైన స్వరంతో 'నాన్నగారూ, నేనాయనను చూడలేక పోతున్నాను. ఆయనకు తిరిగి యవ్వనం ఇచ్చివేయండి. ఆయన తొలి రూపు ఆయనకు తిరిగి ఇవ్వండి'.

శుక్రాచార్యుడు శిరమెత్తి మెల్లని స్వరంతో చెప్పారు - 'రాజా, వీరునిబాణం, తపస్వి శాపం ఎప్పుడూ వృథాకావు. నీవు నేనిచ్చిన శాపం అనుభవించి తీరాలి. కాని నీవు నా ప్రియమైన దేవయాని భర్తవు. ఆలస్యంగానైనా ఆమెతో సంసార జీవితాన్ని గడపాలనే కోరిక నీలో కలిగింది. అందుకే నేను నీకు శాపవిమోచనం కలిగిస్తాను. నీ కుటుంబంలో, నీ రక్త సంబంధీకుడైన యువకుడు ఎవరైనా ఈ ముసలితనాన్ని ఆనందంగా తీసుకోడానికి సిద్ధపడితే నీవు కోరిన వెంటనే నీ యవ్వనం తిరిగి వస్తుంది. కాని ఒక్కమాట గుర్తుంచుకో. నీవు పొందిన యవ్వనం నీ మరణా నంతరమే ఆ యువకునికి తిరిగి లభిస్తుంది. ఇంకోవిధంగా రాదు. నన్ను స్మరిస్తూ మూడుసార్లు - 'నేను ఈ యవ్వనం తిరిగి ఇచ్చి వేస్తున్నాను. అని చెప్పినట్లైతే నీవు మరణిస్తావు..... ......'

దేవయాని గట్టిగా అరిచింది - 'నాన్నగారూ ఇది శాపవిమోచనమా? ఇది మీరిచ్చిన శాపం కంటే భయంకరమైనది'.

శుక్రాచార్యుడు చాలాకోపంతో వెంటనే లేచి నిలబడి దేవయానితో అన్నారు- 'ఇక్కడకు వస్తూనే నీ కాపురం నిలబెట్టడానికి ఈ భవంతిలోకి పరుగెత్తుకొచ్చాను. ఈ తప్పు జరిగింది నావలన. చిన్నప్పటి నుండి నిన్ను నెత్తికెక్కించుకున్నాను. ప్రతిఫలంగా ఈ ముసలి తండ్రికి లభించేదేమిటి? అవమానం. నీ వలన నాకు అవమానం, ఓటమి తప్ప ఇంకేమీ లభించలేదు. నాకు అర్థం కావడంలేదు, ఇలా ఎందుకు జరిగింది? నా తపస్సులో ఏదో తప్పు తప్పక ఉండి ఉంటుంది. ఆ

తప్పను తెలుసుకునేందుకు ఇప్పుడే హిమాలయాలకు వెళ్ళిపోతాను. ఇప్పటి వరకు నీకోసం చేయవలసింది చేసాను. ఇప్పుడు నువ్వు తెలుసుకుంటావో, నీ భర్త తెలుసుకుంటాడో, యువకుడవుతాడో, వృద్ధుడవుతాడో సంసారం నడుపుతారో, చస్తారో! నాకు మీతో సంబంధం లేదు'- అంటూ శుక్రాచార్యుడు చరాచరా బయటకు వెళ్ళిపోయాడు.

భవనంలో మేమిద్దరమే ఉన్నాం. ఒక ముసలి బొమ్మ, బొమ్మయిన ఒక యువతి. దేవయాని నావైపు చూడడానికి సాహసించలేకపోతున్నది. ఆమెకు నా ముఖం చూపించడానికి నాకు సిగ్గుగా ఉంది. మేమిద్దరం భార్యభర్తలం. ఒకరి సుఖానికి మరొకరుగా ఉండవలసినవాళ్ళం, కాని పదునెనిమిదేండ్లలో మేమిద్దరం ఒకరికొకరం దూరంగా ఉన్నాం. ఆమె మా యిద్దరి ప్రపంచం వేరువేరు.

రంగమహల్ నుండి అస్పష్టమైన ధ్వని వినిపించింది. బహుశ ఆ బంగారు రంగు కేశాలు గల యువతికి తెలివి వచ్చి ఉండవచ్చు. ఆమె బంగారు రంగుకేశాలు.....

నేను అద్దంలోకి చూసాను. నా ఈ వికృతవృద్ధ రూపం - శుక్రాచార్యుని శాప విమోచనతో నేను క్షణంలో తిరిగి యవ్వనాన్ని పొందగలను. కాని నా వృద్ధాప్యాన్ని ఎవరు స్వీకరిస్తారు? నాకు రక్త సంబంధీకుడయిన యువకుడు.....

ద్వారం దగ్గర ఉన్నదాసీ మాటలు వినిపించాయి - 'అమ్మా మహారాణి! యువరాజుగారు మీ దర్శనానికి వచ్చారు'.

ఆ మాటలతోనే ఇద్దరు యువకులు భవనంలోకి వస్తూ కనిపించారు. నేను వెంటనే తల తిప్పుకున్నాను. నా ఈ కురూపి వృద్ధరూపాన్ని యయు చూస్తే ......

కాని - కాని యయు నా కుమారుడు, నా రక్తం. తన యవ్వనం నాకు ఇచ్చి వృద్ధాప్యాన్ని తీసుకోగలడు.

నా చెవులు రంగమహల్ నుండి వినిపించే ధ్వనికోసం చూస్తున్నాయి. అక్కడ ఎవరో గొణుకుతున్నారు? ఆ బంగారు అప్సరస లేచి ఏదైనా పాట పాడుతున్నదా? ప్రియునికై ఎదురు చూసే విరహగీతమా .....

కాని నేనిప్పుడు ఆమె ఎదుట ఆమె ప్రియునిగా ఎలా నిలబడగలను?

యయు దేవయానితో మాట్లాడుతున్నా మాటలు నాకూ వినిపిస్తున్నాయి. నగరంలో ప్రవేశిస్తున్నప్పుడు వాళ్ళమ్మ కనిపించక వాడు వ్యాకులం చెందాడట. ఆమె అశోకవనం వెళ్ళిందని తెలిసి పరిగెత్తుకొని వచ్చాడట.

నా శరీరంలోని అణువణువూ రంగమహల్‌లోని ఆ సుందరి గురించే ఆలోచిస్తున్నది. ఈ క్షణమే నాకు యవ్వనం కావాలనే కోరికగా ఉంది. ఆ సుందరితో సుఖం పొందడానికి యవ్వనం కావాలి. నా మనసులో ఒక ఊహ కలిగి వెనుతిరిగి చూసాను.

నా ముఖంచూసి ఆ యిద్దరు యువకులూ ఉలుక్కిపడ్డారు. నేను ప్రశాంతంగా యయుని దగ్గరకు రమ్మని పిలిచాను. అతను దగ్గరకు వచ్చిన తరువాత నేను అన్నాను - 'యయూ, నన్ను గుర్తు పట్టావా? నేను నీ తండ్రిని యయాతిని. నీకు నీ తండ్రి అంటే ప్రేమే కదా?'

'ఔను మహారాజా!'

'నాకోసం నువ్వు ఏ త్యాగమైనా చేయగలవా?'

'అది ధర్మంకదా మహారాజా! మాతృదేవోభవ, పితృదేవోభవ'.

దేవయాని మధ్యలో చీత్కరిస్తూ 'యయూ... యయూ...'

దేవయాని పదునెనిమిది సంవత్సరాలుగా నాపై ప్రతీకారం తీర్చుకుంటూనే ఉన్నది. ఇప్పుడు నాకు ప్రతీకారం తీర్చుకునే సువర్ణావకాశం లభించింది. నా పరిస్థితి ఆకలితోఉన్న సింహంలా ఉంది. కాముకత్వం, ప్రతీకారం మొదలైనవి మనసులో తీవ్రంగా మెదులుతున్నాయి. ఇప్పుడు శుక్రాచార్యుడి భయంలేదు. ఇప్పుడే యయు యవ్వనం నాకు లభిస్తే, దేవయాని ముందే రంగమహల్‌కు వెళ్ళి నేనా యువతి మెడ చుట్టూ చేయివేసి బయటకు తీసుకురావలనే కోరికతో నా బుద్ధి చెవిటిదైంది.

నేను యయుతో అన్నాను - 'ఇక నుండి రాజుగా ఉండాలనే కోరిక నాలోలేదు. నీకు రాజ్యాభిషేకం చేసి .....'

'తండ్రిగారి ఆజ్ఞ ఎలా అయితే అలా', 'కాని ఈ రాజ్యాభిషేకం నా కొడుకుగా కాదు. అందుకోసం నీవు .....'

దేవయాని తిరిగి మధ్యలో అరిచింది - 'మహారాజా, మహారాజా, మీరు రాక్షసులు'

ఆపైపు చూడకుండా నేను యయుతో అన్నాను, 'నా ఈ ముసలితనాన్ని చూస్తున్నావా?'

'ఔను'

'ఇది నాకు శాపంగా లభించింది. నా కుటుంబంలో వారు, నా రక్త సంబంధీకులైన యువకుడెవరైనా దీనిని తీసుకుంటేవారికి ఈ నా రాజ్యాన్ని ఇస్తాను. నా మరణం తరువాత అతనికి యవ్వనం తిరిగి వస్తుంది. శుక్రాచార్యులు అలా శాపవిమోచన ఇచ్చారు. కావాలంటే మీ అమ్మని అడిగి సత్యాన్ని తెలుసు కోవచ్చును'.

నా మొదటి మాట విన్న యయు ఉలిక్కిపడ్డాడు. నాలుగడుగులు వెనకకువేసి అతను దేవయాని దగ్గరకు వెళ్ళాడు. అతనామెను గట్టిగా గుండెలకు హత్తు కున్నాడు. అతన్ని ఓదార్చుతూ దేవయాని అన్నది - 'యయూ, నీ తండ్రి పిచ్చివాడయ్యాడు. ఆయనకు యువకుడవ్వాలనే పిచ్చిపట్టింది. పిచ్చివారితో మాట్లాడితే మరింత పిచ్చిగా వాగుతారు. అందుకే, పద, మనం రాజభవనానికి తిరిగి పోదాం. ఈయన ఈ అద్దం ముందు తన తెల్లని వెంట్రుకలు చూసుకుంటూ కూర్చుంటారు.

నాకు దేవయాని మీద చాలా కోపం వచ్చింది. కాని నేను నిస్సహాయుడను. యయు నా వైపు దయతో చూసాడు. అతని చూపులలో అనంగీకారం కనిపించింది. నా ఆశ అడియాశ అయ్యింది.

యయుతో వచ్చిన ఆ యువకుణ్ణి చూసి దేవయాని అడిగింది. 'యయూ, నీవింత వరకు నీ ఈ మిత్రుని పరిచయమే చెయ్యలేదు. మన ఇంటి విషయాలు పరాయివారికి తెలియరాదు. కాని ఇది చాలా చెడ్డదినం. నా తండ్రిగారు కోపంతో తిరిగి వెళ్ళిపోయారు. నా ఈ రహస్యం ఈ పరాయి యువకుని ఎదుట ... ...'

ఆ యువకుడు చాలా వినయంగా దేవయానితో అన్నాడు - 'అమ్మా! నేను పరాయివాణ్ణికాను'.

'యయూ ప్రాణాన్ని రక్షించిన నీవు నాకు పరాయివాడవెలా అవుతావు? కాని ఇప్పుడు నీవు విన్న ఈ విషయాలు ఇంటి గోడలకు కూడా తెలియకూడనివి'.

'అమ్మా, యువరాజు దేనికైతే భయపడుతున్నాడో, ఆ పని చేయడానికి నేను సిద్ధంగా ఉన్నాను'.

నా ఆశ తిరిగి చిగురించింది. నేను ఆ యువకుని దగ్గరకు వెళ్ళి అడిగాను- 'నీవు నా ముసలితనం తీసుకోడానికి సిద్దంగా ఉన్నావా?'

'ఆనందంగా'

'కాని - కాని - నీవు దాన్ని తీసుకోలేవు. ఇది నా కుటుంబంలోని వాడూ, నా రక్త సంబంధీకుడైన యువకుడు మాత్రమే తీసుకోగలడు'.

'నా శరీరంలోని అణువణువుపైనా మీకధికారం ఉంది మహారాజా! నేనూ మీ కుమారుణ్ణి!'

ఈ మాటలు వినగానే దేవయాని వణికిపోసాగింది. ఆ యువకుని వైపు చూస్తూ అన్నది - 'మహారాజుకు ఒక్కడే కొడుకు. ఈ రాజ్యంపై అతనికే అధికారం ఉంది'.

'అమ్మా! నాకు రాజ్యం వద్దు. నన్ను పుత్రధర్మం పాటించనివ్వు. నాన్నగారి కోరిక తీర్చనివ్వు. నేను మహారాజు కుమారుడనే. ఆయన వృద్ధాప్యాన్ని పొందేందుకు నాకు గల అధికారాన్ని ఎవ్వరూ కాదనకండి'.

దేవయాని అతని వైపు కోపంతో చూస్తూ అన్నది - 'నీవు ... నీవు ... నీవు ... శర్మిష్ఠ కుమారుడివా?'

'అవును. నా పేరు పురు'.

దేవయానిపై ప్రతీకారం తీర్చుకునేందుకు దొరికిన ఈ అవకాశం చేజార నివ్వరాదని నేను నిర్ణయించుకున్నాను. రంగమహల్‌లోని మంచంపై జరుగుతున్న

చప్పుడు విషయాసక్తమైన నాచెవులకు వినిపిస్తున్నది. తీవ్రమైన కోరికతో నా శరీరం రోమాంచితమయ్యింది.

మండుతున్న శరీరపు ప్రతి అణువు చెప్ప సాగింది - 'గుర్తుందా! ఇంత పెద్ద ప్రతీకారానికి మరెప్పుడూ అవకాశం లభించదు. నీ యవ్వనం నీకు తిరిగి లభిస్తుంది. దేవయాని దుష్టమైన కోరిక మట్టిలో కలిసిపోతుంది. ఈ ప్రతీకారా వకాశాన్ని విడిచిపెట్టవద్దు'.

నేను పురువైపు చూసాను. అతను స్థిరంగా నిలబడ్డాడు. అతనిలో భయపు ఛాయ లేమాత్రంలేవు.

చిన్నగా ఉన్న పురు నేడు యవ్వనంతో అందంగా మగవాడిలా కనిపిస్తు న్నాడు. భవిష్యత్ సుఖస్వప్నాలు అతని యువనేత్రాలతో తేలుతూ ఉన్నాయి. అతని మనసు ఏ యువతినైనా ఆకర్షించి ఉంటుంది. యుద్ధం నుండి తిరిగి వచ్చిన తరువాత ఈ వీరునితో వివాహానికి ఏ యువతో ఎదురుచూస్తూ ఉండవచ్చు. అటువంటి పురు నుండి యవ్వనాన్ని యాచిస్తున్నాను. నా ముసలి తనం ఇవ్వడానికి తయారయ్యాను. లేదు, లేదు, బాల్యంలో నేను వాడి తల వెంట్రుకలను వాత్సల్యంతో సవరించాను, వాడే ముసలివాడిగా తలపై తెల్లని వెంట్రు కలతో నా ముందు నిలబడితే నేను వాడిని చూడగలనా?

నా మనసు డోలాయమానమైంది.

ఈ కొద్ది క్షణాల్లో జరిగిన సంఘటనలతోనే దేవయాని ఉడుక్కుంది. ఆ స్థితినుండి బయటపడి ఆమె పురు దగ్గరకు వెళ్ళి అన్నది - 'నీవు పురు కదా? మంచి మగవాడివి కదా? శర్మిష్ఠ కొడుకువు కదా? ఊరుకున్నావెందుకు? నీ తల్లికి ఈయనంటే చాలా ప్రేమని విన్నాను. ఆ తల్లికి కొడుకువునీవు. నీ మనసులో కూడ పితృభక్తి ఎక్కువగా ఉండవచ్చు. ఇంకా ఎందుకాలస్యం? ఎందుకు ఆలోచిస్తు న్నావు? ఇవ్వు, నీ యవ్వనం ఈయనకు ఇవ్వు. ఈయన ముసలితనం నీవు తీసుకో'.

నా మనసులోని కోరికలు చెవుల్లో గీపెట్టి అరుస్తూన్నాయి - 'ఆ అందమైన యువతి రంగమహల్‌లో నీ కొరకు ఎదురు చూస్తున్నది. గత పదిహేను రోజుల నుండి నీవు ఆమెకొరకు పిచ్చివాడివయ్యావు. ఈరోజు ఆ అమృతపాత్ర నీ చేతిలో

ఉంది. పెదవుల పైకి చేర్చకుండా నీవు దానిని పారవేస్తావా? అదే చేస్తే, మరి పదునెనిమిదేండ్లకు పూర్వమే సన్యాసం ఎందుకు తీసుకోలేదు? ఆలోచించు, పిచ్చివాడా? ఆలోచించు, అదృష్టంకొద్దీ నీకు శాపవిమోచనానికి అవకాశం లభించింది. దానిని ఉపయోగించుకో, నాలుగైదు సంవత్సరాలు పురు నీ వృద్ధాప్యాన్ని తీసుకుంటాడు. అందువలన పురుకి నష్టమేముంటుంది? దానికి బదులుగా అతనికి రాజ్యం లభిస్తుంది. కొన్నేళ్ళు తనివితీరా అనుభవించు. కోరికలను పూర్తిగా తీర్చుకో. తరువాత పురుకు అతని యవ్వనాన్ని తిరిగి ఇచ్చివెయ్యి'.

దేవయాని రెచ్చగొట్టటం వల్లనో లేక మరెందుకో పురు వెంటనే ముందుకు వచ్చాడు. నాకాళ్ళపై తన తల ఉంచు అన్నాడు - 'నాన్నగారూ, మీ కులమే అయనప్పటికీ, రాజకన్య అయివుండి కూడా దాసీ అయిన అమ్మ కొడుకును. నేను మీ వృద్ధాప్యాన్ని తీసుకోడానికి సిద్ధం!' నానోటి నుండి 'మంచిది' అన్న మాట వెలుఫడింది. వెంటనే నా ముందు ఆ మాటల ఫలితం ప్రత్యక్షమయ్యింది. నేను కళ్ళు మూసుకున్నాను. కొద్ది క్షణాల తరువాత పురును ఆశీర్వదించడానికి చేతిని పైకెత్త లేకపోయాను, నా ముందు నిలుచున్న పురు ఒక్కసారిగా ముసలి వాడైపోయాడు.

ఈ చమత్కారాన్ని చూసి దేవయాని ఆవాక్కైపోయింది. యయును తీసుకొని వెంటనే తన భవనంలోకి వెళ్ళిపోయింది.

పురు అద్దం ముందుకు వెళ్ళినిలబడ్డాడు. అతను తన రూపాన్ని పరిశీలించి చూచుకున్నాడు. ఒక్క క్షణం రెండు చేతులతో తన ముఖాన్ని కప్పుకున్నాడు. అతను తన త్యాగానికి ఇప్పుడు పశ్చాత్తాపపడుతున్నాడేమో నాకర్థంకాలేదు. కాని వెంటనే శాంతంగా అతను వేదిక నెక్కి కూర్చున్నాడు. అది చూసి నా మనసు కొంత శాంతించింది.

ఇప్పుడే కొద్దిక్షణాల ముందు నేను నా ప్రతిరూపాన్ని చూడలేకపోయాను. మరిప్పుడు పురువైపు చూడలేకపోతున్నాను. నగరం విడిచివెళ్తూ శర్మిష్ఠ సందేశం పంపింది - 'మహారాజుగారి అభయహస్తం ఎల్లప్పుడూ పురు తలపై ఉంటుంది'; కాని నేడు నేను అతని తలను వజ్రఘాతానికి గురిచేసాను. అతని దగ్గరకు వెళ్ళి అతని మెడచుట్టూ చేయివేయనా,అతన్ని ఓదార్చనా! అని మనసులో అని

పించింది. కాని ఆ ఆలోచన క్షణకాలమే. నేను సాహసించలేకపోయాను. పాపానికి కూడా ఎంత భయం కలుగుతుంది?

నాలుగు ఘడియలలో ఇటు ప్రపంచం అటయిపోయింది. ఈ కొద్ది సమయంలో ఎన్ని విచిత్రాలు జరిగాయి. నేను మేల్కోని ఉన్నానా లేక ఏదైనా కలగంటున్నానా అనే విషయం నాకర్థంకాలేదు. మద్యపానంవలన రకరకాలుగా అనిపించింది. ఇదికూడ అలాగే ఏదైనా భయంకరమైన భ్రమా? ఆలోచనాచక్రంలో నాబాధను మరచిపోయాను. మనసు కుంగిపోసాగింది.

వృద్ధాప్యం పురు రూపంలో నావైపు గుర్రుగా చూస్తున్నది. నేను కళ్ళను వేరేవైపు తిప్పి చూడసాగాను. అద్దంలో నాకు నా ప్రతిబింబం కనిపించింది. నేను మునుపటి కన్నా యువకునిలా కనిపిస్తున్నాను. నేను ఈ వయసులో ఉన్నప్పుడు నా మనసులో అలక పట్ల ఎంత ఆసక్తి ఉండేది. కాని అది అసంతృప్తిగా ఉండిపోయింది. అలక - ఆమె బంగారు రంగు కేశాలు - ఈ ఇరవైనాలుగేండ్ల తీరనిదాహం - ప్రళయాగ్నిలా ఒకే కోరిక నా మనసులో మెరవ సాగింది. నేను ప్రపంచాన్నంతా మరచిపోయాను. నా అడుగులు రంగమహల్ వైపు సాగాయి.

నేను లోపలకొచ్చాను. ఆ యువతి మంచంమీద లేచికూర్చుంది. అటూ ఇటూ ఆశ్చర్యంతో చూడసాగింది. ఆమె ఇక్కడకు ఎప్పుడు ఎలా వచ్చిందో, ఏ విధంగానూ తెలియడంలేదు. ఆమె నావైపు చూసి నవ్వింది. నాయవ్వనం చరితార్థమైందనిపించింది. నేను ముందుకు వెళ్ళాను. ఆమెలో భయం తొంగి చూసింది. లేచి ఆమె దూరంగా ఓ మూలకు వెళ్ళి నిలుచుంది. ఆమె ఈ ప్రవర్తన నాకు అర్థంకాలేదు. అర్థం చేసుకునేందుకు నాకు సమయంలేదు. ఎప్పటి నుండో నా మనసు భయంకరమైన తుఫానులో ఊగిసలాడే నావలా ఆయి పోయింది. నేను అన్ని విషయాలు మరచిపోవాలనుకున్నాను. వాటిని మరచి పోవడానికి ఒకటే సాధనం. ఆ యువతి చేయి పట్టుకోవడానికి నేను ముందుకు వెళ్తునప్పుడు భవనం బయట ఎవరో వెక్కి వెక్కి విలపిస్తున్న ధ్వని వినిపించింది. నాచేయి అవిటిదైనట్లు అలాగే ఉండిపోయింది.

బహుశ బయట పురు ఏడుస్తూన్నాడేమోనని మొదట అనిపించింది. తన ఆలోచనారహితమైన త్యాగానికి ఇప్పుడు అతను పశ్చాతాపం పొందుతూ ఉండ వచ్చు. కాని ఆ రోదన ఎవరో స్త్రీది.

పురుని భవనంబయట విడిచి లోపలకు రావడం నాతప్పేమోననిపించింది. అతన్ని మొదటే ఎక్కడకో పంపించి వేయవలసింది. ఇంత వేగంగా అశోకవనం లోని దాసీలకు ఇక్కడ జరిగిందంతా తెలిసిపోయిందా? లేకపోతే స్త్రీరోదన ఇక్కడ వినిపించడం అసంభవం.

నేను సరిగ్గా ఊహించలేకపోతున్నాను. బయట రోదన తగ్గేటట్లు కనిపించడం లేదు. ఎక్కువకాసాగింది. నా ఆనందం ఈవిధంగా భంగం కావడం నాకేమాత్రం ఇష్టం లేదు. కాని నేను కోపంగా రంగమహల్ బయటకు వచ్చాను.

మంచంపై పురు భూతంలా కూర్చున్నాడు. అతన్నిపట్టుకొని ఒక స్త్రీ ఏడుస్తున్నది.

ఎవరో దాసీ పురుకు ఇంత సన్నిహితంగా ఉండడం నాకు కోపాన్ని తెప్పించింది. నేను రెండు అడుగులు ముందుకువేసి పురుతో అన్నాను - 'పురూ, ఇప్పుడు నీవు రాజువు. రాజు తన ప్రతిష్ఠకు, గొప్పతనానికి విరుద్ధంగా ఏ పని చేయరాదు. ఈమె ఎవరు? రెండు కాసుల దాసి నీమెడలో .....'

మిగిలిన మాటలు నాగొంతులోనే ఆగిపోయాయి. నాగొంతు విని ఆ స్త్రీ తలతిప్పి నావైపు చూసింది. ఆమె చూడగానే భూమి బద్దలై నన్ను తనలో దాచుకుంటే ఎంత బాగుండుననిపించింది.

ఆమె శర్మిష్ఠ. పురు పరిస్థితి చూసి ఆమె అంతులేని వేదనతో విలపిస్తున్నది. నేనామెను చూడలేకపోయాను. ఆమె రోదన వినలేకపోతున్నాను. నేను తలదించుకుని నిలబడ్డాను. పదునెనిమిది సంవత్సరాల క్రితం అశోకవనం సొరంగ మార్గం మెట్లపై నిలబడి శర్మిష్ఠకు వీడ్కోలు చెప్తూ నేను అన్నాను - 'నిన్ను మరలా కలవడం ఎప్పుడు, ఏ స్థితిలో జరుగుతుందో, ఆ దేవునికి తెలుసు, ఆ కలయిక ఇప్పుడు, ఈ పరిస్థితిలో జరగాలా?'

నా వేదన చెవిటిదైంది, మూగదయ్యింది. నేను కళ్ళుమూసుకుని రాయిలా నిలుచున్నాను.

'శర్మిష్ఠా! నా ప్రియ శమా!' ఆమెను బాహువులలోకి తీసుకోవాలని, ఆమె కన్నీరు తుడవాలని, ఆమె దుఃఖాన్ని తగ్గించాలని మనసు ఆత్రుత చెందింది. కాని

ఆమె దుఃఖాన్ని ఎలా తగ్గించను? లేడిపిల్ల ప్రాణాలు తీసిన వేటగాడు తల్లి లేడిని ఎలా ఓదారుస్తాడు? ఆ తల్లి మనసుకు సంతోషం ఎలా కలిగించగలడు?

'శర్మిష్ఠ, యయాతి వేరుకాదని, ఇద్దరూ ఒక్కటే' నని నేనామెకు ఏకాంతంలో అనేక సార్లు చెప్పాను. ఈరోజు నేనామెకు శత్రువునయ్యాను. ఆమె జీవితమంతా ఎవరినైతే మనసులో నిలుపుకుని పూలతో పూజిచిందో, అతనే ఆమెనీరోజు అగ్నిగుండంలోకి విసరివేసాడు.

శర్మిష్ఠ కన్నీరు నా పాదాలపై పడుతున్నది. ఆ ఒక్కొక్క కన్నీటిబిందువు నా హృదయాన్ని పిండేస్తున్నది. ఆమె వంటి దేవత నావంటి పిశాచం కాళ్ళపై పడటం నాకు సిగ్గనిపిస్తున్నది. కాని ఆమెను పైకి లేవనెత్తడానికైనా, ఆమె శరీరాన్ని స్పృశించ టానికి నేను సాహసించలేకపోయాను.

ఆమె తలెత్తి పైకి చూసింది. ఆమె కళ్ళలో అంతులేని మరణవేదన తొంగి చూసింది. అదురుతున్న పెదవులతో ఆమె అడిగింది. 'మహారాజా! ఇదేం జరిగింది?' ఆందోళనతో, ఆతృతతో ఆమె చేసిన ఆక్రందన మాతృహృదయం నుండి వెలువడింది. కాని నాకుమాత్రం నా విలాస, ఉన్మత్త పాప జీవనాన్ని ఉద్దేశించి 'మహారాజా! ఏమి జరిగింది?' అని అడిగినట్లు అనిపించింది.

జరిగిందా! లేదు. నేను నా చేతులతో చేసాను. పురుకు వృద్ధాప్యానిచ్చి నేను అతని యవ్వనాన్ని తీసుకున్నాను. అంతా ఆలోచించి, విషయలోలుతతో నిండిన నా మనసుకు క్షణిక ఆనందాన్ని ఇచ్చేందుకు నేనే చేసాను.

నేను పితృధర్మాన్ని ఉల్లంఘించాను. వాత్సల్యాన్ని బురదలో పూడ్చిపెట్టాను. మానవత్వాన్ని చంపాను. అంతులేని కోరికలచేతిలో ఆటబొమ్మనయ్యాను. నాక్షణికా నందం కోసం నాకన్న కొడుకునే బలితీసుకున్నాను. ఈ పదునెనిమిది సంవత్స రాలు నేనొక కోరికల రాక్షసికి గుడి కడుతూ వచ్చాను. ఈరోజు ఆ గుడిపైన ఎంత భయంకరమైన కలశాన్ని ఉంచానో!

శర్మిష్ఠ నాది. ఆమె నాకు అనంతమైన ప్రేమనందించింది. ఆమె ప్రతి కన్నీటి బిందువుకు నా ప్రాణాన్ని త్యాగం చేయడం నా ధర్మం. ఈ రకమైన త్యాగంలో అనంతమైన ఆనందం ఉంది. శర్మిష్ఠకు ఆనందం కలగచేయాలంటే పురుకి

యవ్వనాన్ని తిరిగి ఇవ్వాలి, క్షణం కూడా ఆలస్యం చెయ్యకుండా తిరిగి ఇవ్వాలని ఆలోచించాను. కాని అతనికి యవ్వనం తిరిగి ఇవ్వాలనుకుంటే నేను మరణించడం తప్ప వేరేదారిలేదు.

మృత్యువు - చిన్నప్పటినుండి అడుగడుగునా నన్ను భయపెడుతున్న నా అదృశ్య శత్రువు. ప్రతిసారీ ఏ భయంతో నేను శరీర సుఖాన్ని ఆశ్రయించానో, ఆ అజ్ఞాత - అనామక మృత్యువును ఇప్పుడు నవ్వుతూ కౌగిలించుకోనా? ముందు వెనుక ఆలోచించకుండా దానిని ఆనందంగా కౌగిలించుకోనా?

నేను శర్మిష్ఠ వైపు చూసాను. ఆమె నా వైపు ఆశగా చూస్తున్నది. పదు నెనిమిదేండ్ల క్రితం ఆమె వనవాసానికి, అజ్ఞాతవాసానికి వెళ్ళేటపుడు నాపై ఎటువంటి ఫిర్యాదు చేయలేదు. దేవయాని కోపం నుండి నన్ను రక్షించడానికి ఆమె ఆనాడు మహత్తరమైన త్యాగాన్ని చేసింది.

శర్మిష్ఠ ప్రేమ - మాధవుని ప్రేమ - కచుని ప్రేమ - నేను కూడా ఆ విధంగా ప్రేమించకూడదా?

ఇంతవరకూ అదృశ్యంగా ఉన్న నా మనసులోని ఒక అర నాకు కనిపించింది. ఆ అరలో, ఆమూల కోడెగట్టిన జ్యోతి ఒకటి వెలుగుతున్నది. మెల్ల మెల్లగా అది పెద్దది కాసాగింది. ఆ వెలుతురులో నాకు నా మార్గం సరిగ్గా కనిపించసాగింది. తనకోసం బ్రతికే కంటే ఇతరులకోసం బ్రతికడంలో, చావడంలో ఎక్కువ ఆనందం ఉంది. ఇది నిజంగా ఒక ఉదాత్తమైన గొప్ప సత్యం, నేను మొదటిసారి ఆ అనుభవాన్ని పొందుతున్నాను.

శుక్రాచార్యుడు నా బాహ్యరూపాన్ని మార్చాడు. ఇప్పుడు శర్మిష్ఠ నా అంత రంగంలో సంచలనాన్ని తీసుకొచ్చింది. ఇంతవరకు నాకు కనిపించని యయాతి నా ముందు నిలిచాడు. మృత్యువు భుజంపై చేయివేసి అతను చెప్పాడు - 'ఈ ప్రపంచంలో రెండే సత్యాలు. ప్రేమ - మరణం. పద మిత్రుడా, పద! ఈ చీకటిలో నేను నీకు తోడు ఉంటాను. భయపడవద్దు. ఏమాత్రం భయపడవద్దు. నాచేతిలో ఈ దీపంఉంది. చూసావుగా? ఏమన్నావు? ఇది శుక్రతారా? నీవు పట్టి మూర్ఖుడువు. అరే! శర్మిష్ఠ ప్రేమ'.

ఇంతవరకు శర్మిష్ఠను తాకడానికి నేను సాహసించలేకపోయాను. నేను ఆమె రెండు చేతులను మెల్లగా నాచేతిల్లోకి తీసుకుని ఆమెను పైకిలేపాను. ఆమె తలనిమురతూ నేను అన్నాను - 'శమా, నీవు బాధపడవద్దు. దేవుని దయ అంతా చక్కబడుతుంది'.

ఆమె కరుణార్ద్రస్వరంతో అడిగింది - 'పురు మునుపటిలా అవుతాడా?'

నేను నవ్వుతూ చెప్పాను, 'అవుతాడు - ఈ క్షణంలోనే అవుతాడు'.

కన్నీరు జారుతున్న కళ్ళతో ఆమె అన్నది - 'లేదు మహారాజా - మీరు నన్ను మోసం చేస్తున్నారు. పురు మునుపటిలా కాలేదు. ఎవరో అతనికి భయంకర మైన శాపం ఇచ్చారు'.

'ఔను'

'ఎవరు? నాముద్దుల బాబుకు ఈ శాపమిచ్చినదెవరు?'

'శుక్రాచార్యుడా? యయును నా బాబు రక్షించినందుకైనా దేవయానికి కొద్దిగా నైనా జాలి కలుగులేదా? ఏం జరిగింది మహారాజా! ఏం జరిగింది?'

ఆమె కన్నీటిని తుడుస్తూ నేను అన్నాను - 'శాంతించు, శమా, శాంతించు. నీ పురు అసలు రూపాన్ని పొందగలడు. అతనికి శుక్రాచార్యుడు శాపమివ్వలేదు. అతనికి శాపమిచ్చింది .....'

'ఎవరు - ఏ దుష్టుడు ..... ?'

'ఆ దుష్టుడు యయాతి!' ఆమె ఉలిక్కిపడింది. ఆశ్చర్యపోతూ నాపైపు చూడసాగింది. 'నేను పితృధర్మాన్ని మరచిపోయాను. మానవత్వాన్ని మరచి పోయాను. శాపంగా నాకు లభించిన ముసలితనాన్ని నేను పురుకు ఇచ్చాను. అతని యవ్వనాన్ని నేను తీసుకున్నాను. ఈ విషయలోలుడు, కాముకుడు, అధముడు అయిన యయాతే నీకు ద్రోహంచేసింది. పురుకు ద్రోహంచేసింది'.

ఆమె పిచ్చిదానిలా నాపైపు చూడసాగింది. నా మాటలను ఆమె నమ్మలేక పోతున్నది. నాపట్ల ఆమెకున్న అచంచలమైన విశ్వాసానికి నా హృదయం

ద్రవించింది. నాకు దుఃఖం వచ్చింది. మానవుడెంత మంచివాడు. అతను ఇతరులను ఎంతగా విశ్వసిస్తాడు? విశ్వాసం, భక్తి, నిష్ఠ, అనురాగం, సేవలపై అతను జీవిస్తాడు. వీటి శక్తితో అతను మృత్యువును కూడ నవ్వుతూ ఎదిరిస్తాడు. ఈ భావాలన్నింటికి మనిషి శరీరంతో సంబంధంలేదు, అతని మనసుతోనే సంబంధం వున్నది.

గత పదునెనిమిది సంవత్సరాలుగా నేను నా ఆత్మను పొగొట్టుకున్నాను. శర్మిష్ఠ శ్రద్ధతో తన ఆత్మను రక్షించుకొని అభివృద్ధి చేసుకుంది. నా పోయిన ఆత్మను పొందేందుకు ఒకటే దారి - అది - క్షణిక సుఖంకోసం, ఏ శరీరంకోసం నేను పిశాచినయ్యానో, దాన్ని నవ్వుతూ వదలి వేయడం - అనురాగంతో మృత్యువును హాయిగా కౌగిలించుకొని పురుకు అతని యవ్వనాన్ని తిరిగి ఇవ్వడం.

పురుకోసం నేను మృత్యువును స్వీకరించాలనే మాటలు విని శర్మిష్ఠ సంశయంలో పడి దుఃఖించ సాగాను. చివరకు ఆమె అన్నది - 'మహారాజా! నేను తల్లిని, అదేవిధంగా భార్యనుకూడ - నాకు రెండు కళ్ళూ కావాలి, మహారాజా! రెండుకళ్ళూ'.

ఆమె అంతకంటె ఎక్కువ చెప్పలేకపోయింది. ఆమెకు నాపట్ల ఉన్న ప్రేమను చూసి నేను దుఃఖించాను. ఇప్పుడు ప్రేమదానం పొందడం కాదు - పొందిన దానాన్ని పూర్తిగా చెల్లించాలి.

నేను శర్మిష్ఠతో అన్నాను - 'చాలా రాత్రయ్యింది. రేపు ఉదయం మనం సరిగ్గా ఆలోచించుకుందాం. ఏ పరిస్థితిలోనైనా పురు తన అసలు రూపాన్ని తప్పక పొందుతాడని నీకు నేను మాట ఇస్తున్నాను. వెళ్ళు, అతని దగ్గరకూర్చో. నీవొక త్యాగధనునికి జన్మనిచ్చావు'.

'నీవు నిజమైన వీరమాతవు. వెళ్ళు అతనికి అండగా నిలువు'.

శర్మిష్ఠ పురు వీపు నిమురుతూ వుండగా నేను శుక్రాచార్యుని స్మరించాను. నేను మనసులో అనుకున్నాను - 'ఋణంగా తీసుకున్న ఈ యవ్వనం నేను తిరిగి ఇచ్చి వేయాలని కోరుకుంటున్నాను. నేను ఎవరి దగ్గరి నుండి పొందానో, అది వారికి చెందాలి. అందుకై నేను మరణాన్ని స్వీకరించడానికి సిద్ధంగా ఉన్నాను. అలా

నేను రెండుసార్లు అన్నాను. మూడవసారి అంటూ - శర్మిష్ఠను చూస్తూ నేను ఆ మాటలు మనసులోనే అనుకోసాగాను. భవనమంతా పిల్లల ఆటవస్తువులా గిర్రున తిరగసాగింది. ఆ గందరగోళంలోనే వినిపించింది - 'కచదేవుడు వచ్చారు'.

మరుక్షణం నేను కుప్పకూలుతూ కిందపడ్డాను.

# అధ్యాయం 26

ఎన్నిరోజులు తరువాత నాకు తెలివి వచ్చిందో తెలియదు.

బహుశా సాయంకాల సమయం ఎవరో చాలా తీయని కంఠంతో చెప్తూ ఉన్నారు. ఆ మంత్రం ఆగిపోయింది. ఒక ఆకారం నా మంచం దగ్గరకు వచ్చింది. ఆ ఆకారం నా నుదుటపై విభూతి రాసింది. నేనా ఆకారంవైపు తదేకంగా చూసాను. అతను కచుడు.

నేనతనితో మాట్లాడడానికి ప్రయత్నించాను. కాని నోటినుండి మాటరాలేదు. కచుడు తన స్నేహహస్తాన్ని నా నుదుట ఉంచాడు. సైగతోనే అతను చెప్పాడు 'విశ్రాంతి తీసుకో' మరేమి చెప్పకుండా అతను నవ్వాడు. ప్రతిగా నా పెదవులపై నవ్వు విరిసింది. అతను తిరిగి నవ్వాడు. నవ్వు మానవుని మధురభాష, ఎంత మధురమైనది.

నాకు తిరిగి మెలుకువ వచ్చేటప్పటికి తెల్లవారిపోయింది. తూర్పువైపు కిటకీ నుండి సూర్యోదయం కనిపిస్తున్నది. విశ్వకళ్యాణానికై ఋషులు మదించిన యజ్ఞకుండం చూస్తున్నానా అని నాకనిపించింది.

నేను కనులు మూసుకుని పడుకున్నాను. ఎవరో శ్లోకం చదువుతున్నారు. నేను కళ్ళు తెరిచి చూసాను. కచుడు తూరుపుదిక్కున సూర్యభగవానునికి నమస్కారం చేస్తూ ఉన్నాడు. అతని ప్రార్థన నేను పూర్తిగా వినగలుగుతున్నాను.

'హే సూర్యభగవాన్! నీకు స్వాగతం. కోరికలను జయించే ఆత్మశక్తికి నీవు ప్రతీకవు. నీవు చీకటిని జయించావు. నీవు విశ్వాత్మవు. అదేవిధంగా మానవుని భావాత్మకు కూడా నీవే ప్రతీకవు. నీ సారథి సోమరి అయినా నీవు నీ కర్తవ్యాన్ని

ఎన్నడూ వీడలేదు. నీ వెలుతురు కొండలోయలోకి వెళ్ళినట్లే మా హృదయపు లోతుల్లోకికూడా తొంగి చూస్తుంది అక్కడ కూడ క్రూర జంతువులు దాగి ఉంటాయి. ఓ సహస్ర కిరణుడా, నీకు స్వాగతం'.

ఉదయం సాయంకాలం కచుడీవిధంగా శ్లోకాలు చదువుతూ ఉంటాడు. మరో సమయంలో కూడా అతను నా గదిలోకి వస్తూ ఏదో ఒక శ్లోకాన్ని చదవుతూ వస్తాడు. పచార్లు చేస్తూ ఉంటాడు. అతను ఈ శ్లోకాలను ఆత్మానందానికి మాత్రమే పఠిస్తున్నాడో లేక నా చెవికి వినిపించాలనే ఉద్దేశంతో చదువుతున్నాడో ఏమో తెలియదు. ఏమైనప్పటికీ, నాకతని పఠనం చాలా నచ్చింది. నేను రోగినై మంచంమీద పడి ఉన్నాను. అక్కడ నుండి లేవడానికి, మాట్లాడ డానికి అనుమతి లేదు. శ్లోకాలు నన్ను ఆ రోగశయ్యనుండి ఏదో లోకానికి తీసుకుపోయాయి. ఆ లోకంలో పూలతో బాటు ముళ్ళులేవు, కాని రాళ్ళ నుండి సుగంధం తప్పక వస్తుంది. కచుని ఆ శ్లోకాలన్నీ నా మనసుపై తమ ప్రభావం చూపాయి.

పూల సుగంధం కళ్ళకు కనిపించలేదు. కాని నాసిక దాన్ని ఆఘ్రాణిస్తుంది. ఆత్మ కూడా ఆ సుగంధంలాగే ఉంటుంది.

అన్ని రకాల ఉన్మాదం మృత్యువే అవుతుంది. అంతిమ మృత్యువు కన్నా ఈ మరణం భయంకరంగా ఉంటుంది. ఎందుకంటే, ఇందులో మనిషి ఆత్మ చనిపోయి ఉంటుంది.

'శిఖరం వైపు ఎగిరే ఓ గరుడుడా! రెండో వైపు ఎంత లోతైన లోయ ఉంది? అంధుడై క్షణిక సుఖంకోసం వెంపర్లాడే మనిషికి - చెప్పు - ఆ లోయ ఎంత లోతైనదో, ఎలాంటిదో, అమృతాన్ని తెచ్చి అతనికివ్వు'.

బుద్ధి, భావం మరియు శారీరిక కలయికల త్రివేణి సంగమమే మానవజీవితం. సంగమ పవిత్రత ఆ నదులకు విడివిడిగా ఎలా సంక్రమిస్తుంది?

'ఓ సారథీ, గుండె బద్దలయ్యే వరకూ పరుగెత్తే లేడి దుఃఖాన్ని నీవు తెలుసుకోవాలనుకుంటున్నావా? ఈ లేడి వేటగాడై, నీ ధనుర్బాణాలు దాని దగ్గర ఉండి, నీవు లేడివైతే?'

'గాలి ప్రపంచానికి ప్రాణం. దాని పిల్లగాలులు ఎల్లప్పుడూ అందరి మనస్సులను తాకుతుంటాయి. కాని అవే ప్రచండమయితే అడవంతా దానిని అసహ్యించుకుంటుంది. విశేషమైన కోరిక కూడ అలాంటిదే'.

'సంసారంచేసే స్త్రీ - పురుషులూ, మీరు కూడా తపస్వులే. సంసారమే మీ యజ్ఞం. అనురాగం, వాత్సల్యం - కరుణ మీ శత్రువులు. కోరికలేని ప్రేమ మీ మంత్రం. సేవ, త్యాగం, భక్తి, మీ సంసార జీవనానికి యజ్ఞాహుతులు.

ప్రేమించడం నేర్చుకోవాలనుకుంటున్నావా? నదిని గురువుగా భావించు. వృక్షాన్ని గురువుగా భావించు. తల్లిని గురువుగా భావించు .....'

అనుభవించినంత మాత్రాన కోరిక ఎప్పుడూ తీరదు. ఆహుతులు పొందిన అగ్ని ప్రజర్విల్లినట్లు, అనుభవంతో కోరికకూడా పెరుగుతుంది. ఇలాంటి ఎన్ని శ్లోకాలని లెక్కించను? రోగగ్రస్తునిగా ఉన్నప్పుడు అవే నాకు స్నేహితులయ్యాయి.

మెల్లగా మాట్లాడమని రాజవైద్యుడు నాకు అనుమతి నిచ్చాడు. నేను మంచంపై లేచి కూర్చోసాగాను. పునర్జన్మ నాకేకాక దేవయానికి కూడా లభించినట్లుంది. ఆమె చాలా నిగ్రహంగా సేవాతత్పరురాలుగా కనిపించసాగింది.

ఈ చమత్కారం - కచుని ఇంద్రజాలమహిమా లేక ఆ భయంకరమైన రాత్రి జరిగిన సంఘటనా?

ఆ రాత్రి నేను అచేతనంగా పడిపోయినపుడు తరువాత ఏమి జరిగిందో, నేను మనసులోనే గుర్తుచేసుకోసాగాను. కచుడు, దేవయాని, శర్మిష్ఠ, పురు, యయుల మాటలను బట్టి నేను మనసులో ఆ కథను అల్లుకోసాగాను.

ఆ రాత్రి శుక్రాచార్యుని స్మరించి పురుకు యవ్వనాన్ని తిరిగి ఇవ్వడానికి నేను రెండుసార్లు ప్రార్థించాను. మూడోసారి ప్రార్థిస్తుండగా కచదేవుడు వస్తున్నాడు అనే మాటలు వినిపించి ప్రార్థన సగంలో ఉండిపోయింది. నేను మూర్ఛపోయాను.

కచుడు కూడా తపస్సు చేసి శుక్రాచార్యునిలాగానే విద్యను పొందాడు. అంతే కాదు. మహాకోపి అయిన శుక్రాచార్యుడు వృద్ధాప్యపు శాపాన్ని ఎవరికైనా ఇవ్వగలడని ఆలోచించి, ఆ కృతిమ వృద్ధాప్యాన్ని పోగొట్టే శక్తినికూడా పొందాడు. ఆ శక్తితోనే పురుని తిరిగి యువకుడిగా చేసాడు.

కాని తాపసుల గురించి, వారి తపస్సు గురించి, వారు శక్తులుపొందే విధానం గురించి మాట్లాడేటప్పుడు కచుడు చాలా అశాంతిగా ఉండేవాడు. మధ్యమధ్యలో మునిగిపోయి తిరిగి చెప్పేవాడు - 'మహారాజా! మనిషి జంతువుకాదు. జంతువుల సంస్కృతి, సభ్యత గుర్చి ఊహించలేము. కాని సంస్కృతి మనిషి బాహ్యాస్థితిని మార్చింది. అయితే అంతరంగం నేటికీ అలాగే గుడ్డిగా జీవిత ప్రేరణల వెంట పరుగెత్తే జంతువులాంటిదే. గురువును నిందించడం పాపం, కాని సత్యాన్ని దాచడం మహాపాపం. అందుకే శుక్రాచార్యులవారిని గురించి కొంత చెపుతాను. ఆయనలాంటి మహర్షి ముసలితనం వచ్చిన తరువాత కూడ అడుగడుగునా కోపంతో ఆవేశపడుతున్నారు. అది చూస్తే మనిషి భవిష్యత్తును గురించి బాధపడవలసి ఉంటుంది. తనపైన తనకే అధికారం, అదుపు లేని మనిషి ఘోరమైన తపస్సు చేసి పొందిన సిద్ధులను, శక్తులను మంచి పనికే ఉపయోగిస్తాడని భరోసా ఏమిటి? దానికి హామీ ఎవరు? శుక్రాచార్యులు సంజీవని విద్య పొందారు. దాని శక్తితో రాక్షసులు దేవతలను పరాభవించారు. తిరిగి దేవతల పక్షాన కచుడు ఆ విద్యను పొంది, ఇరుపక్షాల శక్తిని- సమానం చేయటంవలన యుద్ధపరిస్థితి సమానంగా ఉంటుంది - అలాగే జీవితం కూడా ఉంటుందా? ఈ ప్రపంచం ఇలాగే నడుస్తుందా? లేదు, మానవ సమాజం సుఖంగా ఉండాలంటే మనిషి తన మనసును జయించాలి'.

కచుడు అలా చెపుతుంటే నేను వింటూ ఉంటాను. అతని ధ్యానం నాకు వ్యాకులత కలిగించింది. అతని ప్రతి మాటలోని సత్యం నన్ను ఆలోచింపచేసింది. కాని దానికి సమాధానం ఎలా ఇవ్వాలో నాకు తెలియటంలేదు.

నా వ్యాధి కారణంగా నేనూ ఆతనూ దగ్గరయ్యాం. తపస్సుపూర్తి అయిన వెంటనే అతను నన్ను గుర్తు చేసుకున్నాడు. నా అధఃపతనాన్ని గురించి విని అతనిక్కడకు వచ్చాడు. దేవయాని ఆహ్వానం అతనికి దారిలోనే అందింది. అందులో యయు రాజ్యాభిషేకం వార్త చదివి అతను చాలా అశాంతిని పొందాడు. నగరంలోకి వచ్చిన తరువాత నేను అశోకవనంలో ఉన్నానని అతనికి తెలిసింది. అతను తిన్నగా నాదగ్గరకు వచ్చాడు.

'ఓహ్! అతను సరియైన సమయానికే వచ్చాడు. అతని రాకతో నామృత్యువు

ఆగిపోయింది. పురుకు యవ్వనం తిరిగివచ్చింది. అంతేకాదు ఒక మహాపాపం నుండి నాకు విముక్తి కలిగింది?'

ఆ బంగారు కేశాలు గల అమ్మాయి -

యయాతి సేవ మధ్యలో ఆగిపోయిందని చివరి క్షణంలో భూగృహంలోనే అలక భగవంతునితో మొరపెట్టుకున్నదేమో? అలా కాకపోతే అలక తన పుట్టింట తిరిగి ఎలా జన్మనెత్తింది? ఆమె నా కుమారుని భార్యగా హస్తినాపురం ఎందుకు వచ్చినట్లు?

కచుని లాగే శర్మిష్ఠ సరిఅయిన సమయంలోనే వచ్చింది. యుద్ధానికి వెళ్ళిన పురు క్షేమ సమాచారం తెలుసుకునేందుకు ఆమె హస్తినాపురం దగ్గర ఉన్న గ్రామంలో ఉన్నది. పురును ప్రేమించిన అలక ఆమెతోనే ఉంది. యయుతో పురుని కూడా శత్రువులు బంధించారనే వార్తతో ఆమె దుఃఖపడింది. యయు నగర ప్రవేశవార్త విని ఆమె, అలక తెల్లవారుఝామునే లేచి హస్తినాపురం రావడానికి నిర్ణయంతీసుకున్నారు. అర్ధరాత్రి అయిన తరువాత అలక లేకపోవడం శర్మిష్ఠ గుర్తించింది. ఆమె మనసు రకరకాల అనుమానాలతో నిండిపోయింది. ఆమె రాత్రంతా అలకను వెదికింది. కాని అలక ఎక్కడికి వెళ్ళిపోయిందో ఆమెకు తెలియలేదు. ఆమె దుఃఖం రెట్టింపయ్యింది. అంతులేని దుఃఖంతో సాయంత్రానికి ఏదోవిధంగా హస్తినాపురం చేరుకుంది. యయు నగర ప్రవేశం చేస్తున్నప్పుడు అతనితో పురును కూడా చూసింది. ఆమె చాలా సంతోషించింది. యయుని విడిపించిన వీరునిగా ప్రజలు పురుకు జయజయధ్వానాలు పలుకుతున్నారు. యయుపైన కంటే పురుపైన ప్రజలు పూలు అధికంగా జల్లారు. అది చూసి ఆమె కనులు ధన్యమయ్యాయి. కాని పురుకు ఎవరి దిష్టి అయినా తగులుతుందేమోనని, ఆ క్షణం ఆమె బాధపడింది. ఒక్కసారి అతన్ని కనులనిండా, తనివితీరా చూడాలని, తనతోటివారిని విడిచి గుంపులో దూరింది. కాని ఆమె చాలా దూరం వెళ్ళ కుండానే యయు, పురులు ఎక్కడికో వెళ్ళిపోయారు. అంతటా కోలాహలంగా ఉంది. నగరంలో ఎక్కడైనా శత్రువులు ప్రవేశించారేమో? ఆమెకు ఏమీ అర్థంకాలేదు. చివరకు, వారిద్దరూ అశోకవనంలోని మహారాణిని కలవడానికి వెళ్ళారని ఒక వృద్ధుడు చెప్పాడు. ఆమె భయపడింది. పదునెనిమిదేండ్ల క్రితం

విన్న చాటింపు ఆమెకు గుర్తుకొచ్చింది. పురు తనను గురించి యయుకు చెప్పివేస్తే? తన కుమారుని రక్షించిన వీరుడని తెలిసి దేవయాని అతనిని ఆశీర్వదిస్తుందా, లేక సవతి కొడకు అని తెలుసుకొని ప్రతీకారం తీర్చుకుంటుందా?

క్షణంలో ఆమె చుట్టూ ఉన్న పౌర్ణమీ, వెన్నెల మాయమైపోయింది. పదునెనిమిదేండ్ల క్రిందటి ఆ కాళరాత్రి నాటి చీకటి ఆమె చుట్టూ అలుముకున్నది. పురుని ఎలా రక్షించాలో ఆమెకు అర్థంకాలేదు. ఆమె పిచ్చిదానిలా అశోకవనంవైపు పరుగెత్తింది.

శర్మిష్ఠను, కచుణ్ణి విధి తగిన సమయానికే సరిగ్గా అక్కడకు తీసుకువచ్చింది. మరింత అధఃపతనం నుండి నేను రక్షించబడ్డాను. నా ఆత్మకు పునర్జన్మ లభించింది. ఎంత అద్భుతమైన విషయమిది. ఇంతలోనే యతిని చూడటం నేను ఈ ప్రపంచంలోని అత్యద్భుతంగా భావించాను.

నాకు బాగాలేదని తెలిసి యతి నన్ను కలవడానికి వచ్చాడు. నేను లేచి అతనికి ప్రణామం చేయబోతే తనే నన్ను లేవనీయలేదు. అతనే పరుగెత్తివచ్చి నన్ను గుండెలకు హత్తుకున్నాడు. ఆరోజు అడవిలో కలిసిన కఠోర హృదయుడైన యతి, నేటి ఈ స్నేహశీలి యతి - ఇద్దరూ పరస్పర విరుద్ధమైనవారు. మా అన్న దమ్ముల కలయిక చూడడానికి అమ్మ ఉండి ఉంటే!

యతి నా నుండి వీడ్కోలు తీసుకుంటున్నప్పుడు నేను పరిహాసంగా అతనితో అన్నాను - 'నీవిప్పుడు ఇక్కడ నుండి వెళ్ళలేవు'

'ఎందుకని?'

'నీవు నా అన్నవు. ఈ రాజ్యం నీది. ఇప్పుడు నీవు సింహాసనా న్నధిష్ఠించాలి'.

అతను నవ్వి అన్నాడు - 'సింహాసనంపై కంటే జింక చర్మంపై కూర్చోడంలో చాలా గొప్ప ఆనందాన్ని పొందవచ్చును. యయాతీ! ఒక్కసారి అనుభవించి చూడు'.

యతి ఆమాట చాలా సహజంగా అని వెళ్ళిపోయాడు. కాని అతని ఒక్కొక్క

మాట నా మనసులో నాటుకుంది. అక్కడే బీజం అంకురించింది. చూస్తూ ఉండగానే ఆ చిగురు ఒక పెద్ద వృక్షమైంది.

జీవితంలో నేనొకసారి అంతిమక్షణాన్ని చూసి తిరిగి వచ్చాను. ఇప్పుడు విరక్తిని అనుభవించాలి. నేను వానప్రస్థానానికి వెళ్ళాలని నిర్ణయించుకున్నాను. కచుడు నా నిర్ణయాన్ని సమర్థించాడు. శర్మిష్ఠ నాతోరావడానికి సిద్ధమైంది, ఇందులో ఆశ్చర్యమేమీ లేదు. కాని దేవయాని కూడా నాతో అడవిలోకి రావడానికి తన అంగీకారాన్ని తెలియచేయటం నాకంతులేని ఆశ్చర్యాన్ని కలి గించింది.

మొదటిసారి నేను స్పృహలోకి వచ్చినప్పుడు దేవయాని మనసు మారిందనే విషయం నా దృష్టికి వచ్చింది. ఆ విషయమే నాకు చాలా ఆశ్చర్యాన్ని కలి గించింది.

నేను స్పృహలోకి వచ్చిన ఆరాత్రి, కొద్ది క్షణల్లోనే నాకు పూర్తిగా తెలివి వచ్చింది. నేను అదుపులేని గుర్రంమీద నుండి పడిపోవడంతో బాగా దెబ్బలు తగిలాయని, అలక నా తలదగ్గర కూర్చుందని మొదట క్షణకాలం భ్రమ చెందాను. కాని ఆమె దేవయాని అని మరుక్షణం తెలుసుకున్నాను. చేతిలోని విసనకర్రతో ఆమె నాకు గాలి విసురుతున్నది.

నేను కాళ్ళ వైపు చూసాను. అక్కడ శర్మిష్ఠ నా పాదాలు పిసుకుతున్నది.

ఆ రాత్రే నాకుపూర్తిగా స్పృహ వచ్చింది. వారిద్దరు పరస్పరం మెల్ల మెల్లగా ఏదో నెమ్మదిగా మాట్లాడుకుంటున్నారు. దేవయాని శర్మిష్ఠతో అంటున్నది. 'ఇప్పుడు నీవు గాలి విసురు, నేను పాదాలు పిసుకుతాను'.

శర్మిష్ఠ అడిగింది. 'ఎందుకు? దేవయాని చెప్పింది - పాదాలు పిసికీ, పిసికీ నీ చేతులు నొప్పి పుట్టి ఉంటాయి'.

శర్మిష్ఠ నవ్వుతూ తిరిగి ప్రశ్నించింది. 'గాలి విసురుతూ విసురుతూ నీచేయి నొప్పి పుట్టలేదా?'

దేవయాని నవ్వి జవాబు చెప్పింది - 'నా ఒక్క చేయి నొప్పి పుట్టి ఉండవచ్చు. కాని నీ రెండు చేతులూ నొప్పి పుట్టి ఉంటాయి కదా. దేవయాని

తన సవతిని ఎలా బాధపెడుతుంందో చూడమని రేపు లోకులు అనవచ్చు. నేను నీకంటే పెద్దదాన్ని. నామాట నువ్వు వినాలి. లే, ఈ విసనకర్ర, తీసుకో!'

ఇద్దరూ నవ్వుకోసాగారు. దేవయాని ఇంతగా ఎలా మారిందా అని నేను మంచంపై వుండే ఆలోచించాను. కచుడామెకు ఉపదేశం ఇచ్చి ఉంటాడని అనుకున్నాను. ఆ రాత్రి జరిగిన భయంకరమైన అనుభవం వలన, శుక్రాచార్యునికంటే కచుడు గొప్ప జ్ఞాని అని నమ్మి వుండవచ్చు.

చివరకు నేనొకరోజు కచునితో మాట్లాడుతూ ఈ విషయం అడిగాను. దేవయాని మారిపోవటానికి కారణమేమిటని నేను నవ్వుతూ అతణ్ణి అడిగాను. ఈ పరివర్తనకు కారణం అతనేనని అన్నాను. కచుడు, చెప్పాడు. - 'మహారాజా! మీరు పొరబడ్డారు. మీరు దేనికోసం ఇన్ని సంవత్సరాలు ప్రయత్నం చేసారో, అది ఆ రాత్రి ఫలించింది. కాని నావలన మాత్రం కాదు, పురు వలన'.

నేను ఆశ్చర్యపడి ప్రశ్నించాను - 'ఎలా?'

'పురు మీ ముసలితనం తీసుకున్నాడు. ఇప్పుడు మీరతనికి రాజ్యాన్ని ఇచ్చి వేశారు. కాని యవ్వనాన్నిపొందిన వెంటనే పురు దేవయాని దగ్గరకు పరగెత్తుకు వెళ్ళి, ఆమె పాదాలు తాకి చెప్పాడు - 'అమ్మా, యయు నా అన్నయ్య. నాన్నగారు నాకు రాజ్యం ఇచ్చినా నేను తీసుకోను. యయును అవమానిస్తూ నేను సింహాసనం పై కూర్చోను. యయు రాజు అవుతాడు. నీపాదాల సాక్షిగా అతని ఆజ్ఞే నాకు శిరోధార్యం. అమ్మ శర్మిష్ఠ పాదాలు సాక్షిగా ప్రమాణం చేస్తున్నాను. నాకు మీరుకావాలి. తల్లిగా నీవు నాకు కావాలి. అన్నగా యయు కావాలి. నాకు రాజ్యం వద్దు, అమ్మ, అన్నయ్య కావాలి'. దేవయాని ఇంతుకు ముందు ఏ మాటలకు కరగని శిలవంటిది. పురు త్యాగానికి, ప్రేమకు కరిగి పోయింది. అతన్ని కౌగిలించుకుని కన్నీరు కారుస్తూ అతని తల నిమురుతూ ఆమె అన్నది - 'పురూ! సింహాసనంపై ఎవరు కూర్చోవాలో మహారాజు నిర్ణయి స్తారు - ప్రజలు నిర్ణయిస్తారు. కాని నీవు నాకు ఇచ్చిన రాజ్యం, ఈ ప్రపంచంలోని రాజ్యాల కంటే గొప్పది. నీలాంటి త్యాగి, పరాక్రమవంతుడు నన్ను అమ్మా అని పిలిచాడు. పురూ! ఇంత ప్రేమ నీకు ఎవరు నేర్పారు? ఎవరైనా నాకు చిన్నప్పుడు ఇలా నేర్పి ఉంటే ఎంత బాగుండేది. ఇప్పుడు నేను నీనుండి నేర్చుకుంటాను.

తండ్రి ముసలితనాన్ని నీవు నవ్వుతూ స్వీకరించావు. అన్నకొరకు సింహాసనాన్నే త్యాగం చేస్తున్నావు. పురూ!నాకు మరేమీవద్దు. ప్రేమించే నీ ఈ శక్తి నాకు ఇవ్వు'.

పురు సింహాసనంపై తన అధికారాన్ని వదులుకున్నాడు. కాని ప్రజలు అతనినే తమ రాజుగా కోరుకున్నారు. ఉత్తరాన ఉన్న రాక్షసుల తిరుగుబాటును అణచి వేయాలి. అందుకు పరాక్రమవంతుడైన రాజు సింహాసనంపై కూర్చోవడం తప్పని సరి. దేవయాని కూడ ప్రజల అభీష్టాన్ని అంగీకరించింది.

పురు రాజ్యాభిషేకం రోజునే మేము వానప్రస్థానం చేశాం. రాజ్యాభిషేకం పూర్తి అయిన తరువాత కచుడు మా ముగ్గురుని ప్రశ్నించాడు. మీలో ఎవరికైనా తీరని కోరికలున్నాయా? దేవయాని, శర్మిష్ఠ ఇద్దరూ వెంటనే జవాబు చెప్పారు - 'ఏమీలేవు'. కాని నేను స్తబ్దుడుగానే ఉండిపోయాను. అప్పుడు కచుడు అన్నాడు - 'మహారాజా!'

నేను చెప్పాను - 'ఇక నుండి నన్ను మహారాజా అని పిలవవద్దు. యయాతి అని మాత్రమే పిలవండి. మనమిద్దరం సమవయస్కులం, స్నేహితులం. అంగీరస ఋషి ఆశ్రమంలో జరిగిన ఆ యజ్ఞం కాలం నుండే మనం మిత్రులం. నేడుమనం తిరిగి బాల్య మిత్రులమైనాం'.

కచుడు నవ్వుతూ చెప్పాడు - 'మంచిది - యయాతీ! నీకేమైనా కోరికలున్నాయా?'

'అవును, నాకు రెండు కోరికలున్నాయి'.

'రెండు కోరికలా? ఏమిటవి?'

'మాధవుని తల్లి ముసలిదై పోయింది. ఆమెను కూడా నాతో తీసుకుపోవాలనీ, ఆమెకు సేవ చేయలనీ ఉంది. ఇంకా - మా ముగ్గురి కథ దాచకుండా ప్రపంచానికి తెలియజేయడం'.

రాజ్యాధికారం పొందిన పురు మా ఆశీస్సులకోసం వచ్చాడు. నేను అతణ్ణి ఆశీర్వదించాను - 'నీపేరుతో ఈ వంశం ప్రసిద్ధి చెందుగాక! నీ వీరత్వంలాగానే, నీ త్యాగమూ అభివృద్ధిచెందుగాక!'

'ఇంకా ఏమిటి మహారాజా?'

'ఇప్పుడు నేను మహారాజునుకాను'.

'మరేమిటి నాన్నగారూ?'

'ఇప్పుడు నేను సంసారిని కూడాకాదు'.

'మరేమిటి ..... ?'

'సుఖంలో, దుఃఖంలో ఎప్పుడూ ఒక విషయాన్ని గుర్తుంచుకో, కామం, ధర్మం గొప్ప పురుషార్థాలు, చాలా ప్రేరణార్థకమైన పురుషార్థాలు. జీవితానికి చాలా అవసరమైన పురుషార్థాలు. కాని ఈ పురుషార్థాలు స్వేచ్ఛగా, విచ్చలవిడిగా పారి పోతూవుంటాయి. ఈ పురుషార్థాలు ఎప్పుడు గుడ్డివి ఔతాయో, ఎవ్వరూ చెప్పలేరు. వాటి కళ్ళాలను నిరంతరం ధర్మం చేతిలోనే ఉండనివ్వాలి .....'

*న జాతు కామః కామానాముపభోగేన శామ్యతి*
*హావిషా కృష్ణ వర్త్మేవ భూయ ఏవాభివర్ధతే !!*

